



# శ్రీ ఘటికాచల మాహాత్మ్యము

## (సంస్కృత మూలశ్లోక తెలుగు అనువాదములతో)

అనువాదకుడు

**ఆచార్య తాడేపల్లి పతంజలి**

శ్రీ శివాయ గురవే నమః

ఘటికాచలనివాసాయ శ్రీ నృసింహాయ నమః

నాంది

శ్రీ ఘటికాచల లక్ష్మీనరసింహ భగవానుని పాదపద్మములకు మొదటగా నమస్సులు. ఘటికాచల-మాహాత్మ్యము సంస్కృత శ్లోకము , తెలుగు వచనములతో మొదటిసారిగా బయటకు తీసుకు వస్తున్నందుకు చాలా సంతోషిస్తున్నాము. తెనాలి రామకృష్ణుడు ఘటికాచల మాహాత్మ్యము అను పేరుతో పద్య కావ్యముగా దీనిని తెలుగులో వెలువరించిన విషయం మనందరికి తెలిసిందే. కేంద్ర సాహిత్య అకాడెమీ వారి కోరికపై నేను రచించిన తెనాలి రామకృష్ణుడు మోనోలాగ్ కొరకు ఈ గ్రంథాన్ని చదివే అదృష్టం కలిగింది. ఆ మోనోలాగ్ లో ఘటికా చల మాహాత్మ్య విశేషాలు కొన్నింటిని పేర్కొన్నాను.

ఘటికాచల-మాహాత్మ్యము సంస్కృత గ్రంథం చాలా కాలం క్రితం తెలుగు లిపిలో ప్రచురించబడింది.( సంవత్సరం తెలియదు. ) దేవనాగరిలిపిలో ఘటికాచల మాహాత్మ్యమును 2017లో చండామృత మహాచార్య గ్రంథ సంరక్షణ సంస్థ వారు ప్రచురించారు. ఈ ఘటికాచల-మాహాత్మ్య గ్రంథానికి సంక్షిప్త తెలుగు అనువాదాన్ని 1940లో 'శ్రీ ఘటికాచల క్షేత్ర మాహాత్మ్యము' అను పేరుతో శ్రీ రావూరి దొరస్వామి శర్మగారు 'శ్రీ ఘటికాచల మాహాత్మ్యము' పేరుతో 1997లో శ్రీ మామిళ్లపల్లి నరసింహంగారు ప్రచురించారు. 2013 లో పెద్దలు డా ఈప శింగరాచార్య స్వామి కూడా క్షేత్ర విశేషాలతో . ఘటికాచల మాహాత్మ్యమును సంక్షిప్తంగా తెలుగులోకి అనువదించారు.

అయితే ఇంతవరకు -అనగా 2024 వరకు ఘటికాచల-మాహాత్మ్యమును సంస్కృత శ్లోకము దానిని అనుసరించి తెలుగు వచనములతో ఎవరూ సంపూర్ణముగా అనువదించలేదు. మత్పురాకృత శుభాధిక్యముచేత ఈ భాగ్యము నాకు శ్రీ సాయిశ్రీ పవన్ గారు, వారి తండ్రిగారి కోరిక వలన నాకు కలిగింది.బహుగ్రంథ కర్త, పెద్దలుడా ఈప శింగరాచార్య స్వామి కూడా దూరవాణిలో ఈ గ్రంథ అనువాదము ప్రతిశ్లోక సహితముగా చేయమని ఆ త్మీయంగా నన్ను ఆదేశించారు. వారందరికి కృతజ్ఞతలు తెలియచేస్తూ వారి మాటను శిరసా వహించి, వేద వ్యాసునికి నమస్కరించి నరసింహుని ఆశిషములను అర్థిస్తూ సంస్కృత సాహిత్యములో అల్ప పరిజ్ఞానము కలిగిన నేను ఈ మహత్కార్యాన్ని మొదలు పెడుతున్నాను.

ప్రస్తుత రచన ఘటికాచల మహాత్మ్యము బ్రహ్మకైవర్త-పురాణం లోనిదని చెబుతారు. బ్రహ్మకైవర్త-పురాణము అనే మాట అంత ప్రసిద్ధి లోనిది కాదు. . బ్రహ్మవైవర్త-పురాణం అందరికి తెలిసిన పదం. , సంస్కృత సాహిత్య చరిత్రకారుల ప్రకారం, వేదవ్యాసుడు రచించిన పురాణాలలో ఒకటైన బ్రహ్మవైవర్త-పురాణం యొక్క సంస్కరణల్లో ఒకటి బ్రహ్మకైవర్త-పురాణం.

ప్రతి పవిత్ర స్థలంలో దేవాలయం, పవిత్ర జలాల గురించి వివరించే స్థలపురాణం ఒకటి కరదీపికగా ( చిన్నపుస్తకంగా) ఉండటం సర్వసాధారణం. ఆ స్థలానికి సంబంధించిన దేవతలు, ఋషులు, ప్రత్యేక మొక్కలు/వృక్షాలు మొదలైన వాటిని ఈ స్థల పురాణం వివరిస్తుంది. తనను సేవించిన వారికి గడియ( ఘటిక అన్నా గడియ అన్నా ఒకటే. గడియ

అంటే  24 నిమిషాల కాలం) కాలంలో మోక్షాన్ని  ఇస్తాడూ కనుక ఈ క్షేత్రానికి  ఘటికా చలమని   పే రు వచ్చిందని పెద్దలు చెబుతారు. .

ఘటికాచల మాహాత్మ్యం అనేది పరాశర మహర్షి   భృగు మహర్షికి చెప్పిన కథ.  ప్రసిద్ధి చెందిన ఘటికాచలాన్ని పూర్వకాలంలో కోలసింహపురం అని, ఆధునిక కాలంలో షోలింగర్ అని పిలుస్తున్నారు.  శ్రీ యోగనరసింహ స్వామి  , భార్య సుధావల్లి (అమృతఫలవల్లి) శ్రీ యోగాంజనేయుడు, రెండు వేర్వేరు కొండ శిఖరాలపై ఈ ఘటికాచలంలో నివసిస్తున్నారు. ఒక కొండ శిఖరం  పశ్చిమాన ఉంటే   మరొకటి తూర్పున ఉంది.. ఈ పవిత్ర మయిన  స్థలం  బ్రహ్మ తీర్థం, పాండవ తీర్థం  మొదలయిన  అనేక పవిత్రమైన తీర్థాలకు ప్రసిద్ధి చెందింది,

పద్నాలుగు శిఖరాలతో కూడిన ఘటికాచలము కృతయుగంలో బంగారు రంగులో ఉండేది.  ప్రస్తుత కలియుగంలో ఇది రాతి కొండగా ఉంది.(కృతౌ చామీకరమయః....) ఈ ఘటికాచల మాహాత్మ్యంలో  మందలోని ఒక జింక ఇంద్రద్యుమ్నునికి  నిజమైన వైష్ణవుల స్వభావాన్ని గుర్తు చేసి వేట మానుకోమని సలహా ఇచ్చింది. రాజు  అసలు విషయం గ్రహిస్తాడు.  తన రాజ్యాన్ని తన కొడుకుకు అప్పగించి  తన భార్యతో కలిసి జగన్నాథ-క్షేత్రానికి ( పూరీ) వెళతాడు.

ఒకసారి ఇంద్రద్యుమ్నుడు తన కలలో పొరపాటున హరి (విష్ణు)కి బదులుగా హర (శివ) అనే పదాన్ని పలికాడు. అకస్మాత్తుగా, అతను శివుని నివాసమైన కైలాసంలో తన ఉనికిని  పొందుతాడు.  హర అనే పేరు తనను కైలాసానికి తీసుకువచ్చిందని తరువాత  తెలుస్తుంది.   ఇంద్రద్యుమ్నుడు మోక్షాన్ని కోరినప్పుడు, నారాయణుడిని సంప్రదించడం ద్వారా బ్రహ్మ తేజస్సును పొందమని అతనికి సలహా  శివునిచే  ఇవ్వబడుతుంది. "యోగనరసింహ భగవానుడు తన భార్య మహాలక్ష్మితో కలిసి నివసించే పవిత్ర స్థలమయిన  ఘటికాచలములో  అనేక మం ది  తపస్సు చేసారు. చేస్తున్నారు.  చేస్తారు.  నీ ప్రయోజనం కోసం అక్కడికి వెళ్ళ."మనే సలహాతో   కథ మరింత ముందుకు సాగుతుంది.చివరికి ఇంద్రద్యుమ్న మహారాజు నరసింహుని దయతో బ్రహ్మ ర్షిత్వాన్ని , సాలోక్య ముక్తి ని పొందుతాడు. అయితే   ఈ కథకు, తెనాలి రామకృష్ణుని ఘటికాచల మాహాత్మ్య కథకు పోలికలు లేవు.

రామకృష్ణుని ఘటికా చల మా హాత్మ్య కథ ఇది

ప్రథమాశ్వాసము

మానస సరస్సు ఒడ్డున భృగువు యొక్క ఆశ్రమం ఉంది . భృగువు ప్రతిరోజు శ్రీహరిని పూజించేవాడు. ఓసారి నారదుడు భృగువు దగ్గరికి వచ్చాడు. “ అయ్యా! నాకు వైష్ణవుల యొక్క ఉత్తమమైన పవిత్రమైన కథలు చెప్పం”డని భృగువు నారదుని ప్రార్థించాడు. విష్ణువుతో పాటు 108 తిరుపతుల గొప్పతనాన్ని నారదుడు  వర్ణించాడు . 108 తిరుపతులలో ఘటికాచలం ఉన్నది కదా !  ఆ ఘటికాచలం గురించి చెప్పండని నారదుని భృగువు  అడిగాడు. నారదుడు చెప్పటం మొదలుపెట్టాడు.

సరయూ నది ఒడ్డున అయోధ్య అను ఒక  ఊరిని ధవళాంగుడు అనే రాజు పాలించేవాడు. ఒకరోజు ఉన్నవాడు ఉన్నట్లుగా అతడు కిరాతునిగా  మారిపోయాడు. ఇదివరకు ఉన్న తెలివితేటలన్నీ నశించి ఒక్కడే చెప్పకుండా రాజ్యాన్ని వదిలి అడవుల దారి పట్టాడు. కొంతకాలం  అలా బోయవాడిగా తిరిగాడు. ఓ రోజు వశిష్ఠుని యొక్క ఆశ్రమానికి వెళ్ళాడు. వశిష్ఠుడు అతనిని దివ్య దృష్టితో చూసి విషయం తెలుసుకున్నాడు. “రాజా! నువ్వు ఇదివరలో వేటాడుతూ విశ్వామిత్రుని ఆశ్రమంలో తిరిగావు. అందువల్ల విశ్వామిత్రునికి కోపం వచ్చింది. నీకు ఈ శాపం పెట్టాడు. ఒకరకంగా ఇది నీకు మేలు

కలిగిస్తుంది'' అని వశిష్ఠుడు చెప్పాడు. వశిష్ఠుని మాటలు పూర్తయిన వెంటనే ధవళాంగుని యొక్క కిరాతుని వేషం పోయి రాజ వేషం వచ్చింది అని  నారదుడు చెప్పాడు. ఇక్కడితో ప్రథమాశ్వాసం ముగిసింది..

ద్వితీయాశ్వాసము

హరిచక్రము అని ఒక  ఊరు ఉంది.. ఆ ఊళ్లో గోవింద శర్మ అనే ఒక భక్తుడు ఉండేవాడు. భార్య పేరు భద్రాంగి. వాళ్లకి నలుగురు కొడుకులు. వేదాలు మొదలయినవి బాగా చదువుకున్నారు. తండ్రి మాట పాటించేవారు. వాళ్ల ఇంట్లో తరల అను ఒక పనిమనిషి ఉండేది. ఆమెతో వారి ఇంటి పక్కనే ఉన్న హరిశర్మ అను బ్రాహ్మణుడు సంబంధం ఏర్పరచుకున్నాడు. వాళ్లకి నారదుడు పుట్టాడు. నారదుడు గోవింద శర్మ ఇంట్లోనే పెరుగుతున్నాడు.

ఓసారి వర్షాకాలం వచ్చింది. బాగా వానలు పడుతున్నాయి. అప్పుడు కౌండిన్యుడు అను ఒక ముని గోవింద శర్మ నివసిస్తున్న హరిచక్రపురానికి వచ్చాడు. గోవింద శర్మ ఆ మునిని వర్షాకాలం వెళ్లేవరకు తమ ఇంట్లోనే ఉండమని ప్రార్థించాడు. కౌండిన్యుడు అంగీకరించాడు. చిన్నపిల్లవాడిగా ఉన్న నారదుడు ప్రతిరోజు కౌండిన్యుని దగ్గరే ఉండేవాడు. ఆ ముని నారదునికి వైష్ణవమాహాత్మ్యము చెబుతూ ఉండేవాడు. క్రమక్రమంగా నారదునికి కొంత జ్ఞానం వచ్చింది. తర్వాత కౌండిన్యుడు తన దారిని తాను వెళ్లాడు. కొన్నాళ్లకు తరళ చనిపోయింది.

చిన్నవాడిగా ఉన్న నారదుడు గోవింద శర్మ అనుమతితో ఘటికాచలం చేరి అక్కడ శ్రీ హరిని గురించి తపస్సు చేయసాగాడు. శ్రీహరి నారదునికి కనిపించాడు. కానీ వెంటనే వేగంగా అదృశ్య మయ్యాడు. నారదుడు మరల భయంకరమైన తపస్సు చేయాలని అనుకుంటుండగా ఆకాశవాణి ఆ భయంకర తపస్సు మరుసటి జన్మలోనే సాధ్యమని చెప్పింది.

వెంటనే నారదుడు యోగ మార్గంలో శరీరాన్ని విడిచి తర్వాత జన్మలో బ్రహ్మ కుమారునిగా జన్మించాడు. ఇప్పటివరకు నారదుడు చెప్పిన కథలు విన్న భృగువుకు తృప్తి కలగలేదు. ఇంకా ఘటికాచల  మాహాత్మ్యం  చెప్పమని నారదుని కోరాడు. మరల నారదుడు చెప్పుట మొదలుపెట్టాడు.

ఒకసారి సప్త మహర్షులు శ్రీ హరిని చూడాలని కోరికతో శతశృంగము అనే కొండ మీద తపస్సు చేస్తున్నారు. ఈ సంగతి దేవేంద్రునికి తెలిసింది. వెంటనే వాళ్ల తపస్సు ఆపించాలని రంభ మొదలైన అప్సరసలను పంపించాడు. వారు ఎన్ని చేష్టలు చేసినా మహర్షులు చెల్లించలేదు. అప్సరసలు విసిగిపోయి తిరిగి వెళ్లిపోయారు.

ఎంత తపస్సు చేసిన విష్ణువు కనపడుట లేదని మహర్షులు బాధపడుతుండగా ఆకాశవాణి “ మీరు ఘటికా చలానికి వెళ్లండి. అక్కడ మీకు ఘటిక మాత్రము లో(ఇరువదినాలుగు నిమిషముల కాలము) స్వామి కనపడతాడు'' అని చెప్పింది. మహర్షులు బయలుదేరి కాంచికాపురం చేరి అక్కడికి 3 యోజనాల దూరంలో ఉన్న దూరంలో ఉన్న ఘటికాచలానికి చేరుకున్నారు. అక్కడ ఉన్న మునులతో కలిసి వీళ్ళు కూడా తపస్సు చేయగా నరసింహ దేవుడు ప్రత్యక్ష మయ్యాడు. అందరూ నరసింహ దేవుని పొగిడారు. ఇక్కడితో ద్వితీయాశ్వాసము పూర్తయింది.

తృతీయాశ్వాసం

నారదుడు భృగు మహర్షికి చెబుతున్నాడు. మునులు నరసింహ దేవుని భయంకరమైన అకారము చూడలేక శాంతాకారంలో కనపడమని ప్రార్థించారు. వారికి వెంటనే ఒక విమానం కనిపించింది. దానిలో ప్రమథ గణాలతో ఉన్న పరమశివుడు, నరసింహ స్వామి ఇద్దరూ కనిపించారు.

మునులు ఇద్దరిని స్తుతించారు. ఆ పిమ్మట నరసింహుడు తాను ప్రహ్లాదుని రక్షించిన పద్ధతిని చెప్పి ఏవైనా వరములు కోరుకొమ్మని మునులను అడిగాడు. ఈ ఘటికాచలమునకు మూడు యోజనముల వరకు ఉన్న ఏరులు మొదలయినవన్నీ మోక్షాన్ని ఇచ్చేవిగా కావాలని వరం అడిగారు. ఘటికాచలంలో ఉండే ప్రజలందరికీ ధర్మబుద్ధి ఉండాలని ఇంకొక వరం అడిగారు. ఇలా వారు అడిగిన వరాలన్ని నరసింహదేవుడు అనుగ్రహించాడు.

ఆ తరువాత ఆ ఘటికాచలానికి బ్రహ్మ పంపిన వైఖానసులు వచ్చారు. (విష్ణు అర్చకులలో ఒక తెగవారు వైఖానసులు. మఱియొక తెగవారు పాంచరాత్రులు. విఖనస ధర్మ శాస్త్రాలను అనుసరించే వారు వైఖానసులని మరొక అర్థం) అమృత ఫల సరస్సులో స్నానం చేసి శ్రీ హరిని ఆవాహన చేసి పూజ చేశారు అని నారదుడు భృగువునకు చెప్పాడు.

శ్రీహరికి ఆవాహనం, ఉద్వాసన ఎలా చేయాలని భృగువు నారదుడిని అడిగాడు. ఆ విధానమంతా విన్న తరువాత వైఖానసులు ఎవరని భృగువు అడిగాడు. విఖనసుని కుమారులు వైఖానసులని నారదుడు చెప్పాడు. ఒకనాడు వైఖానసులు ఘటికాచలం లో ఉండదలచి ఆ కొండను సమతలము చేయుటకు నరసింహ దేవుని ప్రార్థించారు. నరసింహుడు ఆంజనేయుని తలచాడు. ఘటికాచల భూమిని సమతలము చేయవలసినదిగా నరసింహుడు ఆంజనేయుని అజ్ఞాపించాడు. ఆంజనేయుడు స్వామి ఆజ్ఞను పాటించి ఆ కొండపై ఒక గ్రామమును నివాసయోగ్యంగా నిర్మించాడు. దానికి హనుమ గ్రామం అని పేరు. వైఖానసులు ఆ గ్రామములో నరసింహ స్వామికి కళ్యాణ ఉత్సవాలు చేశారు. దేవతలు, రాజులు అందరూ ఆ ఉత్సవాలకి వచ్చారు. లక్ష్మీ నరసింహుల కళ్యాణం తొమ్మిది రోజులపాటు జరిగింది.

అప్పటి నుంచి వైఖానసులు కళ్యాణ ఉత్సవమును చేస్తున్నారు. నరసింహుడు సుఖముగా సేవలు గ్రహించి భక్తుల కోరికలను నెరవేరుస్తున్నాడు. ఇలా నారదుడు చెప్పిన కథ విని భృగువు తాను అదృష్ట వంతుడనైతినని చెప్పాడు. ఇక్కడితో మూడవ ఆశ్వాసము తో పాటు గ్రంథము కూడా ముగిసింది.

రామ కృష్ణుని ఘటికాచల మాహాత్మ్యములో అంగి రసం శాంత రసం . ఈ గ్రంథంలో అవతారిక లేదు .ఖండోజి అనువానికి ఇది అంకితము చేయబడినది . వెంకటగిరి అనువాడు ఈ రామలింగని పుస్తకానికి అవతారిక రచించాడని చెబుతారు. ఘటికాచల మహాత్మ్యమునకు సంస్కృత మూల గ్రంథముగా ఏదీలేదని విమర్శకులు చెబుతున్నారు.

******

శ్రీ రామానుజులు సందర్శించిన పవిత్ర స్థలం ఈ ఘటికాచల ఆలయం, ఈ ప్రాంతంలో నిరంతర యుద్ధాలు మరియు యుద్ధాల కారణంగా కొన్ని శతాబ్దాలపాటు ఈ ఆలయం మూసి ఉంచబడింది. దీనిని 16వ శతాబ్దంలో చండమారుత మహాచార్యుల వారు పునర్నిర్మించారు.

ఘటికాచలము యొక్క ప్రధాన కొండ శిఖరం, లోపలి మరియు బయటి వృత్తాలలో చిన్న కొండలతో చుట్టుముట్టబడి, గండబేరుండ- నరసింహ రూపంలో ఉన్న నరసింహ స్వామిని పోలి ఉంటుంది, ఎనిమిది తలలు మొత్తం ఎనిమిది దిక్కులకు అభిముఖంగా ఉన్నాయి. ఈ భావన భగవంతుని యొక్క అమిత భక్తులు మాత్రమే గ్రహించగలరని పెద్దలు చెబుతారు.
సుమారుగా 1950 శ్లోకాలు కలిగిన ఈ ఘటికాచల మాహాత్మ్యము 22 అధ్యాయాలుగా రచించబడింది. నేను సంస్కృత మూలశ్లోకాలకి నాగరిలిపిలో చండామృత మహాచార్య గ్రంథ సంరక్షణ సంస్థ వారు ప్రచురించిన ఘటికాచల మాహాత్మ్యమును ఆధారముగా గ్రహిస్తున్నాను.
ఈ ప్రయత్నాన్ని విజయవంతం చేయమని మరోమారు యోగ నరసింహునికి నమస్కరిస్తున్నాను. స్వస్తి.
( ఈ నాందిలో నేను వ్రాసిన కొన్ని విషయాలు నేను రచించిన తెనాలి రామకృష్ణుడు పుస్తకం నుంచి,మరియు దేవనాగరిలిపిలో చండామృత మహాచార్య గ్రంథ సంరక్షణ సంస్థ వారు ప్రచురించిన ఘటికాచల మాహాత్మ్యము నుండి గ్రహింపబడినవి. ధన్యవాదాలు. )
ఆ చార్య తాడేపల్లి పతంజలి 19 -11 -24

శ్రీ శివాయ గురవే నమః

ఘటికాచలనివాసాయ శ్రీ నృసింహాయ నమః

## బ్రహ్మకైవర్త పురాణములో ఉన్న శ్రీఘటికాచల మాహాత్మ్యపు మొదటి అధ్యాయము

(మూల శ్లోకము మరియు తాత్పర్య విశేషాలతో)

### ఇంద్రద్యుమ్నమహారాజుతపోవనమునకువెళ్ళుట

సుధావల్లి పరిష్వంగ సురభీకృతవక్షసే |
ఘటికాద్రినివాసాయ శ్రీ నృసింహాయ మంగళమ్

**అమృతవల్లి అని పేరు గల లక్ష్మీదేవి చేత కౌగిలించుకొనబడి పరిమళములు వెదజల్లు వక్షస్థలము కలవాడై, ఘటికా చలములో నివాసముండు శ్రీ నరసింహ స్వామికి మంగళము.**

**-----------------------------------------------------------------------------------------------------------------------------**

**ప్రథమోఽధ్యాయః**

**శ్రీపరాశరః -**

**ప్రథమాధ్యాయము. శ్రీ పరాశర మహాముని చెబుతున్నాడు**

**అథ తే ప్రీతమనసస్సనకా ద్యాస్సురర్షయః ।**

**ఊచుః ప్రాఞ్జలయస్సర్వే బ్రహ్మాణం బ్రహ్మవాదినమ్।। 1**

**అటుపిమ్మట సనకుడు మొదలయిన మహామునులు సంతోషించిన మనస్సు కలిగినటువంటి వారై,  మహా వేదాంతి(బ్రహ్మ వాది) అయిన బ్రహ్మ దేవునికి నమస్కరించి  అతనితో ఈ విధంగా అన్నారు.**

**ఋషయః**

**ఋషులమాటలు**

**శ్రీమద్వేఙ్కటశైలస్య మాహాత్మ్యం వదతా త్వయా।**

**మధ్యే కిఞ్చిదుపన్యస్తమిన్ద్రద్యుమ్నస్య వైభవమ్ ।।2**

**బ్రహ్మదేవా! మీరు శ్రీ వేంకటాచల మాహాత్మ్యం గురించి మాకు చెప్పేటప్పుడు మధ్యలో ఇంద్రద్యుమ్న మహారాజు  యొక్క వైభవాన్ని ప్రస్తావించారు.**

**రాజ్ఞస్తస్య మహాబాహోః కథం బ్రాహ్మణ్యమాగతమ్।**

**కేన వా తపసా బ్రహ్మన్ కస్య వారాధనక్రమాత్ ।।3**

**గొప్ప భుజములు కలవాడు, శక్తిమంతుడు అయిన ఆ ఇంద్రద్యుమ్న మహారాజుకు ఏ దైవాన్ని ఆరాధించటం వల్ల, బ్రాహ్మణ్యము( బ్రహ్మ సాయుజ్యము, బ్రహ్మజ్ఞానం, మోక్షము, సద్గతి)  వచ్చింది? అతడు ఎవరిని గురించి ఘటికాచలం పై తపస్సు చేసాడు? ఏ ఫలితాన్ని పొందాడు?**

**నిస్సంశయం విస్తరేణ పృచ్ఛతాం వద నో విభో।**

**శ్రీ పరాశరః -**

**అస్తి ద్విజాతిప్రవర ఇన్ద్రద్యుమ్న ఇతి శ్రుతః ।। 4**

ఓ బ్రహ్మదేవా! మాకు మా సందేహములు పోయేటట్లుగా, విస్తారముగా ఆ ఇంద్రద్యుమ్న మహారాజు కథ చెప్పవలసినది.

పరాశరుడు చెబుతున్నాడు.

రెండు జన్మలు గల క్షత్రియ వంశంలో ఇంద్రద్యుమ్న మహారాజు  జన్మించాడు.

**విశేషము**

జన్మించిన పిదప ఉపనయనముచే రెండవ పుట్టుక వస్తుంది కనుక బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులను ద్విజన్ములు (రెండు జన్మలు కలవారు) అంటారు.

పూర్వజన్మని రాజాఽభూత్ సమస్తక్షితిమణ్డలే |
స పూర్వజన్మని భజన్నృపభావం మహర్షయః ||5

సమస్త భూలోకములోను పేరుపొందిన ఆ ఇంద్రద్యుమ్న మహారాజు పూర్వజన్మలో(త్రేతాయుగములో)  రాచరికాన్ని వహించినప్పటికీ, గర్వము లేకుండా వినయముతో మహర్షులను పూజించేవాడు .

జాతమాత్రాద్విష్ణుభక్తశ్శంఖచక్రాఙ్కితో యువా |
పురీమావాసయామాస మధురాం జగతీమవన్ ||6.

మధురానగరాన్ని రాజధానిగా చేసుకుని అందులో నివాసముండే ఆ మహారాజు పుట్టుకతోడనే విష్ణు భక్తి తో పాటు, భుజములపై వైష్ణవమును ప్రతిబింబించు శంఖ చక్రాల గుర్తులను కలిగి ఉన్నాడు.

స వాజిస్యందనోపేత స్సహామాత్యైరనుద్రుతైః |
భటైశ్చాశ్వపదాలమ్బైస్సన్నద్దై రపి ఖడ్గిభిః ||7.

ఒకసారి ఆ మహారాజు బాణములు, రథములతో కూడిన మంత్రులు తనను అనుసరిస్తుండగా , ఖడ్గములతో సన్నద్ధులైన భటులు, గుర్రములతో కలిసి వేటకు బయలుదేరాడు.

వాయుజఙ్ఘాభిధం వాజివరమారుహ్య సాయుధైః|
సోష్ణీషైరుద్భటైః కైశ్చిదాఖేటపథకోవిదైః ||8.

వేటాడుటలో నిపుణులై, ఆయుధములు, తల పాగాలు ధరించి, అడవిలోని మార్గములు తెలిసిన     సమర్థులైన భటులతో కలిసి, వాయువేగము కలిగిన వాయు జంఘము అను పేరు కలిగినఒక గుర్రమును ఎక్కి   ఇంద్రద్యుమ్న మహారాజు వేటకు బయలుదేరాడు.

అన్యైరపి మహామాత్యైర్మన్త్రజ్ఞో వనమభ్యగాత్ |
అటన్ మధ్యేవనం రాజా మృగయాం నృపసత్తమః ||9

ఇంకా మంత్రులు, మంత్ర శాస్త్రం తెలిసినవారు, అడవిలోని రకరకాల మార్గాలు తెలిసినవారు ఆ రాజశ్రేష్ఠుని వెంట వేటకు బయలుదేరారు.

ఏకాకీ హయమారుహ్య సర్వాస్త్యక్త్వా మృగానుగః|
మధ్యే వనస్య మృగయామటన్ హరిణమాయయౌ ||10

ఇంద్రద్యుమ్న మహారాజు తన వెంట వచ్చిన వారందరినీ వదిలిపెట్టి, ఒక్కడే గుర్రమునెక్కి మృగములను అనుసరించాడు. అడవి మధ్యలో ఒక మగ జింకను చూసాడు.

తం దృష్ట్వా భూపతిం తత్ర సజ్యమాయతకార్ముకమ్ |
సభ్రాన్తచేతా హరిణో భయాద్దుద్రావ వేగతః ||11.

దానిని చూసి ఇంద్రద్యుమ్న మహారాజు దానిని వేటాడటానికి ధనుస్సులో బాణము ఎక్కు పెట్టాడు. అది చూసిన ఆ మగ జింక భయముతో చాలా వేగంగా పరిగెత్తింది.

కిమేతదితి పశ్యన్తస్తద్వనస్థా విదూరతః |
మృగాస్తమేకం దదృశూ రాజానం పృష్ఠతోఽపి చ || 12

ఆ  అడవిలో ఉన్నవారు ఇదేమిటని చాలా దూరం నుంచి ఈ దృశ్యాన్ని చూస్తున్నారు. తన వెనక ఉన్న ఇంద్రద్యుమ్న మహారాజుని మాత్రమే గమనిస్తూ చాలా దూరం పరిగెత్తి ఆ మగలేడి తన లేళ్ళ గుంపులో కలిసిపోయింది.

అర్ధలీఢతృణాస్తత్ర న శేకురపి భక్షితుమ్ |
విభ్రాన్తలోచనా రాజబాణదర్శనతస్థితాః ||13.

తాము తినే గడ్డిపరకను పూర్తిగా ఆస్వాదించుటకు భయముతో సాధ్యము కాక, సగం గడ్డిపరకను కిందికి జార విడుస్తూ  ఆ లేళ్ల సమూహం భయపడిన కన్నులతో ఇంద్రద్యుమ్న మహారాజు బాణమును చూస్తూ నిలబడ్డాయి.

స రాజా సంస్కృతిం వీక్ష్య మృగాణాముచితాం తదా|
న మోచయితుమారేభే సాయకం మృగసత్తమే ||14

ఆ మహారాజు కూడా లేళ్ళ యొక్క పరిస్థితిని చూసి బాణం ప్రయోగించుటకు సిద్ధము కాలేదు.

దయయారుద్ధవేగం తమవలోక్య మృగాగణాః|
నిజగాద నృపశ్రేష్ఠం శ్రేష్ఠం ధర్మభృతామపి ||15

తమ పట్ల దయను ప్రదర్శిస్తున్న ధర్మాత్ముడైన ఆ రాజ శ్రేష్ఠుని చూసి ఆ లేడుల సమూహము ఈ విధంగా పలికింది.

మృగాః -

జగన్నాథే కృతాభక్తీ రాజా న రచితా విభో।

మా మోచయ శరం రాజన్ యదేతద్గతికా వయమ్ ॥ 16

ఓ మహారాజా !నువ్వు జగన్నాథుని పట్ల నిజమైనటువంటి భక్తి కలిగిన వాడివి కావు .ఒకవేళ భక్తి కలిగిన వాడివి అయితే ఈ విధంగా మా మీద బాణప్రయోగం చేయవు.

నిశమ్య తద్వచో రాజా జాతలజ్జో జగత్పతిః।

హరౌ నివిష్టచేతాస్తు విజ్యం చాపమధాకరోత్ । 17.

ఆ లేడుల యొక్క మాటలు విని తాను చేయదలచుకున్న బాణ ప్రయోగాన్ని తలుచుకుని ఇంద్రద్యుమ్న మహారాజు సిగ్గుపడ్డాడు . బాణమును వదులుట మానుకున్నాడు.ధనుస్సును విడిచిపెట్టాడు.

రాజా సంసృతిమాలోక్య హరిణీనాం తథా వనే।

ధిగస్తు రాజసు క్షాత్రం యతో న కరుణీ మృగే॥ 18.

ఇంద్రద్యుమ్న మహారాజు అరణ్యంలో ఆ విధంగా ఆ లేడుల సంసారమును  చూసి, రజోగుణముకలిగి, లేడుల పట్ల  దయలేని తన  రాజ స్వభావాన్ని తలుచుకొని సిగ్గుపడ్డాడు.

మా స్మ భీః క్రియతామస్మాజ్జనాద్వనపథే మృగాః।

భవన్తు సుఖినస్సర్వే త్యక్తోఽయం మృగసత్తమః ॥    19.

ఓ హరిణములారా! మీరు ఏమీ భయపడకండి .నా వల్ల , ప్రస్తుతం అడవిలో సంచరిస్తున్న మా పరివారం వల్ల మీకు ఎటువంటి అకృత్యము సంభవించదు. మీరందరూ సుఖముగా ఉండండి .నేను ఈ లేడిని విడిచి పెడుతున్నాను. అని ఇంద్రద్యుమ్నుడు చెప్పాడు.

ఇతి రక్షాం విరచయన్ మృగాణాం నృపసత్తమః ।

కృపావేశంగతస్తేషు సన్న్యవర్తత వాజినా ॥20

ఆ విధంగా ఉత్తమ రాజయిన ఇంద్రద్యుమ్నుడు జింకల రక్షణకు ఏర్పాట్లు చేసాడు. వాటియందు కరుణామయునిగా ప్రవర్తించి తిరిగి గుర్రంపై  వెను తిరిగాడు

మృగయానిస్పృహో రాజా పురీం స్వామభ్యగాద్వనాత్ ।

అనుద్రుతైరనువృతో మన్త్రిభిర్మన్త్రకోవిదః ||21

వేటాడేందుకు ఆసక్తి లేని ఆ రాజు అడవి నుండి తన నగరానికి తిరిగి వచ్చాడు. మంత్ర కోవిదులైన(రహస్యపుటాలోచనలలో నేర్పరులు అయిన)  మంత్రులు ఆయనను అనుసరించారు

రాజానమభితో వీక్ష్య పౌరజానపదాస్తదా|

నీరాజనాదికాస్తత్ర క్రియాః కాశ్చిద్వితేనిరే || 22

అప్పుడు పౌరులు పురప్రవేశం చేసిన  రాజుకు  హారతులు మొదలయినవి ఇచ్చి గౌరవించారు.

ఇన్ద్రద్యుమ్నో జగన్నాథపాదసేవా పరాయణః |

 క్షాత్రముత్సాదయన్ వైగాత్ ఘృణాం సమనుపద్య చ || 23

ఇంద్రద్యుమ్నుడు జగన్నాథుని పాదాల సేవయందు ఆసక్తి కలిగినవాడై, క్షత్రియ ధర్మాన్ని విడిచిపెట్టి దయాగుణాన్ని పాటించి రాజ్యపాలన చేసాడు.

కంచిత్కాలముషిత్వాథ న్యస్తభార స్తనూద్భవే |

కలత్రమాత్రసహితో హరిద్వారముపేత్య వై || 24

రాజధానికి తిరిగి వచ్చిన ఇంద్రద్యుమ్నుడు  కొంతకాలము తరువాత తన రాజ్య పరిపాలన భారాన్ని కుమారునికి అప్పజెప్పి భార్యతో కలిసి శ్రీ జగన్నాథ క్షేత్రాన్ని చేరాడు.

తపసోద్యుక్తసన్నాహో హరిభక్తిమవిన్దత |

తత్ర కాంశ్చిదుషిత్వా తు కాలాన్ కంసారిసేవయా || 25

ఇంద్రద్యుమ్నుడు తపస్సు పట్ల ఉత్సాహంతో, భగవంతునికి భక్తితో సేవ చేసాడు. కంసునికి  శత్రువయిన శ్రీ విష్ణు(కృష్ణ) సేవలో అక్కడ కొంత సమయం గడిపాడు.

తతోఽన్యం దేశమాగత్య జగన్నాథం జగత్పతిః|

తత్ర చక్రే తపస్తీవ్రం జటిలో వ్రతసత్తమః |26

అటుపిమ్మట అక్కడినుండి మరొక ప్రదేశానికి వచ్చి జగన్నాథుడయిన   హరినామ స్మరణ చేస్తూ   ఉత్తమ తపస్వి అయిన, జడలు ధరించిన  ఇంద్రద్యుమ్నుడు  అక్కడ  తీవ్రమయిన తపస్సు చేసాడు.

స తత్ర గత్వా యత్రాస్తే భగవాన్ భూతభావనః ।
కృష్ణః కమలపత్రాక్షో దేవకీనన్దనస్స్వయమ్ ।।27
ఆ తరువాత ఇంద్రద్యుమ్నుడు అన్ని జీవుల సృష్టికర్త అయిన తామరపువ్వు రేకుల కన్నులు కలిగిన వాడు, దేవకీకి ఆనందము కలిగించే కృష్ణపరమాత్మ ఉన్న ప్రదేశానికి వెళ్ళాడు.

ఆపదాం జీర్ణపర్ణాదామశ్మాదాం చ మహాత్మనామ్।
తతో మహారథస్తేషామైక్షిష్ట పదముత్తమమ్ ।। 28
పండిన రాలిన ఆకులు తింటూ,కపోత వృత్తిని ( ఆహార పదార్థములను చాల తక్కువగా సేకరిస్తూ) అవలంబిస్తూ మహాత్ములు కొనసాగించే తపోవృత్తిని ఇంద్రద్యుమ్నుడు కూడా ఉత్తమమైన మోక్ష స్థానము కొరకు అవలంబించాడు.
(అత్తీతి అత్.తేషామ్ అదామ్,జీర్ణపర్ణదామ్ = ఎండివాడిన రాలిన ఆకులు తినేవారు.పర్ణభక్షణ వృత్తి.అశ్మ + అదామ్ .కపోతవృత్తి.)

స్వయం తదా స రాజర్షిస్సకలత్రో హరిం భజన్ ।
నాన్యచేతా నాన్యరతో నాన్యాలోకనతత్పరః ।।29
ఆ సమయంలో రాజర్షి అయిన రాజు మరియు అతని భార్య స్వయంగా పరమాత్మను ఆరాధించారు. ఇంద్రద్యుమ్నుడు ఏ ఇతర ఆలోచనాపరుడు కాక, వేరే దేనిలోనూ నిమగ్నము కాక, ఏ ఇతరమైన వాటిపై చూపు సారించక హరి భక్తిలో నిమగ్నమయ్యాడు.

ముకున్దభజనవ్యగ్రః శివస్స్మృత్యసహస్సదా ।
స చిరం దర్భశయనస్సకళత్రో మహీపతిః ।।30
దర్భశయ్య మీద పడుకొని ఇతర చేష్టలు మాని ఇతరములు చూచుట మాని ఇతరుల యందు ఇష్టం లేనివాడై విష్ణువును సేవించుట యందు మాత్రమే ఇంద్రద్యుమ్నుడు భార్యా సహితుడై తదేక ధ్యానము కలవాడు అయ్యాడు.

ఇంద్రద్యుమ్నుడు కైలాసమునకు వెళ్ళుట

స కదాచన శయ్యాయాం హరిరిత్యక్షరద్వయమ్ ।

వక్తుకామో జగౌ లౌల్యాత్ హర ఇత్యక్షరద్వయమ్ ||31

ఒకప్పుడు నిద్రపోయే సమయంలో హరి అనే రెండక్షరాలు  మాట్లాడాలనుకుని పొరబాటున హర అనే రెండక్షరాలను ఇంద్రద్యుమ్నుడు  మాట్లాడాడు.

యదా ప్రామాదికీ సైషా హర ఇత్యక్షరద్వయీ|

గలితా తం తదా సద్యశ్శివదూతాస్సహస్రశః |32

ప్రమాదవశాత్తు  రెండక్షరాల హర అని పలుకగా అప్పుడు శివుని వేలాది దేవదూతలు వెంటనే అతని దగ్గరికి వచ్చారు.

విమానేతూత్తమే స్థాప్య నిన్యుశ్శివపదం పరమ్ |

సదా హరస్య విద్వేషాత్ హరస్స్మృతిరుపాగతా || 33

ఆ రాజర్షి ఇంద్రద్యుమ్నుని విమానంలో కూర్చుండబెట్టి శివపదమైన కైలాసానికి తీసుకొని పోయారు.  శివద్వేషము వలన ఆ ఇంద్రద్యుమ్నునికి శివస్మృతి కలిగినది.

ఇతి సంజగదుస్తత్ర సమాలోక్య సురేశ్వరాః|

తతోఽసౌ నీతమాత్రస్తు స్వప్నోఽయమితి చిన్తయన్ ||34

అని  కైలాసంలోని దేవతాప్రభువులు  ఇంద్రద్యుమ్నుని చూసి తమలో తాము అనుకొన్నారు.  తర్వాత  ఇంద్ర ద్యుమ్నుడు ఇదంతా కలగా భావిస్తుండగా శివదూతలు  అతనిని కైలాసానికి తీసుకెళ్లారు.

స్వప్నేఽపి విభ్రమః కస్మాదీదృశోఽయముపస్థితః|

యాదృశీ భావనా యత్ర స్థితిర్భవతి తాదృశీ ||35

కలలో కూడా ఈ గందరగోళం ఎందుకో ఇంద్రద్యుమ్నునికి అర్థం కాలేదు.  "ఎక్కడ ఏ విధమైన భావన ఉంటుందో, అక్కడ ఆ విధమైన స్థితి ఉంటుంది."

ఇత్యేషా వైదికీ మిథ్యా పౌరాణప్రశ్రయాపి సా |

ఇతి సంచిన్త్య బహుధా వీక్ష్య విభ్రాన్తచేతనః ||36

పురాణేతిహాసాంతర్గతమయిన   ఈ వైదిక వాక్యము   అసత్యమే.( ఎందుకంటే తాను హరి కొరకు భావన చేస్తుంటే,  ఆ స్థితి రాలేదు. వేరొకటి వచ్చినది)  ఇలా ఆలోచిస్తూ చాలా రకాలుగా కైలాసాన్ని చూస్తూ ఇంద్రద్యుమ్నుడు అయోమయంలో పడ్డాడు.

ఆలులోకే శివపదం పార్శ్వస్థానపి కిఙ్కరాన్ |

ఇన్ద్రద్యుమ్నః -

క్వాహం జ్ఞానపరః క్వేమే ప్రమథా గణశో గణాః ||37

తన పక్కనే ఉన్న శివ ప్రమథ గణాలను (శివుని అనుగ్రహమువలన కైలాసమున అతనితోకూడ ఉండు భక్తుల సమూహము )రాజు చూసాడు. ''జ్ఞానమార్గమును అవలంబించిన నేను మోక్షప్రదమైన వైకుంఠమునకు వెళ్లకుండా ఈ కైలాసానికి ఎందుకు తీసుకొని రాబడ్డాను'' అని రాజు ఆలోచించసాగాడు.

క్వ వా సంపత్ప్రదస్థానం క్వ కైవల్యప్రదం పదమ్।

 ఇతి చిన్తయతస్తస్య పార్శ్వతో వృషభధ్వజః ||38

ఐశ్వర్యాన్ని ఇచ్చే కైలాసమెక్కడ? ముక్తిని ఇచ్చే  వైకుంఠమెక్కడ? నేను కైలాసానికి ఎందుకు తీసుకురాబడ్డాను'' అని ఇంద్రద్యుమ్నుడు ఆలోచిస్తుండగా నందివాహనుడైన శివుడు అతని పక్కకు వచ్చాడు.

ప్రాదురాసీత్ పరఞ్జ్యోతిః పార్వత్యా సహ శఙ్కరః ।

పరమాత్మ అయిన శివుడు  మరియు పార్వతితో సహ ఇంద్రద్యుమ్నుని ముందు  ప్రత్యక్షమయ్యాడు.

శఙ్కరః -

సాధు సాధు మహాభాగ మద్భక్తస్త్వమనన్యధీః ||39

బాగు!, బాగు! ఓ అదృష్టవంతుడా!  నువ్వు నా భక్తుడివి .సాటిలేని బుద్ధిమంతుడివి.

ముదా విరచితం రాజన్ లాఞ్ఛనం వైష్ణవం త్వయి।

రాజర్షే మా కృథాశ్చిన్తామార్జితాస్సంపదో మయా||40

ఓ రాజర్షీ !(= ఋషి వలె నిగ్రహము కల్గిన శ్రేష్ఠుడైన రాజు) నా వల్లనే నీకు వైష్ణవము సిద్ధించింది. నా వల్లనే నీకు సంపదలు కలిగాయి.బాధపడకు.

కిమభీప్సితమస్మత్తః పృచ్ఛతస్తే దదామ్యహమ్ ।

 తం తథావ్యగ్రమనసం తదాకర్ణ్య వచస్తథా ||41

''నువ్వు  ఏమి కావాలని  మమ్మల్ని అడిగితే, అది నీకు ఇస్తాను'' అని శంకరుడు చెప్పగా కలత చెందిన మనస్సు గల ఆ ఇంద్రద్యుమ్న  మహారాజు బదులు చెప్పలేదు.

శఙ్కరో విస్మయమనా ఇదమూచే మహాసతిమ్।

**కోఽయం నారాయణో దేవో మాం వినా నృపసత్తమ ||42**

**శంకరభగవానుడు ఆశ్చర్యంతో ఆ మహానుభావుడయిన ఇంద్రద్యుమ్నునితో " ఓ రాజశ్రేష్ఠుడా ! నేను లేకుండా ఈ నారాయణుడు ఎవడు?" ( నేను, నారాయణుడు ఒకటే అని  శివుని మాటలలోని భావం) అని చెప్పాడు.**

**మామేవ యే ప్రపద్యన్తే తేషాం నారాయణో గతిః |**

**అహమేవ పరఞ్జ్యోతిరహమేవ మహీపతే ||43**

**ఓ ఇంద్రద్యుమ్న మహారాజా! నన్ను{శివుని) ఎవరు పొందుతారో వారికి నారాయణుడే గతి (అనగా శివుని ఆరాధించిన వారికి నారాయణుడు దిక్కు అవుతాడు. అనగా కాపాడుతాడు. ఎందుకంటే ఇద్దరి మధ్య అభేదం కనుక) .నేను పరమాత్మను.**

**నారాయణో జగన్నాథో బ్రహ్మ చైవేతి గీయతే|**

**తద్భక్తా ఏవ మద్భక్తాస్తల్లక్ష్మ మమ లక్షణమ్ ||44**

**నేనే నారాయణునిగా, జగన్నాథునిగా, బ్రహ్మగా కీర్తింపబడుతుంటాను. నారాయణుని భక్తులే నా భక్తులు. నారాయణుని లక్షణములే నా లక్షణములు .**

**ఇతి సంచోదితస్తత్ర రాజా శాస్త్రవిశారదః |**

**విస్మయం పరమం లభ్య ప్రాహ కించిదుమాపతిమ్ ||45**

**అనేక శాస్త్రములు చదువుకున్న ఇంద్రద్యుమ్న మహారాజుకి శివుని యొక్క మాటలు చాలా ఆశ్చర్యమును కలిగించగా అతడు శివునితో ఇట్లా అన్నాడు.**

**అనాదినిధనోఽనన్తో మహర్షిగణసేవితః |**

**బ్రహ్మస్వరూపీ భగవాన్ కైవల్యపదనాయకః || 46**

**శ్రీమన్నారాయణుడే  ఈ లోకానికి అనాది నిధనుడు. ( మొదలు తుదలేనివాడు - పుట్టుకలు చావును లేనివాడు) అనంతుడు (అంతము లేనివాడు) మహర్షిసమూహములచే  సేవింపబడువాడు.  బ్రహ్మస్వరూపి. భగవానుడు .ముక్తిని ఇచ్చేటువంటి వాడు.**

**విశేషాలు**

**భగవానుడు**

**భగ శబ్దానికి  ఐశ్వర్యం, ధర్మం, వైరాగ్యం, జ్ఞానం మొదలైన చాలా అర్థాలు ఉన్నాయి. అవి కలిగినవాడు భగవంతుడు/ భగవానుడు.2. సమగ్ర ఐశ్వర్యం కలిగినవాడు.3. సమస్త భూతముల జ్ఞానం కలిగిన వాడు.4. ఏది జ్ఞానమో ఏది అజ్ఞానమో తెలిసినవాడు.**

**నారాయణో జగద్ధాతా సర్వేషామన్తరే హి సః|**

దేవ కిం బహునోక్తేన భవతోఽపి హృది స్థితః 47

నారాయణుడు జగద్ధాత(= జగత్తును ధరించువాడు) అందరి యొక్క మనసులలోనూ అతడు ఉన్నాడు. ఇన్ని మాటలు ఎందుకు? నీ హృదయమునందును నారాయణుడు ఉన్నాడు ||

విశేషాలు

నారాయణుడు :

1. నీటియందు ఉండేవాడని వ్యుత్పత్తి అర్థం. విష్ణువు. సర్వవ్యాపియైన పరమాత్మ. సకల తత్త్వములకును ఆధారమైన వాడును, సకల తత్త్వములయందు ఉండు వాడును అయిన భగవంతుడు.

2. ఎవరి నాభిలోని కమలం నుంచి సమస్త జగత్తు/ జగత్తును సృష్టించిన బ్రహ్మ పుట్టాడో అతడు నారాయణుడు. ('నారం సరోరుహం ప్రోక్తం జగద్యోనిమయం. పురా, యస్య నాభేస్స ముత్పన్నం ఏ నారాయణ ఉచ్యతే) మరికొన్ని వివరణలు కూడా ఉన్నాయి

బ్రహ్మణోఽపి తథా వేదైర్గీయతే కిము కేశవః|

తథా చ యోగిహృద్ధ్యేయమశేషహృ దివర్తినమ్ ||48

బ్రహ్మ చేత అలాగే వేదముల చేత కూడా అతడు కీర్తించబడుతున్నాడు. అతడు యోగులచే హృదయమునందు ధ్యానింపబడుచున్నాడు .

కైవల్యదమనాదృత్య కో భజేదన్యదైవతమ్ |

అనుభుక్తం మయైశ్వర్యం పుత్రమిత్రకలత్రకమ్ ||49

మోక్ష కారకుడైన శ్రీమన్నారాయణుని వదిలి ఇతర దేవతలను ఎవడు కొలుస్తాడు?( ఎవరూ కొలువరని భావం) పుత్ర మిత్ర భార్యలతో కూడిన అన్ని రకాల ఐశ్వర్యాలను నేను అనుభవించాను.

ఇదానీం ముక్తికామోఽహం తత్ప్రదాతారమాద్రియే

నేను ఇప్పుడు మోక్షమునే కోరుతున్నాను .ఆ మోక్షమును ఇచ్చే వాడెవరో వానిని గురించి తెలుసుకొనుటకు నిన్ను వేడుకుంటున్నాను.

శంకరుడుః

తథా యది తవ బ్రాహ్మయం తేజశ్చేదుపలభ్యతే ||50

శంకరుడు ఇలా అన్నాడుః  ఓ రాజా నువ్వు మోక్షము కోరుతున్నావు . బ్రహ్మ తేజస్సును పొందినవారు   మోక్షాన్ని పొందగలరు

పరం పదం మహావిష్ణోర్నాత్రకార్యా విచారణా ।

మహా విష్ణువు యొక్క సర్వోన్నత నివాసము యొక్క గొప్పతనాన్ని లెక్కపెట్టుటకు అసాధ్యము. అది విచారణకు అందేది కాదు.

ఇన్ద్రద్యుమ్నః -

అస్మిస్తవాఞ్జలిరయం బ్రాహ్మ్యం కస్మాద్భవేన్మయి ।।51

అప్పుడూ రాజు కుతూహలముతో శంకరునితో ఇలా అన్నాడు'' ఓ ఈశ్వరా! నీకు ఇదే నా నమస్కారము. నాకు బ్రాహ్మ్యము( బ్రహ్మ జ్ఞానం)  ఎవరి వలన కలుగును?

కేనోపాయేన లఘునా భవితా వైష్ణవం పదమ్ ।

స లక్ష్మీమిలితోరస్కస్సనకాదినిషేవితః ।

నారాయణః ప్రసన్నో మే భవేత్తద్వద శఙ్కర ।।52

ఏ ఉపాయము చేత వైష్ణవ పదము సులభముగా సిద్ధిస్తుంది?  హృదయములో లక్ష్మీదేవిని కలిగినవాడు,

సనకసనందనాదులచే సేవించబడువాడయిన  విష్ణుమూర్తి నాకు ఎలా ప్రసన్నుడవుతాడో నువ్వు దయతో చెప్పవలసినది.

శఙ్కరః -

అగణ్యకమపుణ్యానామృషిణాం భావితాత్మనామ్ ।

ఆసీదావాసవసుధా శ్రీనృసింహపురీ భువి ।।53

శంకరుడు చెప్పు చున్నాడు.  ''ఓ రాజా! భూమి పైన ఒక నరసింహపురము ఉన్నది .ఎంతో పుణ్యం చేసిన భావితాత్ములైన ఋషులకు అది నివాస స్థానము .

**విశేషాలు**

భావితాత్మ అనగా1. బ్రహ్మాన్ని తెలుసుకొన్నవాడు.2. సన్యాసి.3. ధ్యానం వల్ల పవిత్రమైన ఆత్మ కలిగినవాడు.

ప్రహ్లాదైకవరప్రదానరసికః ప్రహ్లాదనస్సర్వదా

ప్రాతః ఫుల్లసరోజకోమలపదశ్యామోఽరవిన్దేక్షణః ।

లక్ష్మ్యాలాఞ్ఛితవామవక్షసి చిరం న్యస్తాశయః కేశవ-

స్త్రత్రాస్తే భగవాన్నృసింహ ఇతి విఖ్యాతోఽచలాగ్రే పుమాన్ || 54

అక్కడ ఉన్న కొండపై ప్రహ్లాదునికి వరములను ఇచ్చువాడు,అందరికి ఎప్పుడు ఆహ్లాదము కలిగించువాడు, ఉదయకాలములో వికసించిన పద్మముల వంటి మెత్తని పాదములు కలవాడు,నల్లనివాడు, అందమైన పద్మ పత్రముల వంటి కన్నులు కలవాడు, కేశవుడు ,లక్ష్మినిఆలింగనము చేసుకున్న వాడు మోక్ష పదవిని ఇచ్చువాడు అయిన భగవంతుడు శ్రీ నరసింహ స్వామి ఉన్నాడు

**విశేషాలు**

కేశవుడనగా 1. బ్రహ్మరుద్రులను ప్రళయకాలంలో తనయందుంచుకొన్నవాడు.2. బ్రహ్మరుద్రులపైన దయ కలవాడు.3. కేశిని చంపినవాడు. 4. చక్కని వెంట్రుకలు కలవాడు.

యత్రాసతే మహాత్మానః ఋషయస్సప్తవిశ్రుతాః|

ఘటికాచల ఇత్యస్య నామ పౌరాణికా విదుః ||55

పౌరాణికులు ఆ క్షేత్రాన్ని ఘటికాచలము అంటారు. సప్తర్షులను పేరు గలిగిన మహాత్ములు ఇక్కడ ఉన్నారు

**విశేషాలు**

సప్తర్షులు

మరీచి, అంగిరసుడు, పులహుడు, వసిష్ఠుడు, అత్రి, పులస్త్యుడు, క్రతువు అనువారు సప్తర్షులని కొందరు, కశ్యపుడు, అత్రి, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, జమదగ్ని, వసిష్ఠుడు అను ఏడుగురిని సప్తర్షులు అని మరికొందరు చెబుతారు.

తత్రైవ రమతే సాక్షాదమ్భోజసమవీక్షణః |

పద్మయాలిఙ్గితవపుర్నిశ్రేయసనిదానభూః ||56

ఆ  ఘటికాచలములో పద్మములు వంటి చూపులు కలిగిన  మోక్షదాయకుడైన  నరసింహుడు లక్ష్మీదేవిచే ఆలింగనము చేసుకొనబడిన శరీరము కలవాడయి ఉంటాడు.

ఇన్ద్రాదయో లోకపాలాః కృష్ణద్వైపాయనాదయః |

ఋషయశ్చ నిషేవన్తే ప్రతిసన్ధ్యామతన్ద్రితః ||57

ఇంద్రుడు  మొదలైన దిక్పాలకులు, కృష్ణద్వైపాయనుడు(ద్వీపములో పుట్టినవాడు. వేదవ్యాసుడు.) మొదలయిన  ఋషులు ప్రతి సంధ్యాకాలంలో ఈ  ఘటికాచలంపై స్వామిని నిరంతరము కొలుస్తుంటారు.

**విశేషాలు**

అష్టదిక్పాలకులు

1.ఇంద్రుడు (తూర్పు); 2.అగ్ని (పూర్వదక్షిణము);3. యముడు (దక్షిణము);4. నిరృతి (దక్షిణపశ్చిమము); 5.వరుణుడు (పడమర); 6.వాయువు (పశ్చిమోత్తరము); 7.కుబేరుడు (ఉత్తరము);8. ఈశానుడు (పూర్వోత్తరము)

తత్ర దేవాస్సగన్ధర్వాస్సిద్ధాశ్చ వసవస్తథా ।
నారాయణం నరహరిం నిరతం పర్యుపాసతే ।। 58

దేవతలు, గంధర్వులు (దేవలోకమునందు గానముచేయు ఒక తెగ దేవతలు) సిద్ధులు, వసువులు నరసింహావతారము ధరించిన  ఆ నారాయణుని నిరంతరము కొలుస్తుంటారు.

**విశేషాలు**

సిద్ధులు

దేవతలలో ఒక తెగవారు. అణిమాది సిద్ధిగలవారు  సిద్ధులు అని వ్యుత్పత్తి. సాధారణ వ్యక్తులకు ఉండని, అతీంద్రియ శక్తులను సిద్ధులు అంటారు. ఇవి ఐదు విధాలని పాతఞ్జల యోగశాస్త్రం (కైవల్యపదం) తెలియజేస్తున్నది. పూర్వజన్మలో సాధనవల్ల కలిగేవీ, దేవతలకు జన్మచేతనే కలిగేవీ జన్మసిద్ధులు. కొన్ని ఓషధుల వల్ల కలిగేవి ఓషధిజ సిద్ధులు. కొన్ని మంత్రాలవల్ల కలిగే సిద్ధులు మంత్రసిద్ధులు. నాలుగోవి తపస్సు వల్ల కలిగే సిద్ధులు. సమాధి స్థితివల్ల కలిగేవి సమాధి సిద్ధులు.

వసువులు

గణాధిదేవతలను వసువులు అంటారు.వీరు ఎనిమిది మంది.  1. ధరుడు, 2. ధ్రువుడు, 3. సోముడు, 4. విష్ణువు (అహస్సు), 5. అనిలుడు, 6. అనలుడు, 7. ప్రత్యూషుడు, 8. ప్రభాసుడు.

**పాదే తస్య మహీన్ధ్రస్య ఋషిసంఘనిషేవితే ।**
**తీర్థోత్తమాదిసంపూర్ణే మమాపి రమతే మనః ।।59**

ఆ పర్వత సానువులలో ( కొండమీది విశాల సమప్రదేశములు)ఋషులు నివసిస్తూ ఉంటారు. ఆ క్షేత్రములో అనేకమైన ఉత్తమమైన తీర్థాలు ఉన్నాయి. ఆ క్షేత్రం అంటే నాకు కూడా చాలా ఇష్టం.

యది కైవల్యపదవీ వాఞ్ఛితా నృపసత్తమ।
యది బ్రాహ్మ్యం చ తేజస్తే తస్మిన్దేశే తపః కురు ।।60.

ఓ రాజ శ్రేష్ఠా!  బ్రాహ్మ్యము(మోక్ష పదవి), బ్రహ్మతేజస్సు నీకు కావాలంటే ఆ నరసింహ క్షేత్రంలో తపస్సు చేయి.

శ్రీ పరాశరః-

శ్రీ పరాశరుడు చెప్పు చున్నాడు

ఇతీరితశ్శఙ్కరేణ భక్తవాత్సల్యశాలినా|

ప్రహర్షమతులం లేభే ప్రథమం నృపసత్తమః || 61

భక్తవాత్సల్యముతో శంకరుడు చెప్పిన మాటలు విని ఆ ఇంద్రద్యుమ్న మహారాజు చాలా సంతోషించాడు.

దణ్డవత్ప్రణిపత్యాథ శీఘ్రుతోషముమాపతిమ్ |

హృది కృత్వా తదాదేశమాజగామ భువం నృపః||62

ఇంద్రద్యుమ్న మహారాజు దండ ప్రణామము(=శిరస్సు మొదలు ఎనిమిది అవయవములతో నేలను తాకుచూచేయు నమస్కారం) చేసి, ఆశుతోషుడైన(=అల్పసంతోషి అయిన) ఆ శివుని సంతోషపరిచాడు.ఆ శివుని మాటలను శిరసావహించి భూమికి దిగి వచ్చాడు

.

అథ భువమవతీర్య రాజవర్యస్స చ సరసీరుహలోచనాసహాయః |

నరహరిపదసేవనం కదా స్యాదితి హృదయే మతిమాకలయ్య హృష్టః63.

రాజ శ్రేష్ఠుడైన   ఆ ఇంద్ర ద్యుమ్న మహారాజు  , పద్మముల వంటి కన్నులు కలిగిన భార్యతో కలిసి   భూమికి దిగి వచ్చాడు.

కదా పునశ్శంఖగదాయుధః పరస్తథా పుమాన్ పఙ్కజసన్నిభేక్షణః |

పవిత్రమూర్తిః పరవీరహన్తా కైవల్యదో మేం నృహరిస్సమేష్యతి || 64

"శంఖ గదాధరుడు, పరుడు,(=శ్రేష్ఠుడు, పరమాత్మ) పవిత్రమూర్తి, పద్మముల వంటి చూపులు కలిగిన వాడు, శత్రువీరులను సంహరించువాడు, మోక్షమును ప్రసాదించువాడు అయిన నరసింహుని ఎప్పుడు సేవిస్తాను"? అని రాజు భావించాడు.

ఇతి విరచితచిన్తనః ప్రజానామధిపతిరేష మహేశ్వరప్రసాదాత్ |

నరహరిముపసేవితం మునీన్ద్రైరభజదయం ఘటికాచలాధినాథమ్ || 65

అని ఈ విధముగా ఆలోచిస్తూ శివుని కరుణ వలన మునీంద్రులు సేవించిన ఆ ఘటికాచలాధిపతి అయిన నరసింహుని సేవించుట కొరకు ఇంద్రద్యుమ్నుడు ఆరాటపడుతున్నాడు.

ఇతి బ్రహ్మకైవర్తే ఉత్తరఖణ్డే భృగుపరాశరసంవాదే ఘటికాచలమాహాత్మ్యే ప్రథమోఽధ్యాయః |

ఇది బ్రహ్మకైవర్త పురాణంలోని ఉత్తరఖండంలో ఉన్న భృగుపరాశరసంవాదంలో ఉన్న ఘటికాచల మాహత్మ్యంలోని మొదటి అధ్యాయము సమాప్తము.

శ్రీ శివాయ గురవే నమః

ఘటికాచలనివాసాయ శ్రీ నృసింహాయ నమః

బ్రహ్మకైవర్త పురాణములో ఉన్న  శ్రీఘటికాచల మాహాత్మ్యపు  రెండవ అధ్యాయము

(మూల శ్లోకము మరియు తాత్పర్య విశేషాలతో)

-----------------------------------------------------------------------------------------------------------------------------

శ్రీ పరాశరః

బ్రహ్మణో వచనం శ్రుత్వా ఋషయో రోమహర్షణమ్ । విస్మయం పరమం తత్ర లేభిరే తే పరస్పరమ్ ।।౧

పరాశర మహాముని చెబుతున్నాడు.

ఇంద్రద్యుమ్న  మహారాజు కథ విన్న ఋషులు దైవభక్తితో పులకించిపోయారు.   పరస్పరం విషయాన్ని చెప్పుకుంటూ ఆశ్చర్యాన్ని పొందారు.

ఋషయః

సాధు సాధు త్వయా బ్రహ్మన్నానుపూర్వ్యా మహాత్మనః । రాజర్షేస్తస్య వై తత్త్వమీరితం విస్మయాకులమ్ ||౨

ఓ బ్రహ్మ దేవుడా ! ఒక క్రమ పద్ధతిలో మహానుభావుడైన ఆ రాజర్షి ఇంద్రద్యుమ్నుని గురించి మీరు చెప్పిన పద్ధతి చాలా బాగుంది. చాలా బాగుంది. మేమందరము చాలా ఆశ్చర్య పడుతున్నాము.

నరసింహవరాత్తస్య బ్రాహ్మణ్యం కథమాగతమ్ । ఇదానీం శ్రోతుమిచ్ఛామో విస్తరేణ వద ప్రభో ||౩

తర్వాత ఏమి జరిగింది? నరసింహ దేవుని వరము వలన ఆ రాజర్షి కి మోక్షము ఎలా వచ్చింది? ఓ ప్రభూ! తర్వాత జరిగిన కథ మాకు సవిస్తరముగా తెలుపవలసినదిగా మనవి.

నృసింహపురమాహాత్మ్యం మాహాత్మ్యం ఘటికాద్రిణః । కస్మింస్తీర్థే తపస్తేపే తత్తీర్థస్య చ వైభవమ్ ||౪

ఆ నరసింహపురపు గొప్పతనము, ఘటికాచలము యొక్క గొప్పతనం మాకు తెలుపవలసినది . ఆ మహారాజు ఏ తీర్థములో తపస్సు చేసాడు?ఆ తీర్థము యొక్క గొప్పతనం ఏమిటి?

ఆదితో వద నో బ్రహ్మన్ దైవాద్యత్తదుపస్థితమ్ ।

బ్రహ్మ

స శఙ్కరకృతోద్దేశస్తస్మాద్దేశాదపాక్రమాత్ ||౫

ఓ బ్రహ్మదేవుడా ! మొదటినుండి ఏరకంగా  ఆ ఇంద్రద్యుమ్న మహారాజు  ఉపాసన  పద్ధతి జరిగిందో, ఆ శంకరుని ఉద్దేశములోని ఆంతర్యము   మొదలయినదంతా  మాకు చెప్పండి.

ఇంద్రద్యుమ్నుడు హిమాలయానికి చేరుట

అథాపశ్యన్నృపశ్రేష్ఠో హిమవన్తం నగోత్తమమ్ । తమారోహత ఏవాన్యాన్ వాలఖిల్యానపి ద్విజాన్ ||౬

శివుని యొక్క ఆజ్ఞ చేత ఇంద్రద్యుమ్న మహారాజు భూలోకానికి దిగివచ్చి పర్వతాలలో గొప్పదైన హిమాలయ పర్వతానికి చేరాడు. ఆ పర్వతముపై వాలఖిల్యులు మొదలైన ఋషులను మరియు బ్రాహ్మణులను చూసాడు.

విశేషాలు

వాలఖిల్యులు :

వీరు బ్రహ్మమానసపుత్రులలో ఒకడయిన  క్రతువునకు పుట్టిన బొటన వ్రేలి ప్రమాణములో ఉండు 60000 మంది . మహాతపస్సంపన్నులు వీరు.   వీరు  నిరంతరము సూర్యరథము చుట్టు తిరుగుతూ ఉంటారు. . వీరు బ్రహ్మరోమ కూపమునుండి పుట్టినట్లు కొందఱు చెబుతారు..

అభక్షాన్వాయుభక్షాంశ్చ తత్రాపశ్యన్నృపాత్మజః ।
ఇన్ద్రద్యుమ్నః
విశ్రాన్తా ఇవ దృశ్యన్తే భవన్తః కామగా ఇవ ॥ ౭

ఆ పర్వతముపై ఏనాడు ఆహారము తినని వారిని, గాలిని ఆహారముగా స్వీకరించే వాలఖిల్యులు మొదలైన ఋషులను బ్రాహ్మణులను రాజు చూసి వారితో ఇలా అన్నాడు. "మీరు ఇష్టం వచ్చినట్లు ఎక్కడికయినా తిరగగలిగే సామర్థ్యం కలిగిన వారిగా ఉన్నారు. ఇప్పుడు విశ్రాంతి తీసుకొన్నట్లు ఆనందంగా కనబడుతున్నారు.

కిం దైవతముపాస్యైవం స్వస్వమాశ్రమమాగతాః । ప్రతిపాల్య గతిం వోఽహం తిష్ఠామి చ ఋషీశ్వరాః ॥౮

"ఏ దేవుని సేవించి కోరిక నెరవేరిన వారి వలెమీరు విశ్రాంతిగా ఉన్నారు?" అని వారిని పలకరించాడు. మీరు పొందిన ఉత్తమ మార్గాన్ని నేను కూడా పొందాలనుకుంటున్నాను.

యూయం వదత తత్త్వేన పృచ్ఛతః పురతో మమ ।
వాలఖిల్యాదయః ఋషయః
అస్తి కాచిద్మవిశ్రేష్ఠా నృసింహస్య పురీ శ్రుతా ॥౯

దయయుంచి నాకు ఆ వివరాలు చెప్పండి. అని రాజు అడుగగా వాలఖిల్యాది ఋషులు ఇలా చెప్పారు. " ఓ రాజా ! శ్రీ నరసింహపురం అను ఒక గ్రామము ఉన్నది.

తత్ర దేవో నరహరిస్సాక్షాల్లోకపితామహః । స వై హిరణ్యకశిపుం వినిర్భిద్యాసురోత్తమమ్ ॥౧౦

అక్కడ లోకపితామహుడైన శ్రీ నరసింహ దేవుడు ఉన్నాడు. ఆ దేవుడు రాక్షస రాజైన హిరణ్యకశిపుని సంహరించాడు.

ప్రహ్లాదేన స్తూయమాన ఆస్తే నారాయణస్స్వయమ్ । వయం తస్య గిరేశ్శృఙ్గమాసాద్య సురసేవితమ్ ।। ౧౧

నారాయణుని స్వరూపమైన ఆ నరసింహ దేవుడు ప్రహ్లాదునిచే స్తుతించబడ్డాడు. మేము దేవతలు సేవించే ఆ ఉత్తమ పర్వత శృంగము పైకి చేరాము.

తీర్థే హనుమతస్తత్ర స్నాత్వా గత్వా నగోత్తమమ్। నృహరిం వన్ద్య సన్ధ్యాయామితః ప్రాప్తా యథాగతమ్ ॥౧౨

"ఆ పర్వత శృంగముపై ఉన్న హనుమత్ తీర్థములో స్నానం చేసాము. సాయంకాలమున శ్రీ హరికి నమస్కరించి ఈ ఆనందాన్ని పొంది ఇలా తిరిగివస్తున్నాము" అని వాలఖిల్య మునులు చెప్పారు.

శ్రీ పరాశరః

అథాయమవనీపాలో హర్షగద్గదయా గిరా । ఆభాష్య ఋషిముఖ్యాంస్తాన్ దణ్డవత్ప్రణనామ హి ॥ ౧౩

ఆ మాటలు విన్న ఇంద్రద్యుమ్న మహారాజు సంతోషముతో తడబడుతున్న మాటలు కలవాడయ్యాడు. వారికి దండప్రణామము(సాష్టాంగనమస్కారము) చేసాడు.

ఇన్ద్రద్యుమ్నః -

కియద్దూరం నరహరేరద్విరాలక్ష్యతే మహాన్ । యత్ర యూయం గిరివరే విష్ఠితం పరమేశ్వరమ్ ॥౧౪

" పరమేశ్వరుడు కొలువైన మీరు పూజించిన నరహరి పర్వతము ఇక్కడికి ఎంతదూరమున ఉన్నది? " అని వాలఖిల్య మునులను ఇంద్రద్యుమ్న మహారాజు అడిగాడు.

స్తువన్తః పదమర్చన్తః ప్రాప్నువన్తః పరం ప్రియమ్ ।

శ్రీ పరాశరః

ఇత్యుక్తవన్తస్తే తత్ర వాలఖిల్యాదయో నృపమ్ ॥౧౫

“ఏ పర్వతముపై ఉన్న పరమేశ్వరుని సమీపించి, పూజించి పరమ ప్రియమును మీరు పొందారు? ఆ పర్వతము ఎక్కడ ఉన్నది? నాకు చెప్పవలసినది”.అని రాజు అడుగగా వాల ఖిల్యాది ఋషులు ఇలా జవాబు చెప్పారు.

ఊచుస్తద్వైభవం మార్గమపి పృథ్వీధరస్య వై ।

వాలఖిల్యాదయః ఋషయః

ఇతోఽవిదూరే ధర్మాత్మన్ శ్రీనృసింహపురాభిధమ్ ॥౧౬

వాల ఖిల్యాది ఋషులు ఇంద్రద్యుమ్మునికి నరసింహ పురమునకు వెళ్లు మార్గమును ఇంద్రద్యుమ్మునికి ఇలా సూచించారు. ఓ ధర్మాత్ముడా ! ఇక్కడికి దగ్గరిలో పట్టణములలో కెల్లా శ్రేష్ఠమయిన శ్రీ నృసింహ పురము అను పేరు కలిగిన పట్టణము ఉన్నది.

పట్టణం పట్టణానాం చ సత్తమం దృశ్యతే నృప । ఇతో హిమవతశ్శైలాన్నవసాహస్రయోజనే ॥౧౭

శ్రీ నృసింహ పురము పట్టణములలో కెల్లా శ్రేష్ఠమయినది. హిమవత్పర్వతమునకు 9000యోజనముల దూరమున వేగవతి( పయోష్ణి) అను పేరు గల ఒక నది ఉన్నది.

విశేషము

యోజనమనగా ఆమడ. నాలుగు క్రోసులు, పది మైళ్లు

పయోష్ణీ పుణ్యవిజ్ఞేయా వేగవత్యపరాభిధా । తదుత్తరస్య పారస్య పరిష్కారవతీ పురీ ॥౧౮

పుణ్యుల చేత తెలుసుకొనబడు ఆ పయోష్ణికి వేగవతి అని ఇంకొక పేరు ఉన్నది. దానికి ఉత్తరపు గట్టున పరిష్కారవతి అను నగరము కలదు.

నగర్యా నైఋతదిశమలఙ్కృత్య మహీధరః । నరకణ్ఠీరవస్యైష శృఙ్గీ శృఙ్గవతాం వరః ॥౧౯

ఆ నగరమునకు నైఋతి దిశలో నరసింహదేవుని యొక్క ప్రముఖమైన పర్వతం ఉన్నది.ఇది పర్వతములలో ఉత్తమోత్తమైనది.

ఆదృతస్సకలైరేషః పుణ్యశ్చక్షుష్మతాం ఫలమ్ । తస్మిన్ యోగనృసింహేన్ద్రస్స్వామీ విశ్వభయాపహః ॥ ౨౦

కన్నులున్నందుకు ఆనరసింహదేవుని అద్భుతమైన నరసింహ పర్వతమును ప్రతివారు దర్శించాలి. ఈ పర్వతములో విశ్వ భయమును పాగొట్టువాడయిన నరసింహదేవుడు ఉన్నాడు..

ఆస్తే ముముక్షుభిస్సేవ్యో భవ్యో లక్ష్మీసహాయవాన్ గఙ్గాఞ్చ సమతిక్రమ్య శ్రీశైలమచలోత్తమమ్ । ౨౧

ఈ పర్వతములో మోక్షము కోరువారిచే సేవింపబడు లక్ష్మీ సమేతుడయిన నరసింహదేవుడు ఉన్నాడు. ఓ రాజా ! ఆ పర్వతం దగ్గరికి వెళ్లటానికి నువ్వు గంగానదిని దాటి, శ్రీ శైలమును దాటాలి.

శేషశైలం తతో గత్వా విశ త్వం ఘటికాచలమ్ ।

శ్రీ పరాశరః

స రాజా తద్వచశ్శ్రుత్వా ఋషీణాం భావితాత్మనామ్ ॥ ౨౨

తరువాత శేషశైలమును దాటి నువ్వు ఘటికాచలమునకు వెళ్లు" అని వాలఖిల్యాదులు రాజుకు చెప్పారు. ఇంద్రద్యుమ్నుడు భావితాత్ములైన వాలఖిల్యుల మాటలు విని సంతోషించాడు.

విశేషాలు

భావితాత్మ అనగా1.బ్రహ్మన్ని తెలుసుకొన్నవాడు.2. సన్యాసి.3. ధ్యానం వల్ల పవిత్రమైన ఆత్మ కలిగినవాడు.

హస్తామలకవన్మేనే కైవల్యపదముత్తమమ్ । తత్రోషితో ఋషిగణైస్తాం రాత్రిం రాజసత్తమః ॥ ౨౩

వారి మాటలు విని మోక్షము తనకు ఇకపై తనకు అరచేతిలో ఉసిరికాయగా సులభమని రాజు భావించాడు. ఆ రాత్రి ఆ వాలఖిల్య ఋషి పుంగవులతో రాజు కాలం గడిపాడు.

## ఇంద్రద్యుమ్నుడు ఘటికాద్రికి ప్రయాణమగుట

ప్రభాతాయాం తు శర్వర్యాం త్రైరాధిష్టపదేన వై । సహ స్త్రియా స రాజర్షిర్మధ్యేవర్త్మ నిరామయమ్ ॥౨౪

మరు నాటి ఉదయం వాలఖిల్య ఋషులు ఆదేశించిన ప్రకారంగా దోషములేనివాడు అయిన ఆ ఇంద్రద్యుమ్నుడు తన భార్యతో సహ నరసింహపర్వతానికి ప్రయాణము ప్రారం భించాడు.

మౌలిమాలాం భగవతస్త్రియంబకమహేశితుః । అవగాహ్య నదీం గఙ్గాం కృతమాలాం సుగన్ధినీమ్ ॥ ౨౫

ఇంద్రద్యుమ్న  రాజు, తన భార్యతో సహా, మహా ప్రభువు అయిన త్రయంబక భగవానుని (=చంద్రసూర్యాగ్నులు కన్నులుగా కలవాడు. శివుడు.) మహిమాన్వితమైన  మార్గంలో నడిచాడు. సువాసనగల పూల మాలలు  కలిగిన  గంగానదిలో స్నానము చేసాడు.

సభార్యస్సమతిక్రమ్య శ్రీశైలం పృష్ఠతోఽన్వగాత్| తతః పశ్చాద్గిరేశ్శృఙ్గమవతీర్య సహ స్త్రియా || ౨౬

అతను తన భార్యతో కలిసి శ్రీ శైల  పర్వతాన్ని దాటి దాని వెనుక మార్గాన్ని అనుసరించాడు . ఆ పర్వతమునుండి  పడమటి దిశగా కిందకి దిగి అహోబిలము చేరాడు.

జ్వాలానృసింహమానమ్య స్తువన్త్యం కృపయాన్వితమ్ | వినిర్గత్య తతశ్శైలాద్ధర్షోత్పుల్లతనూరుహః || ౨౭

అహోబిలములో దయామూర్తి అయిన   జ్వాలా నరసింహస్వామిని పొగిడి నమస్కరించాడు. ఆ అహోబిల సందర్శనము చే సంతోషించిన వాడయి, పులకిత శరీరము కలవాడయ్యాడు.

సమభ్యేత్య హి రాజర్షిస్స దదర్శ శుభఙ్కరమ్ | ఔన్నత్యాదధరీకృత్య భానుమత్రవిజృమ్భితమ్ ||౨౮

ఆ తరువాత ఆరాజర్షి ఆ అహోబిలాన్ని వీడి, శుభంకరమయిన శేషశైలమును దర్శించాడు.   ఆ శేషశైలము ఎత్తులో సూర్యుడిని  దాటిపోయి ఉన్నది.

అవతీర్ణమివాసన్తం స్థితవన్తం నగోత్తమమ్ | శ్రీమన్నారాయణపదద్వన్ద్వలాఞ్ఛితమస్తకమ్ ||౨౯

విస్తరించిన  ఉత్తమ పర్వతాల పవిత్రతను అధిగమించిన ఉత్తమ పర్వతమయిన శేషశైలమును ఇంద్రద్యుమ్నుడు దర్శించాడు. శ్రీ నారాయణుని పాదముల గుర్తులు కలిగి శేషుని వలె  ఆ  శేష శైలము ఉన్నది.

శేషశైలం తమభ్యేత్య విస్మయం పరమాప సః | తతస్తస్య మహీభర్తుర్మాహాత్మ్యామృతసాగరే | | ౩౦

శేషాచలం దగ్గరకు  వద్దకు వెళ్లినప్పుడు ఆ  ఇంద్రద్యుమ్న  రాజు  ఆశ్చర్యం కలిగినవాడయ్యాడు.  ఆశేషశైల పర్వతాన్ని చూస్తూ మహాత్ముడయిన ఆ రాజు   ఆనందమనే  అమృత సాగరంలో మునిగిపోయాడు.

మజ్జతో నాన్యథా దృష్టిరాసీదవ్యాకులా తథా తతో హర్షాశ్రుభరితశ్శేషశైలమవిన్దత ||౩౧

అతని కళ్ళు ఆ పర్వతాన్ని తప్ప వేరే వాటిని చూడటం లేదు.  అప్పుడు, ఆనందాశ్రువులు నిండిన కళ్లతో శేషశైల  పర్వతాన్ని కనుగొన్నాడు  .

అకరోదవగాహం చ కపిలే తీర్థసత్తమే| శనైరారుహ్య శైలేన్ద్రం స రాజేన్ద్రస్సహ స్త్రియా ||౩౨

ఆ రాజు కపిల తీర్థములో స్నానము చేసాడు. రాజు మరియు అతని భార్య నెమ్మదిగా ఆ పర్వతం ఎక్కారు .

పుష్కరిణ్యమ్బుసార్ద్రస్తు పుమాంసం పరమం భజన్ । ఈడ్యమానం మునివరైర్బ్రహ్మేశానేన్ద్రవన్దితమ్ ।।౩౩
నీటితో నిండిన సర్వోన్నతమైన  స్వామి పుష్కరిణిలో స్నానము చేసాడు. మునివరులచే, బ్రహ్మ, శివునిచే పొగడబడి  నమస్కరింపబడు  స్వామిని  ఆ రాజు  దర్శించాడు.

స్తుత్వా దినత్రయం తత్ర నీత్వా సద్భిః ప్రపూజితః। అవరుహ్య గిరేశ్శృఙ్గాదపశ్యద్దక్షిణాపథే । । ౩౪
అక్కడ స్వామిని పొగుడుతూ, పూజిస్తూ  ఇంద్రద్యుమ్నుడు  మూడు రోజులున్నాడు. ఆ తరువాత ఆ పర్వతం నుండి కిందకి దిగి  దక్షిణ మార్గములో నడిచాడు.

తాం సువర్ణముఖీం నామ సువర్ణముఖరీం నదీమ్ । గత్వా స్రోతస్వినీం భూతసేవ్యాముత్తరవాహినీమ్ ।।౩౫
తరువాత ఉత్తరముగా ప్రవహిస్తూ  జీవులచే సేవింపబడు సువర్ణముఖీ నది దగ్గరకు ఆ రాజు చేరాడు.

తత్రావగాహ్య శుద్ధాత్మా సన్ధ్యామన్వాస్య మధ్యమామ్ । తస్యాః ప్రాగుత్తరే తీరే వటమేకం దదర్శ హ ।। ౩౬
ఆ సువర్ణముఖి నదిలో సంధ్యా సమయములో రాజు స్నానము చేసాడు. ఆ  నదికి ఈశాన్య ఒడ్డున ఒక మర్రి చెట్టును చూసాడు.

శిలావివరసంభూతమూర్జితం పృథివీరుహమ్ । తస్యోపరి చిరాలమ్బిరక్షోయుగ్మమదృశ్యత ।।౩౭
ఆ మర్రిచెట్టు రాళ్ళ గుహలలో పెరుగుతూ  బలంగా ఉంది. ఆ వృక్షము పైన   కొమ్మలను పట్టుకొని   చాలా కాలమునుండి నివసించుచున్న ఇద్దరు రాక్షసులను ఇంద్రద్యుమ్న మహారాజు    చూసాడు.

పూర్వజన్మకృతః పాపైరేధమానం పరస్పరమ్ । సువ్రతానువ్రతాభిఖ్యం ద్వన్ద్వం విఖ్యాతపౌరుషమ్ ।।౩౮
పూర్వ జన్మములో చేసిన పాపము వలన వారు రాక్షసులుగా  వృద్ధి పొంది,  పౌరుషవంతులుగా ప్రఖ్యాతులైన ఆ ఇద్దరి రాక్షసుల పేర్లు వరుసగా సువ్రత అనువ్రతులు..

పశ్యతో రాజసింహస్య తస్మిన్నేవ క్షణే జహౌ । రాక్షసం రూపమత్యుగ్రం తయోరేకస్తపస్వినోః ।। ౩౯
ఆ మహారాజు చూస్తుండగానే  ఆ తపస్వులలో  ఒకతను అత్యుగ్రమైన రాక్షసరూపాన్ని వదిలాడు.

వైష్ణవం రూపమాస్థాయ పుప్లువే వియన్తరే। తతో దృష్ట్వా స రాజేన్ద్రస్సభార్యస్సపరిచ్ఛదః ।।౪౦
ఇంద్రద్యుమ్న మహారాజును చూసిన వెంటనే వారిలో ఒకనికి రాక్షసత్వము వదిలింది.  వైష్ణవ రూపము పొంది ఆకాశములోకి ఎగిరిపోయాడు. భార్యతో కూడిన ఆ మహారాజు ఆ దృశ్యాన్ని చూసాడు.

ఆః కిమేతదితి ప్రాహ వ్యాకులో భవతి స్మ హ। అథాన్తరిక్షే వాగుచ్చైరావిరాసీన్మహర్షయః | | ౪౧
ఆ .. ఇదేమిటి అని ఆశ్చర్యపడుచున్న రాజునకు ఆకాశమునుండి ఒక వాక్కు  ఇలా వినిపించింది.

కయమస్య నృసింహస్య వైభవః కేన వర్ణ్యతే । యదస్య పుష్కరిణ్యమ్బుఃకణసంగేన రక్షసోః ||౪౨
"శ్రీ నరసింహస్వామి వైభవము ఏమని, ఎంతని  వర్ణింప గలము ? ఆ స్వామి పుష్కరిణిలోని నీటిబిందువు  శరీరానికి తగులుట చేత ఆ ఇద్దరు రాక్షసులలో ఒకనికి రాక్షస రూపము పోయినది.

అనయోరేకమున్ముక్తం కా కథా గుణవర్ణనే । ఇతి వాచముపాశృణ్వన్నాశ్చర్యాకులచేతనః ||౪౩
ఇక నృసింహస్వామి గుణ వర్ణనమునకు ఫలము ఇది అని ఏమని చెప్పగలము? ( అనగా నరసింహ స్వామి గుణములను వర్ణిస్తే అనేక ఫలితాలు కలుగుతాయని భావం) ?" ఈ మాటలు వినిరాజు భార్యతో సహ ఇంకా ఆశ్చర్య పడ్డాడు.

పార్శ్వే స దృష్టవాన్ దివ్యకన్యకాః అన్యమానసాః ।
ఇన్ద్రద్యుమ్నః
కన్యాః కథయత ప్రేమ్ణా కిమేతదనయోః పరమ్ ||౪౪
తనకు కొంత దూరములో  దేవకన్యలను రాజు చూసాడు.
రాజు ఆదేవ కన్యలను ఇలా ప్రశ్నించాడు.  "ఓ కన్యలారా! ప్రేమతో దయతో  చెప్పండి.  రాక్షసు లిద్దరిలో ఒకడు విముక్తుడయ్యాడు.

జాతమేకం పరం కస్మాదేనసో భవనం కృతమ్ ।
కస్య వా నలినీతోయరాశేశ్శీకరవైభవమ్ ||౪౫
వారిలో ఒకనికే విముక్తి కలిగినది. రెండవవానికి విముక్తి  ఎందుకు కలుగలేదు. స్వామి పుష్కరిణిలో ఉన్న నీటి బిందువునకు ఉన్న గొప్పతనమేమిటి?

## సువ్రత , అనువ్రతుల కథ

కస్మాద్బిన్దుస్సమపతత్ త్వత్తశ్ర్శోతుం సముత్సహే ।
దివ్యకన్యకాః
అస్తి కశ్చిద్విజశ్రేష్ఠస్తీర్థాచలసమీపతః | | ౪౬
"పుష్కరిణిలో ఉన్న  నీటి బిందువు ఎందువలన అతనిపై  పడినది.? వినుటకు ఉత్సాహముగా ఉన్నది.తెలియచేయుడు" అని రాజు అడుగగా దేవకన్యలు ఇలా జవాబు చెప్పారు.ఇక్కడికి తీర్థాచల సమీపములో ఒక బ్రాహ్మణోత్తముడు నివసించేవాడు.

నామ్నా సోమవ్రతో భార్యామనసూయాముపేత్య సః ।
పుష్కరం సౌమ్యమాసాద్య తపస్తేపే సుదారుణమ్ ||౪౭
అతని పేరు సోమవ్రతుడు. భార్య పేరు  అనసూయ.అతడు పుత్రుల కొరకు స్వామి పుష్కరిణి వద్ద దారుణమైన తపస్సును చేసాడు.

పుత్రార్థీ వైష్ణవీం భక్తిమాస్థాయ ద్విజసత్తమః ।
కాలే కతిపయే జాతే సుతద్వయమవిన్దత ||౪౮
 పుత్రుల కొరకు తీవ్రమైన భక్తి కలిగి తపస్సు చేస్తున్న  విష్ణుభక్తి కలిగిన ఆ ఉత్తములైన బ్రాహ్మణ దంపతులకు కొంతకాలమునకు   ఇద్దరుకొడుకులు పుట్టారు.

జనిక్షణేన తౌ రక్షోరూపౌ ప్రాభవతాం విభో ।
ఇన్ద్రద్యుమ్నః -
జనుషి బ్రాహ్మణస్యాభూద్రక్షోరూప కథం తయోః || ౪౯
 "ఓ రాజా !  పుట్టిన వెంటనే  వారు రాక్షస రూపము పొందారు." అని దేవకన్యలు చెప్పగా "బ్రాహ్మణ జన్మను పొందిన వారికి రాక్షస రూపము ఎందుకు కలిగింది?" అని రాజు వెంటనే  ప్రశ్నించాడు.
కేన పాపేన మహతా విస్తరాన్మే ప్రశంసత ।
దివ్యకన్యకాః
పురాస్య దణ్డకోద్దేశే బ్రాహ్మణస్య పితాఽభవత్ ||౫౦
ఏపాపము వలన వారికి రాక్షస రూపము కలిగిందో చెప్పండి?" అని రాజు అడుగగా  దేవకన్యలు ఇలా  బదులు చెప్పారు. పూర్వము దండకారణ్యములో సోమవ్రతుని తండ్రి    నివసించేవాడు.

సుతపా ఇతి తస్యాఖ్యాం దదుః పూర్వం సురోత్తమాః సర్షిసఙ్ఘనిషేవ్యస్తు విచచార తపః పరమ్ ||౫౨
అతని తపస్సుని మెచ్చుకున్న దేవతా శ్రేష్ఠులు అతనికి సుతపుడు అని పేరు పెట్టారు.  అనేకమంది ఋషులచే సేవించబడిన అతడు పరమ తపస్సు చేసేవాడు.

 అపూర్వేయమితి వ్యాఖ్యామథాసహ ఇవాతురః । వైరాగ్యవశగో రూపం భిక్షువత్సమపద్యత ||౫౩
అతడు చేసే తపస్సు అపూర్వమని అందరూ ప్రశంసిస్తుండగా  సుతపుడు  విరాగిగా భిక్షువులా  జీవితము గడిపేవాడు. .

తస్య శుశ్రూషతే భార్యా భిక్షాం చైవ ప్రయచ్ఛతి। అఙ్గావమర్దనం నిత్యం కరోతి సహ యాతి చ । ౫౪

సుతపునికి  సేవ చేస్తూ   భార్యభిక్షను పెట్టేది. అంగమర్దనము మొదలయిన సేవలు చేస్తూ  అతని వెంట  భార్య తిరుగుతుండేది..

స తాదృగ్రూపవాంశ్చాపి భర్తాఽయం కామమోహితః । ప్రాతరుత్థాయ సన్ధ్యాయాం భార్యాసక్తిముపేత్య వై। ౫౫
అయితే విధి వశాత్తు ఆ రూపవతియైన భార్యపై అతడు కామమోహితుడయ్యాడు. ఒకనాటి   ప్రాతస్సంధ్యలో  భార్యాసక్తి కలిగిన వాడయ్యాడు. అతడు  పతితుడయ్యాడు.

క్షణాదారూఢపతితో భిక్షుకర్మబహిష్కృతః । దినాత్ కతిపయాదూర్ధ్వం కేనాపి విధినా ద్విజః । । ౫౬
 కామము కలిగిన క్షణములో సన్యాసి విధుల నుండి అతడు   బహిష్కృతుడయ్యాడు. పొద్దున్నే లేచి  ఉదయ సంధ్యలో భార్యతో అనుబంధం పెంచుకున్నాడు కనుక  వెంటనే అతను  ఉత్తమ ఆచార మార్గములో   పై నుండి  కింద పడిపోయాడు.( అనగా భ్రష్టుడయ్యాడని భావం)

త్యక్త్వా సన్యాసరూపం తద్వైష్ణవం పదమేయివాన్ । సా చ భార్యా వరారోహా ప్రాసూత సుతముజ్జ్వలమ్ ।।౫౭
కొన్ని రోజుల  తరువాత సన్యాస రూపమును వదలి సుతపుడు  వైష్ణవ పదమును పొందాడు. వరారోహ అయిన (ప్రశస్తమైన జఘనము గలది ) అతని భార్య ఉజ్జ్వలుడైన (వేడుకకాడు) అయిన  ఒక  కుమారుని కన్నది. అతనిపేరు సోమవ్రతుడు.

స తు కాలేన మహతా గృహమేధ్యనసూయయా । తపస్వీ నియతాహారస్సస్త్రీకో గహనం గతః ।।౫౮
తరువాత కొంత కాలానికి గృహమేధి అయిన ( వివాహితుడై భార్యతో చేరియుండువాడు.)  ఆ సోమవ్రతుడు  భార్య అనసూయతో  కలిసి తపస్వియై ఆహారనియమములు పాటిస్తూ  అడవిని చేరుకొన్నాడు.

 ధేనుశైలస్య ప్రాగ్భాగే తపోనిష్ఠః ప్రియానుగః । స కదాచిచ్ఛిలాపృష్ఠే రక్షోమిథునమైక్షత ।। ౫౯
ధేను పర్వతమునకు  తూర్పు భాగములో  భార్యతో కలిసి సోమవ్రతుడు  తపస్సుపై ఆ సక్తి కలిగినవాడయ్యాడు.  ఒకసారి ఆ కొండ శిలపై సుఖాలను అనుభవించు  ఒక  రాక్షస జంటను అతడు చూసాడు.

 తత్క్షణాదేవ సప్తాశ్వ రవిం దృష్ట్వా స భార్యయా । సుఖమావాసయాఞ్చక్రే పర్వతే తాదృశే శుభే ।।౬౦
ఒకసారి భార్యపై కోరిక కలిగిన క్షణంలోనే ఏడు గుర్రములను అధిరోహించిన సూర్యుని చూస్తూ ఆ పర్వత శిఖరములో భార్యతో ఆ సోమవ్రతుడు సుఖించాడు.

విశేషాలు

 ఏడు గుర్రాల పేర్లు1. గాయత్రి 2. బృహతి3. ఉష్ణిక్ 4. జగతి5. త్రిష్టుప్ 6. అనుష్టుప్ 7. పం క్తి

సా యదాస్య వరారోహా సంభోగమభికాఙ్క్షతి । తదా తదా తయా సార్ధం రాక్షసం భావమిచ్ఛతి ।।౬౧

తన భార్య తనతో సుఖాన్ని కోరుకున్నప్పుడల్లా ఆమెతో కలిసి, కలిసిన ప్రతిసారి కూడా సోమవ్రతుడు రాక్షస భావాన్ని పొందుతుండేవాడు.

తద్రూపం ధ్యాయతస్తస్య సుతే రూపం తదావిశత్ । పితామహస్య యత్ర్పాతస్సన్ధ్యాయాం తామసోత్కరమ్ ।।౬౨

సంభోగములో రాక్షస రూపాలను తలచుకోవడం వల్ల వారికి పుట్టిన సంతానం కూడా రాక్షసరూపాన్ని పొందింది. పితామహుడైన సుతపుడు ( సోమవ్రతుని తండ్రి) భార్యపై ఆశతో తమోగుణము ప్రధానంగా కలిగినవాడయి భ్రష్టుడయ్యాడు. ఆ లక్షణములు కూడా కలిసి సోమవ్రతునికి పాపాత్ములైన ఇద్దరు రాక్షసులు కుమారులుగా పుట్టారు.

గుణోవతీర్ణస్తజ్జాతస్సుతయోః పాపశాలినోః । జన్మమాత్రేణ పితరం ముక్త్వా సత్వావమర్దినీ ।। ౬౩

గుణముల చేత దాటబడినవారు అనగా గుణరహితులైన ఆ కుమారులు పాప ప్రవర్తన కలిగిన వారయ్యారు. తండ్రిని పుట్టిన వెంటనే విడిచిపెట్టారు.

రాక్షసౌ బలినౌ దృష్ట్వావుపాసాతే శిలావటమ్ । జన్మాన్తరార్జితేనైష పుణ్యేన మహతా విభో ।।౬౪

ఓ ఇంద్రద్యుమ్న రాజా! ఆ రాక్షసులు శిలల్లో పుట్టిన మట్టి చెట్టును ఆశ్రయించారు. అయితే పూర్వ జన్మలో వారు చేసుకున్న పుణ్యము వలన ఒక గొప్పతనం వారికి జరిగినది.

విశృష్టరుశికః పాపాదూర్వశీశీకరాత్ పురా । అథావహిత ఏవాసౌ సదారస్సాదరో నృపః ।।౬౫

శిలా పుష్కరిణిలో స్నానము చేసిన ఊర్వశి అను అప్సరస యొక్క వెంట్రుకల నుండి రాలిన నీటి బిందువు తగులుటచేత ఈ రాక్షసుల్లో ఒకడు తన రాక్షసత్వాన్ని పోగొట్టుకున్నాడు

హృష్టచేతా ఇదం వాక్యం కన్యకాస్తా జగాద సః ।

ఇన్ద్రద్యుమ్నః

ఆవాదీదేతయోరేకో వైష్ణవం రూపమాస్థితః ।। ౬౬

దేవకన్యలు చెప్పిన విషయాన్ని సంతోషించిన మనస్సు కలవాడైన ఇంద్రద్యుమ్న మహారాజు ఏ పూర్వజన్మ పుణ్యము చేత ఆ ఇద్దరు రాక్షసుల్లో ఒకరికి మాత్రమే వైష్ణవత్వము కలిగినది? అని వారిని అడిగాడు.

కేన పుణ్యేన కస్మాద్వై పరః పాపమవాప్తవాన్ । ఇదన్నో వాఞ్ఛితం కన్యా వదతాలస్యవర్జితాః । ౬౭

అలాగే ఏ పాపము చేత రెండవ రాక్షసుడు ఇంకా రాక్షసత్వాన్ని అనుభవిస్తున్నాడు ?దయచేసి ఆలస్యం చేయక విషయాన్ని చెప్పండి అని ఇంద్రద్యుమ్న మహారాజు దేవకన్యలను అడిగాడు.

దైవాద్దృష్టిపథం యాతా భవత్యః కార్యవిత్తమాః ।
దివ్యకన్యకాః-
రాజన్ కిరాతప్రవరౌ యువానౌ నయకోవిదౌ ||౬౮

దైవము యొక్క దృష్టి మార్గాన్ని తెలుసుకునే కార్యము తెలిసినవారు మీరు. ( దైవజ్ఞులు మీరు అని భావం) అని మహారాజు అనగా దివ్య కన్యకలు ఈ విధంగా అన్నారు. ఓ మహారాజా ! ఆ రాక్షసుల యొక్క పూర్వజన్మ వృత్తాంతం చెబుతాం వినండి. పూర్వము యవ్వనవంతులు, నీతి కోవిదులయిన ఇద్దరు వేటగాళ్లు ఉండేవారు.

పారియాత్రగిరౌ వాసం చక్రాతే మృగఘాతినౌ । కేనచిత్ త్వథకాలేన చరన్తౌ మృగయాం బనే || ౬౯

పారియాత్రము అనే ఒక కొండ ప్రాంతంలో జంతువులను వేటాడే ఇద్దరు వేటగాళ్లు నివసిస్తూ ఉండేవారు. మృగములను వేటాడుతూ అడవిలో తిరుగుతూ ఉండేవారు.

కఞ్చిత్తపోధనం సౌమ్యం సన్న్యాసినమపశ్యతామ్ । పర్ణశాలాదికాన్ సర్వాన్ రచయన్తౌ వనాద్వనమ్ ||౭౦

అలా వేటకి తిరుగుతున్న సమయంలో తపస్సే ధనముగా కలిగిన సౌమ్యుడయిన ఒక సన్యాసిని వారు చూసారు. అతడు ఏ అడవిలో తపస్సు చేస్తే ఆ అడవిలో అతనికి పర్ణశాలలు ఈ వేటగాళ్లు నిర్మించి ఇచ్చేవారు.

కుర్వతి తస్య శుశ్రూషాం కైరాతం రూపమాస్థితౌ । తతస్తౌ తాపసవరమూచతుర్మధురాం గిరమ్ ||౭౧

ఈ విధంగా తనకు సేవ చేయుచున్న ఆ వేటగాళ్ల యందు ఆ సన్యాసి దయ కలిగిన వాడయ్యాడు . ఆ వేటగాళ్లు ఆ సన్యాసితో మధురమైన వాక్కులతో మాట్లాడుతుండేవారు.

ఉపాసినముపస్థాయ హృదిస్థం కేశవం విభుమ్ । కిరాతావపి తత్స్నేహసంభాషణదయాదికమ్ ||౭౨

వారి మాటలను విని అభిమానిస్తూ ఆరాధకుడయిన ఆసన్యాసి తన హృదయంలో ఉన్న పరమేశ్వరుడైన కేశవుడిని తలుచుకొనేవాడు. . వేటగాళ్లు కూడా ముని ప్రవర్తనను అనుసరిస్తూ ఆ సన్యాసి పట్ల ఆప్యాయత, కరుణతో కూడిన సంభాషణ చేస్తుండేవారు.

అవేత్య గతిమిచ్ఛన్తౌ స్వయోగ్యం పర్యపృచ్ఛతామ్ ।
కిరాతీ - (సువ్రతోఽనువ్రతౌ)
స్వామిన్ శుశ్రూషమాణానాం భవన్తం ప్రయతాత్మనామ్ ||౭౩

తమకు ఏమి కావాలనుకొంటున్నారో చెప్పమని ఇంద్రియాలను జయించిన పరిశుద్ధుడయిన ఆ సన్యాసి ఒకసారి అడిగినప్పుడు ఆ కిరాతులు( సువ్రత, అనువ్రతులు) ఆయన పట్ల సేవా భావం కలవారయి ఆయనను ఇలా అడిగారు. .

అస్మాకం కేన విధినా ద్విజభావో మహామతే | ఆగమిష్యతి విశ్వజ్ఞ వద మన్త్రోపదేశతః | ౨౪
స్వామీ !  మీరు అన్నీ తెలిసినవారు. ఏ నియమం ఆచరిస్తే ఏ మంత్రాన్ని బాగా చదివితే మాకు బ్రాహ్మణత్వం(సద్గతి) వస్తుంది? తెలియజేయవలసినదిగా మనవి

మస్కరి( సన్యాసి)
కిరాతవంశీ తౌ జ్ఞాత్వా దుర్మదీ దురుదాహృతౌ | మన్త్రం కమపి సంయోజ్య వ్యాజహార మహామతిః | |౨౫
ఆ సన్యాసి తనని ప్రశ్నిస్తున్న వారు దుర్మదము కలిగిన కిరాత వంశంలో పుట్టిన వారని తెలుసుకొని ఒక మంత్రాన్ని కల్పించి వారికి ఉపదేశించాడు.

సర్వదా మృగ ఏవాహమిత్యముం మన్త్రముత్తమమ్ | జపన్తౌ ప్రత్యహం లుబ్ధౌ నాన్యథాకృతనిశ్చయౌ ||౨౬
సర్వదా "మృగ ఏవాహమ్" ( ఎప్పుడూ నేను మృగాన్ని ) అను ఈ మంత్రము చాలా ఉత్తమమైనది. ఈ మంత్రమును ప్రతిరోజు వేరే ఆలోచన లేకుండా జపించండి  .

దివ్యకన్యకా:-
ఇత్యుక్త్వాన్తర్దధే భిక్షుర్వనాత్తస్మాదతన్ద్రితః | తత్రత్యా దేవతాస్సర్వే సాధు సాధ్వబ్రువన్ వచః | ||౨౭
అని చెప్పి ఆ సన్యాసి తక్షణమే అడవి నుంచి వెళ్ళిపోయాడు. ఇది విన్న అక్కడి దేవతలందరూ కూడా "బాగుంది బాగుంది" అని మాటలు పలికారు

అదృశ్యన్త కిరాతౌ తౌ విజ్ఞాయ విధివత్తథా | మన్త్రం తమేవ నియతం జగద్ రహసి స్థితౌ ||౨౮
ఒక రహస్య స్థలములో ఆ కిరాతులిద్దరూ సన్యాసి చెప్పిన మంత్రాన్ని విధి పూర్వకముగా జపించారు.

కస్యచిత్త్వథ కాలస్య ప్రాసూయేతాం మృగీం తనూమ్ | ఆః కిమేతదితి వ్యగ్రా వనస్థా అపి దేవతా: || ౨౯
ఆ మంత్ర జపం చేసిన కొంతకాలానికి వారు మృగ(హరిణ)  రూపాలని పొందారు. అది చూసి వనదేవతలందరూ కూడా "ఆ !ఇదేమిటి" అని వ్యగ్రులయ్యారు.(కలవరపడ్డారు)

మిథో నభోగతా దేవా అపి విస్మయమన్వయుః కదాచిల్లుబ్ధకశ్రేష్ఠౌ జ్యేష్ఠౌ సర్వతపస్వినామ్ ||౩౦
ఆకాశంలో ఉన్న దేవతలు కూడా వారిని చూసి "ఒకప్పుడు ఇద్దరూ ఉత్తమ వేటగాళ్ళు, ఇప్పుడు సన్యాసులందరిలోను పెద్దవారు అయ్యారు" అనుకొంటూ  ఆశ్చర్యపోయారు.

స్వోపదేష్టా యతో యోగీ తముద్దేశముపాశ్రితౌ । యదృచ్ఛయా పర్యటన్తౌ తౌ దృష్ట్వా తపసాం నిధిః ॥౮౧

మృగ రూపంలో ఉన్న ఆ కిరాతు లిద్దరూ కూడా తమకు మంత్రమును ఉపదేశించిన సన్యాసిని వెతుక్కుంటూ అడవిలో తిరుగుతూ ఉండగా తపస్సుకునిధి అయిన  ఆ సన్యాసి వారికి కనిపించాడు.

దయాలురన్వమంస్తాసీ శిష్యావేతావితి స్వయమ్ । ఆగచ్ఛన్తం మహాభాగావిత్యామన్త్ర్య స యోగిరాట్॥ ౮౨

కరుణామూర్తి అయిన ఆ సన్యాసి వారిద్దరిని తన శిష్యులుగా గుర్తించి ఇలా దగ్గరకు రండి అని ఆత్మీయంగా పిలిచాడు

పస్పృశ్య పాణినా దేహం పవిత్రోదకశాలినా । ద్వాదశాక్షరమన్త్రఞ్చ మృగయూనోస్తయోరసౌ ॥ ఉపాదిశద్ధర్మపరీ మస్కరి కృపయాన్వితః ।౮౩

పవిత్రమైనటువంటి నీటితో వారి శరీరాలను తాకి మృగ రూపములో ఉన్న వారిద్దరికీ విష్ణుమూర్తి యొక్క ద్వాదశాక్షరి మంత్రాన్ని దయతో ఉపదేశించాడు.( 1. ఓమ్, 2. న, 3. మో, 4. భ, 5. గ, 6. వ, 7. తే, 8. వా, 9. సు, 10. దే, 11. వా, 12. య ఈ పండ్రెండక్షరముల మంత్రము ద్వాదశాక్షరి).

మస్కరి(సన్యాసి)

సువ్రతానువ్రతౌ లుబ్ధౌ బ్రాహ్మణ్యమవలమ్బితే । ద్వాదశాక్షరయోగేన భవన్తావాగమిష్యతః ॥౮౪

సువ్రతానువ్రతులారా !  మీరు ద్వాదశాక్షరీ మంత్ర యోగమున బ్రాహ్మణత్వము(సద్గతి) పొందగలరు.'' అని సన్యాసి చెప్పాడు.

దివ్యకన్యకాః-

నిశామ్య స్వోపదేష్టారం నిశమ్య వచనం తథా । ఊచతుర్లుబ్ధకశ్రేష్ఠౌ హర్షావిష్టహృదన్తరౌ ॥౮౫

ఆ గురువుగారి  మాటలకు హృదయ పూర్వకముగా సంతోషించిన   కిరాతులు ఈ విధంగా  ప్రశ్నించారు ''

కిరాతీ - (సువ్రతోఽనువ్రతౌ)

స్వామిన్ కస్య పదం ప్రాప్య కర్తవ్యో జప ఉత్తమః। యథా బ్రాహ్మణ్యమస్మాసు జాయతే తన్నివేదయ ॥౮౬

ఏప్రదేశము చేరి,  ఈ మంత్రమును జపిస్తే  మాకు బ్రాహ్మణ్యము(సద్గతి) సిద్ధిస్తుందో తెలియ చేయవలసినది?'' అని కిరాతులు అడిగారు.

మస్కరి

ఇతో హి దృశ్యతే శైలనృసింహాధివాసితః । హనూమతస్తీర్థవరస్తత్రాప్యాస్తే విరాజతే ।౮౭

సన్యాసి ఈ విధంగా అన్నాడు. '' ఇదుగో శ్రీ నృసింహస్వామికి నివాసమైన పర్వతము ఇక్కడ కనుపిస్తున్నది.

. ప్రక్కన లోయలో హనుమంతుని తీర్థమున్నది.

శీఘ్రం గచ్ఛ తమేతద్ధి రోచతే మమ చేతసే । ఏతస్మిన్నేవ తే దేవాస్సేన్ద్రాస్సాగ్నిపురోగమాః ॥౮౮
అక్కడకు శీఘ్రముగావెళ్ళండి. ఆ స్థలం  నాకు చాల ఇష్టమైనది. ఇంద్రుడు, అగ్నిదేవుడు, ఇతర దేవతలు(తరువాత శ్లోకంతో అన్వయం)
 అయనే విషువే చైవ గ్రహణే చన్ద్రసూర్యయోః । స్నానం కుర్వన్తి నియతం నృసింహం పర్యుపాసతే ॥౮౯
అయనములలో , సంక్రాంతి యందు, సూర్యచంద్ర గ్రహణములయందు ఆ తీర్థములో స్నానము చేసి శ్రీనరసింహ స్వామిని సేవిస్తారు.

భానోరుదయతః పూర్వ యస్స్నానం నియతేన్ద్రియః । కరోతి స విధూతైనా వాఞ్ఛితం లభతే పుమాన్ ।। ౯౦
సూర్యోదయమునకు పూర్వమే  స్నానము చేసి ఇంద్రియములను స్వాధీనము చేసుకొన్న  పురుషునకు పాపములునశించి కోర్కెలు నెరవేరుతాయి.

యువామపి నిరాహారౌ సర్వస్మిన్ ప్రియశంసినీ । ఉదాసీనపరౌ తత్ర కురుతం తప ఉత్తమమ్ ॥౯౧
మీరిద్దరు ఏమి ఆహారము తీసుకోకుండా, అందరిపై  ప్రేమ కలిగి, ఇతరములపై ఆశలేక, ఉత్తమమైన తపస్సును చేయండి.

 కేనచిత్ త్వథకాలేన బ్రాహ్మణ్యముపలభ్య వై । భవన్తౌ పరమప్రీతావైష్యతో వైష్ణవం పదమ్ ॥౯౨
కొంతకాలమునకు మీకుబ్రాహ్మణ్యము(సద్గతి) లభిస్తుంది. మీరు విష్ణుపదమును పొందగలరు''.

దివ్యకన్యకాః-
ఇత్యాకర్ణ్య వచస్తస్య తావుభౌ మృగరూపిణీ । మహామతిం నమస్కృత్య మనురాజపరౌ తదా ॥ ౯౩
మృగరూపములలో ఉన్న ఆ  సువ్రతానువ్రతులు ఇలా చెప్పిన ఆ సన్యాసికి నమస్కరించారు.

ప్రదక్షణీకృత్య గిరిం ఘటికోపపదం పరమ్ । నరసింహస్య ఋషిభిః పూజితం పుణ్యకర్మభిః । ౯౪
తరువాత  కిరాతులు మహర్షులచే పూజింపబడి పుణ్యకార్యాలను నిర్వహించిన ప్రదేశమయిన ఘటికాచలమునకు ప్రదక్షిణము చేసారు.  పర్వతం చుట్టూ ప్రదక్షిణలు చేసిన తరువాత, వారు గిరి శీర్షానికి చేరుకొన్నారు.

ఆసాద్య హనుమత్తీర్థం తత్ర్పాక్సానువిరాజితమ్ । అవగాహ్య క్షణాత్తత్ర జహతుర్వ్వారిణం వపుః ॥౯౫
ఆ కొండ ప్రక్కలో నున్న హనుమత్తీర్థములో  స్నానము చేసి  క్షణములో వారు మృగరూపమును వదిలారు.

మజ్జనోత్తరకాలే తు ఆసీదేతాం నిజం వపుః । తథా సంభ్రాన్తమనసా వ్యాతిష్ఠేతాం మనూత్తమమ్ ॥౯౬
స్నానం తరువాత, వారు పూర్వపు  శరీరాలను పొందారు. అప్పుడు వారు చాలా ఆశ్చర్యపడ్డారు.

సువ్రతానువ్రతీ లుబ్ధౌ హనుమన్నికటే స్థితౌ । శతకృత్వోం జపన్తౌ తౌ మన్త్రరాజం మహామతే ॥ ౯౭
గురువు చెప్పిన విధంగా  ఆ కిరాతులు నృసింహ మంత్ర రాజాన్ని  హనుమంతుని వద్ద 100 పర్యాయములు జపించారు.

ఆజ్ఞయా స్వగురోరేవ వన్ద్య వాయుసుతం తథా । ప్రస్థితౌ పర్ణశాలాయాః కరణేஉవ్యగ్రమానసౌ ॥౯౮
గురువు ఆజ్ఞతో ఆంజనేయునకు నమస్కరించారు.   పర్ణశాల నిర్మించటానికి కలవరపాటు లేకుండా బయలుదేరారు.

ఉత్తరం శృఙ్గమాసాద్య భైరవస్య సమీపతః । తదుద్దేశే పర్ణకుటిం తన్వాతే తౌ పృథక్ పృథక్ ॥౯౯
నరసింహ పర్వతపు ఉత్తర శృంగము ఎక్కి భైరవముని  సమీపమున తమకు పర్ణశాలను నిర్మించాలనుకొన్నారు.

సిద్ధ్యర్థం తదనువ్యగ్రౌ మస్కరాహరణాయ వై। శిలాపుష్కరిణీతీరే వేణుకుఞ్జమపశ్యతామ్ । ౧౦౦
ఆ పర్ణశాల కోసం  వెదురుబొంగులకు అన్వేషించారు. శిలా పుష్కరిణీ తీరమున వెదుళ్ళ గుంపును చూసారు. ,

మస్కరాణాం శతం ఛేత్తుమారభేతాముపావృతౌ । వేణువిచ్ఛేదనోద్యుక్తౌ తౌ దృష్ట్వా ఋషిసత్తమః । । ౧౦౧
అక్కడ నూరు వెదుళ్ళను ఛేదించారు. ఆ వెదుళ్ళను నరికే సమయంలో వారు  ఒక ఋషి పుంగవుని చూసారు.

శిలానలిన్యా వారుణ్యాం దిశి ద్రావిడపోతకః । చుకోప తాపసశ్రేష్ఠస్తపస్వీ విప్రశేఖరః । । ౧౦౨
ఆ శిలా పుష్కరిణీ ప్రదేశంలో సంస్కృత ద్రావిడ భాషలు తెలిసిన  విప్రశేఖరుడు అనే ఒక  ముని ఉన్నాడు. అతనిని కిరాతులు చూసారు.   మిక్కిలి పవిత్రమైన ఆ ప్రదేశంలో చాలా కాలంగా పెరిగిన  వెదుళ్ళను జాలి లేకుండా నరికిన  ఆ వేటగాళ్ళ పనికి ఆ ముని చాలా కోపించాడు.

శశాప చ జలం గృహ్య కమణ్డలుముఖాచ్యుతమ్ ।
విప్రశేఖరః
చిరాయ వర్ధితా వంశా ఉభాభ్యాం దారితా యతః । । ౧౦౩
ఆ సోదరులపై కోపించి కమండలములోని నీరును తీసుకొని  వారిని ఇలా శపించాడు.  . “చాల కాలమునుండి నేను పెంచుకొన్న  వెదుళ్ళను  మీరు నరికారు.

తస్మాత్ సోమవ్రతాజ్జాతౌ భజతం రాక్షసం వపుః ।

దివ్యకన్యకాః-

ఇతి శాపం వితన్వానే విప్రశేఖర ఉజ్వలే ।

తయోరేకస్సమాగత్య జగృహే తత్పదద్వయమ్ ||౧౦౫

. కనుక  సోమవ్రతునకు జన్మించి మీరు  రాక్షస దేహములను పొందండి. విప్ర శేఖరుని శాపము వినగానే సువ్రతుడు ముని పాదములను  పట్టుకొని వేడుకొన్నాడు.

సువ్రతః

బ్రహ్మంస్త్వయా శాపితోఽహం కదాస్యాం శాపమోచితః ।

దయాం విధేహి భద్రం తే మయి సర్వాత్మనా భవాన్ ।।౧౦౬

"స్వామీ! నాపై దయ చూపించండి. నాకు శాప విమోచనము ఎలా జరుగుతుందో అనుగ్రహించండి"అని వేడుకొన్నాడు.

విప్రశేఖరః -

కేనాపి పుణ్యభాగేన భవన్తౌ మృగఘాతినౌ । హనుమత్సరసి స్నానం భేజాతే తీర్థసత్తమే ।౧౦౭

అప్పుడు విప్రశేఖరుడు ఇలా  శాప విమోచన కాలమును చెప్పాడు. "పూర్వపుణ్యము వలనమృగములను చంపే స్వభావము కలిగిన  మీరు తీర్థరాజమైన హనుమత్ తీర్థంలో  స్నానము చేసారు.

అతో యువాం సన్నధియౌ ప్రసన్నే సలిలాశయే । స్నానతశ్శుద్ధమనసౌ సంప్రాప్తావీదృశం పదమ్ ।।౧౦౮

బుద్ధిహీనులైన మీరు ఆ సరస్సులో  స్నానము చేయుట వలన శుద్ధమైన మనస్సుగలవారై ఇట్టి స్థితిని  సాధించారు.

తత్రాపి త్వం మహాజ్ఞానశాలీ సర్వప్రియంకరః । కృతే యుగే తవాగామిన్యాహరిష్యతి మోచనమ్ ।।౧౦౯

మీ ఇద్దరిలో నీవు మహాజ్ఞానశాలివి. ఇతరులకుప్రియము కలిగించు వాడవు. ఇక ముందు రానున్న కృతయుగములో  నీకు శాపవిమోచనము కలుగుతుంది.

ఫాల్గునస్యాన్తిమేం కాలే స్నాతుమప్సరసాం గణః । అభ్యేష్యతి సరస్తీరమూర్వశీ చాగమిష్యతి ।।౧౧౦

ఫాల్గుణ మాసము చివరలో  ఆ సరస్సులో  అప్సరసలు స్నానము చేయటానికి వస్తారు. . ఊర్వశికూడ వస్తుంది.

తత్ర స్నాతోర్వశీ కేశాదాశ్యానసమయే చ్యుతః । శీకరశ్శీర్షభాగే తే మధ్యేమార్గ పతిష్యతి ।।౧౧౧

అచ్చట స్నానము చేసి వెళుతున్న  ఊర్వశి వెంట్రుకల నుండి నీటిబొట్టు మార్గమధ్యములో ఉన్న నీతలపై పడుతుంది.

తదా మోచనకాలస్తే గర్భితాయాస్తనోరపి । విముక్తో వైష్ణవం రూపమాసాద్య భువి సువ్రత || ౧౧౨

ఓ సువ్రతా ! అది నీకు శాప విమోచన కాలము. అప్పుడు అసహ్యకరమైన ఈ దేహమును వదలి  వైష్ణవ రూపమును పొందుతావు

పదమేష్యసి పశ్చాత్ త్వం పదమచ్యుతమవ్యయమ్ ।
ఇన్ద్రద్యుమ్నః -
కిమర్థమితరస్యాపి మోచనం నానుపృచ్ఛతే ।।౧౧౩
తరువాత  అవ్యయమైన  విష్ణు పదమును పొందగలవు'' అని ముని అన్నాడని  దివ్యకన్యకలు చెప్పగా, అంతట రాజు దేవకన్యలతో తన సందేహాన్ని చెప్పాడు. . ''తనస్నేహితుడైన అనువ్రతుని శాపవిమోచనము సువ్రతుడు  ఎందుకు ప్రశ్నింప లేదు?''

సహాయోఽపి సమానోఽపి సువ్రతోఽనువ్రతస్య వై ।
దివ్యకన్యకాః-
అనువ్రతస్య ముక్త్యర్థముపాయం ప్రష్టుచేతసి । ।౧౧౪
తన సహాయుడు, సమానుడయిన  అనువ్రతుని ప్రస్తావన ఎందుకు సువ్రతుడు తీసుకురాలేదు?  అని రాజు అడుగగా ఆ దేవకన్యలు ఇలా చెప్పారు.  ''అను వ్రతుని ముక్తి కొరకు కూడా సువ్రతుడు ఉపాయమును అడగాలనుకొన్నాడు.
తథోక్త్వాన్తర్దధే విప్రస్తత్రైవ సరసీతటే । అథ సోమవ్రతస్యాస్య పుత్రౌ జాతౌ పురావిదౌ । ।౧౧౫
కాని సువ్రతుడు అడిగే లోపుగానే  విప్రశేఖరుడు  సరస్సు తీరము నుండి మాయమయ్యాడు.  ఇదిసోమవ్రతుని పుత్రుల కథ. నీకు చెప్పాము.

రక్షోరూపం చ వికలం జగ్మతుస్తత్క్షణేన తౌ ।(?) ఇదమేతద్యథా వృత్తమాఖ్యాతం భద్రమస్తు వః । । ౧౧౬
తక్షణమే వారిద్దరూ రాక్షసుల రూపాలను ధరించారు.   నేను చెప్పిన ఈ కథను  విన్నందువలన నీకు సకల శుభాలు కలుగుగాక. ఓ రాజా! నీకు మేలగు గాక''

బ్రహ్మా-
రాజా తద్వచనం శ్రుత్వా హర్షనిర్భరమానసః । ముహూర్తం ధ్యానమాస్థాయ వ్యాతిష్ఠత నదీ తటే ।। ౧౧౭
ఆ దేవ కన్యల మాటలు   విని రాజు సంతోషమును పొంది ముహూర్తకాలము ఆ నదీ తీరములో ధ్యానములో కూర్చున్నాడు.

పఠతి ఇయమముత్తమేతిహాసం రహసి శృణోతి పుమాన్ పురాణసూక్తమ్ ।
స జగతి ఘటికాద్రినాథభూమ్నా విధుతకలిః పరమేధతే చిరాయుః । ।౧౧౮

ఈ ఉత్తమ కథను ఎవరు  చదువుతారో, పురాణ సూక్తములు ఏ పురుషుడు వింటాడో, ఘటికాచల నాథుని దయ వలన  వలన పాపములను పోగొట్టుకొని చిరాయువై వృద్ధి పొందుతాడు.

ఇతి బ్రహ్మకైవర్తే ఉత్తరఖణ్డే భృగుపరాశరసంవాదే ఘటికాచలమాహాత్మ్యే ద్వితీయోఽధ్యాయః ।
ఇది బ్రహ్మకైవర్త పురాణంలోని ఉత్తరఖండంలో ఉన్న భృగుపరాశరసంవాదంలో ఉన్న ఘటికాచల మాహత్మ్యంలోని  రెండవ అధ్యాయము సమాప్తము

---

శ్రీ శివాయ గురవే నమః

ఘటికాచలనివాసాయ శ్రీ నృసింహాయ నమః

బ్రహ్మకైవర్త పురాణములో ఉన్న  శ్రీఘటికాచల మాహాత్మ్యపు  మూడవ అధ్యాయము

(మూల శ్లోకము మరియు తాత్పర్య విశేషాలతో)

శ్రీ పరాశరః

తృతీయోఽధ్యాయః

ఇత్యుక్తవన్తం బ్రహ్మాణముపసృత్య సురర్షయః । హర్షాశ్రుసంపరీతాక్షా న క్షమన్తే నిరీక్షితుమ్ ॥ ౧

బ్రహ్మదేవుడు ఈ విధంగా (రెండవ అధ్యాయంలోని కథ విన్న తరువాత)  మాట్లాడినప్పుడు, దేవతల ఋషులు చాలా ఆనందించి ఆనందాశ్రువులతో ఇంకా వినాలనే కోర్కెతో    అతనికి బాగా దగ్గరగా  వచ్చారు.

ఋషయః

బ్రహ్మన్ కథాకర్ణనతో హృష్టా వయమతన్ద్రితాః । ఇన్ద్రద్యుమ్నానుభావస్య శ్రవణే జాగ్రదాశయాః ॥ ౨

"ఓ బ్రహ్మదేవా ! నువ్వు చెప్పిన కథలను విని మేము చైతన్యవంతులమై చాలా సంతోషిస్తున్నాము. ఇంద్రద్యుమ్నుని శక్తిని వినడానికి మాకు ఇంకా ఆసక్తి కలుగుతున్నది.మిగిలిన కథ చెప్పవలసినది". అని ప్రార్థించారు.

బ్రహ్మే

బ్రహ్మ ఇలా చెప్పసాగాడు.

స రాజర్షివరస్తస్య మహానద్యాస్తటం గతః | సభార్యో హర్షసంపుల్లనయనో నయకోవిదః || ౩

వికసించిన కన్నులతో నీతి కోవిదుడయిన ఆ రాజర్షి శ్రేష్ఠుడు ఇంద్రద్యుమ్నుడు భార్యతో కూడి మహానదీ తటమును దాటాడు.

ఇదం హోవాచ భగవాన్ కన్యకాస్తా నిరీక్ష్య వై |

ఇన్ద్రద్యుమ్నః -

కథం సోమవ్రతో విప్రో విముక్తః పైతృకాదృణాత్ | అన్యా వా పుత్రసంపత్తిరాసీదస్య ప్రసంశత ||౪

తరువాత దేవకన్యలను ఆ ఇంద్రద్యుమ్నుడు మరలా ఈ విధంగా ప్రశ్నించాడు. సోమవ్రతుడను బ్రాహ్మణుడు పితృ ఋణము నుండి ఎలా విముక్తుడయ్యాడు? అతనికి వేరే పుత్ర సంతతి ఉన్నదా?"

విశేషాలు

1. ఋషిఋణం, 2. దేవఋణం, 3. పితృణం. అని మూడు ఋణాలు. ఇందులో పితృణాన్ని సత్సంతానాన్ని కనడం ద్వారా తీర్చుకోవాలి. తల్లిదండ్రులు ప్రత్యక్ష దైవాలు, మనకు జన్మనిచ్చి పెంచి పోషించినవారు. వంశాన్ని అవిచ్ఛిన్నంగా కొనసాగించడం ద్వారా, పితృ దేవతలకు తర్పణాది క్రియలు నిర్వహించే యోగ్యులైన సంతానాన్ని కనడం ద్వారా పితృణం తీర్చుకోవాలి. సంతానం కనాలంటే వివాహం చేసుకోవాలి. వేదాధ్యయనం, యజ్ఞం చేయడం, సంతానము కనడం ఇవి మానవుడు తప్పని సరిగా చేయవలసిన విధులుగా వేదం చెపుతున్నది.

## సోమవ్రతుని కథ

దివ్యకన్యకాః

సమాధిర్నామ వైశ్యోఽసౌ బ్రాహ్మణః పూర్వజన్మని | పుర్యా మాహిష్మతీనామ్న్యాం స్వవాసమకరోన్నృప ||౫

దేవకన్యలు రాజుకు ఇలా జవాబు చెప్పారు. "సమాధి అను వైశ్యుడు మాహిష్మతీ 'నగరములో నివసిస్తున్నాడు. అతడు పూర్వ జన్మలో సోమవ్రతుడను బ్రాహ్మణుడు.

ద్వే భార్యే తస్య వైశ్యస్య సురసా విరసేతి చ | విరసాయాం కనిష్ఠాయాం వైరస్యమకరోదయమ్ || ౬

ఆ వైశ్యునకు సురస, విరస అను ఇద్దరు భార్యలున్నారు. ఆతడు పెద్దభార్యపై ప్రేమ కలిగి చిన్నభార్య విరసపై అనాదరము చూపించేవాడు.

యత్ర యత్ర చ స స్నాతి తత్ర ప్రార్థయతే నృప| జ్యేష్ఠాయామేవ మేఽపత్యం స్యాదితి ప్రార్థయన్ స్థితః | || ౭

ఏ ఏ తీర్థములలో స్నానము చేసేటప్పుడు, ఆ యా తీర్థాలలో పెద్ద భార్యకే సంతానం కలగాలని అతడు ప్రార్థించేవాడు.

కనీయస్యపి భర్తారమనుయాతా తపస్వినీ | శుశ్రూషతే భర్త్సితాపి కనీయా విరసా సదా ||౮
చిన్న భార్య విరస భర్త తనను నిందించినప్పటికీ, ప్రేమ చూపించనప్పటికీ అతనిని అనుసరిస్తూ  ఎప్పుడూ  సేవ చేస్తుండేది.

స కదాచిన్నృపశ్రేష్ఠస్సంప్రాప్తో ఘటికాచలమ్ | హనుమత్పుష్కరిణ్యమ్బుఃకణధూతకలిస్తదా ||౯
ఓ రాజా ! ఒకసారి ఆ వైశ్యుడు  ఘటికాచలమును చేరి హనుమత్తీర్థములోని  నీటి బిందువుచే పాపములను పోగొట్టుకొన్నాడు.

తతః పశ్చాదుపారుహ్య వవన్దే నృహరీశ్వరమ్ | ప్రణామాన్తే మహావైశ్య స్తువన్నరహరిం హృది || ౧౦
తర్వాత కొండపైకి  ఎక్కి నరహరికి నమస్కరించాడు.  నమస్కారం చేసిన తరువాత ఆ  మహా వైశ్యుడు నరహరిని కళ్ళు మూసుకొని   హృదయంలో  స్తుతించాడు.

బ్రాహ్మణ్యం ప్రాప్య తేజస్వీ సోమవ్రతకృతాభిధః | సంవన్ద్య పునరున్మీల్యనయనే యాచతే వరమ్ ||౧౧
ఆ వైశ్యునకు బ్రాహ్మణ్యము( సద్గతి) లభించి తేజస్వియై  సోమవ్రతుడు  అనుపేరుతో పిలువబడ్డాడు.
అతడు నరహరికి  నమస్కరించి కన్నులు తెరచి వరమును ఇలా కోరుకొన్నాడు.
సోమవ్రతః -
శిరసా నమ్య నృహరిం వాచా సత్వబలేన సః | సుతమేకం కనీయస్యాం విరసాయామయాచత || ౧౨
"సత్వబలుడైన సుతుడొకడు చిన్న భార్య యగు విరసకు కలుగవలెను". అని శిరస్సు వంచి నమస్కరించి నరహరిని ఆ సోమవ్రతుడు ప్రార్థించాడు.

తతో లబ్ధవరస్తస్మాద్బహిర్నిర్గత్య స ద్విజః | చిన్తయామాస కిమిదమావిరాసీద్వచో మమ | | ౧౩
గుడి బయటకు వచ్చి "నేనునా పెద్ద భార్య సురసను మరచిపోయి ఎందుకని చిన్న భార్యవల్లపుత్రుడు జన్మించాలని కోరాను? " అని  విచారించాడు.
ఇతి సంచిన్త్య విప్రేన్ద్ర ఉష్యతాం రాత్రిముత్తమామ్ | అన్యేద్యుః ప్రాతరుత్థాయ స్నాత్వా పాపనివారిణి ||౧౪
అని పై  విధముగా ఆలోచించి  ఆ బ్రాహ్మణ శ్రేష్ఠుడు రాత్రి  గడపి తెల్లవారగనే లేచి, పాప నివారిణి అయిన  తీర్థములో స్నానము చేసాడు.

హనుమత్సన్నిధౌ స్థిత్వా ద్విజన్మా స నృపోత్తమ| జ్యేష్ఠాయాం మమ భార్యాయామావిరస్తు సుతద్వయమ్ ||౧౫
ఓ ఇంద్రద్యుమ్న రాజా !  తరువాత హనుమంతుని వద్ద నిలిచి "నా పెద్ద  భార్యకు ఇద్దరు కుమారులు కలుగవలె"నని ప్రార్థించాడు.

దివ్యకన్యకాః-

వాచమస్య దయాం చక్రే తదా ద్విజవరో నృప | యస్మాత్తు దైవయోగేన తథావిరభవత్తదా | |౧౬

ఓ రాజా ! తన మాటను తానే కాదని  పల్కినందున దైవయోగముతో అతని పెద్ద భార్యకు ఇద్దరు కుమారులు కలిగారు. కాని, పుట్టిన వెంటనే వారు రాక్షసులుగా మారిపోయారు.

తస్యాః పుత్రో యవీయస్యా దేవవ్రత ఇతి శ్రుతః | యస్య దౌహిత్ర ఏవాసౌ ధ్రువో జగతి గీయతే || ౧౭

చిన్నభార్యకు దేవవ్రతుడనే ఒక కుమారుడు  పుట్టాడు. అతని దౌహిత్రుడే (కూతురు కొడుకు) లోకం కీర్తించే ధ్రువుడు.

స తేన పుత్రవాన్ రాజన్ లోకే విఖ్యాతసాత్వికః | నృహరేరనుభావేన బ్రాహ్మణ్యం తస్మిన్నభూదిదమ్ ||౧౮

ఓ రాజా ! సోమవ్రతుడు ఈ విధంగా  లోక విఖ్యాతుడైనసాత్వికుడైన పుత్రుని పొందాడు. నరసింహ దేవుని వలన అతనికి బ్రాహ్మణ్యము సిద్ధించింది.

నిశమ్య తద్వచశ్శ్రావ్యం రాజా ధర్మభృతాం వరః | కన్యాస్తా బహు మేనేఽసౌ సభార్యో నిమ్నగాపథే | | ౧౯

ధర్మాన్ని పాటించేవారిలో ఉత్తముడు  అయిన ఆ  ఇంద్రద్యుమ్నుడు బార్యతో కలిసి దేవకన్యల  మాటలు విని,   వారు ఉత్తమ మార్గములో  ఉన్నారని భావించాడు.

ఇన్ద్రద్యుమ్నః -

పుణ్యశ్లోకవతాం పుంసాం చరితస్యానువర్ణనాత్ | ఆద్యారభ్య వయం హృష్టాస్స్వస్తి వోఽస్తు వ్రజామ్యహమ్ ||౨౦

పవిత్రమైన చరిత్ర కలిగిన  పుణ్య  పురుషుల  కథలను మీరు వివరించడం ద్వారా మేము  సంతోషంగా ఉన్నాము .మరియు నేను మీకు  శుభము కలగాలని కోరుకొంటున్నాను అని ఇంద్రద్యుమ్నుడు అన్నాడు.

బ్రహ్మ

తా విసృజ్య తతః కన్యాస్స రాజా సహభార్యయా | ఘటికాచలముద్దిశ్య ప్రయయౌ దక్షిణాం దిశమ్ || ౨౧

ఇంద్రద్యుమ్నుడు తన భార్యతో ఆ దేవకాంతలను పలు విధాలుగా పొగడి వారిని విడిచి దక్షిణ దిశలో ఉన్న  ఘటికాద్రి వైపు తన ప్రయాణాన్నికొనసాగించాడు.

ఇంద్రద్యుమ్న దేవేంద్రుల కలయిక

మార్గమధ్యే సురేశానం వ్యాలులోకే మహారథమ్ | శతం శతం కుణ్డలినస్తదనువ్రజతో నృపః || ౨౨

మార్గ మధ్యమున వేలాదిగా అనుచర గణం అనుసరిస్తున్న  గొప్ప రథము కలిగిన ఇంద్రుని  ఇంద్రద్యుమ్న మహారాజు చూసాడు.

ఇన్ద్రోఽపి తం మహారాజం మహాభాగం మహామతిమ్ | సభార్యం దృష్టవాంస్తత్ర ధనం నిర్ధనికో యథా || ౨౩

ఇంద్రుడు కూడా  - గొప్ప అదృష్టం కలవాడు, గొప్ప బుద్ధి కలిగినవాడు, భార్యతో కూడి ఉన్న  ఆ ఇంద్రద్యుమ్న మహారాజును ధనవంతుని, ధనములేనివాడు చూసినట్లుగా చూసాడు.

అథావిదూరే మఘవాన్ ఖస్థ ఏవాభ్యభాషత ।

రాజేంద్రుడగు ఇంద్రద్యుమ్నుడు దేవేంద్రుడు కుశల ప్రశ్నలు ముగిసిన తరువాత పరస్పర మనోరంజకములైన మాటలు మాట్లాడుకొన్నారు. .

ఇన్ద్రః-

రాజర్షే భగవంస్తుభ్యమిన్ద్రోహమభివాదయే ॥౨౪

రాజా ! భగవాన్ !( పూజ్యుడా !)  నీకు నా గౌరవప్రదమైన ప్రణామాలు.

యతస్తే శ్రీనరహరిస్సుప్రసన్నో భవిష్యతి ।

బ్రహ్మా

ఇత్యుక్తవతి దేవేన్ద్రే స రాజర్షిః ప్రతాపవాన్ ॥౨౫

ఒకపనిచేస్తే , శ్రీ నరహరి నీ  పట్ల చాలా సంతోషిస్తాడు అని ఇంద్రుడనగా ప్రతాపవంతుడైన ఆ రాజర్షి  దేవతల ప్రభువుతో ఇలా మాట్లాడాడు.

అగ్రే సర్వ జగాదేదం విష్ణుపాదనిషేవణమ్। బహోః కాలాన్మయా దృష్ట ఇన్ద్రస్త్వం బలిసూదన ॥ ౨౬

ఇది విష్ణు పాదసేవ. ఓ బలి విధ్వంసకుడా!  ఓ ఇంద్రా ! నేను నిన్ను చాలాకాలం తరువాత  చూసాను .

ఇతో నిషీద భగవన్ రసాలవిటపాత్తమే । తావుభౌ నరదేవేన్ద్రౌ బహుశాఖామనుత్తమామ్ ॥౨౭

ఓ ఇంద్ర ప్రభూ!  పూజ్యుడా ! దయచేసి ఇక్కడ ఉత్తమమైన మామిడి  కొమ్మలపై కూర్చోండి.  అని చెప్పగా ఇంద్రుడు కూర్చున్నాడు. రాజు మరియు దేవ రాజు ఇద్దరూ అనేక పరాక్రమ శాఖలను కలిగి ఉన్నవారు మరియు అద్భుతమైనవారు.(శ్రేష్ఠులు)

పుష్పితాం కాఞ్చనమయీం తస్థివాంసౌ  తలోపరి ।  తౌ కాఞ్చనమయైః పుష్పైరక్షీతౌ రేజతుస్తథా ।। ౨౮

పుష్పించే బంగారు చెట్టు కలిగిన (గణికారీ వృక్షము)  నేలపై నిలబడి బంగారు పూలతో వారు మెరిసిపోయారు

స నక్షత్రీ వియద్భాగే పుష్పవన్తావివోదితో భుజాద్భుజం పీడయన్తౌ తౌ మిథో నృసురోత్తమౌ ।। ౨౯

నక్షత్రాలు  పూల తోట వలె ఆకాశంలో కనిపిస్తుండగా  ఆ ఇద్దరు ఉత్తమ పురుషులు ఒకరినొకరు చేతితో మరొకరి చేతిని ( ఒకరి భుజముతో ఇంకొకరి భుజమును) ఆనందంగా స్నేహ పూర్వకంగా స్పర్శించారు.

హర్షాశ్రువీతనయనావిదమూచతురేకదా ।

ఇన్ద్రద్యుమ్నః -

దైవాత్ ప్రాప్తో మహేన్ద్రస్త్వం దిష్ట్యాసి ప్రాపితో నృప ॥ ३०

ఒక్కసారిగా  వారి కళ్ళు ఆనందంతో నిండిపోగా వారు ఒకరితో ఒకరు మాట్లాడుకున్నారు.

ఇంద్రద్యుమ్నుడు

ఓ ఇన్ద్రా ! నా  అదృష్ట వశాత్తు నీవు నా దగ్గరకు  వచ్చావు,

ఇదమేవ కృతం పుణ్యమయమేవ గుణోదయః ।

ఇన్ద్రః

ఇదమేవ హి సౌహార్దమిదం చక్షుష్మతాం ఫలమ్ ॥ ३१

ఇదొక్కటే నేను చేసిన పుణ్యకార్యం, పుణ్యం యొక్క ఎదుగుదల.

ఇంద్రుడు

ఇది నిజంగా మన స్నేహం యొక్క ఫలం. నిన్ను చూడటం  కన్నులున్నందుకు కలిగిన అదృష్టం 31

యతో వంశకరస్త్వం హి యతో విష్ణుపరాయణః ।

బ్రహ్మ

ఇత్యన్యోఽన్యం ముదావిష్టౌ శిష్టౌ సాత్త్వికభావనౌ ॥ ३२

ఎందుకంటే నువ్వు  వంశమును శాశ్వతముగా నిలుచునట్లు చేయువాడివి మరియు నువ్వు  విష్ణువు యొక్క భక్తునివి  కాబట్టి.

బ్రహ్మదేవుడు

ఆ విధంగా ఇద్దరు  శాంతులు, ధీరులు  ఆనందంతో నిండిపోయి సాత్త్విక భావంతో ఒకరితో ఒకరు మాట్లాడుకున్నారు .

నాటయన్తౌ నరసురౌ వ్యఙ్గనౌ తౌ నిరఙ్గనౌ । నరదేవర్షభౌ తత్ర నారాయణపరాయణౌ । ३३

ఈ విధంగా మచ్చలేని  ఆ  ఇద్దరు  ఉత్తమత్వాన్ని చూపుకొన్నారు. ఆ ఇద్దరు భగవంతుడు నారాయణునికి  అంకితమయ్యారు.

సువర్ణముఖరీతీరే తూష్ణీమాస్తాం క్షణం విభో । సస్మితాలోకనం పూర్వం రాజా విబుధశేఖరమ్ ॥३४

ఆ తరువాత సువర్ణముఖి  నది ఒడ్డున  ఒక్క క్షణం  ఆ ఇన్ద్రద్యుమ్నుడు, ఇంద్రుడు  మౌనంగా ఉన్నారు. ఆ తరువాత  మొదట రాజు చిరునవ్వు నవ్వి ఇంద్రుని  చూచాడు

ప్రాహ ప్రసన్నయా వాచా వినయాలమ్బిచేతనః ।

ఇన్ద్రద్యుమ్నః

ఇదమాగమనం తేఽద్య హ్యపూర్వం ప్రతిభాతి మే ॥३५

ఆ తరువాత ఉల్లాసమైన స్వరంలో వినయం ధ్వనిస్తుండగా ఇంద్రద్యుమ్నుడు ఇంద్రునితో ఇలా అన్నాడు.

ఇంద్రద్యుమ్నుడు

ఈరోజు మీ రాక అపూర్వమైనదని నాకు అనిపిస్తోంది

శంస శ్రీవేఙ్కటేశానం ప్రస్తోతుం యాసి వాథవా | శ్రీమద్దక్షిణకైలాసమపి వా స్వర్ణనిమ్నగామ్ ||౩౬

మీరు ఎక్కడికి వెళుతున్నారు?  దేనిని శ్రీవేంకటేశ స్వామికి సమర్పించబోతున్నారు?  అందమైన దక్షిణ కైలాసానికా( శ్రీ కాళహస్తికా) బంగారు నదికా( సువర్ణముఖీ ?)

అనుగ్రహీతుమస్మాన్ వా విష్ణోరాజ్ఞాప్రచోదితః | ఇతీరితో దేవరాజః ప్రశ్రయావనతాననః ||౩౭

విషయం వివరించి మాపై  దయ చూపమని ఇంద్రద్యుమ్నుడు అడిగాడు.  ఇలా తనను  సంబోధించిన ఇంద్రద్యుమ్నుని చూసి విష్ణువు ఆజ్ఞ  మనస్సును ప్రేరేపిస్తుండగా దేవతల రాజు వినయంగా ముఖం వంచాడు.

కృత్వా మనసి విష్ణోర్వే శాసనం ప్రాహ భూమిపమ్| యతో నారాయణే దేవే భక్తిరవ్యాహతా త్వయి ||౩౮

విష్ణువు యొక్క ఆజ్ఞను మనస్సులో ఉంచుకొని రాజుతో  ఆ ఇంద్రుడు   ఇలా అన్నాడు ''నారాయణుని పట్ల నీ  భక్తికి ఎటువంటి ఆటంకం లేదు''( నువ్వు గొప్ప విష్ణుభక్తి కలిగినవాడివని భావం)

నారాయణ త్వమేవాసి జగతీతి విగీయసే | అతో మమ మహేశానబ్రహ్మదేవాసురాత్మకః ||౩౯

ఓ నారాయణా! నువ్వు మాత్రమే విశ్వంగా పాడబడుతున్నావు.( విశ్వం విష్ణుః... అని విష్ణుసహస్ర నామం. రాజు విష్ణ్వంశ సంభూతుడు) నువ్వు  శివుడు,  బ్రహ్మ, దేవ, రాక్షసులతో  కూడి ఉన్నావు.

శ్రీవేఙ్కటేశో భగవానవతీర్ణస్తవాత్మదృక్ | కాలీయఫణిమాణిక్యరఞ్జిత శ్రీపదామ్బుజః || ౪౦

కృష్ణావతారంలో కాళీయుని పడగలమాణిక్యాల మీద ప్రకాశించు పద కమలములు కలిగిన నువ్వు    శ్రీ వేంకటేశ్వరునిగా ఈ భూమిపై అవతరించావు.

స ఏవ భగవాన్ కృష్ణస్తవ రూపీ జనార్దనః | ఇత్యుక్తో నృపతిశ్రేష్ఠః కిమితి వ్యాకులేక్షణః | | ౪౧

అదే పరమాత్మ కృష్ణుని , జనార్దనుని అంశ   నీ స్వరూపంగా వెలిసింది. నువ్వు  రాజులలో ఉత్తముడివి. ' ఇంద్రుడు  ఇలా అనగానే ,  ఇంద్రద్యుమ్నుడు   ఆ పోలికకు పరవశించి మైమరచిపోయాడు. అతనికి    తెలియక కళ్ళు చెమర్చాయి. . 41

పప్రచ్ఛ మఘవానన్తమిదమద్భుతభాషిణమ్ | అదృష్టశ్రుతపూర్వం హి భాషితం విబుధోత్తమ ||౪౨

అద్భుతంగా మాట్లాడిన  ఇంద్రుని ఆ రాజు  అడిగాడు. ''ఓ దేవతలలో ఉత్తముడా,! నేను ఇంతకు ముందెన్నడూ ఇటువంటి మాటలు  వినలేదు.

అన్యాదృశీ పరీభాషా పరితా భవతాఽనఘ | నృకీటం పురతః కృత్వా ప్రవ్యాహరసి వాసవ ||౪౩

ఓ పాపం లేనివాడా! ఇంద్రా !  నువ్వు మరో రకమైన అద్భుత భాష చదివావు. నువ్వు ఈ మానవ కీటకంతో దైవాన్ని పోల్చి మాట్లాడుతున్నావు (అని తన వినయాన్ని చాటుకొన్నాడు)

ప్రాభవానుగుణం పశ్చాద్గుణత్వం సర్వభావితమ్ ।

బ్రహ్మే-

ఇన్ద్రద్యుమ్నస్య వినయం వ్యాహృతిం నిశమయ్య సః ॥ ౪౪

దొరతనం ప్రకారం, ఏ విషయమైనా తరువాతి సర్వవ్యాప్తి చెందుతుందని చెప్పబడింది.( దైవపు దొరతనము తన దగ్గరలేదని తానొక మానవ కీటకాన్ని అని ఇంద్రద్యుమ్నుని వినయం) అని ఇంద్రద్యుమ్నుడు చెప్పగా , అతని వినయపూర్వకమైన వ్యక్తీకరణలను విన్న ఇంద్రుడు ఇలా అన్నాడు.

ఉపలాలయ మహీపాలం ప్రాహ గమ్భీరయా గిరా । న జానాసి మహత్కర్మ జనస్థానే విస్మృమ్భితమ్ ॥౪౫

ఇంద్రద్యుమ్న రాజును బుజ్జగిస్తూ ఇంద్రుడు గంభీరమైన స్వరంతో మాట్లాడాడు . ''జనస్థానంలో ఓ మహత్తర కార్యం సాగిందని మీకు తెలియదు''

ఉగ్రశాసనకర్తౄణాం రక్షసాం భీమకర్మణామ్ ।

ఇన్ద్రద్యుమ్నః -

క్వాయం సంరమ్భసమయే రక్షసాం భీమకర్మణామ్ ॥ ౪౬

జనస్థానాన్ని పాలించే కాలకేయులు భయంకరమైన పాలకులు మరియు భయంకరమైన పనులు చేసేవారు. అని ఇంద్రుడనగా '' ఈ సమయంలో భయంకరమైన పనులు చేసే కాలకేయులనే రాక్షసులు ఎక్కడ ఉన్నారు?

క్వైషా వావాసఽభూస్తేషాం కస్మాల్లబ్ధవరాస్త్వమీ। పీడ్యన్తే హి జనాస్సర్వే సత్త్వం శంస బుధోత్తమ । ॥౪౭

వారి నివాస స్థలం ఏమిటి ? వారు వరాలను ఎలా పొందారు ? మనుష్యులందరూ ఎందుకు బాధపడుతున్నారు? ఓ శ్రేష్ఠమైన పండితుడా ! ఇంద్రా ! దయచేసి నాకు చెప్పండి. అని ఇంద్రద్యుమ్నుడు ప్రశ్నించాడు.

ఇన్ద్రః-

అస్తి కశ్చిద్వనోద్దేశే కాలకేయాధిపో బలీ । కుమ్భోదర ఇతి ఖ్యాతో నరమాంసాదనో నృప । ।౪౮

కాలకేయులకు రాజైన నరమాంస భక్షకుడైన కుంభోదరుడను ఒక రాక్షసుడు ఒక అరణ్యములో ఉన్నాడు.

స చైకదా జగత్సర్వం పీడయానో మహాసురః । ఈశానతో లబ్ధవర ఋషీన్త్రాన్ భక్షయన్నృప ॥౪౯

అతడు ఈశ్వరునిచేత వరములను పొంది ఋషులను భక్షిస్తూ ఈ లోకాన్ని పీడిస్తున్నాడు.

సురథేన కృతాధ్యక్షాం ప్రాప్తవాన్ నృహరేః పురీమ్ । తతస్తైరభవద్యుద్ధమతిప్రబల శత్రుభిః ॥౫౦

సురథుడనేవాడు ఘటికాచల ప్రాంతాన్ని పాలన చేసేవాడు. ఈ కుంభోదరుడు నృసింహపురంపై దండెత్తాడు. అప్పుడు సురథునికి మరియు చాలా బలమైన శత్రువయిన కుంభోదరునికి మధ్య యుద్ధం జరిగింది.,

సురథో నిర్జితస్తస్యాః పుర్యా నిష్కాసితో నృప । హృతకోశో నృపో రాజ్యాత్పరిభ్రష్టో హతానుగః । । ౫౧

ఓ రాజా ! సురథుడు ఓడిపోయి ఆ నగరం నుండి వెళ్లగొట్టబడ్డాడు. రాజు యొక్క ఖజానా దొంగిలించబడింది మరియు అతను రాజ్యం నుండి బహిష్కరించబడ్డాడు. మరియు అతని అనుచరులు చంపబడ్డారు.

అమాత్యభార్యామాత్రేణ సహాయో వనమభ్యగాత్ । గతే తు తస్మిన్ సురథే రాక్షసా బలగర్వితాః । ||౫౨

మంత్రి భార్య వెంటరాగా సురథుడు అడవికి వెళ్ళాడు. సురథుడు అలా వెళ్ళినప్పుడు రాక్షసులు తమ బలానికి గర్వపడ్డారు.

పురీమావాసయాఞ్చక్రుస్తత్రత్యా అపి బాధితాః । ఘటికాచలశృఙ్గాణి ప్రజా ఆరురోహస్తదా ||౫౩

బలగర్వితులయిన రాక్షసులు నృసింహ పురమున నివసిస్తూ జనులను బాధించారు. బాధతో ఆ ప్రజలు ఘటికాచలము పైకి ఎక్కారు.

మయా తత్ర గతం దైవాత్ స్తోతుం నరహరీశ్వరమ్ । పలాయమానా బహుశస్తత్ర దృష్ట్వా మహాప్రజాః ||౫౪

దైనవశాత్తు నేను(ఇంద్రుడు) అక్కడకు వెళ్ళి నరసింహదేవుని ప్రార్థించి పరుగెత్తుతున్న జనాలను చూసాను.

తథా ప్రజాసు నిర్వ్యాజముత్పన్నా తాసు మే ఘృణా । శృఙ్గాగ్రే వేష్టితం సాక్షాదద్రాక్షం పరమం పదమ్ ||౫౫

ఆ విధంగా బాధపడుతున్న వారిని చూసి కారణము లేకుండానే నాకు దయ కలిగింది. శిఖరం పైభాగంలో చుట్టి ఉన్న సర్వోన్నతుని నివాసాన్ని చూసాను.

స్తూయమానం మహర్షీన్ద్రై నరకణ్ఠీరవం నృప । దృశ్య ప్రత్యక్షముని లీలామానుషవిగ్రహమ్ ||౫౬

మహర్షులచే స్తుతింపబడు లీలా మానుష విగ్రహుని నరసింహస్వామిని చూసాను.

స్తుతిపూర్వ ప్రజా రక్ష్యా ఇత్యవోచఞ్జనార్దనమ్ । నరకణ్ఠీరవో వీక్ష్య మామతిస్నిగ్ధయా దృశా || ౫౭

ఆ దేవదేవుని నేను కూడా స్తుతించి ప్రజలను రక్షింపుమని వేడాను . భగవంతుడగు నరహరికి వారి కష్టాలను చెప్పాను. విన్నవించాను. నరసింహుడు నావైపు చాలా ఆప్యాయంగా చూసాడు.

కాలకేయా మదోన్మత్తా వరాహశ్శూలపాణయః । త ఇమే రాక్షసా గృహ్య సురథం పురవాసినమ్ ||౫౮

నరసింహస్వామీ! కాలకేయ రాక్షసులు మదోన్మత్తులైసురథుని అడవులకు తరిమివేసారు. ఈ పురాన్ని ఆక్రమించారు.

వనే వివాసయాఞ్చక్రుర్బాధయన్తో ద్విజర్షభాన్। తైస్తు విత్రాసితా హ్యేతా విద్రవన్తి ప్రజా విభో । । ౫౯

నరసింహస్వామీ! వారు ఉత్తమ బ్రాహ్మణులను అడవికి బహిష్కరించారు. మరియు వారిని వేధించారు . ఈ ప్రజలు వారి చర్యలకు భయపడి పారిపోతున్నారు.

వరదర్పపరీతాస్తే బాధన్తే శూలపాణయః । ఇత్యుక్తవతీ భూతానామధిపే భూతభావనే ॥ ౬౦

జీవులకు ప్రభువా ! జీవుల సృష్టికర్తా ! తమ వరాలను గూర్చిన గర్వంతో పొంగిపోయిన ఆ రాక్షసులు తమ చేతుల్లోని ఈటెలతో ప్రజలపై దాడి చేస్తున్నారు

। నృహరీ వచనం చేదమవోచం పృథివీపతే । హృతరాజ్యః కదా రాజా సురథశ్చ పురీమిమామ్ ॥౬౧

ఓ భూలోక ప్రభువా! ఇంద్రద్యుమ్నా ! నేను నరహరితో "రాజు సురథుడు అతని రాజ్యాన్ని మరియు ఈ నగరాన్ని ఎప్పుడు స్వాధీనం చేసుకుంటాడు?

ప్రాప్స్యతి ప్రాణినస్సర్వాన్ కదా వా పాలయిష్యతి ।
శ్రీభగవానువాచ-
శాలివాహనకాలే తు యోగనిద్రాప్రసాదతః ॥ ౬౨

తిరిగి రాజ్యమును ప్రజలను ఎప్పుడు పొందగలడు? అందరిని ఎప్పుడు పాలించగలడు?" అని అడిగాను.శ్రీ నరసింహ స్వామి కరుణించి నాకు ఇలా చెప్పాడు. "శాలివాహన కాలములో యోగనిద్రా ప్రసాదము వలన -

మత్పురీ పునరభ్యేత్య ప్రజా రక్షిష్యతే స్వకాః । ఆగామిన్యాఞ్చ త్రేతాయామిన్ద్రద్యుమ్నో మహాద్యుతిః ।। ౬౩

సురథుడు నా పురములో ప్రవేశించి ప్రజలను రక్షిస్తాడు. రాబోయే త్రేతాయుగములో అధిక పరాక్రమ కాంతి కలిగిన ఇంద్రద్యుమ్ను డనురాజు -

అవతీర్య మదంశాంశః పృథివీం పాలయిష్యతి । తస్యైషాం నగరీ వజ్రిన్ కల్పితా ప్రభవిష్యతి ।। ౬౪

అవతరిస్తాడు. అతడు నా అంశ కలిగినవాడు. ఈ భూమిని పాలిస్తాడు. అతని చేత ఈ నగరం దృఢమైన రక్షణ కల్గినదానిగా అవుతుంది.

ఆఞ్జనేయసహాయ్యేన తేన భగ్నాస్సయూథపాః । నామశేషః కాలకేయా గమిష్యన్తి యమక్షయమ్ ॥౬౫

ఆంజనేయుని సహాయముచేత అతడు సేనాధిపతులతో సహ కాలకేయులను జయిస్తాడు. . కాలకేయులలో మిగిలిన వారు నామమాత్రులై యమ నివాసానికి వెళతారు.

బ్రాహ్మణ్యమర్థ్యమానాయ తస్మై దాస్యామ్యనన్తరమ్ । తతశ్చక్రాఙ్కితో విప్రో వైష్ణవం రూపమేష్యతి ।। ౬౬

ఆ తదుపరి ఆ ఇంద్రద్యుమ్నుడు  తాను కోరుకొన్న  బ్రాహ్మణ్యము(సద్గతి) పొందగలడు.  . నేను అతనికి బ్రాహ్మణ్యము(సద్గతి) ఇవ్వగా  చక్రాంకితుడై వైష్ణవ రూపము పొందగలడు.''

ఇతీరయతి రాజేన్ద్ర ఘటికాద్రినివాసిని । ముహూర్తమవసంస్తత్ర ప్రజాః పశ్యంస్తతస్తతః || ౬౭

ఓ ఇంద్రద్యుమ్న మహారాజా ! ఈ విధముగా నాకు  తెలిపి  భగవానుడు ఘటికాద్రి వాసి నరసింహుడు  అక్కడక్కడా జనాన్ని చూస్తూ   కాసేపు అక్కడే ఉండిపోయాడు.

భగవానపి విశ్వాత్మా తత్రైవాన్తరధీయత । అన్తర్ధానంగతే విష్ణావాగమం మత్పురీం నృప ||౬౮

తరువాత విశ్వాత్ముడయిన  ఆ  పరమాత్మ ఆ ప్రదేశం నుండి అదృశ్యమయ్యాడు. అతను అదృశ్యమైన తరువాత   ఈ నగరానికి  నారదుడు వచ్చాడు.

ఇదానీం మామనుప్రాప్తో నారదః శ్రుతిగోచరః । శమ్భోరనుజ్ఞయా వజ్రిన్నిన్ద్రద్యుమ్నః ప్రతాపవాన్ ||౬౯

వేదజ్ఞాని  నారదుడు నా వద్దకు వచ్చాడు. శివ  భగవానుని అనుమతితో   ప్రతాపవంతుడైన -

ఘటికాచలనిష్ఠ్యాతమభిష్టోతుమనా నృపః । మధ్యేమార్గమవాతిష్టదితి హోవాచ వైణికః । ||౭౦

''ఇంద్రద్యుమ్నుడు ఘటికాచలముచేరుటకై వచ్చుచున్నాడని  రాజు ఘటిక పర్వతాన్ని పూజించాలనుకుంటున్నాడని  మధ్య మార్గంలో ఉన్నాడని నీ గురించి  వీణాధారియైన నారదుడు నాకు తెలిపాడు.

అహం తద్వచనాత్ సర్వానామన్త్ర్య దివిషద్గణాన్ । అనుజ్ఞయా చ నృహరేస్త్వామద్రాక్షం కథఞ్చన ||౭౧

అతని మాటలకు నేను స్వర్గవాసులందరినీ ఆహ్వానించి,  నరహరి అనుమతితో నేను నిన్ను చూడటానికి వచ్చాను''అని ఇంద్రుడు ఇంద్రద్యుమ్న మహారాజుతో ఇంకా ఇలా  అన్నాడు.

కాలకేయా వరాద్దృప్తా బాధన్తే పృథివీమిమామ్ । విశిష్య నరసింహస్య పురీం తాపసశాలినీమ్ ||౭౨

వరమును పొందిన కాలకేయులు  ఈ భూమిని మరీ ముఖ్యంగా గొప్ప తపస్వులు  నిండిన నారసింహ నగరాన్ని వేధిస్తున్నారు.

త్వమగ్రయాయీ నృపతే చక్రమేవ హనిష్యతి । సహాయో యస్య భగవాన్ హనూమాన్ హరియూథపః ||౭౩

శ్రీహరి తన చక్రమును హనుమంతునికి ఇచ్చాడు.  హనునుంతుడు నీకు సహాయముగా యుద్ధమున నిలుస్తాడు. నువ్వు రాక్షసులను సులభముగా జయింపగలవు.

తస్య కిం న భవేన్నామ జగత్యామభిలాషితమ్ । చక్రఞ్చ తస్మై దత్తఞ్చేద్ధరిణా పాపహారిణా । |౭౪

ప్రపంచంలో హనుమంతుడు  కోరుకున్నది ఏది సాధ్యం కాదు? ( అన్నీ సాధ్యమవుతాయని భావం) ఎందుకంటే సర్వపాపాలను పోగొట్టే భగవంతుడు అతనికి చక్రం ఇచ్చాడు కదా !

తథా శిలావటే దీప్తే మరుతామేలనాయితమ్ । బహునా కిం మయోక్తేన ఋషీణాం భావితాత్మనామ్ ||౭౫

అదేవిధంగా, హనుమంతుడు మరుత్తులను ఒక ప్రకాశించే రాత్రి అడవిలో ఒకచోట చేర్చాడు. అంత గొప్పవాడు ఆంజనేయుడు నీకు యుద్ధంలో సహకరిస్తాడు. ఆత్మసాక్షాత్కారులైన ఋషులకు ఈ వార్త వినటం కంటే గొప్ప వరం ఉంటుందని ఏం చెప్పను?

సర్వేషాం దీనమనసాం భాగధేయాయితం త్వయా ।

బ్రహ్మే

ఇత్యుక్తవతి దేవేన్ద్రే ముహూర్త ప్రస్థితో నృపః ।।౭౬

దీనులైన ఈ ఘటికాచలవాసులకి నీ ద్వారా భాగ్యం కలుగబోతున్నది. ఇంద్రుని మాటలను విని రాజు ఒక్క క్షణం తరువాత ఇలా అన్నాడు. . "

ఉవాచ ఇష్టరోమా వై రాజా తమమృతాశినమ్ । విధూయ సాత్త్వికరీతిం రాజసీం ప్రతిపాద్య సః ।।౭౭

ఆనందపు పులకింతలతో వెంట్రుకలు నిక్కబొడుస్తుండగా( తనకు నరహరి కర్తవ్యాన్ని నిర్దేశించాడని ఆనందం) ఇంద్రద్యుమ్నుడు ఆ అమృతాహారి అయిన ఇంద్రునితో మాట్లాడాడు. మాటలకి ముందు . సాత్త్విక మార్గాన్ని వదిలి రాజస మార్గాన్ని ప్రతిపాదిస్తున్న ఆలోచనలతో -

క్రోధసంరక్తనయనో యుగాన్తాగ్నిరివోత్థితః ।

ఇన్ద్రద్యుమ్నః

అద్య కో వా ఋషిగణాన్ విష్ణుభక్తాన్ ప్రబాధతే ।। ౭౮

అతని కళ్ళు కోపంతో ఎర్రబడ్డాయి. మరియు అతను యుగాంతంలో అగ్నిలా పైకి లేచాడు. శ్రీవిష్ణు భక్తులైన ఋషుల సమూహాన్ని ఈరోజు ఎవడురా వేధిస్తున్నది?

అత్ర మాం విష్టితం లోకే న జానాతి స దుర్మదః। అద్య మత్కోపదీప్తాగ్నౌ శాలభ్యముపలభ్య వై ।।౭౯

విష్ణుభక్తులను రక్షించే నేను ఈ లోకంలో ఉన్నాను అని తెలియని పిచ్చివాడు ఈరోజు నా కోపాగ్నిలో మిడతలా కాలిపోతాడు.

పశ్చాద్యమస్య సదనం దుర్మదస్సముపేష్యతి । త్రిషు లోకేషు కోపా మే క్రోధమాహరయిష్యతి ।। ౮౦

తరువాత ఆ దుష్టుడు యమ సదనానికి చేరుకొంటాడు. నా కోపము మూడు లోకములలో కోపాన్ని రేపుతుంది.

భువనే జయమాకాఙ్క్షీ కో మే కుర్యాద్వ్యతిక్రమమ్ । అద్య మద్బాణవిద్ధానాం రక్షసాం బలశాలినామ్ ।।౮౧

ఈ లోకంలో విజయాన్ని కోరుతున్న , నాపై ఎవరు అతిక్రమించగలరు? ఈరోజు నా బాణాలచేత కొట్టబడిన మహాబలవంతులైన రాక్షసులను,

సవిధే గృధ్రరాజానాం బృన్దం బృన్దం పతిష్యతి । విష్ణుభక్తికృతాలమ్బాన్నృషీన్దాన్ పీడయన్తి వై ।।౮౨

విష్ణువు పట్ల తమ భక్తిని ఆశ్రయించిన గొప్ప ఋషులను హింసించిన వారిని, వివిధ రూపాలలో రాబందుల రాజుల మందలలో పడేటట్లు చేస్తాను.(అనగా వారిని చంపి చంపి కాకులకు గద్దలకు ఆహారమగునట్టు చేస్తానని భావం)

రాక్షసా ఇతి విశ్రావ్య తిష్ఠతే మాదృశః కథమ్ ।

బ్రహ్మో

ఇతి సామర్షముత్థాయ వర్ధమానస్య భూపతేః ॥ ౮౩

దుష్టులైన రాక్షసుల పేరు వినబడిన తరువాత నా బోటివాడు  ఎలా ఊరికే కూర్చుంటాడు? అని ఇంద్రునితో ఇంద్రద్యుమ్నుడు పలుకుతూ కోపంతో విజృంభించి యుద్ధానికి సిద్ధమయ్యాడు.

వజ్రాద్వజ్రం సముత్పాద్య మఖవాన్ దత్తవాన్ కరే । రథం రథాద్వినిష్కృష్య శస్త్రమాదాచ్చ వాసవః ॥౮౪

అప్పుడు ఇంద్రుడు ఇంద్రద్యుమ్నునికి  తన వజ్రాయుధమునుండి దాని అంశము గల వేరొక వజ్రాయుధము కల్పించి ఇచ్చాడు. తన రథము నుండి ఇంకొక రథమునుకల్పించి ఇచ్చాడు. శస్త్రములను ఇచ్చాడు.

ఇన్ద్రాద్యా లోకపాలాస్తే స్వం స్వమంశం దదుః పునః । అస్త్రం చ దత్తవన్తస్తే యాతుధానజిగీషవః ॥౮౫

ఇంద్రుడు మరియు ఇతర దిక్పాలకులు తమ అంశలను  రాక్షసులను జయించాలనే కోరికతో రాజుకు ప్రసాదించారు. అస్త్రాలను ఇచ్చారు .

రత్నాకరో రత్నమాలాముదోలఙ్కారిణీమదాత్ । మారుతో దత్తవాన్ వేగం ధర్మరాడతనోద్ధ్వజమ్ ॥౮౬

సముద్రుడు అతని ఛాతీని అలంకరించే రత్నాల హారాన్ని ఇచ్చాడు. వాయుదేవుడు వేగాన్ని ఇచ్చాడు. యమధర్మరాజు ధ్వజమును  ఇచ్చాడు.

సారథి సారథేస్స్వయాదుత్పాద్యాదాద్దినాధిపః । అంశోంశం సముత్పాద్య వాజిభ్యో వాజనశ్చ సః ॥ ౮౭

సూర్యుడు తన సారథినుండి ఇంకొక  సారథిని కల్పించి ఇచ్చాడు. గుర్రములనుండి   వాటి అంశలు కలిగిన  గుఱ్ఱములను ఇచ్చాడు.

దేవతానుజ్ఞయా రాజా ద్విగుణీకృతవిక్రమః । ప్రాక్రమద్రథమాస్థాయ సభార్యస్సపరిచ్ఛదః ॥౮౮

దేవతల అనుమతితో రాజు తన పరాక్రమాన్ని రెట్టింపు చేసుకున్నాడు.  రాజు రెండింతల బలము కలవాడై తన భార్యతో సహా నరసింహ పురికి వెళ్లటానికి తన రథాన్ని ఎక్కాడు

దత్వా తస్మై స దేవేన్ద్రస్తూణమక్షయసాయకమ్ । యథాగతం సహామాత్యస్సదేవైరభ్యయాత్ తథా ॥౮౯

అతనికి  బాణములను అక్షయతూణీరములను దేవేంద్రుడు ఇంద్రద్యుమ్నునికి ఇచ్చాడు. తమకు చేతనయినట్లుగా దేవతలు , రాజు యొక్క మంత్రులు  అతనిని అనుసరిస్తూ విజృంబించారు.

యుద్ధాభికాఙ్క్షీ కుశలీ తయోరాజపలాశినోః । నిష్క్రమ్య స్వపురాదిన్ద్రస్సానుగస్సపరిచ్ఛదః । । ౯౦

యుద్ధం చేయాలనే ఉత్సాహం  అంతటా నిండుకొంది.  ఇంద్రుడు తన అనుచరులు మరియు అతని పరిచారకులతో కలిసి ఆ నగరం నుండి బయలుదేరాడు

.

అన్తరిక్షపథే తిష్ఠన్ సమ్రమ్భం భావినం ప్రతి । అథ క్రుద్ధో జగన్నేతా రాజా స మునిసత్తమః || ౯౧

దేవతలతో కూడి ఆకాశమునుండి ఇంద్రుడు  ఇంద్రద్యుమ్నుని  చూస్తున్నాడు. అప్పుడు మునిసత్తముడైన విశ్వనాయకుడైన ఆ రాజుకు కోపం వచ్చింది.

చతురఙ్గబలోపేతః క ఇమే రాక్షసా ఇతి । తృణీకృత్య పరాన్ సర్వాన్నృహరేః పురమేయివాన్ ||౯౨

చతురంగ బలంకలిగిన (పదాతిదళం, అశ్వికదళం, ఏనుగులు మరియు యుద్ధ రథాలు.) నా ముందు  ఈ రాక్షసులు ఎంత అని ఉత్సాహం తెచ్చుకొంటూ శత్రువులను తృణీకరిస్తూ  ఇంద్రద్యుమ్నుడు నరహరి పురానికి చేరుకున్నాడు.

చేతః పథే దృఢయతి స్మ తతో నృపాలః శ్రీమత్ తదేవ ఘటికాచలవాసిదైవమ్ ।
యుద్ధాభికాఙ్క్షిభిరనుక్షణమీక్ష్యమాణః కున్తాసిపట్టసధరైరనుయాయివర్గః || ౯౩

అప్పుడు మార్గమధ్యంలోనే మనస్సు నిలుపుకున్న రాజు ఘటిక పర్వతం మీద నివసించే అందమైన నరహరిని  చూశాడు. కత్తులు, గదలతో ఆయుధాలు ధరించిన అనుచరుల గుంపు అతనికొరకు నిలబడి  తక్షణమే యుద్ధము కొరకు  ఆసక్తిగా ఎదురుచూస్తున్నారు 93

పరబలకృతమర్మచిన్తచేతాః పరిణతసఙ్గరమర్మణి ప్రవీణః ।
పరిచితధనుశ్శరాగమావలిః పరిసరమద్రివరస్య సోఽవతీర్ణః || ౯౪

ఇంద్రద్యుమ్నుడు రూపాంతరం చెందిన యుద్ధభూమి యొక్క పదునైన నైపుణ్యం కలిగి ఉన్నాడు.
అతను సుపరిచితమైన విల్లు మరియు బాణాలతో  ఆ మహా పర్వతం యొక్క పరిసరాలపైకి దిగాడు 94

### ఇంద్రద్యుమ్నుడు రాక్షసులతో యుద్ధము చేయుట

అవతీర్ణః పురాభ్యర్ణ ప్రతివాదిభయఙ్కరైః । జ్యాస్వనైః పూరయామాస దిఙ్మణ్డలమతో నృపః || ౯౫

అతను పురంలోకి వచ్చిన తరువాత , భయంకరమైన ప్రతివాదులచే దాడి చేయబడ్డాడు. శత్రు భయంకరమైన అల్లెత్రాటి ధ్వనులు చేసాడు.   రాజు తన వింటి శబ్దంతో విశ్వాన్ని నింపాడు 95

ప్రత్యగ్రశస్స్వపరవేదిషు రాజసు ద్రాక్పూర్ణాస్త్రవిత్ సుగణితస్స పురాణవేత్తా ।
శాస్తా రిపోర్నృహరిపాదసరోజలగ్నచేతా వ్యజృమ్భత రణాఙ్కణలాలనీయః || ౯౬

ఇంద్రద్యుమ్నుడు  పురాణాల యొక్క ప్రసిద్ధ పండితుడు.  తన మరియు ఇతర  రాజుల పరాక్రమములలోని లోతు పాతులు తెలిసినవాడు.  ఆయుధ జ్ఞానం కలిగినవాడు. ఆ యుద్ధభూమిలో నరహరి  పాద పద్మాలపై మనసు నిలుపుకొని  యుద్ధంలో విజృంభించాడు 96

బ్రహ్మా

ప్రవర్తమానే రాజేన్ద్రే శత్రవో రోషవిహ్వలాః । వవ్రూరాగాన్మిథో భూపం శలభా ఇవ పావకమ్ ॥ ౯౭

బ్రహ్మదేవుడు చెబుతున్నాడు.

ఇంద్రద్యుమ్నుడు యుద్ధంలో దూసుకుపోతుంటే , అతని శత్రువులు కోపానికి గురిఅయి దాడి చేసారు. అయితే అగ్నిలో దూకిన మిడతల వలె కాలిపోయారు. 97

ఇతి బ్రహ్మకైవర్త ఉత్తరఖణ్డే భృగుపరాశరసంవాదే ఘటికాచలమాహాత్మ్యే తృతీయోఽధ్యాయః ॥

బ్రహ్మకైవర్త పురాణంలోని ఉత్తరఖండంలో ఉన్న భృగుపరాశరసంవాదంలో ఉన్న ఘటికాచల మాహత్మ్యంలోని మూడవ అధ్యాయము సమాప్తము *****

శ్రీ శివాయ గురవే నమః

ఘటికాచలనివాసాయ శ్రీ నృసింహాయ నమః

బ్రహ్మకైవర్త పురాణములో ఉన్న శ్రీఘటికాచల మాహాత్మ్యపు నాలుగవ అధ్యాయము

(మూల శ్లోకము మరియు తాత్పర్య విశేషాలతో)

శ్రీ పరాశరః

చతుర్థోఽధ్యాయః

శ్రీపరాశరుడు

నాలుగవ అధ్యాయం

ఋషయస్తే మహాత్మానమపదానప్రశంసినమ్ । ప్రశశంసుశ్చ బ్రహ్మాణం కథాశ్రవణలాలసాః ॥౧

తరువాతి కథ వినడానికి ఆత్రుత కలిగిన ఋషులు పవిత్రాచరణ కలిగిన మహాత్ముడయిన బ్రహ్మను స్తుతించారు.

ఋషయః

బ్రహ్మన్నవహితా యస్మాత్ పుణ్యశ్లోకశ్రవే వయమ్ । అతో ముఖైశ్చతుర్భిస్త్వం వద తద్రణవైభవమ్ ॥౨

ఋషులు

ఓ పూజ్యుడా ! బ్రహ్మ దేవుడా ! , ఈ పవిత్రమైన పుణ్య కథలను విని మేము మనశ్శుద్ధి పొందాం..తరువాత జరిగిన ఆ యుద్ధ వైభవాన్ని నీ నాలుగు ముఖాలతో చెప్పు.

బ్రహ్మా

స్వనితమవనిశమ్య చాపకోత్థం చకితమతిః పలలాశిసార్వభౌమః ।

తదను తదనుశాసనాయ భృత్యో ఖరముఖదుర్ముఖనాయకో వ్యసైషీత్ ॥౩

బ్రహ్మ

ఇంద్రద్యుమ్నుని వింటి శబ్దం విని రాక్షస సార్వభౌముడు కుంభోదరుడు ఆశ్చర్యపోయాడు. అది ఏమిటో తెలియక తికమకపడ్డాడు. తరువాత అతడు యుద్ధానికి సిద్ధపడిన కారణాన్ని తెలిసికొని రమ్మని ఖరముఖుడు, దుర్ముఖుడు అనే పేర్లు గల తన సేవకులను ఇంద్రద్యుమ్నుని దగ్గరకు పంపించాడు.

హాః కిమేతదితి క్రోధాదాభాష్య స మహాశరః । ప్రేషయన్ జ్ఞప్తయే చాశా విజ్వరః ప్రబభూవ హ ॥౪

గొప్ప విలుకాడయిన ఆ కుంభోదరుడు ఇంద్రద్యుమ్నుని బాణ ధ్వనిని సహించలేక ''అ ..ఏమిటి ఇది?'' అని కోపంతో అరిచాడు .

తౌ భృత్యౌ స్వామికార్యార్థే చోదితౌ బ్రహ్మఘాతినీ । అభ్యాశన్నృపతేస్తస్య ప్రాపతూ రాక్షసాధమౌ ॥౫

తరువాత కుంభోదరుడు పంపిన నీచమైన ఆ రాక్షస సేవకులిద్దరూ ఇంద్రద్యుమ్నుని దగ్గరకు వచ్చారు. అతడు గొప్ప సేనతో యుద్ధసన్నద్ధుడై రాక్షస ప్రభువుతో పోరాడడానికి సిద్ధమై ఉన్నట్లుగా వారు గమనించారు.

అభ్యేత్య వాహినీ సర్వాం వాహినీమివ గర్జతీమ్ । ఆలోకయామాసతుస్తౌ రాక్షసౌ కామరూపిణీ ॥౬

ఆ ఇద్దరు నీచమైన రాక్షసులు రాజును సమీపించి వాహినిలా ( నదిలా) గర్జిస్తున్న వాహినిని ( సైన్యాన్ని) చూసారు. తరువాత ఒక అందమయిన స్త్రీని రాజు దగ్గర చూసారు.

ఆలోక్య పునరభ్యేత్య రాజానమిదమూచతుః ।

ఆమెను చూసి ఖరముఖుడు, దుర్ముఖుడు తిరిగివచ్చి కుంభోదరునితో ఇలా అన్నారు.

భృత్యౌ - (దుర్ముఖ- ఖరముఖౌ)

స్వామిన్నాస్తే శిలాపృష్ఠే కస్మింశ్చిత్ స నరర్షభః ॥ ౭

సేవకులు - (ఖరముఖుడు, దుర్ముఖుడు)

ఓ కుంభోదరా ! మనుష్యులలో ఉత్తముడయిన ఆ ఇంద్రద్యుమ్నుడు ఒక బండపై కూర్చున్నాడు .

అధీశ్వరో మానుషాణాం సాక్షాద్విష్ణురివాపరః | తురఙ్గమాశ్చ శతశో ద్విపేన్ద్రాశ్చ సహస్రశః || ౮

భగవంతుడయిన విష్ణువు కు మరొక అవతారంలా ఉన్న ఆ రాజు ప్రకాశిస్తూ కొండపై ఉన్నాడు. అతను మానవులకు అత్యున్నత ప్రభువు. వందల గుర్రాలు, వేల ఏనుగులు అతని దగ్గర ఉన్నాయి.

సన్నద్ధాశ్చ రథాః కేచిదాసతే తత్ర తత్పదే | దశనాగబలాః కేచిత్ కేచిత్ సింహపరాక్రమాః | ౯

కొన్ని ఆ యుధాలు కలిగిన రథాలు ఆయన పాదాల దగ్గర ఉన్నాయి. అతని సైనికులలో కొందరు పది ఏనుగులంత బలవంతులు, మరికొందరు సింహముల వలె బలవంతులు. 9

తస్యానుగాః పరార్థా వై వరాహభరణాన్వితాః | సాయుధాస్సపరీవాహా అనురూపాః పరస్పరమ్ ||౧౦

అతని అనుచరులలో కొందరు వరాహాభరణాలు ధరించారు. ఆయుధాలు మరియు రాజార్హ్వమగు వస్తువులతో వారు ఒకరికొకరు అనుగుణంగా ఉన్నారు.

పరస్సహస్రముదితా యువానః ఖడ్గపాణయః | సజ్జరాజినసన్నద్ధాస్సవర్మాణస్సపట్టసాః | | ౧౧

ఆ రాజు దగ్గర వేయిమంది యువకులు కవచాలు ధరించి గండ్రగొడ్డళ్ళు , కత్తులు పట్టుకొన్నారు. 11

దృష్టివిక్షేపమాత్రేణ నిర్దహన్తే పరానిమాన్ | ఇతోఽర్ధయోజనపథే తిష్ఠతే సపరిచ్ఛదః | |౧౨

వారు ఇతరులను తమ కనుచూపుతో కాల్చివేసే దృష్టి కలిగి ఉన్నారు. . ఆరాజు తన వారితో ఇక్కడికి నాలుగు మైళ్ల దూరంలో ఉన్నాడు. .12

యుద్ధరఙ్గాభిమత్తోఽసౌ కాఙ్క్షతే భవదాగమమ్ | శంసతోరేవమీశానో రక్షసాం బలగర్వితః | | ౧౩

అతను యుద్ధభూమిపై మోహముతో నీ రాక కోసం తహతహలాడుతున్నాడు. . . ఖరముఖుడు, దుర్ముఖుడు ఈ విధంగా కుంభోదరునితో ఇంద్రద్యుమ్నుని గురించి చెప్పారు. 13

భర్త్సనం వ్యాకరోదేష తయోరరిశుభం శ్రుతః |

భయముగొలిపే శత్రు ప్రశంసా వాక్యాలు విని కుంభోదరుడు వారిని ఇలా గద్దించాడు.

కుమ్భోదరః

హే దుర్ముఖ మయా కో వా యుద్ధ్యేత త్రిజగత్ స్థలే || ౧౪

కుంభోదరుడు

ఓ దుర్ముఖా ! మూడు లోకాలలో భూమిపై ఎవరు నాతో పోరాడగలరు? 14

మనుష్యమాత్రే కిం వా త్వమారోపయసి తద్గుణమ్ | దత్తా హి శమ్భునా మహ్యం దేవతాభిరవధ్యతా ||౧౫
కేవలం మానవునికి మీరు ఏ సుగుణాన్ని ఆపాదిస్తారు? శివుడు దేవతలచేతిలో మరణం లేకుండునట్లు నాకు అమరత్వాన్ని ప్రసాదించాడు .

నృకీటో దుర్బలః క్షీణః కథం యుద్ధే జయిష్యతి | ఇత్యుక్తవతి యాతూనావధీశే శత్రుజేతరి ||౧౬
బలహీనమైన మరియు అలసిపోయిన ఒక మానవ పురుగు నన్ను యుద్ధంలో ఎలా జయించగలదు?అనేక శత్రువులను జయించిన రాక్షస ప్రభువు కుంభోదరుడు తమతో ఇలా మాట్లాడగానే.... 16

క్రుద్ధస్వామినముద్వీక్ష్య అపసర్పత దుర్ముఖః | ఖరవక్రస్తు దుష్టాత్మా ఇదం హోవాచ స్వామినమ్ | | ౧౭
దుర్ముఖుడు కోపోద్రిక్తుడైన తన యజమానిని చూసి వెనుదిరిగాడు. కాని దుష్టబుద్ధి గల ఖరముఖుడు తన యజమానితో ఇలా అన్నాడు: . 17

ఖరముఖః-
ఐరావతం సమానీతం గజరత్నం మనోహరమ్ | అశ్వరత్నం చ తరవస్సన్తానాద్యాహృతాస్తథా | | ౧౮
ఖరముఖుడు
స్వామీ ! స్వర్గ లోకంలోని ఐరావతాన్ని, గుర్రాలను కల్ప వృక్షాలను అపహరించిన నీకు అసాధ్యం ఇంకొకటి ఉంటుందా18
విశేషం
ఐరావతం ఇంద్రుని ఏనుగు. ఇది సముద్రం నుంచి పుట్టినదని ఐతిహ్యం. (దీనిని ఐరావణం అని కూడా అంటారు)

స్త్రీరత్నం తస్య నృపతేస్సహాస్తే రాక్షసేశ్వర | తం వధిత్వా ప్రయత్నేన తాం స్త్రియం ప్రాప్స్యతే భవాన్ ||౧౯
రాక్షసులకు ప్రభువా! ఒక స్త్రీ రత్నం ఆ రాజు వద్ద ఉంది. అతన్ని చంపి ఆ స్త్రీని నువ్వు పొందు. 19

అథవా తమవిజ్ఞాయ స్త్రీరత్నం లాఘవాద్ధర | స హీనః కాన్తయా రాజా ప్రాణాంస్త్యక్ష్యతి కాననే || ౨౦
లేకుంటే ( అనగా యుద్ధం చేయకుండా) అతనికి తెలియకుండా మోసంతో ఆ స్త్రీ రత్నాన్ని అపహరించు. తన ప్రియమైన స్త్రీని కోల్పోయిన రాజు అడవిలో తన జీవితాన్ని వదులుకుంటాడు 20

ఇతి శంసతమత్యన్తముద్ధతం నిజసేవినమ్ | రాక్షసః కృపయావిష్టః పశ్యన్ వచనమబ్రవీత్ || ౨౧

ఆ విధంగా మాట్లాడిన సేవకుడయిన ఖరముఖుని కుంభోదరుడు మెచ్చుకున్నాడు. దయతో అతనిని చూసి ఇలా అన్నాడు. 21

కుమ్భోదరః

సాధూదితం త్వయా వత్స నృశంస గుణశాలినా । ఛద్మనా వ్యాహృతం సర్వం దశాస్యేన యథా మయా ॥ ౨౨

కుంభోదరుడు

నా ప్రియ కుమారుడా! , నీవు, నీతిమంతుడివి అయినందున, బాగా మాట్లాడావు. నేను రావణునిలా పది ముఖాలతో అన్ని ఉపాయాలు కప్పి పుచ్చుతూ ఎలా మాట్లాడుతానో అలా మాట్లాడావు. . 22

ఇదానీం తం రణే హత్వా సామాత్యం సపరిచ్ఛదమ్। తతో హరిష్యే సుశ్రోణీ తస్య రాజ్ఞస్తపస్వినీమ్ ॥ ౨౩

ఇప్పుడే యుద్ధంలో అతనిని మరియు అతని మంత్రులు పరిచారకులతో చంపుతాను. అప్పుడు నేను అందమైన ఆ తపస్వి అయిన రాజు యొక్క అందమైన స్త్రీని అపహరిస్తాను 23

బ్రహ్మ

ఇతీరయన్ క్రోధవశంగతోస్తౌ పార్శ్వే మహామాత్యసుతాన్ సమీక్ష్య ।

సహాయక్లృప్తాన్ హయసాదియుక్తాన్ రక్షోధిపో యుద్ధపదాభిలాషీ ॥ ౨౪

బ్రహ్మ

ఈ మాటలు మాట్లాడుతూ కుంభోదరుడు తన పక్కన ఉన్నమహా మంత్రి కుమారుల వైపు చూశారు. ఆ ఇద్దరు మంత్రి కుమారులు గుర్రాలు మరియు ఇతర జంతువులతో కలిసి ఉన్నారు. యుద్ధము కొరకు కోరిక కలిగిన ఆ కుంభోదరుడను రాక్షసరాజు వారితో ఇలా అన్నాడు. 24

హేఽమాత్యతనయా యూయం సన్నద్ధా భవతాహవే । తం విజిత్య వరారోహాం సమాహరత శీఘ్రతః ॥ ౨౫

మంత్రి కుమారులారా ! మీరు మీ యుద్ధానికి సిద్ధంగా ఉండండి. ఆ ఇంద్రద్యుమ్నుని ఓడించి త్వరగా అతని భార్యను ఎత్తుకొనిరండి.

శాసనం భర్తురాలభ్య శశ్వదాహవలాలసాః । సోత్సాహం ప్రణమన్తస్తే భర్తారమిదమబ్రువన్ ॥౨౬

మంత్రి కుమారులు కుంభోదరుని ఆజ్ఞ నెరవేర్చ డానికి నిత్యం ఆసక్తిగా ఉంటారు. అందుకే ఉత్సాహంతో తమ రాజుకు నమస్కరించి ఈ మాటలు చెప్పారు.

అమాత్యపుత్రాః

అత్రైవావస్థితస్స్వామిన్ విజయం త్వముపేష్యసి। గత్వా తస్య వరారోహామాహరిష్యామహే వయమ్ ॥౨౭

మంత్రుల కొడుకులు

, ఓ ప్రభూ ! మీరు ఇక్కడే ఉండండి. మీకు  విజయం లభిస్తుంది. మేము వెళ్లి అతని అందమైన   భార్యని  తీసుకువస్తాము.27

బ్రహ్మ-

ఇత్యమాత్యతనూజాస్తే వహ భర్తృశాసనమ్ । రథానారురుహుశ్శీఘ్రం ఖరవాజినియోజితాన్ ॥౨౮

బ్రహ్మ-

ఆ విధంగా చెప్పి  ఆ మంత్రి కుమారులు తమ ప్రభువు ఆజ్ఞను  వెంటనే అమలు చేసారు. వారు త్వరగా గాడిదలు మరియు గుర్రాలు లాగే  తమ రథాలను ఎక్కారు 28

స్యన్దనాగ్రే తు తేషాం వై శ్యేనాశ్శతసహస్రశః । స్వైరమారురుహుః కేచిత్ కుర్వతే చ పరిభ్రమమ్ ॥ ౨౯

అయితే వారి రథాల తలలపై వందల వేల గద్దలు  కూర్చున్నాయి. గద్దలు, రాబందులు మొదలైన మాంసాన్ని భక్షించే పక్షులు వారి రథాలపై అప్రదక్షణంగా ఎగిరాయి..( దుశ్శకునాలు జరిగాయని భావం) 29

రథానాం పరితో వృష్టిం పాంసురూపాం పయోముచః । అవర్షన్త తథా తేషాం ప్రథమం భయశంసనః ॥౩౦

రథములపై మేఘాలు  ధూళి రూపమైన వానను కురిపించాయి. ఈ విధంగా వర్షం కురిపించి  ప్రకృతి   ప్రథమ భయ ప్రకటన చేసింది.  కలిగించింది.

ఝంఝూవాతస్య నిర్ఘోషో వజ్రస్య చ మహర్షయః । పపాత చ పురో భాగే తేషాం మన్త్రితనూభువామ్ ॥ ౩౧

మంత్రి కుమారుల ముందు గొప్ప గాలివానతో  పిడుగుల శబ్దంతో  వాతావరణం భయాకులమైంది. 31

తతస్తే తానవజ్ఞాయ ఉత్పాతాన్ మన్త్రిణస్సుతాః । నగర్గా నిర్యయుస్తస్య త్రిభాగబలసంవృతాః ॥ ౩౨

ఈ ఉత్పాతములను  మంత్రికుమారులు  లెక్కచేయలేదు. తమ బలములో మూడవ భాగము సైన్యము  వెంట రాగా పురమునుండి బయలుదేరారు. 32

విశేషము

ఉత్పాతము అనగా  అపశకునము. ఇది త్రివిధము. - దివ్యము, అంతరిక్షము, భౌమము అని. దివ్యము - అపూర్వ గ్రహనక్షత్రములు పుట్టుట. అంతరిక్షము - పరివేషము ఇంద్రధనుస్సును కలుగుట, కొఱవియు పిడుగును పడుట. భౌమము - అపూర్వములైన చరాచరవస్తువులు కలుగుట. ఇవి దుఃఖరోగప్రదములు.)

అథ రక్షోమన్త్రిసుతాన్ సమరాజిరధిష్ఠితాన్। అవలోక్య మహీపాలో జహర్ష చ ననాద చ ॥ ౩౩

యుద్ధ భూమికి వచ్చిన రాక్షస మంత్రి కుమారులను చూసి రాజు సంతోషించి గర్జించాడు..33

నానద్యమానే భూపాలే సమరాఙ్గణసీమని । క్రోధమాహారయామాసురట్టహాసం చ తే సుతాః ॥౩౪

యుద్ధమునకు సిద్ధమయి నినదిస్తున్న ఇంద్రద్యుమ్నుని చూసి  రాక్షసులయిన మంత్రి  కుమారులు కోపోద్రిక్తులైనారు . మరియు వారు  బిగ్గరగా ధ్వని చేస్తూ  నవ్వారు.  34

తే క్రోధవశమాపన్నా యుగపన్నృపతిం తథా । ఆవవ్రురభితస్తస్య రథపృష్ఠమసృక్ప్రభాః ।।౩౫

వారు కోపంతో మరియు ఏకకాలంలో రాజుపై దాడి చేసారు.వారు రాజు రథమునుచుట్టివేసారు.

తేషాముజ్జృమ్భణం దృష్ట్వా రాజా రోషవశానుగః। మణ్డలీకృతచాపస్తు జ్యారవైస్తానపూరయత్ ।।౩౬

వారు విజృంభణ చూసి రాజు కోపంతో వారిని అనుసరించాడు.వృత్తాకారంలో ఉన్న విల్లును వంచి వింటినారితో ధ్వని చేసాడు.

తస్య జ్యాశబ్దమసహా రథానున్ముచ్య వాజినః। దిశో దశ పలాయన్తో నాద్యాపి స్వాస్థ్యమాసతే ।। ౩౭

ఆ నారి శబ్దమును సహించలేని వారై మంత్రిసుతుల గుర్రములు  రథములను వదలి పది దిక్కులకు పారిపోయాయి.   అవి కోలుకోలేకపోయాయి..37

పదిదిక్కులు

1.తూర్పు, 2. పడమర, 3. ఉత్తరము, 4. దక్షిణము, 5. ఐశాని, 6. నైరృతి, 7. వాయవ్యము, 8. ఆగ్నేయము, 9. ఊర్ధ్వదిశ, 10. అధోదిశ [ఇంద్రుడు, వరుణుడు, కుబేరుడు, యముడు, శివుడు, నిరృతి, వాయువు, అగ్ని, బ్రహ్మ, శేషుడు-వీరు క్రమముగా దశదిశలకు అధిపతులు].

శస్త్రాణి జగతుస్తేషాం పాణిభాగాత్ తరస్వినామ్। బధిరా ఇవ రక్షాంసి తే ముహూర్త చకమ్పిరే ।। ౩౮

రాక్షస వీరుల చేతులనుండి ఆయుధాలు అప్రయత్నంగానే జారిపడ్డాయి. ఒక్క క్షణం రాక్షసులు చెవిటివారిలా వణికిపోయారు. వారు ఏమి చేయాలో తోచక నిశ్చేష్టులయ్యారు 38

క్షణాత్ ప్రబుద్ధమనసస్సచివాత్మభువస్తదా । గృహీతకార్ముకాశ్చాన్యాన్ వాజినో యుయుజ్ రథే ।।౩౯

క్షణములో తెలివిపొంది  అస్త్రములను రథములను, గుర్రాలను  ఆ మంత్రి కుమారులు తిరిగి   స్వీకరించి యుద్ధము చేసారు.

ఏక లలాటే ద్వే శీర్ష్ణ త్రీణి కణ్ఠే రథోరసి । చతురో భుజయోశ్చైతే ముముచుస్సాయకాన్ శితాన్ ।। ౪౦

రాజు నుదుటిపై ఒక  బాణము, తల పై రెండు, కంఠములో మూడు, వక్షస్థలములో  మూడు, భుజములలో  నాలుగు బాణములువదలి ఆ మంత్రిసుతులు అట్టహాసము(ధ్వనితో కూడిన పెద్ద నవ్వు)  చేసారు.40

విముచ్య శరవర్షాణి తదా తే మన్త్రిణస్సుతాః । అట్టహాసం ప్రకుర్వన్తః సమరే రోమహర్షణమ్ ।।౪౧

అలా  మంత్రి కుమారులు రాజు సైన్యంపై  బాణాల వర్షం కురిపించారు . ఒళ్ళు గగురుపొడిచేటట్లు వారు యుద్ధంలో బిగ్గరగా నవ్వారు.

విజయీ భవితా స్వామీత్యుచ్చైర్వ్యాజహురాహవే । తాన్ మన్త్రిసుతనిర్ముక్తశ్శైఘ్రుగ్రైః కఙ్కపత్త్రిభిః ।।౪౨

తమ యజమాని కుంభోదరుడు   విజయం సాధిస్తాడని మంత్రి కుమారులు బిగ్గరగా అరిచారు. మంత్రి సుతులచే విడువబడిన బాణములు రాజును గాయపరిచాయి.

రూషితోఽవ్యలసద్రాజా జాతపత్ర ఇవ ద్రుమః । స రాజా సమరశ్లాఘీ తాననాదృత్య వేగతః ॥౪౩
బాణపు దెబ్బలచే ఇంద్రద్యుమ్నుడు  ఎర్రని చిగురుటాకులు మొలచిన చెట్టులా ఉన్నాడు.అయినా  రాజు  మంత్రి సుతులచే విడువబడిన బాణములను  లెక్కపెట్టలేదు.
ప్రహర్తుమేకం జగ్రాహ శస్త్రం మన్త్రిసుతాన్ ప్రతి । ఉద్దిశ్య కేతూనుద్వీవాన్ హయాన్ సారథినస్తథా । । ౪౪
వేగంగా వారిపై   ఒక శస్త్రమును ప్రయోగించాడు.  కేతువులా మెడలు పైకెత్తిన  గుర్రాలపై , రథసారథులపై కూడా శస్త్ర ప్రయోగము చేసాడు. 44

ముచ్యమానాశ్శరాస్తేన శితాగ్రా గగనాన్తరే । రేజిరే రాహవ ఇవచ్ఛాదయన్తో రిపూదయమ్ ॥౪౫
రాజు మంత్రి సుతులపై ప్రయోగించిన పదునైన   బాణాలు ఆకాశంలో శత్రువుల ఆవిర్భావాన్ని కప్పి ఉంచిన రాహుగ్రహముల వలె ప్రకాశించాయి.

తతస్తే మన్త్రితనయా వీక్ష్య వేగవతశ్శరాన్ । దుర్నివారాన్ శరైస్తీక్ష్ణై ర్నాలం వారయితుం తదా ॥౪
పదునైన బాణాలతో అజేయమైన, తీక్షణమైన  రాజ బాణాలను ఆపడానికి  మంత్రి కుమారులకు  శక్యం కాలేదు.

న తత్ర వాజినస్సంఖ్యే రథినో నైవ కేతవః । న మన్త్రితనయా నాపి భటా దదృశిరే తథా ॥౪౭
రాజ బాణపరంపరని అడ్డుకునేంత   సంఖ్యలో  మంత్రి కుమారులకు  గుర్రాలు లేవు.  రథసారధులు లేరు. మంత్రి కుమారులు, వారి సైనికులు   రాజును చూడలేక పోతున్నారు. (అంతగా రాజు యుద్ధంలో విజృంభిస్తున్నాడని భావం) 47

కేవలం దదృశే యుద్ధమూర్ధని వ్యగ్రచేతసామ్ । వ్యూహేఽమాత్యభువాం తత్ర కఙ్కగోమాయులుణ్ఠితః । । ౪౮
వారు  యుద్ధభూమిలో ఆందోళన చెందుతున్న మనస్సులను మాత్రమే చూసారు. (అంతా అల్లకల్లోలమయిందని భావం) రాబందులు నక్కలు సంచరించు యుద్ద భూమి ఏర్పడింది. 48
ఏతస్మిన్నన్తరే దేవాస్సర్షిసఙ్ఘాస్సచారణాః । పుష్పవృష్టిం ప్రముచ్యన్తస్సాధు సాధ్వితి సజ్జగుః ॥ ౪౯
ఇంతలో దేవతలు, ఋషులు, చారణులు(దేవతాభేదము.) సేనలు పూల వర్షం కురిపించి, 'బాగా చేసారు, బాగా చేసారు' అని రాజును ప్రశంసించారు. 49
అథ తాన్ సఙ్గరే దృష్ట్వా యమక్షయముపేయుషః। పునర్యుద్ధాభికాఙ్క్షీ స యుగాన్తానలసన్నిభః ॥౫౦
అప్పుడు, యుద్ధంలో చనిపోయిన వారిని చూసి, మిగతావారిలో కొంతమంది భయపడుతూ  యమ నివాసానికి చేరుకున్నారు.. మళ్లీ యుద్ధం చేయాలనే కోరికతో నిలబడిన రాజు యుగాంతంలోని అగ్నిలా కనిపించాడు 50

ఖాచ్చ్యుతైః ప్రసవై రాజా రఞ్జితో వ్యరుచత్తదా । నక్షత్రమాలాభరణస్సుమేరురివ మూర్తిమాన్ ॥ ౫౧
నక్ష్రమాలల చేత అలంకరింపబడిన మేరు పర్వతము వలె, ఆకాశము నుండి పడిన పుష్పముల చేత రాజు ప్రకాశించాడు.

. 51

ఆలస్యమస్య నైవాసీద్యుద్ధరఙ్గే మహాత్మనః । విష్ణోరంశావతారస్య నాభజజ్జడిమా హృది ॥ ౫౨

. విష్ణువు అవతారపు అంశ అయిన , మహానుభావుడు అయిన ఇంద్రద్యుమ్నుడు ఏనాడు యుద్ధభూమిలో పోరాటానికి ఆలస్యము చేయలేదు. అతని హృదయంలో జడత్వపు ధ్వని లేదు.

పుష్పరాశి స్యన్దమాన మరన్దరస రూషితః । ఇన్ద్రద్యుమ్నో జహౌ జాడ్యం స తదా రణమూర్ధని ॥ ౫౩

దేవతలు కురిపించిన పూలనుండి స్రవిస్తున్న మకరందముతో అలంకరించబడిన ఇంద్రద్యుమ్నుడు యుద్ధరంగంలో తన జడత్వాన్ని విడిచిపెట్టాడు53

యుగావసానసమయే శూలపాణిరివ స్థితః । తదన్తరే నాలమాసన్ భూతాని ద్రష్టుమాహవే ॥౫౪

యుగాంతంలో శూలపాణిలా(త్రిశూలము చేతిలో కలవాడు. శంకరుడు) ఇంద్రద్యుమ్నుడు చేతిలో ఈటెతో నిలబడ్డాడు. ఈలోగా యుద్ధంలో చూడడానికి ప్రాణులు లేవు 54

అవశిష్టాస్తు క్రవ్యాదాస్తద్దయామోచితాస్తదా । రాజానమబ్రువన్నేవం సప్త మన్త్రిసుతా హతాః ॥ ౫౫

ప్రాణాలతో మిగిలిన రాక్షసులు ఇంద్రద్యుమ్నుని దయకు అర్హులయి, ప్రాణాలతో రక్షింపబడి పారిపోయారు. "ఏడుగురు మంత్రి కుమారులు చంపబడ్డారని వారు కుంభోదరునికి చెప్పారు 55

శ్రవణకటువచస్తదా నిశమ్య స్వకసచివాత్మజలోపభావలక్ష్యమ్ ।

మంత్రి కుమారులు లేరను బాధాకరమైన ఆ వచనములను విని ఆ రాక్షస రాజు బాధపడ్డాడు..

హృదయవికలకర్తరిప్రధీరస్సదసి చుకోప స రక్షసామధీశః ॥ ౫౬

సభలో ధైర్యంగా ఉన్న రాక్షస స్వామి కుంభోదరునికి గుండె చెదిరి పోయి , కోపం వచ్చింది 56

స ముహూర్తమివ స్థిత్వా తూష్ణీం సర్ప ఇవ శ్వసన్ । ఉద్యమ్య భుజముద్గీవో వచనం చేదమబ్రవీత్ ॥౫౭

ఊపిరి పీల్చుకుంటూ ఒక్క క్షణం కుంభోదరుడు మౌనంగా నిలబడ్డాడు. . తరువాత పామువలె నిట్టూర్చి ఇలా అన్నాడు. 57

హే మహామాత్య తేజస్విన్నితో యామి సమిద్భువమ్। క్షణేన హత్వా తం పాపమానయే తస్య భామినీమ్ ॥ ౫౮

ఓ మహా మంత్రీ ! నేను యుద్ధానికి వెళ్తున్నాను. నేను ఆ పాపాత్ముడిని క్షణంలో చంపి అతని అందమైన భార్యను తీసుకువస్తాను 58

యాతూద్వహమితి వ్యక్తముక్తవన్తముదారధీః । మహామాత్యస్సదోమధ్యే వారయన్నిదమబ్రవీత్ ॥౫౯

యుద్ధానికి వెళతాను అని చెప్పిన కుంభోదరుని సభ మధ్యలో ఉన్న మహా మంత్రి ఆపి ఇలా అన్నాడు.

అస్యతామ్బవతాత్రైవ స్వామిన్ తవ బలాన్వితః| అహమేకో గమిష్యామి వారయిష్యే ద్విషద్బలమ్ ||౬౦

ఓ స్వామీ , మీ బలంతో మీరు ఇక్కడే ఉండండి. నేను ఒంటరిగా వెళ్లి శత్రు సేనలను అడ్డుకుంటాను. 60 ||

ఇతి గదితవతీహ మన్త్రివర్యే త్రిదశపతేరిపురేష రాక్షసేన్ద్రః |
ధృతకనకకృతే నవాఙ్గదే ద్వే శ్రవణవిభూషణమప్యదాదముష్మై || ౬౧

అని చెప్పిన శ్రేష్ఠ మంత్రికి , దేవతలకు శత్రువైన కుంభోదరుడను ఆ రాక్షసుల ప్రభువు బంగారంతో చేసిన రెండు బంగారు చెవి పోగులను, ఆభరణాలను, కొత్త కవచాన్ని ఇచ్చాడు. 61 ||

కుణ్డలద్వయమృష్టోరుశ్రవణో మన్త్రిసత్తమః | పుష్పవద్భ్యామివాకాశో విరరాజ రథోత్తమే || ౬౨

శ్రేష్ఠమైన రథముపై ఆకాశపు పుష్పముల వలె ప్రకాశిస్తున్న శుద్ధమైన రెండు చెవిపోగులు ధరించి ఆ మంత్రి వర్యుడు ఇంద్రద్యుమ్నుని పైకి యుద్ధానికి బయలుదేరాడు. 62

ఇతి బ్రహ్మకైవర్త ఉత్తరఖణ్డే భృగుపరాశరసంవాదే ఘటికాచలమాహాత్మ్యే చతుర్థోఽధ్యాయః ||

బ్రహ్మకైవర్త పురాణంలోని ఉత్తరఖండంలో ఉన్న భృగుపరాశరసంవాదంలో ఉన్న ఘటికాచల మాహత్మ్యంలోని నాలుగవ అధ్యాయము సమాప్తము

శ్రీ శివాయ గురవే నమః

ఘటికాచలనివాసాయ శ్రీ నృసింహాయ నమః

## బ్రహ్మకైవర్త పురాణములో ఉన్న శ్రీఘటికాచల మాహాత్మ్యపు అయిదవ అధ్యాయము

(మూల శ్లోకము మరియు తాత్పర్య విశేషాలతో)

శ్రీపరాశరః

పదే పదే ఽమృతస్యన్ది మనోహరమనుత్తమమ్ | ఇతి బ్రువాణమ్ బ్రహ్మాణమబ్రువన్నృషయస్తథా || ౧ ||

శ్రీ పరాశరుడు-

"అడుగడుగునా అమృతము కురిపిస్తూ మనోహరమైన అద్వితీయమైన కథ చెబుతున్నారు."అని బ్రహ్మదేవుని ఋషులు పొగిడారు . 1

ఋషయః –

బ్రహ్మన్ హనుమతశ్చక్రమ్ కదా వా సమరాఙ్గణే | భుజద్వయమ్ చ పూర్వస్మాద్దత్తమిత్రానుజన్మనా || ౨ ||

|| ఋషులు:

ఓ బ్రహ్మదేవుడా ! నరసింహస్వామి యుద్ధభూమిలో హనుమంతునికి తన ఆయుధాలైన శంఖచక్రాలను ఎప్పుడు ఇచ్చాడు?

నృహరేరస్య సన్తోషస్తస్మిన్నావిరభూత్ కథమ్ । సర్వమ్ నో వదతామ్ శ్రేష్ఠ విస్తరేణ ప్రశమ్స వై ॥ ౩ ॥

నరహరికి రాక్షసుల పట్ల సంతృప్తి ఎందుకు కనిపించలేదు?( అనగా నరసింహస్వామి రాక్షసులపై కినుక ఎందుకు వహించాడు అని ప్రశ్న ) ఉత్తమమైన ఈ కథను , దయచేసి మాకు ప్రతి అంశంతో వివరంగా వివరించండి. 3 ॥

బ్రహ్మ –

రక్షసామ్ కాలకేయానామ్ తస్మిన్నేవ మహారణే । జయాయ నృపతేరిన్ద్రో హ్యస్తౌషీన్నృహరీశ్వరమ్ ॥ ౪ ॥

బ్రహ్మ చెబుతున్నాడు

కాలకేయ రాక్షసులతో జరిగే ఆ మహా యుద్ధంలో స్వర్గపు రాజు అయిన ఇంద్రుడు, తన విజయము కొరకు భగవంతుడు నరహరిని ఇలా స్తుతించాడు. 4

ఇన్ద్రః –

ఇంద్రుడు చేసిన నరహరి స్తుతి

ప్రసీద జగతామ్ నాథ భగవన్నృహరే హరే । పరిపాలయ సర్వన్నః పరిపన్థికులమ్ జహి ॥ ౫ ॥

ఇంద్రుడు:

ఓ నరసింహస్వామీ ! సర్వలోకాలకు ప్రభూ ! దయచేసి నన్ను కరుణించు. మమ్ములందరిని రక్షించుము .మరియు శత్రువుల వంశమును చంపుము. 5 ॥

ధర్మార్థకామమోక్షాణామ్ ప్రదాతా భగవాన్ భవాన్ । త్వమ్ యజ్ఞస్త్వమ్ వషట్కారః త్వమ్ బ్రహ్మ త్వమ్ ప్రజాపతిః ॥ ౬ ॥

ఓ నరసింహస్వామీ ! నువ్వు భగవంతునివి. సర్వోన్నత వ్యక్తివి. నువ్వు ధర్మము, సంపద, కోరిక మరియు ముక్తిని ఇచ్చేవాడివి. నీవు యజ్ఞస్వరూపునివి, నీవే వషట్కారస్వరూపునివి. నీవే బ్రహ్మవి, నీవే ప్రజాపతివి. 6 ॥

విశేషాలు

అగ్నిలో హవిస్సులు వేసేటప్పుడు "వషట్" అనే శబ్దాన్ని ఉచ్చరిస్తారు. దీనినే వషట్కారము అంటారు. హోమము చేసేటప్పుడు ఈ పదమును చెబుతారు. హవిస్సు అంటే అగ్నిహోత్రమునందు వేల్చుటకు ఇవురబెట్టిన యన్నము; నెయ్యి.

స్వాహా, స్వధా శబ్దాల వలెనే వషట్ కూడా పరమేశ్వర వాచకం. వషట్ అన్నప్పుడు హోత/ ఋత్విక్కు వాక్ ప్రాణాపానాలు శరీరం నుంచి వెలుపలకు వస్తాయి. కనుక వాక్ ప్రాణాపానాలు తనలోనే సుఖంగా ఉండాలని ప్రార్థిస్తూ "వాగోజః సహ ఓజోమయి ప్రాణాపానో" అనే మంత్రాన్ని చదువుతారు. హోత/ ఋత్విక్కు తన ఓజస్సు, సహస్సు తగ్గకుండా తీసుకొనే జాగ్రత్త ఇది. ఓజస్సు, సహస్సు వషట్కారానికి రెండు అంశలు. (సహః అంటే బలిమి, ఓర్పు అనే అర్థాలు ఉన్నాయి.)

త్వమ్ వేద్యో వేదవిద్భిస్త్వమోఙ్కారస్త్వమసీశ్వర । సృష్టిస్థితిలయాదీని కృత్యాని భవతి ప్రభో ॥ ౭ ॥

ఓ నరసింహస్వామీ ! నువ్వు తెలుసుకొనదగినవాడివి. వేదములు తెలిసినవాడివి. నువ్వు ఓంకార స్వరూపునివి. పరమేశ్వరుడవు నీవు. నీ వలననే సృష్టి, స్థితి సంహారం యొక్క అన్ని కార్యకలాపాలు జరుగుతాయి. 7 ||

స్థితిభాక్షేతి విద్వాంసో బ్రువన్తి బ్రహ్మవాదినః | త్వమ్ తేజస్వీ త్వమోజస్వీ త్వమ్ వర్చస్వీ త్వమీశితా || ౮ ||

గమనాగమములు లేనిది, లేకుండా ఉండునది అయిన స్థితిని పొందినవాడివి; న్యాయ మార్గము పొందినవాడివని .విద్యావంతులు మరియు బ్రహ్మవాదులు( బ్రహ్మయే సత్యము అను వేదాంతులు) నీ గురించి చెబుతారు. నువ్వు తేజస్వివి.( తేజస్సు కలవాడు. సూర్యుడు.) ఓజస్వివి. (పరాక్రమము కలవాడు) వర్చస్వివి. (రూపము , తేజస్సు గలవాడివి) . నువ్వు అష్టైశ్వర్యసంపన్నత్వముకలవాడివి. 8 ||

షణ్ణామపి రిపూణామ్ త్వమూర్మీణామపి బోధకః | కల్పాదౌ యోగ నృహరే పాల్యన్తే భవతా ప్రజాః || ౯ ||

1. ఆకలి, 2. దప్పి, 3. శోకము, 4. మోహము, 5. జర, 6. మృత్యువు అను ఆరురకాల శత్రు రూపములగు ఊర్ముల గురించి జీవులకు జ్ఞానము నిచ్చువాడివి. ఓ యోగ నరసింహా ! కల్పాదిలో (ప్రపంచం యొక్క సృష్టి ప్రారంభమైనప్పుడు కల్పం యొక్క ప్రారంభం) నువ్వు ప్రజలను పాలిస్తావు.

విశేషాలు

ఊర్మి అంటే అల, నొప్పి, ప్రకాశం, ప్రవాహం, వంకర మొదలైనవి సామాన్యార్థాలు.

పారమార్థికంగా ధర్మం, తత్త్వం అనే అర్థాలు ఉన్నాయి.

జీవి ధర్మాలను షడూర్ములు అన్నారు. ఆకలి, దప్పిక, దుఃఖం, మోహం, వార్ధక్యం, మరణం జీవి ధర్మాలు. ఇందులో ఆకలి దప్పులు ప్రాణధర్మాలు. దుఃఖం, మోహం మనస్సు ధర్మాలు. వృద్ధాప్యం, మరణం దేహధర్మాలు.09

తదన్తే రుద్రరూపేణ సమ్హ్రియన్తే ప్రజాస్తథా | సృజ్యన్తే బ్రహ్మరూపేణ పునశ్చ జగదీశ్వర || ౧౦ ||

సృష్టి కాలం ముగిసాక, ప్రజలను శివుని రూపంలో సంహరిస్తావు. విశ్వానికి ప్రభూ ! ప్రజలు మళ్లీ బ్రహ్మ రూపంలో నీచే సృష్టించబడతారు.10 ||

యచ్చ త్రిష్వపి వేదేషు ఏక ఏవ హి గీయతే | స త్వమ్ ప్రసన్నో దేవేశ పాహి భక్తానతన్ద్రితః || ౧౧ ||

మూడు వేదాలలో కీర్తించినది నీ ఒక్కరి గురించి మాత్రమే. దేవతలకు ప్రభూ ! నువ్వు మా పట్ల ప్రసన్నుడివి కమ్ము, దయచేసి నీ భక్తులను ఆలస్యం లేకుండా రక్షించు. 11 ||

స త్వమ్ తత్త్వమసి వ్యక్తోఽవ్యక్తాతీతస్త్వమేవ హి | యజ్ఞగోప్తా యజ్ఞవేత్తా యజ్ఞకర్తా త్రయీమయః || ౧౨ ||

ఓ నరసింహా ! నువ్వు సః ( హంసబీజమయిన విష్ణువువి) "తత్త్వమసి" మహావాక్యానికి అర్థానివి.నువ్వు వ్యక్తావ్యక్తానివి. నువ్వు అతీతునివి.( సత్వరజస్తమములను దాఁటినవానివి)

నువ్వు యాగాల రక్షకునివి. మరియు యాగాలను తెలిసినవాడివి. మరియు యాగాలు చేసేవాడివి 12 ||

విశేషాలు

తత్వ మసి

ఇది మహావాక్యములలో ఒకటి.

"మహావాక్యాలు నాలుగు. ఒకటి అయమాత్మా బ్రహ్మ . రెండు ప్రజ్ఞానం బ్రహ్మ . మూడు తత్వమసి . నాలుగు అహం బ్రహ్మాస్మి. వీటిలో మొదటి దానికి జీవుడు బ్రహ్మమేనని అర్థం. రెండవదానికి ఆ బ్రహ్మం కేవలం జ్ఞానస్వరూపమని అర్థం. మూడవ దానికి నీవు ఆ బ్రహ్మమేనని అర్థం. నాలుగవ దానికి నేను బ్రహ్మమే మరేదీ గాదని అర్థం. ఇలా నాలుగూ నాలుగు అర్థాలు చెబుతున్నట్టు కనిపిస్తున్నా అన్నిటికీ కలిసి ఒకే ఒక అర్థం. అది ఎలాగంటే బ్రహ్మమనేది కేవల జ్ఞానస్వరూపం. అందులో జ్ఞాత(తెలియువాడు) అయిన జీవుడూ జ్ఞేయమైన(తెలియదగినది) జగత్తూ- ఈ రెండు కొసలూ లయమయ్యాయి కాబట్టి ఆ జ్ఞానము అఖండం." అని పెద్దలు చెప్పారు.

వ్యక్త+ అవ్యక్తా

నరసింహ స్వామి వ్యక్త = వ్యక్తమైన అనగా కనబడే అవ్యక్త = అవ్యక్తమైన అనగా కనబడని రూపాలు కలిగినవాడు. వ్యక్తమైన దాన్ని 'కార్యం' అని, వ్యక్తం కాకుండా ఉన్నదాన్ని 'కారణం' అనీ అంటారు.

కళ్ళకు కనబడే 'పంచదార'- దాని వ్యక్త స్వరూపం అవుతుంది. కాని, దాంట్లో గుప్తంగా వుండే $C_{12}$, $H_{22}$ $O_{11}$అంటే, 12 కర్బన పరమాణువులు, 22 ఉదజని పరమాణువులు, 11 ఆమ్లజని పరమాణువులు కళ్ళకు కనబడవు కాబట్టి అవ్యక్త స్థితికి చెందినవవుతాయని పెద్దలు చెప్పారు.

త్వమేవ విశ్వమ్ బహుధా జాతమ్ యజ్ఞాయ తే చ యత్ | జాయమానమ్ చ సర్వమ్ యత్ త్వమ్ తత్కర్తాసి కేశవ || ౧౩ ||

అనేక విధాలుగా విశ్వాన్ని సృష్టించినది నీవే. ఓ కేశవా! పుట్టబోయే ప్రతిదానికి సృష్టికర్తవు నీవే 13 ||

ఓం సహస్రశీర్షా పురుషః | సహస్రాక్షః సహస్రపాత్ | స భూమిమ్ విశ్వతో వృత్వా | అత్యతిష్ఠద్దశాఙ్గులమ్ || ౧౪ ||

పురుషః = భగవంతుడు; సహస్రశీర్షాః = వేలాది శిరస్సులు గలవాడు; సహస్ర అక్షః = వేలాది కన్నులు గలవాడు; సహస్రపాత్ = వేలాది పాదాలు గలవాడు; సః = ఆయన; భూమిం = భూమిని; విశ్వతః = అంతటా; వృత్వా = వ్యాపించి; దశ అంగులమ్ = పది అంగుళాలు వ్యాపించి; అత్యతిష్ఠత్ = నిలబడ్డాడు.

భగవంతుడు వేలాది తలలు కలిగినవాడు, వేలాది కన్నులు కలిగిన వాడు, వేలాది పాదాలు కలిగినవాడు, ఈ భూలోకమంతా వ్యాపించి, హృదయాకాశములో పది అంగుళాలుగా నిలుస్తాడు.

విశేషాలు

ఇది పురుష సూక్తములోని మంత్రం. ఘటికాచల మాహాత్మ్యములోనికి ప్రవేశించినది. వేలాదిగా అనగా అనేకమని అర్థం.

కొండ, చెట్టు వంటివాటిని ఛాయాచిత్రం తీస్తున్నప్పుడు, అవి రూపంలో ఎంత పెద్దవైనా కెమేరాలోని ఫిల్మ్ (film) పరిమాణానికే కుదింపబడి ముద్రింపబడుతవి. అట్లే పరిమితిలేని భగవంతుడు ధ్యానసమయంలో హృదయాకాశాన పది అంగుళాల పరిమాణం గలవాడుగా కానవస్తాడని పెద్దలు వ్యాఖ్యానించారు.14 ||

పురుష ఏవేదగ్ం సర్వమ్ యద్భూతం యచ్చ భవ్యమ్ || ఉతామృతత్వస్యేశానః | యదన్నేనాతిరోహతి || ౧౫ ||

యత్ భూతం =ఇదివరకు ఏది ఉన్నదో; యత్ భవ్యం చ = ఇక ఏది జరుగనున్నదో; ఇదం = ఇప్పుడు ఏది కనబడుతున్నదో; సర్వం = ఈసమస్తం;పురుషః ఏవ = భగవంతుడే అని గ్రహించాలి; ఉత = మరియు; అమృతత్వస్య = మరణంలేని ఉన్నతమైన స్థితికి; ఈశానః = అధిపతియైనవాడు ఆయనే; యత్ = ఆ భగవంతుడు ; అన్నేన = ఈ జడ ప్రపంచాన్ని; అతిరోహతి = దాటిపోయినవాడు.

ఇదివరకు ఏది ఉన్నదో, ఇక ఏది జరుగనున్నదో, ఇప్పుడు ఏది కనబడుతున్నదోఈసమస్తాన్ని భగవంతుడే అని గ్రహించాలి; అమృతత్వస్య = మరణంలేని ఉన్నతమైన స్థితి మనకు అనుగ్రహించి అధిపతియైన ఆ భగవంతుడు ఈ జడ ప్రపంచాన్ని మించినవాడు.

విశేషాలు

పై దానితో పాటు ఇది కూడా పురుష సూక్తములోని మంత్రం. ఘటికాచల మాహాత్మ్యములోనికి ప్రవేశించినది.. 15 ||

వ్యక్తావ్యక్తగిరస్సర్వా వేదాద్యా వ్యాహరన్తి యమ్ । సతామ్ సర్వప్రదస్సత్యమ్ ప్రత్యగ్దృష్టిభిరీడ్యతే || ౧౬ ||

వేదాలతో మొదలయ్యే వ్యక్తమైన మరియు అవ్యక్తమైన పదాలు ఆయనను పలుకుతాయి. సత్పురుషులందరినీ ప్రసాదించే సత్యాన్ని ప్రత్యక్షంగా చూసినవారు అయనను పూజిస్తారు. 16 ||

పృథివ్యాదీని భూతాని స్థావరాణి చరాణి చ । త్వదేకవశగానీతి వ్యాహరన్తి మనీషిణః || ౧౭ ||

భూమితో మొదలుకొని చలించే మరియు కదలని అన్ని జీవులు నీచే సృష్టించబడ్డాయి. బుద్ధిమంతులు నీ అధీనంలో ఉన్నారని పెద్దలు చెబుతారు. 17 ||

ఋతగ్ంం సత్యమ్ పరమ్ బ్రహ్మ పురుషం పురుషమ్ కృష్ణపిఙ్గలమ్ | ఊర్ధ్వరేతం విరూపాక్షమ్ విశ్వరూపాయ వై నమో నమః || ౧౮ ||

ఋతం = కనబడే వస్తువులను అందంగా చూపిస్తూ ; సత్యం = దృశ్యానికి ఆధారంగా ఉన్నటువంటి; పరంబ్రహ్మ = శ్రేష్ఠమయిన బ్రహ్మాన్ని; పురుషం = ప్రతి శరీరం అంతటా నిండినవాడిని; కృష్ణపింగలమ్ = నల్లనిశరీరం కలిగిన విష్ణువు, తెల్లని శరీరం కలిగిన శివుడు ఒకరుగా కలిసిన రూపాన్ని; ఊర్ధ్వరేతం = పరిపూర్ణ పవిత్రుని ;విరూపాక్షం = మూడు కన్నులు కలిగినవానిని; విశ్వరూపాయ వై = సమస్తాన్ని తన రూపంగా గ్రహించినదేవుని; నమోనమః = పదే పదే నమస్కరిస్తున్నాను.

కనబడే వస్తువులను అందంగా చూపిస్తూ దృశ్యానికి ఆధారంగా ఉన్నశ్రేష్ఠమయిన బ్రహ్మాన్ని, ప్రతి శరీరం అంతటా నిండినవాడిని విష్ణు శివదేహాలు ఒకరుగా కలిసిన రూపాన్నిపరిపూర్ణ పవిత్రుని మూడు కన్నులు కలిగినవానిని సమస్తాన్ని తన రూపంగా గ్రహించినదేవునికి పదే పదే నమస్కరిస్తున్నాను.

విశేషాలు

ఇది నారాయణ సూక్తములోని మంత్రం. ఘటికాచల మాహాత్మ్యములోనికి ప్రవేశించినది.. 18 ||

త్వామామనన్తి బహుధా భగవన్తమనామయమ్ । దైత్యరాజమ్ వినిర్భిద్య హిరణ్యకశిపుమ్ పురా || ౧౯ ||

ఓ నరసింహా ! అనేక విధాలుగా నిన్ను దోషరహితుడైన పరమాత్మ అని పిలుస్తారు. గతంలో నువ్వు రాక్షసుల రాజు హిరణ్యకశిపుని ఓడించావు. 19 ||

ప్రహ్లాదమ్ హ్లాదయన్ దేవ యోగభావమ్ సమాస్థితః | సర్వేషామ్ కర్మణామ్ దేవ భువి వ్యాకుర్వతామ్ జనైః || ౨౦ ||

ఓ నరసింహా ! ప్రహ్లాద మహారాజును సంతోషపెట్టి, నీవు యోగస్థితిని పొందావు. నీ చర్యలన్నీ  భూమిపై ఉన్న ప్రజలచేత భూమిలో వ్యాపించాయి. . 20 ||

పర్వతాగ్రమధిష్ఠాయ పశ్యసి త్వమనాకులః | బ్రహ్మా - ఏవమ్ హి స్తూయమానస్తు దేవేన్ద్రేణ విపశ్చితా || ౨౧ ||

నరసింహా ! నువ్వు ఏమీ తొందరపడని స్వభావముతో స్థిరమైనవాడివై  పర్వతం పై ఉన్నావు.

బ్రహ్మా చెబుతున్నాడు

ఈ విధంగా దేవతలకు ప్రభువు,  శ్రేష్ఠమైన ప్రజ్ఞ కలవాడు; ప్రశస్తంగా ఆలోచించువాడు అయిన ఇంద్రునిచే నరసింహ స్వామి స్తుతించబడ్డాడు. 21

మిత్రతామ్ సర్వదేవానామ్ వ్యాజహార జనార్దనః | ఉదయన్నేవ భగవాన్ సనకాదినిషేవితః || ౨౨ ||

సనకాది మహర్షులు పూజించే జనార్దనుడయిన భగవానుడు దేవతలందరి ప్రభువయిన ఇంద్రుని మాటలు విని పలికాడు.

విశేషాలు

జనార్దనుడు

1. జనులు తమ అభీష్టమునకు ఇతనిని అర్థింతురు కనుక జనార్దనుడు. 2. దుష్ట జనమును చంపువాడు  కనుక జనార్దనుడు.

స పూరయన్నంశుజాలైరిన్దీవరపరమ్పరామ్ | ఇన్ద్రస్తుతిపరాధీన ఇన్దీవరవిలోచనః || ౨౩ ||

తామర పువ్వు వంటి కళ్ళు కలిగి, తన చూపుల కిరణ సమూహములతో    తామరపువ్వులను నింపుతూ  నరహరి ఇంద్ర స్తుతికి లోబడినవాడయ్యాడు. ( అనగా నరసింహస్వామి ఇంద్రస్తుతికి సంతోషించాడని, అతని చూపులు   తామరపువ్వుల వలె వికసించి ఉన్నాయని భావం)

నరకణ్ఠీరవో యోగీ తమిన్ద్రమిదమబ్రవీత్ |

శ్రీభగవాన్ –

ఆగమో జ్ఞాతపూర్వస్తే నిఖిలామరనాయక || ౨౪ ||

ఆ యోగ నరసింహ స్వామి  ఇంద్రునితో  ఇలా అన్నాడు.

ఓ దేవేంద్రా ! నీ రాకను, నీ రాకకు కారణాన్ని  ముందే తెలుసుకున్నాను . 24 ||

కిమత్ర కరణీయాని మమ శంస  రిపూన్ ప్రతి |

బ్రహ్మా –

ఇత్యుపశ్లోకితో రాజా దేవానామరిసూదనః ॥ ౨౫ ॥

శత్రువులకు వ్యతిరేకంగా నేను ఏమి చేయాలో చెప్పు ?

బ్రహ్మ –

అని కొనియాడబడిన శత్రు సంహారకుడయిన నరహరి దేవేంద్రుని అడిగాడు. 25

ప్రాహ ప్రసన్నగమ్భీరగీర్భిస్స నృహరీశ్వరమ్ ।

ఇన్ద్రః –

సహాయమిన్ద్రద్యుమ్నస్య కేనచిత్ కల్ప్యతామిహ ॥ ౨౬ ॥

ఉల్లాసమైన, లోతైన స్వరాలతో భగవంతుడయిన నరహరి ఇంద్రుని ప్రశ్నించాడు.

ఇంద్రుడు:

"ఇంద్రద్యుమ్నునికి సహాయము చేయాలి .

26 ॥

నిమిత్తమాత్రభూతోఽయమ్ రాజా కిన్ను జనార్దనః ।

బ్రహ్మే

- ఇతి సమ్బోధితో దేవో నృహరిశ్చిన్తయన్ క్షణమ్ ॥ ౨౭ ॥

"ఓ జనార్దనా ! ఈ ఇంద్రద్యుమ్న రాజు నిమిత్త మాత్రుడు."

అని ఇంద్రుడు చెప్పగా నరసింహస్వామి ఒక్క క్షణం ఆలోచించాడు. 27 ॥

విశేషాలు

ఈ నిమిత్త మాత్ర పదం మనకు భగవద్గీతను గుర్తుకు తెస్తుంది." ఓ సవ్యసాచీ, లెమ్ము, కీర్తిని పొందుము! శత్రువులను జయించుము మరియు సర్వసంపదలతో ఉన్న సామ్రాజ్యమును అనుభవించుము. ఈ యోధులు ఇంతకు పూర్వమే నా చే సంహరింపబడి ఉన్నారు, కేవలం నా పనిలో నిమిత్తమాత్రునిగా( ఒక పనిముట్టుగా) ఉండగలవు" అని కృష్ణుడు, అర్జునునికి చెబుతాడు. (11-33) నిజానికి భగవంతునికి తన పని యందు ఒకరి సహాయం ఏమీ అవసరం లేదు, కానీ మనుష్యులు ఆయన సంకల్పాన్ని నేరవేర్చటానికి పని చేస్తే అది వారికి నిత్య శాశ్వత సంక్షేమం కలిగిస్తుంది. భగవంతుని ప్రీతి కొరకు పని చేసే అవకాశాలు అనేవి, చాల చాలా అరుదుగా మనకు తారసపడే అనుగ్రహాలు. ఈ అవకాశాలను సద్వినియోగము చేసుకోవటం ద్వారానే భగవంతుని విశేష కృపకు మనము పాత్రులం అవ్వగలుగుతాము, మరియు మనం భగవత్ సేవకులుగా, మన యొక్క నిత్య శాశ్వత స్థాయి సాధించగలుగుతాము". అని పెద్దలు చెప్పారు. ఇదే పద్ధతిలో ఇంద్రద్యుమ్న మహారాజు నరసింహస్వామి చేతిలో పనిముట్టు. ఈ విషయము అందంగా ఈ "నిమిత్తమాత్ర పదం"లో చెప్పబడింది.

పురోభాగే హనూమన్తమ్ తిష్ఠన్తమ్ సన్దదర్శ హ ।

శ్రీభగవాన్ –

ప్రసన్నోఽహమ్ వరమ్ దాతుమాగతస్తేఽఞ్జనాసుత || ౨౮ ||

తన ఎదురుగా నిలబడిన హనుమంతుడిని నరసింహస్వామి చూసాడు.

పరమేశ్వరుడు నరసింహుడు  ఆంజనేయునితో ఇలా  అన్నాడు:

ఓ అంజన కుమారా!  నీకు ఒక వరం ఇవ్వడానికి వచ్చినందుకు నేను చాలా  సంతోషిస్తున్నాను. 28 ||

కృతమ్ త్వయా మహత్కర్మ హ్యవతారాన్తరే పురా | సర్వదా త్వత్సహాయేఽహమ్ రణకర్మణి కీర్తిమాన్ || ౨౯ ||

పూర్వం నీ అవతార కాలంలో నువ్వు ఒక గొప్ప కార్యం చేశావు. నేను ఎల్లప్పుడూ యుద్ధంలో నీ సహాయంతో ప్రసిద్ధి పొందుతుంటాను. 29 ||

ప్రతికల్పమ్ చ భవితా దశకన్ధరకర్మ తత్ | ఇతి విజ్ఞాయ చ పునరవతీర్ణ స్వరూపధృత్ || ౩౦ ||

ప్రతి కల్పములోను పది తలలు కలవాడయిన రావణుడు పుడుతుంటాడు.   ఇది తెలిసిన నేను మరలా అవతారం ఎత్తుతుంటాను. 30 ||

విశేషాలు

కల్పం

బ్రహ్మ యొక్క ఒక రోజు లేదా 1000 మహాయుగాలు, 432, 000, 000 సంవత్సరాలను కల్పం అంటారు.

అతో హనూమాన్ రుద్రాణామవతారస్త్వయా కృతః | ప్రార్థితో దైవతైరేభీ రణకర్మణి సర్వదా || ౩౧ ||

ఓ హనుమంతా ! నువ్వు రుద్రాంశ కలిగినవాడివి. యుద్ధమున దేవతలు ఎప్పుడూ  నిన్ను ప్రార్థిస్తుంటారు.  31 ||

ఇదానీమ్ తే వరమ్ దాతుమాగతో భద్రమస్తు తే | హనుమన్ మా కృథాశ్చిన్తామ్ వరమ్ వరయ సువ్రత || ౩౨ ||

ఓ హనుమాన్ ! ఇప్పుడు నేను నీకు ఒక వరం ఇవ్వడానికి వచ్చాను.  నీకు సకల శుభాలు కలుగుగాక.  ఏమీ చింతించకు. వరము వేడుకో 32 ||

బ్రహ్మ –

తమాకర్ణ్య తదా వాచమ్ హనూమాన్ ప్రశ్రితాఞ్జలిః | వరయామాస నృహరేర్వరమ్ పరిషదన్తరే || ౩౩ ||

బ్రహ్మ –

అది విన్న హనుమంతుడు వినయపూర్వకముగా  నరసింహ స్వామికి నమస్కరించి  పెద్దలసభ మధ్యలో, నరసింహస్వామిని ఇలా వరం అడిగాడు.

శ్రీ హనుమాన్ –

భగవన్నృహరే మూర్ధ్ని సర్వదా పదలాఞ్ఛితః | తథాపి శఙ్ఖచక్రాఙ్కకమ్ అభివాఞ్ఛామి శాశ్వతమ్ || ౩౪ ||

శ్రీ హనుమంతుడు –

ఓ నరహరీ ! నా  తలపై ఎప్పుడు నీ పాదముద్రలు ఉంటాయి.  అయినప్పటికీ, నేను నీ యొక్క శంఖం మరియు చక్రం యొక్క శాశ్వతమైన గుర్తులను కోరుకుంటున్నాను. 34

ఏష మే ప్రథమః కామః ఏష మే పుణ్యసఞ్చయః | ఇదమేవ చిరాద్భావ్యమ్ సత్యమ్ తదిదమీరయే || ౩౫ ||

ఇది నా మొదటి కోరిక మరియు ఇది నా పుణ్య సంచితము.  ఇది చాలా కాలంగా ఎదురు చూస్తున్న సత్యవిషయము. 35 ||

బ్రహ్మా –

తథాస్త్వితి ప్రతిజ్ఞాయ తస్మై దత్వా భుజద్వయమ్| శఙ్ఖమ్ శఙ్ఖాద్వినిష్కృష్య చక్రఞ్చక్రాచ్చ కేశవ || ౩౬ ||

బ్రహ్మా:

ఆంజనేయుని మాటలు విన్న వెంటనే “అలాగే” అని వాగ్దానం చేసి  కేశవుడయిన ఆ నరహరి  తన భుజముల నుండి  భుజములను,  శంఖము నుండి శంఖమును, చక్రమునుండి చక్రమును కల్పించి ఆంజనేయునికి ఇచ్చాడు. 36 ||

ఇదమ్ హోవాచ నృహరిర్హనూమన్తముపస్థితమ్ |

శ్రీభగవాన్ –

కర్మవృత్తమ్ మహత్ తత్ర పురతో ద్రోహిణామిహ || ౩౭ ||

ఆ తరువాత నరసింహస్వామి  హనుమంతుడు తనను  సమీపించగానే అతనితో ఈ మాటలు చెప్పాడు. “క్రూరులైన రాక్షసులు నా నరసింహ పురాన్ని  పాడుచేసారు.  37 ||

రక్షసామ్ కాలకేయానామ్ వధార్థమ్ యత్నమాస్థితః | ఇన్ద్రద్యుమ్నో మహారాజో హనూమన్నిష్ఠతే బలీ || ౩౮ ||

ఓ ఆంజనేయుడా ! కాలకేయులను రాక్షసులను చంపే ప్రయత్నం  ఇంద్రద్యుమ్న మహారాజు చేసాడు.  38 ||

బహోః కాలాత్తపస్తప్త్వా స రాజా సహ భార్యయా | బ్రాహ్మ్యమ్ లబ్ధుమ్ మహత్తేజో మదభ్యాశముపాగతః || ౩౯ ||

గొప్ప తేజస్సు కలిగిన ఆ  రాజు బ్రాహ్మమును(సద్గతిని)  కోరి చాలాకాలము తపస్సు చేసి  భార్యతో కలిసి  నా దగ్గరకు  వచ్చాడు. . 39 ||.

స దృష్ట్వా మత్పురమ్ భగ్నమ్ తైర్నృశంసైర్దురాత్మభిః | యోద్ధుకామో బలీ దుష్టైః ప్రస్థితః పావనో నృపః || ౪౦ ||

ఆ క్రూరమైన మరియు దుష్టులచే నా నగరం నాశనం చేయబడటం అతను చూడలేక దుర్మార్గులతో యుద్ధం చేయాలనుకుని ఆ శక్తిమంతుడు మరియు పవిత్రుడైన రాజు బయలుదేరాడు 40 ||

సహాయమ్ తస్య కురు వై త్వత్సహాయో జయిష్యతి | తస్మిన్ రాజనిమిత్తేఽద్య వర్తతే పవనాత్మజ || ౪౧ ||||

ఓ ఆంజనేయా ! నువ్వు ఆ రాజుకి  సహాయం చేయి. అతను నీ  సహాయంతో గెలుస్తాడు. ఆ రాజు కొరకే ఈరోజు నీకు  ప్రత్యక్షమయ్యాను. 41 ||

శ్రూయన్తే క్రోశతామ్ తేషామ్ రక్షసామ్ కూటయోధినామ్ | భేరీశఙ్ఖమృదఙ్గానామతినాదా భయఙ్కరాః || ౪౨ ||

ఇంతలో క్రోసెడు దూరములో ( సుమారుగా రెండు మైళ్ళ దూరములో) మాయా వేషధారణలో పోరాడుతున్న రాక్షసుల నుండి అరుపులు వినిపించాయి. భేరులు( నగారాలు), శంఖములు, మృదంగాల ధ్వనులు భయపెట్టాయి. 42 ||

యుద్ధములో ఇంద్రద్యుమ్న మహారాజుకు హనుమంతుని సహాయం

శీఘ్రమ్ గచ్ఛ సుదుర్ధర్షా వారయాశరపుఙ్గవాన్ |

బ్రహ్మా –

శిరస్యాఞ్జ లిమాదాయ శఙ్ఖచక్రాఙ్కితో బలీ || ౪౩ ||

"ఓ ఆంజనేయా ! జయించుటకు వీలులేని యోధుడా! నివారించుటకు వీలులేని  బాణసమూహములు కలిగినవాడా !  త్వరగా వెళ్ళు." అని నరహరి చెప్పగానే   ఆంజనేయుడు నరసింహ స్వామికి తలవంచి నమస్కరించి శంఖము మరియు  చక్రమును గ్రహించాడు.43 ||

నిష్క్రమ్య స గిరేశ్శృఙ్గముత్తరమ్ సముపస్థితః | భగవానపి విశ్వాత్మా ప్రీణయన్ సర్వదేవతాః || ౪౪ ||

ఆ తరువాత నరహరి పర్వత శిఖరం నుండి బయటకు వచ్చి ఉత్తరం వైపుకు చేరుకున్నాడు . ఈ విధంగా నరసింహ పరమాత్ముడు దేవతలందరినీ సంతోషపెట్టాడు. 44 ||

సనకాద్యైస్స్తూయమానస్తత్రైవాన్తరధీయత | ఇన్ద్రాద్యా అపి తే దేవాః ప్రణమ్య పురుషోత్తమమ్ || ౪౫ ||

సనకుడు మొదలయిన ఋషులు స్తోత్రం చేస్తుండగా నరసింహస్వామి  అక్కడి నుంచి అదృశ్యమయ్యాడు. ఇంద్రుడు మరియు ఇతర దేవతలు కూడా పురుషోత్తముడయిన ఆ స్వామికి  నమస్కరించారు. 45 ||

యుద్ధావలోకనపరాః ప్రాక్రమన్త నభస్థలమ్ | ఏతస్మిన్నన్తరే వాయోస్తనయస్తస్య శృఙ్గతః || ౪౬ ||

యుద్ధాన్ని చూడడానికి ఇంద్రాదులు  ఆకాశానికి చేరుకున్నారు. ఇంతలో వాయుపుత్రుడు పర్వతపు కొమ్ముపై ప్రత్యక్షమయ్యాడు. 46 ||

ఉత్థాయ చక్రముద్యమ్య జగర్జ స మహాబలః | శఙ్ఖమ్ చ దధ్మౌ రభసాత్ స్థాపితమ్ వదనాన్తరే || ౪౭ ||

బలవంతుడైన  ఆ హనుమంతుడు  లేచి తన చక్రాన్ని ఎత్తి గర్జించాడు.  గొప్ప శక్తితో తన నోటి మధ్య ఉంచిన శంఖాన్ని ఊదాడు. (పూరించాడు) 47 ||

ప్రధ్మాతశఙ్ఖమ్ తన్దృష్ట్వా కాలకేయాస్సహస్రశః | ముసలాన్ పట్టసాన్ గృహ్యా రురుధూ రణచత్వరే || ౪౮ ||

వేలకొలది కాలకేయాదులు ఆంజనేయుడు చేసిన శంఖనాదం విని ముసలము(రోకలివంటి ఆయుధము) గండ్రగొడ్డలి మొదలైన ఆయుధాలు ధరించి  యుద్ధభూమిలో దాడి చేసారు. 48 ||

తతో హనూమాన్ సమ్రబ్ధో ధ్మాతశఙ్ఖో మహాజవః | తేషామ్ రథానాముపరి నిపపాత రుషాన్వితః || ౪౯ ||

అప్పుడు హనుమంతుడు కోపోద్రిక్తుడయ్యాడు.  అతడు శంఖం చాలా వేగంగా  ఊదాడు. రోషముతో కూడిన  అతడు వారి రథములపైకి దూకి అటకాయించాడు.  49 ||

తేషాముపరి క్రుద్ధస్య పతనాత్తే హనూమతః । ఊరువేగేన మహతా పతితాః పృథివీతలే ॥ ౫౦ ॥
కాలకేయులపై కోపంతో హనుమంతుడు వారి మీదకు దూకాడు.  వారిలో కొందరిని అమిత వేగంతో నేలపై పడి పోయేటట్లు చేసాడు 50

కతిచిచ్ఛఙ్ఖశబ్దేన కతిచిద్దర్శనక్షణాత్ । నిపేతురవనీపృష్ఠే గృధ్రాణాముపరీకృతాః ॥ ౫౧ ॥
శంఖం ధ్వని ద్వారా కొత్తమంది, హనుమంతుని చూడటం చేత కొంతమంది నేలకూలారు. వారిని రాబందులు(పసుపుపచ్చగానుండే ముక్కు గలిగి చచ్చినగొడ్లను తినే పక్షులు) చుట్టుముట్టాయి. 51 ||.

తతో దృష్ట్వా హనూమన్తమ్ సానుమన్తమివ స్థితమ్ । ప్రతిసూర్యమివాకాశే దేవతా హర్షనిర్భరాః ॥ ౫౨ ॥
అప్పుడు పర్వత శిఖరములా , రెండో సూర్యునిలా ఉన్న హనుమంతుని చూసి ఆకాశంలో ఉన్న దేవతలందరూ సంతోషించారు.

జయీ భవేతి వాచమ్ వై వదన్తః ఖాస్థితాస్సురాః । పుష్పవృష్టిమ్ ప్రముముచుర్దున్దుభిధ్వానబృమ్హితామ్ ॥ ౫౩ ॥
దేవతలు ఆకాశంలో నిలబడి 'నీకు జయం కలుగుగాక' అని హనుమంతుని గురించి నినాదాలు చేసారు. నగారాల మోతతో  హనుమంతునిపై పూలవర్షం కురిపించారు. 53 ||

అథో హనూమాన్ హృష్టాత్మా పుష్పభారావపీడితః । వీక్ష్యమాణో జనైస్సర్వైస్సుపుష్పిత ఇవ ద్రుమః ॥ ౫౪ ॥
అప్పుడు హనుమంతుడు పుష్పాల భారంతో సంతోషించి పొంగిపోయాడు.  అందరూ నిండుగా పూలతో  వికసించిన చెట్టులా ఉన్న హనుమంతుని చూసారు 54 ||

పవనజవనభాజనో హనూమాన్ ప్రతినృహరీన్ద్రశిలోచ్చయస్తనూమాన్ । సమరభువి విజృమ్భమాణకర్మా పరిణత దిక్కరటీప్రభావమాప ॥ ౫౫
అద్భుతమైన వాయువేగము కలిగిన ఆంజనేయుడు నరసింహ పర్వతము వంటి  శరీరం కలవాడయి, యుద్ధభూమిలో పరాక్రమంతో విహరిస్తూ, కర్మ రూపాంతరం చెందిన  దిగ్గజ(దిక్కులయందుండుఏనుగు) ప్రభావాన్ని సాధించాడు.( అనగా అపరిమిత శరీర వైశాల్యంతో ఏనుగులా అందరిని నుగ్గు నుగ్గు చేసాడని భావం)  55 ||

స రామదూతేన తదా మరుద్భువా ప్రసహ్య రక్షోబలవిప్రమాథినా ।
మహారథస్సజ్యధనూరుమాపతే రుద్రస్య నన్దీభగవానివ స్థితః ॥ ౫౬ ॥

అప్పుడు రాముడి దూత అయిన వాయునందనుడు బ్రాహ్మణసమూహాలను పీడించిన రాక్షసులను ఓడించాడు. 11వేల విలుకాండ్రతో పోరాటము చేసే యోధునిగా ( మహారథిగా) గొప్ప రథం కలిగిన ఆ హనుమంతుడు బాణాలు సంధించే సమయంలో శివుని యొక్క నందీశ్వరునిలా యుద్ధంలో నిలబడ్డాడు 56 ||

ఇతి బ్రహ్మకైవర్తే ఉత్తరఖణ్డే భృగుపరాశరసమ్వాదే ఘటికాచలమాహాత్మ్యే పఞ్చమోఽధ్యాయః ||

బ్రహ్మ-కైవర్తంలోని ఉత్తరఖండంలో భృగువు మరియు పరాశరుని మధ్య జరిగిన సంభాషణలో ఘటికాచల మాహాత్మ్యంలో ఐదవ అధ్యాయం పూర్తి అయినది.

+++++

శ్రీ శివాయ గురవే నమః

ఘటికాచలనివాసాయ శ్రీ నృసింహాయ నమః

బ్రహ్మకైవర్త పురాణములో ఉన్న శ్రీఘటికాచల మాహాత్మ్యపు ఆరవ అధ్యాయము

(మూల శ్లోకము మరియు తాత్పర్య విశేషాలతో)

పరాశరః

ఋషయస్తు ప్రహృష్టాస్తే పవనాత్మజవైభవమ్ | ఆకర్ణయన్తో ధాతారమిదమూచురతన్ద్రితాః || ౧ ||

ఋషులు సృష్టికర్త బ్రహ్మ చెప్పిన ఆంజనేయుని యుద్ధ వైభవాన్ని విని ముగ్ధులయ్యారు. ఆ తరువాత తడబడకుండా ఇలా బ్రహ్మను అడిగారు. 1

ఋషయః

స్వామిన్ హనుమతస్తస్య తపస్థానమనన్తరమ్ | అవోచస్త్వమిదానీమ్ నో రోచతే సంగరశ్చ సః || ౨ ||

ఋషులు

స్వామీ ! ఆ హనుమంతుడు బాణాలు సంధించే సమయంలో శివుని యొక్క నందీశ్వరునిలా యుద్ధంలో నిలబడ్డాడని చెప్పారు కదా ! అది మహామాత్యునికి రుచించలేదు కదా ! తరువాత ఏమయింది? ||2 ||

బ్రహ్మ –

సంహర్తారమశేషాణామ్ క్రవ్యాదానామ్ దురాత్మనామ్ | అపాఙ్గయన్ హనూమన్తమ్ రాజా సముముచే తదా || ౩ ||

బ్రహ్మ –

దురాత్ములయిన , మాంసాన్ని తినే రాక్షసులను సంహరించిన వీరుడైన హనుమంతుని ఇంద్రద్యుమ్నుడు తన కడగంటి చూపులలో వినయం తొణికిసలాడుతుండగా గౌరవించాడు.

తథావిధమ్ చ నాసీరమ్ ప్రహర్తరి హనూమతి | పదే పదే వర్ధమానమ్ హర్షో రాజా వ్యజృమ్భత || ౪ ||

ఆ విధంగా యుద్ధభూమిలో రాక్షస సైన్యం వైపు అడుగులు వేస్తూ తన అరుపులు మరియు సంజ్ఞల ద్వారా శత్రువులను ధిక్కరిస్తూ అమోఘమైన యుద్ధం చేస్తున్న హనుమంతుడిని చూసి అడుగడుగునా రాజుకి ఆనందం బాగా పెరిగింది. 4 ||

అహో వీర్యమహో ధైర్యమహో బహుపరాక్రమః | దక్షమ్ హన్తుమ్ ప్రవృత్తస్య రుద్రస్యేవ ప్రదృశ్యతే || ౫ ||

"ఆహా ! నీకు ఎంత బలం, ఎంత ఓర్పు, ఎంత గొప్ప పరాక్రమం! దక్షుని సంహరించటానికి సిద్ధమయిన రుద్రునివలె ఉన్నావు. " అని రాజు హనుమంతుని ప్రశంసించాడు. 5 ||

ఇతి సంజగతుస్సర్వే సామరాస్సమరుద్గణాః | ఋషయోఽన్యోఽన్యమిలితా దివి సఙ్గరదర్శినః || ౬ ||

దేవతలు , మరుత్తులందరూ హనుమంతుని యుద్ధం చూసి చైతన్యవంతులయ్యారు. మహా ఋషులు యుద్ధం చూసేందుకు ఆకాశంలో గుమికూడారు. || 6 ||

అత్రాన్తరే మహేన్ద్రస్య భేరీశబ్దమసాసహః |కేచిదున్దుభిమాఘ్నన్తో నిర్యయుస్త్రిదశారయః || ౭ ||

ఉత్సాహముతో ఇంద్రుడు భేరీ శబ్దమును చేసాడు. రాక్షసులు దుందుభులను మ్రోగించారు.. 7 ||

ఇన్ద్రద్యుమ్నో విజయతామితి హోవాచ దేవరాట్ | కుమ్భోదరో విజయతామితి హోవాచ దైత్యరాట్ || ౮ ||

దేవతల రాజు ఇంద్రుడు "ఇంద్రద్యుమ్నుడికి జయం కలుగుగాక" అన్నాడు. రాక్షసుల గుంపు "కుంభోదరునకు జయం కలుగుగాక" అన్నారు. 8 ||

ఇతి తత్ర దివిస్థానే కలహోఽభూత్ పరస్పరమ్ | జాయమానే తు కలహే సురాణామ్ చ సురద్రుహామ్ || ౯ ||

ఆ విధంగా దేవతలకు, దేవతల శత్రువులకు మధ్య మాటల వైరం ఏర్పడినప్పుడు స్వర్గలోకంలో కలహవాతావరణం ఏర్పడింది.9

.

హాహాకారమకుర్వన్త ఋషయో రోమహర్షణమ్ | పర్యాకులముపాశ్రిత్య దేవాసురబలమ్ తథా || ౧౦ ||

యుద్ధ వాతావరణాన్ని చూసి  ఆనందరోమాంచితులై ఋషులు  ఆనందధ్వానాలు చేసారు . దేవతలు, అసురుల సైన్యం పరస్పరం రెచ్చిపోయారు. 10 ||

ప్రాద్రవద్ధనూమాన్ యత్ర వజ్రహస్తః పురన్దరః | హుఙ్కారేణ చ తాన్ సర్వానధఃకృత్య స మారుతిః || ౧౧ ||

ఇంద్రుడు వజ్రాయుధమును ధరించి హనుమంతుని దగ్గరకు వెళ్లాడు.  . అప్పుడు హనుమంతుడు హుంకారముతో రాక్షసులను తిరస్కరించాడు.11

పునరభ్యాగతః క్షిప్రమిన్ద్రస్తుత్యుపలక్షితః | తాదృగ్విధం  కర్మ  వాయోరపి వా తత్తనూభువః || ౧౨ ||

హనుమంతుడు శత్రు సంహారం తరువాత వెంటనే తిరిగి వచ్చి తనను  ఇంద్రుడు  స్తుతించడం గమనించాడు. "ఈ విధముగా ఇంత వేగంగా యుద్ధ కర్మ చేయువారు వాయువు  లేదా వాయుపుత్రుడు  ------( తరువాత శ్లోకంతో అన్వయం)

అథవా నన్దినస్సాక్షాదితి భూతాని మేనిరే | తమప్రతిమకర్మాణమభినన్ద్య నరేశ్వరః || ౧౩ ||

లేక నందికేశ్వరుడు  మాత్రమే అని జీవులు భావిస్తున్నారని    ఇంద్రుడు హనుమంతుని పొగిడాడు..   ఇంద్రద్యుమ్న రాజు  హనుమంతుని సాటిలేని పనులకు ప్రశంసించాడు --- 13 ||

అర్జితామ్ తపసా స్వస్య మణిమాలామ్ దదౌ తదా | శుశుభే హనుమాన్స్తత్ర స తయా మణిమాలయా || ౧౪ ||

అప్పుడు  తన తపస్సుతో సంపాదించిన ఆభరణాల హారాన్ని హనుమంతునికి ఇచ్చాడు. హనుమంతుడు ఆ రత్నమాలతో అక్కడ ప్రకాశించాడు 14

నక్షత్రాణామివాకాశే చన్ద్రమా ఇవ మాలయా | ఉజ్జృమ్భణమ్ తతః కృత్వా మహామాత్యః ప్రచోదితః || ౧౫ ||.

నక్షత్రమాలచే  చుట్టుకొనబడిన చంద్రునివలె హనుమంతుడు ప్రకాశించాడు. మహామాత్యునిచే ప్రేరితుడై తరువాత హనుమంతుడు  పరాక్రమంలో బాగా వ్యాపించాడు. ( బాగా పరాక్రమించాడని భావం)15 ||.

హనూమతా వేగవతా యోద్ధుమాభ్యాయయౌ బలీ | తముద్యన్తమ్ మహామాత్యమ్ రాజశాసనరక్షకమ్ || ౧౬ ||

పరాక్రమశాలి అయిన హనుమంతుడు చాలా వేగంగా యుద్ధం చేయడానికి రాజాజ్ఞ పాటించు మహామాత్యుని  సమీపించాడు.  16

గృహీతా యుద్ధముఖ్యాస్తే వజ్రహుంకృతికాస్సురాః | యన్తా తస్య మహాశాస్తా శాస్తా ధర్మభృతామ్ నృణామ్ || ౧౭ ||

వివిధ ఆయుధములతో, హుంకారములతో  రాక్షసులు, మహాశాస్త (అమాత్యుడు)  ఎదిరించి పోరాడారు. నీతిమంతుల పాలకుడు అయిన హనుమంతుడు  వారిని నివారించాడు.  17

స్యన్దనమ్ ప్రేరయామాస పవనాత్మజసన్నిధౌ | ఉపస్థితానామ్ కఙ్కానామ్ కలహోఽయమసాసహః || ౧౮ ||

వాయుపుత్రుని సన్నిధికి మహామాత్యుడు  రథాన్ని నడిపాడు. చనిపోతున్న వారు చనిపోతుండగా రాబందుల  గొడవ భరించలేనిదిగా మారింది. 18 ||

నిపపాత మహీపృష్ఠే ధ్వజమ్ తస్య మహాత్మనః | పతితః కేతురవనౌ విరరాజ రథాచ్చ్యుతః || ౧౯ ||

ఆ మహానుభావుడయిన మహామాత్యుని  రథపు   జెండా  హనుమంతునిచే నేలకూలింది., మహామాత్యుడు కూడా రథమునుండి కిందికి దిగాడు 19 ||

||పుణ్యక్షయే దివోమధ్యాత్ ప్రచ్యుతః కర్మవిద్యథా | సతముత్పాతముద్వీక్ష్య దృష్టచేతా మహాశరః || ౨౦ ||

పుణ్యము నశించిన తరువాత , స్వర్గం నుండి కర్మధారి ఏ విధంగా కింద పడతాడో అలా అపశకునములతో   మహా విలుకాడయిన మహామాత్యుడు  పడిపోయాడు.

ఆస్పన్దమ్ వామనేత్రస్య తదానాజీగణద్రణే | తతో నాలీకనారాచైః పట్టసైరపి ముద్గరైః || ౨౧ ||

అప్పుడు  ఆ  యుద్ధంలో  ఆ మహామాత్యుని  ఎడమ కన్ను వణికింది.  అప్పుడు అతని సైనికులు  బాణాలు, అడ్డకత్తులు మరియు ఇనుపగుదియలను యుద్ధంలో ఉపయోగించారు. 21 ||

గదాభిర్ముసలైస్తత్ర వ్యాకుర్వన్త రణమ్ పరే | హనూమాన్ రాక్షసక్షిప్తాన్ తానవజ్ఞాయ వేగతః || ౨౨ ||

. అమాత్యుడు రథము నుండి దిగి గద, ఇనుపగుదియ మొదలగు  ఆయుధములతో యుద్దము చేసాడు .హనుమంతుడు తనపైకి ఆయుధములను విసిరిన రాక్షసులను పట్టించుకోకుండా యుద్ధంలో ముందుకు సాగాడు 22 ||

.

శిలామాదాయ యాతూనామ్ ప్రధావత బలమ్ ప్రతి | చిక్షేప స శిలామ్ తత్ర రణమూర్ధని వాతభూః || ౨౩ ||

ఒక పెద్ద  రాయిని తీసుకుని హనుమంతుడు ఆ  రాక్షసుల బలగం వైపు పరుగెత్తి . మహామాత్యునిపై విసిరాడు. 23

ఆస్ఫోట్య పుచ్ఛమ్ తేజస్వీ అట్టహాసమథాకరోత్ | తామాపతన్తీమ్ తే తత్ర దృష్ట్వా వాతభువేరితామ్ || ౨౪ ||

ఆ తరువాత  తోకను వేగంగా తిప్పి  ,ఆ వేగపు   గాలికి రాక్షసులు యుద్ధ భూమిలో  పడిపోతుండటం  చూసి  హనుమంతుడు  అట్టహాసము చేసాడు 24 ||

.

కాలకేయాశ్శిలామ్ తీక్ష్ణై ర్వారమాయాసురాశుగైః | మోఘమ్ కర్మ తదా వీక్ష్య విచిన్త్య చ స మారుతిః || ౨౫ ||

కాలకేయులు తమ  పైబడుచున్న ఆ పెద్ద రాయిని  ప్రక్కకు తొలగించారు. కాలకేయులు తమ పదునైన ఆయుధాలతో, రాక్షస వేగంతో ఆ శిలనితిప్పి  కొట్టారు. అప్పుడు ఆంజనేయుడు  వ్యర్థమైన తన  చర్యను చూసి   ఏమి చేయాలని ఆలోచించాడు 25 ||

పార్శ్వే నభస్థలారూఢమ్ సాలవృక్షముదైక్షత । తమేకేనైవ హస్తేన సాలముత్పాట్య మారుతిః ॥ ౨౬ ॥

వెంటనే అతను తన పక్కన ఆకాశమంత ఎత్తు పెరిగిన సాలవృక్షం( మద్దిచెట్టు) వైపు చూశాడు. మారుతి ఒక్క చేత్తో దానిని కూల్చాడు.26.

హతా యూయమితి వ్యక్తమాభాష్య చిక్షిపద్బలీ । తమప్రతిహతమ్ దృష్ట్వా నిశితైస్సాయకైరపి ॥ ౨౭ ॥

బలవంతుడయిన హనుమంతుడు , "మీరు చనిపోబోతున్నారు" అని స్పష్టంగా ప్రకటించి ఆ మద్ది చెట్టుని వారివైపుకి విసిరివేసాడు. పదునైన బాణాల ద్వారా రాక్షసులు ఆ చెట్టుని అడ్డుకోవాలని ప్రయత్నించారు. 27

ఉన్ముఖేన తదా యోద్ధుమ్ న శేకుర్భయవిద్రుతాః । యత్ర యత్ర ప్రధావన్తో దృశ్యన్తే పలలాశినః ॥ ౨౮ ॥

కాని చేతకాక రాక్షసులు భయంతో పారిపోయారు . ఆంజనేయునితో ఎదురుగా నిలబడి పోరాడలేక పోయారు. మాంసాలు తినే ఆ రాక్షసులు ప్రతిచోటా పరిగెడుతూ కనిపించసాగారు.28

తత్ర గత్వా స తాన్ సర్వాన్ తాడయామాస పాణినా । హనూమతా వేగవతా హన్యమానే బలే తదా ॥ ౨౯ ॥

హనుమంతుడు వారివెంట పడి చేతులతో చావగొట్టాడు. శరవేగంతో ఆ రాక్షసబలాన్ని సంహరించాడు 29 ॥

క్రోధావిష్టో మహామాత్యో రాజానమభిదుద్రువే । అథాపతన్తమ్ సవిధే మహామాత్యమవేక్ష్య సః ॥ ౩౦ ॥

ఇది చూసి మహామాత్యుడు కోపముతో ఇంద్రద్యుమ్న రాజువైపుకు పరుగెత్తాడు. తన వైపుకు వస్తున్న మహామాత్యుని ఆరాజు చూసాడు. 30 ॥

జ్యాశబ్దమకరోత్ తత్ర భీషణమ్ సర్వరక్షసామ్ । తస్య శబ్దశ్రవేణైవ ప్రాణాన్విజహురఞ్జసా ॥ ౩౧ ॥

. అక్కడ రాక్షసులందరినీ భయభ్రాంతులకు గురిచేసే ధనుష్టంకారమును ఇంద్రద్యుమ్నుడు చేసాడు. ఆ ధ్వనికి వారు తమ ప్రాణాలపై ఆశలను వదులుకున్నారు. 31 ॥

మహామాత్యోఽపి దుర్ధర్షీ చకమ్పే రథవిష్ఠితః । తద్దృష్ట్వా శత్రుహన్తారమ్ రాజా ధర్మభృతామ్ వరః ॥ ౩౨ ॥

అజేయుడైన మహామాత్యుడు కూడ తన రథంలో కూర్చున్నప్పుడు ఆ ధ్వనికి భయపడ్డాడు.అలా ఉన్న ఆ మహామాత్యుని చూసి ధర్మాన్ని సమర్థించేవారిలో ఉత్తముడైన ఆ రాజు ఇలా అన్నాడు. 32

స మర్మస్పృశమ్ వాచమూచే మహామాత్యముపస్థితః ।

ఇన్ద్రద్యుమ్నః

త్వమేవ సమరశ్లాఘీ అస్త్రశస్త్రభృతామ్ వర ॥ ౩౩ ॥

" నువ్వు యుద్ధం బాగా చేస్తావని, అస్త్ర, శస్త్రములు బాగా ప్రయోగిస్తావని పేరు ఉంది కదా !" ( ఇలా వణుకుతున్నావేమిటని హేళన) ఇలా రాజు తన సమీపంలోని మహామాత్యుని హేళనాత్మకమైన మాటలచే వ్యంగ్యంగా నొప్పించాడు. . 33

శ్రుతే మదీయే జ్యాశబ్దే యతః ప్రాణాన్ న హాస్యసి । బ్రహ్మే - ఇతీరియతి రాజేన్ద్రే రాక్షసః క్రోధమూర్ఛితః ॥ ౩౪ ॥

“అస్త్ర శస్త్రప్రయోగ సామర్థ్యము గల నీవు నాధనుష్టంకారముతో ప్రాణాలను వదిలివేయాలి కదా?”అను రాజు మాటలు విని అమాత్యుడు క్రోధముతో ఇలా అన్నాడు.34

ప్రహస్య కిఞ్చిద్రాజానమిదముత్తరమబ్రవీత్ । ఆస్తామ్ తావదిదమ్ వ్యర్థకథనమ్ సమరాజితమ్ ॥ ౩౫ ॥

రాజా! వట్టి మాటలు కట్టిపెట్టు. ఈ ప్రగల్భములు ఎందుకు? 35 ॥

భవాదృశేషు కిమ్ వాయమ్ వీరవాదో విశామ్పతే । సమర్థో యది యుద్ధ్యస్వ ద్వన్ద్వమ్ దాస్యామ్యనన్తరమ్ ॥ ౩౬ ॥

నీలాంటి వారిని ఎంతో మందిని నేను ఎదుర్కొన్నాను. నీవు సమర్థుడవైతే నాతో ద్వంద్వయుద్ధమునకు రా. 36

న చేదస్మాదపాక్రమ్య సుఖీ భవ సుహృజ్జనైః । ఏవముక్త్వా మహామాత్యో రోషపర్యాకులేక్షణః ॥ ౩౭ ॥

లేకపోతే భయపడితే , ఇక్కడి నుండి వెళ్లి నీ స్నేహితులతో సంతోషంగా ఉండండి. అలా రాజుతో మాట్లాడుతూ మహామంత్రి కోపంతో రెచ్చిపోయాడు 37 ॥

జ్యాస్వనైః పూరయామాస సమరాఙ్గణమాశరః । అధిజ్యధన్విమన్త్రీన్ద్రో నారాచయుగమాదధే ॥ ౩౮ ॥

రోషముతో ధనుష్టంకారము చేసి రెండు బాణములు రాజు మీదికి ఎక్కుపెట్టాడు.38 ॥

ఇన్ద్రద్యుమ్నోఽపి రాజేన్ద్రశ్శరయుగ్మముపాదదే । యుద్ధమ్ దిదృక్షవస్తత్ర తయో రాజసురదృహోః ॥ ౩౯ ॥

రాజులకు రాజు అయిన ఇంద్రద్యుమ్నుడు కూడా ఒక జత బాణాలు ఎక్కుపెట్టాడు. అక్కడ ఇద్దరు చేస్తున్న యుద్ధాన్ని దేవతలు చూడాలనుకున్నారు. 39 ॥

ఆజగ్ముః ఋషయస్సర్వే సాసురాస్సమరుద్గణాః । తతో మన్త్రీ క్రుధావిష్టో ముముచే సాయకద్వయమ్ ॥ ౪౦ ॥

దేవతలతో పాటు ఋషులు, రాక్షసులు, మరుత్తులు అందరూ యుద్ధం చూడటానికి వచ్చారు. అప్పుడు మహామాత్యుడు కోపంతో రాజుపై రెండు బాణాలు వేసాడు. 40 ॥

ఉభాభ్యామేవ బాణాభ్యామ్ రాజా చిచ్ఛేద తౌ శరౌ । తతః పఞ్చశరా ముక్తా మహామాత్యేన ధీమతా ॥ ౪౧ ॥

రాజు కూడ అతనిపై రెండు బాణములు వేసాడు. . అప్పుడు తెలివైన మహామాత్యుడు ఐదు బాణాలు వేసాడు. 41 ॥

ప్రాచ్ఛినత్ పఞ్చభిర్బాణైరిన్ద్రద్యుమ్నో రుషాన్వితః । పునః కుద్ధశ్శరాన్ పఞ్చదశపఞ్చ జహౌ తథా ॥ ౪౨ ॥

ఇంద్రద్యుమ్నుడు ఆ బాణాలను తునుకలు చేసాడు.. మళ్ళీ కోపంతో  మహామాత్యుడు   పదిహేను బాణాలు వేసాడు. 42 ॥

అవారయచ్ఛరే రాజా దర్శయన్పాణిలాఘవమ్ । తాభ్యామ్ ముక్తాశ్శరాస్తీక్ష్ణాశ్శతశోఽథ సహస్రశః ॥ ४३ ॥

రాజు హస్తలాఘవముతో( నేర్పుతో)  వాటిని  తొలగించాడు. రాజు తరువాత అనేక బాణాలను మహామాత్యునిపై ప్రయోగించాడు. 43

శీర్షాపీడా వియద్భాగే వీరలక్ష్మ్యా ఇవాబభుః । తతః క్షణాద్వినిష్పిష్య కాలకేయాన్ సమీరభూః ॥ ४४ ॥

యుద్ధరంగంలో మరొక వైపు  ఆకాశంలో వీరలక్ష్మి వలె ప్రకాశిస్తున్న అంజనేయుడు క్షణములో కాలకేయులను రాక్షసులను పిండిచేసి వీరలక్ష్మియొక్క కిరీటము వలె ప్రకాశించాడు.44 ॥

స్యన్దనే మన్త్రిణస్తస్య వేగవాన్నిష్పపాత హ । ఊరువేగేన మహతా రథశ్చూర్ణీకృతస్తథా ॥ ४५ ॥

మహామాత్యుడు  రథము నుండి క్రిందపడిపోయాడు. .రాజు వాని రథాన్ని ముక్కలు చేసాడు.45 ॥

పునరన్యో రథస్తత్ర సమానీతః క్షణేన వై । తమారుహ్య మహామాత్యో రాజానమ్ దశభిశ్శరైః ॥ ४६ ॥

ఇంకొక రథాన్ని  ఎక్కి  మహామాత్యుడు  రాజును పది బాణములచేత కొట్టాడు.46

జఘాన సమరే వీరో మారుతించ శరైఃశ్శనైః । తాననాదృత్య బాణౌఘాన్ హనుమాన్ భీమవిక్రమః ॥ ४७ ॥

వీరులను  చంపుతూ  మాటిమాటికి బాణాలను   మారుతిపై ఆ మహామాత్యుడు ప్రయోగించాడు. . భయంకరమైన పరాక్రమము కలిగిన శక్తిమంతుడైన హనుమంతుడు రాక్షసులు ప్రయోగించిన బాణాల వరదను పట్టించుకోలేదు.  47 ॥

.

తలేనాహత్య యన్తారమ్ శాస్తారమ్ బహు మానయన్ । అశ్వేనాశ్వమ్ ద్విపేన్ద్రేణ ద్విపేన్ద్రమ్ నరతో నరమ్ ॥ ४८ ॥

హనుమంతుడు ఆ బాణములనులెక్కచేయక  ఆ శాస్తను( మాహామాత్యుడు)  గౌరవిస్తూ( వ్యంగ్యంగా)  సారథిని అరచేతితో మోది,  గుర్రం తో గుర్రాన్ని , ఏనుగు తో ఏనుగుని, మనిషి తో మనిషిని రెండు  చేతులతో అటూ ఇటూ ఈడ్చి కొట్టాడు.   48 ॥

సంహృత్య సహసా సంఖ్యే శ్వసమానో హ్యదృశ్యత । రాజాపి మకుటమ్ తస్య మహామాత్యస్య ధీమతః ॥ ४९ ॥

అలా అన్నింటిని  కలగలిపి గుర్రములను, ఏనుగులను సైన్యమునుచంపి హనుమంతుడు అదృశ్యుడయ్యాడు. రాజు కూడా ఆ తెలివితేటలు కలిగిన గొప్ప మంత్రి యొక్క  కిరీటాన్ని కిందపడవేసాడు. 49 ॥.

శరేణైకేన మహతా హ్యపాతయదసౌ బలీ । శరైశ్చతుర్భిస్తస్యాసౌ శకటాని దురాత్మనః ॥ ५० ॥

ఒకే ఒక్క శరముతో రాజు ఆ మహామాత్యుని మకుటమును కింద పడవేసాడు. దుర్మార్గుడైన అతని నాలుగు రథాలను బాణాలతో నింపాడు. 50 ||

శరేణైకేన తేజస్వీ వర్మచాయసముత్తమమ్ | అక్షయ్యమపి తూణీరమ్ సాయకానామ్ త్రయేణ వై || ౫౧ ||

ఒక బాణముతో ఆ మహామాత్యుని ఇనుప కవచాన్ని ,మూడు బాణములతో అక్షయ తూణీరములను( అమ్ముల పొదులను) , ,51

యుగమేకేన బాణేన వాజినశ్చ త్రిభిశ్శరైః | శరేణ ధ్వజమేకేన తథా శాస్తారమాహవే || ౫౨ ||

మూడు బాణములతో గుర్రములను, ఒక బాణముతో ధ్వజమును, ఆ మహామాత్యుని( శాస్త అను పేరు కలవానిని) ఇంద్రద్యుమ్న మహారాజు కొట్టాడు. 52 ||

దశభిస్సాయకైస్తీక్ష్ణైరమాత్యమ్ నిజఘాన హ | తమప్రతిమకర్మాణమ్ యుద్ధసీమ్ని వ్యవస్థితమ్ || ౫౩ ||

ఆ తరువాత పది పదునైన బాణాలతో మహామాత్యుని రాజు కొట్టాడు.అలా రాజు అసమానమైన విన్యాసాలతో యుద్ధభూమిలో నిలబడి ఉన్నాడు.53

అవలోక్య మహాశాస్తా పురీమేవాభ్యధావత | తథా క్రుద్ధో మహామాత్యో హతాశ్వో హతసారథిః || ౫౪ ||

తన గుర్రం మరియు రథసారథి చంపబడటం చూసిన మహామాత్యుడు ఆగ్రహానికి గురయి నగరం వైపు పరుగెత్తాడు. . 54 ||

సచ్ఛిన్నధన్వాశ్వరథో హత సైన్యోఽపి సోఽభవత్ | గదామాదాయ వేగేన క్రుద్ధస్సఙ్గ్రామమూర్ధని || ౫౫ ||

విల్లు, గుర్రం, రథం ఛిన్నాభిన్నమై సైన్యం హతము కాగా కోపోద్రిక్తుడైన మహామాత్యుడు గదను గ్రహించి మరలా వేగంగా యుద్ధభూమిలో దాడి చేసాడు 55

హనుమన్మూర్ధ్ని చిక్షేప హతస్త్వమితి మన్త్రిరాట్ | గదామ్ తామాయసీమ్ ముక్తామష్టఘణ్టామణీయుతామ్ || ౫౬ ||

హనుమంతుడు, ఆ మహామాత్యుని తలపై చావు దెబ్బ కొట్టాడు. ఎనిమిది గంటలు కల గదను వదలిరాక్షసుడు పడిపోయాడు.

ఆపతన్తీమ్ రణే దృష్ట్వా రాజా రణవిశారదః | మిషతామ్ సర్వభూతానామగ్రతో నృపసత్తమః || ౫౭ ||

యుద్ధంలో నిష్ణాతుడైనవాడు, సర్వభూతములలో ఉత్తముడైన ఇంద్రద్యుమ్న మహారాజు మహామాత్యుడు అలా యుద్ధంలో పడిపోవడం చూసాడు. 57 ||

శరేణైకేన తామ్ భస్మసాత్ కృత్వా హస్తలాఘవమ్ | దర్శయన్నఖిలైర్భూతైః స్తూయమానస్తదాభవత్ || ౫౮ ||

ఇంద్రద్యుమ్నుడా గదను బాణాలతో బూడిద చేసాడు. అలా సకల ప్రాణులకు తనశక్తిని చూపి వారిచే మెప్పు పొందాడు. ||58

మోఘీభవన్తీమ్ తామ్ దృష్ట్వా గదామ్ బ్రహ్మర్షిఘాతినీమ్ । స విచిన్త్య ముహూర్తమ్ వై సాలమేకమ్ దదర్శ హై ॥ ౫౯ ॥

బ్రాహ్మణులను, ఋషులను చంపిన తన గద ఇంద్రద్యుమ్నుని పరాక్రమముచే వ్యర్థము కాగా ఒక సాలవృక్షమును( మద్దిచెట్టుని) మహామాత్యుడూ చూసాడు. .59 ॥

ఉత్పాట్య సహసా సాలముద్యమ్య భుజయోర్యుగే । రాజ్ఞస్స్యన్దనముద్దిశ్య స తు చిక్షేప మన్త్రిరాట్ ॥ ౬౦ ॥

మహామాత్యుడు అకస్మాత్తుగా ఆ సాలవృక్షమును తన చేతులతో పెకలించి ఇంద్రద్యుమ్నుని రథము పైకి విసిరాడు. 60

.

శాఖోపశాఖామారూఢమ్ ముచ్యమానమ్ నభోఽన్తరే । నభస్తరుమివాశ్చర్యకారిణమ్ దదృశుస్సురాః ॥ ౬౧ ॥

కొమ్మలతో కూడిన ఆ చెట్టు ఆకాశమంత ఎత్తు ఎగిరింది. ఒక దేవతా వృక్షంలా దేవతలు దానిని అద్భుతంగా చూసారు. 61 ॥

హనుమాన్ లఘునాభ్యేత్య ప్రగృహ్య తరుముత్తమమ్ । ప్రచిక్షేప తదా సాలమ్ ప్రతి రాక్షసమన్త్రిణమ్ ॥ ౬౨ ॥

హనుమంతుడు తేలికగా దానిని సమీపించి ఆ అద్భుతమైన చెట్టును స్వాధీనం చేసుకున్నాడు. (పట్టుకొన్నాడని భావం) తరువాత అదే సాలవృక్షమును( మద్దిచెట్టుని) రాక్షస మంత్రిపైకి విసిరాడు 62 ॥

స తదాయాన్తముద్వీక్ష్య శిలాయాస్తమపోథయత్ । ఆదిదేశ మహామాత్యో శిలామన్యామ్ వధే రిపోః ॥ ౬౩ ॥

అప్పుడు ఆ మహామాత్యుడు దానిని చూసి ఒక శిలను హనుమంతుని పైకి విసిరాడు. 63

తలేన హనుమాన్ తస్య తామ్ శిలామ్ ప్రాపతద్భువి । స వన్ధ్యమ్ కర్మ తద్వీక్ష్య దన్తాన్ కటకటాపయత్ ॥ ౬౪ ॥

తిరిగి హనుమంతుడు అదే శిలను మహామాత్యునిపైకి ప్రయోగించాడు. మహామాత్యుడు దంతములను పటపట కొరుకుచు పర్వత శిఖరము ఎక్కాడు. 64 ॥

ఆదాయం తు గిరేశ్శృఙ్గమాయయౌ మన్త్రిసత్తమః । అవలోక్య మహీపాలః పత్త్రిణామ్ కఙ్కపత్త్రిణామ్ ॥ ౬౫ ॥

మహామాత్యుడు యుద్ధం చేస్తూ రాజును పర్వత శిఖరానికి తీసుకెళ్లాడు. అక్కడ రాజు పక్షులను ఈకలు గల బాణములను వదిలాడు. 65 ॥

ఏకేన మన్త్రిణో హస్తమ్ సహశృఙ్గమథాచ్ఛినత్ । తతోఽన్యేన భుజేనాసౌ మహామాత్యో రుషాన్వితః ॥ ౬౬ ॥

ఆ ఈకలు కలిగిన బాణములలో ఒకదానితో రాజు మంత్రి చేతిని నరికాడు. అప్పుడు మహామంత్రి కోపంతో రాజును తెగకుండా ఉన్న మరో చేతితో కొట్టాడు.. 66 ॥

సాలమ్ కమపి పాదాభ్యామ్ ఉత్పాట్య రిపవేఽక్షిపత్ । తమ్ వృక్షరాజమాయాన్తమ్ ద్రుతమేత్య సమీరభూః ॥ ౬౭ ॥

మహామాత్యుడు తన పాదాలతో ఇంకొక సాలవృక్షమును ( మద్దిచెట్టుని) ఎత్తి శత్రువుపైకి విసిరాడు. అది త్వరగా హనుమంతుని సమీపించింది. 67 ॥

తేనైవ ప్రాహనత్ తత్ర రాక్షసమ్ మన్త్రిసత్తమమ్ । ప్రహతస్తేన తరుణా మహామాత్యో మహాబలః । వ్యా త్తాననో రణభువి నిరసుః ప్రాపతద్వలీ ॥ ౬౮ ॥

హనుమంతుడు ఆ వృక్షమును పట్టుకొని అమాత్యుని పైకి తిరిగి విసిరివేసి ఆ రాక్షసుడిని కొట్టాడు. వృక్షముచేత కొట్టబడి మహాబలుడైన ఆ మహామాత్యుడు నోరు తెరచుకొని మృతి పొందాడు. యుద్ధరంగంలో పడిపోయాడు. 68 ॥

తతో దేవాస్సగన్ధర్వాస్సేన్ద్రాశ్చ పరమర్షయః । పుష్పవర్షాణి ముఞ్చన్తస్సాధు సాధ్విత్యపూజయన్ ॥ ౬౯ ॥

అప్పుడు దేవ గంధర్వులు ఇంద్రుడు మరియు గొప్ప ఋషులు పుష్పవర్షము కురిపించి "బాగుబా గని ప్రశంసించారు. 69 ॥

తదానిలాత్మప్రభవస్య వైభవమ్ రణాజిరే ద్రష్టుమసాసహస్తదా । క్షయమ్ ప్రణీతే సచివాగ్రగణ్యే శిష్టా నిజస్వామినమాపురాసురాః ॥ ౭౦ ॥

అప్పుడు యుద్ధభూమిలో హనుమంతుని వైభవాన్ని చూసి ప్రాణాలతో మిగిలిన రాక్షసులు తట్టుకోలేకపోయాడు.మహామాత్యుడు నాశనం కాగా మిగిలిన రాక్షసులు తమ యజమాని కుంభోదరుని దగ్గరకు చేరారు. 70 ॥

తమ్ పుష్పకాసీనముదారసత్వమ్ స్వర్వారనారీభిరుపాస్యమానమ్ । సమ్మన్త్ర్యమాణమ్ సచివైరనేకైర్ద్విజావమన్తారమమీ హ్యపశ్యన్ ॥ ౭౧ ॥

అప్పుడు కుంభోదరుడు పుష్పము వంటి ఆకారము కలిగిన రత్నాభరణాల ఆసనంపై కూర్చొని ఉన్నాడు. స్వర్గలోకంలోని వారస్త్రీలు అతనిని పూజిస్తున్నారు. అనేకమంది మంత్రులు చుట్టూ చేరగా బ్రాహ్మణులను అవమానించే స్వభావం కలిగిన కుంభోదరుని యుద్ధములో ప్రాణాలతో మిగిలిన రాక్షసులు చూసారు. 71 ॥

వర ప్రమత్తమ్ వరపీఠసమ్స్థమ్ కృతావలేపమ్ క్షణదాచరేన్ద్రమ్ । ఉపాత్తసమ్రమ్భముదస్తవిక్రమమ్ ప్రసహ్య పఞ్చాస్యమివ ప్రబుద్ధమ్ ॥ ౭౨ ॥

రాత్రిపూట తిరిగే రాక్షసుల రాజు అయిన కుంభోదరుడు బాగా మత్తులో ఉన్నాడు. సింహాసనంపై కూర్చొని, లేపనం పూసుకొన్నాడు. కోపంతో ఉలిక్కిపడిన సింహంలా అనుచరుల రాకతో బలవంతంగా లేచాడు. 72 ॥

అన్ధమ్ తమః ప్రావరణమ్ గిరీన్ద్రమివ స్థితమ్ నీలవరోత్తరీయమ్ । తమ్ రత్నమాలాభరణమ్ సువక్షసమ్ సౌదామినీరఞ్జితమమ్బుదమ్ యథా ॥ ౭౩ ॥

కన్ను పొడుచుకొన్న నల్లని చీకటితో రంగు వస్త్రాన్ని ధరించి ఒక పర్వతంలా అతను నిలబడ్డాడు. నల్లటి మేఘం మెరుపులను ఎలా కలిగి ఉంటుందో, — అలా- నల్లని శరీరము కల అతను మెరిసే రత్నమాలలతో అలంకరించబడ్డాడు 73 ॥

దృష్ట్వా తమాసురాధీశమాసురాస్తే ససాధ్వసాః । హనూమద్దయయా ముక్తా భర్తారమిదమబ్రువన్ ॥ ౭౪ ॥

అలా ఉన్న తమ రాక్షసుల స్వామి కుంభోదరుని చూసి రాక్షసులు భయముతో నిలబడ్డారు. . హనుమంతుని కరుణ ద్వారా విముక్తి పొందినవారు( అనగా హనుమంతుడు చంపకుండా విడిచిన రాక్షసులు) కుంభోదరుని తో ఇలా అన్నారు. . 74 ॥

ఇతి బ్రహ్మకైవర్తే ఉత్తరఖణ్డే భృగుపరాశరసమ్వాదే ఘటికాచలమాహాత్మ్యే షష్ఠో ఽధ్యాయః ||

బ్రహ్మ-కైవర్త పురాణంలోని ఉత్తరఖండంలో భృగువు మరియు పరాశరుని మధ్య జరిగిన సంభాషణలో ఘటికాచల మాహాత్మ్యంలో  ఆరవ అధ్యాయం పూర్తి అయినది.

+++++

శ్రీ శివాయ గురవే నమః

ఘటికాచలనివాసాయ శ్రీ నృసింహాయ నమః

బ్రహ్మకైవర్త పురాణములో ఉన్న  శ్రీఘటికాచల మాహాత్మ్యపు  ఏడవ  అధ్యాయము

(మూల శ్లోకము మరియు తాత్పర్య విశేషాలతో)

శ్రీఘటికాచలమాహాత్మ్యమ్

సప్తమోఽధ్యాయః

శ్రీ పరాశరః

దక్షిణాభిముఖాసీనః పీఠే మణిమయే శుభే । నిశ్వస్యాహిరివాశేషానూచే రక్షర్షభస్తదా ।।

శ్రీ ఘటికాచల మహాత్మ్యం

అధ్యాయం ఏడు

పరాశరుడు

కుంభోదరుడు దక్షిణం దిక్కు వైపు మొగం పెట్టి ఒక శుభకరమైన రత్న సింహాసనం పై కూర్చున్నాడు. పాములా నిట్టూర్చి తన వారితో ఇలా మాట్లాడాడు.1

కుమ్భోదరః

హతః ఖలు వినిష్క్రాన్తో మహామాత్యో బలాన్వితః । సంరబ్ధో యుద్ధనిర్హ్రాదీ సాహసం క్రియతే వృథా ॥౨

అయ్యో !మహాబలవంతుడైన మహామాత్యుడు చనిపోయాడు కదా! అతడు యుద్ధ ధ్వని కలిగిన వాడు.(అనగా మహామాత్యుని పేరు చెబితేనే యుద్ధం అనే మాట అందరికీ స్మరణలోకి వస్తుందని యుద్ధ క్రీడలో అతనంతటి ప్రవీణుడని కుంబోదరుని అభిప్రాయం) అటువంటి వాని సాహసం నేడు వృథా అయిపోయినది కదా! 2

అథవా యచ్చ సచివస్స్వయం కాలవశం గతః । భయం ముక్త్వా శంసత వో వాఞ్ఛితం ప్రదదామ్యహమ్। ౩

అంతటి మహా పరాక్రమశాలి మహామాత్యుడు కాలవశాత్తు మరణించాడు. అయినా మీరేమీ భయపడకండి. భయమును విడిచిపెట్టి మీకు ఏమి కావాలో కోరుకోండి! నేను మీకు ఇస్తాను.3

బ్రహ్మే-

ఇత్యుక్తవన్తం రాజానం రక్షసామసురాస్తదా । కిఞ్చిద్విముక్తమోహాస్తే సాభిషంగం సమూచిరే ॥౪

బ్రహ్మ చెబుతున్నాడు- కుంభోదరుడు ఈ మాటలు మాట్లాడగానే ఆ రాక్షసులు తమ దుఃఖ భ్రమల నుండి కొంత ఉపశమనం పొంది ఈ విధంగా అతనితో చెప్పారు.4

అసురాః

యస్తే వైరివిలుంటావో యస్తే దక్షోభుజో మహాన్ । యస్తే విక్రమకాలే తు యుధ్యతే వైరిభిస్సహ ॥౫

రాక్షసులు

ఎవడైతే నీ శత్రువులను సంహరించేవాడో, ఎవడైతే నీకు కుడి భుజంగా ఉండి అన్నింటిలోనూ చొచ్చుకొని పోయేవాడో, ఎవడైతే తన పరాక్రమాన్ని ప్రదర్శిస్తూ నీ శత్రువులతో పోరాడే వాడో ...5

యస్తే హర్షకరో మన్త్రీ యస్తే నాసీరరక్షకః । స ఇదానీం వానరేణ కేనాసి వినిపాతితః ॥ ౬

ఎవడైతే నిన్ను సంతోషపెట్టేవాడో, ఎవడైతే నీ సేనాధిపతిగా సేనాగ్ర భాగమును రక్షించేవాడో, అటువంటి గొప్పవాడు -నీ మహామాత్యుడు ఈరోజు ఒకానొక కోతి చేతిలో మరణించాడు.6.

బ్రహ్మే

నిశమ్య తద్వచస్సంఖ్యే పాతితం మన్త్రిశేఖరమ్। పార్శ్వే ధూమ్రాక్షభీమాక్షౌ విష్ఠితౌ ప్రాహ నైఋతః । ॥౭

బ్రహ్మ

యుద్ధరంగంలో మరణించిన మహామాత్యుని మరణ వార్తను రాక్షసుల ద్వారా విని తట్టుకోలేని కుంభోదరుడు తనకు నైరుతి దిక్కుగా నిలబడి ఉన్న తన కుమారులైన ధూమ్రాక్ష భీమాక్షుల వైపు చూసాడు ||7||

కుమ్భోదరః -

హే సుతౌ మమ భావ్యౌ తౌ సర్వదా రణకోవిదౌ । తం వానరం చ రాజానం నిహత్య సమరే యువా ||

ఓ కుమారులారా! యుద్ధము బాగా తెలిసిన వారైన మీరిద్దరూ ఆ కోతిని ఆ రాజుని సంహరించండి.8

అనన్తరం చ హరతం రాజభార్యామనిన్దితామ్ । అథవా వానరం గృహ్య జీవగ్రాహం మహాబలమ్ ||

తర్వాత దోష రహిత అయిన సౌందర్యవతి అయిన ఆ రాజు భార్యని అపహరించండి లేదా మహాబలవంతమైన ఆ కోతిని సజీవంగా అయినా బంధించి తీసుకురండి.9

రాజానమపి తత్పత్నీం శీఘ్రమాగచ్ఛతాముభౌ ।

బ్రహ్మా

ఇత్యాకర్ణ్య వచస్తస్య తావుభౌ సమితిఞ్జయౌ || ౧౦

ఆ రాజు భార్యని మీరిద్దరూ కలిసి సాధ్యమైనంత తొందరగా తీసుకురండి " తండ్రి చెప్పిన ఈ మాటలను యుద్ధరంగమునందు జయించు స్వభావము కలిగిన ఆ కుమారులు ఇద్దరు విన్నారు.10.

అకుర్వతాం మహాభీమౌ రథారోహణమఞ్జసా । హుత్వా వహ్నిముపస్థాయ వర్ధమానౌ మహారథౌ | | ౧౧

బలవంతులైన ఆ ఇద్దరు పరాక్రమవంతులు అగ్నికి బలి(దేవత యెదుట మృగాదుల నరకుట) అర్పించిన తర్వాత, రథమెక్కి యుద్ధానికి బయలుదేరారు.11

విరేజతురుభౌ వ్యోమ్ని చన్ద్రసూర్యావివాస్థితౌ

అక్షోహిణీసహస్రేణ వ్యూహం కృత్వా తు పద్మకమ్ ||౧౨

ఆకాశంలో చంద్ర సూర్యులులా రథంలో వారు ప్రకాశిస్తూ వేయి అక్షౌహిణుల సైన్యాన్ని తయారుచేసి పద్మవ్యూహం నిర్మించారు.12

( అక్షౌహిణి అనగా 21870 రథములు, 21870 ఏనుఁగులు, 65610 గుఱ్ఱములు, 109350 కాల్బలము గల సేనావిశేషము).

సఙ్గరాన్వేషిణౌ బాలౌ నిర్గతౌ నగరాద్బహిః। నిర్యాన్తౌ తౌ సమీక్ష్యాథ మాంసాగమనహర్షితాః | | ౧౩

యుద్ధాన్ని అన్వేషిస్తూ ఆ ఇద్దరు కుమారులు నగరం నుండి బయలుదేరారు .అలా ఉత్సాహంతో వెళుతున్న వారిద్దరిని చూసి రాక్షసులందరూ సంతోషించారు. 13

శీఘ్రమారురుహుస్తేషాం కఙ్కవ్యూహా రథోపరి । శివాశ్చాశివశంసిన్యో వినేదుస్తత్పురస్థితాః ||౧౪

వారి రథములపై ఆపశకున సూచకంగా గద్దలు నిలిచాయి .వారు ముందు నడుస్తుంటే అనేక రకాలైన అమంగళకరమైన ఉత్పాతాలు కనిపించాయి.14

ఆవర్తముద్రాం వ్యాచక్రుర్ఝుఝ్ఝావాతాః పదే పదే । పాంసువృష్టిం ప్రముఞ్చన్తః పయోధాస్సంప్రతస్థిరే ||౧౫

పదేపదే సుడిగాలులు చెలరేగాయి. దుమ్ముల వర్షాలు కురిసాయి. సముద్రాలు అల్లకల్లోలం అయ్యాయి 15

తయోస్సారథినౌ తత్ర నిర్యత్నాత్ పతితౌ భువి । స్యన్దనస్యాపి మకుటం కార్తస్వరమయం భువి ||౧౬

వారిద్దరి రథసారథులు ఎటువంటి ప్రయత్నం లేకుండానే నేలపై పడిపోయారు. రథముపై ఉన్న బంగారపు శీర్షం కూడా భూమిపై పడిపోయింది16

గతం దేవర్షిశాపేన మహాగ్రహ ఇవాబభౌ । ప్రస్రవన్తో భయాత్తత్ర వాజినో రథవాజినః ||౧౭

శాపము పొందిన రాహు,(కేతు) గ్రహము లాగా ఆ కుమారద్వయము కనిపించింది. వారిద్దరి వెంట నడుస్తున్న గుర్రాలు రథసారథులు భయంతో నడిచారు.17

అభినేతృకశాఘాతా ద్విముఖీభూయ శేరతే| వామంచాక్షిసురారాతే స్తయోరపితనూభువోః|| ౧౮||

ఆ ఇద్దరు కుమారుల రథాలకు కట్టిన గుర్రాలు కొరడా దెబ్బలకు కింద పడుకున్నట్లుగా కొద్దిసేపు కదలటానికి మొరాయించాయి. వారి ఎడమ కన్నులు అశుభాన్ని చూసి సూచిస్తూ అదిరాయి. 18

ప్రాస్పందత తథాచాపమపి భగ్న గుణంస్థితం! తాననాదృత్యచోత్పాతా౯ స్థిత యోరపిపుత్రయోః ! ||

అపశకున సూచకముగా ధనస్సు విరిగింది. అల్లెతాడు తెగిపోయింది. అయినా ఆ కుంభోదరుని కుమారులు ఈ అపశకునములను లక్ష్య పెట్టలేదు.19

బభూవ మహతీచింతా ధైర్యలోపకరీతదా! ఇంద్రద్యుమ్నోపి ధర్మాత్మాయుద్ధకర్మవిశారదః|| ౨౦||

నీతిమంతుడు మరియు యుద్ధంలో నైపుణ్యం కల ఇంద్రద్యుమ్నుడు కూడా అప్పుడు చాలా ఆందోళన, అసహనం చెందాడు.20

తం హెూవాచ హనూమంతం కృతకర్మణమాహవే/ సజ్జీభవతనూజన్మన్ పవనస్యమహామతే ||

యుద్ధంలో తన కర్తవ్యాన్ని నిర్వర్తించిన హనుమంతునితో ఇంద్రద్యుమ్నుడు ఇలా అన్నాడు." వాయు పుత్రుడా!ఓ మహానుభావుడా ! సిద్ధం కావాలి.||21

దృశ్యంతే బహుధా దూ రే యస్య సాంగ్రామికారధాః । ఆవయో రాక్షసానాంచ యుద్ధకర్మాభిలాషిణాం| ౨౨||

యుద్ధం చేయడానికి తహతహలాడే మనకి కుంభోదరుని యుద్ధ రథాలు యుద్ధ సన్నద్ధమై దూరంగా కనిపిస్తున్నాయి.22

ఇదానీం సుమహత్కర్మా భవిష్యతి న సంశయః | సర్వధా జయినస్సంఖ్యే వయమత్ర న సంశయః

ఇప్పుడు చాలా పెద్ద యుద్ధం జరుగుతుందనడంలో సందేహం లేదు. అన్ని విధాలా విజయం మనదే అనడంలో సందేహం లేదు.23

యస్మాద్వాయసరాజోయ మభికూజతిభాస్కరం | దక్షిణాక్షి భుజస్పందశ్శంసతే నః క్షణం రణే||

ఎందుకంటే కాకుల రాజు సూర్యుడిని చూసి మొరుగుతున్నది. ఓ నీతిమంతుడా! కుడి కన్ను ,కుడి భుజముల వణుకు యుద్ధంలో మన విజయ క్షణం గురించి చెబుతున్నది.24

విశేషాలు

(కన్ను అదరడాన్ని శకునంగా భావిస్తారు. ఆడవారికి కుడికన్ను, మగవారికి ఎడమకన్ను అదరడం వల్ల అనర్థాలు జరుగుతాయని చాలా మంది నమ్మకం. సీతాదేవిని రావణాసురుడు అపహరించే ముందు ఆమెకు కుడికన్ను , లక్ష్మణుడికి ఎడమకన్ను అదిరాయట. రావణ సంహారానికి ముందు రాముడు లంకలోకి ప్రవేశించగానే రావణుడికి కుడి కన్ను, సీతకు ఎడమకన్ను అదిరాయట. రామదండు లంక మీద దాడి చేయబోయే ముందు రావణుడికి, మండోదరికి కూడా కన్ను అదరిందట. రామాయణ కాలం నుంచే కన్ను అదరడాన్ని పరిగణలోకి తీసుకుని శకునాలు అంచనా వేయడం ప్రారంభించారు.)

నృహరేరనుభావేన హనూమం స్తవదక్షిణే | కరే భవ్యప్రశంసీవ దృశ్యతే హేతిపావకః | ౨౫ ||

హనుమంతా! నరసింహస్వామి అనుగ్రహంతో నీ కుడివైపు అగ్నిదేవుడు శుభశకునదాయకుడిగా మహా స్తుతిపాత్రునిగా కనిపిస్తున్నాడు. 25

బ్రహ్మే

ఏతస్మిన్నంతరే దేవా జయతాంహనుమానయం | దేవా దుందుభిమాఘ్నంతో వ్యోమభాగే వ్యవస్థితాః||

ఈ యుద్ధం తరువాత, దేవతలు హనుమంతునికి జయ జయ ధ్వానాలు పలికారు. దేవతలు డప్పులు కొడుతూ ఆకాశంలో నిలబడ్డారు.26

తమాకర్ణ్య మహాశబ్దం దుందుభీనాం భయావహం ! ధూమ్రాక్ష స్తు దురాధర్షస్స్యందనం ప్రాహిణోద్రణే||

భయంకరమైన ఆ భేరీల శబ్దం వినగానే అజేయుడైన ధూమ్రాక్షుడు తన రథాన్ని యుద్ధ రంగానికి నడిపించాడు 27

హనూమానపి శత్రూణాం హననేమగ్న మానసః | జా గృహీతి మహీపాల ముక్త్వా ప్రాద్రవదాసురాన్ ! ౨౮

హనుమంతుడు కూడా తన శత్రువులను చంపడంలో మునిగిపోయిన మనసు కలవాడు అయ్యాడు. ఇంద్రద్యుమ్న మహారాజుని చైతన్యవంతం చేసి కొంతమంది రాక్షసుల్ని పారిపోయేటట్లు చేసాడు. 28 ||

శిలాభిస్తరుభిః శృంగైః నిష్పణ్ణాన్ రజనీచరాన్ | కృత్వా సమరవిక్రాంతః ప్రదధ్మౌ శంఖముత్తమం|| ౨౯||

రాక్షసులను రాళ్ళు మరియు చెట్లతో కప్పబడేటట్లు చేసి,( అనగా వారిని సంహరించి) యుద్ధంలో పరాక్రమవంతుడైన హనుమంతుడు తన అద్భుతమైన శంఖాన్ని ఊదాడు. 29||||

ప్రధ్మాతశఙ్ఖం తం దృష్ట్వా ప్రాహ తానపి రాక్షసాన్ | ధూమ్రాక్షః క్రోధతామ్రాక్షో హనూమన్తమపూజయత్ ||౩౦

రాక్షసులు చనిపోవుట చూచి ధూమ్రాక్షుడు శంఖం ఊదుతున్న హనుమంతుని ఇలా ప్రశంసిస్తూ పలికాడు

ధూమ్రాక్షః

వానరేన్ద్ర రణశ్లాఘీ భవానేవ న సంశయః | యత్త్వాం మహాసురాన్ హత్వా ధ్మాసి శఙ్ఖమలజ్జితః | | ౩౧

ఓ వానరుల ప్రభువా! నువ్వు నిస్సందేహంగా యోధుడివి . నీవు, సిగ్గులేకుండా, మహా రాక్షసులను చంపి, నీ శంఖాన్ని ఊదుతున్నావు.

బ్రహ్మో

ఇతి బ్రువాణస్య తథా ధూమ్రాక్షస్య పురస్థితమ్ | పాతాలభేదినం నాగం తాడయిత్వా జగర్జ సః ||౩౨

బ్రహ్మా

ధూమ్రాక్షుడు ఇలా వ్యంగ్యంగా మాట్లాడుతున్నప్పుడు, ధూమ్రాక్షుని ముందున్న ఏనుగును హనుమంతుడు కొట్టాడు. అది గర్జించింది. 32

తాడితో గజరాజస్తు విముఖీభూయ సన్నతః | బృంహితం సోఽకరోదుచ్చే రాక్షసేన్ద్రభయప్రదమ్ ||

ఏనుగుల రాజును కొట్టగా అది వెనుదిరిగి పడిపోతూ రాక్షసులకు భయమగునట్లు ఘీంకారము చేసింది.33

తతః క్రుద్ధో యజ్ఞశత్రుః ప్రాహిణోద్రథసాదినమ్ | తం దేశం యత్ర హనుమాన్ ప్రస్థితో వ్యోమ్ని గర్జతి ||

అప్పుడు కోపంతో యజ్ఞ శత్రువయిన ధూమ్రాక్షుడు తన రథసారథిని దూరంగా గర్జన చేస్తున్న హనుమంతుడు ఉన్న ప్రదేశానికి రథాన్ని నడపమన్నాడు. 34

స గత్వా వాయుజన్మానం శరానాశీవిషోపమాన్| అష్టౌ సన్ధాయ ధనుషి వ్యాహరన్ తదిదం వచః ||౩౫

కోపించి రాక్షసుడు ఆకాశములోకి ఎగిరి హనుమంతునిపై 8 బాణములను ప్రయోగించి అతనితో ఇలా అన్నాడు.

ధూమ్రాక్షః-

భవాన్ హరీన్ద్ర యదిమాన్ సహతే యది సాయకాన్ | అస్మాద్విత్రాసితస్సంఖ్యాత్ పాతాలముపయామ్యహమ్|| ౩౬

వానరుల ప్రభువా! నేను ప్రయోగించిన 8 బాణములను త్రిప్పికొడితే నేను యుద్ధభూమిని వదలి పాతాళమునకు పోతాను.

బ్రహ్మో

ఇత్యుక్త్వా ప్రాహిణోద్బాణానష్టౌ తానసురోత్తమః | పఞ్చశీర్షాణి వాహీన్ద్రానాకాశే జ్వలదర్చిషః ||౩౭

ఇలా చెప్పి రాక్షసుల్లో ఉత్తముడైన ఆ ధూమ్రాక్షుడు అతనిపై ఎనిమిది బాణాలు ప్రయోగించాడు. ఆకాశంలో అయిదు శీర్షాలతో మండుతూ అవి హనుమంతుని మీదికి వచ్చాయి.

దుర్ధర్షాన్ వారయామాస హేతిరాజేన మారుతిః ।

హనుమంతుడు  ఎదిరించటానికి వీలుకాని ఆ  బాణములను తన చక్రాయుధముతో తొలగించాడు.

వ్యర్థం కర్మ స విజ్ఞాయ వితతీకృతకార్ముకమ్। మారుతిం తోషయన్ సఖ్యే వచనం చేదమబ్రవీత్ ||౩౮

తనబాణములు వ్యర్థముకాగా  తన చర్య ఫలించలేదని గ్రహించి తన విల్లును ధూమ్రాక్షుడు దూరంగా విసిరాడు. మారుతితో స్నేహ పూర్వకంగా ఈ మాటలు చెప్పాడు.

ధూమ్రాక్షః

వానరేన్ద్ర న చైవాసీత్ త్రిషు లోకేషు తే సమః । వర్తతే నైవ సుమతే న చ వావిర్భవిష్యతి ||౩౯

ఓ వానర ప్రభువా! ఓ సుమతీ! మూడు లోకాలలోనూ నీతో సమానం ఎవరూ లేరు.  ఇక ముందుకూడా  పుట్టబోడు. 39

అయమేకో విముక్తశ్చేచ్ఛరో మే సంయుగే రుషా । బిభేతి స్వేన సైన్యేన సాక్షాదివ దివస్పతిః ||౪౦

నేను ప్రయోగించిన ఒక్క బాణమే యుద్ధంలో అందరిని దడదడలాడిస్తుంది. ఇంద్రుడంతటివాడు కూడా ఆ ఒక్క బాణ ప్రయోగంతో  సైన్యంతో వణికిపోతాడు.

అష్టానామపి బాణానాం నిహన్త్రే హరయే నమః । సుఖీ భవ హనుమాంస్త్వమితో యాస్యామ్యధస్థలమ్ ||౪౧

అలాంటిది నేను  ప్రయోగించిన  మొత్తం ఎనిమిది బాణాలను నాశనం చేసావు. . నీకు నమస్కారము. సుఖీభవ! నేను పాతాళమునకు వెళ్ళుచున్నాను.”

బ్రహ్మ।

ఇతి బ్రువన్నధో యాతో యోధాస్య చరణే హతః । వైసారథ్యం మృథే యస్య న జానన్తి సురర్షయః ||౪౨

ఇలా చెప్పి  ధూమ్రాక్షుడు ఆకాశం నుండి కిందకి దిగి చటుక్కున అదృశ్యుడై పాతాళానికి వెళ్ళిపోయాడు .. దేవతలకు ఋషులకు  భూమి మీద అతని రథంతో పాటు అతని ఆచూకీ కూడా  తెలియలేదు. 42

గతే తు తస్మిన్ ధూమ్రాక్షే భీమాక్షః క్రోధమూర్ఛితః । భక్షితోఽయమితి జ్ఞాత్వా హనుమన్తముపాద్రవత్ || ౪౩

అతని తమ్ముడు భీమాక్షుడు తన అన్న కన్పించనందున, తన అన్నని  ఆంజనేయుడే మింగి ఉంటాడని భావించి తలచి చాలా కోపంతో ఆంజనేయుని వైపు పరిగెత్తాడు. (ఆంజనేయుని ఎదిరించాడు.)

ఇతికర్తవ్యతామూఢం భీమాక్షం ప్రేక్ష్య మారుతిః । ధనురారోపణాత్ పూర్వం తాడయామాస వేగతః । ।౪౪

మారుతి తన కర్తవ్యం గురించి ఆలోచిస్తూ అయోమయంలో ఉన్న భీమాక్షుని వైపు చూశాడు. అతను విల్లును అమర్చుకోవటానికి ముందే , దానిని త్వరగా విరిగేటట్లు కొట్టాడు. .44

తాడితో గణ్డభాగే చ ప్రభ్రష్టస్స్యన్దనోత్తమాత్ । బభ్రామ శోణితోద్గారీ ముహూర్త భ్రాన్తచేతనః । ।४५

భీమాక్షుడు చెంపపై కొట్టబడ్డాడు . అద్భుతమైన రథం నుండి విసిరివేయబడ్డాడు . ఒక్క క్షణం రక్తపు వాంతులు చేసుకుంటూ భీమాక్షుడు అయోమయంలో పడ్డాడు.

తం దృష్ట్వా భీమకర్మాణం హనూమన్తమథాహవే । న శర్మ లేభిరే తత్ర కాలకేయా భయాద్రుతాః ।। ४६

యుద్ధంలో భయంకరమైన పనులు చేస్తున్న హనుమంతుడిని కాలకేయ రాక్షససైన్యం చూసారు. ఏ మాత్రం సిగ్గుపడక వారు భయపడి పారిపోయారు. 46

రథపృష్ఠావలమ్బం తం దృష్ట్వా పాణినిషేవిణః। హాహాకారం ప్రకుర్వన్తః ప్రాద్రవంస్తే దిశో దశ ।।४७

భీమాక్షుడు రథం వెనుకకు ఆనుకుని ఉండడం చూచి కాలకేయులు భయముతో హాహాకారము చేస్తూ పది దిక్కులకు పరుగెత్తారు. .

విశేషాలు

1. తూర్పు, 2. పడమర, 3. ఉత్తరము, 4. దక్షిణము, 5. ఐశాని, 6. నైరృతి, 7. వాయవ్యము, 8. ఆగ్నేయము, 9. ఊర్ధ్వదిశ, 10. అధోదిశ [ఇంద్రుడు, వరుణుడు, కుబేరుడు, యముడు, శివుడు, నిరృతి, వాయువు, అగ్ని, బ్రహ్మ, శేషుడు-వీరు క్రమముగా దశదిశలకు అధిపతులు].

క్షణేన లబ్ధసంజ్ఞస్తు భీమాక్షో భీమవిక్రమః । పాతాలభేదినం నాగమారురోహ మహారథః ।।४८

ఒక క్షణంలో భయంకరమైన పరాక్రమం కలిగిన భీమాక్షుడు స్పృహలోకి వచ్చాడు. ఆ మహారథి అయిన భీమాక్షుడు(అసహాయుడై పది వేలమంది విలుకాండ్రతో యుద్ధము చేయువాడు.) పాతాళ భేది అను ఏనుగును ఎక్కాడు. 48

ఆరుహ్య నాగమాయాన్తమాలోక్య సహసా కపిః । భుజమాస్ఫోటయానస్తు ఖస్థ ఏవమభాషత ।।४९

ఏనుగు పైన వచ్చు భీమాక్షుని చూచి హనునుంతుడు భుజాస్ఫోటనము( భుజములను వీరోచితముగా చరచుకొనుట) చేసి ఆకాశము నుండి 'వానిపైకి దూకి ఇలా అన్నాడు. 49

అరే భీమాక్ష దైతేయ ధైర్యమస్తి రణాఙ్కణే । తవ మూర్ధ్ని పతన్తం మాం సహస్వ బలభావితమ్ ।।५०

ఓ, భీమాక్షా! రాక్షసుడా! నీకు యుద్ధరంగంలో ధైర్యం , ఓపిక ఉంది. నీ తలపై బలంగా పడుతున్న దెబ్బను భరించు 50

ఇత్యుత్ప్లుత్య వియద్భాగే స్థిత్వా వానరపుఙ్గవః । గజోపరి స్థితస్యాస్య మూర్ధ్ని వేగాత్పపాత హ ।। ५१

ఇలా  చెప్పి వానరుల అధిపతి దూకి ఆకాశంలో నిలబడ్డాడు .  ఏనుగుపై స్వారీ చేస్తున్న  భీమాక్షుని  తలపై బలంగా పడబోయాడు 52

తస్మిన్ పతతి దుర్ధర్షే వనౌకసి గజోపరి । భూతాని నైవ శేకుస్తం వేగవన్తముదీక్షితుమ్ ॥

ఆంజనేయుడు ఆ అడవి  ఏనుగుపై ఉన్న అజేయుడైన భీమాక్షునిపై  పడుతుంటే ,  శరవేగంగా ఉన్న ఆంజనేయుని  వైపు జీవులు చూడలేకపోయాయి. (హనుమంతుని వేగం అలాంటిదని ప్రశంస)

తం పతన్తం తతో బుద్ధ్వా నేతారం జగతామివ మాయావీ స తు భీమాక్షో గజాత్ తస్మాదపాసరత్ ।। ౫౩

మాయావియగు భీమాక్షుడు హనుమంతుడు తనపై  పడబోవు చుండగా చూచి ప్రక్కకు జారుకొన్నాడు.53

అపాక్రమన్తం భీమాక్షమజానన్మారుతిస్తథా । నిపపాత న తన్మూర్ధ్ని  వేగావిష్టో గజోపరి ॥౫౪

భీమాక్షుడు  జారుకొంటున్న విషయం గమనించని  మారుతి  అతివేగంతో ఏనుగు తలపై పడ్డాడు.54

పాదాగ్రహతిమాత్రేణ చూర్ణీభూతో గజాధిపః । నైఋతా అపి పార్శ్వస్థా ఉరువేగేన చూర్ణితాః ॥౫౫

తన మీద హనుమంతుడు పడగానే ఏనుగు  చూర్ణమయింది. ఏనుగు పక్కన ఉన్న  అంగరక్షకులు కూడ నలిగిపోయి చూర్ణమయ్యారు.  55

హనూమానపి విజ్ఞాయ రాక్షసం మాయయా గతమ్ । వితథం కర్మ చ తథా చిన్తామేవ ప్రపద్యత । ౫౬

మాయ చేసి భీమాక్షుడు తప్పించుకున్నాడనే విషయం  హనుమంతుడు  గమనించాడు . తర్వాత ఏమి చేయాలని ఆలోచించాడు. 56

అథ రక్షోఽధిపసుతో భీమాక్షో భీమవిక్రమః । మాయీ దివముపస్థాయ శరవర్షమవర్షత ॥౫౭

ఆ తరువాత కుంభోదరుని కుమారుడు, భయంకర పరాక్రమము కలిగిన వాడు, మాయావి అయిన భీమాక్షుడు ఆకాశములో ఉండి బాణ వర్షాన్ని కురిపించాడు.57

తత్ర సర్వాణి భూతాని భీమాక్షం సమరే తదా । దదృశుర్నైవ బాణౌఘం పశ్యన్తి స్మ వియత్పదే ॥౫౮

భీమాక్షుడు యుద్ధరంగంలో కనిపించడం లేదు కానీ అతని బాణాలు మాత్రమే ఆకాశంలో అందరికీ కనిపిస్తున్నాయి.58

కియత్ విలమ్బం ప్రసహే ఇత్యాలోచ్య స మారుతిః । దృశ్యాదృశ్యగతిర్వ్యోమ్ని చన్ద్రో మేఘ ఇవైక్షత ।। ౫౯

భీమాక్షుని చంపటానికి ఇంకా ఎంత కాలం వేచి ఉండాలి  అనిఆలోచిస్తున్న హనుమంతునికి మేఘాల చాటున కనీకనిపించకుండా ఉన్న చందమామలా భీమాక్షుడు కనిపించాడు.59

యథా దృష్టో హనుమతా గృహీతస్తు తదా పదే । ఘూర్ణితం ప్రథమం ప్రాణాన్ ప్రాహిణోద్యమసాధనమ్ ।

**ఆంజనేయస్వామి చాలా మెలకువతో భీమాక్షుడు ఉన్న చోటును కనిపెట్టి, చాకచక్యంగా అతని రెండు కాళ్లు పట్టుకొని లాగి గొప్ప బలంతో గిరగిరా తిప్పి భీమాక్షుని విసిరి వేసాడు.60**

స వై ముహూర్తం భీమాక్షం కుమ్భోదరసుతం తథా । ఘూర్ణయన్ పరిచిక్షేప యోజనానాం శతం బలీ

**పరాక్రమవంతుడైన ఆంజనేయ స్వామి క్షణకాలంలో కుంభోదర కుమారుడయిన భీమాక్షుని గిరగిరా తిప్పుతూ 100 యోజనాల దూరం విసిరాడు. 61( యోజనమనగా ఎనిమిది నుంచి తొమ్మిది మైళ్లు)**

తం ప్రేరయిత్వా రక్షోభిరనేకైర్యమసాదనమ్ । విత్రాసయన్నరీంస్తత్ర రాజానం ప్రాప్తవాన్ హరిః ॥౬౨

**భీమాక్షునితోపాటు మరి కొంతమంది రాక్షసుల్ని కూడా కలిపి యమనివాసానికి ఆంజనేయుడు పంపించాడు .చావగా మిగిలిన వారిని భయపెట్టి, ఇంద్రద్యుమ్న మహారాజు దగ్గరకు మారుతి చేరాడు. 62**

తం ప్రాప్తవన్తం నృపతిస్సమీరణభువం తదా । పస్పర్శ పాణినా గాత్రం హర్షోత్ఫుల్లతనూరుహః ॥౬౩

**ఆ విధంగా విజయంతో తన దగ్గరకు చేరిన ఆ వాయు పుత్రుని ఇంద్రద్యుమ్న మహారాజు తన చేతితో తాకి పులకించిన శరీరము కలిగిన వాడయ్యాడు .63**

దేవదున్దుభయో నేదుః పుష్పవర్షా దివశ్చ్యుతాః । సాధు సాధ్వితి భూతాని ప్రశశంసుర్నభస్థలే ॥౬౪

**దేవ దుందుభులు సంతోషంతో మోగాయి .దేవతలు పూలవర్షం కురిపించారు .బాగా చేసారు బాగా చేసారు అని అందరూ హనుమంతుని, ఇంద్రద్యుమ్న మహారాజుని ప్రశంసించారు.64**

పలాయమానా దిశి యే అవశిష్టా రణాజిరే। తే మిలిత్వా పురీం ప్రాప్తా భర్తుర్భయనివేదినః

**యుద్ధములో చావక ప్రాణభయంతో దిక్కుల వెంట పరిగెత్తిన రాక్షసులు కుంభోదరుని దగ్గరకు చేరి అతనికి జరిగిన విషయాన్ని వివరించారు.65**

నిశమ్య కుమ్భోదర ఏష తౌ రణే నిశమ్య పుత్రౌ నిహతావితి స్ఫుటమ్ । రుషాన్వితస్సజ్యధనుః ఖరాన్వితం రథం సమారుహ్య పురాద్వినిర్యయౌ ॥ ౬౬

**యుద్ధములో తన పుత్రులు మరణించారన్న విషయం స్పష్టము కాగా కుంభోదరుడు కోపించి, విల్లును ధరించి స్వయముగా గాడిదలు లాగే తన రథాన్ని ఎక్కి పురము బయటికి వచ్చాడు66**

స లబ్ధవర్ణో రణకర్మసు స్వయం పురత్రయారాతిముపేత్య పూజయన్ | ' వరం చ తస్మాత్ ప్రతిగృహ్య దుర్మదః పలాశినాం ప్రాగ్రసరస్తదాబభౌ ||౬౭

ఆ విద్వాంసుడయిన కుంభోదరుడు స్వయముగా త్రిపురాసురులను జయించిన ఆ పరమశివుని పూజించాడు. అనేక వరాలను పొంది నాయకత్వం వహించి యుద్ధానికి వచ్చాడు.67

రథస్య తస్యోపరిభీమకర్మణో నిపేతురుల్కాశ్శతశో భయఙ్కరాః | ప్రణేదురుచ్చైరశివం శివాస్తదా భయావహా రాక్షసచక్రవర్తినః ||౬౮

అతను రథముపై బయలుదేరుతుండగా రాక్షస చక్రవర్తికి అశుభాన్ని సూచిస్తూ వందలాదిగా భయంకరమైన ఉల్కలు(=ఆకాశమునుండి పడు తేజఃపుంజములు) రథం మీద పడ్డాయి. 68

మహారథస్యాహవరఙ్గవర్తినస్తరస్వినస్స్యన్దనమూర్ధ్నివిష్ఠితాః | జవాదధ శ్యేన పరంపరాస్తదావితేనురుచ్చైః పరివేషణక్రియామ్ |

వేగవంతమైన అతని రథాల పైభాగంలో గ్రద్దలు కూర్చున్నాయి. పెద్ద స్వరాలు చేస్తున్నాయి. 69

శతంశతం కుణ్డలినోద్యతాయుధా: పలాశరాజస్య మతానుగామినః | రథాధిరూఢాశ్చ పరప్రమాథినః పురాన్నిరీయుః కతిచిత్ ఖరాన్వితాః | ||౭౦

వందలాదిమంది చెవిపోగులు , ఆయుధాలు ధరించి, ఆ రాక్షసరాజు కుంభోదరుని అనుసరించారు. వారు రథాలు ఎక్కి నగరం నుండి బయలుదేరారు. కొందరు గాడిదలపై ఎక్కి వచ్చారు. ||70||

మహారథానాముపరిస్థితాః ఖగా మహారథానాం భ్రమతోహ్యదక్షిణమ్ | ప్రసహ్య చక్రుః ప్రసభంతరస్వినః ప్రణేతురుచ్చైర్బలిభోజినాం గణాః ||౭౧

వారి గొప్ప రథాలపై పక్షులు అప్రదక్షిణంగా ప్రయాణించాయి. బలిని తిను కాకుల సమూహం పెద్దగా శబ్దం చేసింది.

స తాననాదృత్య శరాసబృంహితైర్దిశశ్చతస్రో నినదైః ప్రపూరయన్ | పయోధరస్స్ఫూర్జధుభిర్యథా నభస్థితస్తథాజృమ్భత సఙ్గరస్థితః | | ౭౨

కుంభోదరుడు ఆ అశుభ శకునాలను వాటిని పట్టించుకోకుండా మేఘాల పిడుగుల ధ్వనులు అకాశంలో ధ్వనించినట్లుగా అలా యుద్ధరంగంలో నాలుగు దిక్కులను తన బాణాల ధ్వనులతో నింపాడు72

స మణ్డలీకృత్య ధనుశ్శరోత్తమా దశాష్టపఙ్క్తాహవమూర్ధ్న్యయోజయత్ | జవేన లక్ష్యం విరచయ్య మారుతి మహీపతిం చ క్షణదాచరేశ్వరః ||౭౩

తన బాణ సమూహముతో ఆ రాక్షస ప్రభువు కుంభోదరుడు మారుతికి,ఇంద్రద్యుమ్న మహారాజుకు త్వరగా లక్ష్యాన్ని నిర్దేశించాడు73

తదా నరేన్ద్రస్య శరాసనం కరాచ్చ్యుతం శరారోపణ కాల ఏవ హి | ప్రభగ్నమేతస్య రథాక్షకూబరం ప్రభగ్నజఙ్ఘాశ్చ ఖరాస్తు యుగ్యాః ||౭౪

అప్పుడు బాణం వేసే సమయంలో రాజు యొక్క విల్లు అతని చేతిలో నుండి పడిపోయింది. ఈ రథం ఇరుసు విరిగిపోయి రథాన్ని నడిపే గాడిదల కాళ్లు విరిగాయి.74

అథైనమాయాన్తముదీక్ష్య సత్తమః క్షణాద్వితీయం విరచయ్య కార్ముకమ్ । హనూమతా వేగవతా రణస్థలీముపేయివాన్ ప్రాగ్రసరో ధనుష్మతామ్ ||౭౫

అప్పుడు, కుంభోదరుడు అలా  రావడం చూసి,  ఇంద్రద్యుమ్నుడు ఒక క్షణము  తన విల్లును లాగాడు. బాణప్రయోగంలో అగ్రేసరుడైన హనుమంతుడు చాలా వేగంతో యుద్ధభూమికి చేరుకున్నాడు 75

ఉపేత్య గాన్ధర్వముదగ్రధన్వినాం పురస్థితశ్శస్త్రమనిన్ద్యవిక్రమః ।
ప్రసహ్య నాసీరభటేషు కేషుచిద్విముచ్య బాణాంశ్చ తుతోష సానుగః ||౭౬

రాక్షస ప్రభువయిన  కుంభోదరుడు    గాంధర్వవిద్య తెలిసిన , వారి నిష్కళంకమైన పరాక్రమం గల ధనుశ్శాలి ఇంద్రద్యుమ్నుని ముందు నిలబడ్డాడు. తన సైనికులను  బాణాలు వేయమని బలవంతం చేసాడు. అనుచరుల బాణ విద్యకు  సంతృప్తి చెందాడు 76

యమక్షయం నీతముదీక్ష్య సైనికం నిశాచరేన్ద్రః కుపితో ధనుర్ధరః । అధీశముద్వీక్ష్య నృణామనన్యధీరాగ్నేయమస్త్రం ప్రముమోచ వేగవాన్ ||౭౭

రాక్షస ప్రభువయిన  కుంభోదరుడు  , యమ విధ్వంసం చేసిన  ధనుర్ధారి ఇంద్రద్యుమ్నుని చూసి  కోపించాడు.   ఆ రాజేంద్రుని ఇంద్రద్యుమ్నుని చూస్తూ అసహనంతో ఉన్న కుంభోదరుడు అగ్నేయాస్త్రాన్ని ప్రయోగించాడు. 77

స వారుణేనైవ రురోధ సంభ్రమాన్నభస్థలే విజ్వలితం దురాసదమ్ । తదస్త్రమస్త్రాగమవేదిశేఖరో దివౌకసాం ప్రాగ్రసరేణ తోషితః ||౭౮

అద్భుతంగా ఆకాశంలో మండుతున్న అజేయమైన  ఆగ్నేయాస్త్రాన్ని  అస్త్రాగమవేది(అస్త్రాలు ప్రయోగించుటలో పండితుడు)  అయిన ఇంద్రద్యుమ్నుడు  వారుణాస్త్రంతో  ఆపాడు. స్వర్గలోకంలోని మొదటివారు అనగా ఉత్తమోత్తములయిన దేవతలు  సంతోషపడ్డారు. 78 (అస్త్రము అనగా మంత్రప్రయోగాదులవలన శక్తిపొంది  శత్రువులను జంపి తిరిగివచ్చు బాణము. వీటిలో అగ్ని, వరుణ మొదలయిన దేవతాసంబంధమయిన అస్త్రాలు ఉంటాయి.)

అథో హనూమానపి వేగదర్శినామనుత్తమః పాణిధృతేన హేతినా । నివారయామాస శరౌఘమాశరప్రమోచితం తానపి సఞ్జఘాన హ || ౭౯

అప్పుడు యుద్ధ వేగాన్ని చూపేవారిలో శ్రేష్ఠుడైన హనుమంతుడు కూడా చక్రాయుధాన్ని చేతిలో పట్టుకొని,  శత్రు బాణాల ప్రవాహాన్ని ఆపి వారిని వధించాడు 79

క్షణేన తత్ర వ్యథితా యమక్షయం నీతా హనూమత్కరశాలినారిణా । కుమ్భోదరో నామ నిశాచరేశ్వరస్స ఏక ఏవ స్థితిమేయివాన్ రణే ||౮౦

క్షణంలో, సైన్యం  హనుమంతుని చేతితో యమరాజు నివాసానికి తీసుకువెళ్ళబడింది.  రాక్షసరాజు కుంభోదరుడు  యుద్ధంలో ఒంటరిగా నిలిచాడు.80

స తత్ర రుష్టో రణమూర్ధ్ని హృష్టో నక్తఞ్చరేన్ద్రశ్శరజాలముచ్చకైః । ససర్జ కల్పాదిషు తాః ప్రజా ఇవ ప్రజాపతిస్తత్ర జగర్జ సానుగః ॥౮౧

రాక్షస రాజు కుంభోదరుడు యుద్ధభూమిలో కోపంతో ఉన్నతంగా వరుసగా బాణసమూహాలు ప్రయోగిస్తూ , సృష్టికర్త కల్ప ప్రారంభంలో వరుసగా సంతానాన్ని సృష్టించి ఆనందించినట్లుగా "ఎన్నో బాణాలు వేస్తున్నా"నని తనలోతాను యుద్ధభూమిలో ఆనందించాడు . ఆ సమయంలో పర్వతశిఖరం పరస్పర బాణధ్వనులతో గర్జించినట్లుగా ఉన్నది. 81

సమీరజన్మాపి రుషావలిప్తః క్లిప్తాట్టహాసో జలజం ప్రదధ్మౌ । నివార్య నక్తఞ్చరరాజముక్తం చక్రేణ చాసీద్రణమూర్ధ్ని హృష్టః ॥౮౨

వాయుపుత్రుడైన హనుమంతుడు కూడా కోపంతో మురిసిపోతూ, శంఖాన్ని ఊది రాక్షసరాజు ప్రయోగించిన బాణములను చక్రముచేత నివారించాడు. కుంభోదరుడు అతని శక్తికి మెచ్చి సంతోషపడ్డాడు. 82

\

ప్రధ్మాతశఙ్ఖం ప్రసమీక్ష్య మారుతిం నిశాచరః కోపవశం గతస్తదా । విజ్ఞాయ మోఘం స్వశరౌఘమాహవే తపః ప్రభావార్జితశూలమాదదే ॥౮౩

తరువాత హనుమంతుడు ఊదుతున్న శంఖాన్ని చూసి రాక్షస రాజు కుంభోదరుడు ఉగ్రరూపం దాల్చాడు. యుద్ధంలో తన బాణాలు వ్యర్థమయ్యాయని గ్రహించి తన తపస్సుల శక్తితో సంపాదించిన శూలాన్ని తీసుకున్నాడు.( శివునివల్ల సంపాదించి నిత్యం ఆరాధించే త్రిశూలాయుధము) 83.

స శూలమాదాయ నిశాచరః కరే పదే పదే చన్దనపఙ్కచర్చితమ్ । రణే హయస్యన్దనసూతమాధినం సమీరజన్మానముదీక్ష్య సోఽబ్రవీత్ ॥౮౪

రాక్షస రాజు కుంభోదరుడు తన చేతిలో అడుగడుగునా చందనం పూసిన శూలం పట్టుకుని , వాయుపుత్రుడైన హనుమంతునితో ఇలా అన్నాడు. .84

కుమ్భోదరః-

వలీముఖోఽసి త్వమతిప్రసహ్య వై స రాక్షసం చాపి భవాన్ ప్రబాధతే । ఇమం విమోక్ష్యే త్రిశిఖం పురారిణా ప్రదత్తమున్మత్తవిశీర్య పాతితమ్ ॥౮౫

ఓ "మదించిన ఓ వానరమా! నీవు నా వీరులను చంపావు. త్రిపురారి అయిన శివుడు నాకు ఇచ్చిన ఈ త్రిశూలాన్ని నీపై ప్రయోగిస్తున్నాను. ఇక కాచుకో. నీ పని అయిపోయింది."85

స చక్రశఙ్ఖాఙ్కభుజం చ వానరం స చాపబాణాసిధరం చ భూపతిమ్ । ప్రవధ్య సంఖ్యే త్రిశిఖేన చామునా ప్రమార్జయేఽశ్రూణి నిశాటసుభ్రువామ్ ॥౮౬

అని పై విధంగా చెబుతూ రాక్షస రాజు కుంభోదరుడు అప్పుడు చక్ర శంఖాలతో ఉన్న హనుమంతుని, విల్లు బాణాలు మరియు కత్తితో ఉన్న రాజును చూసాడు." నేను ఈ త్రిశూలంతో మిమ్మలిని యుద్ధంలో చంపి, రాత్రియందు తిరుగు రాక్షసుల కనుబొమ్మల నుండి కారు కన్నీరు తుడుస్తాను"అన్నాడు.86

బ్రహ్మో

ఇతీరయన్, రాక్షసశేఖరో భువి స్థితో దురాత్మాఽ లఘువిక్రమో బలీ | దురాసదం దుర్విషహన్తధాయుధం ముమోచ మర్త్యక్షతజాభిషేచితమ్ ||౮౭
ఇలా చెప్పి దుష్టబుద్ధి కలవాడు, తేలికకానివాడు, బలవంతుడయిన  రాక్షసశేఖరుడు కుంభోదరుడు  నేలమీద నిలబడి, మర్త్య రాజుల రక్తాలతో అభిషేకము చేయబడిన త్రిశూలాన్ని   ఆంజనేయుని, ఇంద్రద్యుమ్నుని వధించడంకోసం ప్రయోగించాడు.87

విముచ్యమానే త్రిశిఖే వియత్పథే విజృమ్భమాణే విరతప్రమాదిని | విత్రస్తుస్తస్య తథావిధాయుధం నిరీక్ష్య సేన్ద్రాశ్చ సురా విదుద్రువుః ||
ఆ త్రిశూలం  ఆకాశ మార్గంలో జ్వలిస్తూ అందరి  పైకి వచ్చింది . దానిని చూసి భయపడిన దేవతలు మరియు ఇంద్రుడు పారిపోయారు.88

రాజా స తస్యాగతిమీక్షితుం ప్రభుం నృసింహతేజోభజనేన హేతునా | తతో హనూమానపి శక్తిమాన్ మృధే బభూవ హేతిప్రసవేన తేజసా |
రాజు  నృసింహదేవుని ప్రకాశాన్ని పూజించిన కారణముతో పైకి వస్తున్న ఆ  త్రిశూల తేజస్సును చూడగలిగాడు.   హనుమంతుడు కూడా నరసింహదేవుని చక్ర  తేజస్సుతో శక్తిమంతుడయి దానిని చూడగలిగాడు.89

నృపోత్తమోఽసౌ దివి శూలముజ్వలం పరార్ధ్యబాణాస్త్రసహస్రదుర్గమమ్ | తం కాలదణ్డప్రతిమం విలోకయన్ విచిన్తయామాస రణాఙ్కణస్థితః
రాజులలో ఉత్తముడయిన ఆ ఇంద్రద్యుమ్న మహారాజు చాలా శ్రేష్ఠమైన, వేలాది  బాణాలు  ఛేదించలేని కష్టతరముగా యముని పాశముతో సమానంగా   ప్రకాశించే త్రిశూలాన్ని చూస్తూ ఆలోచించాడు.90

సఞ్చిన్తయానం ప్రసమీక్ష్య దూరితిర్నిరాహ భూపాలమిదం వచస్తథా | విలమ్బనం కిం కురుషే నృపాహవే నారాయణాస్త్రం ప్రతిగృహ్యతామిదమ్ ||౯౧
“హనుమంతుడు   అపుడు ఇంద్రద్యుమ్నుని  దగ్గరకు పోయి,త్రిశూలాన్ని  జయించగలిగినది నారాయణాస్త్రం ఒక్కటే అని, దానిని ప్రయోగించమని, ఆ లస్యమెందుకు చేస్తున్నావని అతనికి గుర్తు చేసాడు91

ప్రబోధితో భూపతిశస్త్రముత్తమం తథా న దైత్యప్రవరేణ దుస్సహమ్ | అనేకదీప్తాంశుకరాభముజ్జ్వలం ముమోచ ఫాలం ప్రత వైరిగర్వితః | | ౯౨
హనుమంతుని ప్రబోధంతో ఇంద్రద్యుమ్నుడు  రాక్షసుల అధిపతి కుంభోదరుడూ భరించలేని,  అద్భుతమైన,  నారాయణాస్త్రాన్ని అభిమంత్రించి లోకకల్యాణార్థంగ త్రిశూలంపై ప్రయోగించాడు. ఆ అస్త్రం కోటిసూర్యుల ప్రకాశంతో వెలుగుతూ  త్రిశూలంపైకి వచ్చి తాకింది.92

పరస్పరం తావభిహన్యమానౌ నభస్థలే వీక్ష్య తథాయుధోత్తమౌ | సురా అమన్యన్త భుజఙ్గపుఙ్గవౌ మిథో నిగర్వేణ రణం గతావితి | | ౯౩
ఆ రెండు ఉత్తమదివ్యాయుధాలు ఒకదానితో ఇంకొకటి తలపడిన దృశ్యం  చూస్తూ రెండు ఉత్తమ సర్పాలు  ఒకదానితో  ఒకటి పోట్లాడినట్లున్నదని దేవతలు భావించారు. .93

చిరాయమాణే సతి శస్త్రపుఙ్గవే నారాయణేయాస్త్రవశంగతస్తథా | ప్రచోదితః ప్రాగ్రసరేణ దేహినాం సమీరజో హేతివరం ముమోచ ||౯౪
నారాయణాస్త్రం తిరిగి రావడం కొంచెం ఆలస్యం చేసిన క్షణంలో హనుమంతుడు తన చక్రాయుధాన్ని ప్రయోగించాడు.. 94

ప్రముచ్యమానే హరిహేతిరాజే వేగాసహిష్ణుస్త్రిశిఖో మహాయుధః | అమోఘవేగోఽపి సమోఘవేగో బభూవ వేగేన పరోక్షతాం గతః || ౯౫
ఆ సుదర్శన చక్ర ప్రభావంవల్ల త్రిశూలం భస్మమయింది. త్రిశూలము వ్యర్థము కానిదయినప్పటికీ వ్యర్థమయింది.  మరియు దాని వేగం పరోక్షంగా మారింది. . 95

పరోక్షభావం గమితే నిజేన వై నారాయణే చైవ స హేతిరాజః | ఉభౌ యథావస్థితిమభ్యగాతాం నృపస్య తూణఞ్చ భుజం హనూమతః || ౯౬
కుంభోదరుడు  తన గురించి మరియు నారాయణుడి గురించి పరోక్షంగా తెలుసుకున్నప్పుడు, నారాయణాస్త్రం తిరిగి వచ్చి ఇంద్రద్యుమ్నుని అమ్ముల పొదిలోకిచేరింది. చక్రాయుధం ఆంజనేయుని దగ్గరకు తిరిగి  చేరింది.96
తదా నిశమ్య ప్రవరః పలాశినాం స్థాతుం న శక్తో యుధి వాయుజన్మనః | విశంస మాయాం ప్రవిధూయమానో రసాతలం సానుచరస్సమావిశత్ ||౯౭
తరువాత ఈ విషయం విని తన ప్రయత్నాలన్నీ నిష్ఫలం కాగా రాక్షస ప్రభువు కుంభోదరుడు సిగ్గు పడి  ,  హనుమంతుడి ముందు నిలబడటానికి శక్తి లేక పాతాళలోకంలోకి రాక్టససేనలతో పాటుగా అదృశ్యమయ్యాడు97

పాతాలమభ్యేయుషి రాక్షసాధిపే కుమ్భోదరే దీనమనన్యచేతనే | వినేదురుచ్చైరమరేన్ద్రడిమ్డిమాస్సురర్షయోఽపి ప్రశశంసురమ్బరే ||౯౮
రాక్షసుల ప్రభువైన కుంభోదరుడు పాతాళ లోకంలోకి ప్రవేశించబోతున్నప్పుడు, అతను దిక్కులేని వాడై  దీనంగా ఉన్నాడు. ఇదివరకటి జీవితంలో  తన గురించి అధికంగా  తప్ప  వేరే వాటి గురించి తెలుసుకోలేకపోయాడు.  ఆ సమయంలో దేవతల రాజుల దుందుభులు బిగ్గరగా గర్జించాయి దేవతలు, మహర్షులు  ఇంద్రద్యుమ్నుని విజయానికి సంతోషించి ప్రశంసించారు. 98

దీప్తాంశుమన్తౌ దివి పుష్పవన్తీ దిశః ప్రసన్నాస్సుఖినో మహర్షయః | బభూవురిన్ద్రోఽపి సహానుయాయిభిర్గతవ్యథోఽముఞ్చత పుష్పవృష్టిమ్
ఆకాశము ప్రకాశించే కిరణాలతో ప్రకాశించింది.  దిక్కులు పూలతో నిండి పోయాయి. మహా ఋషులు సంతోషపడ్డారు.  ఇంద్రుడు మరియు అతని అనుచరులు  భయం, బాధ తీరగా  పూల వర్షం కురిపించారు .99

ఇతి బ్రహ్మకైవర్తే ఉత్తరఖణ్డే భృగుపరాశరసమ్వాదే ఘటికాచలమాహాత్మ్యే సప్తమో ఽధ్యాయః ||
బ్రహ్మ-కైవర్త పురాణంలోని ఉత్తరఖండంలో భృగువు మరియు పరాశరుని మధ్య జరిగిన సంభాషణలో ఘటికాచల మాహాత్మ్యంలో  ఏడవ అధ్యాయం పూర్తి అయినది.

+++++

శ్రీ శివాయ గురవే నమః

ఘటికాచలనివాసాయ శ్రీ నృసింహాయ నమః

బ్రహ్మకైవర్త పురాణములో ఉన్న  శ్రీఘటికాచల మాహాత్మ్యపు  ఎనిమిదవ  అధ్యాయము

(మూల శ్లోకము మరియు తాత్పర్య విశేషాలతో)

శ్రీఘటికాచలమాహాత్మ్యమ్

అష్టమోఽధ్యాయః

శ్రీపరాశరః

ఇతి బ్రహ్మణి విస్రబ్ధమపదానం ప్రవక్తరి | తుష్టువుః పరమప్రీతా ఋషయో బ్రహ్మవాదినః || ౧

శ్రీపరాశరుడు చెప్పుచున్నాడు.

ఈ విధముగా  పవిత్రమైన మంచి నడవడి - పరిశుద్ధాచరణము కలిగిన కథలను చెప్పుచున్న బ్రహ్మదేవుని యందు  అపారమైన గౌరవంకలిగిన ఋషులు చాలా సంతోషించి ఆయనను  స్తుతించి ఇలా అన్నారు.  1

ఋషయః

బ్రహ్మన్ ప్రవక్తా తథ్యం త్వం త్రిషులోకేషు విశ్రుతః । న హ్యన్యచేతనః క్వాపి కథాకథనలాలసః ॥౨

ఓ బ్రహ్మ దేవుడా! నువ్వు సత్యవంతుడివి. మూడు లోకాలలోనూ ప్రసిద్ధి చెందిన వాడివి .నీలాగా మనోహరమైన కథాకధన దక్షత కలిగిన వారు లేరు.2

త్వం వినా వచసాం దేవా హ్యభ్యేష్యతి జగత్రయే । త్వం వేదవేద్యో వేదాఙ్గనిష్ఠితో వైదికోత్తమః । ॥౩

మీ మనోహరమైన వాక్కులు విననిదే ఈ మూడు లోకాలలో దేవతలు అనుకున్నది సాధించలేరు. మీరు అన్ని వేదములు తెలిసిన వారు. వేదాంగముల యందు నిష్ఠ కలిగిన వారు. వైదికోత్తములు.3.

(శిక్ష-వ్యాకరణము-ఛంధస్సు నిరుక్తము-జ్యోతిషము-కల్పము అను ఆరు వేదము యొక్క అంగములు).

త్వమేవ జగతాం ధాతా వినీతోఽసి చతుర్ముఖ । త్వయైకేన ప్రజాస్సర్వాస్సృజ్యన్తే చతురానన ॥౪

మీరు విశ్వం యొక్క సృష్టికర్త. నాలుగు ముఖాలు కలిగిన వారు. మీ వల్లనే ఈ సమస్త ప్రాణులు సృష్టించబడ్డాయి.4

చతుర్భిశ్చతురో వేదాన్ సృజసి త్వం ముఖైరపి । ప్రసీద భగవన్ బ్రహ్మన్ సనకాదినిషేవిత ॥౫

మీరు మీ నాలుగు ముఖాలతో నాలుగు వేదాలను సృష్టించారు .సనకుడు మొదలైన మహర్షులచే సేవించబడు ఓ బ్రహ్మ దేవుడా! మాపై దయ చూపించు.5

అస్మాసు వ్యాకురు గుణాన్ పుణ్యశ్లోకానువర్తినః ।

శ్రీపరాశరః

ఇత్యం స్తుతో జగద్ధాతా ప్రసన్నో ఋషిసత్తమాన్॥౬

''ఉత్తమ నడవడిక కలిగిన వారి యొక్క చరిత్రలను మాకు వివరించండి'' అని ఋషులు వినయపూర్వకముగా వేడుకొనగా ఆ సృష్టికర్త ఋషుల పట్ల ప్రసన్నుడయ్యాడు.6

ఉవాచ సూనృతం వాక్యం ప్రహర్షమతులం భజన్ ।

బ్రహ్మే-

ఇన్ద్రద్యుమ్నోఽపి హనుమాన్ రణరఙ్గముపేయిషౌ ॥॥౭

అసమానమైన ఆనందాన్ని అనుభవిస్తూ బ్రహ్మదేవుడు ఆ తర్వాత ఏడవ అధ్యాయపు తదుపరి  కథని ఋషులకు ఇలా చెప్పాడు. ఇంద్రద్యుమ్నుడు హనుమంతుడు యుద్ధరంగాన్ని విడిచిపెట్టారు.7

## ఇంద్రద్యుమ్నుడు నరసింహపురమును పరిపాలించుట

శ్లాఘనీయౌ సురైస్సర్వైరాస్థితౌ హృష్టమానసౌ । తతో దేవాస్సగన్ధర్వాస్సేన్ద్రాశ్చ పరమర్షయః ।

ఇంద్రద్యుమ్నుడు మరియు  హనుమంతుడు సకల దేవతలచేత పొగడబడి సంతోషముతో ఉన్నారు. ఘటికాచలప్రాంతంలో క్షోభను కల్గించిన కాలకేయుల బెడద పూర్తిగా తీరేటట్లు చేసిన వారిని  దేవతలు మునులు పొగిడారు.  అప్పుడు దేవతలు, గంధర్వులు, ఇంద్రుడు,  మహర్షులు ఇంద్రద్యుమ్న హనుమంతుల దగ్గరికి వచ్చారు.8

రాజానమభిషేక్తుం వై నృహరిప్రేషితాయయుః ।

దేవాః -

ఇన్ద్రద్యుమ్న మహారాజ సదా రణవిశారద ।।౯

వారు ఇంద్రద్యుమ్న మహారాజుని రాజ్యంలో ప్రతిష్ఠించటానికి నరసింహస్వామి  ద్వారా పంపబడ్డారు .అందువలన ఆ దేవతలు ఇంద్రద్యుమ్న మహారాజుతో ఇలా అన్నారు ."ఓ మహారాజా యుద్ధములో నైపుణ్యము కలిగిన వాడా!9

వరం వరయ భద్రం తే వరం దాతుమిహాగతాః ।

ఓ మహారాజా !నీకు వరం ఇవ్వటానికి మేము ఇక్కడికి వచ్చాము. కనుక మీకు ఏం వరం కావాలో కోరుకోండి.

బ్రహ్మో

ఇతి తైరీరితో రాజా హర్షగద్గదచేతసః ||౧౦

అని దేవతలు అడుగగా ఇంద్రద్యుమ్న మహారాజు చాలా ఆనందాన్ని అనుభవించాడు.10.

అవలోక్యాగతాన్ సర్వానిదం హోవాచ దేవతాః ।

వచ్చిన దేవతలందరినీ చూసి గౌరవించి వారితో ఇంద్రద్యుమ్నుడు ఇలా అన్నాడు

ఇన్ద్రద్యుమ్నః

యది ప్రసన్నా యూయం మే వరదా యది దేవతాః । । ౧౧

నిజంగా మీరు దేవతలు అయితే, నేను చేసిన పని పట్ల సంతోష పడితే..... 11.

చిరాదీప్సితమేతన్మే బ్రాహ్మ్యం తేజః ప్రదీయతామ్ ।

నేను చాలకాలమునుండి కోరుచున్న బ్రాహ్మ్యమును (బ్రహ్మతేజాన్నిపొంది మోక్షపదవిని పొందడం) ప్రసాదింపుడు .

బ్రహ్మో

ఇత్థం రాజని బ్రాహ్మణ్యం ప్రార్థయత్యమితౌజసి ||౧౨

ఈ విధంగా బ్రాహ్మణ్యం కొరకు (బ్రహ్మతేజాన్నిపొంది మోక్షపదవిని పొందడం) ఇంద్రద్యుమ్న మహారాజు దేవతలను ప్రార్థించాడు.12

విచిన్త్య చ మిథో దేవా భూపాలమిదమూచిరే ।

ఒకరితో ఒకరు చర్చించుకున్న తరువాత దేవతలు ఇంద్రద్యుమ్న మహారాజుతో ఇలా అన్నారు.

దేవాః

సాధు పృష్టం త్వయా రాజన్ బ్రాహ్మ్యమన్యైర్దురాసదమ్ ||౧౩

ఓ మహారాజా! మీరు బాగా అడిగారు.బ్రాహ్మణ్యం(బ్రహ్మతేజాన్నిపొంది మోక్షపదవిని పొందడం)  పొందుట అందరికి సాధ్యము కాదు. 13

కశ్చిత్ కాలముషిత్వాత్ర రాజభావేన భూపతే|

శ్రీయోగనరసింహస్య ప్రభావేన భువి ప్రజాః | | ౧౪

.కొంతకాలం భూమిపై నిలచి ఉండి నరసింహుని అనుగ్రహముతో ఘటికాచల ప్రాంతాన్ని ప్రజారంజకంగా పాలనచేయవలసినది..14

పాలయన్నవిలమ్బేన బ్రాహ్మ్యతేజమ్ ఉపేష్యసి |

ఘటికాచల స్వామి అనుగ్రహంవల్ల రాజ్యపాలన చేసిన తరువాత నువ్వు కోరిన  బ్రాహ్మణ్యమును (బ్రహ్మతేజాన్నిపొంది మోక్షపదవిని పొందడం) పొందగలవు.''

బ్రహ్మే

ఇత్యుక్తవన్తో రాజానం సేన్ద్రాస్సహమరుద్గణాః ||౧౫

ఈ విధంగా ఇంద్రుడు మరియు  మరుద్గణాలు ఇంద్రద్యుమ్న మహారాజుకి చెప్పారు.15

విశేషాలు

మరుత్తులు అనగావాయువులు. దితి-  ఇంద్రుని చంపునట్టి కొడుకు కావాలి అని కశ్యపుని ప్రార్థింపగా అతడు అనుగ్రహించి గర్భమును కలుగచేసి 'నూఱేండ్లు ఈగర్భమును నియమముతో కాపాడుకొంటే  నువ్వు కోరుకొన్న  బిడ్డ నీకు పుడతాడు' అని చెప్పాడు . ఆమె అట్లే అలాగే నియమముతో ఉండి నూఱేండ్లు నిండుటకు కొంతకాలము మిగిలి ఉండగా  నియమం ఆమెకు  కొంచెం తప్పింది.  అంత సమయము చూచుచు ఉండిన దేవేంద్రుడు ఆమె గర్భములో ప్రవేశించి ఆశిశువును తన వజ్రాయుధముతో ఏడు తునియలుగా నరికాడు. అప్పుడు ఆశిశువు ముక్కలై  రోదన చేసే  సమయములో దితి 'మారుద మారుద' అని చెప్పెను. కనుక వీరు మరుత్తులు అను పేరుతో పిలవబడ్డారు. అంత ఇంద్రుడు దితిగర్భమున ఉండి బయటికి వచ్చి 'తల్లీ నీవు అశుచివై ఉన్నందువలన  ఇంతపని చేసాను ' అని ఆమెను మంచిమాటలచే సమాధానపఱిచి ఆమె కోరినట్లు ఆ ఏడుపిండములకు దీర్ఘాయువును ఇచ్చి సప్తలోకాలలో వాయురూపముగా తిరుగునట్లు అనుగ్రహించి వెళ్లాడు. ఈ కారణముగ మరుత్తులును, దేవతలును కలిసి ఉంటారు.

శ్రీనృసింహపురే తత్ర పురన్దరపురోపమే | తీర్థోత్తమాహృతైస్తైర్తైరభ్యషిఞ్చన్ దివౌకసః ||౧౬

దేవేంద్రుడు నృసింహస్వామి ఆజ్ఞతో ఇంద్రద్యుమ్నుని పట్టాభిషేకానికి తగిన సన్నాహాలను చేసాడు. ఇంద్రనగరి అయిన అమరావతితో సమానంగా అలంకరింపబడిన ఘటికాచలంలో, నాల్గు దిక్కులనుండి  పట్టాభిషేక తీర్థం తీసికొని వచ్చారు.16

ఇన్ద్రద్యుమ్నేఽభిషిక్తే తు సేన్ద్రైర్దేవర్షిసత్తమైః | సాధు సాధ్వితి భూతాని ప్రశశంసుర్జగత్రయే ||౧౭

ఇంద్రద్యుమ్నుడు మహారాజుగా పట్టాభిషేకం చేసుకున్నప్పుడు అక్కడ ఇంద్రునితో సహా దేవతలు ఋషులు కూడా ఉన్నారు .పట్టాభిషేకం తరువాత మూడు లోకాల్లోని జీవులందరూ ఇంద్రద్యుమ్నుని "బాగు! బాగు!" అని ప్రశంసించారు.17

దేవరాజస్తతో దేవైస్స్తూయమానో యశస్వినమ్ । ఉపసృత్య హనూమన్తమబ్రవీత్ ప్రాఞ్జలిస్తదా । ।౧౮

ఆ సమయంలో దేవతల రాజైన ఇంద్రుడు విశిష్టుడైన  కీర్తి శాలి అయిన హనుమంతుని దగ్గరికి వచ్చి చేతులు జోడించి ఇలా అన్నాడు 18

ఇన్ద్రః -

అభ్యర్చితోఽసి నృహరేర్త్వనుమన్ భక్తవత్సల । మద్వైరిబలహన్తుస్తే వరం దాస్యామ్యనుత్తమమ్ ।।౧౯

ఓ హనుమంతుడా ! నీ భక్తుల పట్ల దయ కలిగిన వాడా!నువ్వు శ్రీ నరసింహస్వామిచే గౌరవింపబడుటకు అర్హుడవు. నా శత్రువుల శక్తులను నాశనం చేయడానికి నీకు నేను ఒక అద్భుతమైన వరాన్ని ఇస్తాను.19

యతో నిష్కాసితో వైరీ పురాదస్మాన్మహీపతే। అధారభ్య పురీయం తే నామ్నాఖ్యాతా భవిష్యతి ।। ౨౦

నీవలన ఈ ఘటికాచలము నుండి శత్రువు పారిపోయాడు కనుక ఇకనుంచి ఈ నగరము"నీ పేరుతో  ప్రసిద్ది పొందుతుంది" అని ఇంద్రుడు వరం ఇచ్చాడు..  ఈ విధంగా రాక్షసుల ఉపద్రవాన్ని తీర్చిన హనుమంతునికి నమస్కరించి,ఘటికాచలప్రాంతానికి హనుమత్పురి అనే పేరును పెట్టి ఇంద్రుడు ఆనందించాడు. అప్పటినుండి ఘటికాచలాన్ని "హనుమత్పురి" అనే పేరుతో కూడా పిలుస్తారు.20

బ్రహ్మే

ఇతి దత్వా హనుమతే వరం వరయతే సురైః । సురర్షిభిస్తతో వజ్రీ స్వాం పురీమాజగామ హ ।।౨౧

ఈ విధంగా హనుమంతునికి దేవతలందరూ వరము ఇచ్చారు .ఆ తరువాత ఋషులతో కలిసి ఇంద్రుడు తన నగరానికి తిరిగి వచ్చాడు21

ప్రస్తూయమానో ఋషిభిః ప్రవరస్తు వనౌకసామ్ । హనూమానపి తేజస్వీ నృహరేః పదమభ్యగాత్ ।।౨౨

ఋషులు దేవతలు స్వస్థానములకు వెళ్ళారు.  హనుమంతుడు నృసింహుని దగ్గరకు వెళ్లాడు.  దేవతలు, మునులు తమ కోరిక నెరవేరినందున ఆనందంతో తమ తమ నివాసాలను చేరారు.22

చిరాయ రాజా రాజర్షివరేణ్యః పాలయన్ ప్రజాః । హనుమత్పురమభ్యేత్య తుతోష సహ భార్యయా ।। ౨౩

హనుమత్పురమును పాలిస్తూ  రాజు సుఖముగా ఉన్నాడు. రాజర్షియైన ఇంద్రద్యుమ్నుడు ఇంద్రుని మాటను అనుసరించి హనుమత్పురి అనే ఘటికాచలప్రాంతాన్ని చక్కగా పరిపాలించసాగాడు. అంతవరకు రాక్షసుల  భయంతో  మూలమూలలకు పోయి చేరిన అచటి ప్రజలు నరసింహ పురంలోని తమ తమనివాసాలకు చేరి, సుఖంగా యోగనరసింహస్వామి పూజలు చేయసాగారు. 23

స కదాచిన్నృపః పూర్వసన్ధ్యామన్వాస్య వైదికీమ్। శ్రీనృసింహమభిష్టోతుం ప్రాయాత్ పర్వతసత్తమమ్ ।।౨౪

ఒక రోజు రాజు ఉదయ కాలపు సంధ్యలో శ్రీనరసింహస్వామిని పూజించుటకు ఘటికాచలము ఎక్కటానికి బయలుదేరాడు. .24

ఆన్దోలికాం స్వర్ణమయీం సమారుహ్య మహీపతిః | సభార్యస్సపరీవారశిలాపుష్కరిణీమగాత్ || ౨౫

ఇంద్రద్యుమ్నుడు తన భార్యతోపాటు బంగారు పల్లకిపై ఘటికాద్రినాథుని సేవించాలని బయలుదేరాడు. శిలాపుష్కరిణి అనబడే కోనేటివద్దకువెళ్ళాడు. శిలాపుష్కరిణిలో భార్యతో కలిసి స్నానము చేసాడు.25

మధ్యేమార్గ మహాశైలే వన్దిత్వా దేవతర్షభమ్ | నృపతిః పరయా భక్త్యా తతస్తీర్థతటీమయాత్ ||౨౬

మార్గమధ్యంలో ఒక గొప్ప కొండపై దేవతలకు నమస్కరించాడు. రాజు ఎంతో భక్తితో ఆ పవిత్ర స్థలం ఒడ్డుకు వెళ్ళాడు.26

తతశ్చ పుష్పకాదీని యానాన్యైరావతాదయః | తరవః కల్పకాద్యాశ్చ యథాగతముపాగతాః ||౨౭

పుష్పకము మరియు ఐరావతం మొదలైన ఇతర వాహనాలు చెట్లు మరియు కల్పవృక్షాలు ఇంద్రద్యుమ్నుడు చూసిన వాటిలో ఉన్నాయి.27

అభిషిక్తే తు ధర్మాత్మన్యమితౌజస రాజని | తుష్ట ఇన్ద్రశ్చ భూతాని హృష్టాని జగతీ తలే ||౨౮

అపరిమితమైన పరాక్రమము కలిగిన ఇంద్రద్యుమ్నుడు రాజుగా ప్రతిష్ఠించబడినప్పుడు, ఇంద్రుడు సంతృప్తి పడ్డాడు. భూమిపై ఉన్న సమస్త ప్రాణులు సంతోషించాయి.28

( ఆ ఘటికాచల ప్రాంతంలో ఇంద్రద్యుమ్నుడు తన కులగురువైన వశిష్ఠుని చూచి అతనికి నమస్కరించి,రాజ్యపాలన పట్ల తనకు ఇక ఆసక్తి లేదని, మోక్షాన్ని పొందడంలో బలమైన కోర్కె కల్గిందని వినయంగా పల్కి, త్వరగా తాను మోక్షాన్ని పొందే మార్గాన్ని తెలుపమని అతనిని కోరాడు. వశిష్ఠ మహర్షి తన మాటను భక్తిశద్ధలతో వినమని ఇ లా ఇంద్రద్యుమ్నునితో చెప్పాడు)

వశిష్ఠ ఇంద్రద్యుమ్నుల సంభాషణ

వసిష్ఠః -

అత్ర నాగాశ్చ పున్నాగరసాలాః కేసరా అపి | జమ్బూకపిత్థజమ్బీరతిలకామలకాస్తథా ||౨౯

వశిష్ఠ మహర్షి ఇంద్రద్యుమ్నునితో తన ఆశ్రమము ఇక్కడ ఉన్నదని చెప్పి ఆ ఆశ్రమంలో నాగ గన్నేరు చెట్లు, పున్నాగచెట్లు,మామిడి చెట్లు, పొగడచెట్లు, నేరేడు చెట్లు, వెలగ చెట్లు, నిమ్మ చెట్లు , ఎర్రగోరంట చెట్లు,ఉసిరి చెట్లు ఉన్నాయని చెప్పాడు. ఇంకా ఈ విధంగా అతనితో చెప్పాడు.29

కర్ణికారాశ్చ కురవః పుత్రజీవాస్తరూత్తమాః | స్వయంభువా వర్ధితాస్తే దృశ్యన్తే ఫలపూర్ణితాః || 30

పద్మబీజకోశము కల గన్నేరు వృక్షములను తమ కుమారుల వలె భావించి ఉత్తమ వృక్షాలను ఆశ్రయించి ఈ ఆశ్రమంలో జీవిస్తారు. అవి తమకు తామే పుట్టినవి. ఎప్పుడూ ఫలములతో నిండి అవి కనిపిస్తాయి. . 30

చన్ద్రసూర్యౌ చ దృశ్యేతే స్నాత్వా బ్రహ్మసరోజలే | గగనం గాహమానౌ వై గ్రహాదిభిరుపాశ్రితౌ | | ౩౧

బ్రహ్మ కమలాలు కలిగిన నీటిలో స్నానం చేసి ఇక్కడి ఆశ్రమవాసులు కాలానుగుణంగా గ్రహాలతో కూడిన చంద్ర సూర్య దర్శనాలు చేస్తారు. 31

మమ పర్ణకుటీ చాత్ర జమ్బూమూలే ప్రదృశ్యతే | సుమతిర్నామ శిష్యోం మే తిష్ఠతే పాలయన్ గృహమ్ ||౩౨

"నా ఆశ్రమం ( పర్ణశాల) ఇక్కడ నేరేడు చెట్టు మూలములో కనిపిస్తుంది . సుమతి అనే నా శిష్యుడు నా ఇంట్లో కాపలాగా ఉంటాడు"32

అత్ర వ్యాఘ్రాశ్చ సృమరాస్సింహనాగాశ్శిఖావలాః | అవిరోధేన మనసా క్రీడన్తే చ పరస్పరమ్ || ||33

ఈ ఆశ్రమముతో సింహములు, వ్యాఘ్రములు, జింకలు మొదలగు జంతువులు వైర భావము వదలి ఆడుకొంటాయి. 33

పురస్తాదిహ దృశ్యన్తే బదర్యః పఞ్చ భూపతే | ఇమే గాధిభువా శప్తా నిష్పత్రా నిష్ఫలా ఇతి || ౩౪

ఓ రాజా, ఇక్కడ ముందునుండి అయిదు రేగుచెట్లు మీకు కనిపిస్తాయి. ఇవి ఆకులేనివి, ఫలములు లేనివి. అని పూర్వము విశ్వామిత్రునిచే శపింపబడినవి. 34

అత్ర ద్విజా మహాత్మాన ఋషయశ్శంసిత వ్రతాః | పూజయన్తి మహాత్మానం నృహరిం దక్షిణాముఖాః ||౩౫

ఇక్కడ బ్రాహ్మణులు, గొప్ప ఋషులు దీక్షతో దక్షిణాభిముఖంగా ఉన్న నరసింహ స్వామిని సేవిస్తారు. 35

పృథులోమా ద్విజః కశ్చిన్నృహరిధ్యానమాశ్రితః | సాలోక్యమగమద్రాజన్ సర్వదేవర్షిపూజితః ||౩౬

విశాలమైన వెంట్రుకలతో ఉన్న పృథులోముడను బ్రాహ్మణుడు ఒకడు భగవంతుడయిన నరసింహస్వామిని ధ్యానిస్తూ ఇక్కడే సాలోక్యముక్తిని పొందాడు.36

విశేషాలు

ముక్తులలో సాలోక్యము ఒకటి. సాలోక్యమనగా ఏ దేవతను ఆరాధిస్తారో ఆ దేవతకు చెందిన లోకంలో ఆ దేవతతో పాటు ఉండటం. 2. మరో విధంగా చెప్పాలంటే, ఒకే లోకంలో కలసి జీవించడం. ఉదాహరణకు భర్త ఉన్న లోకంలో అతడితో కలసి భార్య జీవించడం.

జనన మరణ బంధ విమోచనం ముక్తి. అవిద్య నశించడం ముక్తి. ఇలాంటి ముక్తులు నాలుగు విధాలని కొందరు, ఐదు విధాలని కొందరు అంటారు. ఐదు విధాల ముక్తులివి : 1. సార్ష్టి (అంటే సృష్టించే శక్తి, సమానాధికారం కలది అనే అర్థాలు ఉన్నాయి), 2. సాలోక్యం, 3. సామీప్యం, 4. సారూప్యం, 5. సాయుజ్యం. నాలుగు విధాలనే వారు 'సార్ష్టి'ని ఇందులో చేర్చరు. సార్ష్టి, సాయుజ్యం ఒకటే అని కొందరు చెబుతారు.

శ్రుత్వా వచో వసిష్ఠస్య నృపతిర్భావితాత్మనః | ఆశ్చర్యముపలేభే చ వచనం చేదమబ్రవీత్ ||౩౭

వశిష్టుని మాటలు విని రాజు పొంగిపోయాడు . అతను ఆశ్చర్యపోయి ఈ మాటలు చెప్పాడు.37

ఇన్ద్రద్యుమ్నః -

మునే కథమిహ బ్రహ్మన్ కృతవాంస్తప ఉత్తమమ్| విశ్వామిత్రే చ రాజర్షీ కథం బ్రాహ్మ్యః త్వయా కృతమ్ || ౩౮

ఇంద్రద్యుమ్నుడు:-

ఓ వశిష్ట మునీ ! ఓ బ్రహ్మర్షీ! నువ్వు ఘటికాచలంలో ఇంత అద్భుతమైన తపస్సు ఎలా చేసావు? విశ్వామిత్రుడను రాజర్షిని నువ్వు  బ్రహ్మర్షిగా ఎలా చేసావు? 38.

విశేషాలు

బ్రహ్మ వంటి ఋషి. బ్రహ్మతో సమానమైన ఋషిని బ్రహ్మర్షి అంటారు. ఓంకారం, వషట్కారం, వేదాలు భాసించిన వ్యక్తిని బ్రహ్మర్షి అంటారు. విశ్వామిత్రుడి కథే ఇందుకు ప్రమాణం. దీర్ఘతపస్సు ఫలితంగా బ్రహ్మ సాక్షాత్కరించి "బ్రహ్మర్షిత్వం నీకు సిద్ధించింది. చిరంజీవివై సకల శుభాలతో వర్ధిల్ల"మని చెప్పినప్పుడు విశ్వామిత్రుడు. "నాకు బ్రహ్మర్షిత్వం సిద్ధిస్తే ఓంకారం, వషట్కారం, వేదాలు స్వయంగా భాసించు గాక" అంటాడు.

కేనాకారేణ నృహరిస్తవాజ్ఞాం దత్తవాన్ పురా | కేన వా హేతునా శప్తా బదరాః పఞ్చభూరుహాః || ౩౯

గతంలో నరసింహస్వామి  మీకు ఈ ఆజ్ఞను ఏ రూపంలో ఇచ్చారు? ఏ కారణం చేత అయిదు రేగుచెట్లు శపించబడ్డాయి? 39

గాధిపుత్రేణ తేజస్విన్ సర్వం విస్తరతో వద |

ఓ తేజస్వీ ! దయచేసి నాకు గాధి కుమారుని గురించి వివరంగా చెప్పండి.

వసిష్ఠః -

స్వారోచిషాన్తరే వేదాన్ చతురోఽపి స దేవరాట్ ||౪౦

వశిష్ఠుడు

స్వారోచిష మన్వంతరంలో  వేదాలలో నేర్పరి అయిన ఆ  దేవతాచక్రవర్తి వశిష్ఠుడు . (తరువాత శ్లోకంతో అన్వయం)

విశేషాలు

కృత, త్రేత, ద్వాపర, కలి అని నాలుగు యుగములు – గడిస్తే ఒక మహాయుగం లేదా చతుర్యుగం. 71 మహాయుగములు (చతుర్యుగములు) గడిస్తే ఒక మన్వంతరం. పద్నాలుగు మన్వంతరాలు ఉన్నాయి. అవి. 1. స్వాయం భువ, 2. స్వారోచిష, 3. ఉత్తమ, 4. తామస, 5. రైవత, 6. చాక్షుస, 7. వైవస్వత, 8. సూర్య సావర్ణి, 9. ఇంద్ర సావర్ణి, 10. బ్రహ్మ సావర్ణి, 11. రుద్ర సావర్ణి, 12. రౌచ్యక సావర్ణి, 13. అగ్ని సావర్ణి (పాఠాంతరం ధర్మ సావర్ణి), 14. భౌచ్యక సావర్ణి. అందులో ప్రస్తుతం నడుస్తున్నది వైవస్వత మన్వంతరం.

విపశ్చితో మతానాహ స్మయాపన్నానుదగ్రధీః |

పండితుడయిన  వశిష్ఠుడు చిరునవ్వుతో తన అభిప్రాయాలను ఇలా రాజుకు వెల్లడించాడు.

ఇన్ద్రః

హే వేదాః కముపాసిత్వా వదధ్వం గచ్ఛతాధునా ||౪౧

ఇంద్రుడు

ఇంద్రద్యుమ్నుడు  అడిగిన  మొదటి ప్రశ్నకు వశిష్ఠుడు  ఇలా బదులు చెప్పాడు. పూర్వము ఇంద్రుడు ఒకసారి  "మీరు ఏ దేవుని గూర్చి చెప్పుచున్నారు?" అని వేదాలను ప్రశ్నించాడు. .

కో ను దేవోఽభిలషితో భవద్భిరిహ వేద్యతామ్ ।

మీరు కోరుకునే దేవత ఎవరో దయచేసి నాకు చెప్పండి. అని ఇంద్రుడు అడిగాడు.

వేదాః

బ్రహ్మణో వ్యతిరిక్తో వై దేవః కోవాస్తి దుర్మతే ||౪౨

వేదాలు

బ్రహ్మదేవుడు కాకుండా దేవుడు ఎవరు?( ఇంకెవరూ లేరని బ్రహ్మయే దేవుడని వేదాలు చెప్పాయి)

కో ను దేవోఽభిలషిత ఇత్యవోచన్ వినిర్భయాత్| స ఏక ఏవ భగవాన్నేతా పాతా ప్రజాస్తథా || ౪౩

"మీరు కోరుకునే దేవుడు ఎవరు?" అని నిర్భయంగా అడిగావు. బ్రహ్మయే  సర్వోన్నత ప్రభువు నాయకుడు మరియు రక్షకుడు 43

స్రష్టా చ ఋషిభిర్వేద్యో వేదవేదాన్తగోచరః । సంసారతారకస్తారరూపీ బ్రహ్మర్షివన్దితః ||౪౪

బ్రహ్మయే సృష్టికర్త మరియు ఋషులకు తెలిసినవాడు మరియు వేదాలలో మరియు వేదాంతాలలో గోచరిస్తాడు. అతడే సంసార సముద్రాన్ని దాటిస్తాడు.  బ్రహ్మర్షులచే పూజించబడినవాడు.44

పఞ్చశీర్షశ్చతుర్బాహుః పఞ్చభూతనిషేవితః । ఇతరద్దైవతం లోకే తత్త్వజ్ఞ వద నోచితమ్ ||౪౫

ఆ బ్రహ్మయే  ఐదు తలలు మరియు నాలుగు చేతులు కలిగి ఉన్నాడు.  మరియు పంచభూతాలచే సేవించబడ్డాడు. ఓ సత్యం తెలిసినవాడా!  ఈ లోకంలో  అతనిని మించిన మరో దైవం లేదు. 45

వసిష్ఠః

నిశమ్య తద్వచస్తీవ్రం తప్తనారాచవేదనమ్| విపశ్చిదిన్ద్రో భగవాన్ ప్రాహ నిర్భత్స్య తానిదమ్ ||౪౬

వశిష్ఠుడు

వేదాలు చెప్పిన మాటలు విని  బాధ ఎక్కువైన  బుద్ధిమంతుడైన  ఆ ఇంద్రుడు  వేదాలను తిరస్కరిస్తూ ఇలా  అన్నాడు.46

ఇన్ద్రః

హే వేదా మూఢహృదయాస్తత్త్వార్థం వో నిరామయమ్ । ఈశానం జగదీశానం విహాయ వదతాపరమ్ ||౪౭

ఇంద్రుడు-

ఓ వేదములారా! మూఢమతులై మీరు ఇలా అంటున్నారు. కపటము లేనివాడు, ఈశానుడు,జగదీశ్వరుడు అయిన పరమేశ్వరుని వదిలి బ్రహ్మ గొప్ప అని చెప్పటం భావ్యం కాదు. 47

స ఏవ జగతాం ధాతా నేతా పాతా జగత్ త్రయే । గీయతే ఋషిభిస్సర్వైః బ్రహ్మజ్ఞానిభిరీశ్వరః ।।౪౮

శివుడు మూడు లోకాల సృష్టికర్త, నాయకుడు మరియు రక్షకుడు.( సృష్టిస్థితిలయ కారకుడు) పరమ సత్యాన్ని తెలిసిన ఋషులందరూ ఆశివుని స్తోత్ర గానం చేస్తారు 48

నారాయణప్రియో రుద్రః పితామహపితామహః । సర్వేషామపి దేవానాం యః పరస్స మహేశ్వరః ।।౪౯

రుద్ర భగవానుడు నారాయణునికి ప్రియమైనవాడు. మరియు అందరికీ ముత్తాత. దేవతలందరికి అతీతమైనవాడు ఆ పరమేశ్వరుడు.49

స ఏక పఞ్చశీర్షో వై త్రిషు లోకేషు గీయతే । తం వినా పఞ్చశీర్షో యస్తే సర్వే తక్షకాదయః ||౫౦

ఆ శివుడు ఒక్కడే పంచముఖుడు. ( అయిదు ముఖాలు కలిగినవాడు. 1. సద్యోజాతము, 2. వామదేవము, 3. అఘోరము, 4. తత్పురుషము, 5. ఈశానము.) మిగతావారు పంచ వక్త్రులు కారు.50

విశేషాలు

పంచముఖుడు

'సద్యో జాతాది పంచవక్త్రజ'' అని త్యాగరాజ స్వామి ప్రయోగం.

సద్యోజాతము, వామదేవము, అఘోరము, తత్పురుషము, ఈశానము అని శివలింగానికి మొత్తం 5 ముఖాలు.శివలింగానికి ఎదురుగా ఉన్న ద్వారం పశ్చిమంవైపు ఉన్నా లేదా శివలింగం పశ్చిమం వైపు చూస్తున్నా అది సద్యోజాతము.ఉత్తరం వైపు చూసే ముఖము "వామదేవ" ముఖమని పేరు. శివలింగం దక్షిణానికి చూసే ముఖాన్ని దక్షిణామూర్తి స్వరూపము అంటారు. ఇదే అఘోర ముఖం . శివలింగం తూర్పు వైపుకు చూస్తూ ఉంటే, దానికి తత్పురుష ముఖమని పేరు.శివలింగంపైన ఉండే ముఖాన్ని "ఈశాన ముఖమని పేరు.

ఈ అయిదు ముఖాలనుండి సప్త స్వరాలు పుట్టాయని కొందరంటే - సద్యోజాత ముఖము నుండి - ''ద'' వామదేవ ముఖము నుండి - ''మ'' అఘోర ముఖము నుండి – '' గ'' తత్పురుష ముఖము నుండి - ''రి'', ఈశాన ముఖము నుండి ''ని'' పుట్టాయని మరికొందరంటారు. సహజంగానే అనాది పురుషుడయిన శివునితో పాటు స, ప అనే ప్రకృతి స్వరాలున్నాయి . అందుకే ఈ కీర్తనలో అయిదు ముఖాలకు సంబంధించి అయిదు స్వరాలను చెప్పుకోవాలని శ్రీ చాగంటి వారు వాగ్గేయకార ప్రసంగాలలో చెప్పారు. ''

శివపూజావిధేస్తస్య బ్రహ్మణస్త్రష్టుభావనా ।

వసిష్ఠ: -

ఇత్యుక్త్వా కుపితో దేవరాజో వజ్రముపాదదే ।। ౫౧

బ్రహ్మ రక్షకభావనతో అందరూ శివుని ఆరాధిస్తారు.

**వశిష్ఠుడు**

**అని పలికి ఇంద్రుడు కోపించి వేదములపై వజ్రాయుధమును ప్రయోగించాడు.  51.**

**ప్రహర్తుకామస్తాన్ సర్వాన్ వేదానుద్ధతిమోహితాన్ । తస్య క్రుద్ధస్య చేన్ద్రస్య వేదా వేగాసహిష్ణవః ॥ ౫౨**

**ప్రగల్భాలు   పలికిన వేదాలను ఇంద్రుడు  కొట్టివేయాలనుకున్నాడు. ఆ కోపించిన ఇంద్రుని వేగానికి వేదాలు సహించలేకపోయాయి.  52**

**బ్రహ్మాణం శరణం జగ్మః కాందిశీకాస్తదా దివి । స ఈక్షన్నాగతాన్ బ్రహ్మా వేదాన్వేధానుధావినమ్ ॥ ౫౩**

**అప్పుడు భయపడి పారిపోతూ వేదాలు  స్వర్గంలో బ్రహ్మా  స్వామిని ఆశ్రయించాయి.( వేదములుబ్రహ్మను శరణు పొందాయని భావం)**

**భయపడుతూ తన దగ్గరకు వస్తున్న  వేదాలను బ్రహ్మదేవుడు చూసాడు. . 53**

**కమణ్డలూదకేనైవ వారయామాస వాసవమ్ । స వారితోఽపి వేగేన వజ్రం చిక్షేప బ్రహ్మణి ॥౫౪**

**బ్రహ్మ తన కమండలంలోని నీటిచే  ఇంద్రుని వారించి,  వజ్రాయుధమును తిరిగి ఇంద్రునిపైన బ్రహ్మ  ప్రయోగించాడు. 54**

**స వజ్రో మన్త్రపూతేన కమణ్డలుజలేన వై । వారితో బ్రహ్మణా ప్రత్యక్ చోదితస్స్వామినం ప్రతి ॥౫౫**

**మంత్రముచే శుద్ధి చేయబడిన  కమండలంలోని నీటిచే  వజ్రాయుధం నివారింపబడింది. ఇంద్రుడు బ్రహ్మచే నిషేధించబడ్డాడు .మరియు నేరుగా తన యజమాని వద్దకు తిరిగి పోవాలని బ్రహ్మ వజ్రాయుధాన్ని ప్రేరేపించాడు.55**

**ప్రహర్తుం స్వయమారేభే దేవరాజం దురాసదమ్ । ఇన్ద్రో వజ్రాయుధం వీక్ష్య బ్రాహ్మమన్త్రాభిచోదితమ్ ॥౫౬**

**ఆ వజ్రాయుధం  అజేయుడైన దేవతల రాజుపై  స్వయంగా  దాడి చేయడం ప్రారంభించింది.  ఇంద్రుడు బ్రహ్మ మంత్రంచే ప్రేరేపించబడి తన పై దాడిచేస్తున్న వజ్రాయుధాన్ని చూసాడు. 56**

**న శశాక పురస్స్థాతుం దుద్రువే స దివస్పతిః । స లబ్ధప్రత్యభిజ్ఞానో రుద్రశాపవిమోచితః ॥ ౫౭**

**ఆ వజ్రాయుధం  ముందు నిలబడలేక  ఆ ఇంద్రుడు  పారిపోయాడు . అతను శివుని శాపం నుండి(మాయనుండి)  విముక్తి పొందాడు కనుక శివుని గురించి పూర్తిగా తెలుసుకొన్నాడు. (అందుకే శివుని గొప్పతనాన్ని తెలుసుకొన్నాడని భావం) 57**

**యత్రాస్తే శఙ్కరో దేవస్తం దేశం ప్రాద్రవత్ తథా ।**

**ఇన్ద్రః-**

**శరణం భవ భూతేశ కరుణాకర శఙ్కర ॥౫౮**

ఇంద్రుడు  శివుడు కొలువై ఉన్న ప్రదేశానికి పరుగెత్తాడు.

ఇంద్రుడు:-

ఓశివా, కరుణామయుడైన శంకర భగవానుడా, నిన్ను ఆశ్రయించుచున్నాను.

మాం ప్రత్యాయుధరాజస్య వేగముత్సారయాశు వై । ఇతి సంబోధితశ్శమ్భుర్విజ్ఞాయాస్య పరాభవమ్ ॥౫౯

నాపై వస్తున్న వజ్రయుధాన్ని త్వరగా తరిమికొట్టండి. ఇలా ఇంద్రుడు తనను శరణు వేడిన తరువాత  శివుడు అతని పరాభవాన్ని  గ్రహించాడు

హుంకారేణైవ కులిశం నిర్వేగమకరోత్ ప్రభుః । భక్తానుకమ్పీ భగవాన్ బ్రహ్మాణశ్చేష్టితం నృప ॥౬౦

శివుడు తన  హుంకారముతో  ఇంద్రుని మీదకు వస్తున్న  వజ్రాయుధాన్ని  ఆపాడు.  ఓ రాజా!  ఆ సర్వోన్నత మూర్తి  తన భక్తుల పట్ల ఎప్పుడూ దయతో ఉంటాడు.

జానన్నిన్ద్రముఖాత్ సర్వం కిఞ్చిత్ క్రోధవశం గతః। నఖేన బ్రహ్మాణశ్శీర్షమూర్ధ్వస్థితమకృతన్తత । । ౬౧

ఇంద్రుని నోటి నుంచి జరిగినవన్నీ  తెలుసుకుని శివుడూ  కొంచెం కోపం తెచ్చుకున్నాడు.  తన గోటితో  బ్రహ్మయొక్క  అయిదవ తలను తీసివేసాడు . 61.

తం నిగర్వం సముత్సార్య సంప్రీణయతి వాసవమ్ । చతుర్ముఖో భవేత్యుక్త్వా తస్య నామ దదౌ పునః । । ౬౨

శివుడు బ్రహ్మ గర్వాన్ని పోగొట్టి  ఇంద్రుడిని సంతోషపెట్టాడు.  బ్రహ్మకు  నాలుగు ముఖాలు ఉంటాయని చెప్పి  చతుర్ముఖుడని  పేరు పెట్టాడు. . 62.

తదా ప్రభృతి దేవేన నఖకృత్తశిరాస్స్వభూః । చతుర్ముఖ ఇతి ఖ్యాతిం బ్రహ్మావిన్దత భూతలే ॥ ౬౩

శివుడు ఒక తలను గోళ్ళతో పెరికివేసిన రోజు దగ్గరినుంచి బ్రహ్మకు భూమిపై చతుర్ముఖుడిగా  పేరు వచ్చింది. 63

చతుర్ముఖోఽపి భగవాన్ స్తుత్వా రుద్రమనామయమ్ । వేదైరభిష్టూయమానస్స్వాం పురీం ప్రయయౌ నృప ॥౬౪

ఓ రాజా ! చతుర్ముఖుడు కూడా దోషము లేని  శివుడిని స్తుతించాడు. వేదాలు స్తుతించిన శివుడు  తన నగరానికి తిరిగి వెళ్లాడు. 64

అఙ్గవైకల్యదోషస్య వినిహత్యే ప్రజాపతిః । వసతీహ స ధర్మాత్మా శ్రీనృసింహప్రచోదితః । ౬౫

భగవంతుడయిన  నృసింహదేవునిచే  అంగవైకల్య దోషమును పోగొట్టుకొనిన  బ్రహ్మ  ఇక్కడ ఈ ఘటికాచలంలో  నివసిస్తున్నాడు.  65.

శుభ్రాంభసి చిరం స్నాతే బ్రహ్మణి ప్రాణినాయకే । వైకల్యదోషస్తస్యైష న బభూవ విశామ్పతే ॥ ౬౬

ఆ తరువాత స్వచ్ఛమైన నీళ్లలో సుదీర్ఘ స్నానం చేసిన తరువాత, సకల ప్రాణులకు నాయకుడు అయిన బ్రహ్మ వైకల్య దోషాన్ని పోగొట్టుకొన్నాడు. 66

చతుర్ముఖో గతే దోషే శ్రీనృసింహప్రభావతః । బ్రహ్మ స్వనామ్నా కాసారం తమకీర్తయదుత్తరమ్ ।।౬౭

బ్రహ్మతన పేరిట ఘటికాచలంలో ఒక సరస్సును నిర్మించాడు. (బ్రహ్మతీర్థము) భగవంతుడు నృసింహదేవుని శక్తితో, చతుర్ముఖ భగవంతుడు అన్ని చెడుల నుండి విముక్తి పొందాడు. 67

గురువారే చ యస్స్నాతి సమాహితమనా నృప । మధ్యాహ్నసమయే మర్త్యాస్తస్య పుణ్యఫలం శృణు ।।౬౮

ఓ రాజా! ఏకాగ్రమైన మనస్సుతో గురువారం ఈ బ్రహ్మతీర్థములో మధ్యాహ్న సమయంలో స్నానం చేసేవారికి కలిగే పుణ్యఫలాలను విను.68

అగ్నిష్టోమాదికరణే పుత్రాదికరణే తథా । యత్ఫలం బ్రహ్మసరసి స్నాయ తత్ఫలమశ్నుతే । ।

ఈ బ్రహ్మతీర్థము లో గురువారము మధ్యాహ్నము స్నానము చేసిన వారికి అగ్నిష్టోమాది యజ్ఞములు చేసిన ఫలము లభిస్తుంది. 69

విశేషము

అగ్నిస్తుతిసాధనమగు అగ్నిష్టోమమను సామముతో సమాప్తియగు యాగమును అగ్నిష్టోమయాగము అంటారు. ఇది వసంత కాలమున అయిదుదినములు చేయవలసిన యాగవిశేషము. ఈ యాగము చేసినవానికి సోమయాజియని పేరు.

యస్తు తర్పయతే దేవాన్ పితౄన్వాపి సమాహితః । తస్య సన్తతివిచ్ఛిత్తిర్నైవాస్తి మనుజర్షభ । ।౭౧

ఓ ఉత్తమపురుషుడా ! దేవతలను లేదా పూర్వీకులను ఏకాగ్రతతో తృప్తి పరిచే దేవపితృ తర్పణము ఈ సరస్సు ఒడ్డున చేసిన వారికి సంతతి వర్ధిల్లుతుంది. .71

బ్రహ్మపుష్కరిణీ తీరే వృక్షానారోపయన్తి యే । అముత్ర సుఖినస్సర్వే మహీయన్తే పరత్ర చ ।। ౭౨

బ్రహ్మ సరస్సు ఒడ్డున చెట్లను పెంచే అందరికి ఇహలోకంలో సుఖం మరియు పరలోకంలో కీర్తి కలుగుతుంది.. 72

విత్తం విద్యాఞ్చ కుర్వాణో యో దద్యాద్ద్విజమన్మనే । యో మాఘమాసి బ్రాహ్మే చ స చిరాయుస్సుఖీభవేత్ ।।౭౩

డబ్బు మరియు జ్ఞానాన్ని సంపాదించాలనుకునే వారెవరైనా మనః పూర్వకంగా బ్రాహ్మణునికి ఈ బ్రహ్మ సరస్సు ఒడ్డున దానం చేయాలి. మాఘ మాసంలో దానం చేసేవాడు దీర్ఘాయువు మరియు సంతోషకరమైన జీవితాన్ని గడుపుతాడు.

యో మాఘమాసి మార్తాణ్డే కిఞ్చిదభ్యుదితే పుమాన్। దైవజ్ఞాంశ్చ పురస్కృత్య ఇమం మన్త్రముదీరయేత్। ।।౭౪

మాఘమాసంలో పురోహిత సమేతంగా ఈ మంత్రాన్ని జపించాలి ||74||

ఓం నమో భగవన్ విష్ణో వాసుదేవ జగన్మయ హరే నరహరే పాహి ఘటికాచలనాయక ।।౭౫

మాఘమాసములో ‘‘ఓం నమో భగవన్ విష్ణో వాసుదేవ జగన్మయ హరే నరహరే సాహి ఘటికాచల నాయక’’ అను మంత్రమును చదివి బ్రహ్మ తీర్థంలో స్నానము చేస్తే పాపము నశిస్తుంది.

స న విన్దతి పాప్మానం ప్రాతస్స్నాయీ ద్విజోత్తమః । బ్రహ్మణోఽనుగ్రహేణాపి నృసింహస్యానుభావతః ॥౭౬

బ్రహ్మదేవుని దయతోనూ, నృసింహ శక్తితోనూ ఈ బ్రహ్మ తీర్థంలో ఉదయపు స్నానం చేసే బ్రాహ్మణుడు పాపానికి దూరమవుతాడు.

ఇతి బ్రహ్మకైవర్తే ఉత్తరఖణ్డే భృగుపరాశరసంవాదే ఘటికాచలమాహాత్మ్యే అష్టమోఽధ్యాయః ॥

బ్రహ్మ-కైవర్త పురాణంలోని ఉత్తరఖండంలో భృగువు మరియు పరాశరుని మధ్య జరిగిన సంభాషణలో ఘటికాచల మాహాత్మ్యంలో ఎనిమిదవ అధ్యాయం పూర్తి అయినది. +++++

శ్రీ శివాయ గురవే నమః

ఘటికాచలనివాసాయ శ్రీ నృసింహాయ నమః

బ్రహ్మకైవర్త పురాణములో ఉన్న శ్రీఘటికాచల మాహాత్మ్యపు తొమ్మిదవ అధ్యాయము

(మూల శ్లోకము మరియు తాత్పర్య విశేషాలతో)

నవమోఽధ్యాయః

ఇన్ద్రద్యుమ్న:-

యస్యాజ్ఞామవలమ్బ్యాత స్నాతవ్యం చ ఫలేచ్ఛుభిః ।

కం దేశం వా స భగవానద్యాస్తే తన్నిబోధ నః ॥ ౧

తొమ్మిదవ అధ్యాయం

ఇంద్రద్యుమ్నుడు:-

ఫలాలను కోరుకునే వారు ఎవరి ఆజ్ఞను పాటించి స్నానం చేయాలి?

ఆ పరమాత్ముడు ఏ ప్రదేశంలో నివసిస్తున్నాడో దయచేసి మాకు చెప్పండి 1

వసిష్ఠః -

ఇతో హి దృశ్యతే శైలో రాజన్నేకశిలాభిధః | దక్షిణస్యాం దిశి బ్రహ్మసరస్తరువిభూషితః ||౨

వసిష్ఠుడు-

ఓ ఇంద్రద్యుమ్న మహారాజా! ఇక్కడ నుండి మీరు ఏకశిల అనే పర్వతాన్ని చూడవచ్చు. ఇక్కడ ఏకశిల అనబడు కొండకు దక్షిణమున చెట్లతో అలంకరించబడిన బ్రహ్మ సరస్సు ఉన్నది. 2

శింశుపానామ వృక్షోఽసౌ దృశ్యతే విటపాన్వితః | అస్య మూలే స భగవాన్తిష్ఠతే భైరవస్స్వయమ్ ||౩

అక్కడ కొమ్మలతో కూడిన శింశుపావృక్షము( ఇరుగుడు చెట్టు) యొక్క మూలములో ఆ కాల భైరవుడున్నాడు.

విశేషాలు

"శివుని జ్యోతిస్వరూపాన్ని కాలభైరవుడు అంటారు.

ఈ శివ స్వరూపం ప్రచండ రూపమును పొంది దిగంబరమై నేనే బ్రహ్మమును అని గర్వించిన బ్రహ్మ అయిదవతలను గోటితో గిల్లేసింది. ఆ రూపమే కాలభైరవ స్వరూపం.

శంకరుడు కాల భైరవునితో "నీవు కాలము వలె ప్రకాశించుచున్నావు. కాలము ఎలా వెళ్ళిపోతూ ఉంటుందో అలా ఉంది నీ నడక. నీ నడకలో బ్రహ్మ తల తెగిపోయింది. నిన్ను ఇవాళ్టి నుంచి కాలభైరవ అని పిలుస్తారు. నీవు ఎంత గొప్ప వాడవయినా బ్రహ్మ తల తెంపేశావు కాబట్టి నీకు బ్రహ్మహత్యాపాతకం అంటుకుంది. ఈ అయిదవ తలకాయ పుర్రెను చేతిలో పట్టుకుని పన్నెండు సంవత్సరములు భిక్షాటన చేసి ఆ కపాలంలో తిను. నీ బ్రహ్మ హత్యా పాతకం పోతుంది.

పుట్టేప్పటికే నీ స్వరూపమును చూసేటప్పటికీ లోకం అంతా గజగజలాడిపోయింది. నిన్ను భైరవ శబ్దంతో పిలుస్తారు. ఎవడు ఈశ్వరుని ధిక్కరించి బ్రతుకుతాడో వాడి ప్రాణోత్క్రమణము అవగానే నువ్వే కనపడతావు. దీనిని 'భైరవ యాతన' అంటారు. జీవుడు నిన్ను చూసి హడలిపోతాడు. కానీ ఎవరు నీ గురించి వింటారో, శివాలయమునకు వచ్చినపుడు ఎవరు కాలభైరవుడి యందు శిరస్సు వంచి నమస్కరిస్తారో వాళ్ళ పాపమును నీవు తీసెయ్యి. అలా తీసేసే శక్తిని నేను నీకు ఇచ్చాను నిన్ను 'అమర్దకుడు' అని పిలుస్తారు.

ఇకనుంచి నీవు నా దేవాలయములలో క్షేత్ర పాలకుడవయి ఉంటావు. భక్తుల పాపములను నీవు తీసిన వాటిని నువ్వు తినేసెయ్యి. నువ్వు పాపములను తినేసి వాళ్ళను రక్షిస్తావు కాబట్టి నీకు 'పాప భక్షకుడు'( పాపాల భైరవుడు) అనే పేరును ఇస్తున్నాను. నిన్ను కాశీ క్షేత్రమునకు అధిపతిగా ఉంచుతున్నాను. నీ అనుగ్రహం ఉన్నవాళ్ళే కాశీక్షేత్ర ప్రవేశం చేస్తారు' అని చెప్పాడు.

అందుకే మనము కాశీక్షేత్రంలోని కాలభైరవుడు ఆ క్షేత్రప్రవేశానికి అనుమతించిన క్షేత్రపాలకుడు కనుక "అయ్యా నాకు లోపలికి ప్రవేశింపచేసి నా పాపములను దగ్ధం చేశావు కాలభైరవా!" అని ఆ మహానుభావుడికి ఇంటికి రాగానే కృతజ్ఞతా పూర్వకంగా కాలభైరవ పూజ అని చేసి ఇకనుంచి మంచి పనులు చేస్తాను అని అన్న సంతర్పణ చేస్తారు. భైరవ మూర్తి ప్రసన్నమూర్తి అయినాడని చెప్పడానికే ఆయన మెడలో ఒక గారెల దండ వేస్తారు. కాశీ సంతర్పణ చేస్తే తప్పకుండా వెళ్లి ఆ ప్రసాదమును తీసుకోవాలి.

ఇహలోకమునందు ఇప్పటివరకు ఈశ్వరుడి పట్ల తాము చేసిన దూషణల ఫలితము ఎలా పోతుందని బెంగ పెట్టుకున్న వాళ్ళ కోసం భైరవయాతన ఇక్కడే తేలికగా అనుభవింప చేస్తాడు.అందుకే హరిద్వార్, ఋషికేశ్ వెళ్ళిన వాళ్ళు మానసా దేవి ఆలయమునకు వెళితే బయటకు వచ్చేటప్పుడు 'ఒకసారి ఒంగోండి' అని ఒక బెత్తం పెట్టి వీపు మీద కొడతారు. అది భైరవ యాతన అని ఆ కర్ర ఠప్ అంటుంది. అక్కడితో పాపాలు పోతాయి. ఈవిధంగా ఆ నాడు పరమేశ్వరుడు కాల భైరవుడికి ఇన్ని వరములను గుప్పించాడు. ఆ మూర్తే ఇప్పటికీ మనకి ప్రతి శివాలయంలో ఆయన ఈశ్వర ఆజ్ఞను ఔదలదాల్చి వచ్చినవాడు కనుక మహానుభావుడు కాలభైరవ స్వరూపంతో ఉంటాడు. ఆయన భక్తుల పాలిట కొంగుబంగారం. ఎవరు ఈశ్వర ధిక్కారం చేస్తాడో వారి పాలిట భైరవ దర్శనంగా భయంకరంగా కనపడతాడు.''అని చాగంటివారు తమ ప్రసంగంలో చెప్పారు.

నృహరేశ్శాసనం గృహ్యేతీర్థాన్యేతాని పాలయన్ । ఢాకిన్యాదిపిశాచాది రక్షాంస్యపి చ వారయన్ ॥౪

ఆ కాల భైరవుడు  నరసింహస్వామి ఆజ్ఞను స్వీకరించి ఈ తీర్థాలను రక్షిస్తుంటాడు.  ఢాకిని మొదలయిన పిశాచ బాధలనుండి రక్షిస్తుంటాడు.

## భైరవ తీర్థ వర్ణన

అనుగ్రహాయ భక్తానాం బృన్దబృన్దముపేయుషామ్ । తస్యైవ వామపార్శ్వస్థం భైరవం తీర్థముత్తమమ్ ॥౫

తన భక్తులపై దయ చూపడానికి, అతను సమూహాలుగా వారి వద్దకు వెళుతుంటాడు. బ్రహ్మసరస్సు ఎడమవైపున భైరవతీర్థం ఉన్నది.

అత్ర స్నానం ప్రకుర్వన్తో బ్రాహ్మే కాలే హ్యతన్ద్రితః। విపాప్మానో నరాస్సర్వే స్వర్గం యాతాస్సహస్రశః ॥౬

అందు బ్రాహ్మీ ముహూర్తములో ఈ భైరవతీర్థంలో  స్నానము చేసినవారు పాపములనుండి విముక్తులై స్వర్గాన్ని పొందుతారు.

**విశేషాలు**

బ్రాహ్మీ ముహుర్తాన్నే బ్రహ్మముహూర్తం అంటారు.

బ్రహ్మముహూర్తం అనేది 48 నిమిషాల కాలం ( ముహూర్తం ) ఇది సూర్యోదయానికి ఒక గంట 36 నిమిషాల ముందు ప్రారంభమవుతుంది మరియు సూర్యోదయానికి 48 నిమిషాల ముందు ముగుస్తుంది.ఒక ముహూర్తం 48 నిమిషాల వ్యవధి. మొత్తం రాత్రి పూట 15 ముహూర్తాలు ఉంటాయి. ప్రతి రోజు సూర్యోదయ సమయం భౌగోళిక స్థానం మరియు సంవత్సరం సమయం ప్రకారం మారుతూ ఉంటుంది మరియు బ్రహ్మముహూర్త సమయం తదనుగుణంగా దానితో మారుతుంది. ఉదాహరణకు, సూర్యోదయం ఉదయం 6:00 గంటలకు అయితే, బ్రహ్మముహూర్తం ఉదయం 4:24 గంటలకు ప్రారంభమై 5:12 గంటలకు ముగుస్తుంది.

గన్ధర్వాణాం చ భూతానాం కిన్నరాణాం చ భూపతే । మజ్జతాం భైరవే తీర్థం శ్రూయన్తే వైదికారవాః ॥౭

ఓ రాజా !  గంధర్వులు, భూతాలు మరియు కిన్నరులు ఈ భైరవతీర్థంలో  స్నానం చేస్తారని పెద్దలు చెబుతారు.  7

అత్ర వైఖానసా వాలఖిల్యాశ్చ పరమర్షయః స్నాతాశ్చ శింశుపాస్కన్దే వల్కలాన్ ఛాదయన్తి చ ॥౮

ఇక్కడ వైఖానసులు మరియు వాలఖిల్యులు, గొప్ప ఋషులు, స్నానం చేసిన వారు తమ భుజాలను శింశుపా వృక్షపు బెరడుతో కప్పుకుంటారు.

ప్రాతస్స్నాత్వా భైరవాదే బ్రహ్మదే స్నాతుమిచ్ఛయా । వైష్ణవాశ్చ ద్విజాశ్శైలాదవరోహన్తి పార్శ్వతః ॥౯
ఉదయమే  బ్రహ్మ సరస్సులో  స్నానం చేయాలనే కోరికతో వైష్ణవులు మరియు బ్రాహ్మణులు ఈ పర్వతం నుండి ప్రక్కగా ఎక్కుతారు.

అత్ర రాజర్షయస్స్నాత్వా దిలీపాద్యా మహాత్మనః । నృహరేరనుభావేన జీవన్ముక్తా నృపోత్తమ ॥౧౦
ఓ శ్రేష్ఠమైన ఇంద్రద్యుమ్నరాజా !  దిలీపుడు  మొదలైన రాజర్షులు ఇక్కడ స్నానం చేసారు. నరహరి అనుగ్రహంతో దిలీపరాజు ఇక్కడ స్నానముచేసి జీవన్ముక్తుడయ్యాడు.(బ్రతికి యుండియే సంసారమును వదిలినవాడు. ఆత్మజ్ఞానము కలిగినవాడు. జీవించియుండియు జ్ఞానముపొంది సమస్త బంధములను ఖండించి బ్రహ్మయందు ఆసక్తితో  ముక్తిపొందినవాడు జీవన్ముక్తుడు.)**10**

నక్షత్రాణామధీశస్తు భైరవం తీర్థమేత్య హి । గురుతల్పగతం దోషం త్యక్తవాన్ దర్శనక్షణాత్ ॥౧౧
నక్షత్రాలకు  అధిపతి అయిన చంద్రుడు   భైరవ తీర్థ దర్శనము చేత గురుతల్పగత దోషము పోగొట్టుకొన్నాడు.

**విశేషాలు**

బ్రహ్మహత్య, సురాపానము, స్వర్ణస్తేయము,( బంగారము దొంగిలించుట)  గురుతల్పగమనము,( గురువుగారి భార్యతో సంగమించుట) ,  పై నాల్గు పాతకములు చేసిన వారితో స్నేహము అను అయిదు గొప్ప పాతకములు.( బ్రహ్మహత్యాపాతకములు) చంద్రుడు వీటిలో గురుతల్పగమనము అను పాపము చేసాడని పురాణ ప్రశస్తి. చంద్రునిలో మచ్చ  ఈ పాపపు మచ్చ అని చెబుతారు.  ఈ వృత్తాంతములో చివర  ఆలోచించదగిన మాటలు ఉన్నాయి.  శుక్రుడు తారతో ఇలా అంటాడు.. "పతివ్రతా! నీవు చంద్రుని వదిలిపెట్టి నీ భర్త దగ్గరకు పొమ్ము. నీవు పరిశుద్ధమైన మనస్సు కలదానవు. అందువలన నీకు జారత్వము వలన కలుగు పాపమంటదు. ప్రాయశ్చిత్తము చేసికొన నప్పటికి నీవు పవిత్రురాలవే. తనకు కోరికలేక బలవంతుడైన పురుషుని వలన బలాత్కరింపబడినచో ఆ స్త్రీకి జారత్వ పాపమంటదు" అని శుక్రుడు వారిద్దరకు శుభాశీస్సులనొసగి పోయెను."

కిం పునస్స్నానతస్సౌఖ్యం కిం కిం న భవితా నృప। ప్రహ్లాదోఽపి మహాతీర్థే ప్రాతస్స్నాత్వా జితేన్ద్రియః । ౧౨
ఓ రాజా ! ఈ  బ్రహ్మ సరస్సును చూసిన వెంటనే పాపం పోతుంది. అలాంటప్పుడు  ఈ బ్రహ్మ సరస్సులో స్నానం చేస్తే ఇక  ఎంత ఆనందం ఉంటుందో చెప్పగలమా ! ప్రహ్లాదుడు కూడా  ఉదయం బ్రహ్మ సరస్సులో స్నానం చేసి ఇంద్రియాలను జయించాడు. **12**

హలావర్త తీర్థము ( ఆకాశగంగ)

ఋషిభిస్స్తూయమానోఽయముపాస్తే నృహరిం సదా । పురాయం శైలరాజస్తు భైరవో బాధతే మమ ॥౧౩
తరువాత ఋషులచే స్తుతింపబడిన నరసింహస్వామిని ప్రహ్లాదుడు పూజించాడు. పూర్వం  భైరవునిచే రక్షింపబడుతూ  పర్వతాల రాజు ఒకడు పెరుగుతూ  అందరిని వేధించేవాడు.**13**

శృఙ్గేణేతి స్వగర్వేణ ప్రవర్ధయితుమారభత్ । ద్వితీయం మేరుమివ తముద్ధతం వీక్ష్య వాసవః ॥౧౪
ఆ పర్వతం తన శిఖరపు  కొమ్ములతో,  తన గర్వాన్ని పెంచడం ప్రారంభించింది. ఇంద్రుడు రెండో మేరువులా ఆ పర్వతం ఎదగడం చూసాడు.

భైరవో రక్షతే శైలమితి నాసృజదాయుధమ్ । కిమితి వ్యాకులమనాశ్చిన్తయానో దివస్పతిః ||౧౫

అది చూసి కూడా  ఇంద్రుడు భైరవ రక్షితమైన ఆ పర్వతముపై  తన వజ్రాయుధమును ఉపయోగింపలేక పోయాడు.( వజ్రాయుధము పర్వతాల రెక్కలను తెగ్గొడుతుంది. అయినా ప్రయోజనం లేకపోయిందని భావం)  భైరవ రక్షితమైన ఆ పర్వతపు ఉద్ధతిని ఎలా ఆపవలెనో తెలియక ఇంద్రుడు విచారపడ్డాడు.15

బలభద్రముపాగమ్య ప్రాంజలిర్వాక్యమబ్రవీత్ ।

ఇన్ద్రః-

ప్రలంబాంతక విశ్వసిన్నిన్ద్రోఽహమభివాదయే || ౧౬

బలభద్రుని సమీపించి, ముకుళిత హస్తాలతో నమస్కరించి అతనితో ఇంద్రుడు ఇలా మాట్లాడాడు.

ఇంద్రుడు:-

ఓ ప్రలంబాసురుని చంపిన బలరాముడా !   నమ్మదగిన ఇంద్రుడు  మీకు నమస్కరిస్తున్నాడు. 16

ప్రసీద భగవన్ దేవ వాఞ్ఛితం పూరయాశు నః ।

భగవానువాచ

కిం బిభేతి భవానిన్ద్ర దేవానామధిపోఽపి సన్ || ౧౭

ఓ ప్రభూ! బలరామా ! దయచేసి మాపై దయ చూపండి. మరియు మా కోరికలను వెంటనే నెరవేర్చండి.

బలరాముడు  చెప్పాడు

దేవతలకు ప్రభువైననూ ఇంద్రా! దేనికి భయపడుతున్నావు? 17

అద్య శంస ప్రకాశం త్వం పూరయే కాఙ్క్షితం తవ ।

ఇన్ద్రః-

స్వామిన్ ప్రవర్ధతే స్వైరమయమేవ శిలోచ్చయః || ౧౮

ఈ రోజు నువ్వు నీ విన్నపాల  కాంతిని ప్రకటించావు.  నేను మీ కోరికను నెరవేరుస్తాను.

ఇంద్రుడు:-

ఓ స్వామీ ! ఒక పర్వతం ఇష్టం వచ్చినట్లు  వేగంతో పెరుగుతోంది 18.

భైరవాజ్ఞామధిష్ఠాయ కురు తస్య ప్రతిక్రియామ్ ।

వసిష్ఠః -

ఇత్యుక్తో దేవరాజేన బలభద్రః ప్రతాపవాన్ || ౧౯

భైరవాజ్ఞను తీసికొని దానికి ప్రతిక్రియ చేయు''మని  ఇంద్రుడు బలరాముని ప్రార్థించాడు.

వసిష్ఠుడు

దేవతల రాజు, ప్రతాపవంతుడయిన  బలరాముడు  ఈ విధంగా ఇంద్రునిచే చెప్పబడ్డాడు.  19

హలాగ్రేణ వికృష్యాధశ్శృఙ్గం చక్రే శిలోచ్చయమ్ । ప్రహ్వీభూతం మహాశృఙ్గస్తదారభ్య శిలోచ్చయః । ౨౦

బలభద్రుడు హలముతో పర్వత శిఖరమును లాగాడు . అప్పుడు ఆ  పర్వతం యొక్క గొప్ప శిఖరం నమస్కారంగా మారింది( ఆ పర్వతం పెరగటం మాని నమస్కరించదని భావం) 20

ఉద్ధీవో మన్త్రరాజేన సరీసృప ఇవాభవత్ । అవటే తరుభిః దైర్ఘ్యమవాప శిఖరం నృప ॥౨౧

ఓ రాజా ! పైకెత్తబడిన మెడ గలవాడు; గర్వము గలవాడు అయిన ఆ పర్వతము  మంత్రముతో నిగ్రహించబడిన పాములా మారిపోయాడు. ఆ పర్వత శిఖరపు రంధ్రములలో ఉన్న  అడవి చెట్లు  విస్తీర్ణతను పొందాయి. .. 21

హలసూత్రేతి విజ్ఞేయా శైలస్యోపరిదృశ్యతే । బలభద్రో హలావర్తం నామ గర్తం తథాఽకరోత్ ॥౨౨

బలభద్రుడు   ఆ పర్వతము  మీద హలముతో హలావర్తమను గుంతను చేసాడు. 22

పనసాన్నారికేళాంశ్చ తరూనారోపయద్బలీ । ఇదం హోవాచ భగవాన్ సేన్ద్రాన్ సర్వమరుద్గణాన్ ॥ ౨౩

బలరాముడు పనస చెట్లు, కొబ్బరి చెట్లను ఆ పర్వత శిఖరముపై  నాటాడు. అప్పుడు బలరాముడు,  ఇంద్రుని మరియు మరుత్తులతో  ఈ క్రింది విధంగా అన్నాడు. 23

శ్రీభగవాన్ -

తపస్యన్తి హలావర్తే భైరవోచ నిషేవిణః । యే నరాస్తే మదాజ్ఞప్తా లోకానాప్నుయురుత్తమాన్ ॥ ౨౪

శ్రీ భగవానుడు( బలరాముడు)

భైరవుని సేవిస్తూ హలావర్తములో  తపస్సు చేసే మానవులకి  పుణ్యలోకములు కలుగుతాయి24

వసిష్ఠ: -

ఇతీరయిత్వా దేవేన్ద్రం సర్షిసఙ్ఘమరుద్గణమ్ । దేవతాభిష్టుతః ప్రాయాత్ ప్రలమ్బఘ్నో యథా గతమ్ ॥౨౫

వసిష్ఠుడు

ఋషులు మరియు మరుత్తులతో కూడిన దేవేంద్రునితో ఇలా మాట్లాడిన తరువాత దేవతలచే స్తుతింపబడి బలరాముడు వెళ్ళిపోయాడు.25

హలావర్తే తపస్యన్తస్తరుమూలేషు వాగ్యతాః । అధోముఖాః ప్రదృశ్యన్తే ఋషయశ్శతశో నృప ॥౨౬

హలావర్తములో తపస్సు చేస్తూ చెట్ల మూలాలలో వాక్కును అదుపులో ఉంచుకొని , క్రిందికి ముఖము గల అనేకమంది ఋషులు తపస్సు చేస్తుంటారు. 26

వైష్ణవా అపి మజ్జన్తశ్శతశో విప్రసత్తమాః | పుష్కరిణ్యమ్బుసార్ద్రాస్తు నృహరిం పర్యుపాసతే ||౨౭
వందలాది మంది వైష్ణవులు మరియు ఉత్తమ బ్రాహ్మణులు కూడా హలావర్తములో స్నానం చేస్తుంటారు. స్నానం చేసి నరసింహస్వామిని పూజిస్తారు. 27

ఇన్దువారే తు యస్స్నాతి భైరవే తీర్థసత్తమే | తస్య పుణ్యస్య భూపాల ఫలం వాచామగోచరమ్ ||౨౮
ఓ రాజా ! సోమ వారం రోజున భైరవ తీర్థంలో స్నానం చేసినవారి పుణ్యఫలం మాటలలో చెప్పలేము.( ఎంతో ఫలితాన్ని ఇస్తుందని భావం)28

గౌతమస్య పురా పత్నీ దేవేన్ద్రస్యానుషఙ్గతః | అర్జితం సుమహత్పాపం మార్జయామాస స్నానతః || ౨౯
పూర్వము గౌతముని భార్య అహల్య ఇంద్రుని ఆలింగనము చేసినందున వలన కలిగిన పాపమును ఈ తీర్థ స్నానముతో పోగొట్టుకొన్నది.29

తపశ్చరతి ధర్మాత్మా గౌతమ ఋషిసత్తమః | భైరవోదస్యోత్తరస్యాం దిశి శిష్యైస్సభార్యయా ||30
ధర్మాత్ముడయిన గౌతముడు భార్యాశిష్యులతో కలిసి భైరవతీర్థ ఉత్తర భాగములో తపస్సు చేస్తున్నాడు.

## గౌతమ తీర్థము

గణ్డశైలస్య పూర్వస్మిన్ భాగే కిఞ్చిత్సరోఽకరోత్ | హలావతోత్తరే పార్శ్వే తపస్యతి స వేదవిత్ || ౩౧
హలావర్తమునకు ఉత్తర భాగములో గౌతమ తీర్థము ఉన్నది.

యే స్నాన్తి గౌతమే తీర్థే నృహరిధ్యానతత్పరాః | ఋషయస్తే విలమ్బేన ప్రాప్నువన్తి పరం పదమ్ ||౩౨
ఈ గౌతమ తీర్థములో స్నానము చేసి ఋషులు నరసింహస్వామిని ధ్యానించి పరమపదమును ( మోక్షమును) పొందుతారు.31
శిలాపృష్ఠే మహాత్మానం పురస్కృత్య చ గౌతమమ్ | వటవస్సామ ఘుష్యన్తి కతిచిత్ సంశ్రితవ్రతాః || 33
గౌతమ తీర్థమునకు ముందు భాగములో శిలాపుష్కరిణి ఉన్నది. అక్కడ కొన్ని మర్రిచెట్లు సామవేదాన్ని పఠిస్తుంటాయి. మరియు కొన్ని వ్రతాలు చేస్తుంటాయి. 33

గౌతమస్య పురోభాగే దృశ్యన్తే వివిధా ద్రుమాః | కపిత్థాః కురవస్సాలాః కోవిదారాశ్చ తిన్దుకాః | |

గౌతమ తీర్థమునకు ముందు భాగములో కపిత్థము( వెలగ), కురవకము( ఎర్రగోరంట), కోవిదారము( ఎర్రకాంచన వృక్షము) మరియు తిందుక ( నల్ల తుమికి చెట్టు) మొదలయిన రకరకాల చెట్లు కనిపిస్తాయి 34

మధుకాః కేసరా నాగాః పున్నాగాశ్చ సహస్రశః| బదరాశ్చ ధవా నీపా సిన్ధువారాశ్చ కేతకాః | | ౩౫

ఇంకా ఆ గౌతమ తీర్థమునకు ముందు భాగములో వేలాదిగా కేసరపు(ఇంగువ) చెట్లు, కుంకుమ చెట్లు, నాగవృక్షాలు, పున్నాగ వృక్షాలు, తెల్లని నీప వృక్షాలు, సింధువార వృక్షాలు, మరియు కేతక( మొగలి) వృక్షాలు ఉన్నాయి. . 35

తిన్త్రిణీజమ్బుజమ్బీర న్యగ్రోధాశ్చ శిలావటాః | ఇమే హి తరవో రాజన్నభ్రసీమానుషఙ్గిణః | | ౩౬

ఓ రాజా! ఇంకా తింత్రిణి( చింత), జంబూ(నేరేడు), జంబీర( నిమ్మ) మరియు న్యగ్రోధపు( మర్రి) చెట్లు గౌతమ తీర్థమునకు ముందు భాగములో అడవులుగా విస్తరించి ఉన్నాయి. ఈ చెట్లు ఆకాశపు సరిహద్దులకు జోడించబడ్డాయి. . ( అనగా బాగా ఎత్తుగా ఉన్నాయని భావం)36

## శిలాపుష్కరిణి

పుష్కరిణ్యమ్బుసా పూర్ణాః ప్రవర్ధన్తే మహీపతే | శిలాపుష్కరిణీతీర్థే స్నాత్వా కామాన్ సహస్రశః || ౩౭

ఓ రాజా ! ఇక్కడ చెరువులు నీటితో నిండి పెరుగుతాయి. ఈ శిలాపుష్కరిణి పుణ్యక్షేత్రంలో స్నానం చేసి వేలమంది కోరికలు తీర్చుకుంటుంటారు. 37

ఆయాన్తి స్వర్గతో మర్త్యా నానాదిగ్భ్యశ్చ మానవాః | ఇమాం పుష్కరిణీ దివ్యామధ్యాస్తే విప్రశేఖరః | ౩౮

స్వర్గం నుండి దేవతలు మరియు మానవులు వివిధ దిశల నుండి ఇక్కడికి వస్తారు. ఈ దివ్య సరస్సులో ఒక బ్రాహ్మణశేఖరుడు(విశ్వరూపుడు) నరహరిని సేవిస్తుండేవాడు. 38.

నృహరౌ జగతాం నాథే భక్తిం కుర్వన్నతన్ద్రితః | వైశాఖపౌర్ణమాస్యాం యో శిలాతీర్థే నృపోత్తమ || ౩౯

ఓ రాజులలో ఉత్తముడా ! వైశాఖ పౌర్ణమి నాడు తప్పకుండా శిలాతీర్థాన్ని దర్శిస్తూ అతను ఎప్పుడూ భక్తిశ్రద్ధలతో విశ్వ ప్రభువు నరహరికి తనను తాను అంకితం చేసుకొనేవాడు.( భక్తి చూపించేవాడని భావం) 39

స్నానమాచరతి ప్రాతః ప్రాప్నోతి సుఖమేష వై | శిలోదే ప్రాతురుత్థాయ స్నాత్వా ద్విజవరో నృప ||౪౦

ఓ రాజా ! ఆ బ్రాహ్మణులలో ఉత్తముడు తెల్లవారుజామున లేచి శిలా పుష్కరిణిలో స్నానం చేసి ఆనందంగా ఉండేవాడు 40

.

దద్యాన్న ప్రతిగృహ్ణీయాద్విన్యస్య నృహరౌ మనః | మన్దవారే మహాతీర్థే శిలోదే స్నాతి యః పుమాన్ | |౪౧

తన మనస్సును నరసింహస్వామిపై స్థిరపరచి శనివారంనాడు శిలా పుష్కరిణిలో ఎవడు స్నానం చేస్తాడో వాడు ఇతరులకు దానం ఇచ్చేవాడవుతాడు కాని దానం పొందేవాడు కాడు. 41

పూర్వోక్తమన్త్రముచ్చార్య ముచ్యతే స తు కిల్బిషాత్| పురాదికాకసామాసీత్ పురోధా బ్రహ్మణస్సుతః ||౪౨

ఈ శిలా పుష్కరిణిలో పూర్వము పెద్దలు చెప్పిన మంత్రాన్ని పఠించడం ద్వారా పాపం నుండి ప్రతి వ్యక్తి విముక్తుడవుతాడు. ఈ పురోహిత బ్రాహ్మణ కుమారుడు ( విశ్వరూపుడు) కూడా ఇలా చేసి అగ్రగణ్యుడు అయ్యాడు.(దేవతలకు గురువయ్యాడు)

విశ్వరూప ఇతి ఖ్యాతో స్వస్త్రీయోదనుజన్మనామ్ | కైతవం తస్య విజ్ఞాయ స్వారాజ్యం స్వయమిచ్ఛతః | ।౪౩

అతడు తదుపరి జన్మల కారణంగా విశ్వరూపుడు అని పిలువబడ్డాడు. అయితే ఒకసారి ఈ విశ్వరూపుడు చేసిన కపటాన్ని రాజ్యకాంక్ష కలిగిన ఇంద్రుడు తెలుసుకొన్నాడు. 43

విశేషాలు

విశ్వరూపుడు తల్లి రచన రాక్షస వంశానికి చెందినది. అందుచేత రాక్షసులు విశ్వరూపుని వద్దకు వెళ్ళి అసురులకు మేనమామ అయిన విశ్వరూపుడిని, యజ్ఞాలలో హవిస్సులను ఇంద్రుడికి తెలియకుండ తమకు ఇవ్వమని కోరుతారు. బ్రహ్మ జ్ఞానం కలిగి తరతమ భేదాలు లేని విశ్వరూపుడు, రాక్షసులు కోరినవిధంగా ఆ హవిస్సులలో కొంతభాగం రాక్షసులకు ఇస్తుండేవాడు. కొద్దిరోజుల తరువాత ఇంద్రుడికి ఈ విశ్వరూపుని కపటపు విషయం తెలుస్తుంది. అప్పుడు ఇంద్రుడు యుక్తాయుక్త విచక్షణ విడిచి తన వద్దనున్న వజ్రాయుధంతో విశ్వరూపుని మూడు శిరస్సులను నరికి వేస్తాడు.

ఇన్ద్రస్తు దేవతేస్సర్వేశ్చిన్తయన్నిదమాహ తాన్ |

ఇన్ద్రః-

అసౌ కిల పురోధా మేం బ్రహ్మణా కల్పితః పురా ||౪౪

ఇంద్రుడు సకల దేవతలను తలచుకుని వారితో ఇలా మాట్లాడాడు.

ఇంద్రుడు:-

పూర్వం బ్రహ్మదేవుని వలన ఈ విశ్వరూపుని నేను గురువుగా చేసుకొన్నాను.

విశేషము

విశ్వరూపుడు త్వష్టకు రచనకు పుట్టిన కొడుకు. ఒకప్పుడు దేవగురువు అగు బృహస్పతి ఇంద్రసభకు రాఁగా ఇంద్రుడు మదోద్రేకముచేత అతనిని గౌరవించి సేవించలేదు. అప్పుడు బృహస్పతి బాగ కోపించి తన అధ్యాత్మమాయచే ఇంద్రునికి కనబడలేదు. అప్పుడు గురువు లేకపోవుటచే దేవతలు తమ ఐశ్వర్యము అంతయు రాక్షసులచే కోల్పోయి బ్రహ్మతో తమ అవస్థ చెప్పుకొన్నారు. అతడు విశ్వరూపుని గురువుగా వేడుకొనమని దేవతలకు ఉపదేశించాడు. వారు అలాగే చేసారు. తరువాత గురువైన విశ్వరూపుడు ఇంద్రునకు నారాయణకవచమును ఉపదేశము చేసాడు. దాని గొప్పతనము వలన మరల ఇంద్రుడు తన పూర్వపు ఐశ్వర్యస్థితిని పొందాడు

।

నిపాత్య మామితో రాజ్యే దైత్యేన్ద్రమభిషేక్ష్యతి | ఇమాని తస్య శీర్షాణి త్రీణి వజ్రేణ హన్మ్యహమ్ ||౪౫

విశ్వరూపుడు నన్ను కీర్తిలో పడగొట్టి, పేరు పొందుతున్నాడు. కనుక నేను అతని మూడు తలలను వజ్రాయుధంతో నరికివేస్తాను.

విశేషము

ఈ విశ్వరూపునకు తలలు మూడు. అందు ఒకటి సోమపానము చేయుటకు, మఱియొకటి సురాపానము చేయుటకు, ఇంకొకటి అన్నము భుజించుటకు  ఉపయోగిస్తుండేవాడు.

ఇత్యుద్యమ్య స వై వజ్రం పాలయామాస మూర్ధని ।
వసిష్ఠ: -
కులిశస్య నిపాతేన త్యక్తజీవోఽభవత్ తథా ॥ ४६
ఇలా చెప్పి వజ్రాయుధాన్ని  ఆ బ్రాహ్మణ శ్రేష్ఠుడు, రాక్షసుడు అయిన విశ్వరూపుని మూడు తలలపై  ఇంద్రుడు  మోదాడు.
వసిష్ఠుడు-
వజ్రాయుధపు దెబ్బచే  విశ్వరూపుడు  ప్రాణాలు కోల్పోయాడు.  46

త్వాష్ట్రస్తు విశ్వరూపో వై త్రిభిర్వక్త్రైరవాకిరత్। తిత్తిరః కలవిఙ్కశ్చ కపిఞ్జల ఇతి త్రయః ।। ४७
విశ్వరూపునిగా పిలువబడు ఆ  త్వాష్ట్రు డు( త్వష్టకు పుట్టినవాడు) తన మూడు నోరుల నుంచి  తిత్తిర, కలవింక, కపింజల అనే మూడు రకాల పక్షులను వెలువరించి చనిపోయాడు.  47

విశేషము

ఆ మూడు శిరస్సులు తిత్తిరి, కలవింక, కపింజల పక్షులయ్యాయని భావం. "విశ్వ రూపోవై త్వాష్ట్రః" అను మంత్రవాక్యము ద్వారా త్వాష్ట్ర శబ్దమునకు తొలుత పురోహితుడని, తరువాత పనికిమాలినవాడని అర్థము ఏర్పడినది.విశ్వరూపుడు తన గురువైనప్పటికీ అసురులకు అనుకూలునిగా ఉన్న కారణముతో  విశ్వరూపుని చూచి ఓర్వజాలక  ఇంద్రుడు  అతనిని చంపెనని కథ.

తతో దేవాస్సగన్ధర్వా బ్రహ్మహేతి దివస్పతిమ్ । ప్రశంసన్తో బభూవుస్తే వినిదన్తస్సురర్షయః ॥४८
అప్పుడు దేవతలు మరియు గంధర్వులు ఇంద్రుడు చేసిన పనికి సంతోషిస్తూ అతనిని పూజించారు. ఆయనను స్తుతిస్తూ దేవతల ఋషులు స్తోత్రాలు ప్రారంభించారు.48

ఆయాన్తీం బ్రహ్మహత్యాం వై దృష్ట్వా బలనిషూదనః । త్రిధా విభజ్యతామిన్ద్రో బభాషే పృథివీం ప్రతి ।। ४९
విశ్వరూపుడు బ్రాహ్మణుడు కనుక అతనిని చంపుటచే తనను   సమీపిస్తున్న బ్రహ్మహత్యా పాతకాన్ని  చూసి, బలవంతులను చంపు స్వభావము కలిగినవాడు మరియు   స్వర్గానికి రాజైన  ఆ ఇంద్రుడు భూమితో  బ్రహ్మహత్యా పాతకాన్ని  మూడు భాగాలుగా విభజించమని కోరాడు.  49

ఇన్ద్రః

ఏకాంశో బ్రహ్మహత్యాయాః పృథివి ప్రతిగృహ్యతామ్ । అపరాంశాస్తు తరవః భవద్భిస్సరితః పరః ॥५०

ఆబ్రహ్మహత్యాపాతకములో ఒక భాగము భూమి తీసుకోవాలి. రెండవ భాగము చెట్లు, మూడవ భాగము నదులు గ్రహించాలని చెప్పాడు.

విశేషము

ఇంద్రుఁడు తనకు ఇచ్చిన పక్షిరూపమగు ఆబ్రహ్మహత్యాపాతకమును నాలుగు భాగములుగ విడగొట్టి భూజలవృక్ష స్త్రీలయందు నిలిపి తాను విముక్తుడు అయ్యాడని మరొక కథనం.

ఇతి త్రిభఙ్గం సంకల్ప్య బ్రహ్మహత్యాం దదౌ భువే । తతో మహేన్ద్రో దేవర్షిచోదితః కలిమోచనే ।। ౫౧

ఈ విధంగా ఆబ్రహ్మహత్యాపాతకమును మూడు భాగాలుగా విభజించాలని సంకల్పించి, దేవర్షులచే ప్రేరణ పొందిన ఇంద్రుడు పాప నివారణకు ప్రయత్నాలు మొదలు పెట్టాడు. . . 51

దేవరాజస్స వై రాజన్నవతీర్ణస్స్వయం భువమ్ । యత్రాస్తే భగవాన్ యోగనృహరిభక్తవత్సలః ।।౫౨

ఓ రాజా, తన భక్తుల పట్ల ఆప్యాయత గల పరమేశ్వరుడు యోగ నరసింహుడు ఎక్కడ నివసిస్తున్నాడో, అక్కడికి దేవతల రాజు ఇంద్రుడు స్వయంగా భూమికి దిగివచ్చాడు.

ప్రథమం బ్రహ్మతీర్థేషు స్నాత్వా రాజా దివౌకసామ్ । భైరవోదే తతస్తీర్థే గౌతమీయే తదా నదే ।। ౫౩

ఆ దేవతల రాజు అన్నింటిలో మొదటిదిగా చెప్పబడే బ్రహ్మతీర్థం అని పిలువబడే పవిత్ర ప్రదేశంలో స్నానం చేసాడు. అలాగే భైరవ పుణ్యక్షేత్రమయిన భైరవ తీర్థంలో గౌతమీ నదిలో స్నానం చేసాడు. 53

శిలాపుష్కరిణీం ప్రాప స్నాత్వా విగతకల్మషః । సురర్షిభిస్స్తూయమానో నృహరిం స్తోతుమభ్యగాత్ ।।౫౪

ఇంద్రుడు శిలాపుష్కరిణి చేరుకుని స్నానం చేసి తన పాపాలను పోగొట్టుకున్నాడు. దేవతల ఋషులచే స్తుతింపబడిన అతడు నరహరిని స్తుతించుటకు స్వామిని సమీపించాడు.

ఉన్నతం శైలమారుహ్య శృఙ్గకోటివిరాజితమ్ । తస్యోపరి మహాశృఙ్గే దక్షిణేఽధిష్ఠితం హరిమ్ ।।౫౫

అనేక శిఖరాలు ఉన్న ఎత్తైన పర్వతంపై మహా శిఖరానికి దక్షిణం వైపున నరహరి కొలువై ఉన్నాడు.

సనకప్రముఖైర్దివ్యై ఋషిభిర్భావితాత్మభిః । ప్రహ్లాదేనాపి సతతం స్తూయమానం మహాత్మనా ।। ౫౬

సనకుడు మొదలయిన దివ్య ఋషులు నరహరిని ఆత్మారాధన చేస్తుంటారు. ప్రహ్లాదుడు కూడా నరహరిని నిరంతరం స్తుతిస్తూ ఉండేవాడు. . 56

వామదేవర్షిముక్త్యర్థమవతీర్ణమనామయమ్ । సర్వత్రారాధితం పూర్వం సప్తర్షిగణసేవితమ్ ।। ౫౭

వామదేవునికి ముక్తినిచ్చుటకై అవతరించినవాడు నరసింహుడు. పూర్వం ఏడుగురు ఋషులచే సేవించబడినవాడు నరసింహుడు. 57

రత్నసింహాసనాసీనం యోగాసనవిభావితమ్ । హేమకోటివిమానస్య ప్రణవాకారజన్మనః ।।౫౮

నరసింహస్వామి రత్నాల సింహాసనంపై కూర్చుని మరియు యోగాసన నరసింహునిగా భావించబడతాడు . ప్రణవాకారముతో హేమకోటి విమానము కలిగి ఉన్నాడు.

ద్వాత్రింశస్తమ్భవిజ్ఞేయకక్ష్యాసు ద్వాదశస్వపి । మహాకమలమున్నిద్రం మధ్యే తస్య విరాజితే ।।౫౯

32 స్తంభములు కలిగి 12 ద్వారములు కలిగి, మధ్య మహాకమలము కలిగిన వానిగా నరసింహస్వామిని ధ్యానించాలి.

కర్ణికారత్నఖచితం తత్ర విజ్ఞాయతే నృప । భూపురం తత్ర విజ్ఞేయం యన్త్రం నృపతిసత్తమ । ౬౦

రాజా ! కర్ణికయందు రత్నములుకలిగి, భూపురము కలది అగు యంత్రమున నరసింహస్వామిని ధ్యానించాలి.60

**విశేషాలు**

భూపురమను పదము శ్రీ చక్రార్చనలోనిది . శ్రీ చక్రమునకు సంబంధించిన నవావరణములలో ప్రథమ ఆవరణను త్రైలోక్యమోహన చక్రము అంటారు. చతురస్రాకారములోనున్న ఈ చక్రమును 'భూపుర మను పేరుతో కూడా పిలుస్తారు. భూపురమనగా భూ విస్తారమును తెలుపునది. ఈ చక్రములో సమస్తము ఉన్నందున (సకల సృష్టి భూమియందు ఉన్నట్లు), భూపురనామము తగియున్నది. ఈ చక్రము మూడు రేఖలతో మూడుగా విభజించబడెను. మూడు అవస్థలందు భ్రమను కలిగించుటచే, ఈ చక్రము త్రైలోక్యమోహన చక్రమని పిలువబడుచున్నది.

ఋతుకోణస్య మధ్యే తు బైన్దవం స్థానముచ్యతే । తత్ర దేవముపాసీనం నృహరిం పరమే పదే
ప్రశ్రయావనతో వీక్ష్య స్తోత్రయామాస వాసవః । ।। ౬౧

షట్కోణ మధ్యమున బిందుస్థానమున ఉన్న నరసింహుని ధ్యానించ వలయును. ఇంద్రుడు వినయంగా నరసింహుని వైపు చూసి ఇలా స్తుతించడం ప్రారంభించాడు.61

**విశేషాలు**

శ్రీచక్రంలో ప్రధానమైనది బిందువు. ఇది తొమ్మిదవ ఆవరణ అయిన సర్వానందమయ చక్రం. ఇక్కడ శివశక్తులు విహరిస్తూ ఉంటాయి. 'యోగినీ హృదయంలో త్రికోణంలో బిందువున్నదని చెప్పబడింది. పరావశ్యంతులు బిందుత్రికోణాలుగా ఉన్నాయి "త్రికోణరూపిణీ శక్తిః బిందురూప పరశ్శివః " ఘటికాచల మాహాత్మ్యంలో శివునికి బదులు నరసింహ నామము శ్రీ చక్రార్చనలో వాడబడినది.

కౌళాచార సంప్రదాయంలో బిందువు త్రికోణంలో ఉంటుంది కాని సమయమతానుసారము బిందువు చతుష్కోణము లేదా షట్కోణములో ఉంటుంది.ఈ రకంగా భిన్న వాదనలున్నాయి.

నరసింహ స్తుతి

ఇన్ద్రస్య స్తుతిః –

ఇంద్రుడు చేసిన నరసింహ స్తుతి

ప్రసీద లోకేశ్వర లోకనాయక ప్రహ్లాదముఖ్యై ఋషిభిః ప్రసేవిత | హిరణ్యదైత్యేన్ద్రవధం క్షణేన వై విధాయ సౌఖ్యం కురుషే త్వమేవ హి ||౬౨
ఓ సర్వలోకనాయకుడా! నరసింహా ! నన్ను అనుగ్రహించు . ప్రహ్లాదుడు, అనేక మంది ఋషులచే సేవలందుకొనే నువ్వు నన్ను కరుణించు. నువ్వు హిరణ్యకశిపుని క్షణంలో చంపి లోకాన్ని సంతోషపెట్టావు.

ప్రద్యుమ్నసంకర్షణవాసుదేవముఖైరనేకైరనురూపభేదైః |మహాద్రివాసీ నృహరే త్వమేవం సందృశ్యసే లాస్యకరో యదైకః ||౬౩
ఓ నరహరీ ! మహా పర్వత వాసీ ! ప్రద్యుమ్నుడు, సంకర్షణుడు మరియు వాసుదేవునిగా అనేక రూపాలతో నువ్వు ఉన్నావు.

స వామదేవో భరతోకపి తావుభౌ ప్రమోచితౌ సంసృతి సఙ్గబన్ధనాత్ | హరే మహాత్మన్ నృహరేఽస్తు తే ఘృణా తయోస్తవైవం ఘటికైకమాత్రతః ||౬౪
ఓ మహాత్మా! నరహరీ ! హరీ ! వామ దేవుడు, భరతుడు అను ఇద్దరినీ భౌతిక అస్తిత్వ బంధం నుండి విడిపించావు. ( ముక్తిని ఇచ్చావు అని భావం). నిన్ను సేవించిన వారికి గడియ(అంటే 24 నిమిషాల కాలం) కాలంలో మోక్షాన్ని ఇస్తావు.

వైవస్వతే సంప్రతి సప్తచర్షయో విముక్తభావం గమితా జగత్పతే | తవానుకమ్పామనవాప్య కోపాచ్చుకాదయో ముక్తిపదం న భేజిరే || ౬౫
విశ్వానికి ప్రభువా! ప్రస్తుతం వైవస్వత మన్వంతరంలో ఏడుగురు ఋషులు ముక్తిని పొందారు. నీ దయను పొందలేకపోయిన శుకుడు(?) మొదలయినవారు ముక్తి దశను చేరుకోలేదు 65

తవాక్షిపాతేషు సహస్రశో ద్విజా మహర్షయశ్చాపి సురర్షయస్తదా | విముక్తికామా భగవన్నిరాకులాస్తపన్తి తీవ్రం తప ఏవ కేవలమ్ || ౬౬
వేలాది మంది బ్రాహ్మణులు, మహర్షులు మరియు దేవర్షులు నీ కరుణా కటాక్షములకు నోచుకొనుటకు , ముక్తిని కాంక్షిస్తూ, తీవ్రమైన తపస్సుచేసి విముక్తి పొందారు. నిన్ను గురించిన తపస్సు మాత్రమే ముక్తికి దారి. 66

త్వమేవ ఖ మ్భూరుదకం సమీరణశ్శిఖావలశ్చాపి భవన్తమన్తరా | పరం న లోకే నృహరే ప్రదృశ్యతే త్వమేవ విశ్వం వివృషే తథా కృతిమ్ || ౬౭
నువ్వే ఆకాశానివి. భూమివి. నీరువి. గాలివి. అగ్నివి. నువ్వు కానిది ఈ ప్రపంచంలో మరేమీ కనిపించదు. ఓ నరహరీ ! మీరు మాత్రమే విశ్వాన్ని ఈ విధంగా అందంగా సృష్టించారు. ( మిగతావారికి అసాధ్యమని భావం) 67

అసంశయం ప్రాణిపతివిరిఞ్చినో లయం వ్రజత్యన్తక ఏష ధర్మరాట్ | సర్వే చ దేవా నృహరే త్వమేకః కల్పావసానే వటపత్రశాయీ || ౬౮
ఓ నరహరీ ! సమస్త జీవరాశులకు ప్రభువైన బ్రహ్మదేవుడు, శివుడు, యమ ధర్మరాజు, మరియు సమస్త దేవతలందరూ నిస్సందేహంగా నువ్వే. నువ్వుఒక్కడివి మాత్రమే కల్పాంతంలో ఒక మర్రిచెట్టు ఆకుపై పడుకుంటావు. 68.

త్వమేక ఏవేశ్వర భావమేయివాన్ తుషారశైలేన్ద్రసుతాపరిగ్రహమ్ | తమోగుణాస్పీతవపుర్జటాధరో జగన్తి నేతా నృహరే హరే సదా || ౬౯

ఓ ప్రభూ! మంచు పర్వతాల రాజు కుమార్తె పార్వతిని వివాహం చేసుకోవడం ద్వారా నీవు మాత్రమే జటాధరుడయిన , తమోగుణవిస్తారకుడయిన ఈశ్వర స్థితిని పొందావు. 69

హరే భవానేవ చతుర్ముఖస్స్వయం సత్వాధికోద్రేకతయా ప్రజాపతిః |
వచస్సవిత్రీకరపీడనోచితో జగన్తి పాతా నృహరే త్రయీమయః || ౭౦

ఓ భగవాన్ హరీ ! నువ్వు సత్వ గుణ ప్రధానుడైన విశ్వానికి సృష్టికర్త అయిన బ్రహ్మదేవునివి. తన కిరణాలతో లోకాన్ని చైతన్యపరిచే త్రయీ మయాత్మకుడైన సూర్య భగవానుడివి.

విశేషాలు

త్రయీ అనగా-

1. ఋక్ యజుస్సామ వేదాలు మూడింటిని కలిపి త్రయీ అంటారని ఒక వాదం ఉంది.
2. ఋక్ యజుస్సామ వేదాలలోని మూడు విధాలైన మంత్రాలు కలసి త్రయా అని మరొక వాదం ఉంది. (భారతీ నిరుక్తి)
3. కర్మకాండ, ఉపాసనాకాండ, జ్ఞాన కాండ అనే త్రివిధాల వేదం.
4.జన్మ మృత్యు వినాశాయ దుఃఖస్య త్రివిధస్య చ/ధ్యానేన పురుషోయస్తు ద్రక్ష్య స్స స్సూర్యమండలే (జనన మరణ రాహిత్యమునకు, ఆధ్యాత్మిక, ఆధిదైవిక, అధిభౌతికమను త్రయీవిధ దుఃఖనివారణకు సూర్యమండలవర్తి అయిన నారాయణుని ధ్యానముచే దర్శించవలెను) అను ప్రామాణిక శ్లోకము కూడా ఇక్కడ స్మరణీయము. .

శ్వేతే మహాద్వీపవటే భుజఙ్గమే శేతే శ్రియా యో భగవాన్ స రాజసః | త్వమేవ విష్ణోర్నృహరే హరే సదా జగన్తి పాతాసి పవిత్రమూర్తిమాన్ || ౭౧

ఓ విష్ణుమూర్తే ! నరహరీ ! హరీ ! శ్వేత ద్వీపంలో ఆదిశేషునిపై పడుకొని ఉన్న ఆ పరమాత్మవి నువ్వే. నీ పవిత్ర రూపంలో విశ్వాన్ని ఎల్లప్పుడూ రక్షిస్తుంటావు. 71

తవైవ వక్త్రాన్నిగమాదికా గిరః పురాతనాశ్చేతస ఏవ చన్ద్రమాః | ముఖాదహఙ్చాక్షిత ఏవ భానుమాన్ కర్ణాద్దిశో వ్యాకురుషే త్రయీ హరే || ౭౨

ఓ హరీ ! నీ వాక్కుగా వేదాలు వెలువడ్డాయి. నీ మనస్సు నుండి చంద్రుడు పుట్టాడు. నీ కంటి నుండి సూర్యుడు, చెవుల నుండి దిశలు పుట్టాయి. 72

విశేషాలు

పురుష సూక్తంలోని "చంద్రమా మనసో జాతః చక్షోః సూర్యో అజాయత" అను మంత్రములు ఇక్కడ స్మరణీయములు.

కంటి నుండి సూర్యుడు పుట్టాడంటే అర్థం ఇది- సూర్యుడెలా ఒకేచోట ఉన్నా ఆయన దీప్తి సర్వత్రా ఎలా ప్రసరిస్తున్నదో అలాగే ఆ నరసింహుని దృష్టి సర్వతో ముఖంగా వ్యాపించి ఉందని భావం.ఇలాగే మిగతావాటికి సమన్వయం చేసుకోవాలి.

వేదైకవేద్యం పురుషం మహాన్తమాదిత్యవర్ణం తమసః పరస్తాత్ |

అవస్థితం త్వాం ఘటికాచలస్థితం శ్రియానుషక్తం శరణం ప్రపద్యే || ౭౩

వేదాల ద్వారా మాత్రమే తెలుసుకోదగినవాడివి, మహిమాన్వితమైన సూర్యునిలా ప్రకాశించేవాడివి, అంధకారానికి దూరంగా ఉన్నవాడివి భగవంతునివి, ఈ ఘటికాచల పర్వతంపై లక్ష్మీదేవితో కూడి ఉన్నవాడివైన నిన్ను శరణు కోరుచున్నాను. 73

విశేషాలు

"వేదాహమేతం పురుషం మహాంతం ఆదిత్యవర్ణం తమసస్తు పారే" అను పురుష సూక్త మంత్రములు ఇక్కడ మనం గమనించవచ్చు. పురుష సూక్తములో తమసస్తు పారే అని ఉంటే ఇక్కడ తమసః పరస్తాత్ అని ఉన్నది.

ఇతి స్తుతో హృషీకేశో దేవరాజేన ధీమతా | సౌరబిమ్బాదివ హరిః ప్రాదురాసీద్విమానతః ||౭౪

ఈ విధంగా దేవతల రాజుచే స్తుతించబడిన భగవంతుడయిన హృషీకేశుడు( ఇంద్రియములకు నియంత) ప్రత్యక్షమయ్యాడు. ఆ నరహరి గుడిమీది గోపురం నుండి సూర్యుని ప్రతిబింబంలా ఇంద్రునికి కనిపించాడు. (విమానము అనగా ఇక్కడ గుడి గోపురము అని అర్థం)74

శ్రీభగవాన్ -

శచీపతేఽమరాధ్యక్ష వజ్రాయుధవిభూషణ | జానామి సురశార్దూల భవదాగమకారణమ్ ||౭౫

ఓ శచీ ప్రభువా, దేవతల రాజా ! దేవతలలో వజ్రాయుధముతో అలంకరింపబడినవాడా ! దేవతలలోశ్రేష్ఠుడా ! నువ్వు రావడానికి కారణం నాకు తెలుసు.75

యథా బ్రహ్మసరోముఖ్యతీర్థేషు సురసత్తమ| స్నాతం త్వయా తదారభ్య పాతకాన్మోచితో భవాన్ | |౭౬

ఓ దేవతలలో శ్రేష్ఠమైనవాడా ! నీవు బ్రహ్మసరస్సులో మొదలయిన ముఖ్య తీర్థములలో స్నానము చేసిన తరువాత నువ్వు సర్వపాపములనుండి విముక్తుడవయ్యావు. 76

శ్రీ భగవాన్ -

అథాపి మమ సాన్నిధ్యం కృతమత్ర భవత్కృతే | వరం వృణు సురాధీశ కామితం దీయతే మయా | ఇత్యజ్ఞాప్తో భగవతా దేవరాజస్తతః పరమ్ ||౭౭

శ్రీ భగవాన్ నరసింహుడు-

"అయినా నీ కోసమే ఇక్కడ నా ఉనికిని చాటుకున్నాను. దేవతలకు ప్రభువా, నన్ను వరం కోరుకో! నీకు ఏది కావాలంటే అది ఇస్తాను." ఈ విధంగా దేవతల రాజును ప్రభువు ఆజ్ఞాపించాడు77

ఇన్ద్రః -

యది మారీ కృతా భక్త్యా భగవన్నిదమాద్రియే | స్తోత్రేణానేన హే దేవ మానవాస్సామభిస్సుతమ్ || ౭౮

ఇంద్రుడు:-

ఓ ప్రభూ!  నాచే చేయబడిన ఈ  స్తోత్రమును మానవులు భక్తితో చదివితే  నువ్వు ప్రీతి పొందెదవుగాక !    78

భవన్తమేవ నృహరేస్తోష్యన్త్యానమ్రమూర్తయః | తేషాం కదాచిదపి వై నభవేయుశ్చ కిల్బిషాః || ౭౯

ఓ నరహరీ ! , వినయ నిగ్రహాలు మాత్రమే నిన్ను  సంతృప్తిపరుస్తాయి. అలా ఉన్న భక్తులు  ఏ పాపాలకు దోషాలకు గురి కారు.  79

నిరపాయా భవేదేషా విష్ణుభక్తిశ్చ శాశ్వతీ | అకాలమృత్యురపి వై న భవేన్నృహరే సతామ్ || ౮౦

"ఈ స్తోత్రమును చదివిన వినయ నిగ్రహాలు  కలిగిన నీ భక్తులు అపాయము లేనివారయి, విష్ణు భక్తికలవారై, అకాలమృత్యువులేక సుఖముగా ఉండెదరుగాక"  అని ఇంద్రుడు నరసింహస్వామిని వరము కోరుకొన్నాడు. 80

వసిష్ఠః

ఇతి పృష్టో జగన్నాథో నృహరిభక్తవత్సలః | తథేతి వ్యక్తముక్త్వైవం తత్రైవాన్తరధీయత || ౮౧

వసిష్ఠుడు

తన భక్తుల పట్ల ఎంతో ఆప్యాయతతో ఉండే  నరసింహస్వామి "అలాగే అగుగాక!" అని ఇంద్రునికి వరము ఇచ్చి అక్కడి నుంచి అదృశ్యమయ్యాడు 81

ఇన్ద్రోఽపి దైవైరాహూతస్స్తూయమానస్సురర్షిభిః | నృహరిం భావయన్నేవ స్వారాజ్యమభజత్తదా || ౮౨

ఇంద్రుడు కూడా దేవతలచే ఆహ్వానించబడ్డాడు. దేవతలు మరియు ఋషులచే ప్రశంసించబడ్డాడు.  తర్వాత నరహరిని ధ్యానిస్తూ తన రాజ్యాన్ని( స్వర్గాన్ని) పొందాడు 82

ఇతి బ్రహ్మకైవర్తే ఉత్తరఖణ్డే భృగుపరాశరసంవాదే ఘటికాచలమాహాత్మ్యే నవమోఽధ్యాయః ||

ఇక్కడితో  బ్రహ్మ-కైవర్త పురాణంలోని ఉత్తరఖండంలో భృగువు మరియు పరాశరుని మధ్య జరిగిన సంభాషణలో ఘటికాచల మాహాత్మ్యంలో తొమ్మిదవ అధ్యాయం పూర్తి అయినది.

+++++

శ్రీ శివాయ గురవే నమః

ఘటికాచలనివాసాయ శ్రీ నృసింహాయ నమః

బ్రహ్మకైవర్త పురాణములో ఉన్న  శ్రీఘటికాచల మాహాత్మ్యపు  పదవ  అధ్యాయము

(మూల శ్లోకము మరియు తాత్పర్య విశేషాలతో)

విశ్వామిత్ర చరిత్ర

దశమోఽధ్యాయః

ఇన్ద్రద్యుమ్నః

భగవన్ సాధు విదితం వేదితవ్యం మయాఽనఘ । విశ్వామిత్రస్య వై బ్రాహ్మ్యముపస్థితముదాహర ॥౧

అధ్యాయం పది

ఇంద్రద్యుమ్నః

ఇంద్రద్యుమ్నుడు వసిష్ఠుని ఇలా  ప్రశ్నించాడు. తెలుసుకోవలసిన  చాలా విషయాలు తెలుసుకొన్నాను.  ''మహర్షీ! విశ్వా మిత్రుడు బ్రాహ్మణ్యమును ( బ్రహ్మర్షిత్వాన్ని) ఎలా పొందాడో  తెలపండి.''1.

వసిష్ఠః -

పురా మాయామధిష్ఠాయ పురీ పురమివామరీమ్ । విశ్వామిత్రో నృపశ్రేష్ఠః పాలయామాస మేదినీమ్ ॥౨

వసిష్ఠుడు చెప్పుచున్నాడు

దేవతల నగరం వలె ఉన్న  మాయ అను  ఒక నగరాన్ని రాజధానిగా చేసుకొని  పూర్వము రాజులలో ఉత్తముడైన విశ్వామిత్రుడు భూమిని పరిపాలించాడు. 2

యథార్థనామా ధర్మాత్మా రరక్ష సకలాః ప్రజాః । శతం శతం క్రతూనాం వై కృతవాన్నృపసత్తమ ॥ ౩

కీర్తి మంతుడయి,  నీతిమంతుడయి అతడు తన ప్రజలందరినీ రక్షించాడు. ఓ రాజ శ్రేష్ఠుడా! అతడు వందలాది యాగాలు చేశాడు 3. 3

కదాచిదర్థితా తేన క్షాత్రగర్వేణ భూపతే । సురభిర్నామ పీనోధ్నీ ధేనురేషా ప్రసహ్య వై ॥ ౪

రాజా ! ఒకసారి, ఆ విశ్వామిత్ర రాజు, క్షత్రియగర్వంతో సురభి అనే పెద్దపొదుగుగల ఆవును నానుండి బలవంతంగా అభ్యర్థించాడు. 4

తముద్ధతముదీక్ష్యాహమభిమన్త్ర్య జలేన వై । దూరముత్సాదయన్ గర్వాదవముచ్యేదమబ్రువన్ ॥ ౫

ఆ గర్విష్ఠిని చూసి నేను  నీళ్లతో మంత్రం జపించాను. అతన్ని ఆ ఆవునుండి  దూరం చేసి, ఈ మాటలు మాట్లాడాను.  5

విశ్వామిత్ర మహారాజ విముక్తస్తేజసా మమ । బ్రాహ్మ్యేనురూపం కిం క్షాత్రమిత్యవోచమనన్తరమ్ ॥

ఓ గొప్ప విశ్వామిత్ర మహారాజా !  నా బ్రహ్మ తేజస్సు ద్వారా నీవు విముక్తి పొందావు. బ్రాహ్మణ తేజస్సుకి అనుగుణంగా క్షత్రియబలంఉండదు కదా! అని అతనితో అన్నాను.  తరువాత---

అథ గాధిసుతస్సమ్యగ్వేదితస్స్వేన కర్మణా । ధిక్కృత్య స బలం క్షాత్రం వనమేవాభ్యగాత్తదా ॥ ౭

అప్పుడు గాధి కుమారుడయిన ఆ విశ్వామిత్రుడు క్షత్రియబలంకంటే బ్రాహ్మణ తేజస్సు అధికమని గొప్పదని భావించి  తపస్సు కొరకు అడవికి వెళ్ళాడు 7

స గత్వా విపినం ఘోరం తపస్తేపే సుదారుణమ్ । బ్రహ్మతేజోఽభిలాషీ వై జీర్ణపర్ణాశనవ్రతః ॥ ౮

అడవికి వెళ్లి కఠోర తపస్సు చేశాడు. బ్రాహ్మణ తేజస్సును కాంక్షిస్తూ ఎండిన  ఆకులను తింటూ తపస్సు చేసాడు.  8.

జజాప తపన న్యస్తలలాటో గాధినన్దనః । నాసాగ్రన్యస్తనయనో మహాసౌరాదికాన్ మనూన్ ॥ ౯

గాధి కుమారుడు సూర్య సంబంధ మంత్రాలను చదువుతూ  నుదుటిపై చూపులు ఉంచి సూర్యుని  జపించాడు. 9

అత్రాన్తరే ప్రసన్నో వై భాస్వాన్ ఋషినిషేవితః । తపస్వినం తు రాజానమాచచక్షే దివి స్థితః ॥౧౦

ఇంతలో విశ్వామిత్ర ఋషిచే సేవింపబడిన సూర్యుడు ప్రసన్నుడయ్యాడు. ఆకాశములో నిలబడి అతనితో ఇలా అన్నాడు. 10.

కురుషే వ్రతమేతత్కిం రాజర్షే గాధినన్దన । శైలస్థయోగనృహరిం భజ బ్రాహ్మణ్యమేష్యసి ।।౧౧

ఓ రాజ ర్షీ ! గాధి కుమారుడైన విశ్వామిత్రుడా! ఈ తపస్సు ఎందుకు చేస్తున్నావు ?ఘటికాచల పర్వతం మీద ఉన్న యోగ నరసింహస్వామిని పూజించు. నీకు కావలసిన బ్రహ్మర్షిత్వాన్ని పొందుతావు.

స దాస్యత్యచిరేణైవ కాలేన బ్రాహ్మ్యముత్తమమ్ । వసిష్ఠో జపతాం శ్రేష్ఠో తపస్యతి తదగ్రతః । । ౧౨

ఆ నరసింహ స్వామి మీ పూజకి నువ్వు కోరిన ఉత్తమమైన బ్రహ్మర్షిత్వాన్ని అనుగ్రహిస్తాడు. మంత్రములను జపించు వారిలో ఉత్తముడైన వసిష్ఠుడు కూడా ఆ ఘటికాచల పర్వతంపై తపస్సు చేస్తున్నాడు.

వామదేవస్య ముక్త్యర్థమావిరేష్యతి కేశవః । నృహరిర్ఘటికామాత్రతోషితో దాస్యతే పదమ్ ।౧౩

వామదేవుని ముక్తి కొరకు ఆవిర్భవించిన నరసింహ స్వామిని సేవిస్తే నువ్వు కోరుకున్న బ్రాహ్మణ తేజస్సును పొందగలవు. ఆ పర్వతముపై ఒక గడియ కాలం తపస్సు చేస్తే నరసింహుడు నీ కోర్కెలు నెరవేరుస్తాడు.

ఇతోఽ విదురే ధర్మాత్మన్ దృశ్యతే ఘటికాచలః । ఋషయశ్శతశస్తత్ర నృహరిం పర్యుపాసతే ।।౧౪

ఓ విశ్వామిత్రా! ధర్మాత్ముడా! ఇక్కడ నుండి ఆ ఘటికాచలాన్ని నువ్వు చూడవచ్చు .అక్కడ వందలాది మంది ఋషులు నరసింహ స్వామిని పూజిస్తారు.

ఇన్ద్రాదయశ్చ దిక్పాలాః ప్రజాపతిపురోగమాః । సురర్షయశ్చ నృహరిం హరిమారాధయన్తి వై ।।౧౫

ఇంద్రుడు మొదలైన దిక్పాలకులు ,బ్రహ్మ నేతృత్వంలో ఉన్న దేవతలు ఋషులు ఇలా చాలామంది ఆ నరసింహ స్వామిని పూజిస్తారు.

నృహరేస్తు ప్రసాదేన మహర్షీణామనుగ్రహాత్ ।

బ్రహ్మే

వసిష్ఠవచనేన త్వం బ్రహ్మర్షిత్వముపైష్యసి || ౧౬

ఆ ఘటికాచల పర్వతము పైకి వెళ్లి తపస్సు చేసిన తర్వాత, నరసింహ స్వామి అనుగ్రహంతో మరియు మహా ఋషుల దయతో వసిష్ఠుని మాటలతో నువ్వు బ్రహ్మర్షిత్వాన్ని పొందుతావు.

ఇతి ప్రబోధితో రాజా గాదిసూనురుపస్థితమ్ । స దృష్ట్వా ద్వాదశాత్మానం భానుమన్తం తదాఽబ్రవీత్ । ।

ఇలా సూర్యభగవానుడు చెప్పగా ఆ మాటలు విన్న విశ్వామిత్రుడు ఆ పన్నెండు మూర్తులు కల. సూర్యుని చూసి ఆ సమయంలో ఇలా అన్నాడు.

**విశేషాలు**

అదితి సంతానం కనుక ఆదిత్యులు అంటారు. దేవతలలో ముఖ్యులు ద్వాదశాదిత్యులని ఒక వాదం ఉంది. ఈ 12 మంది సూర్యులకు సంబంధించి గ్రంథాలలో రకరకాల పట్టికలు లభిస్తున్నాయి.

మొదటి పట్టిక - వరుణుడు, సూర్యుడు, సహస్రాంశుడు, ధాత, తపనుడు, సవితృడు, గభస్తి, రవి, పర్జన్యుడు, త్వష్ట, మిత్రుడు, విష్ణువు.

రెండవ పట్టిక - అర్యముడు, మిత్రుడు, అరుణుడు, అర్కుడు, భగుడు, ఇంద్రుడు, వివస్వంతుడు, పూషుడు, పర్జన్యుడు, త్వష్ట, విష్ణువు, అజఘన్యుడు.

మూడవ పట్టిక - ఇంద్రుడు, ధాత, పర్జన్యుడు, త్వష్ట, పూషుడు, అర్యముడు, భగుడు, వివస్వంతుడు, విష్ణువు, అంశుమంతుడు, వరుణుడు, మిత్రుడు.

నాలుగవ పట్టిక - మిత్ర, రవి, సూర్య, భాను, ఖగ, పూష, హిరణ్యగర్భ, మరీచ్య, ఆదిత్య, సవితృడు (సవిత), అర్క, భాస్కరులు.

ఈ పట్టికలలో చాలా పేర్లు అందులోనూ ఇందులోనూ కనిపిస్తాయి. ఒకటి రెండు పేర్లు తేడా ఉన్న పట్టికలు ఉన్నాయి. వాల్మీకి రామాయణం యుద్ధకాండలో రాముడికి అగస్త్యుడు ఉపదేశించిన 'ఆదిత్య హృదయం' స్తోత్రంలో ఈ పేర్లన్నీనూ, ఇవి గాక ఇంకా చాలానూ ఉన్నాయి. అన్నీ సూర్యుడి పేర్లే.

౧౭ విశ్వామిత్రః -

ఆరభ్య తు బహోః కాలాత్ తపాంసి వివిధాని వై । కుర్వత్సు విష్ణుమృషిషు వామదేవముఖేషు చ ||౧౮

చాలా కాలము నుండి ఆ ఘటికాచలముపై పలు విధములుగా తపస్సు చేసిన ఋషులలో ఆ వామదేవుని కథను నాకు చెప్పవలసినది

కథం కథయ సర్వర్షి భావితాత్మా నమస్కృతిమ్ । కరోతి సతతం భానోః పునః పునరిదం మనః ||౧౯

ఆ వామదేవమహర్షి పరమాత్మకు ఎలా ప్రణామాలు అర్పించాడో, సేవ చేసాడో తపస్సు చేసాడో నాకు చెప్పవలసినది. నా మనస్సు అది వినాలని పదేపదే కోరుకుంటున్నది.

వామదేవ చరిత్ర (అగస్త్యతీర్థము.)

పురా కృతయుగే రాజన్ బ్రహ్మచర్యక్రమే స్థితమ్ । వామదేవం పితా తస్య వేదమధ్యాపయత్ తథా ||౨౦

అలా అడిగిన విశ్వామిత్రునితో సూర్యభగవానుడు వామదేవుని కథ ఇలా చెప్పసాగాడు.'' ఓ రాజా !పూర్వం కృతయుగంలో బ్రహ్మచర్యాన్ని అవలంబిస్తూ వామదేవుడు అనేవాడు తండ్రి దగ్గర వేదాన్ని నేర్చుకున్నాడు.20

అధీతవేదవేదాఙ్గో వామదేవ: ప్రసన్నధీ: । ప్రణమ్యపితరం బాల్యాత్ ప్రహితాఞ్జలిరబ్రవీత్ ||౨౧

వేద వేదాంగాలన్నీ చదువుకున్న తర్వాత ఆ వామదేవుడు చక్కని బుద్ధి కలిగినటువంటి వాడై తండ్రికి నమస్కరించి ''గురుదక్షిణ గా నేను మీకు ఏమి ఇవ్వగలనని ప్రశ్నించాడు.(శిక్ష-వ్యాకరణము-ఛంధస్సు నిరుక్తము-జ్యోతిషము-కల్పము అను ఆరింటిని వేదము యొక్క అంగములు గా చెబుతారు)21

వామదేవ:

స్వామిన్నధీతా వేదా మే సాఙ్గోపాఙ్గాశ్చ సంప్రతి । ప్రదాతుకామో గురవే దక్షిణాం ప్రతిపాదయే ||౨౨

ఓ స్వామి సాంగోపాంగముగా ఇప్పుడు మీ దగ్గర వేదం మరియు వేదాంగాలు నేర్చుకున్నాను. మీకు గురుదక్షిణ ఇవ్వాలని అనుకుంటున్నాను. నా కోరిక మీరు తప్పనిసరిగా మన్నించవలసినది.(శిక్ష, వ్యాకరణం మొదలైన షడంగాలు, ఉపాంగాలతో వేదం అధ్యయనం చేయుటను విషయమేదైనా సమగ్ర అధ్యయనం చేయుటను సాంగోపాంగంగా చదవటం అంటారు)

పూషా-

విచిన్త్య బాల్యే సంరబ్ధం కుమారం కృతచేతనమ్ | పరీక్షార్థమిమాం వాచమవోచద్గురుసత్తమః ||౨౩

సూర్యుడు చెబుతున్నాడు

చిన్నపిల్లవాడి మనస్తత్వంతో తన కుమారుడు గురు దక్షిణ కోరటాన్ని విని గురువులలో గొప్పవాడయిన ఆ తండ్రి ఇలా అన్నాడు.23

పితా -

యది సన్దీయతే మహ్యం దక్షిణా సుమతే త్వయా| ఫాల్గుణే మాసి భవితా పితౄణాం శ్రాద్ధముత్తమమ్| ప్రీణనాయ పితౄణాం వై సుధా ప్రాదీయతాం త్వయా |

కుమారా! నిజంగా గురుదక్షిణ ఇవ్వాలి అని అనుకుంటే రాబోయే ఫాల్గుణమాసంలో పితృ శ్రాద్ధం చేయడానికి అమృతాన్ని తీసుకొని రా! అదే నాకు గురుదక్షిణ అని తండ్రి కుమారునితో చెప్పాడు.24

పూషా -

నిశమ్య తద్వచస్సర్వం మహర్షీణాం మహాత్మనామ్

తథేతి శాసనం గృహ్య ప్రాసర్పత మహామతిః | ||౨౫

మహర్షి మరియు మహాత్ముడైన తన తండ్రిగారు చెప్పిన మాటను వామదేవుడు విన్నాడు.

అలాగే అమృతాన్ని తప్పక తీసుకు వస్తానని చెప్పి ఆ మహా బుద్ధిమంతుడు వామదేవుడు ముందుకు నడిచాడు.25

దూరమధ్వానమాసాద్య వామదేవో మహామతిః సుధామే భవితా కస్మాదితి చిన్తాపరోఽభవత్ | ||౨౬

తండ్రి గురుదక్షిణగా కోరిన అమృతము ఎక్కడ లభిస్తుందని వామదేవుడు చాలా దూరం నడుస్తూ ఆలోచనాపరుడయ్యాడు

చిన్తయానస్య తస్యాథ మతిరాసీదనుత్తమా || అగస్త్యో మత్పితృగురుస్సర్వం మే వేదయిష్యతి | ౨౭

శ్రేష్ఠుడయిన ఆ వామ దేవునికి మనస్సులో ఇలా తోచింది. నా తండ్రికి గురువైన అగస్త్యుని కి నేనేమిటో నా మనస్సు ఏమిటో బాగా తెలుసు .

అగస్త్యో భగవానేష వర్తతే గిరిగహ్వరే |సనన్దాద్యైరుపాస్యస్తు బ్రహ్మే తు ప్రాణిభిర్యథా| ||౨౮.

ఈ కొండ గుహలో ఆగస్త్యుడు ఉంటున్నాడు కదా! సనందుడు మొదలైన మహర్షులు బ్రాహ్మీభూతుడైన అతనిని సేవిస్తుంటారు.

యేన విన్ధ్యో మహాశైలః ప్రహ్వీభూతస్తపోబలాత్ యస్య రోషాత్ క్షణేనైవ సముద్రశ్చులుకీకృతః |

వింధ్య పర్వతం యొక్క గర్వాన్ని తన తపో బలంతో అతడు అణచివేసాడు.

విశేషాలు

ఒకప్పుడు మేరువింధ్య పర్వతములకు ఒక నిమిత్తము వివాదము కలిగింది.  వింధ్యపర్వతము సూర్యచంద్రగతులకు అడ్డముగ పెరిగింది. లోకమునకు అలజడి వచ్చింది.  అది తెలిసిన దేవర్షులు అగస్త్యుని దగ్గరకు పోయి కలిగిన విపత్తును  పోగొట్టుమని వేడుకొన్నారు. అతడు బయలుదేరి  తన శిష్యుడగు వింధ్య పర్వతము దగ్గరకు  రాగా ఆపర్వతము  అగస్త్యునకు దండప్రణామము  చేయటానికి నేలమట్టమయింది. . అప్పుడు అగస్త్యుడు వింధ్య పర్వతమును చూసి నేను దక్షిణమునకు పోయి మరలి వచ్చుదనుక నీవు ఇచ్చట ఈప్రకారమే ఉండుమని పలికి వెళ్లి పోయాడు.  వింధ్యము అది మొదలు ఆ ప్రకారముననే క్రింద పడి ఉన్నదని ప్రసిద్ధి.

యత్ప్రభావాన్మహేన్ద్రాద్యాస్స్వే స్వే ధర్మే ప్రతిష్ఠితాః

అగస్త్యుని అమోఘ ప్రభావముతో క్షణములో సముద్రము అతనిచే తాగబడినది. అతని గొప్ప ప్రభావంతో ఇంద్రుడు మొదలైన వారందరూ  తమ తమ ధర్మాలను అనుసరిస్తూ ఉంటారు. ౩౦

విశేషాలు

కశ్యప ప్రజాపతికి కాలయందు పుట్టినవారు కాలకేయులు. వీరు మహాదుర్మార్గులు. సముద్రమున దాక్కొని అనేక రకాలుగా  దేవతలను బాధిస్తుంటే  అగస్త్యుడు దేవతలచేత ప్రార్థింపబడ్డాడు. అప్పుడు అగస్త్యుడు  వీరి నివాసస్థానము ఐన సముద్రము యొక్క జలమునంతయు పానముచేసాడు.

తమేనముపసర్పామి సైషవేత్తా మదీప్సితమ్ । ఇతి సఞ్చిన్తితశ్శీఘ్రం వామదేవస్తు ధార్మికః ।। ౩౧

అంత గొప్ప మహిమాన్వితుడైన అతని దగ్గరకు వెళ్లి అమృతమును పొందునా కోర్కెను ఎలా నెరవేర్చుకోవాలో తెలుసుకుంటాను అని ధార్మికుడైన వామదేవుడు భావించాడు.31

అగస్త్యాధిష్ఠితం శైలం దదర్శ గిరిగైరికమ్ । అథాధిరుహ్య శైలేన్ద్రం గిరిగైరికమున్నతమ్ ॥

ఆ తదుపరి వామదేవుడు అగస్త్యుడు నివసిస్తున్న  పర్వతాన్ని సందర్శించాడు.పర్వతధాతువిశేషములతో( బంగారు) అది నిండి ఉంది.32

సింహవ్యాఘ్రసమాకీర్ణం పుష్పితద్రుమమణ్డితమ్ । అనేకశతరాజర్షిదేవర్షిగణసేవితమ్ ॥

సింహములతో పులులతో పుష్పించిన చెట్లతో అనేక వందలాదిమంది రాజర్షి, దేవర్షి గణ సమూహములతో అగస్త్యుని పర్వతము నిండి ఉన్నది.33

తదాలోక్య శైలేన్ద్రం ముముదే సహచారిభిః । పురస్తాత్తు శిలాపృష్ఠే తీర్థం తీర్థనిషేవితమ్ ॥

అటువంటి ఆగస్త్యుడు నివసిస్తున్న పర్వతాన్ని తన తోటి వారితో కలిసి చూసిన వామదేవుడు చాలా సంతోషించాడు. ఆ పర్వతానికి ఎదురుగా ఉన్న అగస్త్య తీర్థాన్ని చూసాడు. 34

అగస్త్యమితి విఖ్యాతమవలోక్య తదాఽబ్రవీత్ ।
వామదేవ:
అకర్దమమిదం తీర్థం నిశామయతనిర్మలమ్ ||
అగస్త్యమను పేరుతో ప్రఖ్యాతి పొందిన ఆ తీర్థమును చూసి వామదేవుడు తన తోటి వారితో ఇలా అన్నాడు. ఈ పవిత్రమైన అగస్త్య తీర్థము బురద లేనిదై రాత్రి పూట చాలా నిర్మలంగా ఉంటుంది.35

ఆగస్త్యశిష్యాః పద్మాని గృహ్ణన్తి గురవే సదా । అత్ర పూర్వమహల్యాయాస్సఙ్గదోషం సురేశ్వరః । ।
అగస్త్యుని యొక్క శిష్యులు ఇక్కడి నుండియే గురువుగారి పూజ కొరకు పద్మాలను తీసుకుని వెళతారు. పూర్వము అహల్యతో సంగమించిన దోషాన్ని ఇంద్రుడు ఇక్కడే పోగొట్టుకున్నాడు. 36

స్నానాదుత్సారయామాస కుమ్భయోనేరనుజ్ఞయా । పురాఽస్య దక్షిణే తీరే శబరీ వేదవత్యపి ||
అగస్త్యుని యొక్క ఆజ్ఞతో ఇంద్రుడు ఇక్కడ స్నానము చేసి దోషరహితుడయ్యాడు. పూర్వము ఈ తీర్థం యొక్క దక్షిణ తీరములో శబరీ వేదవతి తపస్సు చేస్తూ ఉండేవారు.37

తపస్యన్త్యౌ మహాత్మానౌ బ్రహ్మచర్యవ్రతే స్థితే । కన్యాం వేదవతీం సాక్షాదవతీర్ణాం శ్రియః ప్రభామ్ ।।
బ్రహ్మచర్య వ్రతాన్ని అవలంబిస్తూ ఆ శబరి వేదవతి ఇక్కడ తపస్సు చేస్తుంటే ప్రకాశమానురాలైన శబరి వాళ్లకు సేవ చేస్తుండేది.38

శుశ్రూషమాణా శబరీ వృద్ధా ధర్మపరాఽభవత్ । అత్రాన్తరే దశాస్యో వై దిగ్జిగీషుః ప్రతాపవాన్ । ।
శబరి సేవా పరాయణురాలై ఉండగా, అక్కడికి దిగ్విజయము చేస్తూ రావణాసురుడు వచ్చాడు.39

దృష్ట్వా ధర్షితుమారేభే కన్యాం వేదవతీ తదా । సంరబ్ధమవలోక్యైనం ధర్షణాయ కృతోన్ముఖమ్ ।
గొప్ప తపస్సు చేస్తున్న ఆ వేదవతిని చూసి రావణుడు కామించాడు.40

శబర్యా వార్యమాణం చ ధిక్కృత్యాహ తపస్వినీ ।
వేదవతీ
ప్రమత్తోఽసి దశగ్రీవ హీనగ్రీవో భవిష్యసి ।।

శబరి వద్దని వారించినప్పటికీ ఆమె మాటలను ధిక్కరిస్తూ తన కామచేష్టలను రావణుడు ప్రదర్శించగా వేదవతి కోపగించుకుని ఇలా అన్నది. ఓ పది తలలు కలిగిన వాడా! తలకాయ లేని వాడా!( వ్యంగ్యము) మదించినవాడా! నీ పది తలలు త్వరలో తెగిపోతాయి.41

త్రేతాయామవతారో మే భవితా త్వద్వధే చ యా ।

వామదేవ:

ప్రతిగృహ్యా జలం శాపం తస్మై దత్వా తపస్వినీ ॥

"త్రేతాయుగములో నేను సీతగా అవతరిస్తాను. నా కారణంగా నీ పది తలలు తెగిప్రాణాలు కోల్పోతావు" అని నీటిని తీసుకొని రావణునికి తపస్విని అయిన వేదవతి శాపం ఇచ్చింది.42

సిన్ధువారతరోర్మూలే క్షణాదన్తరధీయత । అగస్త్యతీర్థే యస్స్నాతి భీమవారే సమాహితః ॥

శాపం ఇచ్చిన తరువాత ఆ వేదవతి సింధువారవృక్షపు మూలలో క్షణములో అదృశ్యం అయింది. మంగళవారం నాడు ఎవరు ఈ అగస్త్య తీర్థములో స్నానము చేస్తారో వారికి విశేష ఫలితం కలుగుతుంది.43

సోఽన్యస్త్రీసఙ్గదోషేణ ముచ్యతే నాత్ర సంశయః । సోఽయం వై దృశ్యతే వృక్షస్సిన్ధువారస్సరస్తటే ॥ ౪౪

మంగళవారం నాడు ఈ అగస్త్య తీర్థములో స్నానము చేసి నా వానికి పరస్త్రీ సంగమ దోషము తొలగిపోతుంది. వేదవతి అదృశ్యమైన సింధువారపు చెట్టు ఈ అగస్త్య తీర్థపు ఒడ్డున కనిపిస్తుంది.44

గన్ధం గృహ్యాస్య పవనః కురుతే ఘ్రాణతర్పణమ్ । అస్మిన్నకర్దమే తీర్థే నిమజ్జామో హ్యతన్ద్రితాః ।।

అద్భుతమైన ఆ సింధువారపు చెట్టు కొమ్మల నుండి వీచే గాలిని ఆస్వాదిస్తూ ఈ అగస్త్య తీర్థములో స్నానము చేసి జీవితంలో అందరూ ఆటంకములు లేనితనము పొందుతారు.45

దేవతాస్తర్పయిత్వాత్ర యాస్యామః కుమ్భసంభవమ్ ।

తత్ర ధర్మభృతాం శ్రేష్ఠస్స్నాత్వా సబ్రహ్మచారిభిః ॥

అగస్త్య తీర్థానికి సంబంధించినదేవతలను పూజించిన తర్వాత మనము కుంభసంభవుడైన ఆగస్త్యుని దగ్గరకు వెళదాము అని వామదేవుడు తన తోటి వారితో చెప్పాడు47

పూషా-

తర్పయిత్వా ఋషీన్ దేవాన్ తస్యాశ్రమముపాయయౌ । వామదేవస్సుధర్మాత్మా గత్వాశ్రమపదం తదా ॥

సూర్యుడు చెప్పుచున్నాడు

ఆ విధముగా వామదేవుడు తన తోటి వారితో కలిసి దేవతలను పూజించి అగస్త్య తీర్థములో స్నానము చేసి ఆగస్త్యుని ఆశ్రమానికి వెళ్ళాడు. 48

అగస్త్యస్య మునేరస్య జగ్రాహ చరణౌ సుధీః । ఉత్థాయ పాదావనతగ్రీవం సర్షిగణేశ్వరః ।।౪౯

వామదేవుడు తన తోటి వారితో కలిసి అగస్త్యాశ్రమమునకు వెళ్లిన వెంటనే భక్తితో అతని యొక్క పాదాలు పట్టుకుని నమస్కరించాడు. ప్రేమతో అగస్త్యుడు తన పాదాలకు నమస్కరించిన వామదేవుని పైకి లేపాడు49

తదాగమం తు తపసా జానన్నిదమువాచ హ

అతని రాకకు కారణమును తెలుసుకొని ఈ విధముగా అగస్త్యుడు  వామదేవునితో అన్నాడు ।

అగస్త్యః

వామదేవ మహాభాగ భవదాగమనం మయా ||

ఓ వామదేవా ! నీ రాక ఎందుకో నాకు తెలుసు..50

విజ్ఞాతపూర్వం తపసా తదుపాయముదీరయే ।

నా తపోబలము చేత నువ్వు ఇక్కడికి ఎందుకు వచ్చావో తెలుసుకున్నాను.

ఇతః పశ్చిమదిగ్భాగే శైలరాజో విరాజతే ||

ఇక్కడకు పశ్చిమ దిక్కులో ఒక గొప్ప పర్వతం ఉన్నది. 51

శుకాదీనాం విముక్త్యర్థం నృహరిస్థానమేష్యతి ।

శుకాదులకు ముక్తినిచ్చిన నరసింహ స్వామి స్థానం అది.

చతుర్దశాస్య శృఙ్గాణి పర్వతస్య మహామతే ||

ఓ బుద్ధిమంతుడా! 14  శిఖరాలతో ఆ పర్వతం ప్రకాశిస్తూ ఉంటుంది 52

పూర్వస్యాం దిశి చత్వారి సామాన్యస్య మహీభృతః ।

ఉత్తరస్యాం దిశి త్రీణి పశ్చిమస్యాం తథా దిశి ||

ఆ పర్వతానికి తూర్పు వైపున నాలుగు ఉత్తరంలో మూడు పశ్చిమంలో మూడు శిఖరాలు ఉన్నాయి.53

దిశ్యేకం దక్షిణస్యాం వై త్రీణీశానదిశి స్వయమ్ । విద్యోతమానో దేవర్షిసేవితో రాజతే సదా ।।

దక్షిణ ఈశాన్యాలలో శిఖర శోభాయమానంగా  దేవముని సంఘాల చేత ఎల్లప్పుడూ పూజింపబడుతూ ఆ పర్వతం ఉంటుంది.54

కృతే చామీకరమయస్త్రే తాయాం రజతాత్మకః । ద్వాపరే తామ్రరూపేణ కలౌ భాతి శిలామయః ||

కృతయుగంలో బంగారంగా త్రేతాయుగంలో వెండిగా ద్వాపరంలో రాగిగా, కలియుగంలో శిలారూపంగా ఆ పర్వతం కనపడుతుంది55

అస్యోపరిష్టాన్ముక్త్యర్థం సురర్షీణాం మహాత్మనామ్ । హేమకోటివిమానస్థో నృహరిః ప్రాదురేష్యతి ॥

అటువంటి విశిష్టమైన ఆ పర్వత శిఖరములపై మహర్షుల చేత సేవించబడుతూ హేమకోటి విమానము పైన శ్రీ నరసింహ స్వామి ఉన్నాడు 56

ఘటికామాత్రతో యస్మాన్మహర్షీణాం కరస్థితా। ముక్తిరస్మాదముం ప్రాఙ్చశ్శంసన్తి ఘటికాచలమ్ ॥

24 నిమిషాలలో అనగా గడియలు ముక్తిని ప్రసాదించుట చేత ఆ నరసింహస్వామి నివసించు ఈ పర్వతమును ఘటికాచలమని ఋషులు చెబుతుంటారు.57

ప్రాచీనం శృఙ్గమస్యైష హనుమాన్ ప్రాప్య దుశ్చరమ్। తపస్తనోతి నృహరేః ప్రసాదం కాఙ్క్షయన్ వటుః ।

పూర్వము ఈ పర్వత శిఖరములపై శ్రీ నరసింహ స్వామి  అనుగ్రహాన్ని కోరుతూ హనుమంతుడు బ్రహ్మచారి రూపంలో తపస్సు చేసాడు.58

తత్ర దేవాస్సహేన్ద్రేణ సానుమన్మూర్ధ్ని విష్టితమ్ । హనూమన్తం తపస్తీవ్రం చరన్తం పర్యుపాసతే ॥౫౯

అక్కడ ఇంద్రునితో పాటు దేవతలు కఠోర తపస్సు చేస్తున్న హనుమంతుడిని పూజిస్తారు59

హనుమత్తీర్థం

తస్మిన్ శైలే మహాశృఙ్గే హనుమత్తీర్థముత్తమమ్ । హేమపద్మశతాకీర్ణం హేమకారణ్డవాకులమ్ ॥౬౦

ఈ ఘటికాచల పర్వతము పైన హనుమత్తీర్థం చాలా ఉత్తమమైనది. ఆ హనుమత్తీర్థం  అనేక బంగారు పద్మాలతో, బంగారు రంగు కలిగిన కన్నె లేడి పిట్టలతో మనోహరంగా ఉంటుంది.

శోభన్తే సతతం తస్య తీర్థే హేమమయా ద్రుమాః । తత్రావతీర్ణా యే మర్త్యాస్తే సర్వే హేమరూపిణః ॥౬౧

ఆ హనుమత్తీర్థములో భక్తితో మునిగి స్నానం చేసిన మనుషులు బంగారు రూపం పొందుతారు. ఆ తీర్థము యొక్క ఒడ్డున ఎప్పుడు బంగారపు కాంతిగల చెట్లు ప్రకాశిస్తూ ఉంటాయి.

ఆగచ్ఛన్తో మృగా వ్యాఘ్రాస్సింహానాగాశ్చ పక్షిణః । సలిలస్పర్శమాత్రేణ హేమరూపా భవన్త్యమీ ॥౬౨

ఆ తీర్థమునకు స్నానము కొరకు వచ్చు మృగములు, పులులు, సింహములు, ఏనుగులు మొదలైనవి ఆ తీర్థములోని నీటి యొక్క స్పర్శ చేతనే బంగారపు రంగును పొందుతాయి.

హనూమతా హృతా జమ్బూచారుశాఖా సురాలయాత్ । ఇహ భాన్తి సరస్తీరే తచ్ఛాయాసఙ్గినో జనాః ॥ ౬౩

హనుమంతుని చేత స్వర్గము నుండి గ్రహించబడిన అల్లనేరేడు చెట్టు మొదలైనవి ఈ హనుమత్ తీర్థపు ఒడ్డున ఆసక్తిగల జనులకు మనోహరముగా ప్రకాశిస్తూ కనిపిస్తాయి. 63

హేమరూపా భవన్త్యత్ర హనూమదనుశాసనాత్ | వైష్ణవాశ్చ ద్విజన్మానశ్శైవాశ్చ జటిలా నరాః | || ౬౪

హనుమంతుని యొక్క ఆజ్ఞ చేత ఈ తీర్థములో స్నానం చేసే వైష్ణవులు, బ్రాహ్మణులు ,శివ భక్తులు, జడలు గల సన్యాసులు బంగారపు దేహ కాంతిని పొందుతారు.64

తత్ర స్నాత్వా హనూమన్తమభీప్సన్తి చిరాయుషః | తతో భానురుపేత్యాయం ప్రతిభావనతస్స్వయమ్ ||౬౫

ఇక్కడ స్నానము చేసి హనుమంతుని ద్వారా దీర్ఘాయుష్షుని పొందుతారు. తరువాత స్వయముగా సూర్యమండల వర్తులవుతారు.65

నృణాం విశిష్య వై స్నాతుం భానువారమకల్పయత్ | భానువారే తు యస్స్నాతి హనూమద్ధ్యానతత్పరః || ౬౬

ఈ హనుమత్ తీర్థములో స్నానము చేయుటకు మనుష్యుల కొరకు ఆదివారము కల్పింపబడినది. 66

సంప్రాప్య సకలాన్ కామాన్ దీర్ఘమాయుస్స విన్దతి | పురా నిహత్య రక్షాంసి రామశ్శస్త్రభృతాం వరః | ౬౭

ఆదివారం నాడు ఎవరు హనుమంతుని యొక్క ధ్యానముతో ఈ  హనుమత్ తీర్థములో స్నానము చేస్తారో, వారు సకలమైన కోరికలను దీర్ఘాయుష్షును పొందుతారు. పూర్వము శస్త్రాస్త్ర కోవిదుడైన శ్రీరామచంద్రుడు రాక్షసులను సంహరించిన తరువాత....67

ప్రతిప్రయాతస్సాకేతం పుష్పకేన ప్రభూత్తమః | మధ్యేమార్గే హనుమతో దృష్టవాన్ సర ఉత్తమమ్ ||౬౮

అయోధ్యకు పుష్పక విమానంలో తిరిగి వెళ్ళు సందర్భములో మధ్య మార్గములో హనుమంతుని మాటచే ఉత్తమమైన ఈ తీర్థమును చూసాడు. 68

హేమశైలేన్ద్రశృఙ్గస్య మూర్ధ్ని ప్రాగ్దిశి భాస్వతః నిర్మలే తు శిలాపృష్ఠే సముల్లసతి వారిణి | | ౬౯

ఈ హనుమత్ తీర్థం హేమ పర్వతము యొక్క శిఖరము వెనుకగా తూర్పుదిక్కువైపు ప్రకాశించుచున్నది.69

హనూమతాభిలషితస్స్నానం చక్రే రఘూత్తమః | రాఘవస్తు తదా స్నాతః సభార్యస్తత్ర వారిణి | |౭౦

నిర్మలమై రాళ్లను తాకుచూ, ఉల్లాసభరితంగా ప్రవహిస్తున్న  ఈ  తీర్థమును చూసి హనుమంతుని కోరికపై శ్రీరామచంద్రుడు తన భార్య అయిన సీతతో కలిసి ఆ నీటిలో  స్నానము చేసాడు. 70

వలీముఖాన్ పురస్కృత్య వాచమూచే సుధామయీమ్ |

రాఘవః

పవిత్రముదకం సేవ్యం సర్వైరపి వలీముఖైః ||౭౧

కోతులందరూ తన ముందు ఉండగా అమృతమయమైన  ఈ చెప్పబోవు మాటలను శ్రీరామచంద్రుడు పలికాడు. కోతులందరికి ఈ పవిత్రమైన హనుమత్తీర్థ జలము సేవింపదగినది. 71

విశిష్య హనుమత్సేవ్యం సర్వదా ప్రభవిష్యతి । యతోఽభిలాషీ హనుమానత్రత్యే తీర్థసత్తమే । ||౭౨

హనుమంతుడు ఈ తీర్థమునందు ఆసక్తి కలిగినవాడై ఉండుటవలన  ఇకపై ఇది   హనుమత్ తీర్థముగా లోకములో ప్రసిద్ధి పొందుతుంది.72

అతో హనుమతస్తీర్థం వ్యాహరన్తి పురావిదః ।

అగస్త్య

ఇతి కృత్వాఽభిధాం తస్య తీర్థస్య భరతాగ్రజః ||౭౩

పుష్పకం తత్సమారుహ్య ప్రయయావుత్తరాం దిశమ్ ।

అని ఈ విధముగా ఆ తీర్థమునకు భరతుని యొక్క అన్నయ్య అయిన శ్రీరామచంద్రమూర్తి నామకరణము చేసి పుష్పక  విమానమును ఎక్కి ఉత్తర దిశగా ప్రయాణం చేసాడు. 73

తత్ర ప్రాతోత్థితః కాలే స్నాత్వా శైలప్రదక్షిణమ్ । కురుతే యో నిరాహారం తస్య కిం నామ నో భవేత్ ।

ఈ  హనుమత్ తీర్థమునందు ఉదయకాలమే లేచి ఎవడు స్నానము చేస్తాడో, శైల ప్రదక్షిణము చేస్తాడో, ఎవడు ఆరోజు ఉపవాసం ఉంటాడో వాడికి లభించనిది ఏముంది?( అన్నియు లభిస్తాయని భావము)

## పాండవ తీర్థము

తే చ తస్యోత్తరే శృఙ్గే ధర్మపుత్రాదయో నృప ||౭౫

మహామునిం పురస్కృత్య తపాంసి పరికుర్వతే । తేషాం చ ద్రౌపతీ నిత్యం శుశ్రూషణపరా సతీ ||౭౬

ఈ హనుమత్ తీర్థమునకు ఉత్తర  శృంగములో  ధర్మరాజు మొదలైన ఐదుగురు పాండవులు మహామునులను ముందు ఉంచుకొని తపస్సు చేసారు. తపస్సు చేస్తున్న ఆ పాండవులకు ద్రౌపదీదేవి నిత్యము సేవలు చేసేది 75, 76

జనన్యా పూర్వవాక్యాని పుణ్యాన్యభ్యనుగచ్ఛతీ । తపః కుర్వన్తి నియతాహారాశ్శంకరచోదితాః । ||౭౭

ఎన్నో పుణ్యములను సముపార్జించుకున్న తమ తల్లి కుంతిచేత,  శంకరునిచే ప్రేరేపింపబడి ఆ పాండవులు నియమము కలిగిన ఆహారము కలిగిన వారయ్యారు.  77

దుర్యోధనవధార్థాయ నృహరిప్రీణనాయ చ । అర్జునేన తపస్తీవ్రం కృష్ణసారథ్యమిచ్ఛతా ||౭౮

అస్త్రం నారాయణం చాపి క్రియతే సుదురాసదమ్ । తత్ర తీర్థోత్తమం నామ పాణ్డవానాం సరః కృతమ్ ||౭౯

దుర్యోధనుని యొక్క వధ కొరకు మరియు నరసింహ స్వామి యొక్క తృప్తి కొరకు- ఈ హనుమత్ తీర్థపు ఉత్తర శృంగము( కొండకొమ్ము)లో ఆ పాండవులు తపస్సు చేసారు. ఎవ్వరు ఎదిరించ లేని నారాయణ అస్త్రము కొరకు మరియు భవిష్యత్ కాలంలో జరగబోవు యుద్ధములో శ్రీకృష్ణుని సారథిగా పొందుట కొరకు అర్జునుడు ఇక్కడ తీవ్రముగా తపస్సు చేసాడు.78,79

పాణ్డవాధిష్ఠితత్వేన పాణ్డవోదం చ తద్విదుః । తత్ర పాణ్డవతీర్థే యః ప్రాతస్స్నాతో జితేన్ద్రియః । ॥౮౦
పుణ్యం తత్సమవాప్నోతి గోసహస్రప్రదాయినామ్ । యస్తు పూజయతే మోహాత్తజ్జ్ఞాత్వా నృహరిం పుమాన్ ॥౮౧
పాండవులు ఇక్కడ తపస్సు చేసి తీర్థాన్ని నిర్మించారు. పాండవులు నిర్మించిన తీర్థము కనుక పాండవ తీర్థమని దీనికి పేరు వచ్చినది. ఈ పాండవ తీర్థములో ఎవడు ఇంద్రియములను నిగ్రహించుకొని ఉదయకాలములో స్నానము చేస్తాడో అతనికి వేయి ఆవులను దానము చేసిన పుణ్యము లభిస్తుంది. 80,81

శిలాయాం వా దారుణీహ స తన్న సుఖమేధతే । చరన్తస్తాపసీవృత్తిం సహధర్మసుతాదిభిః ॥౮౨
ఆవిర్భావం ప్రతీక్ష్యన్తే నృహరేర్నిర్జరా ద్విజాః । దుర్వాసమునినా శప్తస్తేషాం తు ప్రపితామహః । ౮౩
బుధో నామ తపస్తత్ర కుర్వన్ ప్రాయాత్పునర్దివమ్
ఎవడు ఇక్కడ భక్తితో పూజ చేస్తాడో అతనిని ఈ శిఖర స్వామి నరసింహుడు అనుగ్రహించి ఎల్లప్పుడూ సుఖాలను అనుగ్రహిస్తాడు. ఈ ఘటికాచల పర్వతముపై శ్రీ నరసింహుని యొక్క ప్రత్యక్షము కొరకు ఎదురుచూస్తూ, దేవతలు బ్రాహ్మణులు తమ పుత్రులతో భార్యలతో కలిసి ఇక్కడ తాపసవృత్తిని అవలంబించి తపస్సు చేస్తుంటారు. పూర్వము దూర్వాస మహా మునిచే శాపము పొందిన బుధుడు ఈ కొండపై తపస్సు చేసి మరల స్వర్గలోకాన్ని పొందాడు. 82,83

సోమస్యాపి పితా స్వామీ భగవానత్రిగోత్రభూః ॥ ౮౪
ఆ బుధుని యొక్క తండ్రి చంద్రుడు అతడు అత్రి గోత్రములో పుట్టినవాడు అని అగస్త్యుడు చెప్పాడు.84
వామదేవః
శంస మే తత్ కథం తేన ఋషిణా శాపితో బుధః ।
వామదేవుడు అగస్త్యుని "దుర్వాసుని చేత బుధుడు ఎందుకు శాపం పొందాడు?" అనిప్రశ్నించాడు.
అగస్త్యః
దుర్వాసస్తపసా శ్రేష్ఠో రోషశీలస్సతామసః ॥౮౫
అగస్త్యుడు ఈ విధముగా జవాబు చెప్పాడు. ఎల్లప్పుడు కోపము మరియు తామస గుణము స్వభావముగా కలిగినవాడు దూర్వాసుడు.85

కదాచిద్ధేమశైలేస్థం ప్రాప్తవాన్ నృహరేః పదమ్ । హేమకోటివిమానస్థం ప్రణమన్నృహరిం తదా ॥౮౬
ఆ దూర్వాసుడు ఒకసారి ఈ నరసింహ స్వామి కొలువై ఉన్న ఘటికాచల పర్వతానికి వచ్చాడు. హేమ కోటి విమానంలో ఉన్న నరసింహ స్వామికి నమస్కరించాడు. 86

తద్దత్తతులసీమాలాం శిలాలజ్కారిర్ణీ వ్యధాత్| పునరాదాయ తాం కర్ణే కణ్ఠే కట్యాం భుజే తథా ||౮౭
తనకు స్వామి అనుగ్రహించిన తులసీమాలను తన తలపై అలంకారంగా దూర్వాసుడు ధరించాడు. తరువాత మరలా దానిని గ్రహించి చెవులలోను ,కంఠములోనూ, కటిలోనూ, భుజములోనూ మార్చి మార్చి  ఆ తులసీమాలను దూర్వాసుడు ధరించాడు. 87

కుర్వాణం తు బుధో వీక్ష్య జహాస స్తమ్భపార్శ్వతః |
ఇలా రకరకాల ప్రదేశాలలో ఆ తులసీమాలను దుర్వాసుడు ధరించుచుండుటను చూసి స్తంభము చాటుగా ఉన్న బుధుడు ఆపుకోలేక నవ్వాడు

దుర్వాసాస్తపసా శ్రేష్ఠో రోషశీలస్సతామసః ||౮౮
తం నృసింహస్య పురతస్సురర్షీణాం పురస్తదా | హసన్తం బుధముద్వీక్ష్య దుర్వాసా ఇదమబ్రవీత్ || ౮౯
అగస్త్యుడు చెబుతున్నాడు.
కోపమే స్వభావముగా కలిగిన  తమోగుణాధిక్యము గల ఆ దూర్వాసుడు అను తపో శ్రేష్ఠుడు  నరసింహుని ముందు దేవతా ఋషుల ముందు తనను చూసి పరిహసిస్తున్న బుధుని చేష్టలకు కోపించి ఇలా అన్నాడు.88,89

దుర్వాసః:-
దుర్బుద్ధే హరిణాదత్తమాలాలజ్కారిణో మమ | అకార్షీత్ స్మితమత్యన్తం యతో భగవతః పురా || ౯౦
ఓరి  దుష్ట బుద్ధి కలిగిన వాడా! బుధుడా ! ఓ చంద్ర సుతుడా! శాశ్వత దైవమైన ఆ నరసింహస్వామి చేత నాకు ఇవ్వబడిన తులసీమాలను నేను ధరిస్తే చూసి నువ్వు పరిహసిస్తావా!? 90

తస్మాద్ద్వాదశ వర్షాణి భవాన్ భూమౌ వసిష్యతి | అలభ్యా భగవన్మాలా ప్రసాదాత్ప్రీణనాదృతే | | ౯౧
పునరభ్యేష్యసి దివం నృహరిప్రీణనేన వై | గ్రహాణామాధిపత్య త్వాం కల్ప్యతే చన్ద్రమస్సుత ||౯౨
ఈ కారణము చేత 12 సంవత్సరాలు నువ్వు భూలోకమున ఉందువు గాక! అలభ్యమైన నరసింహ స్వామి అనుగ్రహము చేత తులసీమాలను ఆసక్తితో గ్రహించి ఆయనకు ప్రీతి కలిగించి మరల స్వర్గమునకు చేరుకొని గ్రహాధిపతివి అవుదువు కాక!91,92
అగస్త్యః
ఇతి సంశాపితస్సౌమ్యశ్శృఙ్గేఽస్మిన్ హేమభూభృతః | తీర్థోత్తమే నగశ్రేష్ఠే స్నాత్వా తేపే మహత్తపః | | ౯౩
ఈ రకముగా దూర్వాసునిచే శపించబడిన బుధుడు ఈ హేమ పర్వతము తీర్థమునందు స్నానము చేసి గొప్ప తపస్సు చేసాడు.93

తస్య ద్వాదశవర్షాణి నృహరేస్సుప్రసాదతః | నిమేష ఇవ నీతాని బుధస్య పరమాత్మనః ||౯౪

నరసింహ స్వామి యొక్క అనుగ్రహము చేత దుర్వాసుడు శాపం పెట్టిన ఆ 12 సంవత్సరాలు ఒక నిమిషము లాగా బుధునికి గడిచిపోయాయి.94

నృహరేరస్య సాన్నిధ్యాత్ స్వయం స్వస్థ్యమవిన్దత | బుధవారే తు యస్స్నాతి సమాహితమనా నరః || ౯౫
ఋషిభిస్తూయమానస్తు స యాతి పరమాం గతిమ్ | సర్వత్రైవం ప్రియం బ్రూయాత్ పాణ్డవోదే వసన్నృమాన్ | | ౯౬
నరసింహ స్వామి యొక్క సాన్నిధ్యము వలన ఆ బుధుడు శాపరహితుడై స్వస్థతను పొందాడు. బుధవారము ఈ పాండవ తీర్థములో స్నానము చేసిన మానవుడు ఋషుల చేత కొనియాడబడుతూ ఉత్తమమైన గతిని చేరుకుంటాడు. అన్నిచోట్ల ప్రియమే మాట్లాడతాడు 95,96
హితం నాభిభాషేత సర్వత్రైవ క్షమీ భవేత్ | తిన్త్రిణీతరవస్త్ర రోహితా బహవో నరైః ||
న్యగ్రోధాశ్చ వటా నాగా యూధికాశ్చ సహస్రశః | చామ్పేయాశ్చమ్పకా బిల్వా మన్దారాశ్చార్జునాస్తథా | |
ఈ పాండవ తీర్థములో స్నానము చేసిన మానవుడు అహితాన్ని ఎప్పుడూ కోరడు. చెడు ఎప్పుడూ మాట్లాడడు. అందరిని క్షమించే హృదయం కలిగిన వానిగా ఉంటాడు . అనేకమంది మానవులు ఈ పాండవ తీర్థ సమీపంలో చింత చెట్లు ,కిందికి పెరుగు మర్రి చెట్లు , జమ్మి చెట్లు, నాగ గన్నేరు చెట్లు, చాంపేయ( నాగ కేసర) వృక్షాలు, చంపక(సంపెంగ) వృక్షాలు, బిల్వ( మారేడు) వృక్షాలు, మందార వృక్షాలు, అర్జున(ఏరు మద్ది) వృక్షాలు ఇక్కడ నాటారు. 97,98

కున్దాశ్చ కోవిదారాశ్చ తరవో హృదయంగమాః | ఉద్వహన్ పవనశ్చాత్ర తేషాం గన్ధం పదే పదే | విశ్రమం హరతే తేషాం తపస్తీవ్రం ప్రకుర్వతామ్ || ౯౯
కుందములు( మొల్లలు) కోవిదారములు( ఎర్రకాంచనములు) మొదలైన చెట్లు ఇక్కడ హృదయంగముగా కనిపిస్తాయి .ఇక్కడ తీవ్రమైన తపస్సు చేసే ఋషులకు ఈ చెట్ల నుంచి వీచే గాలి తాపశాంతిని కలిగిస్తూ ఉంటుంది.99

ఇతి బ్రహ్మకైవర్తే ఉత్తరఖణ్డే భృగుపరాశరసంవాదే ఘటికాచలమాహాత్మ్యే దశమోఽధ్యాయః ||
ఇక్కడితో బ్రహ్మ-కైవర్త పురాణంలోని ఉత్తరఖండంలో భృగువు మరియు పరాశరుని మధ్య జరిగిన సంభాషణలో ఘటికాచల మాహాత్మ్యంలో పదవ అధ్యాయం పూర్తి అయినది. +++++

శ్రీ శివాయ గురవే నమః

ఘటికాచలనివాసాయ శ్రీ నృసింహాయ నమః

బ్రహ్మకైవర్త పురాణములో ఉన్న శ్రీఘటికాచల మాహాత్మ్యపు పదకొండవ అధ్యాయము

(మూల శ్లోకము మరియు తాత్పర్య విశేషాలతో)

ఏకాదశోఽధ్యాయః

అగస్త్యః

గిరేః ప్రదక్షిణం కార్యం పుంసాం యత్కిఞ్చిదిచ్ఛతా | బ్రహ్మతీర్థాదికాస్సర్వాస్నాతవ్యా దీర్ఘికాస్సదా | |

అగస్త్య మహర్షి వామదేవునితో ఈ విధంగా అన్నాడు. " బ్రహ్మ తీర్థం మొదలైన తీర్థాలలో స్నానం చేస్తూ గిరి ప్రదక్షిణం చేస్తే మానవునికి మేలు కలుగుతుంది."

౧ వామదేవః-

కస్మిన్ తీర్థే కృతస్నానః కర్మ విద్వాన్ లభేత్ సదా । ప్రదక్షిణం ప్రకురుతే గిరేరస్య తటే తథా ॥ ౨

అగస్త్యుడు చెప్పిన మాటలు విని వామదేవుడు అతనిని ఇలా ప్రశ్నించాడు ."మీరు చెప్పిన ప్రకారముగా ఏ తీర్థములో స్నానం చేస్తే విశేషమైన పుణ్యము కలుగుతుంది? అసలు గిరి ప్రదక్షిణం ఎలా చేయాలి? నాకు తెలియచేయవలసినది".

అగస్త్యః-

ప్రదక్షిణద్వయం తత్ర విజ్ఞేయం నగసత్తమే । మహాప్రదక్షిణం విద్యానాన్తరం చ యథాక్రమమ్ ॥౩

పర్వతానికి రెండు రకాలుగా ప్రదక్షిణ చేయాలి .మొదటిది మహాప్రదక్షిణము. రెండవది అంతర ప్రదక్షిణము .

మహాప్రదక్షిణం వక్ష్యే సావధానం నిబోధయ । యత్కృత్వా శౌనకాద్యాస్తే నృహరేరాజగామ హ ॥౪

మహాప్రదక్షిణము గురించి చెబుతాను .సావధానంగా వినవలసింది. ఈ మహా ప్రదక్షిణాన్ని పూర్వం శౌనకుడు మొదలైన మహామునులు చేసి శ్రీ నరసింహ స్వామి యొక్క అనుగ్రహాన్ని పొందారు.( మహా ప్రదక్షిణమనగా ఘటికాచలమునకు రెండు సార్లు ప్రదక్షిణము చేయుట)

.త్రిపురస్థపతిః ప్రాక్ చ ప్రాక్పథే ద్వ్యఙ్కణాశ్రమః । తమిన్ద్రమితి విఖ్యాతం తద్గతం దక్షిణాపథే ॥ ౫

ఇక్కడికి తూర్పులో ఒక శైవక్షేత్రంఉన్నది. అక్కడ శివుని సేవించిన తర్వాత దక్షిణ మార్గంగా ప్రయాణం చేస్తే  ఇంద్రక్షేత్రము అనే ఆశ్రమాన్ని నువ్వు చేరుకుంటావు.5

హేమశైలస్య శృఙ్గే తు దృశ్యతే వివిధద్రుమే । యస్మిన్ తపస్యతే శుక్రః వహ్నికుణ్డస్య పశ్చిమే ॥ ౬

ఆ బంగారు పర్వతపు పశ్చిమముగా ఉన్న ఒక శృంగములోని అగ్నిగుండంలో శుక్రుడు తపస్సు చేసాడు.

తస్య దక్షిణదిగ్భాగే మమాశ్రమ ఉదాహృతః । దృష్టమాత్రస్త్వయా బ్రహ్మన్ మత్తీర్థే గిరిగైరికే ॥౭

ఆ బంగారు పర్వతానికి దక్షిణ దిక్కులో నా యొక్క ఆశ్రమము (అగస్త్య ఆశ్రమము) ఉన్నది.

ఏతస్య పశ్చిమపథే నన్దిగ్రామ ఇతి శ్రుతః । దూర్వాసాస్తత్ర సతతం తప్యతే ఋషిశేఖరః ॥౮

దానికి పశ్చిమ మార్గంలో నంది గ్రామము ఉన్నది అక్కడ ఋషులలో ఉత్తముడైన దూర్వాసుడు తపస్సు చేస్తుంటాడు.8

నీలోత్పలసమాకీర్ణం కారణ్డవనిషేవితమ్ । తిష్ఠతే తత్ర వై తీర్థ సోమకుణ్డమితి శ్రుతమ్ ।।౯

అక్కడ నల్ల కలువల పుష్పములతో కలిసి కన్నె లేడి పిట్టలు సేవించు సోమ గుండము అను ఒక తీర్థం ఉన్నది.9

చిరిబిల్వాశ్చ బిల్వాశ్చ సిన్ధువారా మహాద్రుమాః । శోభన్తే ఋషయో యత్ర దుర్వాసాద్యా ఉపాసతే ।। ౧౦

ఆ తీర్థములో కానుగ చెట్లు ,మారేడు చెట్లు ,వావిలి చెట్లు చక్కగా ప్రకాశిస్తూ ఉంటాయి. దూర్వాసుడు మొదలైన మహర్షులు అక్కడ ఉపాసన చేస్తూ ఉంటారు.

తస్యావిదూరే ధర్మాత్మన్ మహాకాఞ్చీతి విశ్రుతా । వసతే తత్ర మద్భ్రాతా శ్రుతతీవ్రతపా ఇతి । । ౧౧

సోమగుండమను తీర్థమునకు సమీపములో మహాకాంచి అను పేరు గల ఒక ఆశ్రమం ఉన్నది .ఆ ఆశ్రమంలో నా తమ్ముడైన (అగస్త్యుని తమ్ముడైన) శ్రుతతీవ్రతపుడు అనే మహర్షి ఉన్నాడు.

తత్ర పద్మసరోనామ ప్రాచీనం పరిదృశ్యతే । జలనాగా జలవ్యాలా జలమత్స్యా వసన్తి తే ।।౧౨

జలనాగములు, నీటి పాములు, చేపలు మొదలైనవి నివసించే ప్రాచీనమైన పద్మసరోవరము అక్కడ ఉన్నది. 12

స్నాతుకామాన్ ఋషీన్ సర్వాన్న బాధన్తే తదాజ్ఞయా । తత్తీరే కుటజాః కూటశాల్మలీతరవస్తథా ||౧౩

నా తమ్ముని ఆజ్ఞచే ఆ పద్మసరోవరములో స్నానము చేసే ఋషులు మొదలైన వారిని ఆ జల జంతువులు ఏమీ బాధించవు. ఆ పద్మసరోవరపు ఒడ్డున కొండ బూరుగు చెట్లు మొదలైనవి పెరుగుతుంటాయి.

పాటలీపనసాశ్వత్థనీపనాగాః కపిత్థకాః । స్వచ్ఛచ్ఛాయాః ప్రదృశ్యన్తే పుష్పోదయఫలోదయాః ।।౧౪

కలిగొట్టుచెట్టు, పనస,రావి, కడిమి, నాగ గన్నేరు, వెలగ మొదలైన చెట్లు ఆ పద్మసరోవరపు ఒడ్డున పుష్పములతో ఫలములతో విరబూసి చక్కగా ప్రకాశిస్తుంటాయి. 14

అస్మాకమపి తత్రైవ రాజతే జాతుచిన్మనః । పురా మునివరస్తత్ర కఞ్చిత్కాలం మయా స్థితమ్ ।।౧౫

ఆ పద్మసరోవర ప్రాంతానికి వెళ్లాలని నాకు ఒకసారి కోరిక కలిగింది. అక్కడికి వెళ్లి కొంతకాలం నేను ఉన్నాను.15

బిసిన్యాస్తూత్తరే తీరే బహుభిర్మునిపుఙ్గవైః । తత్ర రామస్సహ భ్రాత్రా తతః ప్రాదురభూన్మునే ।।౧౬

ఆ పద్మసరోవరమునకు ఉత్తర తీరములో అనేకమంది ముని పుంగవుల చేత సేవించబడు రామలక్ష్మణులను నేను దర్శించి పూజించాను. 16

రామమిన్దీవరశ్యామమావిర్భూతం మదన్తికే । ఆజానులమ్బితభుజమాసీనం దేవముజ్జ్వలమ్ ।।౧౭

నల్లకలువవలె నల్లగా ఉండు శ్రీరామచంద్రమూర్తి నాకు సమీపంలో కనిపించాడు. ఆ శ్రీరాముడు మోకాలు వరకు గల పొడుగైన చేతులు కలవాడు .చక్కగా ప్రకాశించువాడు .

చీనకృష్ణామ్బరధరం జటిలం సుమహత్ప్రభమ్ । అవలోక్య పటైర్దివ్యైః పూజామకరవం తదా । ౧౮

నార వస్త్రములు ధరించిన వాడును, సన్యాసివేషము ధరించిన వాడును చక్కని కాంతి కలవాడును అయిన రామచంద్ర మూర్తిని చూసి నేను పూజ చేసితిని.18

దశాననవధార్థాయ సోహం రామముపాదిశమ్ । అస్త్రం చానుమయాత్తస్మై భ్రాత్రా సహ నిషేవతే । । ౧౯

పది తలలు కలిగిన రావణాసురుని సంహారము కొరకు నేను రామచంద్రుని ప్రేరేపించితిని. అనేక దివ్యాస్త్రములను తమ్మునితో కలిసి నన్ను సేవించు రామునికి ఇచ్చితిని .19

తత్ర తేన సహ భ్రాత్రా స్నాతుం సరసి నిర్మలే । మయానుజ్ఞాపితో రామో దశాస్యమజయద్రణే ||౨౦

నా ఆదేశముతో తమ్మునితో కలిసి శ్రీరామచంద్రమూర్తి ఈ పద్మ సరస్సులో స్నానము చేయుట వలన యుద్ధములో రావణుని జయించగలిగెను.20

తత్ర గన్ధర్వపతయో మోచితా మదనుగ్రహాత్ । హేమాఙ్గదశ్చిత్రరథో హేమకేశో మహారథః । । ౨౧

శ్వేతకేతుశ్చ పఞ్చైతే గన్ధర్వాణాం ధురిస్థితాః ।

ఈ ప్రాంతంలో హేమాంగదుడు చిత్రరథుడు, హేమ కేశుడు మహారథుడు శ్వేతకేతువు అను ఐదుగురు గంధర్వులు నాచే విడిపింప బడిరి.

దత్తాత్రేయాద్వరం లబ్ధ్వా దుర్మదా నివసన్తి వై ||౨౨

ఐదుగురు గంధర్వులు దత్తాత్రేయుని యొక్క అనుగ్రహముతో వరములను పొంది నివసిస్తున్నారు.

దత్తదత్తవరాస్సర్వే మదమత్తహృదస్తదా । స వయోభిశ్చ సన్నద్ధైశ్చాపతూణీధరైశ్చ తైః ||౨౩

దత్తాత్రేయునిచే వరములను పొందిన మదమత్తులైన ఆ దుర్మార్గులు తమకున్న సర్వాయుధాలను ధరించేవారు.

తే కదాచిద్దురాత్మానః బ్రహ్మలోకజిగీషయా । ధర్మరాజపురీ యాతా గన్ధర్వపతయస్తదా || ౨౪

ఒకసారి ఆ దుర్మార్గులు ఒకసారి బ్రహ్మలోకమునకు పోతూ మార్గమధ్యంలో యమధర్మరాజు యొక్క యమలోకాన్ని సందర్శించారు24

కిఙ్కరాన్శతశో దృష్ట్వా బాధమానాన్వినాదితాన్। సర్వాన్నరాన్ రౌరవకే నరకేషు నిపాతితాన్ । । ౨౫

అక్కడ రౌరవము మొదలైన నరకములలో వందలకొద్దీ యమకింకరులు మానవులను హింసించటం చూసారు.

శ్రుత్వా హాహాకృతం తత్ర నరకస్థైర్జనైః కృతమ్ । తత్రోఽధవశమాపన్నాః కింకరానిదమబ్రువన్ ।।౨౬
ఆ నరకములలో  హింసలు పడుతున్న మానవుల యొక్క హాహాకారాలు విని భరించలేక ఆ యమకింకరులతో ఐదుగురు గంధర్వులు ఇలా అన్నారు26

హే కింకరా భవన్తః కే బాధన్తే వా జనానిమాన్। కస్య వా శాసనం గృహ్యానోఽభిశంసత నిశ్చయమ్ ।। ౨౭
ఓ యమకింకరులారా! మీరు ఎందుకు ఈ మానవుల్ని బాధిస్తున్నారు? మిమ్మల్ని ఇలా చేయమని ఎవరు మీకు ఆదేశం ఇచ్చారు?27

కిఙ్కరాస్తే మహాత్మానో భృత్యా రాజవశే స్థితాః । అలక్షీకృత్య గన్ధర్వాన్ బాధన్తే నిరయే నరాన్ ।। ౨౮
యముని ఆజ్ఞకు బద్ధులైన ఆ యమకింకరులు  గంధర్వుల యొక్క ప్రశ్నకు జవాబు చెప్పకుండా ,వారి మాటలను లెక్కచేయక, మానవులను యధాప్రకారముగా బాధపెట్టారు .28

తే దృష్ట్వా దుర్వరాన్ దగ్ధాన్ వరమత్తాన్మహాత్మనః । కిఙ్కరా లక్షయన్తో వై కూటముద్గరపాణయః ।। ౨౯
యమకింకరుల నిర్లక్ష్య ప్రవర్తనను చూసి దత్తాత్రేయుని వరముతో మదించిన ఆ ఐదుగురు గంధర్వులు కోపించి ఆ యమకింకరులను అనేక ఆయుధాలతో బాధించారు.29

పుష్టా ప్రముముచుస్తేషు శరానాసీవిషోపమాన్। పట్టసాన్భిణ్డివాలాంశ్చ తోమరాంశ్చాస్త్రసత్తమాన్।।౩౦
విషము పూసినబాణముల చేత, ఖడ్గముల చేత పట్టసముల(అడ్డ కత్తులు) చేత, భిండివాలముల(ఇనుపయలుగుకట్టెలు) చేత ,తోమరముల(ఇనుప గుదియలు) చేత, అస్త్రముల చేత ఆ యమకింకరులను ఐదుగురు గంధర్వులు బాధించారు.30

విముచ్య తేషు సర్వేషు వితన్వతి మహాస్వరమ్। కిఙ్కరాశ్చ మృధంకృత్వా చిరాయ సుమహాబలాః ।। ౩౧
తట్టుకోలేని యమకింకరులు పెద్దగా అరుపులు చేస్తూ ఆ మహాబలులైన ఐదుగురు గంధర్వులతో యుద్ధం మొదలుపెట్టారు. 31

జేతుం గన్ధర్వరాజేన్ద్రాన్ న శేకుస్తత్ర సర్వశః । గన్ధర్వైశ్చ వినిర్ముక్తా నిష్టప్తాశ్శరపీడితాః ।। ౩౨
ఎన్ని రకాలుగా యుద్ధము చేసినప్పటికీ ఆ ఐదుగురు గంధర్వ రాజులను యమకింకరులు జయంపలేకపోయారు. వారి బాణములచే బాధింపబడ్డారు.32

శరణం ధర్మరాజానం కిఙ్కరాస్సముపాయయుః । గన్ధర్వపతయో మత్తా ఇతి వాచం ప్రశంసినః ।। ౩౩
మత్తులైన గంధర్వపతుల యొక్క పరాక్రమాన్ని వర్ణిస్తూ యమకింకరులు యమధర్మరాజుని తమను రక్షించమని శరణు వేడారు33

. నరకాన్మోచితాస్సర్వే నరా ఇత్యభిశంసతః । స తానాలోక్య ధర్మాత్మా పితృణామీశ్వరస్తదా ।।౩౪

పితృలోకాధిపతి అయిన యమధర్మరాజు యమకింకరులను. బాధల నుంచి విడిపించడానికి యుద్ధానికి బయలుదేరాడు. మానవులు తమను ఎదిరించగలరా అని తీవ్రంగా వారిని అధిక్షేపించాడు.34

విజ్ఞాయ ధర్మరాజస్తు దత్తాత్రేయజరోదితాన్ | మదేన ముదితాన్ సర్వాన్ హేమాఙ్గదముఖాన్ తదా ||౩౫

యుద్ధరంగమునకు వచ్చిన తర్వాత ఆ ఐదుగురు గంధర్వులను దత్తాత్రేయుని వరప్రసాదులుగా యమధర్మరాజు గుర్తించాడు. 35

మృత్యుం కృత్వా పురఃకాలః కాలదణ్డం ప్రగృహ్య వై| నిర్గత్య సహ సైన్యేన కోపావిష్టః పరేతరాట్ ||౩౬

కాలదండమును ధరించి తన సైన్యముతో ఆ యమధర్మరాజు అయిదుగురు గంధర్వులతో యుద్ధము చేయుట మొదలుపెట్టాడు. 36

మమాథ కాలదణ్డేన గన్ధర్వేన్ద్రాన్విగర్వితాన్ | కాలదణ్డేన మథితాన్ గన్ధర్వేన్ద్రాన్విగర్వితాన్ | ||౩౭

తన కాలదండముతో అనగా యమపాశముతో ఆ గంధర్వులను యుద్ధముల ఓడించి వారి యొక్క గర్వాన్ని యముడు పోగొట్టాడు.37

కాలత్రికోకపి తం దృష్ట్వా దత్తాత్రేయ వ్యచిన్తయత్ | విచిన్త్య సుచిరం కాలం మాం తీవ్రతపసి స్థితమ్ || ౩౮

గంధర్వులు ఈ విధముగా యముని చేత బాధపడుతూ ఉండగా తన చేత వరములను పొందిన ఆ గంధర్వుల బాధలను చూసి సహించలేక ఆ దత్తాత్రేయుడు తీవ్రమైన తపస్సు చేస్తున్న నా దగ్గరకు (అగస్త్యుని) వచ్చాడు.38

వసన్తం తత్ర సంప్రేక్ష్య ప్రత్యక్షమిదమూచివాన్ |

దత్తాత్రేయ:

మయా దత్తవరాః కేచ గన్ధర్వాణాం తరస్వినామ్ ||౩౯

నా దగ్గరకు వచ్చి ఈ విధముగా నాతో అన్నాడు. ఓ అగస్త్యా! మహాబలులైన ఐదుగురు గంధర్వులు నాచేత వరములను పొందారు 39

పతయః పఞ్చనగరీం గతా ధర్మపతేరమీ | తాన్వీక్ష్య సుదురాధర్షాన్ కాలకిఙ్కరచోదితః ||౪౦

అయిదుగురు గంధర్వులు యముడు పాలించు యమలోకానికి వెళ్లి అక్కడ దురాధర్షులైన(=జయింప శక్యము గానివారు) యమకింకరులచే ప్రేరేపించబడ్డారు. 40

దణ్డముద్యమ్య చోద్యుక్తః ప్రహర్తుం మునిపుఙ్గవ | కాలదణ్డో దురాధర్షో భవితా చ వచో మమ ||౪౧

యమకింకరులు యమధర్మరాజును శరణు వేడగా కాలదండమును చేత ధరించి ఆ యముడు ఆ గంధర్వులను బాధిస్తున్నాడు. యముని యొక్క యమపాశము మరియు నా యొక్క మాట తిరుగులేనివి.41

యథార్హతి తథా త్వం వై కురు తత్ర గతో మునే | స్వామిబుద్ధిం విధధతే త్వయి సర్వే సురర్షయః ||౪౨

కనుక గంధర్వులకు నేను ఇచ్చిన వరము నిష్ఫలము కాకుండా, యమపాశం వృథా కాకుండా నీ బుద్ధి చాతుర్యమును ఉపయోగించుము.42

యతో నరహరిస్సాక్షాదధ్యాస్తే భవదాశయే । ఇత్యహం బోధితస్తేన ధర్మరాజముపేత్య వై ।।౪౩
నువ్వు నరసింహస్వామి ఉపాసకునివి గనుక ఇప్పుడు ఏమి చేయవలనో నీకు బాగా తెలుస్తుంది అని దత్తాత్రేయుడు నాతో చెప్పగా నేను(అగస్త్యుడు) వెంటనే యమధర్మరాజు దగ్గరకు వెళ్లాను .

దత్తాజ్ఞాం చ పురస్కృత్య గన్ధర్వాంశ్చ వ్యమోచయః । మయా సుబోధితా హ్యేతే ధర్మరాజాద్విమోచితాః । ।।౪౪
దత్తాత్రేయుని యొక్క ఆజ్ఞను అనుసరించి యమునికి నచ్చచెప్పి అతని బారి నుంచి ఐదుగురు గంధర్వులను నేను విడిపించాను.44

పఞ్చగన్ధర్వపతయో న్యవసన్ భ్రాతురాశ్రమే తే మయా బోధితా నిత్యం ధర్మ్యం పన్థానమాశ్రితాః । । ౪౫
అయిదుగురు గంధర్వపతులు నా తమ్ముడి ఆశ్రమమైన ఇక్కడ నివాసముండి చక్కగా ధర్మ మార్గాన్ని ఆశ్రయించారు 45

కృతావగాహా: పద్మోదే బ్రహ్మర్షిగణసేవితాః । ఉషిత్వా సుచిరం కాలం తపః కృత్వా సుదారుణమ్ ।।౪౬
బ్రహ్మర్షి గణములు సేవించు ఇక్కడి పద్మతీర్థములో స్నానము చేసి వారు చాలా కాలము కఠినమైన తపస్సు చేసారు.

విధూతమదదుర్గర్వాః ప్రయాతాస్స్వం పురీ పురా ।
ఆ తరువాత ఐదుగురు గంధర్వులు తమ గర్వాహంకారాలను వదిలిపెట్టి తమ నగరానికి వెళ్లారు.
తత్ర యే పితృదేవాంస్తు తర్పయన్తి ద్విజర్షభాః ।।౪౭
ఏ మానవుడైన ఈ పద్మతీర్థములో సరస్సులో స్నానము చేసి పితృదేవతలకు తర్పణము ఇస్తాడో వాడు ధన్యుడు. 47

తులసీకాననం యే వే బిల్వానారోపయన్తి యే తే సర్వే మత్ప్రసాదేన మమ భ్రాతుశ్చ వైభవాత్ ।।౪౮
తులసి తోటను , మారేడు చెట్టులను నాటిన నా యొక్క నా తమ్ముని యొక్క ప్రభావము కలిగిన ఈ పద్మతీర్థములో సరస్సులో స్నానము చేసిన వారు పునీతులవుతారు.48

నృహరౌ భక్తిమన్తస్తు సాత్వికాః ప్రభవన్తి వై ।
వారు నరసింహ స్వామి యందు భక్తి మనసు కలిగిన వారయి తదుపరి జన్మలో సాత్వికులుగా పుడతారు. 49

పశ్చిమే తస్య దృశ్యన్తే వృక్షా గగనహేలినః ।। ।। ౫౦
ఈ తీర్థానికి పడమటి దిక్కులో ఆకాశాన్ని తాకే వృక్షాలు ఉన్నాయి. 50

సతతం ఫలపూర్ణాస్తు పూర్ణాస్సర్వర్షిసత్తమైః । తే తు వాల్మీకినా సమ్యగ్వర్ధితా మునినా సదా ||౫౧

ఈ వృక్షాలన్నీ పండ్లతో ఎప్పుడు సంపూర్ణంగా అందంగా కనపడుతూ వాల్మీకి మహర్షి చేత పెంచబడినవి.

వాల్మీకి ఆశ్రమం

శాఖోపశాఖా శోభన్తే భూరుహః పుష్పశాలినః । వాల్మీకేరాశ్రమపదం తత్రైవ ప్రతిభాసతే ||

శాఖోప శాఖలు కలిగిన  వృక్షములు పుష్పములతో కన్నుల విందు చేస్తూ ఇక్కడి వాల్మీకి ఆశ్రమం చక్కగా కనపడుతుంది .52

కుర్వన్తి నియతాహారాస్తపో యత్ర సురర్షయః । పురా స ఋషిశార్దూలస్తపస్తేపే మహాతపాః ||౫౩

అనేక సంవత్సరములు ఆహార నియమము పాటించి ఆ వాల్మీకి మహర్షి ఇక్కడ తపస్సు చేశాడు53

సప్తాశీతిసహస్రాణి వర్షాణి నియతవ్రతః । నిరాస్థస్య మునేస్తస్య జలపర్ణాశననాదిషు

ఈ ఆశ్రమంలో వాల్మీకి 87 వేల సంవత్సరాలు వ్రత నియమముతో కేవలం నీరు ఆకులు తింటూ ఘోరమైన తపస్సు చేసాడు.

వల్మీకభూతదేహస్తు సర్వాణామభవత్ పదమ్ । తస్మిన్ కాలే ప్రజానాథ నారదేన ప్రచోదితః ||౫౫

అతడు తపస్సు చేస్తుండగా అతని శరీరముపై పుట్టలు పెరిగాయి. అందులో పాములు చేరాయి. అప్పుడు నారదుడు వేడుకొనగా బ్రహ్మదేవుడు వాల్మీకి ఆశ్రమానికి వచ్చాడు.55

తస్యాశ్రమపదం భేజే సరస్వత్యాపితామహః । వీక్షమాణో దిశస్సర్వాన్ వంశపుంజమవైక్షత ||౫౬

సర్వలోకమునకు పితామహుడైన బ్రహ్మదేవుడు సరస్వతీ సమేతంగా  ఆ ఆశ్రమానికి వచ్చాడు. అక్కడ తనపై పుట్టలు పెరుగుతుండగా తపస్సు చేస్తున్న వాల్మీకిని చూసాడు.56

తత్ర వల్మీకభవనం ప్రజానాం పతిరుత్తమమ్ । స విస్మయాకులో వాణీమభాణీదన్తికస్థితామ్ ||౫౭

అక్కడ పుట్టలు పెరుగుతున్నను లెక్కచేయక తీవ్రమైన తపస్సు చేస్తున్న వాల్మీకిని చూసి చాలా ఆశ్చర్యపడి బ్రహ్మదేవుడు తన పక్కనే ఉన్న సరస్వతీదేవితో ఇలా అన్నాడు.57

బ్రహ్మ

ప్రియే పశ్య మహాత్మాయమాత్మానం నావబుధ్యతే । ఈదృశీ భక్తిరన్యేషాం నృహరీ నైవ కేవలమ్ ||౫౮

ఓ ప్రియా ! సరస్వతీ ! చూడు ఈ మహాత్ముడు నరసింహునియందు మనస్సును ఉంచి తీవ్రమైన భక్తితో తపస్సు చేయుచున్నాడు.

అయం తు కురుతే తీవ్రం నిరాశీ తప ఉత్తమమ్ । మయాపి శఙ్కరేణాపి దురవాపమిదం ప్రియే ||౫౯

పుట్ట తనపై పెరుగుతున్నా తెలియకుండా తీవ్రమైన తపస్సు చేస్తున్నాడు. నేను, ఈశ్వరుడు కూడ ఇటువంటి తపస్సు చేయలేము కదా!'58

అగస్త్యః

ఇత్యుక్త్వా స గిరాం దేవీం వల్మీకస్య పదం గతః । దైవతైస్స్తూయమానో వై ప్రాహ గమ్భీరయా గిరా ॥ ౬౦

అని సరస్వతీదేవితో పలికి వాల్మీకి దగ్గరకు వెళ్లి దేవతలు స్తుతించుచుండగా గంభీరమయిన మాటలతో వాల్మీకితో ఇలా అన్నాడు.60

ఉత్తిష్ఠోత్తిష్ఠ భద్రం తే అస్మాద్వల్మీకతో మునే । చతుర్ముఖోఽఽయమభ్యేతి భవదీయాశ్రమం పదమ్ ॥౬౧

"వాల్మీకీ! ఈ పుట్టనుండి పైకి లెమ్ము. నీ యొక్క ఆశ్రమమునకు చతుర్ముఖుడయిన నేను వచ్చాను.

ఇతి సంబోధితస్తస్య వచనైవ మహాతపాః । తస్మాద్వల్మీకతో ముక్తిస్సర్పస్త్వచ ఇవాభవత్ ॥౬౨

బ్రహ్మ ఈ రకంగా చెప్పగా కుబుసము విడిచిన పాములా వాల్మీకి పుట్టనుండి బయటికి వచ్చాడు.

బహిర్నిర్గత్య తేజస్వీ కమణ్డలునబోదకైః । నయనే మార్జయన్ పార్శ్వే బ్రహ్మాణం దృష్టవాన్ మునిః ॥౬౩

బయటకు వచ్చిన వాల్మీకి తనపై బ్రహ్మదేవుడు కమండలములోని జలమును చల్లగా శక్తిని పొంది, కన్నులు తెరచి ఎదుట ఉన్న బ్రహ్మను చూసాడు. .. బ్రహ్మను చూచి ఇలా స్తుతించాడు..

వాల్మీకి:-

ధాతశ్చేమాని భూతాని జాయన్తే హి జగత్పతే| యేన జాతాని జీవన్తి యత్ప్రయాన్తి నమోస్తు తే ॥౬౪

ఓ విశ్వ ప్రభువా! ఎవరి వలన ఈ సమస్త జీవులు పుట్టాయో, ఎవరి వలన జీవిస్తాయో, ఎవరి వలన అవి వెళ్ళిపోతాయో వాటికి కారకుడగు నీకు నా నమస్కారాలు అర్పిస్తున్నాను.

యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ । నమస్తే పూష్ణిసంస్థాయ బ్రహ్మణే పరమేష్ఠినే ।। ౬౫

ఎవరిని వర్ణించలేక వాక్కు, చేరలేక మనసు విఫలమవుతాయో అతడే పరమాత్మ అని ఉపనిషత్తులు చెబుతున్నాయి. అటువంటి పరమ సత్యమైన సూర్యమండల స్థితుడవైన పరమాత్మవైన నీకు నమస్కారాలు. . 65

యస్యాజ్ఞయాతిష్ఠతీదం జగత్ స్థావరజఙ్గమమ్ । నమో వేదాన్తవేద్యాయ బ్రహ్మణే తే మహాత్మనే । ౬౬

ఎవరి ఆజ్ఞ వలన ఈ విశ్వంలోని చలించు మరియు కదలకుండా ఉన్న సమస్త జీవులు జీవిస్తున్నాయో, అట్టి పరమ సత్యవంతుడివి, వేదముల చేతతెలుసుకొనబడువాడవగు , నీకు నా గౌరవపూర్వక ప్రణామాలు అర్పిస్తున్నాను. 66

భగవన్ త్వన్ముఖే భాతి యథా గోదేవతా సతీ । ఇయం హి సర్వభూతానాం కురుతే స్వరభేదనమ్ ॥౬౭

పాశాఙ్కుశధరా వాణీ వీణాపుస్తకధారిణీ ।

ఓ ప్రభూ! బ్రహ్మ దేవా ! నీ ముఖం పవిత్రమైన గోదేవతలా కనిపిస్తోంది. తాడు, అంకుశములతో పాటు, వీణను, పుస్తకాన్ని పట్టుకున్న ఈ సరస్వతి , అన్ని జీవులకు శుద్ధమైన స్వరజ్ఞానాన్ని అందిస్తుంది.

ఏషా వసతి సర్వేషు ముగ్ధకున్దేన్దునిర్మలా || ౬౮

మనోహరమైన కమలం మరియు చంద్రునివలె ఆహ్లాదకరమైన ఈ సరస్వతి దేవి అందరిలోనూ నివసిస్తుంది. 68

ఇయం ప్రసన్నా నృణాం వై ప్రవర్తయతి సంపదః | దీర్ఘమాయుశ్చ నిరతం కవితాం చ సుధామయీమ్ ||౬౯

ఈమె ప్రసన్నురాలై స్త్రీ పురుషులలో సంపదగా మారుతుంది. చాలా కాలం నిలిచే మధురమైన కవిత్వం గా ప్రకాశిస్తుంది.

సైషా సుధాస్వధాస్వాహా స్తుతిశ్చ ధృతిరేవ చ| గాయత్ర్యాదీని ఛన్దాంసి బ్రహ్మన్నస్యాం భవన్తి వై | ||౭౦

ఈ సరస్వతి దేవియే సుధ.(అమృతం) ఈమెయే స్వధా స్వాహా మంత్రాలుగా మారుతుంది. ఒకచోట ప్రశంసగా, మరొకచోట ధైర్యంగా మారి జీవన మనుగడకు కారణమవుతుంది (ఒక మంచి మాట జీవితానికి ధైర్యాన్ని ప్రసాదిస్తుంది కనుక సరస్వతీ దేవియే ఉత్తమ జీవన మార్గదాయిని అని వాల్మీకి ప్రశంస) ఓ బ్రహ్మ దేవుడా!, గాయత్రి మరియు ఇతర ఛందస్సులు ఈమె శరీరంలో ఉన్నాయి.70

**విశేషాలు**

అగ్నికార్యంలో/ యజ్ఞాలలో స్వాహా శబ్దం వినిపించినట్లే పితృ దేవతలకు తర్పణాలు ఇవ్వడంలో స్వధా శబ్దం వినిపిస్తుంది. పితృయజ్ఞాలలో స్వాహాదేవియే తర్పణాలలో స్వధా రూపిణిగా వస్తున్నదని శాస్త్రం. (పితృ యజ్ఞేషు స్వధా మాతా.) ఆమెయే సరస్వతీదేవి అని వాల్మీకి ప్రశంస.

హ్రీర్ధీర్భిరపిసంపుష్టిర్నిద్రా హింసా తథా మతిః | ఇయం దేవీ భగవతీ దుర్గా లక్ష్మీ సరస్వతీ ||౭౧

ఈ సరస్వతీదేవియే సిగ్గు, బుద్ధి, పోషణ, నిద్ర, అహింస మరియు తెలివితేటలు మొదలయినవి కలిగించి ఈ దేవత దుర్గ, లక్ష్మీ దేవులుగాప్రజలను కాపాడుతుంది. 71

ఛాయా సువర్చలా సేయం ఏకాకీ బహురూపిణీ |

అందమయిన ఈ సరస్వతీ దేవి ఏకరూపిణిగా, బహు రూపిణిగా లోకంలో ప్రసిద్ధి పొందింది

అగస్త్యః

ఇతి స్తువన్ మునిశ్రేష్ఠః పరమేష్ఠినమన్తికే ||౭౨

ఆ విధంగా బ్రహ్మను, సరస్వతిని స్తుతిస్తూ వాల్మీకి మహర్షి బ్రహ్మదేవుని సమీపించాడు.

అధ్యాసీనం గిరా సార్ధం దణ్డవత్ ప్రణనామ హ| ఉత్థాప్య భగవాన్ బ్రహ్మా ప్రణమన్తం మునీశ్వరమ్ ||

ఈ విధంగా స్తుతించిన తర్వాత బ్రహ్మదేవునికి వాల్మీకి దండ ప్రణామం(సాష్టాంగనమస్కారము) చేసాడు.  బ్రహ్మ దేవుడు తనకు నమస్కరిస్తున్న వాల్మీకిని పైకి లేవనెత్తాడు.

సంస్థాప్య పార్శ్వభాగే తం ప్రాహ సూనృతయా గిరా |

తన పక్కన కూర్చోబెట్టుకుని అతనితో ఆహ్లాదకరమైన స్వరంతో ఇలా మాట్లాడాడు.

బ్రహ్మ

అమునా తపసా భూమ్నా యస్మాద్వల్మీకతో జనిః | | ౭౪

ఈ అద్భుతమయిన తపస్సుతో వల్మీకము(= పుట్ట) నుండి  వచ్చావు.

అభవత్తే తతస్స్వద్బిస్తస్మాద్వాల్మీకిరుచ్యతే | ఇత్థం నిర్గలితా వాణీ వాల్మీకే భవతో ముఖాత్||౭౫

వల్మీకము(= పుట్ట) నుండి  వచ్చావు గనుక వాల్మీకివి అవుతావు.  నీ నోటివెంట ఇలా   ఒక అద్భుతమయిన వాణి వెలువడినది కదా !?

పురా హి మా నిషాదేతి శ్లోకరూపిణ్యనుత్తమా| వ్యాకులస్త్వం నదీతీరే కిమేతదితి చిన్తయా | |౭౬

పూర్వము  నీ నోటివెంట "మా నిషాద......" అను  అద్భుతమయిన శ్లోక వాణి వెలువడినది కదా?

విశేషాలు

మానిషాద ప్రతిష్ఠాం త్వమగన శ్శాశ్వతీస్సమాః  యత్క్రౌంచమిథునాదేక మవధీః కామమోహితమ్  అని శ్లోక పూర్తి పాఠం.

ఈ శ్లోకానికి రకరకాల అర్థాలు

1.'ఓరి వేటగాడా! పరస్పరం కామమోహంతో ఉన్న పక్షులలో మగపిట్టని చంపిన కారణంగా ఎక్కువకాలం నువ్వుండరాదుసుమా!" ఇది బోయవాని పరమైన అర్థం.

(2) మా ( లక్ష్మికి) నిషాదుడవైన (భర్త) ఓ రామా! సీతా విషయంలో కామమోహితుడైన రావణుణ్ణి, రావణమండోదరుల జంటనుండి చంపి, శాశ్వత ప్రతిష్ఠనీ, కీర్తినీ, పొందుదువుగాక! అని రామ పరంగా అర్థం. 'మానిషాద' అనడం వలన బోయవాణ్ణి శ్రీ మహావిష్ణువుగా వాల్మీకి గమనించడం, కేవలం ఆ స్థితిలోనే — అని - ఈ శ్లోకం చెప్తోంది.

(3) ముల్లోకాలనీ బాధపెట్టే ఓ రావణుడా! (నితరాం సాదయతి పీడయతి ఇతి విషాద) రాజ్యం పోయి, వనవాసం చేస్తూ క్షీణించిన 'సీత', అనే అల్పజీవిని, చావుతో సమానమైన భర్తృవియోగ దుఃఖాన్ని కల్గించిన కారణంగా, శాశ్వత కాల కీర్తిని నీవు పొందకుండుదువుగాక! బ్రహ్మ ఇచ్చిన వంశాభి వృద్ధి వరము ఫలింపకుండుగాక! అని రావణపరంగా అర్థం.

(4) చాల కాలంగా జీవిస్తూన్న వాడివి నువ్వు. జంట నుండి మగ క్రౌంచపక్షిని కొట్టడమనేది ఏది ఉందో, ఆ పని యిక మీద వద్దు సుమా! అని ఉపదేశరూపమైన అర్థం.

(5) ఈ శ్లోకంలో ఉన్న 7 పదాల ద్వారా, 7 కాండల అర్థాన్ని ఇప్పిస్తూ, కథా ప్రణాళికని సరస్వతి వాల్మీకికి అందించింది. అంటే, ఏ కాండ, ఏకథావస్తువుతో ఉండాలనేది దీని ద్వారా సరస్వతీదేవి తెలిపింది. వాల్మీకికి తెలిసింది.

(1) ! 'సీతా భర్తా' అని సంబోధనం! బాలకాండం సీతా వివాహంతో సరి. (పరశురామగర్వభంగమున్నా సీతావివాహమే ముఖ్యం.)

(2) ప్రతిష్ఠాం త్వ మగమః - పితృవాక్పాలన విధానం - అయోధ్యా కాండ కథ ఇది.

(3) శాశ్వతస్సమాః - ప్రతిజ్ఞాపాలనం కోసం అనేక సంవత్సరాలు వనవాసం కదా! ఆరణ్య కాండ కథ ఇదే.

(4) క్రౌంచమిధునాత్ (క్రుంచ గతి కౌటిల్యాల్పీ భావయో) - వంకర చరిత్ర కల్గినవీ, అల్ప బుద్ధి ఉన్న తారావాలి జంటలో వాలిని చంపడం. కిష్కింధాకాండ కథ.

(5) ఏకమ్ - కార్య సాధకుడు 'ఒక్కడు' - సుందర కాండ కథ.

(6) అవధీః - రావణ వధ - యుద్ధకాండ కథ. (7) కామమోహితమ్ - ఋషిపత్నులని చూడాలనే సీత మోహతత్త్వం (సీతారాముల వైకుంఠ ప్రయాణం) - ఉత్తర కాండ కథ. ( బ్రహ్మశ్రీ మైల వరపు శ్రీనివాసరావుగారి బాలకాండము 15,16,17 పుటలు)

మునిస్తు వైణికో బ్రహ్మన్ తదా తే నికటం గతః । తద్వాక్యాన్నృహరేః పాదే శైలస్య క్రియతే తపః । । ౭౭

ఈ శ్లోకము నీ నోటినుండి  ఎందుకు వచ్చినదని నీవు ఆలోచిస్తుంటే  నారదుడు వచ్చి నీకు ఉపదేశము చేసాడు. నారదుడు చెప్పినట్లుగా నీవు నరసింహుడు కొలువైన  ఈ కొండపై తపస్సు చేస్తున్నావు.

ఆనుపూర్వ్యేణ భగవానేష తే బోధయిష్యతి । తదహం వచసాం దేవ్యాస్సర్వైరపి సురోత్తమైః । ।౭౮

నీకు రామాయణ కథను సమగ్రంగా వరుసగా  నారదుడు చెబుతాడు. అందువలన  శ్రేష్ఠులయిన దేవతలందరితో కలిసి నేనువచ్చాను.

తవ ప్రజ్ఞాం చ కీర్తి చ దాతుకామ ఇహాగతః। అద్య ప్రభృతి కీర్తిస్తే బ్రహ్మన్ తేజో మదీప్స్యసి । ।౭౯

నీకు ప్రజ్ఞను కీర్తిని  ఇవ్వాలని వచ్చాను.  ఇది మొదలుగా  నీ కీర్తి శాశ్వతమై ప్రకాశిస్తుంది.

వచో దేవీ భవద్వక్త్రే ప్రాదుర్భవతి భారతీ । బ్రాహ్మణైః క్షత్రియైవైశ్యశూద్రైరపి సమాదృతమ్ ।।౮౦

నీ నోటివెంట  సరస్వతి పుడుతుంది. . బ్రాహ్మణ,  క్షత్రియ, వైశ్యశూద్రులు అందరూ  ఆదరించు కావ్యాన్ని నువ్వు రచిస్తావు. 80

కావ్యం రామాయణం నామ కరిష్యతి భవాన్ మునే । అనన్యసులభా కీర్తిస్తే సమావిర్భవిష్యతి । । ౮౧

భవితాஉஉదికవిస్త్వం హి త్రిషు లోకేషు విశ్రుతః ।

అందరూ  ఆదరించు రామాయణ  కావ్యాన్ని నువ్వు రచించి,  అనితర సాధ్యమైన ఆదికవి అను  గొప్ప కీర్తిని మూడులోకాల్లోను పొందుతావు

అగస్త్యః

మన్త్రపూతం జలం గృహ్య కమణ్డలుముఖాచ్చ్యుతమ్ ।।౮౨

సారస్వతమనుం తస్మై సోపదేశ్య దివం గతః । సారస్వతమనుం గ్రాహ్య బ్రహ్మణో వచనాచ్చ్యుతమ్ ।।౮౩

ఇలా  చెప్పి మంత్ర పూతమయిన నీటిని గ్రహించి  బ్రహ్మ సారస్వత మహామంత్రమును వాల్మీకికి ఉపదేశించాడు.

గిరాం దేవీం మనసి వై సంస్థాప్య ధ్యానమాస్థితః । గిరాం దేవ్యనుభావేన వాల్మీకిర్మునిపుఙ్గవః ।।౮౪

కృత్స్నం రామాయణం తత్ర వ్యాకరోన్నృహరేః పదే | తస్యాశ్రమపదే తీర్థం రామనామాఙ్కితం మహత్ ||౮౫

ఆ మంత్రమును మనస్సులో ధ్యానించి పదే పదే జపించి వాణి అనుగ్రహ ప్రభావముతో వాల్మీకిమునిపుంగవుడు సమగ్ర రామాయణమును శ్రీ నరసింహ స్వామి నిలయమైన ఘటికాచలముపై రచించాడు. ఆ వాల్మీకి ఆశ్రమములో రామతీర్థము ఉన్నది. 84,85

తత్తీరే భూరుహాః పఞ్చ పుష్పిణః ఫలినస్సదా | ఆమ్రః కపిత్థః పనసో నారికేలోఽథ జమ్బుకః ||౮౬

ఇచ్చట రామతీర్థపు తీరములో మామిడి,వెలగ, పనస, కొబ్బరి,నేరేడు అను అయిదు రకాల ఫల పుష్పాదులతో కూడిన వృక్షములు ఉన్నాయి.

ఇమే హి పఞ్చ తరవ ఋషీన్ సంప్రీణయన్తి వై| తస్యోత్తరస్యాం దిశి వై శిలాకూట ఇతి శ్రుతః || ౮౭

పైన చెప్పిన అయిదు చెట్లు ఋషులను ఆనందింపచేస్తుంటాయి.. దీనికి ఉత్తరమున శిలాకూటము ఉన్నది.

యస్తు యోగనృసింహాదేః పాదోత్తమ ఇతీయంతే | తత్ర సర్వేషు చ స్వైరం షడ్జస్వరవిహారిణః ||౮౮

బర్హిణః పరిహృష్యన్తః పరినృత్యన్తి సర్వశః | స తనోతి తపస్తీవ్రం మన్తా తంత్ర ఋషీశ్వరః | యస్య విష్ణుశ్చ రుద్రశ్చ బ్రహ్మా తనుభువః పురా || ౮౯

. ఇక్కడ శ్రీయోగ నరసింహస్వామి పాదతీర్థము ఉన్నది. ఇక్కడ షడ్జస్వరములు పలుకుతూ నెమళ్ళు అంతటా నృత్యం చేస్తూ ఇక్కడ ఉన్న తఒతాపము కల మునీశ్వరుల మనస్సులను ఆహ్లాదపరుస్తుంటాయి. ఇక్కడే అత్రిమహర్షి తపస్సు చేసి బ్రహ్మవిష్ణు మహేశ్వరులను కుమారులుగా పొందాడు.( సంగీతమున సప్తస్వరములలో ఒకదానిని షడ్జస్వరము అంటారు. (షట్ + జం) ఆరు స్థానాల నుంచి జనించే శబ్దం. ఆరు స్థానాలు : ముక్కు, గొంతు, దౌడ, నాలుక, దంతాలు, రొమ్ము)

ఇతి బ్రహ్మవర్తే ఉత్తరఖణ్డే భృగుపరాశరసంవాదే ఘటికాచలమాహాత్మ్యే ఏకాదశోఽధ్యాయః ||

ఇక్కడితో బ్రహ్మ-కైవర్త పురాణంలోని ఉత్తరఖండంలో భృగువు మరియు పరాశరుని మధ్య జరిగిన సంభాషణలో ఘటికాచల మాహాత్మ్యంలో పదకొండవ అధ్యాయం పూర్తి అయినది. +++++

శ్రీ శివాయ గురవే నమః

ఘటికాచలనివాసాయ శ్రీ నృసింహాయ నమః

## బ్రహ్మకైవర్త పురాణములో ఉన్న శ్రీఘటికాచల మాహాత్మ్యపు పన్నెండవ అధ్యాయము

(మూల శ్లోకము మరియు తాత్పర్య విశేషాలతో)

ద్వాదశోఽధ్యాయః

వామదేవ:

పన్నెండవ అధ్యాయము

### అత్రి ఆశ్రమము

వామదేవుడు అడుగుచున్నాడు

01-10

బ్రహ్మన్ బ్రహ్మాదయో దేవాస్సృష్టతాః పుత్రతాం పురా | అత్రేరస్య ప్రభావం వై వద మే వదతాం వర ||౧

వామదేవుడు అగస్త్యుని ఇట్టు ప్రశ్నించెను. "ఓ బ్రహ్మర్షీ! బ్రహ్మాది దేవతలు ఏ మహాత్ముని పుత్రులై ఉన్నారో, అటువంటి అత్రిమహర్షి ప్రభావమును నాకు వివరింపుము." అనిప్రశ్నింపగా అగస్త్యుడు ఇలా చెప్పాడు.

అగస్త్యః

పురా తు సింహలద్వీపే సిన్ధుద్వీప ర్షి చోదితః । ఔర్వో నామ తపశ్శ్రే ష్ఠః పుత్రకానంశ్చకోర హ ॥౨

పూర్వము సింహళద్వీపములో సింధు ద్వీపుడను మహర్షి ఉండేవాడు. అతనిచేత ప్రేరేపింపబడి, ఔర్వుడు అను మహర్షి సంతానము కొరకు తపస్సు చేసాడు.

నిరాహారో జితక్రోధో యస్మిన్ పుష్కరసత్తమే । స బ్రహ్మర్షిగణైరీడ్యో విష్ణుభక్తిపరోఽభవత్ । ॥౩

ఆ మహర్షితీర్థాలలో స్నానము చేస్తూ , ఆహారం తీసుకోకుండా, క్రోధమును జయించినవాడై, ఋషులచేత మెప్పుపొందాడు. విష్ణుభక్తి కలిగి అతడు తపస్సు చేసాడు.

వైష్ణవోఽసౌ ద్విజాతేషు దృష్టేషు భరతర్షభ । సంపుల్లమానస్తపసే స క్షేత్రస్తాపసస్సదా ॥౪

నియమాలను పాటిస్తూ ఔర్వుడు మూడుపూటల స్నానముచేసేవాడు. వాసుదేవుని సేవిస్తూ , మూడు పూటల వైష్ణవులైన ఋషులకు నమస్కరించేవాడు.

సతాం ప్రీణయతే నిత్యమనాహారో జితేన్ద్రియః । జితామర్షో జితోయస్తు విష్ణుభక్తిపరాయణః ॥౫

ఎప్పుడూ ఉపవాసం ఉంటూ ఇంద్రియాలను జయించేవాడు. సద్గురువులను సంతోషపరిచేవాడు. అతను కోపాన్ని జయించాడు, విష్ణు భక్తికి అతడు అంకితమయ్యాడు.

ఔర్వస్త్రిషవణస్నాయీ వాసుదేవకృతాశయః । త్రిసన్ధ్యం వన్ద్యమానో వై వైష్ణవానృషిసత్తమాన్ ॥౬

మూడు కాలములలోను(1. ప్రాతఃకాలము; 2. మధ్యాహ్నకాలము; 3. సాయంకాలము.) స్నానం చేసి ఔర్వుడు, వాసుదేవుని పట్ల అంకితభావంతో ఉన్నాడు. ఆయన మూడు సంధ్యలలోను వైష్ణవులను, గొప్ప ఋషులను పూజించాడు.

తస్య శుశ్రూషతే భార్యా శ్రుతకీర్తిరితి ప్రియా । అరున్ధతీవ భర్తారమనిన్ద్యగుణశాలినీ ॥౭

శ్రుతకీర్తి అను అతని భార్య అరుంధతి వలె ఉత్తమగుణములు కలిగి అతనిని సేవిస్తుండేది.

భర్తుర్విలమ్బమసహా భర్త్రనన్తరభోజినీ । భర్తుర్విలోకనపరా నిత్యం భర్తృహితే రతా ॥౮

భర్తను విడచి ఉండలేక అతనితో కలసిమెలసి ఉండేది. భర్త భుజించిన తరువాత భుజిస్తూ ఎల్లవేళల భర్తకు సేవ చేసేది.

సా సత్యవాదినీ సాధ్వీ విష్ణుభక్తసహోదరీ । ఉపాస్తే పుత్రకామా వై వైష్ణవాంశ్చ ద్విజర్షభాన్ ।।౯

ఆమె సత్యము మాట్లాడేది. పతివ్రత.  విష్ణుభక్తి కలది. ఆమెకూడా పుత్రులను పొందటానికి విష్ణుభక్తులకు పూజ చేసేది.

తే సర్వ ఋషయస్తత్ర వైష్ణవాః పుత్రమిచ్ఛతోః । దమ్పత్యోర్విన‌మన్త్యోర్వై వ్రతం వీక్ష్యేదమబ్రువన్ ।।౧౦

కొంతకాలము తరువాత మహర్షు లందరు ఆ దంపతులయొక్క కఠిన వ్రతమును, వాళ్లయొక్క పుత్రాభిలాషను గమనించి భగవంతుని ఇలా ప్రార్థించారు.

11-20

ఋషయః

యద్వయం వైష్ణవా విష్ణో యద్వయం వేదవాదినః । వాక్కాయమనసః శుద్ధాః ప్రసన్నో భవితా భవాన్ ।।౧౧

ఓ ప్రభూ! మేము విష్ణుభక్తులైన వైష్ణవులమైనచో,వేదమార్గమును అనుసరించు వారమైనచో, మనో వాక్కాయ కర్మలలో  పరిశుద్ధులమైనచో,

షట్కిబన్ధమయా దేవా గౌరవం గ్రహణం తథా । అనుల్లఙ్ఘితమస్మాభిః ప్రసన్నో భవితా భవాన్ ।। ౧౨

దేవతలందరిని మేము తృప్తిపరచి ఉంటే,  వ్రతము మొదలయిన  అనుష్ఠానములు మాచే ఉల్లంఘింపబడకుండా ఉంటే,

తత్కృత్వా భక్తిరన్యాసు దేవతాసు కదాచన। కృతా న చేద్యదాస్మాభిః ప్రసన్నో భవితా భవాన్ ।।౧౩

అనన్య భక్తి మీపై మాకు ఉంటే, ఆచార్యులను దేవతలను గురువులనుభక్తియుక్తులమై మము సేవిస్తుంటే,

విశేషము

'సమస్తం పరమాత్మ స్వరూపమే, సర్వం పరమాత్మ ఇచ్ఛ ప్రకారమే జరుగుతున్నది" అనే భావనతో భక్తి కలిగి ఉండటాన్ని అనన్య భక్తి అంటరు. . త్రివిధ భక్తి రూపాలలో ఇది ఒకటి. మిగిలిన రెండు బాహ్యాభక్తి, ఏకాంతభక్తి.

కాయేన మనసా వాచాప్యాచార్యే దైవతే గురౌ భక్తిమన్తో ।యది వయం ప్రసన్నో భవితా భవాన్ ।।౧౪

శరీరం, మనస్సు మరియు వాక్కులతో మేము మా ఆధ్యాత్మిక గురువుపట్ల అంకితభావంతో ఉన్నామని భావించి, మీరు మా పట్ల సంతోషిస్తే,

విద్యావృత్తం విబోధో వా వినయో వాऽథ శేముషీ। ధర్మస్సత్యం సదాస్మాసు ప్రసన్నో భవితా భవాన్ ।।౧౫

విద్య, మంచి నడవడి,  జ్ఞానము,  వినయము, సద్బుద్ధి, ధర్మము,  సత్యము - అనువానిని మేమవలంబిస్తే,

పరదారపరద్రవ్య పరహింసాపరాఙ్ముఖాః । వయం యది మహావిష్ణో ప్రసన్నో భవితా భవాన్ ।।౧౬

పరస్త్రీ కాంక్ష,  పరద్రవ్యఅపహరణ,  పరహింస మొదలగు దుర్గుణములు మాకు లేకుంటే,  ఓ మహావిష్ణుదేవా ! నీవు మాకు ప్రసన్నుడవగుము.

జితా యద్యరయో దేవ జితా యది షడూర్మయః ప్రీతిః కృతా చేత్ సర్వత్ర ప్రసన్నో భవితా భవాన్ ।।౧౭

షడూర్ములను మేము జయిస్తే,  సర్వభూత దయాపరులమైతే,నీవు మాకు ప్రసన్నుడవగు''మనిమహర్షులు విష్ణువును  ప్రార్థించారు.

**షడూర్ములు**

ఊర్మి అంటే అల, నొప్పి, ప్రకాశం, ప్రవాహం, వంకర మొదలైనవి సామాన్యార్థాలు. పారమార్థికంగా ధర్మం, తత్త్వం అనే అర్థాలు ఉన్నాయి. జీవి ధర్మాలను షడూర్ములు అన్నారు. ఆకలి, దప్పిక, దుఃఖం, మోహం, వార్ధక్యం, మరణం జీవి ధర్మాలు. ఇందులో ఆకలి దప్పులు ప్రాణధర్మాలు. దుఃఖం, మోహం మనస్సు ధర్మాలు. వృద్ధాప్యం, మరణం దేహధర్మాలు.

ఊర్మి అంటే పది వరకు అర్థాలు ఉన్నాయి గాని ఈ సందర్భంలో 'అల', 'వంకర' అనే అర్థాలను గ్రహించవలసి ఉంది. క్షుత్తు (ఆకలి), తృష్ణ (దాహం), శోకం, మోహం, జర (ముదిమి), మరణం అనే ఆరింటిని షడూర్ములు అన్నారు. ఇవి సహజంగా కలిగేవే. ఐతే సమపాళ్లలో ఉండవు. ఒక రోజు ఉన్నట్టు మరో రోజు ఉండకపోవచ్చు. కనుక అల, వంకర అనే అర్థాలు గ్రహించదగినవి. జీవిత సహజమైన ఈ ఊర్ములను జయించడం యోగసాధనలో భాగం. ఆకలి, దప్పిక మొదలు మరణం వరకు అత్యంత సహజమైన ప్రకృతులను జయించడం అంటే ఏమిటనే విషయంలో వ్యాఖ్యానాలుచాలాఉన్నాయి.

అగస్త్యః

|| ఇత్థం ప్రబోధితో విష్ణుర్లక్ష్మీవాన్ శుభలక్షణః |

ప్రాదుర్భవన్నాహ గిరా తేషామగ్రే ప్రసన్నయా ||౧౮

వారి ప్రార్థనలు విన్న మహావిష్ణువు వారి ఎదుట ప్రత్యక్షమై ప్రేమతో ఇలా అన్నాడు

భగవాన్ -

త్వద్విధా వైష్ణవా లోకే న భవన్తి కదాచన | ప్రసన్నో భవతామగ్రే వాఞ్ఛితం కరవాణ్యహమ్ ||౧౯

"నాయనలారా!మీవంటి వైష్ణవులు లోకమున లేరు. ప్రసన్నుడనైతిని. మీ కోరిక నెరవేరుస్తాను." అని మహావిష్ణువు పలికాడు.

ఋషయః-

యది ప్రసన్నో భగవానస్మాకం పురతో భవాన్ | ఔర్వాయ పుత్రసంపత్తిర్దీయతాం నిరవగ్రహా ||౨౦

భగవంతుని మాటలు విన్న ఋషులు "ప్రభూ! మా పై నీ అనుగ్రహము ఉంటే ఈ ఔర్వునికి పుత్ర సంతానము అనుగ్రహింపుము" అని వేడుకొన్నారు.

21-30

శ్రీభగవాన్ -

అథాహ తాన్ మహానాసీజ్జమ్బూద్వీపే మహర్షయః | హనుమత్పర్వతో నామ తత్రాస్తే మమ వాసభూః ||౨౧

అప్పుడు భగవంతుడు "ఓ మహర్షులారా! జంబూద్వీపములో హనుమత్పర్వతము నా నివాస భూమి.

చతుర్దశాస్య శృఙ్గాణి ప్రసేవ్యన్తే సురర్షిభిః | తేషు ద్వే శిఖరే రమ్యే సనకాదినిషేవితే | | ౨౨

దాని పదునాలుగు శిఖరములను దేవఋషులు సనకాదులు సేవిస్తుంటారు. ఆ అందమైన రెండు శిఖరాలలో సనకుడు మొదలయినవారు నన్ను సేవిస్తుంటారు.

తత్ర దక్షిణశృఙ్గాగ్రే మమైవ భవనం విదుః । తత్ర బ్రహ్మర్షిదేవర్షిపూజితం భవసేవితమ్ ॥౨౩

ఆ పర్వతములో దక్షిణ శిఖరము నా నివాస స్థానము.  అది బ్రహ్మర్షులచే, దేవతలచే, ఋషులచే పూజించబడుతుంది. మరియు శివునిచేకూడా సేవించబడుతుంది.

హిరణ్మయం తద్విమానం హేమకోటీతి విశ్రుతమ్ । పురాఽహం ప్రార్థితో దేవైర్హిరణ్యనిధనేచ్ఛుభిః ॥౨౪

బంగారంతో చేయబడిన హేమకోటి విమానమని  ఆ ఆలయశిఖరానికి  పేరు. పూర్వము హిరణ్య కశిపుని సంహరించుటకైదేవతలు నన్ను ప్రార్థింపగా ....

సింహరూపం సమాస్థాయ మయా తస్య వధః కృతః । తదా సర్వా మిలిత్వా వై దేవతా ఇదమూచిరే ॥౨౫

నరసింహ రూపమును ధరించి వానిని సంహరించాను.దేవతలందరు నరసింహ రూపములో ఉన్న నన్నుఇలా ( ఈ చెప్పబోవు శ్లోకాలలో) పొగిడి ఈ రూపములో  వారిని అనుగ్రహించవలెనని  ప్రార్థించారు.

నరోత్తమార్థ భగవాన్ నరసింహాభిధో భవాన్ । ఇదం తత్త్వాభిధాం గృహ్య దేవాస్సేన్ద్రాస్సహర్షిభిః ॥ ౨౬

పురుషోత్తమా !  నీవు పరమాత్ముడైన నరసింహుడిగా ప్రసిద్ధి చెందావు. ఇంద్రుడు, ఋషులు నీ ఈ తత్త్వ నామాన్నిభక్తితో గ్రహించి ధ్యానిస్తుంటారు. 26

స్తువన్తే హృష్టమనసః ప్రాప్నువన్తి యథాగతమ్ । హిరణ్యకశిపోః పుత్రః ప్రహ్లాద ఇతి విశ్రుతః ॥౨౭

. హిరణ్యకశిపుని కొడుకు ప్రహ్లాదుడు  సంతోషకరమైన హృదయంతో నిన్ను స్తుతిస్తాడు.  తాను పొందిన  ప్రతిదాన్ని యథాతథంగా భగవంతుని ప్రసాదంగా స్వీకరిస్తాడు.అని మునులు విష్ణువును పొగిడారు.

ఆజన్మసిద్ధమద్భక్తిపరిణామప్రసన్నధీః। ఇదం హోవాచ మామేత్య బాలః ప్రహ్లాదనో నృణామ్ ॥౨౮

పుట్టినప్పటినుంచి సహజంగా నా పై అలవాటయిన భక్తితో పరిణామము చెందిన ప్రసన్నమయిన బుద్ధి కలిగిన  ప్రహ్లాదుడు నరసింహరూపములో ఉన్న నా దగ్గరకు వచ్చి ఇలా చెప్పాడు.

ప్రహ్లాదః -

విష్ణో భీమమిదం రూపం సంహరేతి స భక్తిమాన్ । ప్రశాన్తో యోగనృహరిస్తదా తేన ప్రబోధితః ॥౨౯

అప్పుడు ప్రహ్లాదుడు ‘‘స్వామీ! ఈ భయంకరమయిన రూపమును మాని శాంతరూపముతో ప్రజలకు దర్శనమి"మ్మని ప్రార్థించెను.

సాత్వికో భావమవ్యగ్రస్సర్వర్షిగణసేవితః । సంయోగం హృదయే కృత్వా కర్మ కర్మవిదాం వరః ॥30

'భయంకరమయిన రూపం వదిలి సాత్విక రూపం ధరించు. అప్పుడు నీ భయంకరత్వాన్ని చూసి  క్షోభించని హృదయం కలిగిన అందరి ఋషులచేత సేవించబడతావు.  అందరి హృదయాలలో  ఐక్యతను ఏర్పరచుకొను కర్మయే అత్యుత్తమమైనదని నీకు తెలియనిది కాదు'  అని ప్రహ్లాదుడు నన్ను ప్రార్థించాడు.

31-40

అహం హనుమతశ్శైలం ప్రహ్లాదేన ప్రచోదితః । తత్ర భక్తపరాధీనో హేమకోటివిమానగః ॥31

అందువలన భక్తులు కోరినట్లు చేయు స్వభావము కలిగిన నేను, ప్రహ్లాదుని చేత  ప్రార్థించబడిన వాడినై,  ఈ హేమకోటి విమాన శిఖరము క్రింద యోగ నరసింహస్వామిగా ఆవిర్భవించాను.

ప్రాదుర్భూతస్తు తత్రాహం ప్రదదామి శుభం నృణామ్ । బిమ్బో మే సర్వదాతత్ర హేమకోట్యాం విరాజతే ॥ 32

నా ఆకారము హేమకోటి విమాన శిఖరములో ఎప్పుడు చక్కగా ప్రకాశిస్తున్నది. నేను అక్కడ నివసిస్తూ నా భక్తులకు శుభములను అనుగ్రహిస్తూ ఉంటాను.

యథా సన్నిహితస్తత్ర తథా ప్రాదుర్భవామ్యహమ్ । శుకాదయస్తు ఋషయో భవితారో ముముక్షవః ॥33

నా భక్తులు ఎప్పుడు నన్ను ప్రార్థిస్తే అప్పుడు వెంటనే వారి కోర్కెలు తీర్చేందుకు దగ్గరగా ఉన్నాను. శుకుడు మొదలైన మహర్షులు ఇక్కడ మోక్షము కొరకు తపస్సు చేసారు.

తపాంసి కుర్వతే తత్ర మద్భక్తా మత్పరాయణాః । వసిష్ఠాద్యాశ్చ ఋషయస్సప్తసప్తార్చిరర్చిషః ॥34

నాపై  విశేషమైన భక్తి కలిగిన వారు  అనేకమంది ఇక్కడ తపస్సు చేస్తుంటారు. వసిష్ఠుడు మొదలైన సప్తర్షులు ఇక్కడ తపస్సు చేసారు.

**విశేషాలు**

మరీచి, అంగిరసుడు, పులహుడు, వసిష్ఠుడు, అత్రి, పులస్త్యుడు, క్రతువు అనువారు సప్తర్షులని కొందరు, కశ్యపుడు, అత్రి, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, జమదగ్ని, వసిష్ఠుడు అనువారు  సప్తర్షులు అని కొందఱు చెబుతారు.

సామీప్యం ప్రాప్తుకామాస్తు కుర్వతే కేవలం తపః। చతుర్ణాం పురుషార్థానాం కాఙ్క్షిణశ్చ పృథక్పృథక్। ।35

ఈ హేమాద్రి శిఖర సమీపములో కొంతమంది నా సామీప్య ముక్తి పొందుట కొరకు నన్ను ప్రార్థిస్తుంటారు. మరి కొంతమంది నాలుగు రకాల పురుషార్థాలు(ధర్మ-అర్థ-కామ-మోక్షములు) నెరవేరుట కొరకు తపస్సు చేస్తుంటారు.

**విశేషాలు**

ముక్తులు నాలుగు.1.సాలోక్యము (విష్ణులోకమందుండుట), 2. సామీప్యము (విష్ణువు దగ్గఱనుండుట), 3. సారూప్యము (విష్ణురూపుడై యుండుట), 4. సాయుజ్యము (విష్ణువులో జేరియుండుట)

కతిచిత్పర్ణభక్షాస్తు చరన్తి తప ఉత్తమమ్ I సాన్నిధ్యం కర్తుకామోఽహం హేమకోటిపదే స్థితః || ౩౬
నా సాన్నిద్యము కోరి  కొంతమంది కేవలము ఆకులను మాత్రమే  తిని ఉత్తమమైన తపస్సుని ఈ హేమకోటి శిఖరములో చేస్తుంటారు.

ప్రీణయిష్యామి సతతం బ్రహ్మర్షీన్ భావితాత్మనః I వసిష్ఠః కశ్యపశ్చాత్రిర్జమదగ్నిశ్చ గౌతమః ||౩౭
నా భక్తులుగా మారిన వసిష్ఠుడు, కశ్యపుడు, అత్రి, జమదగ్ని మరియు గౌతమ బ్రహ్మర్షులను నేను ఎల్లప్పుడూ సంతోషపరుస్తాను.

.భరద్వాజోఽపి ధర్మాత్మా తపస్యతి శిలోచ్చయే| సవిత్రైర్వాభ్యనుజ్ఞాతో బ్రామ్యమిచ్ఛన్ మహాతపాః| ౩౮
ధర్మాత్ముడైన భరద్వాజుడు కూడా కొండపై తపస్సు చేస్తున్నాడు. సావిత్రుల( సరస్వతి మొదలయినవారు ) అనుమతితో, ఆ మహా సన్యాసి బ్రహ్మత్వము కావాలని కోరుకున్నాడు.

విశ్వామిత్రస్తు హనుమచ్ఛైలరాజముపేష్యతి I శైలస్య పశ్చిమపథే శిలాకూటే మహర్షిభిః || ౩౯
ఈ హేమకూట శిఖరానికి పశ్చిమములో ఆత్రిఅనే మహర్షి తపస్సు చేస్తున్నాడు. విశ్వామిత్రుడు హనుమచ్ఛిఖరాన్ని సందర్శిస్తాడు.  గొప్ప ఋషులు కలిగిన శిలా కూటము( రాతి శిఖరంపై )యొక్క పశ్చిమ మార్గంలో ---.

పూజ్యమానస్తపస్తీవ్రమత్రిరాట్ తనుతే సుధీః సంస్తుతో యది ధర్మాత్మా తపస్తీవ్రో జితేన్ద్రియః I ||౪౦
ఇంద్రియాలను జయించిన, నీతిమంతుడైన వివేకవంతుడైన  అత్రి  అను మహర్షి తీవ్రమైన తపస్సు చేస్తున్నాడు.  ౪౦

41-50

సభార్యాయ ప్రజాం స్నిగ్ధామన్త్రిరూర్వాయ దాస్యతి I అహం చ తుష్టో దేవర్షిగణవాక్యేన చోదితః ||౪౧
అతనిని  భార్యా సమేతంగా  సేవిస్తే ఈ ఔర్వునికి పుత్ర సంతతి లభిస్తుంది. దేవతాగణముల ఋషుల  మాటలతో నేను సంతృప్తి చెందాను.

అత్రేః పుత్రత్వమాపన్నో మార్జయే పైతృకం ఋణమ్ I
అగస్త్యః
ఇత్యుక్త్వా భగవాన్ తాన్ వై సనకాదిప్రపూజితః ||౪౨
లక్ష్మ్యా సహ హృషీకేశశ్శీఘ్రమన్తరధీయత I

నేను కూడా అత్రి పుత్రుడిని అయి, నా తండ్రి ఋణాన్ని తీర్చుకుంటాను.ఈ విధముగా చెప్పి సనకుడు మొదలైన మహర్షులచే పూజలు పొంది లక్ష్మితో సహా ఇంద్రియములను నిగ్రహించు స్వభావము కలిగిన యోగ నరసింహస్వామి  మాయమయ్యాడు.

అథ తే ఋషయస్తత్ర వత్సాద్యా హృష్టచేతసః ||౪౩ ఊచుః ప్రసన్నయా వాచా తమౌర్వ ఋషిసత్తమమ్ |

ఋషయః -

శ్రుతా హి భగవద్వాచా భవతా ఋషిసత్తమ ||౪౪

గచ్ఛ శీఘ్రం మహాశైలమత్రేరాశ్రమముత్తమమ్ |

అప్పుడు ఔర్వునితో ఋషులందరూ ఇలా అన్నారు.' నువ్వు భగవంతుడు చెప్పిన మాటలను విన్నావు కదా !కనుక వెంటనే ఈ  పర్వతములో ఉన్న అత్రి మహర్షి ఆశ్రమానికి వెళ్లి అతనిని సేవించు"

అగస్త్యః

ఇతి సంసూచితస్త్వౌర్వః పుత్రార్థం సహ భార్యయా ||౪౫ అత్రేరాశ్రమమాసాద్య లబ్ధవాన్ పుత్రముజ్జ్వలమ్ |

ఋషులు ఈ విధముగా చెప్పిన తరువాత ఔర్వుడు పుత్రుల కొరకు భార్యతో సహా అత్రి మహర్షి ఆశ్రమానికి వెళ్ళాడు.

అత్రి ఆశ్రమానికి వెళ్లి ఆ మహర్షి యొక్క ప్రభావముతో  ఔర్వుడు పుత్ర సంతానాన్ని పొందాడు.

ఏతస్యాశ్రమమభ్యేత్య స్నాతి వజ్రసరోజలే ||౪౬ అత్రేః ప్రసాదాత్ సర్వే తే లభన్తే పుత్రసంపదః |

ఎవరు ఈ హేమకూట శిఖరము దగ్గర ఉన్న వజ్రతీర్థములో స్నానము చేసి అత్రి మహర్షి అనుగ్రహాన్ని పొందితే వారికి తప్పకుండా పుత్ర సంతానము లభిస్తుంది.

నారఙ్గా నారికేలాశ్చ పూగా జమ్బీరజమ్బవః | |౪౭ రసాలామలకాశ్చాత్ర సర్వే చ ఫలశాలినః |

ఆ అత్రి ఆశ్రమములో  నారింజ, కొబ్బరి, వక్క, నిమ్మ, నేరేడు చెట్లతో పాటు  రసవంతమైన ఉసిరిచెట్లు  ఉన్నాయి . అవన్నీ ఫలవంతమైనవి.

తస్య శీలవతీ నామ కన్యాఽత్రేర్భావితాత్మనమ్ ||౪౮

ఆ పరిశుద్ధమైన మనస్సు కలిగిన ఆ త్రిమహర్షికి శీలవతి అను ఒక కూతురు ఉన్నది.

స దక్షిణాం గతశ్చాశామౌర్వోఽత్యుగ్రతపాముని:| సువర్చ ఇవ మార్తాణ్డముద్రాహ్యోగ్రతపో మునిః ||౪౯

ఆమెను ఉగ్రతపుడు అను మహర్షి వివాహం చేసుకొన్నాడు. కఠోర తపస్సు చేసిన ఔర్వ ముని దక్షిణ దిశగా వెళ్ళాడు. ఆ మహర్షి సువర్చుని లాగా మార్తాండముద్రతో  తీవ్రమైన తపస్సు చేసాడు.

తస్యా భర్తా సుదుష్టాత్మాఽన్యస్త్రీసక్తమనాస్సదా | తామ్రపర్ణానదీతీరే వాసం చక్రే సుదుర్మదః ||౫౦

ఈ శీలవతి యొక్క భర్త  ఉగ్రతపుడు దుష్టాత్ముడై,  పరస్త్రీలందు ఆసక్తి కలిగినవాడై తామ్రపర్ణి నది తీరములో నివసిస్తున్నాడు.

**51-60**

తథాపి తస్య శుశ్రూషాం కురుతే ధర్మచారిణీ । సదా వ్యగ్రమనాస్సాధ్వీ భర్తురీప్సితకర్మసు ||౫౧

భర్త ఎంత దుష్టుడైనప్పటికీ శీలవతి ఆ ఉగ్రత పునికి సేవచేస్తూ ఎప్పుడూ అతనికి ఇష్టమైన పనులే చేస్తుండేది.

కేనచిత్ త్వథకాలేన తస్యోగ్రతపసో మునేః । అగమ్యాగమనద్వారా వ్యాధిరాసీద్దురాసదా ||౫౨

అయితే, కొంత సమయం తరువాత, ఆ ఉగ్రత పునికి పరస్త్రీ సంగమము వల్ల భయంకరమైన వ్యాధి వచ్చింది.. ఈ వ్యాధిని  పోగొట్టుకోవడం ఎప్పుడూ కష్టం.

బహిర్నిర్గమనే శక్తిర్నైవ తస్య బభూవ హ । ఆహారాదౌ స్పృహా నైవ ఫలాదీనాం మునేరభూత్ ||౫౩

క్రమంగా అతనికి ఇంటి నుంచి బయటకు వచ్చే శక్తి పోయింది. ఆ ఋషికి ఆహారం మరియు ఇతర వస్తువులపై కోరిక పోయింది.

యత్ర వేశ్యోద్భవా గీతా యత్ర గీతా మనోరమా । యత్ర హాస్యకథాస్తత్ర స కరోతి సదా మనః ||౫౪

కాని అటువంటి స్థితిలో  కూడ అతనికి వేశ్యల సంగీతనాట్యాలపై  కోరిక పెరుగుతుండేది. . హాస్య కథలుఉన్న చోట అతను ఎప్పుడూ తన మనసు పెట్టేవాడు.

సన్ధ్యాకర్మసు నైవాసీన్మనస్తస్య కదాచన। వేదాశ్చ విస్మృతాస్తేన శాస్త్రాణి వివిధాని చ ||౫౫

సంధ్యావందనాది వైదిక కర్మలపై అతని మనస్సు ఇష్టపడలేదు.  వేద శాస్త్రములు మరచిపోయాడు.

పూతిగన్ధస్తుతస్యాభూత్ సర్వైరపి చ దుస్సహః । కుత్సితం వపురాస్థాయ గ్రామమధ్యే స్థితోః భవత్ । । ౫౬

చీము వాసనలతో  భరించలేని దుర్వాసన అతనిశరీరమునుండి వచ్చేది. అతను అసహ్యకరమైన శరీరంతో గ్రామపు మధ్యలో ఉన్నాడు.

తస్య శీలవతీ భార్యా సతతం ప్రియభాషిణీ । పదే పదే వీక్షమాణాగృహ్య ప్రియమపోషయత్ ||౫౭

ఆ విధంగా ఉన్నప్పటికీ  శీలవతి భర్తతో మంచి మాటలనే చెబుతూ ప్రీతితో అతనిని సేవించేది.

స్యన్దమానాఙ్కలాలాం వై మార్జయన్తీ పటాఞ్చలాత్ శోణితాని స కీటాని మహాగ్రన్థిశతాని చ । । ౫౮

అతని లాలాజలమును తనచీరతోతుడిచేది. పురుగులు పడి రక్తము కారుతున్న అతని శరీర రంధ్రాలను శుభ్రముచేసేది.

వ్యాధే: ప్రతిక్రియామస్య కోఽపి లోకే వదేత్ప్రభుః । ఇత్యస్యా మహతీ చిన్తా యదా ప్రాదురభూన్మునే । । ౫౯

తన భర్త వ్యాధికి నివారణ చెప్పగలవారు ఎవరైన కలరా?’’ అని ఆమె చాలా బాధపడేది.

తదాఽశరీరవచనమన్తరిక్షే బభూవ హ । మా భీతిః క్రియతాం వత్సే హరిష్యామి తవ వ్యథామ్ ||౬౦

ఇంతలో ఆకాశమునుండి అశరీర వాణి "ఓ బిడ్డా! నీవు భయపడవద్దు. నీబాధను నేను తొలగిస్తాను'

61-70

దివ్యఞ్చ రూపం భర్తుస్తే ప్రభవిష్యతి బాలికే । త్వయ్యేవ భర్తా నిరతో రమ్స్యతే నాత్ర సంశయః ||౬౧

. నీ భర్తకు నిజరూపము కలుగుతుంది. తరువాత నీ భర్త నీపై  ప్రేమ కలవాడు అవుతాడు . ఇందులో సందేహం లేదు.

ఉత్తరస్యాం దిశి మహాన్ దృశ్యతే హనుమద్గిరిః । తస్యైవ భవితా నామ ఘటికాచల ఇత్యపి || ౬౨

ఘటికాచలమునకు ఉత్తర దిక్కులో  హనుమ త్పర్వతము ఉన్నది..

తత్రాస్తే జనకస్తేఽత్రిరనసూయా చ తత్ప్రియా । వత్సే తత్పార్శ్వమభ్యేహి సర్వం తద్వేదయిష్యతి || ౬౩

. అక్కడ ఉన్న నీ తల్లిదండ్రులు అత్రి అనసూయల వద్దకువెళ్ళు. జరుగవలసిన కార్యము అక్కడ నీకు తెలుస్తుంది." అని ఆకాశవాణి పలికింది.

ఇత్యనుజ్ఞాపితా సాధ్వీ భర్తారం గృహ్య పాణినా । ఆరోపితకటీభర్త్రా ప్రయయా ఉత్తరాం దిశమ్ ||౬౪

ఈ రకంగా ఆకాశవాణి చెప్పగా  ఆ పతివ్రత తన భర్తను భుజముపై కూర్చుండ బెట్టికొని ఉత్తర దిక్కునకుబయలు దేరింది. _

విజ్ఞాతుమస్య మాహాత్మ్యం బహుశోఽభిప్రశోభితమ్ । నృహరిః కల్పయామాస దూరమధ్వానమాత్మనః ||౬౫

భగవంతుడైన నరసింహ స్వామి ఆమెను పరీక్షించాలనుకొని  పర్వతమునుదూరముగా ఉండేటట్లు చేసాడు.

అనేకశతవర్షాణి గామినీ పథి భామినీ । సాధ్వీ ప్రగృహ్య భర్తారం చిన్తయా సహ దుఃఖితా ||౬౬

అనేక సంవత్సరములు భర్తను మోసికొంటూ ఆమె మార్గములో శ్రమ పడుతూ  నడుస్తున్నది.

మూర్ఛాలురేవ భవితా శ్వోభూతే వ్యాధిపీడితః । కుత్సితోఽపి చిరాయుర్వా జీవేదితి హి మే మతిః | | ౬౭

"వ్యాధి తీవ్రతచేత, . నాభర్తరేపటినుండి దీర్ఘకాలము మూర్చను పొందునట్లు తోచుచున్నది. మూర్ఛలో ఎంతకాలముంటాడోతెలియదు.

దీర్ఘమాయుశ్చ తే భర్తా దివ్యరూపఞ్చ యాస్యతి । ఇతి యదుదితం వాక్యం నమసా కిము సాంప్రతమ్ ||౬౮

నీ భర్త దీర్ఘాయుష్మంతుడై ఆరోగ్యముతో మంచి రూపమును పొందుతాడని ఆకాశవాణి చెప్పింది కదా ? అది నిజమవుతుందా?

కియద్దూరం భగవతో నృహరేరచలస్య వా । అమునా హి వనేనాహం శక్నుయాన్న నిషేవణే | | ౬౯

శ్రీనరసింహుని పర్వతము ఇంకెంతదూరములో ఉన్నది కదా? ఈ ఘోరమైన అరణ్యములో  నా భర్తని ఎట్లు సేవిస్తాను?"

ఇతి చిన్త్య వరారోహా భర్తురాజ్ఞాస్పృహా సతీ । హుత్వా వహ్నిముపస్థాయ ప్రాబ్రవీత్ర్పాఞ్జలిస్తదా । ॥౭౦

ఈ విధముగా ఆలోచించి శీలవతి భర్త ఆజ్ఞచేత ఒక హోమ గుండమును వెలిగించి ,దానికి చేతులు జోడించి ఇలా అన్నది

71-80

శీలవతీ

యది ప్రసన్నో భగవాన్ చిత్రభానుర్మయా హుతః । యద్యస్తి మయి సాధ్వీ త్వం మా భవిత్రీ విభావరీ ॥౭౧

ఓ అగ్నిదేవుడా! నీవు తృప్తి పడితే, నాయందు పాతివ్రత్యము ఉంటే రాత్రిరాకుండు గాక'' అని శాపము పెట్టింది.

అగస్త్యః

ఇతి సా శంసితా దేవ్యాశీలవత్యా విభావరీ। నాలమాగమనాయాభూత్తపస్వీ బ్రాహ్మిణీస్థలమ్ । ।౭౨

ఇట్లు శపించుటచే రాత్రి వచ్చుటకు వీలు కాలేదు. ఆ విధంగా సత్ప్రవర్తన గలశీలవతి విభావరిని స్తుతించింది.

మార్తాణ్డోత్థారుచిర్మధ్యే నభః ప్రతపదంశుకః । ద్విజర్షభస్తూయమానః పూజ్యమానః పదే పదే ॥౭౩

సూర్యుని నుండి ఎండవేడిమి వచ్చుచుండెను. పర్వతాల మధ్యలో ఆకాశం ప్రకాశవంతంగా ఉంది. సూర్యుని అత్యుత్తమ బ్రాహ్మణులు అడుగడుగునా ప్రశంసించారు మరియు పూజించారు.

త్రిమూర్తిరనఘోఽచిన్త్యో ద్వాదశాత్మా దివాకరః । కర్మసాక్షీ నభోమధ్యే ప్రాంశుకో వై వ్యజృమ్భత। ॥౭౪

త్రిమూర్తుల స్వరూపమైనవాడు, పాపరహితుడు, ఊహించలేనివాడు , పన్నెండు రూపాలు కలిగిన వాడు, కర్మ సాక్షి అయిన బాగా ఎత్తయిన వాడు అయిన సూర్యుడు ఆకాశం మధ్యలో వ్యాపించాడు.

ద్వాదశాత్మా

ద్వాదశాత్మా అంటే పంద్రెండుగురు సూర్యులు. అదితి సంతానం కనుక ఆదిత్యులు. వారు: మొదటి పట్టిక ప్రకారం- వరుణుడు, సూర్యుడు, సహస్రాంశుడు, ధాత, తపనుడు, సవితృడు, గభస్తి, రవి, పర్జన్యుడు, త్వష్ట, మిత్రుడు, విష్ణువు. (దేవతలలో ముఖ్యులు ద్వాదశాదిత్యులని ఒక వాదం ఉంది.) రెండవ పట్టిక ప్రకారం - అర్యముడు, మిత్రుడు, అరుణుడు, అర్కుడు, భగుడు, ఇంద్రుడు, వివస్వంతుడు, పూషుడు, పర్జన్యుడు, త్వష్ట, విష్ణువు, అజఘన్యుడు. మూడవ పట్టిక - ఇంద్రుడు, ధాత, పర్జన్యుడు, త్వష్ట, పూషుడు, అర్యముడు, భగుడు, వివస్వంతుడు, విష్ణువు, అంశుమంతుడు, వరుణుడు, మిత్రుడు. నాలుగవ పట్టిక - మిత్ర, రవి, సూర్య, భాను, ఖగ, పూష, హిరణ్యగర్భ, మరీచ్య, ఆదిత్య, సవితృడు (సవిత), అర్క, భాస్కరులు. ఈ పట్టికలలో చాలా పేర్లు అందులోనూ ఇందులోనూ కనిపిస్తాయి. ఒకటి రెండు పేర్లు తేడా ఉన్న పట్టికలు ఉన్నాయి. వాల్మీకి రామాయణం యుద్ధకాండలో రాముడికి అగస్త్యుడు ఉపదేశించిన 'ఆదిత్య హృదయం' స్తోత్రంలో ఈ పేర్లన్నీనూ, ఇవి గాక ఇంకా చాలానూ ఉన్నాయి. అన్నీ సూర్యుడి పేర్లే.

చిరాయమాణాం మార్తాణ్డో మధ్యే వ్యోమపదం తదా। ఋషయశ్చిన్తయామాసుర్యజ్ఞకర్మసు కోవిదాః ॥౭౫

సూర్యుని తేజస్సు పెరిగి పగలు ముగియలేదు. ఆసమయములో యజ్ఞములు చేసే ఋషులు ఇలా బాధపడ్డారు.

దినానాం సంఖ్యయా శూన్యాః జ్యోతిష్టోమాదికాః క్రియాః | కర్తుం న ప్రభవోలోకే ఋషయో ధర్మచారిణః | | ౭౬

“జ్యోతిష్టోమాది క్రియాకలాపములు దిన సంఖ్య లేనివైనవి. అందువలన లోకమున ఋషులు యజ్ఞములుచేయలేకున్నారు.

జ్యోతిష్టోమము

గ్రహ నక్షత్రాదులు స్తోమంగా(స్తోత్రంగా) గల యజ్ఞము. 16 ఋత్విక్కులు వుండు యజ్ఞము

దుష్టాత్మానస్తు మన్దేహాస్తదానీ రాక్షసాధమాః | వర్ధతే జనతాస్సర్వా అర్ధ్యాభావేన గర్వితః | ||౭౭

దుష్టులైన మందేహాది రాక్షసులు బ్రాహ్మణులచే అస్త్రములు విడువబడనందున బలగర్వితులయ్యారు.

విశేషము

మందేహులు బ్రహ్మనుగూర్చి తపము చేసి సూర్యునితో పోరాడునట్లు వరము పొందారు.. వీరి సంహారముకొరకు త్రిసంధ్యలలో బ్రాహ్మణులు గాయత్రిచే అభిమంత్రించిన అస్త్రములను అర్ఘ్యమూలముగ విడిచిపెడతారు. వారు అ అస్త్రములచేత చనిపోయినప్పటికీ వరదానమహిమచే మళ్లీ బతుకుతుంటారు. అయితే సూర్యుడు కనబడకపోవటం వలన త్రిసంధ్యలు లేకపోవుటచే మందేహులు బలగర్వితులయ్యారు.

స్వర్గాత్ప్రచ్యావయన్తి స్మ సేన్ద్రానపి మరుద్గణాన్ | ధనదఞ్చ మహాత్మానం వరుణఞ్చ జలాధిపమ్ ||౭౮

మందేహులు ఇంద్రుని, మరుద్గణములను తోసి వేయగలరు. ఇది గాక కుబేరుడు, జలాధిపతియైన వరుణుడు మొదలగు వారిని తొలగించగలరు. అంతశక్తిశాలులుగా మందేహులు అయ్యారు.

సర్వాధిపత్యే తే సర్వే మన్దేహా నామ రాక్షసాః | ద్విజానామర్ఘ్యరాహిత్యాదృశ్చిన్తాశ్చ బభూవిరే | |౭౯

మందేహులు అధికారములచేపట్టు శక్తి కలవారు.. బ్రాహ్మణులు విడచు అర్వ్యములు లేనందున వారికి దుష్టచింతలు కలిగాయి.

సన్ధ్యాసు బ్రాహ్మణాశ్చాపః త్రిరూర్ధ్వం విక్షిపన్తి హి|తా ఆపో వజ్రసదృశాః మన్దేహాన్దారయన్తి హి | ౮౦

సంధ్యాసమయములలో బ్రాహ్మణులు గాయత్రీ మంత్రముచే అభిమంత్రించిన నీటిని మూడు పర్యాయములు పైకి చల్లెదరు. (మూడు అర్ఘ్యములు వదులుతారు). ఆనీరే వజ్ర సమానమై మందేహులను కొట్టి వేసేది కదా!

81-90

మన్త్రపూతార్ఘ్యరాహిత్యా దుర్మదా గర్వభూషితాః | క్రుద్ధాస్తే రాక్షసాస్సర్వే బాధన్తే బహుశో జనాన్ | |౮౧

మంత్రముతో పవిత్రమైన అర్ఘ్యములు లేనందున గర్వముతో రాక్షసులు జనులను కూడ బాధించగలరు” అనిచింతించారు.

తేషాం మహత్త్వం విజ్ఞాయ సేన్ద్రావిష్ణుపురస్సరాః | బ్రహ్మాణం శఙ్కరఞ్చాపి పురస్కృత్య చ దేవతాః | | ౮౨

ఆ ఋషుల ప్రార్థనల విన్న దేవతలు ఇంద్ర సహితముగా బ్రహ్మవిష్ణుమహేశ్వరాదులను ముందు పెట్టుకొని .

తతో హనుమతశ్శైలం నృహరిస్థానముత్తమమ్ । అభ్యేత్య పశ్చిమే శృఙ్గే దదృశుర్మునిసత్తమమ్ ||౮౩ అనసూయామపి మునేర్ధర్మపత్నీ యశస్వినీమ్ ।

హనుమత్పర్వతములో నరసింహుడున్న చోటు చేరారు. పశ్చిమ శిఖరము మీద నున్నఅత్రి అనసూయాదంపతులను చూసారు.

దదృశుర్భక్తినిరతాం ఛాయామివ దివాకరే ।౮౪ అధావలోక్య తే సర్వే దివిస్థాస్సముపాగతాః । అబ్రువన్నిదమత్రేస్తు భామినీ ధర్మచారిణీమ్ ||౮౫

ఆ దేవతలు అనసూయను సూర్యుని నీడలా భక్తిలో నిమగ్నమై ఉండటం చూసారు . ఆ దేవతలందరూ అందమైన మరియు నీతిమంతురాలైన అనసూయతో ఇలా అన్నారు

బ్రహ్మవిష్ణుశివా దేవి త్వత్సన్నిధిముపాగతాః । అభ్యేత్యైవాసతే పుణ్యః త్వద్దామ్పత్యవ్రతేన చ ||౮౬

“ఓ దేవీ!నీ సన్నిధికి బ్రహ్మ, విష్ణు, శివులు వచ్చారు. మీ పవిత్ర చరిత్రము, దాంపత్యవ్రతము మమ్ములను సంతోషపెట్టాయి.

అనసూయే త్వయా భర్త్రా నిరసూయం తపః కృతమ్ । ఇదానీం ఫలితం తత్తే శ్రీనృసింహపదాశ్రయాత్ ||౮౭

ఓ అనసూయా, నువ్వు మరియు నీ భర్త అసూయ లేకుండా తపస్సులు ఆచరించారు. ఇప్పుడు శ్రీ నృసింహుని పాదాలను ఆశ్రయించడం ద్వారా మీకు తపస్సు ఫలించింది.

ఇహావతీర్ణా దేవి త్వత్పార్శ్వే నారాయణాదయః । దేవా దేవి ప్రసాదం తే కీర్తిఞ్చ తపసాం బలాత్ ||౮౮

మీ ఎదుట నారాయణాది దేవతలు ప్రత్యక్షమయ్యారు.మీ తపోబలముతో లోకక్షేమము కలిగించాలని వారు కోరుతున్నారు.

కన్యా శీలవతీ యాతే తయా సా శాపితా నిశా శూన్యా భవేతి యది తన్మూర్ఛాగమనశఙ్కయా ||౮౯

శీలవతి అను పేరు కలిగిన మీ కుమార్తె భర్త మూర్ఛ చెందునను అనుమానముతో రాత్రిని రాకుండునట్లు శపించినది.

తదాప్రభృతి మన్దేహా బాధన్తే బ్రాహ్మణానిమే। అనుస్మరన్తః పూర్వాణి వైరాణి జగతీతలే ।।

౯౦

అది మొదలు మందేహులు అను రాక్షసులు పూర్వ వైరమును స్మరించి దేవ బ్రాహ్మణులను బాధపెడుతున్నారు.

91-100

త్వయా మానయితవ్యా తే కన్యా శీలవతీ సతీ। మానితా యది సేదానీం శర్వరీముద్ధరిష్యతి ||౯౧

శీలవతి యగు మీ అమ్మాయిని నువ్వు శాంతింపచేస్తే ఆమె సంతోషిస్తే రాత్రి ఏర్పడగలదు.''

తతో నిశమ్య తాం వాచమనసూయా సుధామయీమ్ । శిరస్యఞ్జలిమాధాయ ప్రాప్య కన్యామభాషత ॥ ౯౨
ఆ అమృత సదృశములైన మాటలు విన్న అనసూయ వారికి నమస్కరించి తన కూతురు వద్దకు వెళ్ళి ఇలా అన్నది.
అనసూయా
ప్రసిద్ధకన్యే భవతి ప్రశంస త్వం నిశాం ప్రతి । ఆగచ్ఛేతి మహాధర్మలోపో మా ప్రాస్యదాం త్వయా ।। ౯౩
''అమ్మా! నీవు రాత్రిని శపించావు. శాపమును ఉపసంహరించు కొనుము. లేకున్న ధర్మలోపము కలుగుతుంది.

బ్రహ్మాదయోఽపి తే దేవా ఇదమూచురుపేత్య మామ్ । త్వద్దామ్పత్యోద్భృతం రక్షో బాధతే జనతా ఇతి ॥ ౯౪
బ్రహ్మ నేతృత్వంలోని దేవతలు  నా దగ్గరికి వచ్చి నాతో ఈ క్రింది విధంగా మాట్లాడారు. 'మీ జంట వలన మందేహులు  ప్రజలను వేధిస్తున్నారు.

అగస్త్యః
ఇతి సంబోధితా మాత్రా తథేతి ప్రత్యభాషత । తస్మిన్నేవ క్షణే శైలమద్రాక్షీన్నృహరేః పదమ్ ॥౯౫
ఇలా అనసూయచే బోధింపబడిన శీలవతి''అట్లే అగుగాక'' అని శాపవిముక్తి వాక్యం పలికింది. వెంటనే ఆ క్షణముననే ఆమె నృసింహ పర్వతమును దర్శించ గలిగెను.

తతో దేవా వరం తస్యై మునేరత్రేర్నతభ్రువే । దదుస్తే పుత్రకామా యే పద్మనాభముఖాస్తదా । ౯౬
దేవి ప్రసన్నో భగవాన్ విష్ణు రుద్రః పితామహః । ఏతే త్రయో హ్యపత్యార్థే వినియుక్తా భవన్త్విమే ॥ ౯౭
ఆ తరువాత  దేవతలు అత్రి అనసూయలతో ఇలా అన్నారు.  ''అమ్మా! విష్ణువురుద్రుడు బ్రహ్మ   నీ పట్ల  ప్రసన్నులమయ్యారు.  వారు ముగ్గురు  నీ కుమారులుగా జన్మించగలరు

ఇహ వజ్రసరో నామ శిలాకూటే విశోభతే । అత్ర స్నానేన తపసా వజ్రిభూతో భవిష్యతి ॥౯౮
ఇక్కడ వజ్ర సరస్సులో స్నానము చేసి తపస్సు చేసిన వారికి పుత్రసంతతి కలుగుతుంది.''

ఇతి దత్వా వరం తస్మై దేవతాస్స్వస్థచేతసః । బ్రహ్మాదయో మహాత్మానః ప్రయయుస్స్వస్వమన్దిరమ్ ॥౯౯
అని వరాన్ని ఇచ్చి బ్రహ్మాదిదేవతలు అంతర్ధానమయ్యారు.

దుర్వాసాశ్శఙ్కరస్యాంశో దత్తాత్రేయస్తు వైష్ణవః । బ్రహ్మ తు చన్ద్రమా అత్రేః పుత్రత్వే తేఽభవంస్తదా ।। ౧౦౦
తరువాత దూర్వాసుడు ఈశ్వరాంశతో, దత్తాత్రేయుడు విష్ణ్వంశతోను, చంద్రుడు బ్రహ్మ అంశతోను అత్రికి పుత్రులుగా పుట్టారు.

101-110

స చ తస్మిన్ సరసి వై స్నాతో విగతకల్మషః | వజ్రీకృతశరీరోఽభూచ్ఛీలవత్యా మనోహరః | | ౧౦౧

శీలవతి భర్త అయిన ఉగ్రతపుడు ఆ వజ్రసరస్సులో స్నానముచేసి సమస్త పాపములు నశించిపోగా వజ్రకాయుడై ప్రకాశించాడు.

వజ్రపుష్కరిణీమేత్య యస్స్నాతి సహ భార్యయా | స పుత్రవాన్ చిరాయుస్తు స భవత్యత్రిశాసనాత్ | | ౧౦౨

ఎవరు భార్యతో కలిసి వజ్రసరస్సులో స్నానము చేస్తారో వారు పుత్రవంతులై దీర్ఘాయుష్మంతులవుతారు.

భరద్వాజుని ఆశ్రమము

తస్యాః ప్రాగన్తరే పార్శ్వే భరద్వాజాశ్రమో మహాన్ | బహుపాదపసంశోభీ దృశ్యతే ఋషిసేవితః | | ౧౦౩

ఈ వజ్రతీర్థమునకు తూర్పున ఋషులచే సేవింపబడు భరద్వాజుని ఆశ్రమము ఉన్నది. అది చెట్లతో చాలమనోహరముగా ఉన్నది.

పురా తత్ర మహారాజో భరతో నామ వీర్యవాన్ | సాకేతవాసీ ధర్మాత్మా రఘువంశవివర్ధనః | | ౧౦౪

పూర్వం భరతుడు అనే పరాక్రమవంతుడైన మహారాజు ఉండేవాడు. అతను సాకేతములో(అయోధ్యానగరము) నివసించాడు .అతడు నీతిమంతుడు మరియు రఘు వంశాన్ని అభివృద్ధి చేసాడు. . 104

రావణాపహృతా భార్యా జ్యేష్టభ్రాతురితీర్ష్యయా | చతురఙ్గబలోపేతస్సహాయకరణాయ సః | | ౧౦౫

తన అన్న శ్రీరాముని భార్యను అనగా సీతమ్మను రావణుడు అపహరింపగా శ్రీరామునిసహాయముకొరకు చతురంగ బలములతో(నడిచే సైనికులు, గుర్రాలు, ఏనుగులు మరియు యుద్ధ రథాలు.) తమ్ముడైన శత్రుఘ్నునితో కలిసి ఈ నరసింహపర్వతానికి వచ్చాడు.

శత్రుఘ్నేన సహ భ్రాత్రా సర్వశస్త్రభృతాం వరః | రథమారుహ్య సైన్యేన ప్రాప్తవాన్ స మునేః పదమ్ ||౧౦౬

అతను తన సోదరుడు సాయుధులైన పురుషులందరిలో ఉత్తముడయిన శత్రుఘ్నునితో కలిసి సైన్యంతో సహ రథాన్ని ఎక్కి ఋషి నివాసాన్ని చేరుకున్నాడు.

భరద్వాజాశ్రమపదం ప్రాప్య రామానుజో బలీ | విసర్జయిత్వా సైన్యాని తదాశ్రమపదం యయౌ || ౧౦౭

భరద్వాజాశ్రమమును చేరి సైన్యమును దూరముగా నిలిపి అత్రిమహర్షిని భరతుడు దర్శించాడు.

స నిశమ్య భరద్వాజం శిష్యవాక్యేన రాఘవః | ప్రాప్తస్సుమన్త్రిణా రాజా శత్రుఘ్నేనానుమోదితః | | ౧౦౮

తన శిష్యుని మాటల ద్వారా సుమంత్రుడు, శత్రుఘ్నులతో కలిసి భరతుని రాకను భరద్వాజుడు విన్నాడు.

అథ తౌ మునిశార్దూలౌ రాఘవౌ పదసేవినౌ | ప్రేక్షయామాస తేజస్వీ ప్రహృష్టేనాన్తరాత్మనా | | ౧౦౯

ఆ మహర్షి భరతశత్రుఘ్నులను ప్రేమతో ఆదరించి అప్పుడు శత్రుఘ్నుడు, భరతుడు భరద్వాజుని పాదాల వద్ద సేవ చేసారు. ఆ తేజస్వి అయిన భరద్వాజుడు వారి వైపు సంతోషకరమైన హృదయంతో చూసాడు. . 109 –

నృహరేస్తు ప్రసాదేన భరతస్య మహాత్మనః । స సైన్యస్య తథాతిథ్యం భరద్వాజశ్చకార హ । ।౧౧౦

నరసింహస్వామి దయతో సైన్యముతో వచ్చిన వారందరికి భరద్వాజుడు ఆతిథ్యము ఇచ్చాడు.

111-120

పదే పదే వర్ధమానైః ఫలమూలరసాదిభిః ।తోషయామాస సర్వాంస్తాన్ నృహరేరనుభావతః । । ౧౧౧

భగవంతుడు నృహరి అనుగ్రహంతో వారందరికి పండ్లు, వేర్లతో, రసంతో మరియు అడుగడుగునా పెరిగే ఇతర వస్తువులతో భరద్వాజుడు సంతృప్తిపరిచాడు. . 111

పూజాన్తే మునిశార్దూలో విదిత్వా స తదాగమమ్ । రామానుజం మహాత్మానమూచే మధురయా గిరా । ।౧౧౨

పూజ చివర భరతుడు వచ్చుటకు కారణము తెలిసికొని భరద్వాజుడు అతనితో మధురమైన వాక్కులతో ఇలా అన్నాడు.

రామస్తవాగ్రజో ధర్మవత్సలో నయకోవిదః । నిహత్య రావణం సంఖ్యే స్వభాయాం ప్రాప్నువాని హ । । ౧౧౩

"నాయనా! మీఅన్న రాముడు ధర్మాత్ముడు. నీతి కోవిదుడు. రావణుని యుద్ధమున సంహరించి తన భార్యతోతిరిగి వస్తాడు.'

క్షిప్రమేష్యతి ధర్మాత్మా సభార్యస్ససుహృద్గణః గృహ్యాగ్రజన్మనోఽనుజ్ఞాం రక్ష రాజ్యం సమేత్య వై ।।౧౧౪

నీతిమంతుడైన రాముడు త్వరలోనే తన భార్యతో, మిత్రులతో తిరిగి వస్తాడు. నీ అన్నయ్య అనుమతి తీసుకుని కలిసి రాజ్యాన్ని కాపాడుకో.

అద్యాగతోఽహం నృపతే సహాగస్త్యేన ధీమతా। రామరావణయోర్యుద్ధం నిరీక్ష్య సహ దైవతైః । ।౧౧౫

ఓ భరతా! నేను ఈ రోజు జ్ఞాని అగస్త్యునితో దేవతలతో కలిసి రాముడు మరియు రావణుడి మధ్య జరిగిన యుద్ధాన్ని చూచి వచ్చాను. .115

ప్రతిగృహ్య వచస్తస్య యాతుకామః పురీం ప్రతి । ఇదం హోవాచ భరతస్సత్కృతి శ్లాఘయన్ వచః । ।౧౧౬

భరద్వాజుని మాటలను అంగీకరించిన తరువాత అతను నగరానికి తిరిగి వెళ్లాలని కోరుకున్నాడు. భరతుడు భరద్వాజుని గౌరవాన్ని ప్రశంసిస్తూ ఈ మాటలు పలికాడు. .116

భరత:

స్వామిన్నక్షౌహిణీ సేనా తోషితా భవతాఽనఘ । ఆశ్చర్యమేతద్వద మే తపః కీదృశమార్జితమ్ ।।౧౧౭

స్వామీ!భరద్వాజా! ఇంత గొప్ప అక్షౌహిణీ సేనకు(21870 రథములు, 21870 ఏనుగులు, 65610 గుఱ్ఱములు, 109350 కాల్బలము కలిగిన సేనావిశేషము) మీరు ఆతిథ్యము ఇచ్చారు. ఇది ఎలా సంభవమైనది? నాకు ఆశ్చర్యముగా ఉన్నది'

భరద్వాజః

అయం నృప మహాశైలో దృశ్యతే ధాతుమణ్డితః। అత్రాస్తే భగవాన్విష్ణుస్సింహరూపీశ్రియా సహ।। ౧౧౮

భరద్వాజుడు ఇలా అన్నాడు. "ఓ రాజా! శ్రీనృసింహ పర్వతము మీదశ్రీమహావిష్ణువు లక్ష్మితో కూడ నృసింహ రూపమున ప్రకాశిస్తున్నాడు.

అథ తస్యోత్తరే పాదే యో మాయా సేవ్యతే సదా। అత్ర కల్హారసరసి నిత్యం కల్హారభూషితే ||౧౧౯

ఆ పర్వతమునకు ఉత్తర దిక్కులో నేనున్నాను. అక్కడ ఉన్న కల్హారమను సరస్సున స్నానము చేసాను.

తపస్యతామృషీణాం వ కిం కిం న భవితా నృప। బ్రహ్మన్నృసింహశైలోఽయమద్య ప్రభృతి గణ్యతామ్ ||౧౨౦

ఇక్కడ తపస్సుచేసిన వారు ఏమి కోరినా పొందగలరు." అని భరద్వాజుడు చెప్పగా విని భరతుడు "స్వామి! ఈ నృసింహశైలము లెక్కింపవలసినది.

చిన్తామణిరితి స్వైరం తృప్తా యేన చిరాద్వయమ్।

121-130

అగస్త్యః -

భరద్వాజాభ్యనుజ్ఞాతో భరతస్సహ సేనయా ||౧౨౧

చింతామణి అని మనము ఈ పర్వతమును భావించాలి' అని పర్వతాన్ని ప్రశంసించాడు.

అగస్త్యుడు:-

ఆ తరువాత భరద్వాజుని అనుమతితో భరతుడు తన సైన్యంతో కలిసి...

హృష్టచేతా సహ భ్రాత్రా సాకేతం ప్రయయౌ తదా।

సంతోషించిన మనస్సుతో తమ్మునితోకూడ అగస్త్యుని సేవించి అయోధ్యకు వెళ్ళెను.

తదా ప్రభృతి శైలోఽయం చిన్తామణిరితీయతే || ౧౨౨

అది మొదలు ఈ ఘటికాచలమునకుచింతామణి (కోర్కెలను తీర్చు మణి) అనుపేరు వచ్చెను.

యే తపస్యన్తి శైలేఽస్మిన్ తపస్వీప్సితప్రదే। కుర్వతే యే తపస్తత్ర కల్హారోదనిషేవిణః ||౧౨౩

ఈ పర్వతంపై తపస్సు చేసేవారు ఇంచుక యెఱుపును దెలుపును గలిగి మిక్కిలి పరిమళము గల కలువ, (సౌగంధికముల)తో అర్చింపబడు నరసింహుని సేవించి కోరికలను నెరవేర్చుకొనేవారు.

చిన్తామణీశసాన్నిధ్యాన్నిత్యతృప్తా భవన్తి హి । నృసింహనగరీ తస్య పురో భాగే మహామతే |౧౧౨౪

ఆ తపస్వులు ఎల్లప్పుడూ చింతామణి వంటి ఆ నరసింహ ప్రభువు సాన్నిధ్యంతో సంతృప్తి చెందుతారు. నృసింహ నగరం ఆ నగరానికి తూర్పు భాగంలో ఉంది.

దృశ్యతే విష్ణుభక్తానామాస్పదం భావితాత్మనామ్ । సురథోనామ ధర్మాత్మా తిష్ఠతే పాలయన్నృజాః । । ౧౨౫

అగస్త్యుడు ఇంకా ఇలా చెప్పాడు. ‘‘సురథుడను ధర్మాత్ముడైన రాజు ధర్మబద్ధముగా ఇప్పుడు ఆనగరాన్ని పాలిస్తున్నాడు.

ధనానామధిపో రాజా తాం పురీమలకామివ । ఇతః పరం తు భవితా ఇన్ద్రద్యుమ్నో నృపోత్తమః || ౧౨౬

తరువాత సంపదలకు అధిపతి అయిన ఇంద్రద్యుమ్నుడను రాజు అలకాపురి వలె ఈపురమును పాలించును.

సౌరీమివ పురీం తత్ర రక్షిష్యతి పురీమిమామ్ । తత్ర భక్తోచిత ఇతి ప్రథాం కృత్వా సహ శ్రియా || ౧౨౭

యముడు నగరాన్ని రక్షించినట్లే, ఇంద్రద్యుమ్నుడు ఈ నగరాన్ని కూడా రక్షిస్తాడు. అక్కడ, లక్ష్మీ దేవతతో కలిసి , భక్తుడికి తగినట్లుగా ఆ నారాయణుడు చేయవలసిన కర్మను నిర్వహిస్తాడు. 127

కామిదం పూరయన్నృణామాస్తే నారాయణస్స్వయమ్ ।

మానవుల కోరికలను తీర్చడానికి భగవంతుడు నారాయణుడు స్వయంగా ఉన్నాడు.వసంతకాలంలో, వేసవిలో నరహరిని అక్కడ సేవించాలి.

వసన్తకాలే నృహరిగ్రీ ష్మే తత్రావతారయేత్ ||౧౨౮

చిక్రీడతో శ్రియా మాసే మార్గశీర్షే తు ఫాల్గునే ।

వసంతకాలములో, గ్రీష్మములో, మార్గశీర్షములో, ఫాల్గుణమాసములలో అక్కడ అవతరించిన నరహరికి గొప్ప ఉత్సవములు జరుగుతాయి.

ఉత్సవానాన్తు సప్తానాం పదం భక్తోచితస్స్వయమ్ ||౧౨౯

ఏడు పండుగలు ఆ నరహరికి భక్తులకు తగినట్లుగా జరుగుతాయి.

అనుగృహ్ణాతి భూతాని తదాయాతాని భూతలే| సప్తర్షిభిః కృతా పూర్వ ఇమే సప్త మహోత్సవాః || ౧౩౦

పూర్వము సప్త ఋషుల చేత ఏడుమహోత్సవములు జరుపబడినవి. భూమిపైకి వచ్చిన జీవుల పట్ల నరహరి దయను నిరూపిస్తూ  ఈ ఏడు గొప్ప పండుగలను గతంలో ఏడుగురు ఋషులు జరుపుకున్నారు.

పఞ్చానామపి బిమ్బానాముత్తమోఽయముదీర్యతే | అతో భక్తోచితే బిమ్బే నిత్యం సన్నిదధాతి సః | | ౧౩౧

ఈ కొండపై ఉన్న 5 విగ్రహములకు ఈ ఉత్సవములు జరుపబడతాయి.  ఐదు విగ్రహాలలో నరహరి విగ్రహం  అత్యుత్తమమైనది. ఆయన ఎల్లప్పుడూ తన భక్తునికి తగిన రూపంలో తనను తాను మలచుకుంటాడు.

అత్ర వైఖానసానామ పూజకాస్తు ప్రకీర్తితాః| అభ్యర్చ్వితా■న్నృహరే వసన్త్యాగమకోవిదాః || ౧౩౨

ఇక్కడ వైఖానసులు అర్చకులుగా ఉంటారు. ఆగమ కోవిదులైన వైఖానసులు శ్రీనరసింహనికి ప్రీతి పాత్రులు.

వైఖానసులు

వైఖానస సూత్రాల ప్రకారం వైష్ణవాలయాలలో పూజలు నిర్వహించే అర్చక స్వాములు

తత్ర దీర్ఘసరో నామ సతతం దీర్ఘపఙ్కజైః | తత్ర దీర్ఘాశ్చ తరవః స్నాతా దీర్ఘాయుషో నరాః | | ౧౩౩

ఇచ్చట దీర్ఘ సరస్సు ఉన్నది. దీనిలో పెద్ద తామరపూలు ఉన్నాయి. సరస్సుచుట్టు పెద్ద చెట్లు ఉన్నాయి. ఇక్కడ స్నానము చేసినవారు దీర్ఘాయుష్మంతులవుతారు.

గన్ధర్వాణాఞ్చ మరుతాం కిన్నరాణాం శతం శతమ్| వృన్దం వృన్దం చ యక్షాణాం చిక్రీడతి సరస్తటే || ౧౩౪

ఈ సరస్సు వద్దకు గంధర్వులు మరుత్తులు కిన్నరులు యక్షులు గుంపులు గుంపులుగా వచ్చి ఆనందిస్తారు.

ఇమాని శ్రీనృసింహాద్రిపాదాశ్రమపదాని చ | ప్రదక్షిణీకృత్య నరో ముచ్యతే సర్వకిల్బిషాత్ |

ఇక్కడి ఆశ్రమములలో  నృసింహ క్షేత్రములు ఉన్నాయి. . వీటికి ప్రదక్షిణము చేసిన వారు సమస్త పాపములనుండి విముక్తులు అవుతారు.

ఇదం గిరేరస్య మహాప్రదక్షిణం ప్రకుర్వతే యే నృహరేరనుజ్ఞయా |

సుఖీ భవన్తో మనుజాస్తథాసురాశ్చిరాయుషో జాగ్రతి సద్భిరీడితాః ||౧౩౬

ఇందు స్నానము చేయువారు దీర్ఘా యుష్మంతులు అవుతారు.నృసింహదేవుని అనుగ్రహముతో సమస్త సౌఖ్యములు పొంది సత్కీర్తి పొందుతారు.

గురోర్ముఖాద్యశ్శృణుతే మహాత్మా తచ్ఛాయమేతచ్చిరభక్తిశాలీ |

దదాతి తస్మై నృహరిః ప్రసన్నో హ్యాయుశ్చ విద్యాం చ యశశ్చ ముక్తిమ్ ||౧౩౭

పై విధముగా ఈ క్షేత్రమాహాత్మ్య మును గురువు ద్వార విన్నవారుశ్రీహరి అనుగ్రహముతో ఆయుస్సును విద్యను కీర్తిని ముక్తిని కూడ పొందుతారు''

ఇతి బ్రహ్మకైవర్తే ఉత్తరఖణ్డే భృగుపరాశరసంవాదే ఘటికాచలమాహాత్మ్యే ద్వాదశోఽధ్యాయః ||

ఇక్కడితో  బ్రహ్మ-కైవర్త పురాణంలోని ఉత్తరఖండంలో భృగువు మరియు పరాశరుని మధ్య జరిగిన సంభాషణలో ఘటికాచల మాహాత్మ్యంలో పన్నెండవ అధ్యాయం పూర్తి అయినది.

+++++

శ్రీ శివాయ గురవే నమః

ఘటికాచలనివాసాయ శ్రీ నృసింహాయ నమః

బ్రహ్మకైవర్త పురాణములో ఉన్న  శ్రీఘటికాచల మాహాత్మ్యపు  పదమూడవ  అధ్యాయము

(మూల శ్లోకము మరియు తాత్పర్య విశేషాలతో)

1-10

త్రయోదశోఽధ్యాయః

అతః పరం చ వక్ష్యేఽహమాన్తరం చ ప్రదక్షిణమ్ | యత్ కృత్వా లభతే సర్వసంపదో నిరూపాధికాః || ౧

తరువాత అగస్త్యుడు వామదేవునకు ఆంతర ప్రదక్షిణమును గురించి ఇలా వివరించాడు. ఈ ఆంతర ప్రదక్షిణము చేస్తే గొప్ప సంపద కలుగుతుంది.

విశేషాలు

బ్రహ్మతీర్థంలో స్నానమాడి, అగ్నితీర్థం, సోమకుండం, పద్మసరోవరం, వాల్మీకితీరం, వజ్రతీర్థం మొదలైనవానిలో స్నానం చేసి, గిరిప్రదక్షిణం చేయడం మహాప్రదక్షిణం అనబడుతుంది. బ్రహ్మతీర్థంలో స్నానం చేసి భైరవతీర్థం, హలావర్తతీర్థం, వరాహతీర్థం, పుండరీక తీర్థం, గారుడం,

పాపవినాశం, అమృతకుండం,వామతీర్థం, రత్నతీర్థం, వశిష్ఠతీర్థం అనే తీర్థాలలోను, లక్ష్మీతీర్థంలోను స్నానమాడి ఘటికాద్రి చుట్టూ ప్రదక్షిణం చేయడం అంతరప్రదక్షిణమని చెబుతారు.

బ్రహ్మణా సృష్టికర్తృత్వం కుబేరేణ ధనేశతా । స్వర్గాధిపత్యమిన్ద్రేణ యత్కృత్వా ప్రాపితం పురా ।।౨
బ్రహ్మ ఈ ఆంతర ప్రదక్షిణముతో తపస్సు చేసి సృష్టి కర్తృత్వాన్ని , కుబేరుడు ధనములపై అధికారాన్ని , ఇంద్రుడు స్వర్గాధిపత్యమును పూర్వం పొందారు.

బ్రహ్మతీర్థే పురా స్నానం కర్తవ్యం ఫలమిచ్ఛతా । వేదానధ్యాపయన్నాస్తే యత్ర శిష్యాననేకశః ।।౩
ఒకసారి విశ్వామిత్రుడు తాను కోరిన ఫలమునకై శిష్యులతో కలసి బ్రహ్మతీర్థములో స్నానము చేసి తపస్సు చేసాడు. ఆయన అక్కడే ఉండి అనేక మంది శిష్యులకు వేదాలు బోధించేవాడు.

విశ్వామిత్రస్తు రాజర్షిః బ్రహ్మతేజోభిలాషవాన్ । తపాంసి కృత్వా తత్రైవ ప్రాదురేష్యతి సానుగః ।।౪
రాజర్షి అయిన విశ్వామిత్రుడు బ్రహ్మర్షి కావాలని కోరుకున్నాడు. ఇక్కడే తన అనుచరులతో కలిసి నివసిస్తూ బ్రహ్మర్షిత్వము కొరకు తపస్సు చేసాడు.

కర్తవ్యం భైరవోదే చ స్నానం పుంసాభిలాషిణా । పుమర్థాన్ లభతే తత్ర చతురశ్చతురోపి సః ।। ౫
నేర్పరియై పురుషార్థములను(1. ధర్మము, 2. అర్థము, 3. కామము, 4. మోక్షము) కోరువాడు భైరవ తీర్థములో స్నానము చేయాలి.

అనన్తరం హలావర్తే తపః కర్తవ్యమేవ హి । తతో గౌతమతీర్థే వై స్నాతవ్యం ఫలకాఙ్క్షిభిః ।।౬
తరువాత హలావతి తీర్థములో తపస్సు చేయాలి. ఆపై గౌతమ తీర్థములో స్నానము చేయాలి.

తస్యోత్తరే పథే భూమౌ మహావనమితి శ్రుతమ్ । ఋక్షాణామధిపో యత్ర తపశ్చరతి జామ్బవాన్ ।।౭
ఈ పర్వతానికి ఉత్తరములో ఒక మహా వనము ఉన్నది. . దానియందు భల్లూక రాజైన జాంబవంతుడు తపస్సు చేస్తున్నాడు.
తత్ర జామ్బవతీ నామ కన్యా తస్యాభవన్మునే । యయా తు భగవాన్ విష్ణుర్లఙ్ఘితప్రథమాశ్రమః ।।౮
ఆ ప్రాంతములోనే శ్రీకృష్ణుని పెండ్లాడిన జాంబవతి అను కన్య ఉండేది. ఆమె విష్ణువుయొక్క మొదటి ఆశ్రమాన్ని దాటించింది.
(1. బ్రహ్మచర్యము, 2. గార్హస్థ్యము, 3. వానప్రస్థము, 4. సన్యాసము అను నాలుగు ఆశ్రమాలలో మొదటి ఆశ్రమమయిన బ్రహ్మచర్యమును దాటించింది. అనగా రెండవ ఆశ్రమానికి సంబంధించిన పెండ్లి చేసుకొన్నదని భావం. )

పురా జామ్బవతీ నామ కృష్ణం భర్తారమిచ్ఛతీ । బోధితా వాయునా తత్ర తపః కృతవతీ మహత్ ।।౯
పూర్వము కృష్ణుని భర్తగా పొందుటకై వాయుదేవునిచే ప్రేరేపింపబడిన జాంబవతి తీవ్రమైన తపస్సు చేసింది.

కాలే తస్మిన్నిరాలమ్బాం నిరాహారాం తపస్వినీమ్ | వీక్ష్య విస్మయమాపన్నో వరాహః కోఽప్యచిన్తయత్ | ।౧౦

ఆమె ఆహారము మాని తపస్సు చేస్తుండగా ఆమెను చూచిన శాపవశాత్తు వరాహముగా మారిన ఒకానొక యువకుడు ఇలా అనుకొన్నాడు.

11-20

వరాహః

అష్ట వర్షాణి కన్యేయం దుఃశ్చరం తనుతే తపః | అశక్యమీశానముఖైస్సురైరేవ న సంశయః | ।౧౧

8 సంవత్సరాల వయస్సు కలిగిన ఈ కన్య చాలా ఆశ్చర్యకరంగా ఇతరులకు అసాధ్యమైన తపస్సు చేస్తున్నది. ఈమె చేస్తున్న ఇటువంటి తపస్సును దేవతలు కూడా చేయలేరు .

జలం పర్ణం ఫలం వాపి కన్దమూలం తథాదరాత్ | అయాచితవ్రతానాం వై దాతవ్యం దర్శనక్షణాత్ ||౧౨

నీరు, ఆకు, పండు , కందమూలము(చిలుగడదుంప) మొదలైన వాటిని ఇటువంటి గొప్పతపస్వినులకు చూసిన వెంటనే ఇవ్వాలి.

ఇతో హి దృశ్యతే వల్లీ పూర్ణకన్దా హ్యనిన్దితా | ఏతాముత్కృత్య కన్యాయై ఏతస్మై ప్రదదామ్యహమ్ ||౧౩

ఈ ప్రదేశములో మంచి కందమూలములు కలిగిన తీగ కనిపించుచున్నది . ఈ తపస్సు చేయుచున్న ఈమెకు దీనిని పెకిలించి ఇచ్చెదను గాక!

అగస్త్యః

ఇతి సఞ్చిన్త్య పోత్రీన్ద్రః ధర్మ్యం పన్థానమాశ్రితః పాణిభ్యాం ఘోణయా పద్భ్యామఖనన్మేదినీం శనైః | | ౧౪

ఈ విధముగా ధర్మ మార్గములో ఆలోచించిన ఆ వరాహం తన చేతులతోనూ ముట్టెతోను( పందిముక్కు) కాళ్లతోనూ భూమిని మెల్లగా తవ్వింది.

ఖాత్వా భూమిం తదా కోలో ఘర్ఘరధ్వానశోభితః | దీర్ఘకన్దాం మహావల్లీం మన్దం మన్దం చకర్ష సః | ౧౫

పెద్దగా కందకాన్ని ( పెద్ద గుంట) తయారుచేసి ఆ వరాహము బాగా అడుగున ఉన్న ఆ గొప్ప తీగను మెల్లమెల్లగా పైకి లాగటానికి ప్రయత్నించింది

లతాయాం గృహ్యమాణాయాం మధ్యే విఘ్నో మహానభూత్ | పార్శ్వస్థా చ శిలా తత్ర మహతీ నిరుపాధికీ||౧౬

ఆ వరాహము ఆ తీగను పైకి లాగుచుండగా ఒక పెద్ద విఘ్నం వచ్చినది. కందమూలమునకు పక్కనే ఉన్న ఒక పెద్ద రాయి వరాహము లాగుతున్న కందమూలమును పైకి రాకుండా అడ్డుపడింది.

త్రుటితాభూన్మహావల్లీ మధ్యేకూటం తు పోత్రిణా | పోత్రీ చ చిన్తయామాస త్రుటితాం తస్య వల్లరీమ్ ||౧౭

అయితే ఆ వరాహం లాగుతున్న కొద్దీ ఆ గొప్ప లత మధ్య శిఖరాన్ని బద్దలు కొట్టింది. ఆ అడవి పంది కూడా తన లత గురించి ఆలోచించింది.

చిన్తయిత్వా వరాహస్తు ఘోణయోద్ధృత్య తాం శిలామ్ । కరేణ కన్దముత్పాట్య వ్యసైషీద్బహిరఙ్గణమ్ ॥ ౧౮

దాని గురించి ఆలోచిస్తూ, ఆ అడవి పంది తన ముట్టెతో బలంగా ఆ రాయిని ఎత్తింది. తన చేత్తో లోపల ఉన్న ఆ దుంపను తీసుకొని బయటకు విసిరింది. 18.

అథ దృష్ట్వా తు తాం మూలే భిద్యమానం నవం పయః । తత్రత్యై ఋషిభిర్దాన్తైః ప్రథమానం సదా భవేత్ ॥౧౯

అప్పుడు ఆ వరాహం శిల పగిలి, దానికింద ఉన్న నీరు పైకి రావటం చూసింది. అక్కడ పుట్టిన ఆ నీరు ఇంద్రియ నిగ్రహము కలిగిన ఋషులకు ఎల్లప్పుడూ ప్రసిద్ధముగా , ప్రథమప్రాముఖ్యమును కలిగి ఉంటుంది. (అనగా జపతపాదులకు ఋషులకు ఆ నీరు ఆవశ్యకమని భావం)

వనకోలస్తదా దృష్ట్వా దదర్శ బిలమాదరాత్ । పయః పత్రపుటే గృహ్య సకన్దరసమేదురమ్ ॥౨౦

వరాహము ఆ రాయిని తొలగించడం వల్ల అక్కడ కొత్తగా జల ధార పుట్టింది. ఆ రాయి కింద ఉన్న నీటి బిలము నుంచి ఒక ఆకు దొప్పలో నీటిని కందమూలమును ఆ వరాహము తీసుకొన్నది.

21-30

. తతః స్నిగ్ధాం జామ్బవతీం నిరాహారాం చ కన్యకామ్ । మునికన్యాం జనైర్దత్తే వస్తున్యపి నిరాశయామ్ ॥ ౨౧

ఆహారం ఏమీ తినకుండా తపస్సు చేయుచున్న ముని కన్య అయిన జాంబవతికి ఆ నీటిని కందమూలమును వరాహము ఇచ్చింది.

అనాలమ్బామనాధారాం తారామివ భువం గతామ్ । కేనాపి హేతునాత్రత్యాం విద్యామివ నిరామయామ్ ॥ ౨౨

ఆమె ఎటువంటి ఆసరా లేకుండా, నేలపై ఉన్న నక్షత్రంలా ఉన్నది. . ఏదో కారణం చేత స్వస్థత కలిగించే విద్యలా ఆమె ఇక్కడ ఉంది 22

గన్ధర్వానుజ్ఞయా తీర్ణాం కన్యాం వేదశ్రుతీమివ। పార్వతీమివ భర్తారం కాఙ్క్షిణీం తపసి స్థితామ్ ॥౨౩

గంధర్వుల అనుమతితో వేద గ్రంథాలను దాటిన ( చదివిన) కన్యలా ఉన్నది. . పార్వతి లాగే, తన భర్త కోసం తపిస్తూ, తపస్సు చేసే యువతిలా ఉన్నది.

అనావిద్ధామనాహారామష్టవర్షామనిన్దితామ్ । సమీక్ష్య తాం తతస్తస్యై దదౌ కన్దం చ వారి చ ॥ ౨౪

నిందలేని స్వభావము తో, ఎటువంటి బాధలు లేకుండా కొన్ని సంవత్సరాలుగా తపస్సు చేస్తున్న ఎనిమిదేళ్ళ వయస్సు కలిగిన ఆమె ఏమీ తినలేదు. అటువంటి ఆమెకు వరాహం ఒక దుంప, నీళ్ళు ఇచ్చింది. 24

అనాదరా సఖీదత్తజీర్ణపర్ణాశనాదిషు । వన్యేన పోత్రిణా దత్తమాదాయేదమువాచ హ

తన స్నేహితురాళ్లు ఇదివరలో ఆహారము మొదలైనవి సమకూర్చినప్పటికీ వాటిని తాకటానికి ఇష్టపడని ఆ జాంబవతి ఆ వరాహము తెచ్చిన కందమూలమును. నీటిని చూచి ఇలా అన్నది॥౨౫

జామ్బవతీ -

అహో వరాహో భగవాన్ కథమీదృశకర్మణి । ప్రకల్పితే కిమేతద్ధి శంస మే త్వమన్యధీః ||౨౬

ఓ, పూజ్యుడా ! ఓ వరాహమా !నువ్వు ఈ పనిని ఎందుకు చేసావు? నువ్వు వేరే ఉద్దేశ్యంతో ఇలాంటి పని చేసావా?

అప్పుడు వరాహము జాంబవతికి ఇలా జవాబిచ్చింది.

వరాహః -

పురాఽభూద్దణ్డకో దేశే వరాహధ్వజనామభాక్ । రాజా సర్వస్య లోకస్య రథకుఞ్జరవాజిమాన్

పూర్వము దండకదేశములో వరాహధ్వజుడు అనే పేరు కలిగిన ఒక రాజు ఉండేవాడు . సకల లోకాలలోని ఉత్తమ రథాలు, ఏనుగులు మరియు గుర్రాలు అతని దగ్గర ఉండేవి.

తస్యాహమగ్రజః పుత్రో నామ్నా సింహధ్వజో యువా । జనకేనాదృతో నిత్యం సర్వకర్మసు సమ్మతః ||౨౮

నేను అతని యొక్క పెద్ద కుమారుడిని. నా పేరు సింహధ్వజుడు. నా తండ్రి పట్ల నేను చాలా గౌరవము కలిగి ఉండేవాడిని.

యౌవరాజ్యాభిషిక్తోఽహం గురుణా నయశాలినా । సర్వప్రీతికరో నిత్యం వైరివంశవిదారకః ||౨౯

నీతిశాలియైన, శత్రురాజులను సంహరించు స్వభావము కలిగి, అందరికి ఇష్టమయిన నా తండ్రి నన్ను యువరాజుగా పట్టాభిషేకం చేసాడు .

కదాచిదుద్భటైరశ్వైస్సన్నహ్యైరపి కుఞ్జరైః । యౌవనే సమయే గర్వీ యువభిః పరివారితః ||౩౦

ఒకసారి యవ్వన గర్వముతో పరివారముతో కలిసి వేటకు బయలుదేరాను. ఆ పరివారములో గుర్రాలపై స్వారీ చేసేవారు, ఆయుధాలు ధరించినవారు, ఏనుగులపై కూర్చున్నవారు ఉన్నారు.

ఉద్భటైశ్చ భటైరశ్వైః కోలాఖేటవిశారదైః । సాయుధస్తురగారూఢః సోష్ణీషో వనమేయివాన్ || ౩౧

వేటలో నిపుణులైన వారు , బాణాలు ప్రయోగించుటలో నేర్పు కలవారు అయిన ఇతర సైనికులు ఆయుధాలు ధరించి గుర్రాలపై స్వారీ చేస్తూ వస్తుండగా తలపాగాలు ధరించి వేటకు అడవిలో ప్రవేశించాము.

మృగయాసమయే కోఽపి వరాహః ప్రత్యదృశ్యత । స భయానుద్రుతః పార్శ్వ మునేస్తుణ్డోరుపావిశత్ || ౩౨

ఆ వేట సందర్భంలో నేను ఒక వరాహాన్ని చూసాను. నన్ను చూసి భయపడి ఆ వరాహము భయముతో పరిగెత్తి పక్కనే ఉన్న ఒక ముని ఆశ్రమంలోకి ప్రవేశించింది.

మునేశ్శాపాదహం తత్ర సద్యః పోత్రీత్వమాప్తవాన్ | విజ్ఞాయ సేనా మాం తత్ర పోత్రిరూపిణమఞ్జసా ||

ముని ఆశ్రమంలో ఉన్న ఆ వరాహాన్ని వేటాటానికి ప్రయత్నించిన నన్ను చూసి వరాహము కమ్మని ఆ ముని శపించాడు. నేను వెంటనే వరాహ రూపాన్ని పొందాను. ౩౩

ప్రశశంసేదమఖిలం భర్తుః పార్శ్వముపేత్య వై | నిశమ్య తద్వచస్సైన్యైః జ్ఞాయమానో వనం గతః || ౩౪

ఈ విషయమును నా పక్కనే ఉన్న పరివారము ద్వారా తెలుసుకున్న నా తండ్రి వరాహధ్వజుడు వెంటనే అడవికి వచ్చాడు.

తణ్డోరాగమనాకాఙ్క్షీ ప్రాతిష్ఠథ విచక్షణః | అథ శిష్యేణ కేనాపి సహాయాన్తం మహామునిః | | ౩౫

నాకు శాపము పెట్టిన ఆ తండులుడను పేరు కలిగిన ముని దర్శనమయ్యేవరకు వేచి ఉండి, ఒక శిష్యుని సహాయముతో తనదగ్గరకు వస్తున్న తండుల మహామునిని అల్లంత దూరములో నా తండ్రి చూసాడు.

వరాహధ్వజః -

స్యన్దనాదవరుహ్యాసౌ నమస్కృత్యేదమబ్రవీత్ | అజ్ఞానాదవతీర్ణోఽయం మత్పుత్రో భవదాశ్రమమ్ ||౩౬

నా తండ్రి వరాహధ్వజుడు రథము నుంచి కిందికి దిగి ఆ మునికి నమస్కరించి వినయముతో ఇలా అన్నాడు. " అయ్యా! నా కుమారుడు అజ్ఞానం వలన మీ ఆశ్రమంలోనికి ప్రవేశించాడు.

స్వామిన్ సహస్వ బ్రహ్మర్షే శాపాన్మోచయ మత్సుతమ్ |

నా కుమారుని క్షమించి అతని శాపాన్ని తొలగించవలసినదిగా ప్రార్థిస్తున్నాను

తణ్డుః-

న లఙ్ఘనీయశ్శాపో మే రాజన్ బ్రహ్మాదిభిస్సురైః ||౩౭

అప్పుడు తండులుడు అను ఆ ముని రాజుతో ఈ విధంగా అన్నాడు.రాజా !బ్రహ్మ మొదలైన దేవతలు కూడా నా శాపాన్ని తప్పించుకోలేరు.

కథమేష నృకీటస్తు లఙ్ఘతే ఇహ మద్వచః |

మరి అటువంటి సందర్భంలో మానవమాత్రులు నా శాపము నుండి ఎలా తప్పించుకోగలరు?

యతోఽసి త్వమిహాయాతో రాజన్ సర్వజనేశ్వరః ||౩౮

అయినప్పటికీ నా దగ్గరికి వచ్చి నువ్వు ప్రార్థన చేయుచున్నావు కనుక.....

అతశ్శృణు త్వం పుత్రస్య శాపమోక్షణకారణమ్|

నీ కుమారుని యొక్క శాపవిమోచనము ఎలా జరుగుతుందో చెబుతాను విను.

పయోష్ణ్యాశ్చోత్తరే తీరే శ్రీనృసింహాచలో మహాన్ | | ౩౯

ఈ పయోష్ణము అను ప్రదేశమునకు ఉత్తరంలో గొప్పదయిన శ్రీ నరసింహ స్వామి పర్వతము ఉన్నది

బోధాయనాదిమునిభిస్సేవ్యతే సర్వదా నృప | తత్ర నీతో యది సుతో వరాహత్వముపేయివాన్ ||౪౦

ఆ పర్వతములో బోధాయనుడు మొదలైన మునులు ఎప్పుడూ నరసింహుని సేవిస్తుంటారు. అక్కడ ఆ పర్వతములో నీ కుమారుని విడిచిపెట్టు

41-50

జాతిస్మరో భవేత్తత్ర విచారః క్రియతాం త్వయా | తత్ర జామ్బవతః కన్యా కృష్ణం మనసి కాఙ్క్షిణీ |౪౧

నీ కుమారుడు వరాహ రూపం లో ఉన్నప్పటికీ పూర్వజన్మ జ్ఞానము కలిగిన వాడై ఉంటాడు. ఆ పర్వతములో జాంబవంతుని కూతురు కృష్ణుని మనస్సులో కోరుకుంటూ తపస్సు చేస్తున్నది.

నిరాహారా జితక్రోధా తపశ్చరతి దుశ్చరమ్ | తస్యాశ్శుశ్రూషణపరో భవితా భవదాత్మజః ||౪౨

ఆ జాంబవతి ఆహారమేమి తీసుకోకుండా క్రోధమును జయించి చాలా దుష్కరమైన తపస్సు చేయుచున్నది. వరాహ రూపంలో ఉన్న నీ కుమారుడు ఆమెకు సేవ చేయగలడు.

కన్యకాయాః ప్రసాదేన శాపాన్ముక్తో భవిష్యతి | మహావరాహే భగవత్యనిశం జగదీశ్వరే ||౪౩ లయమేష్యతి పుత్రస్తే నాత్ర కార్యా విచారణా |

ఆ జాంబవతి యొక్క అనుగ్రహముతో నీ కుమారునికి శాప విముక్తి కలుగుతుంది. జగదీశ్వరుడయిన మహా వరాహస్వరూపుడైన భగవంతునిలో అతడు లీనము కాగలడు .ఇక నువ్వు ఎటువంటి ఆలోచన చేయకు.

వరాహః

ఇత్యుక్త్వా పితరం తత్ర ఋషిరన్తర్గతో మహాన్

ఈ విధముగా మా తండ్రి తో చెప్పి ఆ తండులుడను ఋషి మాయమయ్యాడు.

౪౪

ఘృణామపి కృతాం పుత్రపూర్వస్నేహానుబన్ధతః | గురుణా సంప్రణీతోఽహమత్ర శైలేషు సఞ్చరే ||౪౫

నా తండ్రి దయతో నన్ను ఇక్కడ విడిచిపెట్టాడు . నేను వరాహ రూపంలో ఈ కొండలో తిరగటం మొదలు పెట్టాను.

తతస్తత్శ్చరిత్వా త్వామద్రాక్షం సమయాద్బహోః |

ఈ కొండలో అటు ఇటు తిరుగుతూ చాలా కాలం తర్వాత నిన్ను చూడగలిగాను

దైవాద్వల్లీయముత్కృష్టా దృష్టా ప్రతినవోదకా । ।౪౬

దైవ వశాత్తు ఈ తీగతో పాటు నీటి ధార నాకు కనిపించాయి..

ఇదం స్వీకురు భద్రం తే తథా వారి చ మద్ధృతమ్ ।

నీకు శుభం జరగాలి.ఇదిగో నేను ధరించిన  ఈ నీటిని, తీగను స్వీకరించు.

జామ్బవతీ

ఇదం సరశ్చ భవతా ఘోణయా విహితం యతః ।।౪౭

వరాహమా ! నీ ముట్టె చేత ఈ సరస్సు ఏర్పడింది కనుక---

త్రీణి నామాని కరవై సరసోఽస్య మహామతే। వల్లీతీర్థం శిలాతీర్థం వారాహమితి చ క్రమాత్ ।।౪౮

ఈ సరస్సుకు వల్లీ తీర్థం, శిలా తీర్థం, వరాహ తీర్థం అను మూడు పేర్లు  కలుగుతాయి .

ప్రసన్నసలిలం స్వాదు సర్వర్షిగణసేవితమ్ ।

ఈ నీరు చాలా రుచికరంగా అందరూ ఋషులు సేవించటానికి వీలుగా ఉంటుంది.

అస్మిన్ వారాహతీర్థే యస్స్నాతి పాతి నిషేవతే । ।౪౯

ఈ వరాహతీర్థములో ఎవడు స్నానము చేసి శ్రీమహావిష్ణువుని సేవిస్తాడో....

మహావరాహకృపయా సవిష్ణోః పదమేష్యతి । తత్రాన్తరే మహాపోత్రీ భగవాన్ విశ్వరూపధృక్ ।।౫౦

అతడు మహా వరాహ అవతారము ధరించిన శ్రీమహావిష్ణువు యొక్క స్థానాన్ని పొందగలడు.

51-60

తస్మిన్ పోత్రిణ్యదృశ్యే తు ఘుర్ఘురధ్వనిశఙ్కితే । సర్వబ్రహ్మర్షిదేవర్షిద్విజర్షిగణసేవితః

ఈ విధముగా జాంబవతి చెబుతూ ఉన్న సమయంలోనే , ఆ వరాహ రూపంలో యువకుడు అదృశ్యము కాగా( తనలో లీనం కాగా)  బ్రహ్మర్షులు, దేవర్షులు, ద్విజర్షులు తనను సేవిస్తూ ఉండగా  విష్ణుమూర్తి అక్కడ ఆవిర్భవించాడు || ౫౧

మహావరాహో భూమేర్యః పతిర్వై ప్రాదురాస హ । అవాప్య తాం తు భగవాన్ పోత్రీ చరతి దుస్స్వరః ।।౫౨

భూమికి భర్త అయిన వరాహావతారంలో విష్ణుమూర్తి కనిపించాడు.  ఆ జాంబవతి దగ్గరకు వచ్చాడు.

ప్రాహ ప్రసన్నయా వాచా స్తూయమానో మునీశ్వరైః ।

భగవాన్ -

కాయేన మనసా వాచా కరణీయం చ జాతుచిత్ ॥ ౫౩

మునీశ్వరులందరూ తనను ప్రార్థిస్తూ ఉండగా ఆ భగవానుడైన శ్రీమహావిష్ణువు జాంబవతితో ఇలా అన్నాడు. త్రికరణ శుద్ధిగా అనగా మనస్సు చేత మాట చేత శరీరము చేత శుద్ధిగా  నువ్వు చేసిన ఈ తపస్సుకి నేను చాలా సంతోషించాను.

జాగర్తి యాదృశం దేవి తాదృశం కురుషే తపః । లోకానుద్ధరసే కిఞ్చ సప్త సప్తర్షిపూజితే ॥౫౪

ఓ జాంబవతీ ! నువ్వు ఎలా మేల్కొని ఉన్నావో, అలాగే తపస్సు చేస్తున్నావు. నువ్వు  లోకాలను రక్షిస్తావు.  మరియు ఏడుగురు ఋషులచే పూజించబడతావు. (మరీచి, అంగిరసుడు, పులహుడు, వసిష్ఠుడు, అత్రి, పులస్త్యుడు, క్రతువు అనువారు సప్తర్షులని కొందరు,  కశ్యపుడు, అత్రి, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, జమదగ్ని, వసిష్ఠుడు అనువారు సప్తర్షులు అని కొందఱు చెబుతారు)

శంస జామ్బవతః కన్యే భవత్యాః ప్రీణయే మనః । అహమీప్సితదానేన సత్యం ప్రతిశృణోమి తే ॥ ౫౫

. జాంబవంతుని కూతురా !, నేను నిన్ను  సంతోషపెట్టాలనుకుంటున్నాను. అది ఎలాగో చెప్పు.  నీ కోరికను అడగవలసినది అని మహావిష్ణువు చెప్పాడు. 55

అగస్త్యః

ఆవిర్భూతం తదా దృష్ట్వా కేశవం వనపోత్రిణమ్ । కన్యాస్తౌషీదముం కోలం హర్షసంపుల్లమానసా ॥౫౬

అలా తన కన్నుల ఎదుట మహావరాహావతారంతో  ఆవిర్భవించిన  విష్ణువును చూసి  ఆ జాంబవతి  ఆనందంతో ఉప్పొంగే మనస్సుతో ఈ విధంగా స్తుతి చేసింది.

జామ్బవతీ స్తుతి:

మహావరాహ భవ తే దంష్ట్రిణే భగవన్నిదమ్

మనః ప్రయచ్ఛ త్వయ్యేవ భక్తిషు వ్యభిచారిణీమ్ ॥౫౭

ఓ గొప్ప వరాహమా! దయచేసి నీ కోరలతో నన్ను ప్రసన్నంగా చూడు. ఓ ప్రభూ!నీపై నా మనసు నిశ్చల భక్తితో ఉండేటట్లు అనుగ్రహించు.

త్వమేవ బ్రహ్మ పరమమాపో జ్యోతిరనామయమ్ ।

నీవే బ్రహ్మవి.పరమ సత్యానివి. సర్వోన్నతమయిన జలానివి. వెలుగువి మరియు ఆరోగ్యదాయకునివి.( మోక్షదాయకునివి)

అనిలశ్చ తథా వ్యోమ భవాన్ భక్తైర్నిగద్యతే ||౫౮

నీ భక్తులు నిన్ను వాయువుగా, ఆకాశంగా వర్ణించారు.

యచ్చ కిఞ్చిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపి వా |

అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణస్స్థితః |

మొత్తం విశ్వంలో కనిపించేది ఏదైనా, లేదా వినిపించేది ఏదైనా. వాటన్నింటి లోపల మరియు వెలుపల ప్రతిదానిలోనూ భగవంతుడు నారాయణుడు వ్యాపించి ఉన్నాడు ( ఇది నారాయణ సూక్త మంత్రము.)

ఉత్సన్నాన్ సకలాన్వేదానుద్ధర్తుం ప్రార్థితో బుధైః | అవతీర్ణో భవేద్యస్తు తస్మై మత్స్యాత్మనే నమః | | ౬౦

జ్ఞానులు వేదాలను ఉద్ధరించమని నిన్ను అడిగారు. దాని కొరకు మత్స్యావతారమెత్తిన నారాయణునికి నా నమస్కారములు .

విశేషాలు

ప్రళయం తరవాత బ్రహ్మ సృష్టించాలనుకొన్నాడు. కాని వేదాలు అపహరణకు గురయ్యాయని తెలుసుకొని శ్రీమహావిష్ణువును ప్రార్థించాడు. వేదాలను అపహరించిన సోమకుడనే రాక్షసుడు మహా సముద్ర గర్భంలోకి వెళ్లాడు. అప్పుడు విష్ణువు మహా మత్స్య రూపం ధరించి సముద్రాన్ని వెతికాడు. . సోమకునికి ఆ , మహా మత్స్య రూపంలోని విష్ణువుకి యుద్ధం సాగింది. చివరకు నారాయణుడు ఆ రాక్షసుడి ఉదరాన్ని చీల్చి వేదాలను, దక్షిణావర్త శంఖాన్ని బ్రహ్మ వద్దకు తీసుకు వచ్చాడు. వేదాలను బ్రహ్మకు అప్పగించి, శంఖాన్ని తాను గ్రహించాడు. వేదాలను అపహరించడమంటే జ్ఞాన ప్రకాశాన్ని అదృశ్యం చేయాలనే యత్నమని పెద్దలు చెప్పారు. అందువలన ఈ భాగంలో జ్ఞానులు వేదాలను ఉద్ధరించమని అడిగారని వ్యాసుడు పేర్కొన్నాడు.

భారాసహ ధరిత్రీతి ప్రేరితో దైవతైస్స్వయమ్ | అవతీర్ణో భువః పృష్ఠే తస్మై కూర్మాత్మనే నమః | | ౬౧

దేవతలచే ప్రేరేపింపబడి బరువైన మందరపర్వతాన్ని మోయటానికి ధరించిన కూర్మావతారానికి నా ప్రణామాలు అర్పిస్తున్నాను. . 61

విశేషాలు

క్షీర సముద్ర మథన సమయంలో విష్ణుమూర్తి దేవతలపై గల ప్రేమను వెల్లడిచేస్తూ, మహాకూర్మావతారం ధరించాడు. . ఆ పెద్ద తాబేలు పై డిప్ప చక్కగా గట్టిగా లక్ష యోజనాల వెడల్పుతో ఉంది.( యోజనమంటే 08 మైళ్లు) లోపలికి బయటకు కదలాడే పెద్ద తల, కమలాల వంటి చక్కనైన రెండు కళ్ళు ఉన్నాయి. అలా బహు అందమైన రూపం కల మహావిష్ణువు చిన్న ముత్తంచిప్పంత సులువుగా, మారి మందర మహాపర్వతాన్ని అవలీలగా తన వీపుపై పైకెత్తాడు.

సముద్రాన్తరితాం భూమిముద్ధర్తుం బ్రహ్మణేరితః | మిమక్షువార్నిధిం తస్మై వరాహవపుషే నమః ||౬౨

సముద్రం లోపల మునిగిన భూమిని ఎత్తమని బ్రహ్మ కోరగా వరాహ రూపం ధరించిన స్వామికి నమస్కారాలు అర్పిస్తున్నాను.

విశేషము

మూడవ అవతారము వరాహావతారము. జయవిజయులను వైకుంఠ ద్వారపాలకులు ఋషులశాపమువలన హిరణ్యాక్ష హిరణ్యకశిపులను రూపములు ధరించారు. హిరణ్యాక్షుని వలన పాతాళములోపలికి పోయిన భూమిని కాపాడుటకొరకు ఈ అవతారమును స్వామి ధరించాడు..

ప్రహ్లాదప్రీతయే దైత్యరాజం హన్తుం య ఉద్యతః | ఆవిర్భూతో మణిస్తమ్భే తస్మై సింహాత్మనే నమః |

ప్రహ్లాదునిపై ప్రీతితో  రాక్షసుల రాజును చంపుటకు నరసింహ అవతారం ఎత్తిన నారాయణునికి నా నమస్కారాలు

రత్నాల స్తంభంపై కనిపించిన ఆ నరసింహానికి నా ప్రణామాలు అర్పిస్తున్నాను

విశేషము

నాల్గవఅవతారము నృసింహావతారము . హిరణ్యకశిపుని సంహరించుటకు  ఈ అవతారమును స్వామి ధరించాడు..

.

మహాబలేస్తు దైత్యస్య మానభఙ్గాయ యః పుమాన్ | యాచతే త్రిపదం లోకే నమస్తే వామనాత్మనే ||౬౪

బలవంతుడైన రాక్షసుడి గౌరవాన్ని నాశనం చేయుటకొరకు వామనావతారం ధరించి ఈ లోకంలో మూడు పాదాల స్థలం అడిగిన వామన రూపివైన నీకు నా ప్రణామాలు అర్పిస్తున్నాను.

విశేషము

అయిదవ అవతారము వామనావతారము. బలిచక్రవర్తి తన పరాక్రమముతో  దేవతలను స్వర్గమునుండి వెళ్లగొట్టి సృష్టిక్రమమునకు ఆటంకము కల్గించాడు. అందువలన భగవానుడు వామనావతారమును ధరించి  3 అడుగుల దానము తీసుకుని, బలిని పాతాళలోకమునకు పంపించాడు.

యః ప్రీతయే పితుర్యుద్దే కర్తుం క్షత్రవిదారణమ్ |

బిభర్తి పరశుం హస్తే తస్మై రామాత్మనే నమః ||౬౫

తండ్రి యొక్క ఆత్మ శాంతి కొరకు చేతిలో గొడ్డలి పట్టుకున్న ఆ పరశురామావతారానికి నా ప్రణామాలు అర్పిస్తున్నాను

విశేషము

అధార్మికమయిన క్షత్రియశక్తిని నాశనము చేసి  ప్రపంచములో శాంతిని, ధర్మమును స్థాపించిన స్వామివారి ఆరవ అవతారము పరశురామావతారం.

పితుర్వచనరక్షార్థం సభార్యస్సానుజో వనమ్ |

సంప్రాప్తో యస్తు భగవాన్ తస్మై రామాత్మనే నమః ||

తండ్రి మాటను పాటించడానికి భార్య, తమ్ముడితో కలిసి అడవికి వెళ్ళిన ఆ రామావతారానికి నా ప్రణామాలు అర్పిస్తున్నాను. 66

విశేషము

ఆదర్శజీవితమునకు ఒక నిదర్శనము చూపించుట కొరకు ఈ రామావతారమును స్వామి ధరించాడు..

ప్రలమ్బాసురభఙ్గాయ ప్రార్థితో యస్స్వయం హలమ్ | బిభర్తి యో విష్ణురూపః తస్మే రామాత్మనే నమః ||౬౭

ప్రలంబుడు అనే రాక్షసుడిని నాశనం  చేయుటకు  బలరామావతారాన్నిస్వీకరించిన నారాయణునికి నా ప్రణామాలు అర్పిస్తున్నాను 67

జన్మక్షణే చతుర్బాహుం శఙ్ఖచక్రగదాధరమ్ । నన్దో నననదయన్ దృష్ట్వా తస్మై కృష్ణాత్మనే నమః

జన్మించిన సమయంలో శ్రీ కృష్ణునికి శంఖం, గద పట్టుకున్న నాలుగు చేతులు ఉన్నాయి. నందుడు అతన్ని చూసి సంతోషించాడు. ఆ శ్రీ కృష్ణావతారానికి నమస్కారాలు68।

సర్వానపి మహాదైత్యాన్ హేషయా భీషయన్ బలీ ।

యః పుమానావిరభవత్తస్మై కల్క్యాత్మనే నమః ।। ౬౯

ఆ మహాబలవంతుడైన ప్రభువు తన వాహనమైన గుర్రపు సకిలింతలతో  మహా రాక్షసులందరినీ భయపెడతాడు.కల్కి  స్వరూపునిగా అవతరించబోయే  పరమాత్మునికి నా గౌరవపూర్వక ప్రణామాలు అర్పిస్తున్నాను. . 69. 69

విశేషము

‘‘10 వ అవతారము కల్కిఅవతారము.ఈ అవతారమింకను ఆవిర్భవింపలేదు. కలియుగము 4 లక్షల32 వేలసంవత్సరముల పరిమాణము కలిగియున్నది. అదిప్పటికి 5 వేలసంవత్సరములు మాత్రమే గడచినది. కావున కల్కిఅవతార ముద్భవించుటకు కింకను చాలాకాలము గడువవలసి యున్నది. ఇంకను ధర్మమునకు సంపూర్ణమగు గ్లాని సంభవింపలేదు. అనేకవిధములగు భగవద్విభూతులవలనను, ఆవేశావతారములవలనను, ఋషులవలనను, కొంతవరకు ధర్మము కాపాడబడుచునే యున్నది. కావున, ఇప్పుడే భగవంతుడు అవతరింపవలసిన ఆవశ్యకత కలుగలేదు. ఆ అవతార ముద్భవించెడి సమయమునందు దేశకాలపరిస్థితు లెట్లుండునో ఆవిషయమంతయును శ్రీమద్భాగవతాది గ్రంథములందు స్పష్టముగా వివరింపబడి యున్నది. అప్పుడు ప్రపంచమంతయును మహాపాపభూయిష్టమై యుండును. మనుష్యులందరును ధర్మచ్యుతులగుదురు. రాజులు ప్రజాపీడన మొనర్చెదరు. మ్లేచ్ఛులకు రాజ్యాధికారము లభించును. అప్పుడు కల్కి అవతార ముద్భవించి మ్లేచ్ఛులను, పాపులను నాశనమొనర్చి పుణ్యాత్ములను రక్షించును. అతడవతరించినపిదప మరల సత్యయుగము ప్రారంభించి ధర్మము వ్యాపించును’’ అని పెద్దలు కల్క్యవతారమును గూర్చి వివరించారు.

అగస్త్యః

బ్రహ్మా త్వం చాప్యణుస్త్వం హి సత్యస్త్వం సవితా విభుః । త్వం సోమస్త్వం యమోరుద్రస్త్వం విష్ణుస్త్వం ప్రజాపతిః ।। ౭౦

నీవు పరబ్రహ్మావి.. , అణువువి, సత్యమువి, సూర్యుడవు, సర్వశక్తిమంతుడవు. నువ్వే చంద్రుడు, యముడు, రుద్రుడు, విష్ణువు మరియు ప్రజాపతివి.

త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వం బ్రహ్మా త్వం ప్రజాపతిః । నమః ప్రసీద భగవన్ మహాపోత్రివపుష్మతే ।।౭౧

నీవే యజ్ఞస్వరూపునివి., నీవే వషట్కారానివి, నీవే బ్రహ్మవి, నీవే ప్రజాపతివి. మహా వరాహ రూపం ధరించిన ఓ ప్రభూ! నాపై దయ చూపండి,

విశేషము

1.వషట్కారం

అగ్నిలో హవిస్సులు వేసేటప్పుడు “వషట్” అనే శబ్దాన్ని ఉచ్చరిస్తారు. . స్వాహా, స్వధా శబ్దాల వలెనే ఇది కూడా పరమేశ్వర వాచకం. దేవ హవిర్దాన వాచకం కూడా. వషట్కారం చేసే ఋత్విక్కుగానీ, హోత గానీ తప్పనిసరిగా పఠించవలసిన ఒక మంత్రం ఉంది. వషట్ అన్నప్పుడు హోత/ ఋత్విక్కు వాక్ ప్రాణాపానాలు శరీరం నుంచి వెలుపలకు వస్తాయి. కనుక వాక్ ప్రాణాపానాలు తనలోనే సుఖంగా ఉండాలని ప్రార్థిస్తూ

“వాగోజః సహ ఓజోమయి ప్రాణాపానో” అనే మంత్రాన్ని పఠించవలసి ఉంటుంది. హోత/ ఋత్విక్కు తన ఓజస్సు, సహస్సు తగ్గకుండా తీసుకొనే జాగ్రత ఇది. ఓజస్సు, సహస్సు వషట్కారానికి రెండు అంశలు. (సహః అంటే బలిమి, ఓర్పు అనే అర్థాలు ఉన్నాయి.)

2. త్వం యజ్ఞస్త్వం

సబ్రహ్మనశివ స్సహరి స్సేన్ద్రస్సోక్షరః పరమస్స్వరాట్ || అను మంత్రపుష్పభాగాన్ని ఈ స్తుతి గుర్తుకు తెస్తున్నది.  ఆ సూక్ష్మాగ్నిస్వరూపుడు నల్లని వర్షించు మేఘముల మధ్య ఉన్న మెఱుపుతీగవలె ప్రకాశిస్తుంటాడు. ఆ మహా పురుషుడు నీవారధాన్యపు ముల్లువలె అణువువలె మిగుల సూక్ష్మమైన పసుపువర్ణము గల్గి ప్రకాశిస్తుంటాడు. అత్యంత సూక్ష్మాకారముగనున్న ఆ అగ్నిజ్వాల మధ్య ఆ పరమాత్మ స్పష్టముగ ఉన్నాడు. ఆ పరమాత్మయే చతుర్ముఖుడగు బ్రహ్మ. ఆయనయే శివుడు. ఆయనయే విష్ణువు. ఆయనయే ఇంద్రుడు. ఆయనయే అక్షరుడు(నాశనము లేనివాడు) అని వ్యవహరింపబడువాడు. ఆయనయే శుద్ధచిద్రూపము (జ్ఞానరూపము). ఆ పరమాత్మయగు నారాయణుడే స్వయంప్రకాశకుడు.

ఘోరాయ దంష్ట్రిణే తుభ్యం వాసుదేవాయ విష్ణవే |
ఇతి స్తుతో హృషీకేశో వరాహవపురాస్థితః ||౭౨
ప్రాహ జామ్బవతీం కన్యాం ప్రసన్నేనాన్తరాత్మనా |

“ఓ ప్రభువైన వాసుదేవా, విష్ణుమూర్తీ !  నీవు అందరికంటే భయంకరమైనవాడివి, కోరలు కలిగినవాడివి.’ అని ఈ విధముగా జాంబవతి స్తుతి చేయగా వరాహరూపము ధరించిన  ఇంద్రియములను జయించిన ఆ హృషీకేశుడైన శ్రీమహావిష్ణువు ప్రసన్నుడై జాంబవతి తో ఇలా అన్నాడు.

శ్రీభగవాన్ -
కన్యే తే కాఙ్క్షితం జానే ఫలిష్యతి తపస్తవ ||౭౩
ఓ కన్యా !  నీ మనసులో ఉన్నది నాకు తెలియును. నువ్వు దేనికొరకు తపస్సు చేయుచున్నావో అది ఫలిస్తుంది.61

కృష్ణం భర్తారమాసాద్య భవతీ సుఖమేష్యతి | భద్రే వనమిదం రామే తవాభీష్టకృతో భవేత్ ||౭౪
శ్రీకృష్ణుని భర్తగా పొంది నువ్వు సుఖముగా ఉండగలవు.ఓ శుభురాలా ! ఈ భయంకరమైన అరణ్యము నీకు ఆనందాన్ని కలిగించగలదు.

.భవేయుః ఫలినో మర్త్యాః వాసాజ్జామ్బవతీ పదే |
ఈ జాంబవతి ఆశ్రమంలో నివసించువారి కోర్కెలు తీరును.

శిలాపుష్కరిణీతీరే వసన్నహమనిన్దితే ||౭౫ భక్తేభ్యో వాఞ్ఛితం దద్యాం తోషితస్స్నానవైభవాత్ |
ఈ శిలా పుష్కరిణి తీరములో నేను నివసిస్తుంటాను. ఇక్కడ స్నానం చేసిన  భక్తుల కోర్కెలను నేను తీర్చుచుందును.

అయనే విషువే చైవ గ్రహణే చన్ద్రసూర్యయోః ||౭౬ అత్ర స్నానం ప్రకుర్వాణో జీవన్ముక్తో న సంశయః|

దక్షిణాయన పుణ్యకాలంలో, రాత్రి పగలు సమానంగా ఉండు రోజులలో సూర్య చంద్ర గ్రహణ సమయములలో ఈ శిలా పుష్కరిణిలో స్నానము చేసిన వారు జీవన్ముక్తులవుతారు.

పితౄన్ వై దేవతా వాపి ప్రీణయన్తి నరోత్తమాః ||౭౭ వరాహతీర్థసలిలైహ్యేతేన నిరయైషిణః |

దేవతలను పితృదేవతలను ఈ వరాహతీర్థపు నీటితో సేవించిన వారు స్వర్గాన్ని పొందుతారు.

తపాంసి కుర్వతాం తత్ర యాని కానిచిదేవ వా || ౭౮ నరాణాం క్షీణపాపానాం మయి భక్తిః ప్రజాయతే |

ఈ శిలా పుష్కరిణిలో స్నానము చేసిన వారికి పాపములను తొలగిపోయి నాయందు భక్తి అధికమవుతుంది.

అగస్త్యః

ఇత్యుక్త్వాన్తర్దధే దేవః పోత్రిరూపీ జనార్దనః ||౭౯

ఈ విధముగా చెప్పి వరాహ రూపంలో ఉన్న జనార్ధనుడు మాయమయ్యాడు.

ఋషీణాం మిషతామేవ సనకాదిస్స్తుతస్తదా | కన్యాపి భగవన్నేత్రపాత్రభూతా నిరఞ్జనా ||౮౦ వరం లబ్ధ్వాశ్రమపదం ప్రాయాజ్జామ్బవతో మునేః |

అప్పుడు ఋషులు చూస్తుండగా సనకుడు మరియు ఇతరులు ప్రశంసించబడ్డారు. భగవంతునికి ప్రీతిపాత్రురాలు మరియు తమోగుణాది మాలిన్యము లేని ఆ జాంబవతి వరమును పొంది తన తండ్రి ఆశ్రమానికి తిరిగి వెళ్ళింది.

తత్ర యస్స్నాతి మధ్యాహ్నే ప్రాతఃకాలేఽథవా మునే || ౮౧ స మహాకోలసాన్నిధ్యాత్ సర్వాన్ కామానవాప్నుయాత్|

ఈ వరాహ తీర్థములో ఉదయం కానీ మధ్యాహ్నము కానీ స్నానము చేసిన వారికి ఆ వరాహ స్వామి దయతో అన్ని కోర్కెలు నెరవేరుతాయి

తత్ర స్నానం సదా కార్య సద్భిస్సర్వహితేరతైః || ౮౨ పాణ్డవోదేవతస్స్నాయాత్ యత్ర పార్థస్తపస్యతి |

వరాహ తీర్థమున స్నానము చేసిన తరువాత పాండవ తీర్థములో అందరి సంక్షేమం కోసం అంకితభావంతో కృషిచేసే సత్పురుషులు ఎల్లప్పుడూ స్నానము చేయాలి . ఎందుకంటే అక్కడ అర్జునుడు తపస్సు చేసాడు. పాండవులు స్నానం చేసారు.

తస్య ప్రాగ్దక్షిణే పార్శ్వే హనూమత్తీర్థముత్తమమ్ ||౮౩ అధ్యాస్తే భగవాన్ యత్ర శఙ్ఖచక్రాభిలాషవాన్ | ప్రదక్షిణం ప్రకుర్వీత తత్ర స్నాత్వా బుధోత్తమః | హనూమదనుమత్యా వై తస్యాపి క్షేమమిచ్ఛతః ||౮౪

ఆ పాండవ తీర్థానికి తూర్పులో ఉత్తమమైన హనుమత్తీర్థం ఉన్నది .అక్కడ శంఖ చక్రాలు ధరించిన హనుమంతుడు కొలువై ఉన్నాడు .ఆ హనుమంతునికి ప్రదక్షిణం చేసి భక్తులు ఆయన అనుగ్రహాన్ని పొందటానికి ప్రయత్నించాలి.

ఇతి బ్రహ్మకైవర్తే ఉత్తరఖణ్డే భృగుపరాశరసంవాదే ఘటికాచలమాహాత్మ్యే త్రయోదశోఽధ్యాయః ||

ఇక్కడితో  బ్రహ్మ-కైవర్త పురాణంలోని ఉత్తరఖండంలో భృగువు మరియు పరాశరుని మధ్య జరిగిన సంభాషణలో ఘటికాచల మాహాత్మ్యంలో పదమూడవ అధ్యాయం పూర్తి అయినది.                                    +++++

శ్రీ శివాయ గురవే నమః

ఘటికాచలనివాసాయ శ్రీ నృసింహాయ నమః

బ్రహ్మకైవర్త పురాణములో ఉన్న  శ్రీఘటికాచల మాహాత్మ్యపు  పద్నాలుగవ  అధ్యాయము

(మూల శ్లోకము మరియు తాత్పర్య విశేషాలతో)

పుండరీక తీర్థము

1-10

శ్రీఘటికాచలమాహాత్మ్యమ్

చతుర్దశోఽధ్యాయః

అగస్త్యః

తస్యావిదూరే ధర్మాత్మా దక్షిణే గిరిసానుని ।

 కాపిలః కురుతే తీవ్రం తపః పఞ్చాగ్నిమధ్యగః ।। ౧

అగస్త్యుడు వామనునితో ఇంకా ఇలా చెబుతున్నాడు. ఆ హనుమత్ తీర్థానికి దక్షిణంలో ఉన్న ఒక కొండ లోయలో కశ్యపుడు అనేటువంటి వాడు ఐదు అగ్నుల మధ్యన నిలబడి తీవ్రమైన తపస్సు చేస్తున్నాడు.

**విశేషాలు**

అంతరిక్షంలో సూర్యుడు ఉండగా నాలుగు దిక్కులలో నాలుగు అగ్నులు ఉంచి, వైదిక కర్మను ఆచరించే వ్యక్తిని అగ్నిహోత్రి అంటారు. ఆహవనీయం తూర్పు దిక్కున, దక్షిణాగ్ని దక్షిణ దిక్కున, గార్హపత్యం పశ్చిమ దిక్కున ఏర్పాటు చేయడం సంప్రదాయం. సభ్య, అవసథ్యాగ్నులకు ఈశాన్య దిక్కును చెప్పారు. ఉత్తర దిక్కు విషయంలో ఏదీ చెప్పలేదు. అలా తన చుట్టూ అగ్నులను ఉంచుకొని తపస్సు చేసేవాడిని  పంచాగ్ని అంటారు.

తస్య ధర్మవ్రతా నామ భార్యా ప్రియమనువ్రతా ।
ప్రభేవ భాసామధిపం చన్ద్రికేవ సుధాకరమ్ ॥౨*

ఆ కశ్యపుని భార్య పేరు  ధర్మవ్రత. ఆమె భర్తకి ప్రియము కలిగించేటట్లు నడుచుకునే పతివ్రత. ఆమెతో వెలుగులకు ప్రభువులా , అమృతముతో నిండిన చంద్రునిలా భర్త ప్రకాశించాడు.

లక్ష్మీరివ మహావిష్ణుం పార్వతీవ మహేశ్వరమ్ ।
సరస్వతీవ బ్రహ్మాణం భర్తారముపజీవతి ॥౩

లక్ష్మీదేవి విష్ణువుని, పార్వతీదేవి పరమశివుని, సరస్వతీదేవి బ్రహ్మను ఎలా వీడకుండా ఉంటారో అలా ఈ ధర్మవ్రత కూడా భర్తని ఎప్పుడూ విడిచి ఉండేది కాదు.

పిటకం గృహ్య బాహుభ్యాం ఖనిత్రం చ యశస్వినీ ।
కశ్యపస్య మునేః పత్నీ మూలమానేతుమభ్యగాత్ ॥౪

కీర్తిమంతురాలైన ఆ ధర్మ వ్రత ఒక రోజు ఒక గంపని, ఒక గునపాన్ని తీసుకొని కందమూలాలు తీసుకురావడానికి కొండపైకి వెళ్ళింది.

పార్శ్వేషు పర్వతేన్ద్రస్య తథాగ్రేషు తపస్వినీ ।
వనమేత్య తతస్తత్ర కన్దానాం ఖననాయ వై ॥౫

ఆ తపస్విని  పర్వతాల నలువైపులా మరియు శిఖరాలపై  తిరిగి చివరకు  దుంపలు  తవ్వడానికి కొండపై ఉన్న ఒక  అడవికి చేరుకొన్నది..

శృఙ్గే కస్మింశ్చిదద్రేస్తు కపిత్థానాం శతంశతమ్ ।
దృష్ట్వా గృహీతుకామా తాన్ వ్యాఘ్రం క్వాపి దదర్శ హ॥౬

ఆ కొండ శిఖరముపై వందల కొలది వెలగ పండ్లని చూసి వాటిని తీసుకొనుటకు ఆమె ప్రయత్నిస్తుండగా, అక్కడ ఆమె ఒక పులిని చూసింది.

సాపి గృహ్య కపిత్థానాం ఫలాని సుబహూన్యపి ।
నిధాయ పిటకే సాధ్వీ గమనాయోపచక్రమే ॥౭

పులిని చూసినప్పటికీ  ఏమీ బెదరకుండా చాలా చక్కగా ఉన్న ఆ వెలగ పండ్లను గంపలోకి ఎత్తుకొని ఆ పతివ్రత తిరిగి ఆశ్రమానికి బయలుదేరటానికి సిద్ధమయింది.

అగస్త్యః
మహావ్యాఘ్రః క్షుధార్తస్తు తాముపేత్య యశస్వినీమ్ ।
మహాక్రోధో వనే తత్ర వాక్యమేతదువాచ హ ॥౧౮

ఆకలితో ఉన్న ఆ పెద్దపులి ఆ కీర్తిమంతురాలైన ధర్మవ్రతను సమీపించి మహా క్రోధముతో ఆమెతో ఈ విధముగా అన్నది

వ్యాఘ్రః -
కశ్యపస్య మునేస్తత్ర ధర్మపత్ని యశస్వినీ ।
ఫలమేకం మహాస్వాదు ప్రదేయం క్షుధితాయ మే

అమ్మా ! కశ్యప ధర్మపత్నీ !  ఓ కీర్తిమంతురాలా !  నాకు బాగా ఆకలి వేయుచున్నది. నువ్వు సేకరించిన రుచికరమైన వెలగపండ్లలో ఒక దానిని నాకు ఇవ్వవలసినది.

న చేద్దాసి ధర్మిష్ఠే సఫలాం త్వామనిన్దితే ।
క్షుధార్తహృదయోఽహం చ భక్షిష్యే విజనే వనే ॥౧౦

ఓ ధర్మాత్మురాలా!ఒకవేళ నువ్వు నాకు రుచికరమైన వెలగపండు ఇవ్వకపోతే ఆకలిగొన్న హృదయముగల నేను ఎవరూ లేని ఈ పర్వతపు వనములో నిన్ను నా ఆహారంగా స్వీకరిస్తాను.

11 -20

ధర్మవ్రతా -
కాలే ఫలానాం గ్రహణే ప్రతిజ్ఞాతమిదం మయా ।
అమూని రసవన్త్యస్మై కాశ్యపాయ దదామ్యహమ్ ॥౧౧

అప్పుడు ధర్మవ్రత ఆ పెద్దపులితో ఇలా అన్నది. ఈ కాలానికి సంబంధించిన వెలగ పండ్లను సేకరించి నా భర్త అయిన కశ్యప మహామునికి సమర్పిస్తానని నేను ప్రతిజ్ఞ చేసి ఉన్నాను. కనుక ఈ పండ్లు అన్నింటిని కశ్యప మహామునికి మాత్రమే నేను ఇవ్వగలను.

అతో నైకం ఫలమపి ప్రదేయమితి మే మతిః ।
అన్యతో గచ్ఛ భద్రం తే భవితా మృగసత్తమ ॥౧౨

కనుక ఒక్క పండు కూడా నీకు నేను ఇచ్చుటకు అశక్తురాలిని. కనుక ఓ మృగ శ్రేష్ఠమా! వేరొక చోటికి వెళ్లి నీ ఆహారాన్ని వెతుకు. నీకు శుభం కలుగుతుంది.

అథవా యత్త్వయోక్తం వై ఖాదేయం సఫలామిమామ్ ।
తత్పశ్చాదహమభ్యేత్య కరవై భవతాదయమ్ ॥౧౩

లేకపోతే నువ్వు చెప్పినట్లుగా మంచి ఫలములకొరకు అన్వేషించి ఆకలి తీర్చుకో. అలా కాకుంటే ఇంటికి వెళ్లి, నా భర్త ఆకలి తీర్చిన తరువాత నేను నీ దగ్గరకు వస్తాను.

దత్వా ఫలాని మునయే కాశ్యపాయ క్షుధాయుజే ।
చరితార్థం వ్రతం కృత్వా భవన్తం ప్రీణయే తతః । ।౧౪

-ఆకలిగా ఉన్న కాశ్యప మహామునికి ఈ పండ్లను ఇచ్చిన తరువాత నా వ్రతము పూర్తి అవుతుంది. అప్పుడు నువ్వు కోరినట్లుగా, నీకు సంతోషము కలిగేటట్లు నన్ను నువ్వు తినవచ్చు.

వ్యాఘ్రః
గచ్ఛ సుశ్రోణి భద్రన్తే మా విలమ్బం సహామి తే।
జీవామి ఘటికాం పశ్చాత్ప్రాణాంస్త్యక్ష్యే భవత్కృతే ॥ ౧౫

ఆ మాటలు విన్న పెద్దపులి ఆమెతో ఇలా అన్నది" తల్లి నువ్వు త్వరగా వెళ్లి రావలసినది. నేను ఆలస్యము భరించలేను. ఒక ఘడియలో(=ఇరువది నాలుగు నిమిషముల కాలము) నువ్వు రాకుండా ఉంటే నేను ప్రాణాలను విడిచిపెడతాను"

ధర్మవ్రతా
పుణ్డరీకసరస్తీరే తపస్యతి మహాతపాః ।
ఇతోఽవిదూరే ధర్మాత్మా కాశ్యపః ప్రయతాత్మవాన్ ॥౧౬

ఆ మాటలు విన్న తరువాత ధర్మవ్రత ఇలా అన్నది. కాశ్యప వంశములో జన్మించిన పవిత్రుడైన నా భర్త పుండరీక సరస్సు యొక్క తీరములో తపస్సు చేస్తున్నాడు. ఆ సరస్సు ఇక్కడికి చాలా దూరంలో ఉన్నది.

వ్యాఘ్రః

పుణ్డరీకస్య సరసి క్వాస్తే సానుని శంస మే

యత్నాత్తే వాదకథయా మాం ప్రీణయసి ధర్మిణీ ||౧౭

ఓ ధర్మాచారురాలా! ఆ పుండరీక సరస్సు ఎక్కడ ఉన్నది? నాకు వెంటనే చెప్పవలసినది. ఆ పేరు వినటంతోటే నాకు చాలా ఆనందం కలుగుతున్నది.

నిర్యాతుకామాః ప్రాణా మేం క్షుధార్తస్య తపస్వినీ |

పుణ్డరీకస్మృతిర్వాత్ర కిల తేషాం ప్రజాయతే || ౧౮.

నిజానికి ఆకలితో బయటికి పోవుచున్న నా ప్రాణములు నువ్వు "పుండరీక సరస్సు" అని చెప్పిన వెంటనే మరలా నా శరీరములోనికి ప్రవేశించినవి. నేను మరలా బతికాను. చాలా ఆనందంగా ఉన్నది.

అగస్త్యః

తపస్వినీ తమాలోక్య విస్మయాపన్నమానసమ్ |

స్వయం చ విస్మయవ్యగ్రమానసా వ్యాఘ్రమబ్రవీత్ ||౧౯

ఆ పులి యొక్క మాటలను విన్న తపస్విని అయిన ధర్మవ్రత చాలా ఆశ్చర్యపడినది.ఆశ్చర్యపడు తన మనస్సుతో ఆమె పులితో ఈ విధముగా అన్నది.

కిమిదం శంస వృత్తాన్తం స్వస్తి తేఽస్తు మృగోత్తమ |

యత్స్మృత్యా హర్షసంపుల్లమానసో జాయతే భవాన్ | ౨౦

ఓ పులిరాజా!! ఆ పుండరీక సరస్సు పేరు విన్న వెంటనే నువ్వు సంతోషముతో వికసించిన మనస్సు కలిగినవానివిగా కనపడుచున్నావు .ఎందుకు? ఆ వృత్తాంతము నాకు చెప్పవలసినది.

21 -30

వ్యాఘ్రః

నర్మదాతటినీతీరే పురా ద్విజర్షయస్తపః |

చక్రిరే బహుభిశ్శిష్యైః సహ సద్భిరనిన్దితాః || ౨౧

పులి ఆ ధర్మవ్రతకు ఈ విధముగా వృత్తాంతం చెప్పుట మొదలు పెట్టినది. పూర్వం నర్మదా నది ఒడ్డున ఋషులు, బ్రాహ్మణులు తపస్సు చేసేవారు.

వారు తమ శిష్యులతో పాటు నింద లేకుండా ఆచారాలను నిర్వహించేవారు.

అథ తేషామయత్నేన పురాణం పాపమాగతమ్ ।

తర్కవిద్యా మూర్తిమతీ ప్రాప్య పాపీయసాం నృణామ్।। ౨౨

వారిని ఒకసారి వారి పూర్వ పాపము పీడించుట మొదలుపెట్టింది. పాప ప్రభావముచే ఆ మునులు కుతర్కవాదము(సహేతుకముగాని వాదము) చేయుట మొదలుపెట్టారు.

సన్నిధిం తపసాం విఘ్నం కర్తుం సముపచక్రమే ।

తత్ర మే తాతపాదస్తు విష్ణుభక్తో నిరంకుశః ।।౨౩

ఆ కుతర్కవాదము వారి తపస్సుకి విఘ్నము కలిగించినది. అటువంటి వారున్నచోటికి విష్ణుభక్తుడు అయిన మా తండ్రి అనుకోకుండా వచ్చాడు.

నామ్నా ధర్మవ్రతో బ్రహ్మ ఋషిదేవాదుపాగతః ।

నర్మదాపయసి స్నాత్వా సన్ధ్యామన్వాస్య మధ్యమామ్ ।।౨౪

ధర్మవ్రతుడు అని మాతండ్రిగారి పేరు. ఆయన బ్రహ్మర్షుల సమీపానికి వచ్చాడు. నర్మదా నదిలో స్నానము చేసి మధ్యాహ్న సంధ్యను అతడు ముగించాడు.( పూర్వాహ్ణ, మధ్యాహ్న, అపరాహ్ణాలు మూడు సంధ్యలు. సంధ్య కాలంలో చేసే అనుష్ఠానం సంధ్యావందనం.)

సభార్యస్సహ శిష్యేణ దక్షిణం పదమేయివాన్।

తత్రాశ్రమే జననాం వై ఋషీణాం భావితాత్మనామ్ ।।౨౫

ఆ ధర్మవ్రతుడు తన భార్యా శిష్యులతో కలిసి దక్షిణ ప్రాంతంలో ఉన్న ఆశ్రమానికి చేరుకున్నాడు.ఆ ఆశ్రమంలో పరిపూర్ణత సాధించిన ఋషులు ఉన్నారు.

దృష్ట్వా ధర్మవ్రతో దేవాత్తీరబాలద్రుమానగాత్ ।

షట్త్రింశత్ తత్ర వర్తన్తే తర్కవిద్యామత క్రమాత్ ।।౨౬

ఆ చిన్న చిన్న చెట్లతో కూడుకొని కొండపై ఉన్నఆశ్రమంలో కలతపడుతున్న బుద్ధికల 36 మంది తర్కవిద్యా(=తర్కమును అనగా వాదమును) తెలుపు విద్య. న్యాయశాస్త్రము, న్యాయదర్శనము) నిపుణులను మా తండ్రి చూసాడు.

అద్రాక్షీద్వ్యాకులధియో ద్విజాన్ బాలానతన్ద్రితాన్ ।

వీక్ష్య ధర్మభృతాం శ్రేష్ఠస్తాతపాదస్తటద్రుమాన్ ।।౨౭

మా తండ్రి తర్క విషయంలో ఆందోళన చెందుతున్నవారిని , పిల్లతనంతో సోమరితనం ఉన్న బ్రాహ్మణులను చూసాడు.ధర్మాన్ని నిలబెడుతున్నట్లుగా ఉన్న నది ఒడ్డున ఉన్న ఉత్తమమైన చెట్లను మా తండ్రి చూసాడు.

పాలాశహరణార్థం వై ప్రాయాచ్ఛిష్యేణ భార్యయా ।
తానాసాద్య తతస్తత్ర దురుక్తిశ్రవణే మనః ॥౨౮
నిజానికి మా తండ్రి ధర్మవ్రతుడు మోదుగు పుల్లల సేకరణ కొరకు భార్యతో, శిష్యులతో  అక్కడికి వెళ్ళాడు. వాటిని సేకరించే సమయములో ఆ 36 మంది చేసే కుతర్కవాదములను యథాలాపంగా విన్నాడు.

చకార ఘటికామాత్రం పత్రాహరణదుర్మనాః ।
మనశ్చక్రే స తేషాం వై విద్యాయా శ్రవణే సుధీః ॥౨౯
'మోదుగు పుల్లలను గడియ సేపు ( 24 నిమిషాల కాలము) సేకరించిన సమయములో  వారి కుతర్కములను బుద్ధిమంతుడైన మా తండ్రి విన్నాడు.

పఞ్చయజ్ఞాధికరణే న చక్రే తాపసవ్రతే ।
శిష్యోఽపి గౌరవీంరీతిమభజత్ క్షణతస్తదా ॥౩౦
పదేపదే వారి కుతర్కములను వినుట వలన పంచయజ్ఞములు, తపస్సు వ్రతాలు ఇలాంటివి చేయాలా? నిజంగా వీటి వల్ల ఏమన్నా ఫలితం ఉంటుందా? ఇటువంటి  సందేహములు మా తండ్రికి కలిగి అప్పటినుండి అవి చేయటం మానివేసాడు.

విశేషాలు

పంచయజ్ఞములకు మూడు పట్టికలు ఇలా ప్రసిద్ధాలు.

(అ.) 1. స్నానము, 2. దానము, 3. తపస్సు, 4. హోమము, 5. పితృయజ్ఞము.

(ఆ.) 1. జపము, 2. హోమము, 3. బలి( దేవతలకు ఇచ్చునది), 4. బ్రాహ్మణ శ్రేష్ఠుని పూజించుట, 5. పితృతర్పణము.( పితరులనుద్దేశించి చేయు జలతర్పణము)

"అహుతం చ హుతం చైవ తథా ప్రహుతమేవ చ, బ్రాహ్మ్యం హుతం ప్రాశితం చ పంచయజ్ఞాన్ ప్రచక్షతే" [మనుస్మృతి 3-73]

(ఇ.) 1. అగ్నిహోత్రము, 2. దర్శపూర్ణమానము(ఒక చిన్న యాగము), 3. చాతుర్మాస్యము,( ఆషాఢ శుద్ధము మొదలు కార్తిక శుద్ధము వరకు అనగా నాలుగు మాసములుచేయు ఒక వ్రతము.) 4. పశుయాగము, 5. సోమయాగము.

భార్యానిబోధితోఽప్యాసీత్ సర్వకర్మణ్యలోలుపః ।
మాసమాత్రం స్థితస్తత్ర వేదవేదాన్తవర్జితః ॥౩౧
భార్య కూడా ప్రోత్సహించుట వలన  నా తండ్రి సత్కర్మలు చేయుటయందు ఆసక్తిని కోల్పోయి ఒక నెల రోజులు వేద వేదాంత విద్యలకు(ఋగ్వేదాది నాలుగు వేదములు. శిక్షా మొ॥ ఆరు వేదాంగాలు.) దూరమయ్యాడు.

కేవలం తర్కవిద్యాసు మనశ్చక్రే హ్యనన్యధీః ।
మాసమాత్రోషితస్తత్ర దురుక్తిపథగోచరః ॥౩౨

కేవలము తర్కవిద్యలోనే మనస్సును నిలిపి మహా పండితుడైన నా తండ్రి కు తర్కముచే చెడు మాటలు మాట్లాడసాగాడు.

అన్వహం తాస్స్మరన్నేవదాస్యామివ బభూవ హ|
కస్యచిత్త్వథ కాలస్య పశ్చాచ్ఛిష్యేణ ధీమతా ||౩౩
ఎప్పుడూ కూడా ఆ కు తర్కములందే మనస్సు నిలుపుట  వలన మా తండ్రిగారి శిష్యుడు కూడా కుతర్కవాదిగా మారిపోయాడు.

అభ్యయాద్ భార్యయా సార్ధం గురోర్వ్యాసస్య సన్నిధిమ్|
పరాశరాత్మజో దృష్ట్వా దురుక్తిం వక్తుచేతసమ్||౩౪
ఇలా ఉండగా ఒకసారి తన భార్య తోటి శిష్యులతో కలిసి నా తండ్రి తన గురువైన వ్యాసుని దగ్గరకు వెళ్ళాడు. పరాశర కుమారుడయిన వ్యాసుడు   నా తండ్రి యొక్క దుష్టపు మాటలను విని, మాట్లాడాలని నిశ్చయించుకున్నాడు.

శిష్యం ధర్మవ్రతం నామ సశిష్యమిదమాహ సః |
విహాయ వైదికీవిద్యాం దుర్విద్యామాశ్రితోఽసి యత్ ||౩౫
వ్యాసుడు ధర్మవ్రతుడు అనే శిష్యుడిని మరియు అతని శిష్యుడిని ఉద్దేశించి ఇలా ప్రసంగించాడు. ఓ ధర్మవ్రతా! నువ్వు వైదిక విద్యలను వదిలి చెడు విద్యలను ఆశ్రయించావు.

సహశిష్యస్సభార్యస్త్వం పుణ్డరీకో భవిష్యసి |
తత్ర వాసోఽపి భవితా హ్యపి జాతేశ్చ సంస్మృతిః || ౩౬
అందువలన నువ్వు భార్య శిష్యులతో కలిసి పెద్దపులిగా మారతావు. అలా పులిగా మారినప్పటికీ నీకు పూర్వ జన్మ జ్ఞానం ఉంటుంది.
యత్రాస్తే భగవాన్ శైలే యోగానన్దనృకేసరీ |
జీర్ణపర్ణాశిషు ప్రాయశ్చరత్సు తప ఉత్తమమ్ ||౩౭
యోగానంద నరసింహ స్వామి ఉన్న కొండపై నువ్వు ఉండు .ఎండిన ఆకులు తింటూ తపస్సు చేయి.

అవ్యగ్రవైష్ణవ భక్తిం దృష్ట్వా తు ప్రాదురేష్యతి |
కేషుచిత్త్వథ కాలేషు నీతేషు నరకేసరీ ||౩౮
ఏకాగ్రముగా నువ్వు చేయుచున్న విష్ణు భక్తితో కూడిన తపస్సు వలన శ్రీ నరసింహ స్వామి ప్రత్యక్షమై నీకు వరాలను ఇస్తాడు

ప్రసన్నో భవతో లోకాన్ సంప్రదాస్యతి మాస్తు భీః
ఇతి సంబోధితస్తేన వ్యాసేన స మహర్షిణా || ౩౯
నీయందు అనుగ్రహించి నరసింహస్వామి  నీకు ఉత్తమ లోకాలను ఇస్తాడు. భయపడకు. వ్యాసుడు ఈ విధముగా చెప్పిన తర్వాత....

40 -50

ప్రణమ్య లజ్జావనతః ప్రాయాదేనం నగోత్తమమ్ ।
సప్తర్షి హృదయే కృత్వా సశిష్యస్సహ భార్యయా ॥౪౦

తాను చేయుచున్న దుష్టపు పనులకు తండ్రి సిగ్గుపడి వ్యాసునికి నమస్కారము చేసి, సప్తర్షులను హృదయములో తలుచుకుంటూ తపస్సు కొరకు ఈ కొండ దగ్గరకు వచ్చాడు

విశేషాలు

సప్తర్షులు

మరీచి, అంగిరసుడు, పులహుడు, వసిష్ఠుడు, అత్రి, పులస్త్యుడు, క్రతువు అనువారు. (ఒక పట్టిక)

కశ్యపుడు, అత్రి, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, జమదగ్ని, వసిష్ఠుడు (రెండవ పట్టిక)

నృహరిధ్యానమాసీనః కేవలం కురుతే తపః ।
జీర్ణపర్ణజలాహారః కన్దమూలఫలాదనః ॥ ౪౧

నరసింహ స్వామి ధ్యానముతో ఎండిన ఆకులు కందమూలాలు తింటూ నా తండ్రి ఈ కొండపై తపస్సు చేసాడు.

న భయం కురుతే నృణాం దుష్టానామమృతాశనః ।
కాలేన మహతా తత్ర తపఃకరణశీలయోః ॥౪౨

సహజముగా పులి అయినప్పటికీ ఎవరిని భయపెట్టకుండా కేవలము సాత్వికమైన బుద్ధితో నా తండ్రి చాలా కాలం తపస్సు చేసాడు.

పుత్రోఽహమభవం వ్యాఘ్రః దమ్పత్యోర్భావితాత్మనోః ।
పుణ్డరీకవనే వ్యాఘ్రః పోషితోఽహం దినే దినే । । ౪౩

ఆ విధముగా పులి రూపాలలో ఉన్న సమయంలో నా తల్లిదండ్రులకు నేను జన్మించాను. పుండరీక వనములో పూర్వజన్మ జ్ఞానము కలిగిన వాడినై ప్రతిరోజు వారిచే పోషింపబడ్డాను.

జాతిస్మరః ఫలాన్యేవ భుజన్ బాల్యం ప్రణీతవాన్ ।
తపస్యతోస్తయోరత్ర కాలేన మహతా హరిః । ౪౪

కేవలము పళ్ళను మాత్రమే తింటూ జాతిని గుర్తు చేసుకొంటూ నా బాల్యాన్ని గడిపాను. తీవ్రమైన తపస్సు చేయుచున్న నా తల్లిదండ్రుల ఎదుట కొంతకాలానికి నరసింహుడు ప్రత్యక్షమయ్యాడు.

ప్రాదుర్భూతస్తదా సర్వాన్ ప్రాపయత్పదమాత్మనః ।

అహం వాగీయతే శైలే సర్వైరపి ద్విజర్షభః ||౪౫

బ్రాహ్మణశ్రేష్ఠులచే పర్వతముపై  నుతించబడే  నరసింహుడు  ప్రత్యక్షమై అందరినీ తన సమీపానికి చేర్చుకొన్నాడు.

పుణ్డరీకస్స ధర్మాత్మా పుణ్యశ్లోకో జితేన్ద్రియః |

యస్మిన్నృసింహః ప్రత్యక్షం ప్రాప సర్వైరగోచరః | | ౪౬

ఎచ్చట ధర్మాత్ముడై పుండరీకమై (పులి) జితేంద్రియుడై, నా తండ్రి  తపస్సు చేసాడో  అక్కడ నరసింహుడు దర్శనమిచ్చాడు.. ఎవరికీ కనబడని నరసింహస్వామి నా తండ్రి ఎదుట ప్రత్యక్షమయ్యాడు.

ఆత్మనామాఙ్కితం తీర్థం పుణ్డరీకోప్యకల్పయత్|

మజ్జతామత్ర పుంసాం వై జాతిస్స్మృతిరుదేష్యతి | |౪౭

తన పేరు మీదుగా ఒక పుండరీక తీర్థాన్ని కల్పించాడు .ఎవరు ఈ పుండరీక తీర్థములో స్నానము చేస్తారో వారికి పూర్వజన్మ స్మృతి కలుగుతుందని నరసింహ స్వామి చెప్పాడు

ధర్మవ్రతః

సాధు దైవాదుపక్రాన్తం కర్మవృత్తమిదం సతా |

ఇదానీం ప్రీణయే శ్రోత్రం భవద్వాక్యామృతేన వై ||౪౮

ఈ మాటలు విన్న ధర్మవ్రత సంతోషించింది. నీ వాక్యామృతముతో నేను చాలా ఆనందించానని చెబుతూ పులిని ఇట్లు ప్రశ్నించెను.

కథం జాతిస్స్మరస్త్వం హి వ్యాఘ్రభావం భజన్నపి |

వదత్వమధునేదం హి చిరాయ తు మరాజితే ||౪౯

''నీవు పులివి కదా ! ఈ  పూర్వజన్మజ్ఞానము నీకెలా  కలిగినది?'' అను ధర్మవ్రత  ప్రశ్నకు సమాధానముగా పెద్దపులి ఇలా చెప్పింది..

## పుండరీక పూర్వజన్మ వృత్తాంతము

వ్యాఘ్రః

ఆసీద్గన్ధర్వనగరే రాజా చిత్రరథస్త్వితి |

చతుర్దశాభవన్ పుత్రాస్తస్య గన్ధర్వస్వామినః ||౫౦

పూర్వము గంధర్వ నగరములో  చిత్రరథుడను రాజు ఉన్నాడు. ఆ గంధర్వ స్వామికి 14మందికుమారులు.

51  -60

ఇల్వాలవఙ్కావఙ్కాశ్చ మణికణ్ఠో మణిధ్వనిః |

చిత్రభానుశ్చిత్రకేతుర్మణిభద్రో మహారథః | | ౫౧

వారి పేర్లు వరుసగా ఇల్వాలుడు, అవంకుడు, వంకుడు, మణికంఠుడు, మణిధ్వని,  చిత్రభానుడు, చిత్రకేతువు, మణిభద్రుడు, మహారథి.

శ్వేతకేతూ రశ్మికేతూ రత్నకేతుశ్చ ధూసురః ।
ఏతేషామగ్రజో నామ్నా కలకణ్ఠో మహావ్రతః ॥ ౫౨

శ్వేతకేతువు, రశ్మికేతువు,  రత్నకేతువు,  ధూసురుడు, కలకంఠుడు. వీరిలో కలకంఠుడు పెద్దవాడు.

సర్వానపి సభామధ్యే స్థాపయన్ చిత్రమాప్తవాన్ ।
పితా వైణికమాహూయ నారదం మునిసత్తమమ్ ॥౫౩

ఆ చిత్రరథుడు ఒకసారి  అందరినీ సభామధ్యమములో ఉంచి,  సన్యాసులలో అగ్రగణ్యుడైన వీణావిద్వాంసుడైన నారదుని పిలిచాడు. వారికి నారదుని గురువుగా చేసాడు.

విద్యాభ్యాసమయం తస్మై ప్రదదౌ మధురస్వరమ్।
తదాహం నారదముఖాత్తన్త్రీకణ్ఠోత్థితాన్ స్వరాన్ ॥౫౪
నిషాదాదీన్సప్త తన్త్రౌ జాతవాంస్సుహృదాంతతః ।

ఆ నారదుడు  వారికి  అభ్యసించడానికి కొంత  సమయం ఇస్తూ  మధురమైన స్వరాలను నేర్పాడు.  అప్పుడు వారితోపాటు  నేను కూడా నారదుని నోటినుండి వీణనుండి వచ్చిన నిషాదము మొదలగు స్వరములను తెలిసికొన్నాను.

విశేషాలు

*సప్త-స్వరములు*

(అ.) 1. నిషాదము, 2. ఋషభము, 3. గాంధారము, 4. షడ్జము, 5. మధ్యమము, 6. ధైవతము, 7. పంచమము.

"నిషాదర్షభ గాంధార షడ్జ మధ్యమ ధైవతాః, పంచమశ్చేత్యమీ సప్తతంత్రీ కంఠోత్థితాః స్వరాః" [అమరకోశము 1-6-1]

1. షడ్జమము. –
   "స, రి, గ, మ, ప, ద, ని" అను సప్తస్వరములలో  మొదటి స్వరము. షట్ నాసిక, కంఠము, ఉరస్సు, తాలువు, జిహ్వ, దంతములు (6) ఆరు స్థానములందు జనించు ధ్వని.  దీనికి సంకేత అక్షరము "స". సప్తస్వరములలో ఋషభాది (6) ఆరు స్వరములును షడ్జము ఆధారముగా పుట్టాయి. అందుకే దీనికి ఈ  పేరు.
2. ఋషభము –
   సప్తస్వరములలో  రెండవ స్వరము.  దీనికి సంకేత అక్షరము "రి". ఈ స్వరము యొక్క ధ్వని ఋషభము (ఎద్దు) యొక్క ధ్వని వలె గంభీరత్వముగా హృదయమున ప్రవేశించునదిగా ఉండును. కనుకనే ఋషభ స్వరమని పేరు వచ్చింది. వాడుకలో "రిషభము" అని చెబుతారు.
3. గాంధారము –
   సప్తస్వరములలో  మూడవ స్వరము. దీనికి సంకేత అక్షరము "గ".

4. మధ్యమము

సప్తస్వరములలో  నాలుగవ స్వరము. దీనికి సంకేత అక్షరము "మ".

5. పంచమము –

సప్తస్వరములలో  అయిదవ స్వరము. దీనికి సంకేత అక్షరము "ప". ఇది ఏడింటిలోనూ అయిదవ స్థానమున ఉన్నది కనుక పంచమము అని పేరు.

6. ధైవతము –

సప్తస్వరములలో  ఆరవ స్వరము. దీనికి సంకేత అక్షరము "ద".

7. నిషాదము –

"స, రి, గ, మ, ప, ద, ని" అను సప్తస్వరములలో  ఏడవ స్వరము . దీనికి సంకేత అక్షరము "ని", షడ్జము నుండి  ధైవతము వరకు గల ఆరు ( స్వరములను ముగించు స్థానమున ఉన్నది కనుక దీనికి  నిషాదమని పేరు.

శ్రుతిభేదాః కథఙ్కారమాసన్ కీదృగ్విధాస్త్విమాః | | ౫౫

నారదుడు "శ్రుతి భేదములు ఎలా వస్తాయి? " అని నన్ను  ప్రశ్నించాడు.

జానన్నపి దురుక్త్యాహం తదా దూషితవాన్ శ్రుతీః |

నాకు తెలిసినప్పటికీ  అహంకారముతో వేదాలను  నిందించాను.

తదా మాం వీక్ష్య సక్రోధో మునివైణికసత్తమః ||

ఇదమాహ సతాం మధ్యే గన్ధర్వాణాం చ పశ్యతామ్ ||౫౬

అప్పుడు కోపముతో వైణిక విద్వాంసుడయిన  నారదుడు  గంధర్వులు మొదలయినవారు చూస్తుండగా ఇలా అన్నాడు.

నారద:

సాఙ్గోపాఙ్గమధీత్యాపి స్వరభేదాన్తథా శ్రుతీః |

దురుక్త్యా దూషయసి యత్తద్వ్యాఘ్రోభవ భూతలే ||౫౭

"దుర్మార్గుడా! సంపూర్ణముగా స్వర భేదాలను వేదాలను చదువుకొన్నప్పటికీ వేదాలను  నిందిస్తున్నావు. అందువలన నీవు భూమిపై పెద్దపులి వగుదువు గాక.

హనూమచ్ఛైలపాదేషు చరిష్యతి మమాజ్ఞయా |

పుణ్డరీకస్య పుత్రత్వం ప్రాప్య జాతిస్మరో భవ ||౫౮

పెద్దపులిగా జన్మించి ఈ హనుమత్ పర్వత ప్రాంతంలో తిరుగుతూ ఉండెదవు గాక! పులికి జన్మించినప్పటికీ నువ్వు పూర్వజన్మ జ్ఞానము కలిగి ఉంటావు అని నారదుడు చెప్పాడు.

60 -70

కశ్యపస్య మునేర్భార్యాం నితరాం వేదయిష్యసి ।
శరీరాదేవ వైయాఘ్రాన్ముచ్యసే త్వమనిన్దితః ॥౬౦

ఎప్పుడైతే కశ్యపుని యొక్క భార్యకు ఈ శాపవృత్తాంతం తెలుస్తుందో అప్పుడు నువ్వు ఈ పులి జన్మ నుండి విముక్తుడవయి నింద లేని వాడివి అవుతావు.

హిరణ్మయవపుర్ధీమాన్ హిరణ్మయవిమానగః ।
పునరభ్యేష్యతి భవాన్ తాపసీవచసో బలాత్ ॥౬౧

బంగారపు వర్ణము గల శరీరమును ధరించి బంగారపు విమానములో ఎక్కి ఆ కశ్యపుని భార్య యొక్క వచనముల చేత తిరిగి ఇక్కడికి రాగలవు.

గన్ధర్వః-
ఇతి శాపం విశాపం చ కృత్వా వైణికపుఙ్గవః ।
ఉద్వేగవాన్ వినిష్క్రమ్య యథాగతమవిన్దత ॥ ౬౨

అని వీణా విద్వాంసుడైన నారద మహర్షి నాకు శాపము, శాప విమోచనము రెండు చెప్పి వెళ్లిపోయాడు.

పశ్చాద్య విష్ణుభక్త్యా భవత్యా దర్శనాదహమ్ ।
రూపం జీర్ణ చ వైయాఘ్రం త్యక్త్వే దైవతకం శ్రయే ॥ ౬౩

అమ్మా! కశ్యప పత్నీ! ఇప్పుడు విష్ణుభక్తుల సాంగత్యంతో, నీ యొక్క దర్శనంతో ఈ పులి జన్మ నుంచి నేను విముక్తుడిని అయి దేవతలను ఆశ్రయిస్తాను .

పశ్యన్త్యాం కశ్యపమునేర్ధర్మపత్న్యాం తదా వనే ।
పుణ్డరీకం వపుర్హిత్వా గాన్ధర్వ రూపమాదదే ॥౬౪

అని పై విధంగా చెబుతూ కశ్యప మహాముని ధర్మపత్ని దర్శనముతో అప్పుడు తన పూర్వపు రూపాన్ని విడిచిపెట్టి గంధర్వ రూపాన్ని ఆ పులి ధరించింది .

స తదా లోకయన్తీన్తాం విస్మయాపన్నమానసామ్ ।
తాపసీం వీక్ష్య ధర్మాత్మా కలకణ్ఠస్తదాఽవదత్ । ౬౫

ఆ తరువాత ఆ పులిరూపం నుంచి గంధర్వునిగా మారిన కలకంఠుడు నిండు మనసుతో కశ్యపుని యొక్క భార్య ధర్మవ్రతను చూసి ఇలా అన్నాడు.

కలకణ్ఠః

శుక్తేరివ మణిర్దేవి మూషాయా ఇవ కాఞ్చనమ్ ।

ముక్తోఽహమద్య మాం పశ్య సా త్వం వాత్సల్యవీక్షణా ॥ ॥ ౬౬.

ముత్యపు చిప్ప నుంచి ముత్యము బయటికి వచ్చి ప్రకాశిస్తున్నట్లుగా, మూషమునందు  మలినములను పొగొట్టుకొని  బంగారము ప్రకాశిస్తున్నట్లు నేను ఈరోజు విముక్తుడనయి స్వేచ్ఛగా ఉన్నాను. దయచేసి నన్ను వాత్సల్యముతో చూడు.

విష్ణుభక్తానుషఙ్గేణ వపుషోఽస్మాత్ప్రమోచితః

స్వస్తి వోఽస్తు గమిష్యామి యథాగతమనిన్దితే ॥౬౭

మీ వంటి విష్ణుభక్తుల అనుబంధం వలన నేను ఈరోజు శరీరము నుండి విముక్తి పొందాను. నీకు శుభము కలుగుగాక! నేను  ఎలా వచ్చానో అలాగే  వెళ్ళిపోతాను.

ధర్మవ్రత

కలకణ్ఠం తతో ధ్యాత్వా దృష్టేర్దూరపథం గతమ్ ।

ఆశ్చర్యపథమాపన్నా భర్తురాశ్రమమభ్యగాత్ ॥౬౮

తరువాత ధర్మవ్రత  కలకంఠుని గూర్చి ఆలోచిస్తూ  తన దృష్టిమార్గము  నుండి అతను  దూరంగా వెళ్ళిపోయిన తరువాత, జరిగినదానికి ఆశ్చర్యపడుతూ ఆమె తన భర్త ఆశ్రమానికి చేరుకుంది.

సర్వం నివేద్య భర్త్రే వై హ్యవిలమ్బనకారణమ్ ।

పుణ్డరీకసరస్తీరే నివాసమకరోత్ తదా ॥ ౬౯

ఆకశ్యప మహాముని భార్య ధర్మవ్రత  ఆశ్రమానికి తిరిగి వెళ్లి భర్తకు జరిగిన వృత్తాంతము చెప్పినది.తన ఆలస్యానికి కారణం వివరించింది ఆ కశ్యప దంపతులు ఆ తరువాత పుండరీక సరస్సు ఒడ్డున నివాసము ఏర్పరచుకున్నారు.

శ్రీనృసింహపదాకాఙ్క్షీ కశ్యపో నామ ధర్మవిత్।

వైష్ణవాగమనం మన్యే శిష్యాన్ వ్యాఖ్యాపయత్యసౌ । ౭౦

ధర్మజ్ఞాని అయిన కశ్యపుడు శ్రీ నృసింహస్థానాన్ని ఆశ్రయించాలని  కోరుకుంటూ ,అతిథులుగా వైష్ణవుల రాక కొరకు ఎదురుచూస్తూ తన శిష్యులకు శాస్త్ర వ్యాఖ్యానములు చేయుచూ కాలము గడిపాడు. 70

71 -80

యస్స్నాతి నియతో విద్వాన్ పుణ్డరీకసరోజలే

జాతిస్మరస్స వై లోకం వైష్ణవం ప్రాప్నుయాన్నరః । ॥౭౧

ఈ పుండరీక తీర్థములో నియమముతో స్నానము చేసిన వారు పూర్వ జన్మ జ్ఞానము కలిగిన వారై విష్ణు లోకానికి వెళ్లగలరు.

వృశ్చికం యాతి మార్తాణ్డే యస్స్నాతి విజితేన్ద్రియః|
సముక్తకిల్బిషో జీవన్ముక్తో భవతి వై నరః | ౭౨

సూర్యుడు వృశ్చిక రాశిలో ఉన్నప్పుడు ఈ పుండరీక సరస్సు ఒడ్డున దానము చేసిన వారు పాపముల నుండి విముక్తులై జీవన్ముక్తులవుతారు. (జ్ఞానము గొని సమస్తబంధములను త్యజించి,బ్రహ్మనిష్ఠులైముక్తి పొందినవారు./ జీవించి యుండియు ముక్తి పొందిన వారు జీవన్ముక్తులు)

కఙ్కేలయశ్చ న్యగ్రోధా మధూకా ఉత్పలా ధవాః |
వసన్తస్తరవస్తత్ర పఞ్చతే ఫలశాలినః ||౭౩

అశోకవృక్షాలు, మర్రి చెట్లు, ఇప్ప చెట్లు,  నల్లసుగంధిపాల చెట్లు,   ఉమ్మెత చెట్లు అను అయిదు.ఫలాలను ఇచ్చే చెట్లు ఆ పుండరీక సరస్సు ఒడ్డున ఉన్నాయి.

తస్య దక్షిణపార్శ్వస్థశృఙ్గరాజో విరాజతే |
నిషేవ్యస్సతతం సర్వైర్బ్రహ్మర్షిభిరనుత్తమైః ||౭౪

ఈ పుండరీక సరస్సు కు దక్షిణ భాగంలో ఒక శిఖరం ఉన్నది. తమకంటే ఉత్తములు లేనిసర్వోత్తములయిన  అనేకమంది ఋషులు దానిని సేవిస్తుంటారు.

శైలస్య దక్షిణే పార్శ్వ ప్రతిభాతి శిలావటా|
శోభన్తే వివిధా యత్ర శాఖాశ్శతసహస్రశః | ||౭౫

ఈ శిఖరానికి దక్షిణములో ఒక అనేక వందలు, వేలుగా  శాఖోపశాఖలు కలిగిన  పెద్ద మర్రిచెట్టు ఉన్నది.

అవష్టభ్య తమవ్యగ్రా ఋషయస్సప్తశో మునే |
లమ్బమానాస్తపస్యన్తి నృహరిర్ధ్యానతత్పరాః ||౭౬

సప్తర్షులు ఆ మర్రిచెట్టును ఆశ్రయించి ఉండగా, ఆ మర్రి చెట్టు కొమ్మలకు వేలాడుతూ అనేకమంది ఋషులు శ్రీ నరసింహ స్వామిని ధ్యానిస్తూ ఉంటారు.

ఊర్ధ్వీభవన్మహాశాఖాభుజాలఙ్కృతవల్కలాః |
దృశ్యతే యస్తపస్వీవ జటాభిః పరిమణ్డితః | ||౭౭

పెద్ద కొమ్మలు మరియు చేతులతో అలంకరించబడిన బెరడు చెట్లు అక్కడ పైకి లేచాయి. అవి జడల జుట్టుతో అలంకరించబడిన సన్యాసులులా కనిపిస్తున్నాయి.

గిరేః ప్రదక్షిణం కృత్వా స గన్తవ్యో మనీషిణా।
యత్రాస్తే భగవాన్ పక్షీ గరుత్మాన్ పన్నగాశనః ॥ ౭౮
సర్పములను ఆహారముగా స్వీకరించు గరుత్మంతుడు కొలువైన ఈ వృక్షానికి, నరసింహ పర్వతానికి ప్రదక్షిణం చేసే సమయంలో నమస్కరించాలి.

తస్య పశ్చిమసానుస్థో దృశ్యతే భగవాన్ మునిః।
తపశ్చరతి ధర్మాత్మా సపత్నీకస్సుదారుణమ్ ॥౭౯
దీనికి పశ్చిమ దిక్కులో  ధర్మసుతుడు అనేటువంటి ఒక ముని తన భార్యతో కలిసి తపస్సు చేస్తున్నాడు.

తస్య శిష్యా మహాత్మానో నిత్యం ధర్మసుతా మునే ।
శుశ్రూషణపరాస్తత్ర సునన్దాద్యా వసన్తి హి ॥౮౦
ఆ ధర్మసుతుని శిష్యులైన సునందుడు మొదలయినవారు గురు సేవకు అంకితమై అక్కడ నివసిస్తున్నారు.

రాజర్షయో ద్విజన్మానో యూథశః పఙ్క్తిపావనాః ।
సభార్యాశ్చ తపస్యన్తి స్వస్వధర్మనిషేవిణః ॥౮౧
రాజర్షులు, తాముకూర్చున్న వరుసలను పవిత్రము చేయు  శ్రాద్ధభోజనార్హ బ్రాహ్మణులు అనేకులు సమూహాలుగా   ఇక్కడ ఉండి తమతమ భార్యలతో  తపస్సు చేస్తున్నారు.  మరియు వారి ఆచార విధులను నిర్వర్తిస్తుంటారు.

అగ్న్యగారోదితా ధూమా అభ్రమార్గావలమ్బినః।
దృశ్యన్తే వాతసఞ్ఛిన్నాః పయోముచి నిలీయ వై ॥౮౨
హోమగుండముల నుండి వచ్చే పొగ ఆకాశమర్గానికి వ్యాపిస్తూ గాలిచే చెదరగొట్టబడి  వేలాడుతున్న మేఘాలులా కనిపిస్తాయి.

గిరిప్రదక్షిణకృతాం నరాణాం భావితాత్మనామ్ ।
శ్రమం హరన్తి తత్రత్యా మారుతా భవ్యగన్ధినః ॥౮౩
ఇక్కడ ప్రదక్షిణము చేసే  బ్రహ్మన్ని తెలుసుకొన్నవారు, సన్యాసులు, ధ్యానం వల్ల పవిత్రమైన ఆత్మ కలిగినవారు అయిన మానవులకి అద్భుతమైన వాసననలను  వెదజల్లు గాలులు అలసటను పోగొడతాయి.

ఇతి బ్రహ్మకైవర్త ఉత్తరఖణ్డే భృగుపరాశరసంవాదే ఘటికాచలమాహాత్మ్యే చతుర్దశోఽధ్యాయః ॥
ఇక్కడితో  బ్రహ్మ-కైవర్త పురాణంలోని ఉత్తరఖండంలో భృగువు మరియు పరాశరుని మధ్య జరిగిన సంభాషణలో ఘటికాచల మాహాత్మ్యంలో పద్నాలుగవ అధ్యాయం పూర్తి అయినది.                    +++++

శ్రీ శివాయ గురవే నమః

ఘటికాచలనివాసాయ శ్రీ నృసింహాయ నమః

బ్రహ్మకైవర్త పురాణములో ఉన్న  శ్రీఘటికాచల మాహాత్మ్యపు  పదిహేనవ  అధ్యాయము

(మూల శ్లోకము మరియు తాత్పర్య విశేషాలతో)

గరుడాశ్రమము

1-10

పఞ్చదశోఽధ్యాయః

అగస్త్య:

తస్యోత్తరదిశి జ్ఞానశాలినాం భావితాత్మనామ్ ।

ఆశ్రమేషు మునిః కశ్చిదాస్తే శ్రీమాన్నిశాకరః ।। ౧

అగస్త్యుడు వామ దేవునితో ఇలా అన్నాడు. ఆ మర్రి చెట్టుకి ఉత్తరం వైపు జ్ఞానవంతులైన మహామునుల ఆశ్రమాలు ఉన్నాయి.ఆ ఆశ్రమాలలో నిశాకరుడు అను ఒక ముని ఆశ్రమం కూడా ఉన్నది.

తత్రాశ్రమపదే సాధ్వీ కీర్తనీయా మునీశ్వరైః|
నిశాకరో రోహిణీం చ రోహిణీ చ నిశాకరమ్ ||౨

నిశాకరుడు (చంద్రుడు) రోహిణీ నక్షత్రముతో కలిసి ఆనందంగా ఉన్నట్లుగా, ఆ నిశాకరుడు పతివ్రత అయిన తన భార్య రోహిణి అను ఆమెతో తన ఆశ్రమములో కలిసి కాపురం చేస్తున్నాడు.

అనువ్రతా ధర్మపత్నీ తథా చ మునిపుఙ్గవః |
తస్య శిష్యోఽస్తి మతిమాన్నామ్నా కౌత్స ఇతి స్మృతః || ౩

ఆ రోహిణి భర్తను ఎప్పుడు అనుసరించే ధర్మ పత్ని. ఆ నిశాకర మహర్షికి కౌత్సుడు అను పేరుగల ఒక బుద్ధిమంతుడైన శిష్యుడు ఉండేవాడు.

గురోశ్చ గురుపత్న్యాశ్చ సదా శుశ్రూషణే రతః |
పిత్రోరివ తయోర్నిత్యం ప్రేష్యతాం ప్రయయౌ తథా ||౪

ఆ కౌత్సుడు తన గురువు యొక్క గురుపత్ని యొక్క సేవలో నిరంతరము ఆసక్తి కలిగినవాడై ప్రతినిత్యము వారిని తల్లిదండ్రుల వలె సేవిస్తూ ఉండేవాడు.

స కదాచిత్ పురా విద్వానేణం దృష్టం వనాన్తరే |
నివేదయామాస మునిః కౌత్సస్తు మహదద్భుతమ్ ||౫

ఆ విద్వాంసుడైన కౌత్సుడు ఒకనాడు అడవిలో ఒక అద్భుతమైన జింకను చూసి వచ్చి తన గురువు గారికి ఈ విధముగా నివేదించాడు

కౌత్స:

భవతా ప్రేరితస్స్వామిన్ అహమేకో వనం గతః |
ఇహావిదూరే కన్దానాం మూలానాం ఖననాయ చ ||౬

ఓ గురుదేవా !మీరు పంపగా నేను ఒక్కడినే ఇక్కడికి సమీపముగా ఉన్న అడవిలో కందమూలాలు తవ్వితెచ్చుటకు వెళ్లాను.

స్నాతుకామో మహాతీర్థ స్వామిన్ పాపవినాశనే |
గత్వా మాధ్యాహ్నికం కర్మ నిర్వర్త్య గతవాంస్తథా| ||౭

సంధ్యావందనము చేయుటకు ముందుగా స్నానము కొరకు కోరిక కలిగినవాడినయి అడవిలో దగ్గరగా ఉన్న ఒక పాపవినాశన తీర్థంలో మధ్యాహ్నమునకు సంబంధించిన స్నానసంధ్యలు పూర్తి చేసాను.

మృగః కోఽపి మయా దృష్టో నానావర్ణవిశోభితః |
స్నాతుకామో మహాతీర్థే దర్శనీయతనూరుహః ||౮

అంతలో ఆ మహా తీర్థ సమీపములో అనేక రంగులు కలిగిన విచిత్రమైన అందమయిన ఒక జింక నాకు కనిపించినది.

స్వామిన్నదృష్టపూర్వోఽసౌ శ్రుతపూర్వో న మే మృగః ।
మయా ముహూర్త దృష్టో వై జపవ్యాజేన తిష్ఠతా ||౯
ఓ గురుదేవా! అటువంటి జింకను గురించి ఇంతకుముందు ఎప్పుడు నేను వినలేదు. కనలేదు. నేను నేను ఒక క్షణకాలము దానిని చూసి జపము చేసుకొనుటకు సిద్ధపడితిని.

స తు పీత్వోదకం తత్ర నిర్గన్తుం బహిరుత్థితః ।
ఇతస్తతోఽవలోకం చ చకార హరిణోత్తమః । । ౧౦
ఆ ఉత్తమమయిన జింక కూడా ఆ మహా తీర్థములో నీటిని తాగి తన ఇష్టము వచ్చిన వైపు వెళ్ళుటకు బయలుదేరుతూ ఇటు అటు ఒకసారి తన చూపు సారించింది.

11 -20

తత్రాన్తరే పూర్వశృఙ్గదిశానిర్గతవానిహ ।
ముఖరీకృతదిగ్భాగప్రభావస్సింహహుంకృతిః । । ౧౧
ఇంతలో తీర్థమునకు దగ్గరగా ఉన్న కొండ యొక్క తూర్పు శిఖరము నుండి దిక్కులు నిండిపోయేటట్లుగా చాలా పెద్దగా ఒక సింహగర్జన వినిపించింది.

హుంకృతానుపదో సింహో వినిర్గత్య గుహాన్తరాత్ ।
విలోలమాననయనం ప్రాస్పృశం మృగమఞ్జసా ||౧౨
గర్జన వినిపించిన వెంటనే ఆ కొండ గుహ నుండి ఒక సింహం బయటికి వచ్చింది. . జింక భయపడి మూర్ఛపోయి కింద పడిపోయింది. భయపడుతున్న చంచలమైన కన్నులు కలిగిన ఆ జింకను ఓదార్చటానికి నేను ఆ జింకను తాకాను.

స్పర్శనానుపదం స్వామిన్నదృష్టో మృగసత్తమః ।
మృగరాజోఽపి తద్భూత్వా కేవలం రాక్షసం వపుః || ౧౩
నేను అలా తాకిన మరుక్షణమే ఆ జింక కనపడకుండా పోయింది. ఆ సింహము కూడా ఒక రాక్షస శరీరాన్ని ధరించింది

అనన్తరమహాలోకః కేశమాత్రపరిష్కృతః ।
సమూహీభూయరశ్మీనాం శతం శాన్త ఇవాభవత్ || ౧౪
తరువాత రాక్షస శరీర స్థానంలో ఒక వెంట్రుకల కుప్ప కనిపించినది. ఆ వెనువెంటనే అద్భుతమైన వందలాది కిరణాలు కలిగిన జ్యోతిస్స్వరూపాన్ని పొంది,ఆ సింహం గొప్పగా ప్రకాశించింది.

అథాన్తరిక్షే సూర్యాణాం ద్వాదశానామివ క్షణమ్ |
మణ్డలాని విమానానాం దృష్టాని సుబహూన్యపి | ౧౫

ఆ పిమ్మట ఆకాశములో 12 మంది సూర్యులు ఒకేసారి వెలుగుతున్నట్లుగా అనిపించినది .అనేకమైన విమానాలు తిరుగుతున్నట్లుగా కనిపించింది.

**విశేషము**

**ద్వాదశాదిత్యులు**

అదితి సంతానం కనుక ఆదిత్యులు అంటారు. దేవతలలో ముఖ్యులు ద్వాదశాదిత్యులు.  వీరి పేర్ల గురించి నాలుగు పట్టికలు మన గ్రంథాలలో ఉన్నాయి.

మొదటి పట్టిక ప్రకారం- వరుణుడు, సూర్యుడు, సహస్రాంశుడు, ధాత, తపనుడు, సవితృడు, గభస్తి, రవి, పర్జన్యుడు, త్వష్ట, మిత్రుడు, విష్ణువు. రెండవ పట్టిక ప్రకారం - అర్యముడు, మిత్రుడు, అరుణుడు, అర్కుడు, భగుడు, ఇంద్రుడు, వివస్వంతుడు, పూషుడు, పర్జన్యుడు, త్వష్ట, విష్ణువు, అజఘన్యుడు. మూడవ పట్టిక - ఇంద్రుడు, ధాత, పర్జన్యుడు, త్వష్ట, పూషుడు, అర్యముడు, భగుడు, వివస్వంతుడు, విష్ణువు, అంశుమంతుడు, వరుణుడు, మిత్రుడు. నాలుగవ పట్టిక - మిత్ర, రవి, సూర్య, భాను, ఖగ, పూష, హిరణ్యగర్భ, మరీచ్య, ఆదిత్య, సవితృడు (సవిత), అర్క, భాస్కరులు.

ఈ పట్టికలలో చాలా పేర్లు అందులోనూ ఇందులోనూ కనిపిస్తాయి. ఒకటి రెండు పేర్లు తేడా ఉన్న పట్టికలు ఉన్నాయి. వాల్మీకి రామాయణం యుద్ధకాండలో రాముడికి అగస్త్యుడు ఉపదేశించిన 'ఆదిత్య హృదయం' స్తోత్రంలో ఈ పేర్లన్నీనూ, ఇవి గాక ఇంకా చాలానూ ఉన్నాయి. అన్నీ సూర్యుడి పేర్లే.

దృష్ట్వా ప్రసన్నమనసో వైష్ణవాస్తత్ర పఙ్క్తిశః |
హిరణ్యశ్మశ్రవో హేమకేశాశ్చక్రభుజాఙ్గితాః | ౧౬

ప్రశాంతమైన మనస్సు కలిగిన అనేకమంది వైష్ణవోత్తముల గుంపులు కనిపించాయి. వారందరూ కూడా బంగారు వర్ణము కలిగిన గడ్డములతో శంఖ చక్రములు గుర్తుగా కలిగిన వారై ఉన్నారు. విష్ణుచిహ్నాలను ధరించిన పలువురు వైష్ణవోత్తములు జ్యోతిస్స్వరూపంతో నిలచిన ఒక పురుషునకు ఆదరంతో స్వాగతం పలుకగా, అతడు వారితో కలిసి విమానం ఎక్కి మాయమయ్యాడు.

ఐన్ద్రజాలీవ సా విద్యా దర్శితా దేవతేన మే |
క్షణమాత్రం తదా సర్వం ప్రత్యదృశ్యత పూర్వవత్ || ౧౭

ఇదంతా నాకు ఒక ఇంద్రజాల విద్య లాగా అనిపించింది.( తన కౌశలముతో చూచువారి కండ్లను కప్పి, లేనిదానిని చూపించుట. ఇంద్రజాలము.) ఒక క్షణం తరువాత అసలు ఇదేమీ జరగనట్లుగా మామూలుగా ఆ ప్రదేశం కనిపించింది.

పథి మూలాని సంగృహ్య వ్యాకులేనాన్తరాత్మనా |
భగవంస్త్వత్పదే సర్వం విజ్ఞాపితమిదం మయా ||౧౮

నేను ఆ సంఘటన గురించి  ఆలోచిస్తున్న మనస్సు కలిగిన వాడినై నేను ఆశ్రమమునకు వచ్చు దారిలో కందమూలాలను గ్రహించి మీ దగ్గరకు వచ్చాను. స్వామీ! నాకు అలా ఎందుకు కనిపించిందో, ఆ విశేషమేమిటో మీరు చెప్పవలసినదిగా మనవి.

అగస్త్యః

ఆకర్ణ్య హర్షసంపుల్లమానసస్తు నిశాకరః ।

 తద్వైభవం పూర్వవృత్తమాఖ్యాతుముపచక్రమే ॥ ౧౯

తన శిష్యుడు కౌత్సుడు చెప్పిన మాటలు విని నిశాకారుడు  అను మహర్షి చాలా సంతోషించి కౌత్సుడు చూసిన దృశ్యములోని అంతరార్థాన్ని ఇలా వివరించాడు.

 పురా పుణ్యతమో నామ వైఖానసకులోత్తమః ।

 నృహరేరర్చనపరశ్శీలవాన్ ప్రబభూవహం । ౨౦

పూర్వము పుణ్యతముడు అను ఒక వైఖానసోత్తముడు ఉండేవాడు. అతడు ఎప్పుడూ కూడా నరసింహస్వామి యొక్క సేవలో ఆసక్తి కలిగి ఉండేవాడు.

విశేషాలు

"ఏ నఖాః తే వైఖానసాః ఏ వాలాః తే వాలఖిల్యాః " అని పెద్దల మాట.  ఎవరైతే అనఖా: అనగా పాపరహితులో వారే వైఖానసులు అని అర్థం.  వైఖానసస్య ఇదమ్ సన్న్యాసికి సంబంధించినది వైఖానసమని ఇంకొక అర్థం ఉన్నది.  ఈ మతాన్ని అనుసరించేవారు విష్ణువుని ముఖ్య దైవంగా కొలుస్తారు. దీని స్థాపకుడు అయిన విఖనస ఋషి నుండి వచ్చింది కాబట్టి వైఖానసం అయింది.  విఖనసునిచే చెప్పబడిన శాస్త్రము వైఖానస ఆగమము.

21 -30

 తస్య భాగ్యోదయాత్ కశ్చిద్ధరిదత్త ఇతి శ్రుతః ।

పుత్రోఽజనిష్ట నృహరేః ప్రసాదాత్ తదనుగ్రహాత్ ॥ ౨౧

నరసింహ స్వామి యొక్క అనుగ్రహము చేత మరియు పుణ్యతముని యొక్క భాగ్యవశమున అతనికి హరిదత్తుడు అనే కుమారుడు జన్మించాడు.

అథ పుత్రం సమాలోక్య శీలవన్తం గుణాన్వితమ్ ।

ఆగమప్రాప్తయే సోఽయం పితా దుర్వాససే దదౌ ॥ ౨౨

మంచి నడవడితో ఉన్న గుణవంతుడైన తన కుమారుని హరిదత్తుని చూసి పుణ్యతముడు ఎంతో సంతోషించి తన కుమారునికి వైఖానసాగమశాస్త్రాన్ని నేర్చుకోవడానికి దూర్వాసో మహర్షి దగ్గరకు పంపించాడు .

 హరిదత్తోఽపి ధర్మాత్మా గురోర్దూర్వాససో మనః।

ప్రహర్షయన్ ప్రతిపదం విద్యామభ్యాసయత్ తదా || ౨౩

హరి దత్తుడు కూడా దూర్వాసో మహర్షి దగ్గర చాలా వినయంతో ప్రవర్తిస్తూ అతన్ని సంతోషింప చేస్తూ విద్యను నేర్చుకున్నాడు.

అదక్షిణమహో విద్యా తేనాభ్యస్తేతి దుర్మనాః ।

దుర్వాసా హరిదత్తాయ బ్రాహ్మణాయేదమూచివాన్ ||౨౪

కొంత కాలమైన తరువాత విద్య పూర్తయినప్పటికి హరిదత్తుడు ఎటువంటి గురుదక్షిణ ఇవ్వకపోయేసరికి దూర్వాసుడు కోపించాడు. అతనితో ఇలా అన్నాడు.

దుర్వాసః -

త్వం ప్రాజ్ఞస్త్వం కులీనశ్చ సత్యసన్ధో జితేన్ద్రియః।

హరిభక్తస్సదాపి త్వమాగావిద్యామదక్షిణామ్ ||౨౫

ఓ హరిదత్తా! నువ్వు చాలా బుద్ధిమంతుడివి. మంచి కులములో పుట్టావు. ఎల్లప్పుడూ సత్యము మాట్లాడే స్వభావము కలిగిన వాడివి. ఇంద్రియాలను జయించావు. హరి భక్తుడివి. కాని గురుదక్షిణ లేకుండా నా దగ్గర విద్యను గ్రహించావు.

కఞ్చిత్ కాలముషిత్వాత్ర రాక్షసం రూపమాస్థితః।

కామరూపీ భవాన్ సర్వం కాననం ప్రచరిష్యతి || ౨౬

కనుక ఈ తప్పుకు శిక్షగా కొంత కాలము రాక్షస రూపాన్ని పొంది ఈ అడవిలో  తిరిగెదవు గాక! ఇక్కడ కొంత కాలం గడిపిన తరువాత నువ్వు ఒక రాక్షస రూపాన్ని స్వీకరించి,  కోరిన రూపంలో అడవి అంతా తిరుగుతావు. రాక్షసుడవయి తిరుగుతూ నువ్వు  ఏ రూపాన్ని చూస్తావో ఆ రూపాన్ని పొందుతావు.

యాశ్చ పశ్య మహారణ్యే జాతయః ప్రసవన్తి హి।

తాసు తద్రూపభాక్త్వం వై క్రీడావాన్ పాపహా భవ । ||౨౭

అడవిలో తిరుగుతున్న సమయంలో ఏ ఏ జంతువులు తమ బిడ్డలను ప్రసవిస్తాయో  ఆ బిడ్డల రూపాలను నువ్వు పొందుతూ నీ పాపాన్ని పోగొట్టుకుంటావు.

తతః కాలేన మహతా మమానుగ్రహతో భవాన్ ।

నిశాకరాశ్రమం ప్రాప్య స్వస్వరూపం వ్రజేద్వనే || ౨౮

చివరకు కొంతకాలానికి నా అనుగ్రహము వలన ఘటికాచలంలోని నిశాకరుని యొక్క ఆశ్రమమునకు చేరి సత్పురుషుని దర్శనంవల్ల నీ యొక్క నిజరూపాన్ని పొందగలవు.

పాపనాశమహాతీర్థ సేవయా ముక్తకల్మషమ్ |

త్వాం నృసింహోఽనుగ్రహాత్ స్వపదం ప్రాపయిష్యతి ||౨౯

పాప నాశన మహా తీర్థములో స్నానము చేసి పాపములను పోగొట్టుకొని ,నువ్వు నరసింహస్వామి యొక్క అనుగ్రహముతో విష్ణులోకాన్ని పొందగలవని శాపవిమోచనాన్ని దూర్వాసోమహర్షి పలికాడు.

నిశాకర:-

ఇత్థం దుర్వాససశ్శాపాత్ హరిదత్తోం మహాతపాః |

శరీరం రాక్షసం గృహ్య వనమధ్యం జగామ హ || ३०

ఈ విధముగా దూర్వాసో మహర్షి యొక్క శాపము వలన హరిదత్తుడు రాక్షస రూపాన్ని పొంది అడవి మధ్యలోకి వెళ్లాడు.

31 -40

యేషు జన్తుషు యద్రూపం తేషు రూపం తదాఽఽవిశత్ |

రమమాణో వనం దైవాత్ మామకం ప్రాపితో మహత్ ||३౧

ఏ జంతువు ప్రసవించినప్పుడు, ఆ జంతువు యొక్క రూపాన్ని ధరిస్తూ హరిదత్తుడు దైవవశాత్తు నా ఆశ్రమం దగ్గరకు వచ్చాడు.

దుర్వాససోఽనుగ్రహేణ సత్సంసర్గవశాదపి |

పూర్వం నృహరిసాన్నిధ్యాత్ తీర్థమేతన్నిషేవితమ్ ||३౨

దూర్వాసో మహర్షి యొక్క అనుగ్రహముతో ,కోరిన రూపాన్ని ధరించగల సామర్థ్యము కలిగిన హరిదత్తుడు సింహ రూపంగా మారి జింకపైకి లంఘించాడు. సింహరూపంలో ఉన్న అతడు సత్పురుషుడైన కౌత్సుని సందర్శనం వలన రాక్షసరూపం పోగొట్టుకొని నరసింహ స్వామి సమీపములో ఉన్న ఈ తీర్థములో స్నానము చేసాడు.

నరకేసరిణస్సఙ్గాద్విముక్తస్స చ రాక్షసః|

దివ్యరూపం సమాస్థాయ వైష్ణవం లోకమేయివాన్ | 33

నరసింహ స్వామి యొక్క అనుగ్రహము వలన ఆ హరిదత్తుడు అను రాక్షసుడు తన రాక్షస రూపాన్ని పోగొట్టుకొని దివ్య రూపం ధరించి వైష్ణవ లోకానికి వెళ్ళాడు .

త్వం హి భాగ్యవతాం శ్రేష్ఠశ్శుశ్రూషణపరస్సతామ్ |

వేదైరదృష్టోఽపి హరిః యత్తే దృష్టిపథం గతః | | ३౪

అదృష్టవశాత్తు నీ యొక్క గురుసేవ తత్పరత వలన ఎవ్వరికీ కనిపించని ఆ నరసింహుడు నీ కన్నుల ఎదుట ప్రత్యక్షమయ్యాడు. ఇది నువ్వు చూసిన దృశ్యము.

వైష్ణవాశ్చ మహాత్మానశ్శఙ్ఖచక్రధరాస్స్వయమ్ |

విమానేషు యతో దృష్టాస్తస్మాద్ధన్యతమో భవాన్ । ౩౫

శంఖచక్రములను ధరించిన మహాత్ములైన వైష్ణవులు విమానాలలో ప్రయాణిస్తూ నీకు కనిపించారు. అందువలన నువ్వు ఎంతో ధన్యుడివి.

సర్వపాపవినిర్ముక్తస్స యాస్యతి పరాం గతిమ్ ।

అగస్త్యః

ఇత్యుక్తో హృష్టచేతాస్తు కౌత్సశ్శిష్యతమో గురోః ॥ ౩౬

సర్వ పాప విముక్తుడివై జన్మ విశిష్ట స్థానాన్ని పొందగలవు. అని గురువు అంతరార్థము చెప్పగా చాలా సంతోషించిన కౌత్సుడు అను ఆ శిష్యుడు చాలా సంతోషించాడు.

పాదాభివన్దనరతః ప్రముమోద తదా మునిః ।

తత్ర పాపవినాశే యస్స్నాతి తీర్థనిషేవితే ॥౩౭

గురువు యొక్క పాదాలకు నమస్కారము చేసి తన జన్మ సఫలమైనందుకు చాలా ఆనందాన్ని పొందాడు. కనుక ఎవరు ఈ పాప నాశన తీర్థములో స్నానము చేస్తారో, వారు పాప విముక్తులవుతారు.

సాషేణస్సజ్జవాదర్వాక్ సేవతే తీర్థముత్తమమ్ ।

భవేత్ పాపవినిర్ముక్తో నృసింహానుగ్రహేణ సః ॥౩౮

ఈ ఉత్తమ తీర్థములో ప్రాతః కాలమున  స్నానము చేసిన వారు నరసింహ స్వామి అనుగ్రహముతో పాపములను నుండి విముక్తి పొందుతారు.

## అమృతకుండ తీర్థము

తస్యావిదూరే సాషేణ వనమున్నిద్రపాలితమ్ ।

ఉన్నిద్రతరుసుచ్ఛాయమునిద్రమృగసంకులమ్ ॥౩౯

ఈ పాపనాశన తీర్థమునకు సమీపములో సుషేణము అను ఒక అడవి ఉన్నది. అది చాలా చెట్లతోటి ,మృగములతోటి నిండి ఉన్నది.

సుషేణవనమాప్తా యే విదూరాత్ సర్వజన్తవః ।

బిభ్యన్తి వ్యాధయస్సర్వే తత్ర గన్తుం మహామతే ॥౪౦

ఓ మహామతీ !దూరదూరాల నుండి  ఆ సుషేణమను  అడవికి చేరుకున్న సర్వజీవులకు రోగాలన్నీ నశిస్తాయి.

41  50

సఞ్జీవనకరీ తత్ర సన్ధానకరణీ తథా

విశల్యకరణీ చాపి వల్లయస్తు వసన్తి హి ॥౪౧

ఆ అడవిలో సంజీవనకరి ,సంధాన కరణి, విశల్య కరణి అను అద్భుతమైన తీగలు కలవు.

**విశేషాలు**

**మూర్ఛిల్లిన లక్ష్మణుని రక్షించడానికి వైద్యుడు సుషేణుడు ఆంజనేయుడిని 'ఓషధీ పర్వతాన్ని( సంజీవని పర్వతాన్ని)' తెమ్మంటాడు (యుద్ధకాండ: 102 సర్గ, 21-24). దాని దక్షిణ శిఖరంలో వుండే విశల్య కరణి, సవర్ణ కరణి, సంజీవని, సంధాన కరణి చెట్లను తెమ్మని చెబుతాడు.**

**వాల్మీకి రామాయణానికి ప్రామాణికంగా, రాముని 'తిలక', శివసహాయుని 'రామాయణ శిరోమణి' , గోవిందరాజ 'భూషణ' వ్యాఖ్యలు సుప్రసిద్ధములు. ఆ వ్యాఖ్యలలో ఈ నాలుగు ఓషధుల వివరణ ఇలా ఉన్నది.**

**మృతసంజీవని**( సంజీవన కరి)

**మృతానాం సంజీవనీం స్పర్శమాత్రేణ సంజీవనకర్త్రీ (శిరోమణి )**

**స్పర్శ మాత్రము చేత చనిపోయినవారికి లేదా స్పృహ కోల్పోయిన వారికి తిరిగి స్పృహ తెచ్చేది కనుక మృతసంజీవని. ఘటికాచల మాహాత్మ్యంలో దీనిని సంజీవన కరి అని వ్యాసుడు చెప్పాడు.**

**సంధానకరణి:**

**సంధానీం ఛిన్నశిరఃకబంధయోరపి యథాపూర్వం నాడీ సంధానకరణీం (తిలక)**

**తల, మొండెము విడిగా తెగిపోయినా సరే, మునుపటి వలె నాడులతో సహా అన్నీ కలిపేది సంధానకరణి.**

**సంధానకరణీం ఛిన్నశిరఃప్రభృతీనాం యథాపూర్వం సంయోజికామ్ (శిరోమణి)**

**శిరస్సు నుండి విడిపోయిన (శరీరమును) మునుపటివలె తిరిగి కలిపేది కనుక సంధానకరణి అని పేరు.**

**విశల్యకరణి:**

**విశల్యకరణీం స్పర్శమాత్రేణ బాణరాహిత్య సంపాదికామ్ (శిరోమణి)**

**విశల్యకరణీం చ అంతర్గతశల్యనిర్గమన కారిణీం చ ఓషధీం మూలికాం (భూషణ)**

**శరీరములో దిగిన బాణమును (ఏ ఆయుధమైనా) తీసివేసి, గాయము మాన్పే మూలిక, ఓషధి కనుక విశల్యకరణీ (శల్యము అంటే బాణము) అని పేరు.**

**ఈ  ఓషధులకు 'భూషణ' వ్యాఖ్య ఇలా చక్కని సమన్వయము చేస్తుంది -**

**చనిపోయిన వారిని బ్రతికించేది మృతసంజీవని. అలా బ్రతికిన వారికి తిరిగి పనిచెయ్యటానికి తగ్గట్టుగా ఆయుధ గాయాలను తొలగించేది విశల్యకరణి. అలా గాయాలు తొలగినాక లేదా మానాక చర్మం, ఎముకలు వంటివి కలిపి యథావిధిగా చేసేది సంధానకరణి. అలా బ్రతికి, గాయాలు మాని, అంతా సర్దుకున్నా, శరీరము పూర్వ తేజస్సు, ఉత్సాహమును వెంటనే పొందదు. ఆరోగ్యంగా ఉన్నప్పుడు ఎంత తేజస్సు, ఉత్సాహం, నిలకడ, శాంతి వంటివి కలవో వాటిని తిరిగి వ్యక్తిలో పునరుద్ధరించేది సావర్ణ్యకరణి (సువర్ణకరణి).**

**ఇవి ఆ సుషేణమను అడవిలో ఉన్నాయని ఘటికాచల మాహాత్మ్యం చెబుతున్నది.  వాల్మీకి రామాయణములో సుషేణుడు. ఘటికాచల మాహాత్మ్యంలో సుషేణమను అడవి. చక్కని పొందిక.**

**మన్దారపారిజాతశ్చ పున్నాగో నాగకేసరః ।**

**రసాలాశ్చ పలాశాశ్చ కఙ్కోస్త్విన్దురకాస్తథా । ।౪౨**

అడవిలో మందారం,(జిల్లేడు) పారిజాతం (పగడమల్లి), పున్నాగము,( పొన్న చెట్టు) నాగకేసరం, రసాలము(తియ్యమామిడి చెట్టు), పలాశము(మోదుగచెట్టు), కంకము(పెద్ద రాచమామిడి) మొదలగు చెట్లు ఉన్నాయి.

అశ్వత్థాః కేసరాశ్చాపి కర్ణికారాశ్చ మల్లికాః|
చమ్పకాస్తిలకాశ్చూతాస్సిన్దువారాశ్చ తిన్దుకాః ||४३
ఇంకా అశ్వత్థము( రావిచెట్టు), కేసరము(పొగడ), కర్ణికారము(కొండగోగు) మల్లిక(మల్లె చెట్టు), చంపకం(సంపెంగ), తిలకం( బొట్టుగుచెట్టు.), చూతము(మామిడిచెట్టు), సిందువారము(వావిలిచెట్టు) ,తిందుకము(తుమ్మికి చెట్టు) మొదలైన చెట్లు కూడా ఉన్నాయి.

జమ్బూమధూకకఙ్కోలాశ్చామ్పేయపనసాస్తథా |
కున్దాశ్చ స్యన్దనాస్సాలాః పాటలాశ్చ వటాస్తథా | |४४
మరియు జంబు(అల్లనేరేడు), ఇప్పచెట్టు, జాజికాయ, సంపెంగ, పనస చెట్టు, మొల్ల, స్యందన(తినాసపుచెట్టు),, సాల(మద్ది),పాటల(కలిగొట్టుచెట్టు), మర్రి మొదలైన చెట్లు కూడా ఉన్నాయి.

భద్రాశ్చామలాకా ద్రాక్షాస్సమాధ్వీకాశ్చ వర్షిణః |
తత్ర దీర్ఘాటవీ మధ్యే కుల్యా చోత్తరవాహినీ | |४५
నల్లవావిలిచెట్టు, నల్లగినియచెట్టు, ద్రాక్షారసము ఇప్ప పువ్వుతో చేసిన సారాయి వర్షించు చెట్లు ఉన్నాయి. ఆ అడవి మధ్యలో ఉత్తర ముఖముగా ప్రవహించు ఒక నది ఉన్నది.

తీరస్థద్రుమపుష్పాన్తశ్చ్యుతమాధ్వీకపూరితా |
తత్తీరే భగవాన్ యోగీ జాబాలీ ఋషిసత్తమః | | ४६
ఆనది ఒడ్డున ఉన్న చెట్లు మరియు పూల నుండి పడుతున్న తేనెతో నిండి ఉంది. దాని ఒడ్డున పూజ్యుడైన, ఋషిశ్రేష్ఠుడయిన జాబాలి ఋషి ఉన్నాడు.

తపస్యతి దురాధర్షో యోగం కృత్వా మహాతపాః |
ఆలమ్బికాయోగరతాస్తిష్ఠన్త్యమృతసేవినః ||४७
అతడు అజేయమైన యోగాభ్యాసం చేసే గొప్ప తపస్వి. అతడు ఆలంబికా యోగంలో నిమగ్నమై ఉండి అమృతాన్ని సేవిస్తుంటాడు.

విశేషాలు

ఆలంబికా యోగం

నాలుకను వెనుకకు మడచి కొండనాలుకకు వెనుక భాగమున కల రంధ్రము గుండా తలలోకి పోనిచ్చి దృష్టి ని నొసటి యందు రెండు కను బొమల మధ్యన నిలిపి యుంచి తదేక దృష్టి తో నిలిచి యుండుటే ఖేచరీ ముద్ర.దీనినే లంబికా యోగము అని కూడా యోగ గ్రంథములలో చెప్పారు.

వేమనకు ఉపదేశము చేసిన గురువు పేరు లంబికా శివ యోగి అని ఒక కథ ఉన్నది.. బహుశా ఆయన ఇటువంటి ఒక పద్ధతిలో నిష్ణాతుడై ఉండవచ్చు.

సామాన్యముగా ఇటువంటి ముద్రలు క్రియలు శైవ సాంప్రదాయం లోనూ, శాక్త సాంప్రదాయం లోనూ కనిపిస్తుంటాయి. నవీన కాలంలో క్రియా యోగాన్ని ప్రచారం లోకి తెచ్చిన లాహిరీ మహాశయులు కూడా ఈ ఖేచరీ ముద్రలో నిష్ణాతులే.

యోగ గ్రంథాల ప్రకారం ఈ క్రియ చెయ్యటం వలన తలలోనుంచి అమృతము అనబడే ఒకానొక ద్రవము జారి అంగిలి లో పడుతుంది. దానిని సరాసరి మింగటం వలన ఆకలి దప్పిక లు తగ్గిపోతాయి. కాని మనిషికి నీరసం అలసట ఉండదు. ముఖంలో ఒక విధమైన తేజస్సు ఎప్పుడూ ఉంటుంది. నిత్య ఉత్సాహంగా, చురుకుగా మనిషి ఉండగలదు. వార్ధక్యం వాయిదా వెయ్య బడుతుంది. దేహ పుష్టి స్థిరంగా ఉంటుంది. రోగాలు దగ్గరకు రావు. ఇదే కాక అతీత యోగ సిద్దులు కాల క్రమేణా కలుగుతాయి.

కాని ఈ క్రియ చెయ్యటానికి పెద్ద ప్రతిబంధకం నాలుకను కిందకు పట్టి ఉంచే ఫ్రెన్యులం అనబడే ఒక చర్మపు అతుకు. దీనిని తొలగించటానికి అనేక క్రియలు యోగంలో ఉన్నాయి. చేదనము దోహనము అనే క్రియలు యోగులకు తెలుసు. ఈ అతుకును శుభ్రమైన పదునైన కత్తితో రోజుకు వెంట్రుక వాసి అంత కోస్తూ దానికి ప్రత్యేకం గా తయారు చేసిన మూలికా మిశ్రమం అద్దుతూ ఉంటే కొద్ది నెలలలో అది మొత్తం తొలగించ బడి నాలుక పూర్తిగా వెనుకకు తిరిగి కపాల కుహరం లోకి ప్రవేశించ గలుగుతుంది.

కాని ఈ క్రియను చాలా జాగ్రత్తగా చెయ్యాలి. తేడా వస్తే మాట పడి పోయి మూగ తనం వస్తుంది. దీనికి తోడుగా రోజూ వెన్న రాస్తూ పాలను పితికి నట్లు నాలుకను ఒక ప్రత్యేక పద్దతిలో సాగతియ్యాలి. దీన్ని దోహన క్రియ అంటారు. (ఆధారం తెలుగు యోగి సమాచారం)

అనుగ్రహన్తి సాదృశ్యం తరవస్తే నిషేవిణామ్ ।
తత్పుష్పమాలాభరణో భగవాన్ నృహరిస్తథా ।।౪౮

ఆ అడవిలోని చెట్లు తమకు సేవ చేసే వారిపై దయ చూపుతాయి. నరసింహస్వామి కూడా ఆ చెట్ల పూలమాలలతో అలంకరించబడతాడు.

దీర్ఘానుషఙ్గానస్మిన్ వై కురుతేஉనన్యదుర్లభాన్ ।
క్రియతే నృహరేర్యత్ర దీర్ఘాపాఙ్గపరమ్పరామ్ ।।౪౯
యత్ర దీర్ఘతపస్తత్ర జాబాలిః కురుతే మునిః ।।౫౦

నరసింహస్వామి ఇక్కడ వరదునిగా ఈ ప్రపంచంతో దీర్ఘకాలిక అనుబంధాలను ఏర్పరచుకున్నాడు. ఇది మరొక చోట దుర్లభము. ఎక్కడ జాబాలి అనే ఋషి  దీర్ఘమైన  తపస్సులను చేస్తున్నాడో,  అక్కడ నరసింహస్వామి కూడా  తన పొడవైన దయతో కూడిన కడకంటిచూపులతో (కరుణాకటాక్షములతో) భక్తులను రక్షిస్తుంటాడు.

**51 -60**

తద్వనం మునిభిస్సర్వైర్దీర్ఘారామస్తదుచ్యతే ।
కుల్యాయాః పశ్చిమే తీరే దీర్ఘారామాన్తరే మునే ।।౫౧

ఆ నదికి పశ్చిమ తీరంలో ఒక అమృత కుండము ఉన్నది. ఆ అడవిని అందరు ఋషులు దీర్ఘారామము  అని పిలుస్తారు.ఆ దీర్ఘారామము  మధ్యలో ఉన్న నది యొక్క  పశ్చిమపు  ఒడ్డున ఒక అమృత కుండమున్నది.

సర్వదామృతకుణ్డో హి దృశ్యతే పూరితామృతమ్ ।
తత్రావతీర్య తే ధన్యా గృహ్యా వారి పిబన్తి యే ॥౹౨

ఆ అమృతకుండము  ఎప్పుడూ అమృతముతో నిండినదిగా కనిపిస్తూ ఉంటుంది. ఆ అమృతం వంటి నీరు తాగిన వారు  ధన్యులు.

అభిమన్త్ర్య నృసింహాష్టవర్ణైరాగమగోచరైః ।
వైఖానసా వాలఖిల్య ఋషయశ్చంసితవ్రతాః ॥౹౩

ఆ పవిత్ర ప్రదేశంలో వేదములలో చెప్పబడినటువంటి నరసింహ స్వామి యొక్క అష్టాక్షరి మంత్రాన్ని  వైఖానసులు వాలఖిల్యులు పరాశరుడు మొదలైన ఋషులు భక్తితో జపిస్తుంటారు.

**విశేషాలు**

వైఖానసులు

ఈ పదిహేనవ అధ్యాయములో   20 వశ్లోకములో వివరణ ఉన్నది

వాలఖిల్యులు

వీరు బ్రహ్మమానసపుత్రులలో ఒకడయిన క్రతువునకు పుట్టిన అంగుష్ఠప్రమాణదేహులు అగు 60000 మంది. వీరు మహాతపస్సంపన్నులు. నిరంతరము సూర్యరథము చుట్టు తిరుగుతూ ఉంటారు. వీరు బ్రహ్మరోమ కూపమునుండి పుట్టినట్లు కొందఱు చెబుతారు.

పరాశరాదయస్తత్ర పీత్వా దీర్ఘాయుషోఽభవన్ ।
దీర్ఘారామతరుచ్ఛాయామాశ్రితానాం మహాత్మనామ్ ॥౹౪

పరాశరుడు మొదలయిన అనేక మంది ఋషులు ఆ  అమృతకుండములో నీరు తాగి చాలా కాలం జీవించారు.ఆ మహానుభావులు ఆ దీర్ఘారామపు చెట్ల  నీడలను ఆశ్రయించి ఉంటారు.

హేమకోటిపదచ్ఛాయా భజతే కాపిలం వనమ్ ।
ఉన్నతా విటపాశ్చైవ తరూణాం ఫలశాలినామ్ ॥ ౹౫

ఉన్నతమైన చెట్లతో , ఫలాలతో కూడి ఉన్న  హేమకోటి పర్వతము కింద ఉన్న  కపిల వనమును వారు పూజిస్తుంటారు.

హరిధ్యానవతాం పుంసాముద్బాహవ ఇవాభవన్ ।
తస్యోత్తరదిశి స్ఫీతే శృఙ్గే వేదాన్తగోచరః ॥౹౬

ఆ కపిల వనములోని చెట్ల కొమ్మలు నరసింహస్వామిని ధ్యానిస్తున్న  చేతుల్లాగా ఉంటాయి. దీర్ఘారామము  మధ్యలో ఉన్న నది యొక్క  ఉత్తర దిక్కు వైపు ఉన్న కొండపై  వేదాంత గోచరుడైన దత్తాత్రేయ భగవానుడు ఉన్నాడు

దత్తాత్రేయస్స భగవాన్ తిష్ఠతే తపసి స్థితః ।

దత్తాత్రేయ భగవానుడు అక్కడ తపస్సు చేసుకుంటూ ఉన్నాడు.

శృఙ్గస్య వామపార్శ్వస్థా దృశ్యతే వామదీర్ఘికా ॥

యత్ర దత్తో మహాతేజా ఉన్మజ్జతి నిమజ్జతి ।

ఎక్కడ మహాతేజుడైన దత్తాత్రేయుడు స్నానము చేస్తుంటాడో, మునిగి పైకి లేస్తూ విహరిస్తుంటాడో ఆ వామదీర్ఘిక ఆ ప్రదేశానికి ఎడమవైపుగా ఒక ఉన్నది.

క్రీడా సరస్సు

పురా దేవాసురే యుద్ధే దైత్యేన్ద్రాన్ జేతుచేతసామ్ ।

సురాణాం బుద్ధిరభవత్ వాసవస్యావనాయ వై ॥౫౮

పూర్వము రాక్షసులకు దేవతలకు మధ్య జరిగిన యుద్ధంలో రాక్షసులను దేవతలు జయించాలని, ఇంద్రుని రక్షించాలని అనుకున్నారు

అయం హి వర్తతే వహ్నిర్వోఢుం భారమతన్ద్రితః ।

అస్మై దాస్యామహే వామం వస్వీతీమేఽనుమేనిరే ॥ ౫౯

మన దగ్గర ఉన్న వసు అను పేరు కలిగిన ధనాన్ని మోయడానికి( కాపాడటానికి) ఈ అగ్నిదేవుడు సమర్థుడు. మనమందరం కూడా మన ధనాన్ని ఇతని దగ్గర దాచిపెడదామని భావించారు. .

హే వహ్నే ఽస్మద్ధనమిదం గోప్యతాం భవతా మహత్।

అథాసురాన్ విజిత్యైతత్ ప్రతిగృహ్యామహే వయమ్ ॥

ఓ అగ్నీ ! మా ఈ గొప్ప నిధిని కాపాడుము. ఇప్పుడు, రాక్షసులను ఓడించిన తర్వాత మేము దీనిని తిరిగి తీసుకుంటాము. అని అగ్నిని దేవతలు అడిగారు. తమ ధనాన్ని దాచటానికి అగ్నిదేవుని సమర్ధుడిగా భావించి ధనాన్ని దాచిపెట్టమని అతనిని కోరారు.

61 - 70

వహ్నిః -

బలవన్తోఽసురా యత్ర ఇష్టం సన్నిదధత్యమీ ।

కుశలీ నాహమేతద్ధి వోఢుమన్యత్ర దాప్యతామ్ ॥౬౧

బలవంతులైన రాక్షసులు యజ్ఞం చేసే సమయంలో నేను ఈ ధనమును దాచిపెట్టలేను కనుక వేరొక చోట మీరు దాచి పెట్టండి అని అగ్నిదేవుడు జవాబు చెప్పాడు

సురాః-

మహానుభావో విశ్వాత్మా హవ్యకవ్యవహో బలీ ।

అనుగృహ్ణాతు భగవాన్ వసూనాం గ్రహణే మనః ||

 అప్పుడు దేవతలు అగ్నితో "మహానుభావా! నువ్వు విశ్వాత్ముడివి.( ప్రపంచమే ఆత్మగా కలవాడు. పరమాత్ముడు.) హవ్యమును కవ్యమును వహింపగలిగిన వాడివి కనుక నువ్వే దాచాలి అని చెప్పారు

విశేషాలు

యజ్ఞాలలో దేవతలకు అర్పించే సమిధలు మొదలైన హోమ ద్రవ్యాలు హవ్యాలు.

అగ్ని దేవుని భార్య స్వాహాదేవి ఏ దేవుడికి/ దేవతకు ఏ ద్రవ్యం అందాలో దానిని చేరుస్తుంది.

దేవతలకు అందేది హవ్యం కాగా, పితృ దేవతలకు అందించే ద్రవ్యాలు కవ్యాలు.

కవ్యాన్ని స్వధాదేవి పితృ దేవతలలో ఎవరికి ఏది చేరాలో దానిని చేరుస్తుంది.

హవ్యం అనగా దేవతలకు అగ్నిలో వేయడం ద్వారా అందించే నేతితో తడిపిన అన్నం మొదలైనవి.

కవ్యం పితృదేవతలను ఉద్దేశించి అగ్నిలో వేసే హోమ ద్రవ్యాలు.

అగస్త్యః

అమరైర్ధీప్యమానం తదాదాయ సుమహామనాః |

 ఆవహత్స్వ చిరం కాలం హవీంషీవ వసూత్కరమ్ ||౬౩

దేవతలు ఆ విధముగా అడిగిన తరువాత అగ్ని వారి ప్రార్థనను అంగీకరించి వారి ధనమును దాచి పెట్టాడు.

 తదా దృష్ట్వా దైత్యసేనా: వామం వసు హవిర్భుజి|

చిన్తయానా హవ్యవహం పరివవ్రుః పరశ్శతమ్ ||౬౪

అప్పుడు రాక్షస సైన్యాలు అగ్నిహోత్రుడు ఎడమ చేతిలో ధనాన్ని పట్టుకుని ఉండటం చూసాయి.వారు  వందలాదిగా వచ్చి ధనం కొరకు అగ్నిని బాధించారు.

 సన్నహ్యేనవలోక్యాథ కాందిశీకస్తు హవ్యభుక్ |

 దిశో దశ హి దుద్రావ అత్యనాశీరవిద్రుతః ||౬౫

తట్టుకోలేని బాధతో,  ఏ దిశకు వెళ్లాలనే భయం  కలిగిన కాందిశీకునిలా  అగ్నిదేవుడు పది దిక్కులకు పరిగెత్తాడు. (1. తూర్పు, 2. పడమర, 3. ఉత్తరము, 4. దక్షిణము, 5. ఐశాని, 6. నైరృతి, 7. వాయవ్యము, 8. ఆగ్నేయము, 9. ఊర్ధ్వదిశ, 10. అధోదిశ)

తత్రాన్తరే విగలితం వసు వామం మరుద్ధనమ్ |

వహ్నిం ప్రసాద్య తత్సైన్యమవలోక్య సురా యయుః || ౬౬

ఆ పరుగులాటలో పొరపాటున అగ్నిదేవుడు దేవతలు తనకు ఇచ్చిన ధనాన్ని జారవిడిచి పోగొట్టుకున్నాడు. దేవతలు అగ్నిని శాంతింపజేసి రాక్షస సైన్యాన్ని ఎదుర్కొన్నారు.

తతో విజిత్య వై దైత్యానుద్ధతాన్ రణకోవిదాన్ ।
అయాచన్త సురా వహ్నిం దీయతాం వసుమద్ధనమ్ ।
కొంతకాలము తరువాత దేవతలు యుద్ధంలో రాక్షసులను జయించి అగ్ని దగ్గరకి వచ్చి తమ ధనమును తిరిగి తమకు ఇమ్మని అడిగారు.

పునః పునశ్చ పృష్టోఽపి వహ్నిర్యత్నముపాస్థితః ।
కిమితి వ్యాకులమనాస్సభయం ప్రాహ తాన్ సురాన్ ||
దేవతలు ఎన్నిసార్లు అడిగినప్పటికీ జవాబు ఇవ్వకుండా చివరికి భయముతో అగ్ని ఆ దేవతలతో ఇలా అన్నాడు

వహ్నిః
భవద్భిర్దత్తమేతద్ధి ధనం దుష్టా దనుద్భవాః ।
సన్నహ్య మాం తదాలోక్య దైత్యాశ్చ పురసేవకాః । । ౬౯
మీరు నాకు ధనాన్ని ఇచ్చారు.అది కనిపెట్టిన  దుష్టులైన ఆ దానవులు నా వెంట పడ్డారు .

విశేషాలు

దానవులు

దితికి పుట్టిన వారు దైత్యులు. (రాక్షసులు) కాని కశ్యపునికి దనువుయందు పుట్టిన వారు వారి సంతతివారిని దానవులు అంటారు. వారిలో ముఖ్యులు అయోముఖుడు, ఏకచక్రుడు, పులోముడు, కపిలుఁడు, అంధకుడు, అరిష్టుడు, అరుణి, అనుతాపకుడు, ద్విమూర్ధ్నుడు, శంబరుడు, హయగ్రీవుడు, విభావసుడు, శంకుశిరస్సు, స్వర్భానుడు, వృషపర్వుడు, విప్రచిత్తి (ఇతనికి సింహికయందుఁ పుట్టిన కొడుకులు రాహువు, కేతువు), వాతాపి, ఇల్వలుడు, నముచి, రెండవ స్వర్భానుడు, కాలనాభుడు, వక్త్రయోధి, త్ర్యంశుడు, శల్యుడు, నభుడు, నరకుడు, పులోముడు, ఖసృముడు, రెండవ అంధకుడు, ధూమ్రకేతువు, విరూపాక్షుడు, దుర్జయుడు, వైశ్వానరుడు, రెండవ తారకుడు.

చారైరపి ప్రహర్తుం మాం కూటముద్గరపాణయః ।
పలాయమానే సహసా ప్రహర్తుమనసోఽసురాన్ || ౭౦
దానవులు గూఢచారులతో కలిసి  మోసపూరితమైన  ఆయుధాలు ధరించి నాపై దాడి చేసారు. నేను భయముతో పరిగెత్తాను.

71  -80

నిరీక్ష్య దక్షిణస్యాం వై దిశి నిర్గలితం వసు ।

వసుభిశ్శూన్యమాలోక్య నిరాశాస్స్వం పురీం గతాః ।।౭౧

భయముతో పరిగెత్తు సమయములో మీరిచ్చిన ధనాన్ని దక్షిణం దిక్కుగా జారవిడిచాను. ధనము లేని నన్ను చూసి రాక్షసులు నిరాశతో తమ పురమునకు తిరిగి వెళ్లారు.

అతో విలోక్యతాసద్భిర్భవద్భిస్తత్వవేదిభిః

దక్షిణస్యాం దిశి సురాః దృశ్యతే భువి నాన్యతమ్ ।

కాబట్టి, తత్త్వ వేదులయిన నిజం తెలిసిన మీరు ధనము కొరకు దక్షిణ దిక్కులో ఉన్న భూమిని వెతకండి. ఇందులో అబద్ధం లేదు.

అగస్త్యః

తతో దేవాః సహేన్ద్రేణ మార్గమాణా వసూత్తమమ్ ।

అగ్ని మార్గమును చూపించుచుండగా ఇంద్రాది దేవతలు భూమి పైకి దిగి వచ్చారు

వహ్నినా దర్శితపథా భువః పృష్ఠముపాయయుః ।।౭౩

వారందరూ  భూమార్గం పట్టి అగ్ని చూపిన  మార్గాన్ని అనుసరిస్తూ అతని వెనుకగా నడిచారు.

యత్ర తిష్ఠతి ధర్మాత్మా సర్వపాపవిశోధకః ।

తస్యాం దిశి సురాస్సర్వే యయుస్సేన్ద్రాసహానలాః ।।౭౪

ఏ దిక్కులో సర్వపాపములను పోగొట్టు స్వభావము కలిగిన వాడు, ధర్మాత్ముడు అయిన నరసింహస్వామి ఉన్నాడో, ఆ దిక్కువైపు ఇంద్రుడు, అగ్ని మొదలయిన దేవతలు నడిచారు.

చిన్తామణిగిరేస్తస్య శృఙ్గమున్నతముత్తమమ్ ।

అవలోక్య తతస్సర్వే సురాః ప్రాహురిదం వచః ।।౭౫

నెమ్మది నెమ్మదిగా వారందరూ  ఘటికాచల  క్షేత్రమునకు ఉత్తర దిక్కులో ఉన్న చింతామణి పర్వతాన్ని చూసారు. ఆ ఉత్తమమైన పర్వత శిఖరం చూసిన తరువాత దేవతలు అందరూ ఇలా భావించారు.

సురాః-

అత్రాస్తే భగవాన్ సాక్షాదితో నారాయణాంశకః

అస్మై విజ్ఞాపితం చైతదస్మభ్యం జ్ఞాపయిష్యతి ||౨౬

ఇక్కడ సాక్షాత్తు నారాయణాంశ కలిగిన దత్తాత్రేయుడు ఉన్నాడు. ఆ స్వామిని మనం ప్రార్థిస్తే అతడు  మనకు దారి చూపించగలడు

ఇతి సఞ్చిన్త్య మనసా దత్తాత్రేయమనుత్తమమ్ |
యోగినాం ప్రవరం సర్వే శరణం ప్రయయుస్సురాః ||౨౭

అని మనస్సులో భావించి తనకంటే ఉత్తముడు లేనివాడు, సర్వోత్తముడయినవాడు, యోగులలో శ్రేష్ఠుడయిన  దత్తాత్రేయుని శరణువేడి దేవతలందరూ  ఈ విధముగా ప్రార్థించారు.

విశేషాలు

యోగినాం ప్రవరం(యోగులలో శ్రేష్ఠుడు)

**మార్గ**శీర్ష పూర్ణిమ శ్రీ దత్త జయంతి అని సాధక లోకమంతా విశ్వసించే విషయం. సప్త ఋషులలో ఒకడు అత్రి మహాముని. ఆయన భార్య అనసూయా దేవి. వారికి త్రిమూర్తుల అంశలలో పుట్టిన వారిలో రుద్రాంశతో పుట్టినవాడు దుర్వాస మహాముని. బ్రహ్మాంశతో పుట్టినవాడు చంద్రుడు. శ్రీ మహావిష్ణువు అంశతో పుట్టిన తనయుడు శ్రీ దత్తుడు. అత్రి కుమారుడు కనుక ఆత్రేయుడు అయ్యాడు. అలా ఈ యోగి వరేణ్యుడు దత్తాత్రేయుడిగా లోక ప్రసిద్ధి పొందాడు.

సమస్త వేద, యోగ విద్యలకూ అధినాథుడు శ్రీదత్తుడు. సాక్షాత్తూ సుదర్శన చక్రావతార మూర్తి అయిన కార్తవీర్యార్జునునికి యోగ గురువు ఈయన. దత్తాత్రేయుడు బోధించిన మహా యోగము.. మంత్ర యోగం, లయ యోగం, హఠయోగం, రాజయోగం అనే నాలుగు యోగాల కలయిక. మంత్ర యోగం ద్వారా ఇంద్రియాలపై, మనసుపై, బుద్ధిపై, అహంకారంపై పట్టును సాధించవచ్చు.

లయ యోగం ద్వారా అభీష్ట దేవతను దేహంలోని కాలి బొటన వేలు, ముక్కుకొన, కనుబొమల మధ్య భాగము, తల వెనుక భాగము వంటి ఏదో ఒక సంకేత స్థానంలో ఉంచుకుని ధ్యానం చేసే విధానాన్ని సాధించవచ్చు. హఠ యోగం ద్వారా.. మహాముద్ర, ఖేచరీ ముద్ర, విపరీత కరణి, వజ్రోలి, మహా బంధం, జాలంధర బంధం, ఉడ్డీయాన బంధం, మూలబంధములను సాధించవచ్చు. రాజ యోగం ద్వారా యోగ శాస్త్రంలోని అష్టాంగాలైన యమ, నియమ, ఆసన, ప్రాణాయామాది అంగాల్లో.. ప్రాణాయామమునకు మోక్ష సిద్ధిలో ఎక్కువ ప్రాధాన్యమివ్వడం శ్రీ దత్త మహా యోగంలో గమనించాల్సిన విషయం ( ఆచార్య రాణి సదాశివ మూర్తి)

కనుకనే ఘటికాచల మాహాత్మ్యంలో దత్తాత్రేయుని యోగినాం ప్రవరం(యోగులలో శ్రేష్ఠుడు)గా పేర్కొన్నది.

అగస్త్యః-

ప్రసీద భగవన్ స్వామిన్ భక్తముక్తిప్రదాయక |
పరిపాలయ నస్సర్వాన్ దత్తాత్రేయ నమోఽస్తు తే ||౨౮

ఓ పూజ్యుడైన దత్తాత్రేయ స్వామీ !( అనసూయ, అత్రి మహాముని దంపతుల కుమారుడుగా జన్మించిన సాక్షాత్ మహావిష్ణువు) నీకు మేము నమస్కారము అర్పించుచున్నాము. నువ్వు భక్తులకు ముక్తిని అనుగ్రహించగల సమర్థుడివి. మమ్ములను దయతో పరిపాలించు.

సముద్రశాయీ భగవాన్ విష్ణుస్సర్వామరైస్స్తుతః |

అత్రిజ త్వం ప్రసన్నోఽసి దత్తాత్రేయ నమోఽస్తు తే । ౹౭౯

ఓ భగవాన్ దత్తాత్రేయుడా! నువ్వు పాలసముద్రములో శయనిస్తావు. అందరి దేవతల చేత పూజింపబడిన విష్ణుమూర్తివి. ఓ అత్రికుమారా! నువ్వు మా యందు ప్రసన్నుడివి కమ్ము. నీకు మేము నమస్కరించి స్తుతించుచున్నాము.

మరుద్వృథాసరిత్తీరే సన్నద్ధాముదమావహన్ ।
అర్థితో మునికన్యాభిః దత్తాత్రేయ నమోఽస్తు తే ॥౮౦

కావేరి నది ఒడ్డున సన్నద్ధుడవయి సంతోషాన్ని కలిగిస్తుంటావు.ఋషి కన్యలచే ప్రార్థించబడిన ఓ దత్తాత్రేయా! నీకు నా ప్రణామాలు అర్పిస్తున్నాను.

విశేషాలు

ప్రహ్లాదుడు ఒకసారి కావేరీ నదిలో స్నానసంధ్యలు గావించి నదీతీరంలో ప్రకృతి సౌందర్యాన్ని చూస్తూ అల్లంతదూరాన నేల మీద పడుకొని ఉన్న ఒక మహర్షిని చూచారు. ఆ మహర్షి శరీరం దుమ్ముకొట్టుకునిపోయి వుంది. కాని శరీరం నుంచి దివ్యతపః కిరణములు పెల్లుబుకుతున్నాయి. ఎవరీ మహర్షి? ఎందుకు ఇలా నేల మీద పడివున్నాడు. ఉలుకు పలుకూ లేదు. కదలిక మెదలికాలేవు. సమీపంలో ఆశ్రమంకానీ కుటీరంగాని లేదు ఇది ఏమైనావ్రతమా? నియమమా? లేదా ఇంకేదైనా వుందా? తెలుసుకుందామని ఆ మహర్షి పాదముల చెంత కూర్చున్నాడు. పాదములకు శిరస్సు ఆన్చి నమస్కరించాడు మృదువుగా ఆ పాదములను తనఒడిలోకి తీసుకుని మెల్లమెల్లగా ఒత్తుతూ మహానుభావా! అని భయం భయంగా పలకరించాడు. ఆయన మెల్ల మెల్లగా కన్నులు తెరిచి ప్రహ్లాదుని వంక ఏమిటి అన్నట్లు చూచాడు.

ఈ మహర్షి రూపములో ఉన్న స్వామి దత్తాత్రేయుడు. ఆ కావేరీతీరస్థుడయిన దత్తాత్రేయుని ఈ ఘటికాచల మాహాత్మ్య స్తుతిలో మరుద్వృథాసరిత్తీరే అంటూ ప్రస్తావించారు.

“ప్రహ్లాదా! ఈ సృష్టిలో తేనెటీగ ఒకటి మరియు అజగరం ఒకటి నాకు గురువులు. ఎలాగంటే చెబుతాను విను. తేనెటీగలు అష్టకష్టాలుపడి తేనెను సమకూరుస్తాయి పట్టులో. లోభంతో తేనెను కూడబెడతాయి. ఎవడో వచ్చి పొగ పెట్టి ఆ తేనేటీగల్ని చంపి పారద్రోలి ఆ తేనె కాస్తా అపహరించుకుపోతాడు. తేనెటీగలకు మిగిలింది ఏమిటి చెప్పు. అలాగే మానవులు ధనం కూడబెడతారు. చివరకు దాని వలనే నశిస్తారు. అందువల్ల తేనెటీగల్ని చూచి వైరాగ్యం నేర్చుకొన్నాను. ఇంకొకటి మహాసర్పం (కొండ చిలువ) వుంది చూచావా! అది కదలదు మెదలదు అందుబాటులో ఆహారాన్ని మాత్రమేస్వీకరిస్తుంది. తనకై తను సొంతంగా ప్రయత్నం చేయదు. ఏ తిండీ దొరక్కపోతే హాయిగా కడుపులో కాళ్ళుపెట్టుకుని పడి వుంటుంది. ఎన్నాళ్ళయినా ఈ అజగరము ఇలాగే పస్తులుంటుంది. ఈ అజగరాన్ని చూచి సంతుష్టిని నేర్చుకొన్నాను. లేదని ఎవరిని అడగను. రాదని దుఃఖపడను. ఎవరు పిలిచినా ఆ అనను. ఏది ఇచ్చినా వద్దు అనను. నాకు సుఖము లేదు దుఃఖము లేదు. విలువైన పట్టుబట్టలు కట్టినా, గుడ్డపీలకలే ధరించినా, అసలు ధరించకపోయినా నా మనస్సుకి తేడాలేదు”అని అద్భుతమైన బోధను దత్తాత్రేయుడు ఈ సందర్భంలోనే ప్రహ్లాదునికి బోధిస్తాడు.

**81 -90**

నర్మదాతీరవాసీ త్వం దృశ్యాదృశ్యవపూరిహ ।
విమోహయస విశ్వాత్మన్ దత్తాత్రేయ నమోఽస్తు తే ॥౮౧

ఓ విశ్వాత్మా! (ప్రపంచమే ఆత్మగా కలవాడా ! పరమాత్మా!) . ఓ దత్తాత్రేయా! మీరు నర్మదా నది ఒడ్డున కనబడీ కనబడని రూపాలను ధరిస్తుంటావు. మోహింపచేస్తుంటావు. నీకు నా ప్రణామాలు అర్పిస్తున్నాను.

**విశేషాలు**

అంతఃపురకాంతలతో జలకాలాడుతూ తన వెయ్యి బాహువులనూ సాచి నర్మదా నదీ ప్రవాహానికి అడ్డుకట్టవేసిన కార్తవీర్యార్జునునికి తగురీతిలో బుద్ధి చెప్పినవాడు దత్తాత్రేయుడు. ఆ వృత్తాంతము ఇక్కడ అనుసంధానీయం.

అధిత్యకాయం సన్ధాస్య తతో యత్పులకావృతమ్|
ప్రహర్షయసి గన్ధర్వాన్ దత్తాత్రేయ నమోఽస్తు తే ||౮౨

ఓ దత్తాత్రేయా ! ఒకసారి ఉన్నతోన్నతంగా నువ్వు శరీరాన్ని అనుసంధానిస్తూ , ఆ దృశ్యాన్ని చూసిన పులకలు కలిగిన గంధర్వులను సంతోషపెడుతుంటావు.నీకు నా ప్రణామాలు అర్పిస్తున్నాను.

**విశేషాలు**

దత్తాత్రేయుడు స్వయంగా గంధర్వదంపతుల కథను దత్తపురాణంలో చెబుతాడు.

విశాలాక్షుడు, సుశీల అను మానవ దంపతులు తాము ఉపాసించిన గాంధర్వ కామశాస్త్రాల మహిమ వల్ల అతడు గంధర్వుడుగా ఆమె గంధర్వ కన్యగా గంధర్వ లోకంలో పునర్జన్మలు పొందారు. అక్కడా దంపతులయ్యారు. ఆడుతూ పాడుతూ ఇష్టం వచ్చినట్లుగా భోగాలు తనివితీరా ఆస్వాదిస్తున్నారు. ఒకనాడు కైలాసానికి దగ్గరలో వున్న ఉద్యానవనంలో వీరికి పార్వతీ పరమేశ్వరులు విహరిస్తూ కనిపించారు. దంపతులిద్దరూ సాష్టాంగపడ్డారు. నాదవేత్త అయిన గంధర్వుడు మంజుల స్వరం విప్పి మెల్లగా ఆదిదంపతులపై స్తుతిగీతం అందుకున్నాడు. గంధర్వసుందరి వీణ మీటినట్లుగా గొంతు కలిపింది. పార్వతీ పరమేశ్వరులు ఎంతగానో సంతోషించారు. నాదజ్ఞుడైన శివుడైతే మరింత ప్రసన్నుడై ఆనందంతో ఇంతటి ఉత్తమగీతాన్ని సంగీతాన్ని నేనెప్పుడ వినలేదు. గంధర్వుడా నువ్వు ధన్యుడవు, కృతకృత్యుడవు. నువ్వూ, నీ భార్యా ఇంద్రలోకం వెళ్ళండి ఇది నా ఆజ్ఞ అని వరమిచ్చాడు. గంధర్వ దంపతులు ఆనందంతో మరింతగా స్తుతించారు. ఇంతలో ఒక దివ్య విమానం వచ్చి వీరి దగ్గర నిలిచింది. దాన్ని ఎక్కి గంధర్వ దంపతులు (సుశీలా విశాలాక్షులు) ఇంద్రలోకం చేరుకొన్నారు.

జమదగ్నిప్రియా యేన ద్రవీభూతా సురాశినా |
పురా నిష్పన్దమభవత్ దత్తాత్రేయ నమోఽస్తు తే || ౮౩

ఓ జమదగ్నికి ఇష్టమైనవాడా ! ఓ దత్తాత్రేయా ! పూర్వము ఒకసారి అందమైన రాజగుణముతో , దయార్ద్ర హృదయము కలిగినవాడివై , నిశ్చలత్వాన్ని పొందావు.నీకు నా ప్రణామాలు అర్పిస్తున్నాను.

**విశేషాలు**

1. పరశురాముని తండ్రి జమదగ్ని. శివ స్వరూపుడు. కార్తవీర్యార్జునుని కుమారులు జమదగ్ని తల నరికివేసారు. అప్పుడు జమదగ్నిని, తల్లిరేణుకను ఒక కావిడిలో ఉంచుకొని దిగంబర సన్యాసి రూపంలో ఉన్న దత్తాత్రేయుని దగ్గరకు పరశురాముడు వస్తాడు. అప్పుడు దత్తాత్రేయుడు జమదగ్నికి నమస్కారం చేస్తాడు. అందుకే ఘటికాచల మాహాత్మ్యం జమదగ్ని ప్రియా అని దత్తాత్రేయుని సంబోధించింది.

2. యస్య చిత్తం ద్రవీభూతం/కృపయా సర్వ జంతుషు/తస్య జ్ఞానేన మోక్షేణ/కిం జటా భస్మ లేపనైః  అని ఒక ప్రాచీనశ్లోకం  ద్రవీభూత పదాన్ని అందంగా ప్రయోగించింది. దయార్ద్ర హృదయము ఉంటే చాలు.  ముక్తి కోసం  జప తపాదులు, విభూతి లేపనములు, జడలు కట్టేటంత కఠోర తపస్సులు అవసరంలేదు. వీటన్నింటినీ మించినది దయాగుణము.
3. *సురాశి దేశే రాజన్వాన్ స్యాత్ సురాశీతి || శోభనో రాజా యత్ర |( అమరకోశం ద్వితీయకాండం. )*

నానారూపం సమాస్థాయ వినా వర్ణైస్సమావృతః |
సంప్రీణయసి ధర్మాత్మన్ దత్తాత్రేయ నమోఽస్తు తే ||౮౪

వివిధ రూపాలను స్వీకరించి,  మరియు వర్ణములు  లేకుండా అందరితోటి కలిసిపోయిన  ఓ ధర్మాత్ముడైన దత్తాత్రేయా ! నాకు తృప్తి కలిగించు. నీకు నా ప్రణామాలు అర్పిస్తున్నాను.

విశేషాలు

దత్తాత్రేయస్వామి వారు పరస్పర విరుద్ధరూపాలలో తిరుగుతుంటారు. భక్తులను కఠినంగా పరీక్షిస్తుంటారు. ఒక్కోసారి జటామండలధారిగా మరుక్షణంలో ముండిత శిరస్కుడుగా, యోగిగా, భోగిగా, దిగంబరుడుగా, శ్వేతాంబరుడుగా, పీతాంబరుడిగా, కనిపిస్తారు. ఒక్కోసారి మహా విద్వాంసుడిగా కనిపిస్తే మరోసారి ఉన్మత్తుడిగా, మదమత్తుడిగా, కనిపిస్తారు. ఒకోసారి భిక్షాటన చేస్తూ కనిపిస్తారు. ఒకోసారి మహైశ్వర్య సంపన్నుడిగా కనిపిస్తారు. నిజమైన రూపం ఏది అనేది ఎవ్వరికీ తెలియదు. అంతుపట్టని రహస్యం. హర, హరి, హిరణ్యగర్భులుగా కనిపిస్తూ, ఒకేసారి త్రిమూర్తి స్వరూపుడవుతాడు. గంగలో స్నానం చేసి, కొల్హాపురిలో బిక్షచేసి, సహ్యాద్రిపై నివసిస్తూ ఉంటారు. త్రికరణశుద్ధిగా స్మరిస్తే భక్తులకు కనిపిస్తారు. స్మర్తృగామి అనేది ఈ స్వామికి గొప్ప బిరుదు. (**స్మరించినవారిని శీఘ్రముగా పొందువారే స్మర్తృగాములు)**

భుక్తిం వై భుక్తికామేషు ముక్తిం ముక్త్యభికామిషు|
ప్రదాస్యతి భవానేవ దత్తాత్రేయ నమోఽస్తు తే ||౮౫

ఇహలోక పరలోక భోగానుభవాన్ని కోరుకునే వారికి ఇహలోక పరలోక భోగానుభవాన్ని , మరియు ముక్తి కోరుకునే వారికి ముక్తిని ఓ దత్తాత్రేయా ! నువ్వే  ప్రసాదిస్తావు. నీకు నా ప్రణామాలు అర్పిస్తున్నాను.

కేనాపి కామేన భవాన్ తపాంసి కురుతే క్వచిత్ |
క్వచిత్విహరతే రాగీ దత్తాత్రేయ నమోఽస్తు తే | ౮౬

కొన్నిసార్లు నువ్వు ఏదో ఒక ప్రయోజనం కోసం తపస్సు చేస్తున్నట్లు కనబడతావు. ఓ దత్తాత్రేయా ! మరి కొన్నిసార్లు మోహాన్ని ఆస్వాదించే అనురాగ శీలిలా కనబడుతుంటావు..  నీకు నా గౌరవపూర్వక ప్రణామాలు అర్పిస్తున్నాను.

ఇతి స్తుతో మహాయోగీ ప్రీణయన్నఖిలాన్ సురాన్ |

దత్తాత్రేయస్స భగవానూచివాన్ వచనం తదా || ౮౭

ఇట్లు అఖిలదేవతలచే స్తుతింపబడిన మహాయోగి దత్తాత్రేయుడు సంతోషించి వారితో ఇలా అన్నాడు

దత్తాత్రేయః-

భో మహేన్ద్రాదయో దేవాః కిమిదానీముపస్థితమ్ |

ప్రశంసత భయం త్యక్త్వా క్రియతే భవదీప్సితమ్ ||

. "ఓ ఇంద్రాది దేవతలారా! ఇప్పుడు ఏమి జరిగింది? మీ భయమును వీడి మీ కోరిక చెప్పండి." అన్నాడు.

సురాః-

మహాకులధనం సూర్యరక్షితం వసు నామకమ్ |

పురాస్మాభిర్దైత్యయుద్ధే దత్తం హవ్యభుజాశ్రమే ||౮౯

సూర్యుడు రక్షించు "వసు" అను పేరు గల మా కులధనాన్ని మేము అగ్నికి దాచి పెట్టమని మాకు రాక్షసులకు యుద్ధం జరిగే సమయంలో ఇచ్చాము. అగ్ని నుంచి మా ధనాన్ని రాక్షసులు అపహరించాలి అని అనుకుంటున్నారు

అస్య దుర్లలితే భీత్యా కుతోఽపి దలితం వసు |

సర్వే వయం విచిన్వన్తస్సేన్ద్రాస్సాగ్నిపురోగమాః | | ౯౦

అగ్ని యొక్క అరుదైన భయం కారణంగా, అతని దగ్గర మేము దాచిన సంపద ఎక్కడ జారిపోయిందో మాకు తెలియటంలేదు .ఇంద్రుడు అగ్ని మొదలైన మేమందరము దానిని వెతుకుతూ వస్తున్నాము.

91 -100

ప్రసీద వాసం శరణం భవన్తమిహ విష్ఠితమ్ |

తన్నివేదయితా త్వాం వై వినా కోఽపి న విద్యతే | | ౯౧

మాపై నువ్వు దయ చూపించవలసినది నిన్ను శరణు కోరుచున్నాము ఆ ధనము ఎక్కడుందో మాకు చెప్పగలిగినవాడివి నువ్వు తప్ప వేరొకరు లేరు.

భవద్వసూని సంగృహ్య బలవన్తో వయం సదా || ౯౨

ఆ వసు అనేటువంటి ధనాన్ని నీ ద్వారా మేము కనుగొని మేము ఎల్లప్పుడూ బలవంతులుగా మారతాం.

దత్తాత్రేయః -

ఇతో రక్తశిలాయాం వై లక్ష్యతే వసువామకమ్ |

యుష్మన్మూలధనం బహనేర్ధూరాత్ సంపతితం భువి | | ౬౩
వారి మాటలు విని దత్తాత్రేయుడు వారితో ఇలా అన్నాడు- ఇక్కడ ఎర్ర రాతి మీద మీ మూలధనమైన వసు అను పేరు గల ధనము ఉన్నది. అది అగ్ని నుంచి జారి కింద పడినది.

భూతాధిపోऽరక్షదిమం నికుమ్భ ఇతి విశ్రుతః |
మదాశయా ప్రేరితస్తు నిస్తారయతి వైరిణః ||౬౪
నా చేత ప్రేరితుడై భూతాధిపుడైన నికుంభుడు అనేవాడు దానిని రక్షిస్తున్నాడు

తత్ర గచ్ఛత హే దేవాః యూయం స్వస్తి భవద్వచః |
నికుమ్భస్స తు విజ్ఞాయ సర్వ విజ్ఞాపయిష్యతి | | ౬౫
ఓ దేవతలారా ! మీరు నికుంభుని దగ్గరకు వెళ్ళండి. మీ అందరికీ శుభము జరుగుగాక! నికుంభుడు మీకు సర్వము తెలుపగలడు.

అగస్త్యః
తతో నిశమ్య తద్వాక్యం సంప్రహృష్టా దివౌకసః |
నికుమ్భరక్షితం వామం వసు గృహ్యేదమబ్రువన్ ||౬౬
ఆ దత్తాత్రేయుని మాటలు విని ఆ దేవతలందరూ చాలా సంతోషించి నికుంభుని దగ్గరకు వెళ్లి అతని చేత రక్షింపబడుతున్న వసు అనేటువంటి ధనాన్ని స్వీకరించారు.

సురాః-
దత్తేన వసు వామం వై రక్షితం నిమ్నసీమని |
వసుప్రభృతిసంపూర్ణ సలిలైః ప్రభవిష్యతి ||౬౭
దేవతలందరూ ఆ వసు అనే ధనమును స్వీకరించిన పిదప ఇలా అన్నారు -దత్తాత్రేయులచే వసు అనే పేరు గల ధనము రక్షించబడినది కనుక ఇది మొదలు ఈ ధనము రక్షించబడిన చోట ఒక నిండు జలాశయము ఏర్పడగలదు.

ఇదం క్రీడాసరో నామ దత్తాత్రేయస్స యాస్యతి |
ఇదం రత్నతటాకం చ వ్యాహరన్తి పురావిదః || ౬౮
ఇది దత్తాత్రేయుని క్రీడా సరోవరము కాగలదు. గత చరిత్ర తెలిసిన వారు దీనిని రత్న తటాకము అనే పేరుతో కూడా పిలుస్తారు.

వామానాం చ వసూనాం వై రక్షణాదేవ కారణాత్ |

ఇదం దేవసరో నామ వ్యాహరన్తి మనీషిణః || ౯౯

వసువు అనే దేవతలకు సంబంధించిన ధనమును రక్షణకొరకు దాచి ఉంచిన చోటు కనుక ఈ సరోవరమును దేవసరోవరము అనే పేరుతో కూడా పిలుస్తారు.

అత్ర యే మనుజా దేవాః గన్ధర్వాశ్చాపి కిన్నరాః ।
స్నాన్తి దత్త హ్రదే తైస్తు ప్రాప్యన్తే సర్వసంపదః || ౧౦౦

ఇచ్చట స్నానము చేసిన మనుష్యులు ,దేవతలు, గంధర్వులు, కిన్నరులు సర్వసంపదలు పొందుతారు.

101 -110

అగస్త్యః
గృహ్య వామం వసు సురాః నృహరిం వన్ద్య తత్క్షణాత్ ।
దత్తం చ శ్లాఘయన్తో వై స్వారాజ్యం ప్రతిపేదిరే || ౧౦౧

ఈ విధముగా చెప్పి వసు అను ధనమును గ్రహించిన దేవతలందరూ నరసింహస్వామిని సేవించి దత్తాత్రేయుని శ్లాఘించి, స్వర్గమునకు తిరిగి వెళ్ళారు

తత్ర రక్తతటాకే యస్స్నాతి మర్త్యస్స్వబన్ధుభిః ।
భోగాననన్తాన్ సంప్రాప్య ప్రేత్య స్వర్గే మహీయతే || ౧౦౨

ఈ రక్త తటాకములో ఎవరు స్నానము చేస్తారో వారు తమ బంధువులతో సహా అనేక భోగములు అనుభవించి చివరకు స్వర్గలోక భాగ్యాన్ని పొందుతారు

అస్య ప్రాచీనసద్రోణ్యాం కాన్తారం వ్యాఘ్రసేవితమ్ ।
నానా ఋషిగణాకీర్ణం దృశ్యతే బహుపాదపమ్ || ౧౦౩

ఈ రక్త తటాకమునకు తూర్పు వైపున పులులు సేవితమైన ఒక అడవి ఉన్నది. అందులో అనేకమంది ఋషులు అనేక చెట్లు ఉన్నాయి.

విశ్వామిత్రస్య భవితా తస్యాశ్రమపదం పరమ్ ।
యస్య బ్రాహ్మ్యం మహాతేజో నృసింహో దాస్యతి క్షణాత్ | | ౧౦౪

ఈ అడవిలోని ఆశ్రమంలో విశ్వామిత్రుడు నరసింహ స్వామిని ఆరాధించి ఆయన అనుగ్రహముతో బ్రహ్మ తేజస్సును పొందుతాడు.

### వసిష్ఠతీర్థము

వసిష్ఠస్యాశ్రమపదం తస్య దక్షిణతో మునే ।
తస్య సౌరమహారాజా తమర్థయతి సజ్జమాత్ || ౧౦౫

దీనికి దక్షిణమున వశిష్ఠాశ్రమము ఉన్నది. సూర్యవంశపు రాజు అయిన శ్రీ రాముడు యోగ వాసిష్ఠ గ్రంథానుబంధం కొరకు ఇక్కడే వసిష్ఠుని ప్రార్థించాడు.

గీయతే చ పురాణేషు శ్లోకోఽయం బ్రహ్మణా పురా ।
పురాణకర్తా భగవాన్ నప్తా యస్య మునీశ్వరః ।। ౧౦౬

పురాణాలలో, ఈ యోగవాసిష్ఠం చాలా పేరుపొందినది. పూర్వం పురాణాలను రచించిన గొప్ప ఋషి అయిన వశిష్ఠుని మునిమనుమడు వ్యాసుడు ,బ్రహ్మ దేవుడు ఈ గ్రంథాన్ని కీర్తించారు.

విశేషాలు

వశిష్ఠుని కుమారుడు శక్తి. శక్తి కుమారుడు పరాశరుడు. పరాశరుని కుమారుడు వ్యాసుడు .

స బ్రహ్మయోగవిద్యా యస్య సుభ్రూ అరున్ధతీ ।
పురా రామస్య ధర్మాత్మా సానుజో వంశవర్ధనః ।। ౧౦౭

అందమైన కనుబొమ్మలు కలిగిన అరుంధతి లాంటి భార్యతో ఆ వసిష్ఠుడు, పరమ సత్యాన్ని తెలుసుకున్నవాడు.అటువంటి వశిష్ఠునిచే రచింపబడిన యోగవాసిష్ఠము( వసిష్ఠరామాయనము) ఒక బ్రహ్మయోగవిద్యాదర్పణము. పూర్వము గుణశీలాదులు కలిగిన తమ్ములలు కలిగినవాడు , ధర్మాత్ముడు , వంశపు పేరును వృద్ధి చేసిన నీతిమంతుడు శ్రీరాముడు.

విశేషాలు

యోగవాసిష్ఠము, అఖండ రామాయణము అని వినుతికెక్కిన గ్రంథరాజమే 'వసిష్ఠ రామ సంవాద' రూపమున నాలుగు సంపుటములుగా ఆవిష్కరింపబడినది. అవతార పురుషుడు, ధర్మాత్ముడు అయిన శ్రీరామచంద్రునికి కలిగిన నిరాశా నిస్పృహలతో కూడిన వైరాగ్యము తొలగించి కార్యోన్ముఖుడిని కావించడానికి వసిష్ఠులవారు చేసిన ఫలవంతమైన ప్రయత్నమిది. ఇందులో బ్రహ్మజ్ఞానం, కర్మజ్ఞాన మార్గాలను రెండింటిని ఆచరిస్తేనే మోక్షము లభిస్తుందని తెలుపబడుతుంది.

సరయూరోధవసతిర్జానకీవాక్యచోదితః ।
వసిష్ఠం జపతాం శ్రేష్ఠమిదం వచనమబ్రవీత్ । ౧౦౮

ఒకసారి సరయూ నది ఒడ్డున జానకి మాటలతో ప్రేరేపించబడి మంత్రోపదేశకులలో అత్యుత్తముడైన వశిష్ఠుని దగ్గరకు వచ్చి శ్రీరాముడు ఇలా ప్రార్థించాడు.

రామ:

చిరస్థాయి చరిత్రం వై యథా భవతి తద్బవాన్।
మునే సంస్కృతయా వాచా కరోతు చరితం మమ ।। ౧౦౯

స్వామీ! నా చరిత్రను చిరస్థాయి అగునట్లు మీరు సంస్కృత భాషలో వ్రాయండి.

నరకేసరిశైలస్య పాదపార్శ్వే మనః కృథాః ।

యత్రాఞ్జనేయో నృహరేః ప్రీతయే కురుతే తపః | ।౧౧౦

ఎక్కడ ఆంజనేయుడు నరహరి ప్రీతి కొరకు తపస్సు చేసాడో, అక్కడ నరహరి శిఖర పార్శ్వములో మీ మనస్సును నిలిపి నా చరిత్ర వ్రాయండి.

111  -116

గత్వా తత్ర మహాభాగ నృసింహానుజ్ఞయా భవాన్ |

మామకం చరితం కృత్వా వైష్ణవం లోకమేష్యతి | | ౧౧౧

ఓ పూజ్యుడా ! ఆ నరహరిశిఖర ప్రాంతానికి వెళ్లి నరసింహుని ఆజ్ఞతో నా చరిత్రను వ్రాసి విష్ణులోకమును పొందగలరు"అని రాముడు వశిష్ఠుని అడిగాడు.

అగస్త్యః

ఇత్యుక్తోఽరున్ధతిపతిరనుజ్ఞాప్య రఘూద్వహమ్ |

వసన్నిహ వసిష్ఠస్య ప్రీణయామాస వైష్ణవాన్ ||౧౧౨

ఈ విధముగా రఘుకులోత్తముడైన శ్రీరామునిచే  చెప్పబడిన  వశిష్ఠుడు ఇచ్చట నివసించి  వైష్ణవులకు ప్రీతి పాత్రమగునట్లు శ్రీరాముని చరిత్రను వ్రాసాడు.

అనుగ్రహేణ నృహరేర్వైష్ణవానాం ద్విజన్మనామ్ |

మాహాత్మ్యం రఘునాథస్య కృతవాన్ భగవాన్ మునిః | | ౧౧౩

"నృసింహస్వామి  అనుగ్రహముతో వైష్ణవులు మరియు బ్రాహ్మణుల ఆశీర్వాదముతో  మహర్షి వశిష్ఠుడు శ్రీరాముని  గొప్పతనాన్ని వర్ణిస్తూ శ్రీరామ చరిత్ర వ్రాసాడు.

తస్యాశ్రమపదం నానాఋషిసఙ్ఘనిషేవితమ్ |

వసిష్ఠతీర్థం తత్రైవ శోభతే నిర్మలోదకమ్ || ౧౧౪

ఆ వశిష్ఠుని ఆశ్రమము నానా సమూహములచేత సేవింపదగినది.  ఇచ్చట  స్వచ్ఛమైన జలములతో   వశిష్ఠ తీర్థము కలదు.

వసిష్ఠతీర్థే యే స్నాన్తి యే వా తత్పదవాసినః |

తే మాహాత్మ్యవిదో విష్ణోస్సాన్నిధ్యం ప్రాప్నుయుర్నరాః | | ౧౧౫

ఈ వశిష్ఠ తీర్థములో  స్నానము చేసిన వారు, ఆ ప్రదేశములో నివసించువారు, ఆ తీర్థ మాహాత్మ్యము తెలిసిన వారు   విష్ణుసాన్నిధ్యమును పొందగలరు.

అద్యాయం పఠతే భక్త్యా య ఇదం శృణుతే నరః ।

సమర్త్యస్సగణో లోకాన్వైష్ణవాన్ప్రాప్నుయాత్ సుధీః ।। ౧౧౬

ఈ అధ్యాయమును భక్తితో  చదివినమానవుడు , విన్నమానవుడు తమతమ బంధుసమూహములతో కలిసి  విష్ణులోకమును చేరగలరు

ఇతి బ్రహ్మకైవర్తే ఉత్తరఖణ్డే భృగుపరాశరసంవాదే ఘటికాచలమాహాత్మ్యే పఞ్చదశోఽధ్యాయః ।।

ఇక్కడితో  బ్రహ్మ-కైవర్త పురాణంలోని ఉత్తరఖండంలో భృగువు మరియు పరాశరుని మధ్య జరిగిన సంభాషణలో ఘటికాచల మాహాత్మ్యంలో పదిహేనవ అధ్యాయం పూర్తి అయినది. +++++

శ్రీ శివాయ గురవే నమః

ఘటికాచలనివాసాయ శ్రీ నృసింహాయ నమః

బ్రహ్మకైవర్త పురాణములో ఉన్న  శ్రీఘటికాచల మాహాత్మ్యపు  పదహారవ  అధ్యాయము

(మూల శ్లోకము మరియు తాత్పర్య విశేషాలతో)

1-10

షోడశోఽధ్యాయః

అగస్త్యః-

బ్రహ్మరుద్రేన్ద్రమరుతామపి గృహ్య ప్రదక్షిణమ్ ।

అన్తరం చ తథా గృహ్య దృశ్యతే తదనుగ్రహాత్ ।।౧

అంతర మహా ప్రదక్షిణాల గురించి అగస్త్యుడు వామదేవునితో చెబుతున్న సందర్భం.

ఓ వామదేవా! ఈ అంతర ప్రదక్షిణము చేసిన వారిని బ్రహ్మదేవుడు రుద్రుడు మొదలైన వారు కూడా అనుగ్రహిస్తారు.

విశేషాలు

1. శ్రీఘటికాచల మాహాత్మ్యం 11 వ అధ్యాయంలో కూడా ప్రారంభంలో ఈ అంతర ప్రదక్షణ ప్రసక్తి ఉన్నది.( ప్రదక్షిణద్వయం తత్ర విజ్ఞేయం నగసత్తమే | మహాప్రదక్షిణం విద్వానాన్తరం చ యథాక్రమమ్ ||౩ పర్వతానికి రెండు రకాలుగా ప్రదక్షిణ చేయాలి .మొదటిది మహాప్రదక్షిణము. రెండవది అంతర ప్రదక్షిణము .) మరలా అదే విషయాన్ని దాని ప్రాముఖ్యతను నొక్కి చెప్పటానికి అగస్త్యుడు ఈ  అధ్యాయ ప్రారంభంలో చెబుతున్నట్లుగా భావించాలి.
2. ప్రదక్షిణలలో ఆత్మప్రదక్షిణ, ప్రాకార ప్రదక్షిణ, గిరి ప్రదక్షిణ,అర్ధ ప్రదక్షిణ అని నాలుగు  రకాలున్నాయి.
3. మన ఆత్మలోనే పరమాత్మ ఉంటాడని నమ్మి  ఎవరికి వారే తమ చుట్టూ తాము తిరిగి చేసేదాన్ని ఆత్మ ప్రదక్షిణ అంటారు.
4. ప్రాకార ప్రదక్షిణ అంటే మూల విగ్రహానికి చేసే ప్రదక్షిణ.ఈ  ప్రాకార ప్రదక్షిణలో ధ్వజ స్తంభం ప్రదక్షిణ , పాద ప్రదక్షిణ, నమస్కార ప్రదక్షిణ, అంగప్రదక్షిణ అని   నాలుగు రకాలున్నాయి. (అ)ధ్వజ స్తంభం ప్రదక్షిణ  అర్థం పేరులోనే తెలుస్తుంది. ధ్వజస్తంభం చుట్టూ చేసే ప్రదక్షిణ.  పాద ప్రదక్షిణ. దీన్నే పడి ప్రదక్షిణ అంటారు. (ఆ)పాదానికి పాదం తాకిస్తూ అడుగులు వేస్తూ చుట్టూ తిరిగే ప్రదక్షిణ పాద ప్రదక్షిణ. (ఇ) నమస్కార భంగిమలో చేసే  ప్రదక్షిణ నమస్కార ప్రదక్షిణ. (ఈ) దీన్నే పొర్లుకుంటూ చేసే  ప్రదక్షిణ అంగప్రదక్షిణ.
5. కొండ చుట్టూ చేసే ప్రదక్షిణ గిరి ప్రదక్షిణ. ఇలా  గిరి ప్రదక్షిణ చేస్తే కోటి సార్లు అంగప్రదక్షిణ చేసిన ఫలితం వస్తుందని చెబుతారు. అరుణాచల గిరి ప్రదక్షిణ ప్రసిద్ధికి ఎక్కినది.
6. శివలింగానికి అర్ధ ప్రదక్షిణ చేయాలి. . అంటే సగం వరకు ప్రదక్షిణ చేసి మరల వెనుకకు తిరిగి చేసే ప్రదక్షిణ .సాధారణంగా శివాలయాల్లో 'మహాప్రదక్షిణ' చేస్తారు. బలిపీఠం నుండీ మొదలుపెట్టి ఆలయం చుట్టి తిరిగి ధ్వజస్తంభం [బలిపీఠం] వరకూ చుట్టాక, తిరిగి వెనక్కు ప్రదక్షిణ  ధ్వజస్తంభంవరకూ చేయటం.అంటే ఒక ప్రదక్షిణ ఒక అప్రదక్షిణ కలిపి మహా ప్రదక్షిణ అన్నమాట.

అయితే  శ్రీఘటికాచలంలో మాత్రం మహా ప్రదక్షిణకు విభిన్నార్థం కనిపిస్తున్నది. బ్రహ్మతీర్థంలో స్నానమాడి, అగ్నితీర్థం, సోమకుండం, పద్మసరోవరం, వాల్మీకితీరం, వజ్రతీర్థం మొదలైనవానిలో స్నానం చేసి, గిరిప్రదక్షిణం చేయడం మహాప్రదక్షిణం అనబడుతుంది. బ్రహ్మతీర్థంలో స్నానం చేసి భైరవతీర్థం, హలావర్తతీర్థం, వరాహతీర్థం, పుండరీక తీర్థం, గారుడం, పాపవినాశం, అమృతకుండం,వామతీర్థం, రత్నతీర్థం, వశిష్ఠతీర్థం అనే తీర్థాలలోను, లక్ష్మీతీర్థంలోను స్నానమాడి ఘటికాద్రి చుట్టూ ప్రదక్షిణం చేయడం అంతరప్రదక్షిణమని చెబుతారు.

7. తథా ప్రదక్షిణద్వన్ద్వం కురు త్వం విజితేన్ద్రియః |

అందువలన ఇంద్రియములను జయించు  స్వభావము కలిగిన వాడివై రెండు అంతర ప్రదక్షిణములను చేయుము.

స్నానం చ భవతా కార్యం హనుమత్కమలాకరే ||౨

హనుమత్ కమలాకరములో(తామరకొలను) స్నానము చేయుము.

తముపాస్య హనూమన్తం ప్రార్థితం లభ్యతే త్వయా ।

అలా స్నానము చేసిన పిదప హనుమంతుని ప్రార్థించి నువ్వు కోరుకున్న వరాన్ని పొందగలవు.

తోషణేన పితౄణాం చ నృహరేః పదమేష్యతి ||౩

ఈ కమలాకరము దగ్గరే నీ పితృదేవతలను కూడా తృప్తిపరచి అటుపిమ్మట నరసింహస్వామి సన్నిధిని చేరగలవు.

ఇతోఽవరున్ధ్య శైలేన్ద్రాత్పశ్చిమాం దిశమాస్థితః ।

ఇక్కడ నుండి ఈ గొప్ప పర్వతానికి పశ్చిమ దిక్కుగా వెళ్ళుము

గచ్ఛ శీఘ్రం మహాత్మంస్త్వం సుధా సంప్రాప్యతే త్వయా ||౪

అలా వెళ్ళిన పిమ్మట నీకు ఆ పశ్చిమ దిక్కులో అమృతము లభించగలదు.

యథా హనూమాన్ తేజస్వీ ప్రసన్నో భవితా తథా

క్రియతాం యత్నసంపత్తిస్సర్వం సేత్స్యతి చిన్తితమ్ ||౫

అక్కడ హనుమంతుడు ఉన్నాడు. ఆ హనుమంతుడు నీ యెడల ప్రసన్నుడైతే నువ్వు ఎలా జరగాలని అనుకుంటున్నావో అలా ప్రతిదీ నెరవేరుతుంది.

కిమత్ర బహునోక్తేన శ్రోతవ్యో భగవాన్ త్వయా ।

స్తుతిప్రసన్నో భగవాన్ దద్యాన్నృణామభీప్సితమ్ ||౬

ఈ విషయంలో ఇంకా చెప్పవలసినది ఏముంటుంది? చక్కగా స్తోత్రం చేస్తే హనుమంతుడు అనుగ్రహం చూపించి మానవులు కోరుకున్న కోరికలన్నింటిని ఇవ్వగలడు.

అజానన్ స్వబలం నిత్యం స్తుత్యా జానన్మహామతే ।

అలక్షీకురుతే సర్వాన్ సూర్యో వా యది చన్ద్రమాః ||౭

హనుమంతుడు తన బలమును తాను తెలుసుకోలేడు కానీ ఇతరులు స్తోత్రము చేసినప్పుడు మాత్రం సూర్యుడు చంద్రుడు మొదలైన వారిని కూడా లెక్క చేయక తనను స్తోత్రము చేసిన వారి కోర్కెలు తీరుస్తాడు.

పురా యం మన్దరం శైలమధ్యువాస సమీరణః ।

అఞ్జనాస్పర్శనేనాముమజీజనదనుత్తమమ్ ||౮

పూర్వము ఈ పర్వతము మీద వాయుదేవుడు అంజనాదేవిని స్పర్శించి హనుమంతుని జన్మకు కారణమయ్యాడు

ప్రాదుర్భావక్షణేనాయం క్షుధితో బలగర్వితః ।
అథ తం భాస్కరం దృష్ట్వా ప్రాయాద్దాడిమశఙ్కయా ॥౯
జన్మించిన వెంటనే ఆకలి వేసిన హనుమంతుడు తన బల గర్వములతో సూర్యుని చూసి దానిమ్మ పండు అని భావించాడు.

ఉడ్డీయమానే వ్యోమస్థా దేవాస్సేన్ద్రాః ప్రదుద్రువుః ।
ఆః కిమేతదితి వ్యగ్రా యక్షా భూతాని మేనిరే । । ౧౦
ఆ సూర్యుని దానిమ్మ పండుగా భావించి దానిని గ్రహించాలని పైకి ఎగురుతున్న హనుమంతుని చూసి" ఆహా ఏమి పరాక్రమము " అని దేవతలందరూ ఆశ్చర్యపడ్డారు.

11 -20
అభియాన్తం తతో దృష్ట్వా హనూమన్తమహఃపతిః।
సమీరణస్యమాహాత్మ్యాద్వేగవన్తమకీర్తయత్
అప్పుడు ఆ సూర్యుడు హనుమంతుడు కదులుతున్న దృశ్యాన్ని చూసాడు.వాయుదేవుని యొక్క గొప్పతనాన్ని వేగవంతమైనదిగా వర్ణించాడు.

భాస్కరః
హనూమన్ బాల్యసమయే వేగో హ్యనుపమస్తుతః ।
పూర్వక్షణే సముత్పన్నో ద్వితీయక్షణవిహ్వలః ॥౧౨
సూర్యుడు తనలో తాను ఇలా అనుకొన్నాడు. “హనుమంతుడు తన బాల్యంలో తన అసమానమైన వేగానికి ప్రశంసలు అందుకున్నాడు. అతను ఒక్క క్షణంలో పైకి లేస్తాడు. మరియు రెండవ క్షణంలో భయనిశ్చేష్టత కలిగినవారిగా చూచేవారికి విభ్రాంతి కలిగిస్తాడు.”

ఈదృగ్విధో జవస్స్వస్య గురోరప్యధికా గుణాః ।
తస్మాత్తవ ప్రసన్నోఽహం సద్విద్యా వైదికీ తవ । । ౧౩
ఆంజనేయా! ఇంతటి వేగముగల నిన్ను చూచిన నాకు నీ తండ్రియైన వాయువునకు,ఇంత బలము లేదనిపిస్తున్నది. నీకున్న నిజమైన జ్ఞానాసక్తి పట్ల నేను సంతోషిస్తున్నాను. గొప్పదయిన దైవికమైన విద్యను నీకు ఇస్తాను. 13.

చతుర్భుజత్వమపి తే బ్రహ్మచర్యేణ సేత్స్యతి ।
యో బ్రహ్మణౌ స్తౌతి దత్తవరమజ్ఞమనిన్దితమ్ ॥౧౪
తస్య స్వబలవిజ్ఞానీం ఘటయిష్యతి చిన్తితమ్ ।

ఆంజనేయా ! నీ బ్రహ్మచర్యముతో నాల్లు చేతులు పొందుతావు. నీ పట్ల భక్తిని కలిగి నిన్ను  స్తుతించేవారికి అన్ని మంగళాలు కల్గుతాయి. తన బలమును తాను గ్రహించే సామర్ధ్యము కలిగి విజయము పొందుతారు.

అగస్త్యః

ఏవముక్త్వా దినాధ్యక్షః కరస్థకమలాదిభిః || ౧౫

వికృష్య కమలం తస్మై రసపూర్ణం ప్రదత్తవాన్ |

అని ఈ రకంగా చెప్పి  సూర్యుడు తన చేతిలో ఉన్న  తామరపూవులలో ఒక రసపూర్ణమైన పువ్వును హనుమంతునకు ఇచ్చాడు.

హనూమాన్ ప్రణమ్య శిరసా ప్రగృహ్య మధువారిజమ్ ||౧౬

హర్ష పుల్లదనాక్లేశః ప్రయయౌ పితురాశ్రమమ్ |

హనుమంతుడు సూర్యునికి  నమస్కరించి తేనెతో నిండిన ఆ తామరపువ్వును గ్రహించి చాలా  సంతోషముతో ఎటువంటి కష్టములేక  తండ్రి యొక్క ఆశ్రమము చేరాడు.

తాదృగ్విధం విక్రమం చ కృత్వా విక్రమచేతసా ||౧౭

వాయునా పాల్యమానస్తు ప్రావర్ధత దినే దినే |

. అట్టు తండ్రి వాయుదేవునిచే పెంచబడుచున్న  హనుమంతుడు పరాక్రమముకలిగినవాడయి దినదిన ప్రవర్దమానుడయ్యాడు.

కదాచిత్ క్రీడమానస్తు బాలభావేన చైన్దవమ్ ||౧౮

కలఙ్కహరిణం జ్ఞాత్వా కృతవాన్ గ్రహణే మతిమ్ |

ఒకసారి  హనుమంతుడు బాల్యములో  చంద్రునిలోని మచ్చను జింక అని భావించి దానిని పట్టుకోవటానికి ఆకాశమధ్యములోకి ఎగిరాడు.

తతో జవేన భాస్వన్తం నభోమధ్యే సుధాకరమ్ ||౧౯

గృహీతుకామో భగవాన్ పుప్లువే చన్ద్రమణ్డలమ్ |

గృహీతుమనసం దృష్ట్వా చిహ్నమజ్ఞానతో మృగమ్ ||౨౦

అప్పుడు అమృతధారి అయిన చంద్రుడు ఆకాశం మధ్యలో వేగంతో ప్రకాశించాడు.ఆ చంద్రుని లోని మచ్చను జింకగా భావించి దానిని బంధించాలనే కోరికతో, హనుమంతుడు  చంద్రుని కక్ష్యలోకి దూకాడు.

శశిరాం ప్రేరయామాస హిమానీ హిమదీధితిః

| సా తేన ప్రేరితా వాయునన్దనం జవశాలినమ్ || ౨౧

తనను పట్టుకోవటానికి వస్తున్న  హనుమంతుని  అడ్డుకోవటానికి అతని పై చంద్రుడు మంచును కురిపించాడు.

శిశిరార్తస్సమాయాతి కిమిత్యుక్త్వా తమాప వై।
 తత్ర వృత్తిం తతో దృశ్య స్వభూవాత్సల్యతో మునే ॥ ౨౨
ఓ మునీ ! ఆ మంచుచే హనుమంతుడు కప్పబడుటను పుత్ర వాత్సల్యము కలిగిన   వాయువు చూసాడు.

 సమీరణోఽపి భగవాన్ ప్రాయాత్తాన్దిశమాకులమ్ ।
మూర్తిమన్తమథో దృష్ట్వా సమీరస్తాం ప్రవిశ్య వై॥ ౨౩
దేవదేవుడైన వాయుదేవుడు అన్ని దిశలలో ఆక్రమించాడు.  మంచు చేత ఆక్రమించబడిన కుమారుని చూసి, ఆ మంచు అతనిని ఏమీబాధించ కుండా ఉండటానికి వాయుదేవుడు మంచులో ప్రవేశించి దానిని  కదలకుండా చేసాడు.

పదాత్ పదం ప్రచలితుమక్షమాం వ్యాకరోత్ తదా
 మారుతిస్తు తతో వేగాత్ హిమానీ దృశ్య చాక్షమః ।౧౨
అప్పుడు మంచు  ఒక అడుగు నుండి మరొక అడుగుకు కదలలేకపోతున్నానని ఆంజనేయునితో మొరపెట్టుకొంది.ఆంజనేయుడు అప్పుడు ఆ మంచుస్థితిని  చూసి దానిని వదలి, దానిని తనపైకి ప్రయోగించిన చంద్రునిపైకి ఉరికాడు.

 ప్రాయాచ్చన్ద్రమసో బిమ్బం నిరుపాధిజవస్తథా ।
చన్ద్రమాస్తు మరుత్పుత్రం మృగీణ్యామాకృతిం తదా ॥ ౨౫
హనుమంతుడు  దాదాపుగా  చంద్రబింబ సమీపానికి చేరుకున్నాడు. కాని చంద్రుని వేగం అదుపు చేయలేనిదిగా ఉంది.అప్పుడు చంద్రుడు మరుత్ కుమారుడైన జింక రూపాన్ని ధరించాడు.

 జవమాస్థాయ విక్రాన్తం దృశ్య సస్మార వాసవమ్।
 విధోస్సంస్మృతిమాత్రేణ వాసవః ప్రత్యదృశ్యత ॥ ౨౬
తనపైకి  వేగంగా, శక్తివంతంగా ఎగబాకుతున్న హనుమంతుని తీరును చూసి చంద్రునికి  ఇంద్రుడు గుర్తుకు వచ్చాడు.అతనిని శరణువేడాడు.

వజ్రధన్వా గజాదృక్షమధిరుహ్యా వియత్స్థితః ।
ఏష విష్ణుశరీరస్స ఇతి సఞ్చిన్త్య మారుతిః ।। ౨౭
వెంటనే ఇంద్రుడు  వజ్రాయుధమును ధరించి చంద్రునికి రక్షణగా ఆకాశములో  ఐరావతమును ఎక్కి వచ్చాడు. ఆంజనేయుడు ఇంద్రుని చూసి విష్ణురూపముతో ఉన్నాడని భావించాడు.

కరేణ తాడయామాస గజరాజం బలోద్ధతః ।
తాడితస్తేన నాగేన్ద్రః పలాయనపరోఽభవత్ ।।౨౮
హనుమంతుడు ఆ ఏనుగును చేతితో కొట్టాడు.ఆ ఏనుగు భయముతో పరుగెత్తింది.

ప్రధావతో రాజన్యస్య స్కన్ధారూఢో దివస్పతిః ।
ఉన్ముఖీభూయ చిక్షేప వజ్రం పవనజం ప్రతి ।।౨౯
ఐరావతము హనుమంతుని దెబ్బతో పారిపోవుచుండగా దానిపై ఉన్న ఇంద్రునికి కోపం వచ్చి ఆంజనేయునిపై వజ్రాయుధాన్ని ప్రయోగించాడు.

తేన వజ్రేణ కిఞ్చిద్వై నిహతో హనుభాగతః ।
మారుతిర్హనుమాన్నామ వహన్ చన్ద్రమధావత ||3౦
ఇంద్రుని వజ్రాయుధముచే కొంచెముగా దవడ భాగము కొట్టబడుటచే ఆంజనేయునికి హనుమంతుడని పేరు వచ్చింది. హనుమంతుడు చంద్రునిపైకి ఉరికాడు.

31- 40

చన్ద్రస్తు దేవతాత్మాసౌ తమాలోక్య నిరాకులమ్ ।
అభీకం తం హనూమన్తమిదమూచుర్మహామతే || 3౧
దేవతల ఆత్మ అయిన చంద్రుడు, ఏ మాత్రం కలవరపడని భయపడని హనుమంతుని చూసి అతనితో ఇలా అన్నాడు.

చన్ద్రః-
మమ లక్షణమేతద్ధి దుర్గహం హ్యగమత్ త్వయా ।
తథాపి భవతో యానం సఫలం కర్తుమాద్రియే || 3౨
ఆంజనేయా! నీవు తీసికొన దలచిన జింక నామచ్చ మాత్రమే. అలా అయినప్పటికీ నీవు చేసిన ఈ ప్రయత్నము వ్యర్థము కాకూడదు.

ఇమాం స్వీకురు భద్రం తే సుధాం సురవరోచితామ్ ।
యథా యద్యాచితం తద్ధి దీయతే నాత్ర సంశయః ||33
నీకు శుభమగు గాక! నా దగ్గరినుంచి ఏదో గ్రహించాలని వచ్చావు కనుక దేవతలకు అర్హమైన ఈ అమృతమును గ్రహించు. ఎవరు ఏది కోరితే దానిని ఈ అమృతము ఇస్తుంది.

జవాతిరేకో భవతో మనో మేం ప్రీణయన్నయమ్ ।

ప్రదాపయతి తే వాయుసూనో త్వద్యాచితం సదా ||३४

"నీబల విశేషముచే నాకు సంతోషము కలిగినది.ఈ అమృతమునీ మనసుకు సంతోషాన్ని ఇస్తుంది. ఓ ఆంజనేయా అడిగినది ఇస్తుంది" అని చంద్రుడు హనుమంతుని ప్రశంసించాడు.. 32

హనూమాన్ -

విధో త్వయి త్వయా దత్తా సుధా నక్షత్రనాయక ।

నిక్షిప్యతే యథా కాఙ్క్షయమేతదాదీప్యతాం త్వయా । ||३५

చంద్రుని మాటలు విన్న హనుమంతుడు " ఓ చంద్రా ! నీవు ఇచ్చిన అమృతాన్ని నీవద్దనే ఉంచు. నేను అడిగినప్పుడు నాకు ఇమ్ము" అన్నాడు.

అగస్త్యః

ఇతి చన్ద్రమసి క్షిప్య దీప్యమానాం సుధాం నవామ్ ।

హనూమాన్ వేగసంపన్నో జగామ భవనం తథా || ३६

ఈ విధముగా చెప్పి చంద్రునిదగ్గరే అమృతమును ఉంచి హనుమంతుడు వేగముగా తన పర్వతాన్ని చేరుకొన్నాడు.

తద్గత్వా హనుమత్పార్శ్వం స్మర్తవ్యం వృత్తమీదృశమ్ ।

తతో హనూమాన్ సర్వం తే తద్దాస్యతి న సంశయః । ।

వామదేవా! నీవు అచ్చటికి( ఘటికాచలానికి) పోయినప్పుడు ఈ అమృత వృత్తాంతమును స్మరించు. అప్పుడు హనుమంతుడు నీవు కోరిన వాటిని అనుగ్రహిస్తాడు"అని అగస్త్యుడు చెప్పాడు.

ఇతీదం బోధితస్తేన తత్రాగస్త్యేన ధీమతా ।

వామదేవో హృష్టమనాః పశ్చిమాం దిశమభ్యయాత్|| ३८

ఈ విధముగా అగస్త్యునిచే విషయాలను తెలుసుకొన్న వామదేవుడు సంతోషముతో పశ్చిమ దిక్కునకు వెళ్ళాడు.

అగస్త్య వచనం చిత్తే కృత్వా తత్త్వావబోధకః ।

వామదేవో హనుమతశ్శైలపాదముపారుహత్ ||३९

బ్రహ్మజ్ఞానమును బోధించు అగస్త్యుని మాటను మనస్సులో తలచుకొని, వామదేవుడు హనుమత్ పర్వతాన్ని ఎక్కాడు.

తత్రాపశ్యన్మహావ్యాఘ్రాంన్సింహాన్నాగాన్బహూన్మృగాన్ ।

పఞ్చవక్త్రాన్సప్తవక్త్రాన్దశవక్త్రాననేకశః ||४०

వామదేవుడు ఆ హనుమత్ పర్వతములో  పెద్దపులులను,  సింహములను, ఏనుగులను, అయిదు తలలు, ఏడు తలలు, పది తలలు కలిగిన  అనేక జంతువులను చూసాడు.

41  -50

సరీసృపాన్ధావమానాన్శతశీర్షాంశ్చ కాంశ్చన|
ప్రలమ్బమానాన్కుహరే జృమ్భమానాంశ్చ పఙ్క్తిశః ||౧౪

వంద తలల సరీసృపాలను(పాములను) వామదేవుడు చూసాడు. వాటిలో  కొన్ని అటూ ఇటూ పరుగెత్తుతున్నాయి.కొన్ని పాములు గుంటలో వరుసలలో  వేలాడుతూ  ఆవలిస్తున్నాయి.

క్వచిత్పర్వతసంకాశాన్ క్వచిద్ఘనసమాన్ గజాన్ |
క్వచిదైరావతప్రఖ్యాన్ గజరాజాన్ దదర్శ హ ||౪౩

పర్వతాలలా కనిపించే ఏనుగులను కొన్నిచోట్ల,  మేఘాలలా కనిపించే ఏనుగులను కొన్నిచోట్ల, ఐరావతాన్ని(ఇంద్రుని ఏనుగు) పోలిన ఏనుగుల రాజులను కొన్నిచోట్ల వామదేవుడు చూసాడు.

చతుర్దన్తానపి గజాన్ పఞ్చదన్తాన్మృగాధిపాన్ |
క్వచిచ్చ కిన్నరా హృష్టాః క్వచిత్కింపురుషాఙ్గనాః ||౪౪

నాలుగు దంతాల ఏనుగులను (ఐరావతానికి నాలుగు దంతాలు)  మరియు ఐదు దంతాల సింహ రాజులను కూడా చూసాడు.కొన్నిచోట్ల కిన్నరులను(గుర్రపు ముఖము,  నరశరీరమును గల దేవతలు)  కొన్నిచోట్ల సంతోషిస్తున్న కింపురుషుల భార్యలను( నరముఖము,  అశ్వశరీరము కలవారు) వామదేవుడు చూసాడు.

క్వచిద్గన్ధర్వపతయః క్వచిద్దైత్యాః క్వచిత్సురాః |
క్రీడన్తి వానరాన్గృహ్య విటావేశ్యాజనాన్ క్వచిత్ ||౪౫

కొన్నిచోట్ల  గంధర్వ ప్రభువులను, కొన్నిచోట్ల రాక్షసులను, కొన్నిచోట్ల దేవతలను చూసాడు.కొన్నిచోట్ల  కోతులతో ఆడుకుంటున్న  విటులను, వేశ్యా సమూహాలను వామదేవుడు చూసాడు.

ఏతాన్ సర్వాన్ సమాలోక్య వామదేవ: ప్రసన్నధీ: |
చరితార్థమివాత్మానం మన్వానో వాక్యమబ్రవీత్ | ||౪౬

ఇవన్నీ చూసి వామదేవుడు చాలా సంతోషించాడు.
తన జన్మ చరితార్థమయినదని భావించి తనతో ఉన్న ఋషి పుత్రులతో  ఈ విధముగా అన్నాడు.

హే వయస్యా న వో భీతిర్మనసాం వీక్ష్య కుఞ్జరాన్ ।
ఇమే హి హనుమత్స్పృష్టా న బాధన్తే సదా జనాన్ ॥౪౭
ఓ స్నేహితులారా ! ఈ ఏనుగులు మొదలయిన వాటిని చూసి భయాన్ని మనస్సులోకి తెచ్చుకోవద్దు. ఈ మృగములు హనుమంతుని అనుగ్రహముచే ఎవరిని బాధించుట లేదు.

అత్ర సన్నిహితశ్శైలపాదే హనుమతో మహాన్।
భగవాంస్తత్పితా యస్మాద్వాతి జామ్బవదద్య ధృక్ ॥౪౮
ఈ కొండదరి దిబ్బలో  గొప్పవాడయిన  హనుమంతుడు ఉన్నాడు.వాయుదేవుడు  తన తండ్రి.  ఆయన నుండి అల్లనేరేడు వాసనలు కలిగిన  గాలి వీస్తున్నది.

ఇహ దేవాస్సగన్ధర్వా వాయునన్దనసేవినః ।
స్నాత్వా హనూమతస్తీర్థే వినిర్గచ్ఛన్తి సఙ్ఘశః ॥౪౯
ఇక్కడ  హనుమత్తీర్థములో దేవగంధర్వులు వాయునందనుడైన ఆంజనేయుని సేవించి గుంపులు గుంపులుగా  స్నానముచేసి వెళుతున్నారు.

విశ్వావసుముఖా దేవాః ప్రత్యహం హనుమత్పదమ్ ।
ఆశ్రిత్య కుర్వతే స్నానం తత్తీరే ముక్తికాఙ్క్షయా ॥౫౦
విశ్వావసువులు మొదలయిన గంధర్వులు (ఎవరి వద్దనుండి ధనం లభిస్తాయో వారు  విశ్వావసువులు అను దేవతలు)  ప్రతిరోజూ హనుమంతుని శైలానికి వచ్చి, ఆయనను ఆశ్రయిస్తూ  ముక్తికాంక్షతో హనుమత్తీర్థములో స్నానము చేస్తున్నారు.

51  - 60

అత్ర సన్నిహితో మాఘస్సర్వపాపవిదారకః ।
అత్ర స్థిత్వా తపః కుర్మో మాసమేకం ప్రయత్నతః ॥ ౫౧
''పాపములను పోగొట్టు మాఘమాసము వచ్చినది. హనుమత్తీర్థములో ఉండి ఒక నెల రోజులు తపస్సు చేస్తాను'' అని  వామదేవుడు మిగిలిన ఋషిపుత్రులకు చెప్పాడు.

పశ్చాద్విధాస్యతి క్షిప్రం హనుమానస్మదీప్సితమ్ ।
ఇత్యుక్త్వా తానృషిసుతానగస్త్యాభిమతేన వై ॥౫౨
''ఇలా ఇక్కడ తపస్సు చేస్తే  భవిష్యత్ కాలములో  హనుమంతుడు త్వరలోనే మన కోరికను తీరుస్తాడు' అని ఆ ఋషి కుమారులతో వామదేవుడు చెప్పాడు.

వర్త్మనా గిరిరాజస్య ప్రదక్షిణమథాకరోత్ ।

పూర్వచిన్తనమవ్యగ్రో గర్భిణీవత్పదాత్ పదమ్ ।।౫౩
అగస్త్యుడు చెప్పినట్లుగా ముందుగా గర్భిణీ స్త్రీలాగా ప్రతి అడుగు జాగ్రత్తగా వేస్తూ, అడుగడుగునా హనుమంతుని మనస్సులో ధ్యానిస్తూ గిరిప్రదక్షిణమును వామదేవుడు చేసాడు.

పూర్వోక్తవిధినా స్నాతో వ్యసైషీత్ ప్రత్యహం తు యః ।
ఉత్తరస్మిన్ హనుమతః పార్శ్వే పర్ణమయ కుటీమ్ ।।౫౪
నిర్దేశించిన పద్ధతిలో స్నానం చేసిన తర్వాత, ప్రతిరోజూ కర్మలు ఆచరిస్తూ హనుమంతునికిఉత్తరమువైపు పర్ణశాలను నిర్మించుకొన్నాడు.

కృత్వా తపాంసి కురుతే సహ సబ్రహ్మవాదిభిః ।
ఏవం కాలే నీయమానే ప్రాదురాసీత్ తపోవనే ।।౫౫
తన సోదరులతో కలిసి ఆ పవిత్రమయిన హనుమంతుని సమీపంలో ఉన్న తపోవనంలో వామదేవుడు తపస్సు చేయటం మొదలుపెట్టాడు. .

భానువారసమాయుక్తా దృశ్యతే మాఘపౌర్ణిమా ।
తస్మిన్ దినే వామదేవః ప్రాతరుత్థాయ నిర్మలః ||౫౬
కొంతకాలము జరిగిన తరువాత ఆదివారముతో కూడిన మాఘపౌర్ణమి వచ్చింది. ఆనాడు వామదేవుడు ఉదయముననే లేచి, నిర్మలమయిన చిత్తముతో- - -..

గత్వా హనుమతస్తీర్థం మలం ప్రక్షాల్య వారిణా ।
త్రిరాచమ్య శుచిర్భూత్వా ప్రాఙ్ముఖో వినయాన్వితః ।। ౫౭
హనుమత్తీర్థమునకు వెళ్ళి స్నానము చేసి, మూడు సారులు వామదేవుడు ఆచమనము చేసాడు. శుచిగా , వినయముతో తూర్పుకు తిరిగి- - - - - - - - -

పారిజాతతరోర్మూలేవాసినం వనవాసినమ్ ।
పశ్చిమాభిముఖం బాలం హనూమన్తం భజంస్తదా ।।౫౮
పారిజాత వృక్ష మూలమున , పశ్చిమమువైపుకు తిరిగిన బాలహనునుంతుని గురించి వామదేవుడు తపస్సు చేసాడు.

**విశేషాలు**

శ్రీ విష్ణుమూర్తి అంశలతో హనుమంతుడు పంచముఖ హనుమంతుడుగా వెలిసాడని పెద్దలు చెబుతారు. . ఈ పంచముఖములవివరాలుఇవి. ,

(అ)తూర్పుముఖముగా ఉన్న హనుమంతుడు: పాపాలను హరించి, చిత్త శుద్ధిని కలుగ చేస్తాడు.

(ఆ) దక్షిణముఖంగా కరాళ ఉగ్ర నరసింహ స్వామి: శ త్రు భయాన్ని పోగొట్టి, విజయాన్ని కలుగజేస్తాడు.

(ఇ) పడమర ముఖంగా మహావీరగరుడ స్వామి, దుష్ట ప్రభావాలను పోగొట్టి శరీరానికి కలిగే విష ప్రభావాల నుండి రక్షిస్తాడు.

(ఈ) ఉత్తరముఖముగా లక్ష్మీవరాహమూర్తి గ్రహ చెడు ప్రభావాలను తప్పించి, అష్టైశ్వర్యాలు కలుగజేస్తాడు.

(ఉ) ఊర్ధ్వముఖము కలిగిన హనుమంతుడు హయగ్రీవస్వామి అవతారం. ఈ స్వామి రూపంలో హనుమంతుడు జ్ఞానాన్ని, జయాన్ని, మంచి భార్యని, బిడ్డలను ప్రసాదిస్తాడు.

నాభిదఘ్నే జలే స్థిత్వా వైదికం మన్త్రముచ్చరన్।
స్నాత్వా ధృతపరీధానః పక్షమన్వాస్య పూరకమ్ ।।౫౯

వామదేవుడు బొడ్డువరకు గల నీటిలో నిలిచి, వైదికమంత్రములచే హనుమంతుని ప్రార్థించాడు. అతను స్నానం చేసి,శుభ్రమైన దుస్తులు ధరించి,తదితర పూజా కార్యక్రమాలను నిర్వర్తించాడు.

సరస్తీరే సమాసీనం హనూమన్తమతన్ద్రితః ।
త్రింశత్కృత్వస్సమాప్లుత్య స్తోత్రయామాస కేవలమ్ ।।౬౦

తరువాత శుభ్రమైన వస్త్రములు ధరించి సరస్సు తీరమున కలవరపాటులేక కూర్చుని ఉన్న, వేదము చదివిన పిమ్మట ఆశ్రమాంతరమును పొందని స్నానశీలుడగు బ్రహ్మచారి అయిన , పరిశుద్ధుడయిన హనుమంతునికి 30 మార్లు ప్రదక్షిణము చేసి తరువాత వామదేవుడు ఇట్లు ఆంజనేయస్తోత్రము చేసాడు.

**విశేషాలు**

"త్రింశత్కృత్వస్సమాప్లుత్య" అను పదబంధము గూర్చి దీర్ఘ చర్చ జరగవలసి ఉన్నది. ఏ దేవాలయానికి వెళ్ళినా మూడు ప్రదక్షిణాలు చేస్తాం. కాని హనుమంతుని ఆలయానికి వెళ్లినప్పుడు ఐదు ప్రదక్షిణాలు చేయాలని పెద్దలు చెప్పారు. 'ప్రదక్షిణనమస్కారాన్ సాష్టాంగాన్ పంచ సంఖ్యాయా' అనిపెద్దల వాక్యం. కాని ఈ ఘటికాచల మాహాత్మ్య శ్లోకంలో 30 ప్రదక్షిణములు అని ఉన్నది. ఇది ఆలోచనీయమైనది.

**61 -70**

వామదేవ:-

త్వం వై వరేణ్యో హనుమన్ వనౌకసాం త్వం కీర్తనీయస్సతతం మహీభువా ।
త్వం శ్లాఘనీయో రఘువంశకేతునా త్వం నన్దనీయోఽసి దివౌకసాం గణైః ।। ౬౧

ఓ హనుమా! నీవు అరణ్యవాసులలో శ్రేష్ఠుడవు. భూమిపై నీవు ఎల్లప్పుడూ ప్రశంసలకు అర్హుడివి.స్వర్గలోకవాసులయిన దేవతలచే రఘు వంశపు కీర్తి జెండాతో నీవు ప్రశంసలకు అర్హుడివి. 61

**విశేషాలు**

రఘువంశంలో జన్మించిన శ్రీరాముని కీర్తిని ఉన్నతంగా ఎగరవేసిన వారిలో హనుమంతుడు ప్రధానుడు కనుక రఘు వంశపు కీర్తి జెండాగా హనుమంతుని ఘటికాచల మాహత్మ్యం వర్ణించింది.

అశోకవన్యాం త్వమశోకదాతా త్వమక్షహన్తా త్వమనిన్ద్యవిక్రమః ।
త్వం గోష్పదీభూతమహార్ణవోఽసి త్వమన్తవేద్యస్తుతవేగలాఞ్ఛన ।। ౬౨

ఓ హనుమంతా ! అశోక వనంలో సీతమ్మవారి శోకాన్ని పోగొట్టినవాడివి నువ్వు. రావణుని కుమారుడైన అక్ష సంహారకుడివి నువ్వు. నింద లేని పరాక్రమం నీది. గోవుయొక్క పాదమంత గా మహా సముద్రాన్ని భావించి దానిని దాటిన ఘనత నీది. 62

విశేషాలు

1. "గోష్పదీకృత వారాశిం మశకీకృత రాక్షసమ్ రామాయణ మహామాలా రత్నం వన్దేఽనిలాత్మజమ్" (సముద్రమును గోవుయొక్క పాదమంత గా భావించి దాటిన వాడు ,రాక్షసులను దోమలుగా భావించి సంహరించిన వాడు, రామాయణం అనే మాలలో రత్నం అయిన వాయుపుత్రునికి నమస్కరిస్తున్నాను...) అను శ్లోకం మనకు వెంటనే ఈ సందర్భంలో గుర్తుకు వస్తుంది.
2. హనుమంతుడు నూరు యోజనములు కలిగిన సముద్రమును దాటుటలో అంతరార్థమును శ్రీభాష్యం అప్పలాచార్యులవారు తమ సుందరకాండ తత్త్వ దీపికలో ఇలా వ్రాసారు.(441 వపుట)

   'సముద్రము నూరు యోజనములు ' అనుటలో 'కేవలము సముద్రము యొక్క పరిమాణమే నిర్దేశింపబడినదని భావింపరాదు. ఇందు తాత్త్వికముగు విషయము ఇమిడియున్నది.

   నూరు అంకె (100) తత్త్వజ్ఞానమును సూచించును. తత్త్వజ్ఞానము కలుగుటయే సంసారసముద్రమును దాటుట. నూఱు సంఖ్యచే తత్త్వస్వరూపము నిర్దేశింపబడినది. తత్త్వములు మూడు:-

1. భగవత్తత్త్వము.
2. జీవతత్త్వము.
3. ప్రకృతితత్త్వము.

వీనిలో భగవత్తత్త్వము ప్రధానము. జీవ, ప్రకృతి తత్త్వములు దానిపై ఆధారపడి యుండునవి, అది లేనిచో ఉండనివి. కారణావస్థలో ఈమూడును ఉండును. కాని భగవతత్త్వము స్పష్టముగా కన్నడుచుండును. జీవ ప్రకృతి తత్త్వములు ఉండియు లేనట్లు ఉండును. అనగా సూక్ష్మావస్థయందుండును. సూక్ష్మావస్థయందుండి, ఉండియు నామరూపములు లేకపోవుటచే లేనట్లుగానుండు జీవ ప్రకృతితత్త్వములతో కూడిన భగవతత్త్వమే ఈ జగత్తునకు కారణము అని ఎఱుంగుట తత్త్వజ్ఞానము.

ఈ తత్త్వజ్ఞానమును నూఱు అంకె సూచించును. ఒకటి ప్రక్కనున్న రెండుసున్నలు నూఱు. (100) నూఱులో నున్న రెండుసున్నలకు విలువ యున్నది. కాని అంకెలుగా లేవు. సున్నలుగా నున్నవి. ఆ ఒకటి తీసివేసినచో వానికి విలువలేదు. ఒకటి ప్రక్కనున్ననే అవి విలువకలవి; లేనిచో విలువలేదు. ఒకటి ప్రధానము-రెండుసున్నలు అప్రధానములు. ఈ రెండు సున్నలును-సూక్ష్మదశలో నున్న జీవ ప్రకృతితత్త్వములను సూచించును. ఒకటి- భగవత్త త్త్వమును సూచించును. కారణతత్త్వము యొక్క స్వరూపమును ఇట్లెఱుం గుటయే తత్త్వజ్ఞానము. ఆ తత్త్వజ్ఞానము కల్గుటయే నూఱుయోజనములు దాటుట.

"కారణంతు ధ్యేయః"

కారణతత్త్వమునే ధ్యానింపవలెనని శాస్త్రము చెప్పుచున్నది.

దీనిని సూచించుటకే మనవారు బ్రహ్మకైనను, దేవతలకైనను, మానవులకైనను ఆయుర్దాయము నూరేళ్ళనిరి. అనగా తత్త్వజ్ఞానము కల్గునంతవరకే శరీరసంబంధము. శరీరముతో సంబంధము కల్గియుండుటయే ఆయుర్దాయము.

రక్షఃపురద్వారకృతావతారలఙ్కాభిదం కాతరితోఽఙ్గులిక్రమాత్ |
నిరర్గలం సౌరిపురీ ప్రవేశితా తస్మై నమో మారుతయే మహాత్మనే || ౬౩
లంకా ద్వారం దగ్గర కాపలాగా ఉన్న లంకిణి ని ఎడమ చేతి వేళ్లను ముడిచి పిడికిలితో నేలపడునట్లుగా చేసి అడ్డులేక లంకలోకి ప్రవేశించిన ఓ హనుమా! నీకు నమస్కారము

విశేషాలు

హనుమంతుడు రాత్రివేళ లంకా నగరంలోకి ప్రవేశించుటకు లంక ద్వారము దగ్గరికి వచ్చాడు. రావణులు పరిపాలించు లంక వికృతమైన ముఖము వికృతమైన చూపులు కలదై లేచి నిలబడి గంభీరమైన గర్జనము చేసి '' నన్ను జయింపనిదే నువ్వు లంకను చూడలేవు' అని చెప్పింది.  అప్పుడు హనుమంతుడు ఆ లంకిణితో "ఒక్కసారి పట్టణాన్ని చూసి మళ్ళీ వెళ్ళిపోతాను" అని అంటే ఆ లంకిణి భయంకరమైన మహానాదాన్ని చేసి అరచేతితో హనుమంతుని కొట్టింది .

అప్పుడు హనుమంతుడు తన ఎడమ చేతి వేళ్ళను ముడిచి ఎక్కువ కోపం తెచ్చుకోకుండా కొద్దిపాటి కోపముతో పిడికిలితో ఆమెను కొట్టాడు . ఆ హనుమంతుని దెబ్బతో ఆ రాక్షసి కింద పడింది. " ఓ మహాబాహూ! నన్ను అనుగ్రహించు.  నేను లంకా నగరిని.  పూర్వము బ్రహ్మనాతో 'ఏనాడు ఒక వానరుడు పరాక్రమముతో నిన్ను జయిస్తాడో అప్పుడు రాక్షసులకి కీడు కలుగుతుంది' అని చెప్పాడు. ఆ సమయం ఇప్పుడు ఆసన్నమైనది.  నువ్వు పట్టణములో ప్రవేశించి చేయవలసిన పనులన్నింటినీ చేసుకో' అని లంకిణి హనుమంతునితో  చెప్పింది.  దీనినే ఘటికాచల మాహాత్మ్యం  నిరర్గలం(అడ్డు లేకుండా)  అని చిన్న పదములో చెప్పినది.

సంపాతివాక్యేన వనౌకసాంస్తవైర్నిరస్య విఘ్నాన్ పథి భవ్యశాలినా |
విలఙ్ఘితో యేన మహాపయోనిధిర్నమో నమస్తే మహతే హనూమతే || ౬౪
సంపాతి మాటలతో, ఆ మహిమాన్వితుడైన భగవానుడు స్తోత్రాలతో వనవాసుల మార్గంలో ఉన్న అన్ని అడ్డంకులను తొలగించి,మహాసముద్రాన్ని దాటిన ఆ మహా హనుమంతుడికి నా ప్రణామాలు అర్పిస్తున్నాను. 64.

విశేషాలు

"సీతాదేవి లంకయందలి రావణుని అంత; పురమునందు బంధింపబడియున్నది. ఆమె పట్టు సీతామాతను రాక్షసస్త్రీలు కాపలాకాయుచున్నారు. లంకానగరముచుట్టునుగల సముద్రము దానిని రక్షించుచున్నది. జనకమహారాజు కూతురైన మైథిలిని అక్కడ చూడగలరు. సముద్రముమీద పూర్తిగా నూఱుయోజనములదూరము ప్రయాణించిన పిమ్మట, దాని దక్షిణ తీరమునగల లంకలో రావణుని చూడగలరు. కనుక ఓ వానరులారా! వెంటనే మీ పరాక్రమమును చూపుచు సముద్రమును లంఘించుటకు త్వరపడుడు. మీరు అక్కడ అవశ్యము సీతాదేవిని దర్శించి క్షేమముగా తిరిగిరాగలరు. నా దివ్యదృష్టితో చూచి పలుకుచున్న మాటలివి." ( వా. రామా.  58 వసర్గ 22 - 25 శ్లోకాలు)అని కిష్కింధాకాండలో సంపాతి వానరులతో చెబుతాడు. ఈ సంపాతి మాటలు ప్రేరణగా హనుమంతుని లంకాప్రయాణము జరిగింది. అందుకే  ఘటికాచల మాహాత్మ్యం సంపాతివాక్యేన అని ప్రముఖంగా చెప్పింది.

వాలాగ్రనిష్ఠ్యూత మహానలేన యో లఙ్కాం నిరాకారమహానిరఙ్కుశమ్ |
మహీభువం ప్రీణయతి స్మ జానకీ నమో నమస్తే మహతే హనూమతే || ౬౫

నీ తోక కొన నుండి ప్రకాశించిన నిరాకారమైన అదుపులేని గొప్ప అగ్ని లంకా నగరాన్ని నాశనం చేసింది.

భూజాత  జానకిని ప్రసన్నం చేసుకుంది. గొప్పవాడివయిన హనుమంతా !  నీకు నా ప్రణామాలు అర్పిస్తున్నాను. 65.

**విశేషాలు**

వాయుపుత్రోడైన ఆ హనుమంతుని తోకకు సంబంధించిన  అగ్ని పొగలేనిమంటలతో ఆ లంకా నగర భవనములలో  వ్యాపించింది. ఆకాశమునంటుచున్న మంటలతో ప్రళయకాలాగ్నిలా అది మహాశక్తిగలదై వృద్ధిచెందింది. (వాల్మీ.   సుందర 54 వసర్గ – 33 శ్లో)

హిరణ్యనాభః యుధి తాడితోఽపి సన్ యం రామదూతం సమనన్దయత్ పురా ।
ఫలైశ్చ పుష్పైరపి సాధయన్ గిరా నమో నమస్తే మహతే హనూమతే ॥ ౬౬

గతంలో హిరణ్యనాభుడయిన శ్రీరాముడు  యుద్ధములో ఇంద్రజిత్తుచే నాగాస్త్రముచే  కొట్టబడినప్పటికీ రాముని దూతగ నువ్వు ఉత్సాహపరిచావు. ఓ గొప్ప హనుమా, నీకు పండ్లు మరియు పువ్వులవంటి మెత్తని  మాటలతో నా ప్రణామాలు అర్పిస్తున్నాను. 66. 66

**విశేషాలు**

ఇందులో ప్రయోగించిన హిరణ్యనాభ  పదము  విష్ణుసహస్రనామంలోనిది.  తేజోమయమైన నాభి కలవాడు అని దీని అర్థం. ఈ నామానికి పెద్దలు ఇలా వివరణ చేసారు.

'నహ్యతి బధ్నాతి ఇతి నాభిః' - బంధించి (ఒకచోట) ఉంచునది నాభి. అన్నీ దేనియందు కేంద్రీకృతమై ఉంటాయో అది 'నాభి'. విశ్వానికి మూలమైన తేజస్సు 'హిరణ్యం'. ఆ తేజస్సును కేంద్రంగా చేసి విశ్వ చక్రాన్ని విస్తరింపజేసిన వాడు విష్ణువు. లోకంలో చక్రానికి నడిమి కేంద్రాన్ని 'నాభి' అంటారు. శరీర కేంద్రం కూడా 'నాభి'యే. ''మన శరీరంలోని సర్వ 'సిర'లకు నిబంధన స్థానం (కేంద్రం) నాభి (బొడ్డు). చక్రంలో అరలన్నీ (ఆకులు) కేంద్రాన్ని ఆధారం చేసుకున్నట్లుగా, సిరలకు మూలమైన ప్రాణాలన్నీ నాభిని ఆశ్రయించి ఉంటాయ''ని సుశ్రుతుడు శరీర శాస్త్రంలో వివరించాడు.గ్రహనక్షత్రాదులన్నిటికీ మూలమైన తేజోకేంద్రశక్తి విష్ణువే కనుక అతడు 'హిరణ్యనాభుడు'.

విశ్వాన్ని నడిపే సర్వశక్తులకూ ఆతడే ఆధారం.

2. సృష్ట్యారంభంలో సృష్టిబీజాలన్నీ తేజోమయంగా స్వామి నాభియందు కేంద్రీ కృతమై, ఆ తేజస్సునుండి ఉద్భవించిన కమలములో సర్వజీవుల సమష్టి స్వరూపమైన బ్రహ్మ ఆవిర్భవించాడని, సృష్టిక్రమం వివరిస్తోంది. ఆ పద్మానికి కూడా మూలమైన తేజోమయనాభి కలవాడు విష్ణువు.

ముక్తాట్టహాసాన్విరచయ్య మన్త్రిజాన్ కుమారమక్షం చ మృధే ప్రసహ్య వై ।
వినిష్పిపేష ప్రసభం చ తద్వనం నమో నమస్తే మహతే హనూమతే ॥ ౬౭

అశోక వనములో నీపై  యుద్ధానికి వచ్చిన ఏడుగురు మంత్రి కుమారులను చూచి భయంకరముగా గర్జించి,వారిని సంహరించి ,తరువాత రావణుని కుమారుడయిన అక్ష కుమారుని చంపి రావణునికి భయము కలిగించిన   హనుమంతా ! నీకు నా గౌరవపూర్వక ప్రణామాలు అర్పిస్తున్నాను. 67

**విశేషాలు**

హనుమంతుడు ఎంతమంది రాక్షస వీరులను చంపినప్పటికీ రాని కీర్తి- రావణుని కుమారుడు అక్ష కుమారుని చంపినప్పుడు వచ్చింది. వాల్మీకి తన రామాయణంలో అక్ష కుమారుని వధా సందర్భంలో ఆంజనేయుని పరాక్రమాన్ని విస్తృతంగా వర్ణించాడు. అక్ష కుమారుని సమీపించి, ఆతనికాళ్లను

గట్టిగా హనుమంతుడు చిక్కించుకొన్నాడు. (47 -34) తనతండ్రియైన వాయుదేవునివలె మహాపరాక్రమశాలియైన హనుమంతుడు గరుత్మంతుడు మహాసర్పమును గ్రహించినట్లు, ఆ అక్షకుమారుని పట్టుకొని, పెక్కుమార్లు గిరగిర త్రిప్పి, యుద్ధరంగమున వేగముగా విసరి నేలకేసి కొట్టాడు. హనుమంతునిధాటికి అక్షకుమారుని యొక్క చేతులు, తొడలు, కటిప్రదేశము, కంఠము శిథిలమయ్యాయి. రక్తములో తడిసి ఎముకలు, కన్నులు నుగ్గునుగ్గాయెను. కీళ్లన్నియు దెబ్బతినెను. నరములన్నియు తెగిపోయెను. అంతట అతడు ప్రాణములను కోల్పోయి నేలకొరిగాడు. (47 -36) హనుమంతుడు అక్షకుమారుని హతమార్చుచుండగా జ్యోతిశ్చక్రమున సంచరించుచు, వ్రతనియమములను పాటించు మహర్షులు, యక్షులు, నాగులు, ఇతర ప్రాణులు, ఇంద్రుడు మొదలగు దేవతలు, మిక్కిలి విస్మయముతో ఆయనను చూసారు.

ప్రసిద్ధమయిన "అంజనానందనం వీరం" అను హనుమంతుని స్తోత్ర శ్లోకంలో మిగతా రాక్షసుల పేర్లు చెప్పకుండా "కపీశ మక్షహంతారం" అని ఇప్పటికీ కూడా హనుమంతుని అక్ష కుమారుని చంపిన వాడని కీర్తిస్తుంటారు . అందుకే ఘటికాచల మాహత్మ్యం కూడా ఆ మంత్రి కుమారులతో పాటు అక్షకుమారుని వధను ప్రత్యేకంగా ప్రస్తావించింది

జనిక్షణాదేవ శశిప్రభాకరో జవాతిరేకాద్బలవాన్నిరస్య తౌ ।
స్తుతస్తుతాభ్యామధతన్ మహిజ్గతః నమో నమస్తే మహతే హనూమతే ॥ ౬౮

పుట్టిన క్షణం నుండే ఆకాశానికి ఎగిరి సూర్యుని , చంద్రుని నీ వేగాధిక్యంలో తిరస్కరించావు. ( వేగములో వారిని మించిపోయావని భావం) అనేక ప్రశంసలపై ప్రశంసలు పొంది భూమికి తిరిగి వచ్చిన ఓ గొప్ప హనుమంతుడా, నీకు నమస్కారం.

**విశేషాలు**

స్వచ్ఛమైన ఆకాశమున వెళ్లుచున్న ఆ వాయుసుతుని గమనవేగము ముందు వాయువేగము, గరుడునివేగము, మనోవేగముసైతము సాటిరావు. (ఉత్తరకాండ 35 వసర్గ 26 వశ్లో) అని వాల్మీకి రామాయణం. అందుకే వేగ ప్రసక్తిని ఘటికాచల మాహత్మ్యం కూడా ప్రస్తావించింది.

విదేహకన్యా చికురే పరీప్సితం మణిం సమాధాయ విలఙ్ఘ్య చార్ణవమ్ ।
ప్రదాపయామాస రఘూద్వహాయ యో నమో నమస్తే మహతే హనూమతే ॥ ౬౯

జనకమహారాజు కూతురు అయిన సీతమ్మ జడలోఉన్న, తొందరగా రాముని పొందవలెనని తహతహలాడుచున్న చూడామణితో సముద్రాన్ని దాటి,రఘువంశాన్ని ఉద్ధరించు రామునికి ఇచ్చిన గొప్ప హనుమంతునికి నా ప్రణామాలు అర్పిస్తున్నాను. 69

**విశేషాలు**

వాల్మీకి రామాయణంలో చూడామణి వివరాలు ఇవి.

1. సీతాదేవి తన కొంగుముడి విప్పి, అందున్న శుభప్రదమైన దివ్యచూడామణిని దీసి 'దీనిని శ్రీరామునకు 'సమర్పింపుము' అని పల్కుచు హనుమంతునకు ఇచ్చెను. అప్పుడు వీరుడైన హనుమంతుడు అత్యుత్తమమైన ఆ చూడామణిని (మణిశిరోభూషణమును) గ్రహించెను. అది భుజమున ఇముడదు గావున దానిని తన చేతివ్రేలియందు భద్రపఱచుకొనెను. పిదప సీతాదేవికి నమస్కరించి, ప్రదక్షిణ మొనర్చి, వినమ్రుడై ప్రక్కకుచేరి నిలబడెను. (సుందరకాండ 38-68,69 శ్లో)
2. ఈ చూడామణి చరిత్రను శ్రీరాముడు ఇలా చెబుతాడు

హనుమంతుడు చూడామణిని తనకు ఇచ్చిన తరువాత శ్రీరాముడు ఉత్కృష్టమైన ఆ మణినిజూచి, శోకాకులుడై కన్నులనీరునిండగా సుగ్రీవునితో ఇలా అన్నాడు. లేగదూడపైగలవాత్సల్యముచే " ధేనువు పాలను చేపునట్లు ఈ అమూల్యమైన చూడామణిని చూడగానే నా హృదయము ద్రవించుచున్నది. మామయైన జనకమహారాజు వివాహసమయమున (ఆమె తల్లిద్వారా) నాతండ్రిసమక్షమున వైదేహికి కానుకగానిచ్చెను. దానిని ఆమె తనశిరస్సున ధరించినప్పుడు ఆమణిశోభలు ఇనుమడించెను. జలమునుండి ఆవిర్భవించిన ఈ మణి సజ్జనుల పూజలను అందుకొనినది. జనకుడుచేయు యజ్ఞమునకు ధీశాలియైన దేవేంద్రుడు సంతుష్టుడై దీనిని ఆ మహారాజునకు బహూకరించెను. సౌమ్యుడవైన ఓ సుగ్రీవా! నేను విశిష్టమైన, ఈ మణిని జాడగానే నేడు నాకు మాతండ్రియైన దశరథుని, మామయైన జనకుని దర్శించినట్లున్నది. ఈ మణియే నాప్రియురాలైన సీతయొక్క శిరస్సునందు ఇంతవఱకు అలంకృతమగుచు శోభిల్లుచున్నది. నేడు దీనినిజూచి ఆమెను పొందినట్లు తలంచుచున్నాను. (సుందర 66 వసర్గ2 నుండి07 శ్లోకాలు)

3. విదేహుడు అంటే దేహ సంబంధం లేనివాడు. జనకమహారాజు. అతని కూతురు సీత, అందుకే ఘటికాచల మాహాత్మ్యంలో విదేహ కన్యా అనిప్రయోగం.

సూర్యవంశపు రాజైన ఇక్ష్వాకువు యొక్క కుమారుడు నిమి. ఇతడు చక్రవర్తి, ఇతడు ఒక యాగం చెయ్యాలని సంకల్పించి, పదార్థాలన్నీ ఏర్పాటు చేసుకుని వసిష్ఠుని దగ్గరకు వెళ్ళి యాగం చేయించమని అడిగాడు. అయితే అంతకు పూర్వమే పురుహూతుడు అనే రాజు ఒక యాగం చెయ్యాలని సంకల్పించి వసిష్ఠుని యాగం చేయించమని కోరాడు. సరేనన్నాడు వసిష్ఠుడు. . ఇప్పుడు నిమిచక్రవర్తి వచ్చి అదే సమయంలో నాకు యాగం చేయించాలి అన్నాడు.దానికి వసిష్ఠుడు ముందు చెప్పిన వాడు పురుహూతుడు. కాబట్టి అతడి యాగం పూర్తి చేయించి వస్తాను అన్నాడు.అంత కాలం ఆగటం ఇష్టంలేని నిమిచక్రవర్తి గౌతముణ్ణి హోతగా పెట్టుకుని యాగం చేస్తున్నాడు. ఈ సమయంలో వసిష్ఠుడు వచ్చాడు.అప్పుడు నిమి నిద్రలో ఉన్నాడు. దాంతో వసిష్ఠుణ్ణి స్వాగతించలేదు. వసిష్ఠుడికి కోపం వచ్చి నిమిని దేహము విడువుము, విదేహుడవు కమ్ము అని శాపం ఇచ్చాడు.నిమిదేహాన్ని చాలించాడు. గౌతముడు నిమిచక్రవర్తి దేహాన్ని నూనెలో భద్రపరచి యాగము పూర్తి చేశాడు. దేవతలు వచ్చి హవిస్సులు స్వీకరించి నిమిని పునర్జీవితునిగా చేస్తాము అన్నారు.కాని ఈ దేహం ధరించటానికి నిమి ఒప్పుకోలేదు. దేవతల మహిమవల్ల దేహం లేకపోయినప్పటికీ ప్రజలకు దేహమున్నట్లే కనుపించాడు నిమిచక్రవర్తి. అందుకనే నిమి పాలించిన దేశానికి విదేహదేశము అని పేరొచ్చింది.నిమికి కుమారులు లేరు కాబట్టి అతని కుడిభుజాన్ని మథించారు ఋషులు. దానిలో నుంచి ఒక బాలుడు జన్మించాడు. అతడే జనకుడు. విదేహుని కుమారుడు కాబట్టి వైదేహుడని, మథనజాతుడు కాబట్టి మిథులుడని పిలువబడ్డాడు. మిథులుడు నిర్మించిన నగరమే మిథిలానగరము.

కృత్వాఽభిషేకం తరుణామ్బుధారయా దృఢాం కపాలీమపి రాఘవేశ్వరః |
యస్మై దదాతీతరమ్భగ్యమన్వహం నమో నమస్తే మహతే హనూమతే || ౨౦

శ్రీ రాముని మాటపై ఇతరులు సాధించలేని గొప్ప కార్యక్రమముగా కైలాసమునుండి శివలింగమును రామేశ్వరము తీసుకొని వచ్చి, ఆ దృఢమైన శివ లింగానికి ప్రతిరోజు సముద్ర జలాలతో అభిషేకం చేయించిన హనుమంతుడా ! నీకు నమస్కారం.

విశేషాలు

1. **'రామచంద్రేణ సమర్చితం తం రామేశ్వరాఖ్యం సతతం నమామి' అని రామేశ్వరుడి ప్రస్తావన ద్వాదశ జ్యోతిర్లింగస్తోత్రంలో ఉంది.**
2. **ఈ రామేశ్వరుని ఈ** ఘటికాచల మాహాత్మ్య **శ్లోకంలో రాఘవేశ్వరుడు అని చెప్పారు.**

3. రామేశ్వర స్థల పురాణం ప్రకారం- త్రేతాయుగంలో సీతాదేవిని అపహరించిన రావణాసురుడిని సంహరించేందుకు శ్రీరాముడు వానర సైన్యంతో కలిసి రామేశ్వరం నుంచి రామసేతు నిర్మించి శ్రీలంకకు చేరుకున్నాడు. తర్వాత రావణుడిని సంహరించిన అనంతరం రాముడు - సీతాదేవి, లక్ష్మణుడు, హనుమంతుడు, సుగ్రీవుడు అందరూ కలిసి అయోధ్యకు వెళ్లేటప్పుడు ఇక్కడ సేదతీరారని పురాణోక్తి.

అప్పుడు.. మహాజ్ఞానీ, శివభక్తుడూ అయిన రావణుడిని సంహరించినందుకు బ్రహ్మహత్యాపాతకం చుట్టుకోకుండా ఉండటానికి.. పరిష్కారం చూపించమని రాముడు మహర్షులను అడిగాడట. శివలింగాన్ని ప్రతిష్ఠించి పూజించమని వారు సలహా ఇచ్చారట. అప్పుడు.. కైలాసానికి వెళ్లి శివలింగాన్ని తీసుకురమ్మని హనుమంతుడిని ఆదేశించాడట రాముడు.

అయితే.. బయల్దేరి వెళ్లిన హనుమంతుడు ముహూర్త సమయం దగ్గరపడుతున్నా రాలేదట. దీంతో సీతాదేవి సముద్రపు ఒడ్డున ఇసుకతో శివలింగాన్ని తయారుచేసిందట. ఆ శివలింగానికే రాముడు పూజలు చేశాడట. ఆ తర్వాత శివలింగంతో వచ్చిన హనుమంతుడు.. ఈ విషయం తెలిసి అలగడంతో రాముడు రెండింటినీ ప్రతిష్ఠించాడట. అంతేకాదు.. భక్తులు మొదట హనుమంతుడు తెచ్చిన శివలింగాన్నే దర్శించుకోవాలనే కోరాడట.

అందుకే.. ఇప్పటికీ అర్చకులు హనుమంతుడు తెచ్చిన శివలింగానికి పూజలూ, నైవేద్యాలూ చేసిన తర్వాతే రామలింగానికి పూజలు చేస్తారు. ఇలా రెండు శివలింగాలూ కలిగిన అరుదైన ఆలయంగా ఈ గుడి గుర్తింపు పొందిందని పండితులు చెబుతున్నారు. అలా రాముడు ప్రతిష్ఠించిన రామనాథస్వామి జ్యోతిర్లింగంగా భక్తులతో పూజలు అందుకుంటున్నాడు.(ఈటీవీ భారత్ సౌజన్యం)

4. 'రామః తత్పురుషం బ్రూతే బహువ్రీహిం మహేశ్వరః
రామేశ్వర పద ప్రాప్తే ఋషయః కర్మధారయమ్'

రామభక్తులు రామేశ్వర పదానికి అర్థం చెప్పమని రాముడిని అడిగారు. అప్పుడు రాముడు వారితో.. తత్పురుష సమాసం ప్రకారం రాముడికి దేవుడైనవాడు రామేశ్వరుడు అనే అర్థాన్ని చెప్పాడట.

శివుని భక్తులు రామేశ్వర పదానికి అర్థం చెప్పమని శివున్ని అడిగారు. బహువ్రీహి సమాసం ప్రకారం రాముడు ఎవరికి దేవుడో అతడు రామేశ్వరుడు అని చెప్పాడట.

ఋషుల్ని అడిగితే రాముడే ఈశ్వరుడు, ఈశ్వరుడే రాముడు అంటూ కర్మధారయ సమాసంలో రామేశ్వర పదానికి అర్థం చెప్పారట.

మొత్తానికి, రాముడన్నా, ఈశ్వరుడన్నా ఒక్కటే అని రామేశ్వర పదానికి అర్థం. రాఘవేశ్వరుడు అన్నా అదే అర్థం.

5. ఈ ఘటికాచల మాహాత్మ్య శ్లోకానికి మరింతగా పండిత లోకపు విశ్లేషణ అవసరమనిపిస్తున్నది. పదాల అర్థ సమన్వయం సరిగా కుదరటంలేదు.

71 – 80

వచోఽనురోధేన పురా మహామృధే వర్షీయసో జామ్బవతో మహౌషధీః ।
ప్రగృహ్య యోఽజీవయదూర్మిలాసఖం నమో నమస్తే మహతే హనూమతే ॥ ౭౧

పూర్వం మహా యుద్ధంలో వృద్ధుడైన జాంబవంతుని మాటను అనుసరించి ఓషధి పర్వతమును తీసుకొని వచ్చి ఊర్మిళాదేవి భర్త అయిన లక్ష్మణుని తిరిగి బ్రతికించిన ఆ మహా హనుమంతునికి నా గౌరవపూర్వక నమస్కారాలు అర్పిస్తున్నాను. 71

విశేషాలు

జాంబవంతుడు హనుమంతునితో చెప్పిన మాటలు ఇవి

మారుతీ! నీవు వెంటనే సముద్రము మీదిగా అంతరిక్షమార్గమున సుదూరము పయనించి, పర్వతరాజమైన హిమాలయమునకు చేరుట ఎంతేని అవసరము. శత్రుసంహారకా! ఆ చోట నీకు స్వర్ణమయమై, అత్యున్నమైన 'వృషభగిరి' అను ఒక మహాపర్వతము, కైలాసశిఖరము కనబడును - మహావీరా! వృషభగిరికిని కైలాసశిఖరమునకును మధ్య సాటిలేని తేజస్సుతో చక్కగా వెలుగొందుచుండెడి 'ఓషధిపర్వతము' కనిపించును - అది వివిధములగు ఓషధులకు నిధానము. వానరోత్తమా! ఆ శిఖరముపై దివ్యములైన నాలుగు ఓషధులు నీకు గోచరములగను. అవి తమ దివ్యకాంతులతో దశదిశలను ప్రకాశింపజేయుచుండును. మృతసంజీవని, విశల్యకరణి, సంధానకరణి సావర్ణ్యకరణి, అను పేర్లతో ఒప్పెడి ఆ నాలుగు మహౌషధులను  తీసికొని శీఘ్రముగా మఱలి రమ్ము. వాయుసుతా! ఆ ఓషధుల ప్రభావముతో వానరులను సజీవులనుగావించి వారికి స్వస్థత గూర్చుము.''( వాల్మీకి రామాయణం యుద్ధకాండ 74 వసర్గ -29 నుండి 34 శ్లో)

హనుమంతుడు జాంబవంతుని మాట ప్రకారం 'ఓషధిపర్వతము' తీసుకొని వచ్చి, అందరికి స్వస్థత కలిగిన పిమ్మట మరలా దానిని హిమవత్పర్వతము మీదికి చేరుస్తాడు.

త్వం రామదూతోఽసి దశాస్యదర్పహా త్వం వేదవేద్యోఽసి మహర్షిపూజితః ।
త్వం రుద్రరూపోఽసి భవాన్ హి వైష్ణవః పురావిదస్త్వాం వివిధా గృణాన్తి వై ॥౭౨

నువ్వు రామ దూతవి . రావణుని గర్వాన్ని నాశనం చేసావు.  నువ్వు వేదాలకు వేదికవు. నువ్వు మహా ఋషులచే పూజించబడుతున్నావు నీవు రుద్ర రూపంలో ఉన్నావు. నీవు నిజంగా వైష్ణవుడివి. ఈ విధంగా పూర్వీకులయిన తెలిసిన వారు నిన్ను వివిధ విధాలుగా స్తుతిస్తారు.

త్వం పుత్రకామేషు సుపుత్రదాతా త్వం వీర్యకామేషు సువీర్యదాతా ।
త్వం భక్తికామేషు హి భక్తిదాతా కిం కిం న దాతాఽసి నృణాం హనూమన్ ॥ ౭౩

పుత్రులను కోరుకునే వారికి నీవు మంచి పుత్రులను ఇస్తావు, పరాక్రమాన్ని కోరుకునే వారికి నీవు మంచి బలాన్ని ఇస్తావు. భక్తి కోరుకునే వారికి భక్తిని ఇచ్చేవాడవు నీవు, మరి మానవులకు భక్తిని ఎందుకు ఇవ్వవు, ఓ హనుమా?( ఇవ్వమని ప్రార్థన)

స్తుతిప్రియస్త్వం పవనప్రియస్త్వం భక్తప్రియస్త్వం నృహరిప్రియస్త్వమ్ ।
రామప్రియస్త్వం సవితృప్రియస్త్వం ప్రసీద మహ్యం హనుమన్నమస్తే ॥ ౭౪

నీవు స్తుతికి ప్రియమైనవాడవు, వాయువుకి ప్రియమైనవాడవు, నీ భక్తులకు ప్రియమైనవాడవు, నరహరికి ప్రియమైనవాడవు. రాముడికి, సూర్యుడికి నువ్వు ప్రియమైనవాడివి .నన్ను కరుణించు ఓ హనుమా, నీకు నా నమస్కారాలు అర్పిస్తున్నాను. 74

నమస్తే నమస్తేఽస్తు నాథాయ తుభ్యం నమస్తే నమస్తేఽక్షప్రాణహన్త్రే ।
నమస్తే నమస్తేఽసురగర్భహన్త్రే నమస్తే సమస్తాభిలాషప్రదాత్రే ॥ ౭౫-

అక్షకుమారుని జీవితాన్ని నాశనం చేసిన ఓ ప్రభూ, నీకు నా గౌరవపూర్వక ప్రణామాలు అర్పిస్తున్నాను.

రాక్షసమాతల గర్భాలను నాశనం చేసే నీకు, మా కోరికలన్నింటినీ ప్రసాదించే నీకు నమస్కారాలు. 75-

ఇతి స్తుతో మహాయోగీ వానరేన్ద్రో ప్రహర్షితః ।
ఊచే సంస్కృతయా వాచా వామదేవం కృతాఞ్జలిమ్ ।।౭౬
ఆ విధంగా వామదేవుడు  స్తుతించగా ఆ మహా యోగి అయిన  వానర ప్రభువు సంతోషించాడు.ఆయన చేతులు జోడించిన వామదేవునితో సంస్కృతంలో ఇలా మాట్లాడాడు.

శ్రీహనుమాన్

వామదేవ త్వయా యద్వా వాఞ్ఛితం వద సాధయే।
వివాదో నాత్ర కర్తవ్యో నృహరౌ శాస్తరి స్థితే ।।౭౭
“వామదేవా! నీ ఇష్టమును చెప్పు. శ్రీ నరసింహుడు రక్షకుడై యుండగా ఎవరూ బాధపడనవసరం లేదు” అని హనుమంతుడుచెప్పాడు.

వామదేవ:

మహాతపా నామ పితా మమ మారుతనన్దన ।
వేదానధ్యాపయామాస సానుక్రోశేన మాదృశాన్ ।।౭౮
వామదేవుడు ఇలా చెప్పాడు“వాయునందనా! మహా తపుడను నా తండ్రి నాయందు దయతో నాకు వేదములను  నేర్పాడు.

తత్రాయం శైశవాత్ స్వామీ పితా సంప్రార్థితో మయా ।
అధీతాశ్రుతయస్తాత దీయతే గురుదక్షిణా ।।౭౯
కాని నేను బాల్యచాపల్యముతో నా తండ్రిని  “నీకు గురుదక్షిణ ఏమి ఇవ్వవలెనని" అని ప్రార్థించాను.

తదా మాం బాలిశం వాక్యమూచివాన్ స మహాతపాః ।
వారయామాస బహుశస్సహశిష్యమనాదృతః ।। ౮౦
అప్పుడు ఆ మహా తపస్వి నా మాటలను పిల్లతనపు మాటలుగా లెక్కించి  చాలాసార్లు తనకు గురుదక్షిణ వద్దని చెప్పారు. 80.

81 -90

అథో నిర్బన్ధతో రాజన్ వానరాణాం మహాతపాః।
సుధా మే దీయతాం వస్తు పితృశ్రాద్ధాయ గుర్వినే।।౮౧
ఓ వానర శ్రేష్ఠా ! హనుమంతా ! నేను  నిర్బంధముగాగురుదక్షిణ తీసుకొమ్మని  అడిగితే  నా తండ్రి  శ్రాద్ధకర్మకొరకు(తద్దినము)  అమృతమును తెమ్మని నన్ను కోరాడు.

ఇత్యుక్తోఽహమమీభిస్తు సహ భ్రాత్రైః పితుర్గురోః ।
అగస్త్యస్యాశ్రమపదం ప్రాప్తవాన్ పవనాత్మజ ।।౮౨
ఓ వాయు పుత్రా ! అలా తండ్రి కోరికను విని నేను నా సోదరులతో కలిసి  అగస్త్యాశ్రమమునకు వెళ్ళాను.

**విశేషాలు**

**'అగం వింధ్యం పర్వతం స్త్యాయతి' వింధ్య పర్వతమును పెరగకుండా ఆపినవాడు కనుక అగస్త్యుడు అని పేరు వచ్చింది.**

**నమస్కృతో మయాగస్త్యస్సర్వం బుద్ధ్వా మదీప్సితమ్ ।**
**ఇహ యాహీతి మామాహ హనూమంస్తవ సన్నిధౌ ॥**

**అగస్త్యునికి నమస్కరించి జరిగిన కథ చెప్పి అమృతము ఎలా లభిస్తుందని అగస్త్యుని అడిగాను. ..ఓ హనుమంతా ! ఆ మహర్షి మీ సన్నిధికి వెళ్ళమని చెప్పాడు.**

**స హి స్తుతస్సర్వకామాన్ ప్రదాస్యతి న సంశయః ।**
**ప్రార్థితాదధికం దాతుం క్షమతే హనుమానితి ॥౮౪**

**"హనుమంతుని స్మరిస్తే అన్ని కోరికలు నెరవేరతాయి. కోరిన దానికంటె ఎక్కువగా హనుమంతుడు ఎక్కువగా ఇవ్వగలడని అగస్త్యుడు నాతో చెప్పాడు.**

**ఇత్యుక్తో మునినా సోऽహమగస్త్యాధిష్ఠవర్త్మనా ।**
**సంప్రాప్తో దైవయోగేన హనూమన్ భవదన్తికమ్ ॥౮౫**

**"ఓ హనుమంతా ! అగస్త్యముని అలా చెప్పిన తరువాత నేను అగస్త్యుడు సూచించిన మార్గములో మిమ్మలిని వెతుక్కొంటూ నా అదృష్ట విశేషమున మీ దగ్గరకు వచ్చాను" అని వామదేవుడు వినయముతో అన్నాడు.**

**శ్రీహనుమాన్**

**సుధా నిక్షేపరూపేణ స్థాపితా చన్ద్రమణ్డలే ।**
**సా హీదానీం భవద్వస్తు దీప్యతే సుమనోహరమ్ ॥౮౬**

**ఆంజనేయుడు వామదేవునితో ఇలా అన్నాడు. "చంద్రమండలమున నేను దాచి ఉంచిన అమృతమును నీకు ఇస్తాను. ఇప్పుడు నువ్వు కోరిన కోరిక అందంగా ప్రకాశిస్తుంది."**

**పూషా-**

**తత్రాన్తరే స భగవాన్ చన్ద్రమా హనుమత్పదమ్ ।**
**నమస్కృత్య స నృహరేరవతీర్ణో నగోత్తమమ్ ॥౮౭**

**హనుమంతుడు చెప్పిన వెంటనే , గౌరవనీయుడైన చంద్రుడు, హనుమంతుని పాదాల వద్ద ప్రత్యక్షమయ్యాడు. అతను నరసింహస్వామికి నమస్కరించి, స్వామివారి అత్యుత్తమ పర్వతముపైకి దిగాడు.**

అవగాహ్య మహాతీర్థే పావనేః పావనే తథా
భగవాంశ్చన్ద్రమాః పార్శ్వ హనూమన్తముపాసదత్ ||౮౮
పవిత్రతకు పవిత్రత కలిగించే  హనుమత్తీర్థములో స్నానము చేసి ,చంద్రుడు తన పక్కనే ఉన్న హనుమంతుడిని పూజించాడు.

అథోత్థాయ హనూమాంస్తు బహుమానేన చక్షుషా |
పశ్యన్నపశ్యాయకరమిదమూచే సుధాకరమ్ ||౮౯
అప్పుడు హనుమంతుడు లేచి చంద్రుని వైపు చాలా ప్రేమగా చూసాడు. సుధాకరునితో( అమృతమయములగు కిరణములు కలవాడు. చంద్రుడు) హనుమంతునితో ఇలా అన్నాడు.

విశేషాలు

1. యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి |
   తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి ||06 - 30 || (ఎవరైతే నన్ను అంతటా దర్శిస్తారో, అన్నిటినీ నా యందే దర్శిస్తారో, నేను వారికి దూరమవను. వారు నాకు దూరం కారు.) అను గీతాశ్లోకం ఈ సందర్భంలో స్మరణీయం.
2. సుధాకరుడను ( అమృతమయములగు కిరణములు కలవాడు. చంద్రుడు) పద ప్రయోగం ఈ సందర్భంలో మనోహరం.

శ్రీహనుమాన్ -
నక్షత్రేశ మహాభాగ త్వయి గుప్తా మయా పురా |
యా సుధా మునిపోతాయ దీయతాం తదిదం త్వయా | | ౯౦
చంద్రా! పూర్వము నీయందు నేను ఉంచిన  అమృతమును ఈ మునికుమారుడయిన  వామదేవునకు ఇమ్ము.
జన్మప్రభృతి వత్సోఽయం హరిభక్తో జితేన్ద్రియః |
వామదేవో మహాయోగీ విశేషం హనుమత్ప్రియః || ౯౧
ఈ వామదేవుడు బాల్యమునుండి హరిభక్తుడు. జితేంద్రియుడు. మహాయోగి. విశేషించి నాకు ఇష్టమైనవాడు .

హనుమత్ప్రీణనాచ్చైవ పితౄణాం ప్రీణనేన చ |
గురుప్రీణనయాప్యస్మిన్ ప్రసన్నో నరకేసరీ || ౯౨
నన్ను, తండ్రిని, గురువును సంతోషింపజేసిన ఈ వామదేవునిపై  నరసింహస్వామి అనుగ్రహము చూపించాడు.'' అని హనుమంతుడు చంద్రునితో అన్నాడు.

చన్ద్రమాః
దుర్లభా హి సుధా లోకే యదస్మిన్ దీయతే త్వయా |
హనూమంస్తద్దయాదేవ దేవో మర్త్యో న కేవలమ్ ||౯౩

చంద్రుడు హనుమంతునితో ఇలా అన్నాడు.  "లోకములో  అమృతము చాల దుర్లభమైనది. దేవతలు, నరసింహానుగ్రహము కలవారు తప్ప ఇతరులు పొందలేరు. నీ దయతో ఇతడు పొందాడు.

అమునా రచితస్తోత్రం త్వత్కృతే పవనాత్మజ|
విలిఖ్య పఠతే యస్తు శ్రుణుతే వా సతాం మతః ||౯౪
ఆంజనేయా ! ఈ వామదేవుడు నీపై  చేసిన స్తోత్రము చదివినవారు, విన్నవారు నీ అనుగ్రహముతో విష్ణుభక్తిని పొందుతారు.

విశిష్య పౌర్ణమాస్యాం వే భానువారే పఠేన్నరః |
త్వత్కృపాలమ్బనద్వారా విష్ణుభక్తిః ప్రజాయతే || ౯౫
ఓ హనుమంతా !పౌర్ణమి రోజున, ముఖ్యంగా ఆదివారం రోజున  ఈ నీ స్తోత్రాన్ని చదివిన మానవుడు  నీ దయకు నోచుకొని  విష్ణువు పట్ల భక్తి కలిగినవాడవుతాడు..

సుదుర్లభం నృణాం జన్మ నరకేసరిణః పథే |
తత్రాపి దుర్లభా విష్ణౌ భక్తిరవ్యభిచారిణీ || ౯౬
నరసింహభక్తి  మార్గం కలిగిన  మానవ జన్మ  జన్మించడం చాలా అరుదు. ఆ జన్మలో కూడా విష్ణువు పట్ల అచంచలమైన భక్తి ఉండటం చాలా అరుదు. 96

భవత్కృపాతిరేకేణ నరో వా దేవతాపి వా |
నృహరౌ భక్తిమభ్యేత్య జీవన్ముక్తో న సంశయః ||౧౭
నీ దయవల్లనే, మనిషి అయినా, దేవత అయినా, నరసింహ భక్తిని పొందుతాడు.  తరువాత, అతను నిస్సందేహంగా సజీవంగా మోక్షం పొందుతాడు.

ఇతి సంకీర్త్య చ దదౌ సుధాం తాపసయోగినే |
హనూమతోఽనుమత్యాసౌ నృహరేః పదమభ్యగాత్ ||౯౮
ఈ రకంగా హనుమంతుని  జపించిన తర్వాత, చంద్రుడు  ఆ అమృతాన్ని వామదేవునికి  ఇచ్చాడు. తరువాత హనుమంతుని అనుమతితో అతను నరహరి నివాసాన్ని చేరుకున్నాడు.

తతో హనూమాన్ మునయే దాపయన్ చన్ద్రమస్సుధామ్ |
నిశ్రేయసం తే భావీతి వ్యాహృత్యాన్తరధాత్తదా | | ౯౯
చంద్రుడు అమృతాన్ని వామదేవునికి ఇచ్చిన తరువాత  హనుమంతుడు  "నీకు మేలగుగాక"  అని వామదేవుని ఆశీర్వదించి మాయమయ్యాడు.

వామదేవ:

సుధాం ప్రగృహ్య ధర్మాత్మా హనుమద్వాక్యయోదితః ।

హస్తామలకవన్మేనే నృహరేరపరోక్షతామ్ । ।౧౦౦

హనుమంతునిచే ఆశీర్వదింపబడిన వామదేవుడు అమృతమును గ్రహించి ఆ అమృత స్వరూపములో పరోక్షముగా శ్రీ నృసింహుడే తనకు ప్రత్యక్షమైనట్లుగా భావించాడు. నరసింహుని కరతలామలకముగా( సులువుగ అధీనమగువానిగా) తలచాడు.

విశేషాలు

తనంతనే స్పష్టమగుదానికిని, అప్రయత్నముగ లభించుదానికి  కరతలామలకముగా అను పదబంధాన్ని వాడతారు.

101 -106

వాఞ్ఛితాదధికం దద్యాద్ధనుమానితి యద్వచః ।

కుమ్భయోనీరితం తథ్యం సర్వథా నాత్ర సంశయః || ౧౦౧

కోరిన దానికంటె ఎక్కువగా  హనుమంతుడు ఇచ్చునని అగస్త్యుడు చెప్పిన మాట సత్యమైనదని  , ఇందులో ఎటువంటి సందేహము లేదని వామదేవుడు భావించాడు.

ఇతి విస్మయమాపన్నో వామదేవస్సహోనుగః ।

నృహరిం చ హనూమన్తం ధ్యాయన్నాశ్రమమభ్యగాత్ । ।౧౦౨

ఆ విధంగా వామదేవుడు మరియు అతని సోదరులు హనుమంతుని మహిమను తలచుకొంటూ  ఆశ్చర్యపోయారు. తరువాత వామదేవుడు నరహరిని మరియు హనుమంతుడిని ధ్యానిస్తూ తండ్రి ఆశ్రమమునకు వెళ్ళాడు.

తతో గత్వాశ్రమపదం ప్రశ్రయావనతో మునిః ।

అభివాద్య గురుం పశ్చాద్దర్శయామాస తాం సుధామ్ ||౧౦౩

తండ్రి ఆశ్రమమునకు వెళ్ళిన తరువాత  వినయముతో గురువైన తండ్రికి  నమస్కరించి వామదేవుడు  అమృతము ఇచ్చాడు.

తతో వాహతవర్ణీ తాం సుధాం గృహ్య మహాతపాః ।

మూర్ధ్న్యపాఘ్రాయ తనయం పస్పర్శ స ముహుర్ముహుః ||౧౦౪

వామదేవుని తండ్రి  అమృతమును  తెచ్చిన తన కుమారుని కౌగలించి, అతని  తలపై ప్రేమతో మాటిమాటికి ముద్దుపెట్టి  ఆనందించాడు.

తామేవ గాథామనిశం శ్రావ్యాం హనుమతః ప్రియామ్ ।

శృణ్వన్ దురుస్తథా పుత్రం ప్రీణయన్ స జహర్ష హ । । ౧౦౪

హనుమంతుడు సంతోషించిన  విధమును,  జరిగిన కథను వామదేవుడు తన తండ్రికి చెప్పాడు..ఇది విని తండ్రి  తన కొడుకు వామదేవుడు ప్రవర్తించిన విధానానికి  చాలా సంతోషించాడు.

రాజర్షే తాదృశస్యైవ మహిమ్నః పదమాస్థితః ।

వామదేవో నరహరేః ప్రసాదాన్ముక్తిభాక్ క్షణాత్ ॥ ౧౦౫

పై కథను సూర్యుడు విశ్వామిత్రునకు చెప్పి "ఓ రాజర్షీ! విశ్వామిత్రా ! హనుమద్భక్తితో వామదేవుడు నరసింహుని దయకు పాత్రుడై అతిశీఘ్రంగా ముక్తి పొందాడు.

కిం పునః పునరుక్తేన నరసింహపదే వసన్ ।

వైష్ణవ భక్తిమాసాద్య జీవన్ముక్తో భవేన్నరః । । ౧౦౬

"పలుమాటలు ఎందుకు? ఈ ఘటికాచలములో నివసించువాడు విష్ణుభక్తిని పొంది జీవన్ముక్తిని(జీవించి ఉండగానే కర్తృత్వ, భోక్తృత్వ, సుఖ దుఃఖాలకు అతీతమైన, భవ బంధాలు బాధించని స్థితి. జీవించి ఉండగానే 'ముక్తి'.) తప్పక పొందగలడు. అని కూడా సూర్యుడు విశ్వామిత్రునకు చెప్పాడు.

ఇతి బ్రహ్మకైవర్తే ఉత్తరఖణ్డే భృగుపరాశరసంవాదే ఘటికాచలమాహాత్మ్యే షోడశోఽధ్యాయః ॥

ఇక్కడితో బ్రహ్మ-కైవర్త పురాణంలోని ఉత్తరఖండంలో భృగువు మరియు పరాశరుని మధ్య జరిగిన సంభాషణలో ఘటికాచల మాహాత్మ్యంలో పదహారవ అధ్యాయం పూర్తి అయినది. +++++

శ్రీ శివాయ గురవే నమః

ఘటికాచలనివాసాయ శ్రీ నృసింహాయ నమః

బ్రహ్మకైవర్త పురాణములో ఉన్న శ్రీఘటికాచల మాహాత్మ్యపు పదిహేడవ అధ్యాయము

(మూల శ్లోకము మరియు తాత్పర్య విశేషాలతో)

1-10

సప్తదశోఽధ్యాయః

శ్రీవసిష్ఠః-

ఇతీరితస్తు భగవాన్ విశ్వామిత్రో మహామునిః ।

హర్షసంకులయా వాచా ప్రస్తోతుముపచక్రమే ॥ ౧

1-10

పదిహేడవ అధ్యాయం

శ్రీ వసిష్ఠుడు-

" ఈ ఘటికాచలములో నివసించువాడు విష్ణుభక్తిని పొంది జీవన్ముక్తిని(జీవించి ఉండగానే కర్తృత్వ, భోక్తృత్వ, సుఖ దుఃఖాలకు అతీతమైన, భవ బంధాలు బాధించని స్థితి. జీవించి ఉండగానే 'ముక్తి'.) తప్పక పొందగలడు". అని సూర్యుడు విశ్వామిత్రునకు చెప్పాడు.( పదహారవ అధ్యాయము) ఈ సూర్యుని మాటలు విన్న విశ్వామిత్ర మహర్షి ఆనందంతో నిండిన మాటలతో సూర్యుని ఇలా స్తోత్రం చేసాడు. 1.

## సూర్యుని స్తుతి

సహస్రశీర్ష్ణాయ సహస్రబాహవే సహస్రపాదాయ సహస్రరోచిషే ।

మహానుభావాయ మహాస్త్రచారిణే నమః పరస్మై పతయే మహాత్మనామ్ ॥౨

ఓ వేయి తలలు, వేయి చేతులు, వేయి పాదాలు, వేయికిరణాలతో ప్రకాశవంతమైన ప్రభువా!

ఓ మహా శక్తిమంతుడైన గొప్ప ఆయుధధారీ ! సర్వోన్నత ప్రభువయిన సూర్యునికి నా ప్రణామాలు అర్పిస్తున్నాను.

**విశేషాలు**

విశేషాలు

సూర్యుని వేయి కిరణాల గురించి భారతంలో, మత్స్యపురాణంలో, మార్కండేయపురాణంలో వర్ణించారు.

వృష్టిసర్జన ( వానను సృష్టించు) కిరణాలు 400. వాటిలో మళ్ళీ 100 చెప్పున నాలుగు రకాలుగా ఉండి వర్షాన్ని కురిపించే కిరణాలు ఎన్ని రకాలుగా ఉంటాయో చెప్పారు.

ఘర్మసర్జన కిరణాలు 300. ఘర్మము అంటే తాపం, ఉడకపోత ఇవి కలిగించే కిరణాలు.

హిమసర్జన కిరణాలు 300 అనగా మంచును కలిగించే కిరణాలు.

ఇలా 'వెయ్యికిరణాల వాడు' అంటే లెక్కకట్టి సహస్రకిరణ స్వరూపుడైన ఆదిత్యుని వర్ణన చెప్తున్నారు.

వీటి వలన వాతావరణంలో ఈ మూడు లక్షణాలు ప్రవేశింపజేసి సూర్యుడు వర్షాన్ని, ఘర్మాన్ని, హిమాన్ని కూడా కలిగిస్తున్నాడు.

ఇవన్నీ రశ్ముల భేదాలు. ఆయన కిరణములతో చేస్తున్న పనులు ఎన్నో కనుక ఇన్ని కిరణాలు కలిగిన మహానుభావుడు సర్వజగత్తుని వాటితోనే పాలిస్తున్నాడు.

'ప్రాణాన్ రశ్మిషు సన్నిధత్తే' - ఆ కిరణాల ద్వారానే సూర్యుడు జీవకోటికి ప్రాణాలిస్తున్నాడని ప్రశ్నోపనిషత్ మంత్రం.

అగాధసత్త్వాయ తమోఽపహారిణే మహాత్మనే సత్యమహావియత్స్పృశే ।

అనామయాయామితధీమయాయ తే నమో నమః కారణకారణాయ ॥౩

ఓ అతీంద్రియ శక్తిశాలీ ! నీవు చీకటిని పారద్రోలుతావు,నువ్వు మంచి స్వభావము కలవాడివి. (గౌరవము గలవాడివి. గొప్పవాడివి.).

నీవు సత్యమనే గొప్ప ఆకాశాన్ని తాకుతున్నావు.

ఓ దోషరహితుడా! అపరిమితుడా! తెలివైనవాడా! సర్వ కారణములకు కారణమయినవాడా, నీకు నా నమస్కారాలు అర్పిస్తున్నాను.

**విశేషాలు**

నమః కారణకారణాయ(సర్వ కారణములకు కారణమయినవాడా)

1. స్వభావము, 2. ఈశ్వరుడు, 3. కాలము, 4. యదృచ్ఛ, 5. నియతి (పూర్వజన్మ సంపాదిత ధర్మాధర్మములు), 6. పరిణామము. [సృష్టిలోని కార్యజాతము పుట్టుటకు ఈ ఆఱును కారణములని సుశ్రుతమతము. ఈ కారణములకు సూర్యుడు కారణమయినవాడు.
2. కుండ ఈ లోకంలో తయారు కావాలంటే, 1. మట్టి (ఉపాదానకారణం అనగా ముఖ్య కారణం), 2. మట్టిని కుండగా రూపొందించటం (సమవాయ కారణం అనగా ఏ కారణము కార్యమందు చేరి ఉంటుందో అది), 3. కుండను చేసేవాడు (నిమిత్త కారణం) అవసరం. అలానే బట్ట నిర్మాణం కూడా 1. ప్రత్తి (ఉపాదానకారణం), దారాలు నేత (సమవాయ కారణం, వస్త్రానికి, దానికి కారణాలైన దారాలకూ గల

వేరుచేయరాని సంబంధం ), బట్ట నేసే వాడు (నిమిత్త కారణం). లోకంలో, ఏ కార్యానికైనా పై మూడూ అవసరం. భగవంతుని సృష్టిలో భగవంతుడు సమవాయ కారణమని భాగవతం చెబుతున్నది. (03 -345).

అజాయ లోకత్రయపావనాయ భూతాత్మనే శిక్షితసంహతాయ ।
సూర్యాయ సర్గప్రలయాలయాయ నమో మహాకారుణికోత్తమాయ ॥౪
ఓ సూర్యదేవుడా ! నీవు జన్మరహితుడివి, మూడు లోకాలను పవిత్రం చేసేవాడివి, అన్ని జీవులకు ఆత్మవి, నీవు విద్యావంతుడివి, నేర్పరితనంతో జగత్తును ఒక్కటిగా చేయువాడివి.
సృష్టి సంహారాలకు నిలయమైనవాడివి, అందరికంటే కరుణామయునివి . నీకు నమస్కారం.

నమః ప్రశాస్త్రే జగతాం త్రయాణాం నమః ప్రశాస్త్రే జహి విద్విషే మే ।
తమోనిహన్త్రే హృదయంగమాయ నమః ప్రవక్త్రే నిగమాదివాచమ్ ॥౫
మూడు లోకాలను శాసించువానికి నమస్కారం . మూడు లోకాల మిత్రునికి నా ప్రణామాలు అర్పిస్తున్నాను. దయచేసి నాలోని శత్రువును( శత్రుభావాన్ని) సంహరించవలసినది.
ఓ చీకటిని నాశనం చేసేవాడా! హృదయంలో కదిలేవాడా,( మనోహరమైనవాడా!) వేదాలు మొదలైన వాటిని చెప్పేవాడా, నీకు నా ప్రణామాలు అర్పిస్తున్నాను.

**విశేషాలు**

**హృదయంగమాయ**

ఈ మధ్య కాలంలో కేరళలో జరిగిన సంఘటన ఇది. ఒక వ్యక్తికి సుమారు 70 యేళ్ళు. ఏనాడూ అన్నం తినలేదు. కానీ శరీరంలో రోగం రాలేదు. ఇప్పటికీ బలంగా ఉన్నాడు ఆయన. ఆయన చెబుతాడు "నాకొక్కటే తెల్సు. ప్రాతఃకాలంలో సూర్యునికి ఎదురుగా నిలబడి ఒక ప్రక్రియతో ఆయన్ని చూస్తానన్నాడు" ఏకాగ్రంగా సూర్యుని చూస్తాడు.
సూర్యునినుంచి మనందరం వెలుగొస్తుందని అనుకుంటున్నాం. ఆ మహానుభావుడు "ఆ కిరణములనించి అమృతం వస్తోంది" అన్నాడు. రహస్యం చూడాలి. కిరణాల్లో వెలుగుతో పాటు అమృతం ఉంటుంది. ఆ అమృతమే మనందరం తాగుతున్నాం. అయితే మనం పరోక్షంగా తాగుతాం, ఆయన ప్రత్యక్షంగా తాగడానికి ప్రయత్నించాడు.సూర్యుడు అలా అమృత రూపంలో హృదయంలో కదులుతుంటాడు.

వివస్వతే జ్ఞానిహృదన్తరాత్మనే జగత్ప్రతీతాయ జగద్ధితైషిణే ।
స్వయంభువే దీప్తసహస్రచక్షుషే సుతోత్తమాయామితతేజసే నమః ॥౬
ఓ వివస్వాన్,( భువనమును కిరణములచే ప్రకాశింప చేయువాడా ! విశిష్టమైన ఐశ్వర్యము కలవాడా!) నీవు జ్ఞానుల హృదయంలో ఉన్న పరమాత్మవు. నీవు విశ్వాన్ని గ్రహించి విశ్వ సంక్షేమాన్ని కోరుకుంటున్నావు.
ఓ స్వయంభూ(తనకు తాను పుట్టినవాడా!), వేలాది ప్రకాశవంతమైన నేత్రాలు కలిగినవాడా, ఉత్తమ పుత్రులు కలిగినవాడా, అపారమైన వైభవం కలిగినవాడా, నీకు నా ప్రణామాలు అర్పిస్తున్నాను.

విశేషాలు

వివస్వాన్

సూర్యునికి ఉన్న రకరకాల పేర్లలో వివస్వాన్ అనే పేరు ఒకటి. ఇవన్నీ వైదికమైన పేర్లు. వేదాలందు చెప్పబడ్డ సూర్యనామాలే ఇందులో చెప్పబడ్డాయి.

'వివస్తే' అనే శబ్దానికి కప్పుట అని అర్థం. 'వివస్తే ప్రభయా ఆచ్ఛాదయతి ఇతి వివస్వాన్' అన్నారు. ఆయన ఈ ప్రపంచాన్నంతటిని తన కాంతితో కప్పుతాడు అంటే తన కాంతిని విస్తరింపజేసి దానిలో ఇదంతా వెలిగిపోయేట్టు చేస్తాడు. అందుకే ఆయన పేరు వివస్వాన్.

నమః సవిత్రే జగదేకచక్షుషే జగత్ప్రసూతిస్థితినాశహేతవే ।

త్రయీమయాయ త్రిసుమూర్తిధారిణే విరిఞ్చినారాయణశఙ్కరాత్మనే 7

విశ్వానికి ఏకైక నేత్రమైన సూర్యదేవుడికి నా గౌరవపూర్వక ప్రణామాలు అర్పిస్తున్నాను. విశ్వం యొక్క సృష్టి, నిర్వహణ మరియు విధ్వంసం యొక్క కారణమైనవానికి నా ప్రణామాలు అర్పిస్తున్నాను. ఋక్ యజుస్సామ వేదాలు మూడు కలిపి ఒక రూపమైనవాడా !  బ్రహ్మ, విష్ణు, శంకరుల రూపములు కలిగినవాడా !

విశేషాలు

త్రయీమయాయ(ఋక్ యజుస్సామ వేదాలు మూడు కలిపి ఒక రూపమైనవాడు)

మనకు ఆదిత్యహృదయంలో 'ఋగ్యజుస్సామపారగః' అనే నామం వస్తుంది. సూర్యుడు వేదవిద్యాస్వరూపుడని దీని అర్థం.

సూర్యుడు అనగానే కేవలం కాంతి ఒక్కటే కాదు. ఈ చెవికి వినపడక పోవచ్చుగానిప్రాణశక్తిలో నాదం దాగి ఉంటుంది. లోపల ప్రాణం ఉంది గనుకనే మనలో నాదం ఉంది. జగత్తంతా నాదం ఉన్నది. ఇంత నాదాన్ని ప్రాణశక్తిని సూర్యకిరణాల్లోంచి ప్రకృతి పొందుతోంది.

సూర్యకిరణాలలో వేదస్వరూపమైన శబ్దశక్తి దాగియుంది. ఈ రహస్యం యాజ్ఞవల్క్య మహర్షికి, హనుమంతునికి తెలుసు. అందుకే వాళ్ళు సూర్యుని నుంచే విజ్ఞానం అంతా నేర్చుకున్నారు.అందుకే ఋక్ యజుస్సామ వేదాలు మూడు కలిపి ఒక రూపమైనవాడు సూర్యుడు.

శ్లోకరూపంగా, పద్యరూపంగా ఉండే మంత్రాలు ఋక్కులు. గద్యరూపంగా ఉండే మంత్రాలు యజుస్సులు. గానరూపంగా ఉండే మంత్రాలు సామములు. ఈ మూడు రకాల మంత్రాలు నాలుగు వేదాలలో ఉంటాయి. ఈ మూడింటితో కూడుకున్నదే వేదరాశి. ఆ వేదస్వరూపుడే సూర్యభగవానుడు.

విరిఞ్చినారాయణశఙ్కరాత్మనే(బ్రహ్మ, మహేశ్వర, విష్ణు రూపాలతో ఉన్న సూర్యుడు)

శాస్త్రంలో ఉదయం, మధ్యాహ్నం, సాయంకాలాదుల యందు బ్రహ్మ, మహేశ్వర, విష్ణు రూపాలతో ఉన్న సూర్యునకు నమస్కారం అన్నారు.

జ్యోతిర్గణానాం పతయే నమస్తే దినాధినాథాయ దివాకరాయ ।

నమః ప్రభాణామధిపాయ శాశ్వతే నమః పరస్మై మహతే బలాయ 8

ఓ  జ్ఞానజ్యోతులనే విద్యాగణాలకు ప్రభువువి.  నీవే పగటి యజమానివి, నీవే సూర్యదేవుడవు.

శాశ్వతమైన వెలుగుల ప్రభువుకు ప్రణామము, అత్యున్నతమైన గొప్ప శక్తికి ప్రణామము.

విశేషాలు

జ్యోతిర్గణానాం పతయే నమః(జ్ఞానజ్యోతులనే విద్యాగణాలకు ప్రభువువి)

విద్యలన్నీ వేదాల నుంచి ఉద్భవించినవి. ఈ విద్యలన్నీ సూర్యుడు అనే మహాజ్యోతి నుంచి వచ్చిన జ్ఞానజ్యోతులే. సూర్యుడే ఆ జ్ఞానజ్యోతులనే విద్యాగణాలకు పతి.

దినాధినాథాయ( పగటి యజమానివి)

విచారణ వలన కలిగే బ్రహ్మవిద్యకే 'పగలు' (దినం) అని పేరు. శంకరభగవత్పాదుల వారి ప్రమాణంతో పగలంటే బ్రహ్మ విద్యాజ్ఞానం, శాస్త్రాల వలన కలిగిన బ్రహ్మజ్ఞానానికి సూర్యుడే పతి. అనగా వేద ప్రతిపాద్యమైన పరతత్త్వం.

శాశ్వతే(శాశ్వతమైన వెలుగుల ప్రభువు)

ఒకరోజు గ్రీష్మకాలం మధ్యాహ్నం వేళ ఉన్నట్టుండి రమణమహర్షి లేచి జగదీశన్ అను శిష్యునితో "పద అరుణాచలం ప్రదక్షిణ చేద్దాం" అన్నారు.

"ఇంత మధ్యాహ్నం ఎలాగ? కష్టమండి" అన్నాడు జగదీశన్

"మరి నేను వెళ్ళడం లేదా" రమణమహర్షి

"కాళ్ళకి చెప్పులు లేకుండా వెళ్ళగలమా" అన్నాడు జగదీశన్

"నేను చెప్పులు వేసుకోను" అన్నారు రమణమహర్షి.

శిష్యుడు "మీరు గొప్పవారు" అని అంటే....నాకు మాత్రం నీలాగ దేహం లేదా? నాలో ఏ చైతన్యముందో జగదీశన్ అని చెప్పబడుతున్న నీలోనూ అదే చైతన్యముంది. చైతన్యం ఇద్దరిలోనూ సమంగా ఉంది. కాబట్టి నేను బయలుదేరుతున్నాను. నువ్వు బయల్దేరు అన్నారు.

ఇద్దరూ బయలుదేరారు.

కొండచుట్టూ రమణమహర్షి చకచకా నడుస్తున్నారు. శిష్యుడు కొద్దిసేపు వెళ్ళేటప్పటికల్లా చతికిల పడిపోయాడు. "మహానుభావా! కాళ్ళు కాలిపోతున్నాయి, పై నుంచి సూర్యతాపం తగుల్తోంది, కొద్దిసేపు ఇలాగ నడిస్తే నా తల పగిలిపోతుందని అనిపిస్తోంది. నా వల్ల కాదు తలనొప్పి పెరుగుతోంది." అంటే రమణమహర్షి. "ఒకసారి ఆ సూర్యమండలాన్ని చూడు అక్కడ ఉన్నదేదో ఇక్కడున్నది అదే అని భావించి 'సూర్యోస్మి' అని పదిమార్లు చెయ్యి" అన్నారు.

సూర్యోస్మి- అస్మి అంటే 'అయివున్నాను' అని అర్థం. 'సూర్యోస్మి' అంటే ఆ సూర్యుడు నేనే అనుకోమన్నారు. ఆయన అలా అనుకోగానే కాళ్ళకి, ఒంటికి వేడి తెలియలేదు, మొత్తం గిరి ప్రదక్షిణ అంతా చేసాడు.

"అప్పటినుంచి 'సూర్యోస్మి' నిత్యం చేస్తున్నాను నేనిప్పుడు ఏ ఎండలో అయినా ఏ ఊళ్ళో అయినా, ఎక్కడైనా కాళ్ళకి చెప్పుల్లేకుండా ఎంత దూరమైనా హాయిగా నడవగలను" అని జగదీశన్ అనే శిష్యుడు తన అనుభవాన్ని పుస్తకంలో వ్రాసుకున్నాడు. ఈ 'అహం బ్రహ్మోస్మి' అనే భావన చాలా సులభంగా మనం తెచ్చుకోగలగాలి.

హిరణ్యరూపాయ హిరణ్మయాయ హిరణ్యకేశాయ హిరణ్యబాహవే |

హిరణ్యధూమ్నే చ హిరణ్యయోనయే హిరణ్యనాభాయ నమో హిరణ్వతే ||౯

ఓ సూర్యదేవా ! బంగారు రంగులో (పరిశుద్ధ స్వరూపం) కనిపించేవాడా! నువ్వు బంగారంతో తయారయ్యావు, నీకు బంగారు జుట్టు మరియు బంగారు చేతులు ఉన్నాయి.

ఓ బంగారు ధూమమా! బంగారపు గర్భము కలిగినవాడా !, బంగారు నాభి కలిగినవాడా, నీకు నా ప్రణామాలు అర్పిస్తున్నాను.

**విశేషాలు**

**హిరణ్యరూపాయ**

**మన లోపల ఉన్న పరమపురుషునే ఉపనిషత్తు వర్ణిస్తూ 'ఆప్రణఖాత్ సర్వఏవ సువర్ణః ' అన్నది. ఆదిత్యమండలంలో కాలి గోరు మొదలుకొని పైన ఉన్న కేశాల వరకూ బంగారు రంగు కలిగిన పరమపురుషుని ధ్యానించాలి. ఆయన్నే 'హిరణ్మయ వపుః' -బంగారు రంగు కలిగిన వాడు అన్నారు. ఆయన శివుడా! విష్ణువా! బ్రహ్మదేవుడా అంటే అన్ని దేవతల సమిష్టి స్వరూపుడైన హిరణ్మయ శరీరుడు.**

**హిరణ్యగర్భః**

**ఇది కూడా చాలా ప్రధానమైన నామం. రహస్యనామాలలో రహస్యనామం. ఆదిత్య హృదయానికి మూలమంత్రం. హిరణ్యగర్భః ఈ మంత్రాన్ని చెయ్యగలిగిన సంఖ్య చేసి అధమపక్షం 12 మార్లు లేదా 108 సార్లు జపం చేసి ఆదిత్యహృదయం చదివి మళ్ళీ జపం చేస్తే చాలా విశేషమని చెప్పారు. ఈ మంత్రాన్ని చెయ్యవలసిన విధానం 'శ్రీభగవతే హిరణ్యగర్భాయ నమః'. మార్తాండ నామానికి ఈ నామానికి అర్థం సమన్వయం చేసుకోవచ్చు.**

**ఈ జగత్తు అంతా హిరణ్మయాండంగా, తేజోమయమైన అండంగా ముందు ఉండేది. ఆ అండమునకు గర్భమునందు అనగా లోపలభాగంలో ప్రధాన తేజస్సుగా ఉన్నవాడు ఇతడే. హిరణ్మయాండమునకు తేజస్సుగా ఉన్నవాడు కనుక హిరణ్యగర్భః - గర్భ అంటే లోపలి భాగం - హిరణ్యమునకు లోపల ఉండువాడు ఇది ఒక అర్థం.**

**మరొక అర్థంలో హిరణ్యాన్ని తన లోపల ఉంచుకున్నవాడు. హిరణ్యగర్భ అనే అంశం విశ్వనిర్మాణ విజ్ఞానాన్ని చెబుతుంది.**

**హిరణ్యం అనగా తేజోమయం. అది పదార్థమయం కాదు తేజోమయం. తేజస్సు. ఘటికాచల మాహాత్మ్యం హిరణ్యగర్భునికి బదులు హిరణ్య యోని అని పేర్కొన్నది.**

**విశ్వాత్మనే పూర్వమహీధ్రరూపిణే నమః పరాయావనిభృద్విహారిణే |**
**ఛాయాప్రమాదిప్రమదాకుటుమ్బినే నమో నమస్తే త్రిజగత్కుటుమ్బినే ||౧౦**

**ఓ సూర్య ప్రభూ, నీవు విశ్వానికి ఆత్మవు. నువ్వు ఉదయించే తూర్పు పర్వతపు రూపానివి. మరియు నీవు అస్తమించే పశ్చిమ పర్వతం యొక్క రూపానివి. ఉషా, పద్మిని, ఛాయా, సంజ్ఞా అను పేర్లుకలిగిన స్త్రీలతో కూడిన కుటుంబము కలవాడివి. మూడు లోకాలు కుటుంబముగా కలవాడివి. నీకు నమస్కారం.**

**విశేషాలు**

**ఛాయాప్రమాదిప్రమదాకుటుమ్బినే**

**సూర్యుని భార్యలు ఉషా, పద్మిని, ఛాయా, సంజ్ఞా. మనప్రకారంగా కాకుండా దేవతా ప్రకారంగా సంబంధాలు వేరుగా ఉంటాయి. ఈ సంబంధాలని భౌతికంగా అన్వయించ రాదు. దేవతాశరీరాలు తేజోమయం, మానవశరీరాలు పంచభూతమయమైనవి.**

**భార్య అనగా దేవతా పరిభాషలో ఆయనను వీడకుండా ఉండే సహాయకశక్తి. ఉషా అనగా రోగహరణ శక్తి. పద్మిని అనగా సర్వజగత్తుని వికసింపజేసే సూర్యునిశక్తి. పద్మిని శబ్దానికి గమనం అనికూడా అర్థం. ఛాయా అనగా కాంతి, నీడ అని అర్థం. వెలుగునిచ్చే ఆయనే నీడని కూడా ఇస్తాడు.సంజ్ఞాదేవియే ఛాయగా మారిందన్న పురాణ కథ ఉంది. 'సంజ్ఞ' అనగా పోల్చుకోగలగడం.**

**పూర్వమహీధ్రరూపిణే(తూర్పు పర్వతపు రూపానివి)**

వేదాలకి గిరులు అని పేరు. వాక్కులకు కూడా గిరులు అని పేరు ఉన్నది.

'ఆత్మా త్వం గిరిజా మతిః' 'స్తోత్రాణి సర్వా గిరో.....' అన్నారు కదా!

వేదాలకు గిరులు అనే పేరు. అందుకే గిరిశ, గిరీశుడు, గిరిజానాథుడు అని అంటున్నాం. గిరిజానాథుడు అంటే శివుడు. ఆ శివుడే సూర్యుడు. ఆయన ఎప్పుడూ కొండమీద ఉంటాడు.

మనం ఎక్కలేనంత ఉన్నతంగా, విస్తారంగా ఉంటే కొండ అని అంటాం. అనంతమై ఉన్నతంగా విస్తారంగా వేదాలు ఉన్నాయి.

వేదం రెండు భాగాలు. పూర్వ భాగం- కర్మకాండ, పశ్చిమ భాగం- జ్ఞానకాండ అని అంటారు. కర్మకాండలో భాగమే ఉపాసనా కాండ. వేదానికి 'కాండద్వయాత్మకం' అనే మాట వాడతారు.

నమః పూర్వాయగిరయే అని ఆదిత్య హృదయం. వేదంలో పూర్వభాగంలో ఉన్న వేదరాశి అంతా 'కర్మకాండ'ను తెలియచేస్తుంది.

పశ్చిమాయాద్రయే నమః - వేదంలో పూర్వభాగం తరువాత ఉన్న వేదరాశి అంతా 'జ్ఞానకాండ'ను అనగా 'వేదాంతా'న్ని తెలియచేస్తుంది.

వేదాంతం అనగా ఉపనిషత్తులు. 'అంతం' అంటే పశ్చిమం (తరువాతి భాగం).

పూర్వంలో ఉన్న గిరులు, పశ్చిమంలో ఉన్న అద్రి. గిరులు అంటే వాక్కులు, అద్రి అంటే కదలనిది. వేదాంతతత్త్వమైన బ్రహ్మమునకు పరిణామం లేదు. కర్మలు, వాక్కుల ద్వారా ఎన్ని విధాలుగా అయినా చేసుకోవచ్చు. పూర్వాయ గిరయే - ఇది వేదము నందు కర్మభాగము. సూర్యుడే కర్మల యందు యజ్ఞస్వరూపుడుగా ఉన్నవాడు. ఆయనే జ్ఞానకాండ పశ్చిమాద్రి యందు బ్రహ్మముగా చెప్పబడుతున్నవాడు.

11 -20

త్వం యత్ర రూపీ ప్రతిభానవానసి త్వం సత్ప్రణేతా భగవానసి ప్రభుః ।

త్వం తత్ఫలానామశనాయకల్పితస్త్వం హవ్యకవ్యప్రసవస్త్వమీశ్వరః ॥ ౧౧

నీవు నియంత్రించు రూపము కలవాడివి. ప్రతిభావంతునివి. ఉత్తమ నాయకునివి. సమస్త భూతముల జ్ఞానం కలిగిన పరమాత్మ స్వరూపుడవు. కుష్ఠనామౌషధుల ఫలాలను తినడానికి నువ్వు రూపొందించబడ్డావు. ( అనగా కొన్ని ప్రత్యేక ఓషధులు సూర్యుని వెలుగులో వికసించి ఫలిస్తాయని తాత్పర్యము) యజ్ఞాలలో దేవతలకు అందించే హవ్యాన్ని , పితృ దేవతలకు అందించే కవ్యాన్ని అగ్నిరూపంలో అందించేవాడివి నువ్వే.

యోఽసౌ తపన్నుదయమేతి నభోఽన్తరాలే వహ్నిభ్య ఏవ కిరణాన్ ప్రతిగృహ్య శాన్తాన్ ।

భూయోఽపి తత్ర విసృజస్యధికం త్వమేవ సాయన్తనేషు సమయేషు తథా గృణన్తి ।। ౧౨

ఓ సూర్యదేవా ! నీ వేడికి మూలమైన ఆకాశం, నీలోకి ప్రాతః కాలములో అగ్ని కిరణాలను స్వీకరించి లోకాన్ని శాంతపరుస్తుంది. . మళ్ళీ సాయంకాలములో నీ తేజస్సును అగ్నిలో ప్రవేశింపచేస్తున్నావు.

**విశేషాలు**

"అగ్ని యొక్క తేజస్సు ప్రాతః కాలములో సూర్యునిలోకి చేరుతుంది. సూర్యతేజస్సు రాత్రియందు అగ్నిలో ప్రవేశిస్తుంది" అని వేదంలో ఉన్నది. (సౌరం తేజః సాయమగ్నిం సంక్రమతే! ఆదిత్యో వా అస్తంయన్నగ్ని మనుప్రవిశతి, అగ్నిం వా ఆదిత్యః సాయం ప్రవిశతి" ) పరాక్రమ తేజ ప్రభావాదులచేత సహజముగానే ప్రకాశించుచున్న రఘువు పితృదత్తమైన రాజ్యాధికారమునుపొంది, సాయంకాలమున సూర్యతేజస్సు

సంక్రమించిన అగ్నివలె విశేషముగా ప్రకాశించెనని కాళిదాసు రఘువంశంలో చెప్పాడు.(04 -01) ఇదే ప్రామాణ్యాన్ని ఘటికాచల మాహాత్మ్యం కూడా పై విధంగా పేర్కొన్నది.

(సూర్యస్తుతిలోని విశేషాంశాలలో కొన్ని బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖ శర్మగారి ఆదిత్యహృదయం సూర్యారాధన ప్రవచన పాఠంనుండి గ్రహింపబడినవి. వారికి ధన్యవాదాలు)

వసిష్ఠ: -

ఇతి స్తుతినమస్యాభ్యాం తోషితో భాస్కరో విభుః ।

విశ్వామిత్రం తథా రాజన్నిదం వచనమబ్రవీత్ ॥ ౧౩

శ్రీ వశిష్ఠుడు-

ఆ విధంగా సర్వశక్తిమంతుడైన సూర్యదేవుడు విశ్వామిత్రుని స్తుతులతో సంతృప్తి చెందాడు.

ఓ రాజా! అంటూ ఆ తరువాత విశ్వామిత్రునితో సూర్యుడు ఈ విధంగా అన్నాడు. . 13

పూషా -

స్తవేనానేన రాజర్షే తోషితోఽహం త్వయాభితః ।

యద్యద్వాఞ్ఛసి ధర్మాత్మన్ తత్తత్తే దీయతే మయా ॥౧౪

సూర్యుడు -

ఓ రాజా! నువ్వు చేసిన ఈ ప్రార్థనతో నేను చాలా సంతృప్తి చెందాను.

ఓ ధర్మాత్ముడా, నీవు ఏది కోరితే అది నేను నీకు ఇస్తాను.అడుగు.

విశ్వామిత్రః -

భగవన్ త్వత్ప్రసాదేన సర్వం మే సాధు లక్షితమ్ ।

బ్రాహ్మణ్యం చ ప్రదత్తం చేదుత్తీర్ణోఽహం త్వదాజ్ఞయా । ౧౫

అనగా విశ్వామిత్రుడు ‘‘భగవంతుడా! నీ దయతో నా కంతా మేలు జరిగినది.

అలాగే దయతో బ్రాహ్మణ్యము( బ్రహ్మర్షిత్వము) ఇస్తే ధన్యుడిని అవుతాను.

శ్రీనృసింహతనౌ భక్తిర్మమ భూయాదచఞ్చలా ।

వసిష్ఠవచసా యస్మాత్ బ్రాహ్మణ్యం ప్రాదురేష్యతి ॥ ౧౬

శ్రీ నరసింహునిపై నాకు అచంచలమయిన భక్తి కలుగుగాక.

వసిష్ఠుని మాటల ద్వారా బ్రాహ్మణ్యము( బ్రహ్మర్షిత్వము) నాకు కలుగుగాక !

దుర్లభా వైష్ణవీ భక్తిర్యయా ముక్తో భవేన్నరః ।

సామర్థ్యం దీయతాం భానో ప్రసన్నో యది సర్వదా ॥౧౭

దుర్లభమైన ముక్తిప్రదమైన విష్ణుభక్తి నాకు కలుగు గాక.

ఓ సూర్యదేవా ! నీవు ప్ర ప్రసన్నుడవైనచో ఈ వరము అనుగ్రహించు.''

పూషా

అయం హి ఘటికాశైలశ్శృఙ్గకోటివిరాజితః ।

ప్రధానాన్యత్ర సానూని చతుర్దశ మహన్తి వై ।।౧౮

అప్పుడు సూర్యుడు ఇలా అన్నాడు. ''ఈ ఘటికాచలము అనేక శిఖరములతో ప్రకాశించుచున్నది.

ఈ ఘటికాచలములో 14 శిఖరములు ఇంకా గొప్పవి.

శైలోత్తరే శృఙ్గవరే బ్రహ్మేధ్యాపయతి శ్రుతీః ।

శిష్యేభ్యస్తు విశిష్టేభ్యో బ్రహ్మతీర్థతటే సదా । । ౧౯

ఈ కొండకు ఉత్తర శిఖరములో ఉన్న బ్రహ్మతీర్థములో వశిష్ఠుడు నిత్యము తన శిష్యులకు వేదములను బోధిస్తున్నాడు.

తస్యావిదూరే మహతామృషీణాం పుణ్యకర్మణామ్ ।

తత్రాశ్రమస్తే భవితా రాజర్షే భవదాఖ్యయా ।।౨౦

ఓ రాజా ! ఆ వశిష్ఠాశ్రమమునకు దగ్గరగా నీ పేరు మీద ఒక ఆశ్రమం ఉంటుంది.

అక్కడ పుణ్యకార్యాలు చేసే గొప్ప ఋషులు నివసిస్తారు.

21 -30

సరశ్చ తత్ర సతతం నిర్మలోదకముత్తమమ్ ।

తావకం దీప్యతస్తస్మాత్ శ్రీర్జజ్ఞే విదుషాం పతే ।।౨౧

అద్భుతమైన స్వచ్ఛమైన నీటితో కూడిన సరస్సు కూడా ఉంటుంది.

ఓ జ్ఞానులలో గొప్పవాడా ! ప్రకాశిస్తున్న ఆ సరస్సు నుండి లక్ష్మీ దేవత జన్మించింది.

తస్యోత్తరదిశి స్ఫీతం మహాసర ఇతి శ్రుతమ్ ।

యస్య పాదే నరహరిర్లక్ష్మీముదవద్ధరిః ।।౨౨

ఆ సరస్సుకు ఉత్తర దిక్కున మహాసారము అనే ఇంకో పెద్ద సరస్సు ఉంది.

అక్కడ నరహరి లక్ష్మిని పెండ్లి చేసుకొన్నాడు.

అభ్రంకష మహావృక్షాస్తత్ర సన్తి ఫలోపగాః ।

పుష్పోపగాశ్చ తరవస్సమృద్ధవిటపైస్సదా ।।౨౩

ఇచ్చట మేఘములను తాకు ఎత్తైన ఫలాలను ఇచ్చే పెద్ద చెట్లు ఉన్నాయి.
ఆ చెట్లు ఎల్లప్పుడూ పుష్పిస్తూ ఉంటాయి. మరియు గొప్ప కొమ్మలతో ఉంటాయి

మృగాశ్చ శతశస్తత్ర ద్వన్ద్వం ద్వన్ద్వం రమన్తి వై ।
ప్రసన్నాః పక్షిణస్తత్ర తథా క్రీడన్తి రాగిణః ||౨౪
అక్కడ వందలాది జింకలు జంటలు జంటలుగా ఆనందాన్ని ఆస్వాదిస్తున్నాయి.
అక్కడ ఆనందకరముగా పరస్పర ప్రేమ కలిగిన పక్షులు ఆడుకుంటాయి

విశ్వామిత్రః-
భాస్వన్ కథం జనిర్వాస్మిన్ సుధార్ణవభువశ్రియః
అభవద్భగవాన్ వాయం పాణిగ్రహణతత్పరః | | ౨౫
సూర్యుడు చెప్పిన మాటలు విని విశ్వామిత్రుడు ఇలా ప్రశ్నించాడు. "సూర్యదేవా! పాలసముద్రమున పుట్టిన లక్ష్మి ఈ సరస్సున ఎలా పుట్టింది? విష్ణువు ఆమెను ఎలా వివాహము చేసుకొన్నాడు? "
పూషా-
పురా లక్ష్మీ మహామాయా స్వోత్పత్తిం పునరిచ్ఛతీ ।
సహస్రపత్రకమలాజ్జజ్ఞే త్రిజగదీశ్వరీ ||౨౬
సూర్యుడు ఇలా జవాబిచ్చాడు. పూర్వము మహామాయ(జరగని దానిని జరిగించు శక్తి గలది) అయిన లక్ష్మీదేవి తనను తాను తిరిగి సృష్టించుకోవాలని కోరుకుంది.
వేయి దళముల కమలము నుండి ఆ త్రి జగదీశ్వరి( స్వర్గమర్త్యపాతాళములకు రాణి) జన్మించింది.

సా కన్యారూపమాస్థాయ శ్రీనృసింహపురే వరే ।
అవతీర్య సరస్తీరే వాసం చక్రే సఖీజనేః ||౧౨౭
ఆ మహామాయ కన్యారూపమును ధరించి ఈ శ్రీ నరసింహదేవుని అద్భుతమైన నృసింహపురములో ఈ సరస్సు ఒడ్డుకు దిగి తన సఖీ జనములతో స్థిరపడింది.

పురస్య నైఋతే పార్శ్వే ఘటికాస్తథోత్తరే ।
బ్రహ్మోదస్యావిదూరే సా స్వనామ్నా సరసీం వ్యధాత్ ||౨౮
నృసింహపురికి నై రృతి దిక్కులో(దక్షిణ పశ్చిమముల నడిమి దిక్కు) , ఘటికాచలానికి ఉత్తరములో , బ్రహ్మ సరస్సునకు సమీపములో , తనపేరిట ఒక సరస్సు కల్పించింది.

తత్ర శ్రీ రమతే బాలా డోలామారుహ్య కాఞ్చనీమ్ |
స్తూయమానా మహద్భిశ్చ నిత్యమప్సరసాం గణైః | ౨౯
అక్కడ,  ఆ బాలా స్వరూపిణి అయిన లక్ష్మి బంగారు ఊయలను ఎక్కి ఆనందిస్తుంటుంది.
ఆమెను నిరంతరం అప్సరసల సమూహాలు ప్రశంసిస్తుంటాయి.  29
స్తుతా గన్ధర్వకన్యాభిర్మునికన్యాభిరీడితా |
ముముక్షుభిస్సదైశ్వర్యకామిభిస్స్తూయతే సదా ||౩౦
గంధర్వకన్యలు, మరియు ఋషుల కుమార్తెలు తనను  ప్రశంసిస్తుంటారు.  ఆమెతో ఆడుకున్నారు.
ముక్తిని కోరుకునేవారు మరియు శాశ్వత సంపదను కోరుకునేవారు ఆమెను ఎల్లప్పుడూ స్తుతిస్తారు.

31 -40

గజాభ్యాం హేమకుమ్భాభ్యాం స్థాపితా కర్ణికాపదే|
నిషేదుషీ కటాక్షేణ జనయన్తీ శుభం నృణామ్ ||౩౧
తనకు ఇరువైపుల ఏనుగులు  నిలబడి  తొండములతో తనపై అమృత జలమును వర్షించుచుండగా, మానవులకు  అదృష్టం కలిగించు చూపులతో ఆమె  కూర్చుని ఉన్నది.

విశేషాలు

లక్ష్మీదేవి రెండు పక్కల ఏనుగులేమిటి? ఎందుకు అభిషేకిస్తుంటాయి? అంతరార్థమేమిటి?-------------------------
దీనికి శ్రీసూక్త-దీపకమను  సంస్కృతపు   పుస్తకంలో  - ప్రొ. హ రనారాయణభాయీ పాణ్డ్యా   ఇలా వివరణను ఇచ్చారు. (  215 వపుట)
మమకారో మదశ్చేతి వర్తతే పార్శ్వయోర్ద్వయోః| దేవతే గజరూపిణ్యౌ శ్రీదేవీమ్ అభిషించతః | తయోః శుణ్డాగ్రయోర్భాత ఆశా-ప్రీత్యాహ్వయావుభౌ | సువర్ణకలశౌ తాభ్యాం తృప్తిపూర్ణామ్బుసాన్వహమ్
ఆ రెండు ఏనుగులలో ఒకటి మమకారం
రెండోది మదం.
ఆ రెండు ఏనుగుల తొండాలలో రెండు కలశాలు
ఒకటి ఆశ
రెండోది ప్రీతి.
ఆ రెండు కడవల్లోని నీరు తృప్తి.
ధనం కలిగినప్పుడు మమకారం, మదం కలుగుతాయి.
ఆశ, ప్రీతి పెరుగుతుంటాయి.
వాటితో నాశనం కాకు.
నా వైపు దృష్టి మరల్చు. నీ ఆశా ప్రీతి అను దుర్లక్షణాల కలశాలలో   తృప్తి అనే జలాన్ని నింపుతాను. దానితో నన్ను అభిషేకించు"అని అమ్మవారి సందేశం.

అద్భుతమైన ప్రతీకాత్మకమయిన సందేశం.

చాలకుంటే లోకమెల్ల చాలదు   అన్నాడు కదా అన్నమయ్య

తత్రాన్తరే మహావిష్ణుమదనాస్త్రవిమోహితః ।

దైవతైః ప్రార్థ్యమానస్తు శ్రియముద్వోఢుమైచ్ఛత ॥ ౩౨

ఇంతలో విష్ణువు మన్మథబాధకు ఓర్చుకోలేక తనను దేవతలు ప్రార్థింపగా,  లక్ష్మిని వివాహమాడుటకు విష్ణుమూర్తి  ఆమె దగ్గరకు వచ్చాడు.

పక్షిరాజం సమారుహ్య మహేన్ద్రవచసా హరిః ।

విచిన్వానో మహాలక్ష్మీం జమ్బూద్వీపమవిన్దత ॥ ౩౩

ఇంద్రుని మాటల ప్రకారం,  విష్ణువు పక్షి రాజయిన గరుత్మంతుని ఎక్కి  లక్ష్మిని వెదకుచు జంబూ ద్వీపానికి వచ్చాడు.  33

విశేషాలు

జంబూ ద్వీపం భూమండలం మీది సప్త ద్వీపాలలో ఒకటి.

సప్తద్వీపములకు నడుమ జంబూద్వీపము ఉన్నది.  దానిచుట్టు లవణ సముద్రమును, దాని చుట్టి ప్లక్షద్వీపమును, ఆవల ఇక్షు సముద్రమును, పిదప శాల్మలద్వీపమును, తదనంతరము సురోదధియు, వెనుక కుశద్వీపమును, వెనుక ఘృత సముద్రమును, దాని చుట్టి క్రౌంచద్వీపమును, ఆ క్రౌంచద్వీపమును చుట్టి దధి సముద్రమును, దానిని చుట్టి శాకద్వీపమును ఉన్నాయి.. ఆశాకద్వీపమునకు వెనుక పాలసముద్రమును, దానికి అనంతరము పుష్కరద్వీపమును, దాని చుట్టి మంచినీళ్ల సముద్రమును ఉండును.

ఇలా జంబూద్వీపమును చుట్టి ఉండు ద్వీపములు ఆఱును క్రమముగ ఒకటికంటె ఒకటి రెండింతల పరిమాణము కలదై అనేక పర్వతములును నదులును కలిగి ఉంటాయి.

విన్ధ్యం చ మన్దరం చాద్రి తత్ర శేషాచలం తథా ।

ఆర్యావర్త మహావిష్ణురాకాశస్థో దదర్శ హ ॥౩౪

వింధ్యపర్వతము,మందర పర్వతము, శేషాచలపర్వతము  అనే పర్వతాలలో వెదకి  మహా విష్ణువు ఆర్యావర్తమును (=పూర్వ పశ్చిమ సముద్రములకును వింధ్యహిమాలయ పర్వతములకును గల మధ్యప్రదేశము)   చూసాడు. .

అనన్తరం చ ఘటికాశైలరాజం సమున్నతమ్ ।

వామదేవాదిమునిభిః పూజితం పుణ్యయోగిభిః ॥ ౩౫

తరువాత, ఆ ఆర్యావర్తములో  వామదేవుడు వంటి ఋషులు మరియు ఇతర ధర్మబద్ధమైన యోగులు పూజించు ఘటికాచలమును  చూసాడు.

అగస్త్యేన శుకేనాపి బ్రహ్మణా పాణ్డవైస్తథా ।

దుర్వాససా సప్తర్షిభిః పూజితశ్చ మహర్షిభిః ॥౩౬

ఘటికాచలము  అగస్త్యుడు, శుకదేవుడు, బ్రహ్మ, పాండవులు ,దుర్వాసుడు, సపర్షులు మరియు మహా ఋషులచే  పూజించబడినది.

తస్యోత్తరదిశి స్ఫీతముద్యానముదకారజమ్ ।
నానాపక్షిభిరాకీర్ణ పశ్యతాం లక్ష్మివర్ధనమ్ ।।౩౭
ఆ నదికి ఉత్తరం వైపున నీటితో కూడిన పెద్ద తోట ఉంది.అది వివిధ పక్షులతో నిండిపోయి, చూసేవారికి  అందాన్ని మరింత రెట్టింపు చేస్తూ కనబడుతున్నది. .

తత్రోద్యానే మహాచైత్రరథప్రఖ్యే విహారిణమ్ ।
లక్ష్మీం దృష్ట్వా ప్రహృష్టాత్మా బభూవ సహ దైవతైః ।।౩౮
ఆ పర్వతమునకు ఉత్తర దిక్కున ఉన్న చైత్ర రథము అని పిలువబడు ఉద్యానవనమున విహరించున్న లక్ష్మీదేవిని చూసి మహావిష్ణువు దేవతలతో కలిసి ఆనందించాడు.

.

భూయోఽన్తికముపాశ్రిత్య శఙ్ఖచక్రధరో హరిః ।
గరుడస్థో లీలయైవ జగ్రాహ కరవారిజమ్ ||౩౯
శంఖం మరియు చక్రాన్ని పట్టుకున్న మహావిష్ణువు  గరుత్మంతుని పైన కూర్చుని లక్ష్మీదేవి చేయి అను పద్మమును పట్టుకొన్నాడు.

పాణిస్థం పఙ్కజం గృహ్యాపశ్యమానం తథా హరిమ్ ।
దృష్ట్వాదృష్ట్వా నతముఖీం ప్రభావాద్వారిజోద్భవామ్ ।। ౪౦
కమలాన్ని చేతిలో పట్టుకున్న, కమలం నుండి పుట్టిన  లక్ష్మీదేవి  హరి వైపు చూసింది.పదే పదే చూస్తూ సిగ్గుతో ముఖాన్ని కిందికి వంచింది.

పాణిం గృహ్య తతో విష్ణుః పరిష్వజ్య చ వార్ధిజామ్।
అఙ్కే నిధాయ సస్మేరమిదమూచే సురాన్ ప్రతి ।
తన తొడపై కూర్చుండ బెట్టుకొనిచిరునవ్వుతో దేవతలను చూచి ఇట్లనెను. అప్పుడు విష్ణువు లక్ష్మియొక్క చేయి పట్టుకుని ఆమెను కౌగిలించుకున్నాడు.ఆమెని తన తొడపై కూర్చుండ బెట్టుకొనిచిరునవ్వుతో దేవతలతో ఈ మాటలు చెప్పాడు.

విష్ణుః
అనయా ఖలు సుశ్రోణ్యా సర్వేషాం భవతామపి।
దివి వా భువి వా నృణాం సమృద్ధాస్సంపదో గృహే ।।౪౨

‘‘ఈ లక్ష్మీ దేవి అనుగ్రహము వలన భూమిపైనగాని స్వర్గములో కాని కోరుకొన్న సంపదలు పొందగలరు.

ఏతదర్థం పురాస్మాభిర్మథితో దుగ్ధవారిధిః ।
ఇత్థం ఖలు వరారోహాం నారీణాముత్తమాం సురాః ॥౪౩
ఈ సర్వోత్తమ స్త్రీ రత్నమయిన వరారోహ అయిన లక్ష్మీ దేవి కొరకు పూర్వము పాల సముద్రము చిలుకబడినది.

క్షణమాత్రమపి త్యక్తుం లక్ష్మీమేనాం మనోహరామ్ ।
న జీవేయమహం పాథోబహిష్ఠో మత్స్యరాడివ ॥౪౪
ఈ అందమైన లక్ష్మిని ఒక్క క్షణం కూడా నేనువిడచియుండలేను. ఈ మెను విడచి, నీటిని విడచిన చేపల రాజులా దారి తప్పి జీవించలేను.
పురా గౌరీం శ్రియం వాణీం దృష్ట్వాహం రుద్రవేధసా ।
సర్వేశ్చిన్తితమేతద్ధియాసాం వరయతే నరః ॥౪౫
పూర్వము నేను, శివుడు, బ్రహ్మ మా ముందున్న లక్ష్మి పార్వతి సరస్వతులనుచూచి వీరు ఎవరిని ఇష్టపడతారో అని అనుకొన్నాము..

తతో మాం వరయామాస లక్ష్మీరీశానమీశ్వరీ ।
సరస్వతీ చ బ్రహ్మాణం యథాతథముపాగతాః ॥౪౬
అప్పుడు అదృష్ట దేవత అయిన లక్ష్మీదేవి నన్ను తన భర్తగా ఎన్నుకుంది.
పార్వతి శివుని, సరస్వతిని బ్రహ్మని వరించారు.

తదా ప్రభృతి బాలేయం మనో హరతి మామకమ్ ।
సైషా ప్రసన్నా వరదా నృణాం చ మరుతామపి ॥౪౭
అప్పటినుండి ఈమె నా మనోహారిణియై యున్నది. అప్పటి నుండి, ఈమె నా మనస్సును ఆకర్షిస్తున్నది..
లక్ష్మీదేవి సంతోషిస్తే మానవులకు, మరుత్తులకు(వాయువులకు) కూడా వరాలను ప్రసాదిస్తుంది.

**విశేషాలు**

దితి ఇంద్రుని చంపునట్టి కొడుకు కావాలి అని కశ్యపుని ప్రార్థింపగా అతఁడు అనుగ్రహించి గర్భమును కలుగచేసి 'నూఱేండ్లు ఈగర్భమును నియమముతో కాపాడుకొంటివేని అట్టి బిడ్డడు నీకు పుట్టును' అని చెప్పెను. ఆమె అట్లే అతి నియమముతో ఉండి నూఱేండ్లు నిండుటకు కొంతకాలము కొఱత ఉండగా ఏమఱి ఆ నిష్ఠను కొంచెం తప్పింది.
సమయము కొరకు ఎదురు చూస్తున్న దేవేంద్రుడు ఆమె గర్భములో ప్రవేశించి ఆశిశువును తన వజ్రాయుధముతో ఏడు తునియలుగా నఱకెను. అప్పుడు ఆశిశువు తుండెములై రోదన చేసే సమయంలో దితి 'మారుద మారుద' అని చెప్పెను. కనుక వీరిని మరుత్తులు అన్నారు. ఇంద్రుడు దితిగర్భమున ఉండి వెలువడివచ్చి 'తల్లీ నీవు అశుచివై ఉండినందున ఇంతపని చేయ చాలితిని' అని ఆమెను మంచిమాటలచే సమాధానపఱిచి

ఆమె కోరినట్లు ఆ ఏడుపిండములకు దీర్ఘాయువును ఇచ్చి సప్తలోకములయందును వాయురూపముగా తిరుగునట్లు అనుగ్రహించి వెడలిపోయెను. అది కారణముగ మరుత్తులును, దేవతలును కలిసి ఉంటారు.

మహేన్ద్ర ! భవతా కార్యం స్తవనం కమలాం ప్రతి ।
ఇయం ఖలు మహాభాగా భుక్తిముక్తిఫలప్రదా ||౪౮

మహేంద్రా ! ఈ లక్ష్మీదేవి స్తుతించడం మీ కర్తవ్యం. ఈమె గొప్ప అదృష్టం ప్రసాదిస్తుంది. భోగమును, భోజనమును, మోక్షమును అనుగ్రహిస్తుంది.

దేవేంద్రుడు చేసిన లక్ష్మీ స్తుతి

మహేన్ద్ర స్తుతిః -

త్వం శ్రీః హ్రీః ప్రియా విష్ణోస్త్వమీశాని మహేశ్వరీ ।
సరస్వతీ త్వమేకేవ దృశ్యసే నర్తకీవ హి ||౪౯

నీవు శ్రీః అను బీజాక్షరానివి. హ్రీః అను బీజాక్షరానివి. విష్ణువుకు ప్రియమైనదానివి. నువ్వు దుర్గాదేవివి.
నువ్వు సరస్వతివి. నువ్వు ఒక్కదానివే నర్తకిలా కనిపిస్తున్నావు.

విశేషాలు

"శ్రయతే ఇతి శ్రీః" - సకలజీవులచేత, ఆశ్రయింపబడుతున్నది కనుక "శ్రీః"
"శృణాతి దోషాన్ ఇతి శ్రీః" ఆశ్రితుల దోషాలను నశింపజేస్తుంది - కనుక "శ్రీః"
"శృణాతి గుణైః ఇతి శ్రీః" గుణాలను విస్తరింపజేస్తుంది కనుక "శ్రీః"
ఆద్యే పదత్రయే వర్ణాః శ్రీమ్ హ్రీమ్ ఓమితి మన్మయాః||(. పూర్వకాలంలో పుట్టిన "శ్రీమ్ హ్రీమ్, ఓమ్"-అనే మూడు పదాలు వన్ను విషయంగా కల్గినవి.లక్ష్మీతంత్రం)
"శ్రీం" ఇతి బిందు విశిష్ట 'శ' వర్ణేన సుఖశబ్దవాచ్య మానంద ముచ్యతే. (శ్రీం అను బీజాక్షరములోని బిందువుతో కూడిన శ వర్ణము వలన ఆనందము చెప్పబడుచున్నది)
"హ్రీం" ఇతి ద్వితీయబీజే నావ్యక్త ముచ్యతే. ( హ్రీం అను బీజాక్షరము అవ్యక్తమును చెప్పుచున్నది.) (వామకేశ్వర తంత్రము)

త్వదాశ్రితానాం ప్రభవన్తి సంపదః ప్రసన్నభావేన పరైర్దురాసదా ।
పురాణవాచోవిషయా త్వమేకికా సంగీయసే వేదవచోభిరాదరాత్ || ౫౦

ఓ లక్ష్మీదేవి! నీపై ఆధారపడిన వారు, నిన్ను ఆశ్రయించినవారు ఇతరులు కష్టంతో చేరుకొనదగిన సంపదలతో ప్రసన్నభావంతో దీవించబడతారు ( అనగా లక్ష్మిని ఆశ్రయించినవారికి సులభంగా సంపదలు దొరుకుతాయని భావం)

వేదవచనాలలోను, పురాణాల మాటలలోను నువ్వు మాత్రమే కీర్తించబడుతున్నావు.

**51 -60**

త్వం విశ్వగోప్త్రీ జగతాం జనిత్రీ తథా నిహస్త్రీ త్రిగుణాశ్రయా త్వమ్ ।
విష్ణోరురస్సీమనిషేదుషీ త్వం దదాసి పుత్రాంశ్చ తథా ఫలాని ॥ ౫౧

నీవు విశ్వ రక్షకురాలివి. సమస్త లోకాలకు తల్లివి. మరియు వాటిని నాశనం చేసేదానివి. భౌతిక ప్రకృతి యొక్క త్రిగుణాలకు నీవు ఆశ్రయమయినదానివి. విష్ణువు వక్షస్థల సరిహద్దులో కూర్చుని నువ్వు పుత్రులను, ఫలాలను ప్రసాదిస్తావు.

కల్పాదయో భూమిరుహాశ్చ చన్ద్రమాస్సుధా తథా కామగవీ మహాప్సరాః ।
చిన్తామణిశ్చ మణిరేవ సముజ్జ్వలశ్రీ సర్వాణ్యమూని తవ సోదర భావభాఞ్జి ॥ ౫౨

కల్పములు మొదలయినవి, భూమిపై ఉన్న వృక్షాలు, చంద్రుడు, అమృతం, కోరిన కోర్కెలు తీర్చే కామధేనువు, గొప్ప అప్సరసలు కోరిన కోర్కెలు తీర్చే చింతామణి ఇవన్నీ మీ సోదర ప్రేమను నిరూపించే రత్నాలు. . ( ఇవన్నీ అమ్మవారి ఐశ్వర్యములని భావం)

**విశేషాలు**

కల్పమనగా 432,000,000 సంవత్సరాలు. బ్రహ్మదేవునియొక్క ఒక రోజు లేదా 1000 మహాయుగాలు,

విష్ణోరముష్యత్రిజగత్ప్రణేతుర్వక్షస్థలే కౌస్తుభరత్నభూషయా ।
సహాధివాసం భవతీవ చ స్మ కరోతి కాలా భువనేషు పద్మే ॥ ౫౩

మూడు లోకాలకు మూలకారకుడైన శ్రీమహావిష్ణువు వక్షస్థలంలో కౌస్తుభ రత్నంతో కలిసి ఉంటూ, కాలాన్ని లోకమనే పద్మంలో నిర్మిస్తున్నావు. (విష్ణు వక్షస్థలంలో ప్రకాశిస్తుండే మణిని కౌస్తుభమంటారు ;కుస్తుభ అనగా సముద్రములో పుట్టినది కనుక కౌస్తుభమని పేరు)

అనాదిభావం గమితాపి దుగ్ధపయోనిధౌ జన్మ తథా పయోజే ।
ఇతః పరం జన్మ కుతోఽపి దేవి భావీతి కింసాదిగణేషు గణ్యా ॥ ౫౪

ఆది (మొదలు) తెలియని భావాన్ని పొందినప్పటికీ,( శాశ్వతురాలివైనప్పటికీ) పాలసముద్రములో మరియు పద్మంలో నువ్వు విలాసంగా జన్మించావు. ( జన్మ ఎత్తనవసరం లేని శాశ్వతురాలివి అయినప్పటికీ లోకాన్ని ఉద్ధరించటానికి జన్మ ఎత్తావని భావం)
ఓ లక్ష్మీదేవి! నువ్వు భవిష్యత్తులో మరెక్కడైనా జన్మిస్తావని కొంతమంది భక్త సారథి సమూహాలలో లెక్కించడం వల్ల ప్రయోజనం ఏమిటి? ( ప్రయోజనం లేదని అమ్మ మరొక జన్మ ధరించదని భావం)

యామేతి వాగ్ఘనవతీత చ చన్ద్రలేఖా మూలేతి శాన్తిరితి పుష్టిరితి ప్రమేతి ।
ఇష్టిస్తథా మణిరితి ప్రమదేతి విష్ణోస్స్వాహాస్వధేతివిబుధాభవతీం భణన్తి ॥౫౫

ఓ లక్ష్మీదేవి! నిన్ను యామ(రాత్రి) , సరస్వతి , చంద్రలేఖ, మూలా, శాంతి, పుష్టి, ప్రమ(యథార్థ జ్ఞానము), ఇష్టి(యజ్ఞము), మణి, ప్రమద(యౌవనాదిమదము గల ఆడుది), విష్ణు స్వాహా, స్వధా అను పేర్లతో పిలుస్తారు.

**విశేషాలు**

లక్ష్మీసహస్ర నామాలలోని కొన్ని పేర్లు కొన్ని మార్పులతో ఇందులో ప్రస్తావింపబడ్డాయి.

**స్వాహా**

యజ్ఞకాండలో స్వాహా శబ్దం లేకుండా హవిస్సులు వేల్చడం ఉండదు. ఏ దేవతలను ఉద్దేశించి యజ్ఞాదులు చేస్తున్నారో వారికి హవిస్సులు అందడానికి 'స్వాహా' తప్పనిసరి. ఆహుతులు స్వాహాకార, వషట్కార పూర్వకంగా వేల్చినప్పుడే దేవతలకు అందుతాయి. ఐతే, సంధ్యావందనంలో కేశవ నామాలు చెప్పేటప్పుడు "త్రిరాచమ్య" అంటూ ముమ్మారు స్వాహాకారంతో ఆచమనం చేయడం పద్ధతి. ఇక్కడ హోమాగ్ని ప్రసక్తి లేదు. ఐనప్పటికీ అవి దేవతలకు సమర్పించేవే కనుక స్వాహా శబ్దాన్ని వాడవలసి వస్తున్నది.

స్వాహా శబ్దం హోమ సంబంధమైన సాంకేతిక పదం మాత్రమే కాదు. అది సార్థకమైన వాఙ్నామం కూడా. చక్కగా హుతమగుగాక అనే అర్థాన్ని కొందరు భాష్యకారులు ఉదహరించారు. ఇది మహామహిమాన్వితమైన మంత్రమని కొందరు విద్వాంసుల భావన. వేద మంత్రాలు లేకుండానే స్వాహా మంత్రోచ్చారణ చేసే సందర్భాలు ఉన్నాయి. నిత్యనైమిత్తిక కర్మలలోనూ యజ్ఞ యాగాదులలోనూ ఆచమన క్రియతో "స్వాహా" సాక్షాత్కరించడం ప్రారంభ మవుతుంది. దేవతలకు ఆహుతులను అందించే శబ్దంగా "స్వాహా" ప్రసిద్ధమైంది.

**స్వధా**

అగ్నికార్యంలో/ యజ్ఞాలలో స్వాహా శబ్దం వినిపించినట్లే పితృ దేవతలకు తర్పణాలు ఇవ్వడంలో స్వధా శబ్దం వినిపిస్తుంది. పితృయజ్ఞాలలో స్వాహాదేవియే తర్పణాలలో స్వధా రూపిణిగా వస్తున్నదని శాస్త్రం. (పితృ యజ్ఞేషు స్వధా మాతా.) పితృ దేవతలను ఉద్దేశించి వషట్కారం చేయడం స్వధాకారం.(స్వధానమ ఇతి వషట్కారపి.)అగ్ని దేవుని భార్య స్వాహాదేవి. ఆమె మరో రూపం స్వధా. స్వధా శబ్దానికి అన్నం అని కూడా అర్థం ఉంది.

హ్రీం క్లీమితి స్వకమలోపరి సంస్థవర్ణావాభ్యాం పుటీకృతముపేత్య విభాతి పద్మే |
శ్రీం శ్రీమితి ప్రతిపదం జపతాం త్వదాఖ్యాం కిం నామ భావిన జగత్త్రితయే బుధానామ్ ||౫౬

బీజాక్షరాలతో మంత్రాలను రూపొందించే ఒక పద్ధతిని సంపుటీకరణమంటారు. హ్రీం క్లీమ్ అను బీజాక్షరాలతో నువ్వు కూర్చున్న పద్మము చుట్టబడి ఉన్నట్లుగా భావించి, శ్రీం శ్రీం అని నీ బీజాక్షరాలతో మూడు లోకాలలోను నీ నామాన్ని అడుగడుగునా జపించే జ్ఞానులకు భవిష్యత్తులో లభించే అదృష్టాన్ని ప్రత్యేకంగా చెప్పటం ఎందుకు? ( అద్భుతమైన అదృష్టం వరిస్తుందని భావం)

దిగ్దన్తి పుష్కరగృహీతనవోదకుమ్భధారాతినిర్యదుదకప్లవమానదేహామ్ |
దివ్యామ్బరాభరణమాల్యసుగన్ధధూపదీపోపహారబలిభిః కమలే భజే త్వామ్ ||౫౭

1. ఐరావతము, 2. పుండరీకము, 3. వామనము, 4. కుముదము, 5. అంజనము, 6. పుష్పదంతము, 7. సార్వభౌమము, 8. సుప్రతీకము. అను దిగ్గజములలో ఒకరెండు ఏనుగులు కలశములు కలిగిన తొండములెత్తి నీ శరీరమును తడుపుతూ సేవించుచున్నవి. నేను కూడా దివ్య వస్త్రాలు, ఆభరణాలు, పూలమాలలు, సుగంధ ద్రవ్యాలు, ధూపం, దీపాలు, కానుకలు మరియు నైవేద్యాలతో నిన్ను పూజించి తరిస్తాను.

విశ్వమయీతి వచసామధిదేవతేతి గౌరీతి భూమిరితి దీధితిరిత్యజస్రమ్ ।
విద్యాకరేతి కమలేతి శచీతి చ త్వాం వ్యాకుర్వతే నిగమవాక్ప్రవరాస్సవిత్రి ।।౫౮

ఓ సావిత్రీ !( సరస్వతి, పార్వతి) లక్ష్మీదేవీ ! వేదాలను చెప్పేవారిలో అత్యుత్తములు నిన్ను విశ్వమయి( విశ్వమంతా నిండి ఉండునది), అధిదేవత(సర్వాధిపతియగు దేవత), గౌరి, భూమి, దీధితి(ప్రకాశించునది. కిరణము.) అజస్రము(ఎడతెగనిది, నిరంతరము ఉండునది) విద్యాకరి, (విద్వాంసురాలు)కమల(నీటిని అలంకరించునది. లక్ష్మి), శచి(మధురంగా మాట్లాడు స్త్రీ. ఇంద్రపత్ని.) అని పిలుస్తున్నారు.

విశేషాలు

సావిత్రి ప్రస్తావన రావటంతోనే అరవిందుల సావిత్రి గుర్తుకువస్తుంది. సావిత్రి జగన్మాత అవతారం. అశ్వపతి తపస్సు చేసి పరమాత్మను ప్రసన్నం చేసుకుని, జగన్మాతను భూమిపైన అవతరించవలసిందిగా అర్థించాడు. ఆమే సావిత్రి. . సావిత్రి యోగప్రస్థానం 'సత్యం' లక్ష్యంగా సాగింది. మృత్యువును జయించి మనిషిని దివ్య మానవునిగా తీర్చిదిద్దడం ఆమె లక్ష్యం.

ఇతి స్తుతా తదా దేవీ లక్ష్మీరున్నిద్రలక్షణా।
అదాదభీప్సితం సర్వం తస్మై విబుధస్వామినే ।।౫౯

ఇట్టు స్తుతింపబడిన వికసించిన పుష్ప లక్షణము కలిగిన లక్ష్మీదేవి ఆ దేవేంద్రునికి కోరిన వరములు ఇచ్చింది..

విష్ణుః

యస్త్వనేన స్తవేనైవ స్తోష్యత్యాననమ్రమూర్తిమాన్ ।
తస్య గేహే మహాలక్ష్మీస్తిష్ఠతే నాత్ర సంశయః ।।౬౦

విష్ణువు

అప్పుడు విష్ణువు ఇలా అన్నాడు. ''ఎవరు ఈ స్తోత్రముతో లక్ష్మిని వినయముగా ప్రార్థిస్తారో, వారి ఇంటమహాలక్ష్మి నివాసముంటుంది. ఇందులో సందేహము లేదు.

61 -70

ఇదం సరోవరం దేవ లక్ష్మీసర ఇతీర్యతే।
అత్ర యస్స్నాతి మనుజో వాఞ్ఛితాని స వై లభేత్ ।।౬౧

ఈ సరస్సును లక్ష్మీ సరస్సని పిలుస్తారు. ఇక్కడ స్నానం చేసే వ్యక్తికి తాను కోరుకునేవన్నీ లభిస్తాయి. . 61.

భృగువారే శ్రియా సంగో మమ జాతో మహాసురాః ।
విశిష్య భృగువారే తు స్నాతవ్యం నియమాదితః ।౬౨

ఓ మహా దేవతలారా ! శుక్రవారము రోజున, లక్ష్మిని నేను గ్రహించాను. కనుక శుక్రవారము రోజున, నిర్దేశించిన ఆచారాల ప్రకారం స్నానం చేసి, నియమంతో ఉండాలి. 62

అత్ర సన్నిహితో లక్ష్మ్యా వసన్తే సమయే త్వహమ్।

తదా మమోత్సవో లక్ష్మ్యా మమ చ ప్రభవిష్యతి । ౬౩

మా ఇరువురికి ఇచ్చట ఈనాడు మహోత్సవము జరుగును. నేను వసంతకాలంలో లక్ష్మితో ఇక్కడ(ఘటికాచలంలో) శుక్రవారం  ఉంటున్నాను. అప్పుడు లక్ష్మితోనూ, నాతోనూ ఉత్సవపు  పండుగ జరుగుతుంది.  63

సురాః కిం బహునోక్తేన నిత్యం సన్నిహితస్త్వహమ్ ।
నరకేసరిణస్స్వరం బిమ్బే విహృతిమాద్రియే ॥౬౪

దేవతలారా! ఇన్ని మాటలెందుకు? నేను లక్ష్మితో కలసి ఇచ్చట నరసింహ రూపములో  నిత్యసన్నిహితునిగా  ఈ ఘటికాచలంలో ఉంటాను.''

పూషా -

స్తూయమానో మహావిష్ణుర్మహాలక్ష్మ్యా సహామరైః ।
సనకాదిస్తుతో దేవస్తత్రైవాన్తరధీయత ॥౬౫

సూర్యుడు

ఇలా చెప్పిన  తరువాత తనను సనకుడు మొదలయినవారు స్తుతించుచుండగా   మహాలక్ష్మి, దేవతలతో సహ విష్ణువు మాయమయ్యాడు.

భృగువారే తు యస్స్నాతి లక్ష్మీసరసి నిత్యదా।
సర్వాన్కామాన్ సమభ్యేత్య విష్ణులోకే మహీయతే॥ ౬౬

ఓ విశ్వామిత్ర! శుక్రవారమునాడు లక్ష్మీ సరస్సున స్నానము చేసినవారు అన్ని కోరికలను పొంది విష్ణు లోకమును చేరుకొంటారు.

వాసో వాపి ఫలం వాపి తామ్బూలం వా గుడం పయః।
హరిద్రా వా సువాసిన్యై దాతవ్యం తత్ర శక్తితః ॥ ౬౭

వస్త్రము,ఫలము, తాంబూలము, బెల్లము, పాలు, పసుపు ఇచ్చట ముత్తైదువకు  తమ తమ శక్తి మేరకు ఇవ్వాలి.

విశేషాలు

మొత్తం అయిదు అలంకారాలు ఉన్న స్త్రీని ముత్తైదువ అంటారు.

అవి.. 1) కాళ్ళకి పట్టీలు, మెట్టెలు 2) చేతులకి గాజులు3) మెడలో మంగళసూత్రం4) తలలో పువ్వులు5) నొసటన అంటే కనుబొమ్మల మధ్య సింధూరం లేదా కుంకుమ ఉన్న స్త్రీ.

అయిదు+వన్నెలు గలది ముత్తయిదువ అని ఇంకొక నిఘంటుకారుడు అర్థం చెబుతూ  వాటిని మంగళసూత్రము. పసుపు, కుంకుమము, గాజులు, చెవ్వాకు((చెవి + ఆకు) అని  పేర్కొన్నాడు.

కల్పోక్తేన ప్రకారేణ లక్ష్మీసరసి యః పుమాన్ ।

సువాసినీం ప్రీణయతే యథాశక్తి భృగోర్దినే । ॥ ౬౮

కల్పంలో(=వైదికవిధానములు తెలుపు ఒకానొక శాస్త్రము.) వివరించిన విధంగా లక్ష్మీ సరస్సులో స్నానము చేసిన వ్యక్తి శుక్రవారం రోజున చక్కగా ముత్తయిదువను వీలైనంత వరకు సంతోషపెట్టాలి.

లక్ష్మీసరసి యస్స్నాత్వా భృగువారే హ్యతన్ద్రితః ।
లక్ష్మీనృసింహపూజాం చ కురుతే వై స సిద్ధభాక్ ॥ ౬౯

శుక్రవారం నాడు లక్ష్మీ సరోవరంలో సోమరితనం లేకుండ- శ్రద్ధతో స్నానం చేసేవాడు. లక్ష్మీ నరసింహులను పూజించేవాడు పరిపూర్ణతను పొందుతాడు. 69.

తస్మాత్ సర్వప్రయత్నేన నియమాదాదరాత్ తథా ।
నృసింహపూజా కర్తవ్యా పుంసా సాయుజ్యమిచ్ఛతా । ॥౭౦

కాబట్టి, అన్ని జాగ్రత్తలతో, నియమాలను పాటిస్తూ, నరసింహదేవుని పూజను చేసినవాడు మరియు శుక్రవారం నాడు ముత్తైదువను గౌరవించినవాడు నరసింహదేవునిలో లీనమవుతాడు.( సాయుజ్యము)

**విశేషాలు**

నాలుగురకాలుగా ముక్తులను చెప్పారు. 1. సాలోక్యము (విష్ణులోకమందుండుట), 2. సామీప్యము (విష్ణువు దగ్గఱనుండుట), 3. సారూప్యము (విష్ణురూపుడై యుండుట), 4. సాయుజ్యము (విష్ణువులో చేరియుండుట).

ఇతి బ్రహ్మకైవర్త ఉత్తరఖణ్డే భృగుపరాశరసంవాదే ఘటికాచలమాహాత్మ్యే సప్తదశోఽధ్యాయః ॥

ఇక్కడితో బ్రహ్మ-కైవర్త పురాణంలోని ఉత్తరఖండంలో భృగువు మరియు పరాశరుని మధ్య జరిగిన సంభాషణలో ఘటికాచల మాహాత్మ్యంలో పదిహేడవ అధ్యాయం పూర్తి అయినది. +++++

శ్రీ శివాయ గురవే నమః

ఘటికాచలనివాసాయ శ్రీ నృసింహాయ నమః

బ్రహ్మకైవర్త పురాణములో ఉన్న  శ్రీఘటికాచల మాహాత్మ్యపు  పద్దెనిమిదవ అధ్యాయం

(మూల శ్లోకము మరియు తాత్పర్య విశేషాలతో)

**1-10**

**అష్టాదశోஉధ్యాయః**

**శ్రీవసిష్ఠః-**

**ఇతి నిర్దిశ్య తపసే విశ్వామిత్రస్య ధీమతః ।**

**ద్వాదశాత్మా స భగవాన్ యథాగతముపేయివాన్ ॥౧**

**ఈ విధంగా 18 వ అధ్యాయములో  జ్ఞాని అయిన  విశ్వామిత్రునికి తపస్సు చేయమని పన్నెండు పేర్లు కలిగిన  సూర్యుడు చెప్పిన ఉపదేశాన్ని విశ్వామిత్రుడు శ్రద్ధగా ఒక్క అక్షరం పొల్లుపోకుండా విన్నాడు.**

**విశేషాలు**

**ద్వాదశాత్మా( పన్నెండు పేర్లు కలిగిన సూర్యుడు)**

**ధాతా మిత్రోஉర్యమా రుద్రో వరుణస్సూర్య ఏవచ, భగో వివస్వాన్ పూషాచ సవితా దశమస్స్మృతః, ఏకాదశ స్తథా త్వష్టా విష్ణుర్ద్వాదశ ఉచ్యతే, అరుణో మాఘమాసేతు సూర్యోవై ఫాల్గునే తథా, చైత్రేమాసిచ వేదజ్ఞో వైశాఖే తపనస్స్మృతః, జ్యేష్ఠేమాసి తపే దింద్ర ఆషాఢే తపతే రవిః, గభస్త్రశ్రావణే మాసి యమో భాద్రపదే తథా, ఇషే హిరణ్యరేతాశ్చ కార్తికేచ దివాకరః, మార్గశీర్షే తపేచ్చిత్రః పౌషే విష్ణు స్సనాతనః, ఇత్యేతే ద్వాదశాదిత్యాః కాశ్య పేయాః ప్రకీర్తితాః.” (వాచ.)**

**1)  చైత్రమాసంలో సూర్యుడు ధాత అని పేరు ధరిస్తాడు.**

**2) వైశాఖమాసంలో సూర్యుడు అర్యముడు అనే పేరు వహిస్తాడు.**

**3) జ్యేష్ఠమాసంలో సూర్యుడు మిత్రుడు అనేపేరు దాల్చుతాడు.**

**4) ఆషాఢమాసంలో సూర్యుడు వరుణుడు అనే పేరు పొందుతాడు.**

5) శ్రావణమాసంలో సూర్యుడు ఇంద్రుడు అనే పేరు స్వీకరిస్తాడు.

6) భాద్రపదమాసంలో సూర్యుడు వివస్వంతుడు అనే పేరుతో విరాజిల్లుతాడు.

7) ఆశ్వయుజమాసంలో సూర్యుడు త్వష్ట్ర అనే పేరుతో భూమికి ప్రమోదం కలిగేటట్లు ఆకాశంలో సంచరిస్తూంటాడు.

8) కార్తీకమాసంలో సూర్యుడు విష్ణువు అనే పేరుతో వ్యవహరిస్తాడు.

9) మార్గశీర్షమాసంలో సూర్యుడు అర్యముడు అనే పేరుతో విలసిల్లుతాడు.

10) పుష్యమాసంలో సూర్యుడు భగుడనే పేరు ధరిస్తాడు.

11) మాఘమాసంలో సూర్యుడు పూషుడు అనే పేరుతో వ్యవహరింపబడతాడు.

12) ఫాల్గుణమాసంలో సూర్యుడు క్రతువు అనే పేరుతో విరాజిల్లుతాడు.

విశ్వామిత్రస్తు ధర్మాత్మా రాజర్షిస్సముపేత్య సః ।
బ్రాహ్మణ్యకామో ఘటికాశైలరాజముపాసదత్ ॥౨

సూర్యుడు చెప్పిన విషయములను ధర్మాత్ముడయిన విశ్వామిత్రుడు శ్రద్ధగా విని, సూర్యుడు మాయమయిన పిమ్మట తరువాత బ్రహ్మర్షిత్వమును పొందాలనుకొని రాజర్షి అయిన విశ్వామిత్రుడు ఘటికాచలముకు చేరాడు.

విశేషాలు

బ్రహ్మర్షి అంటే బ్రహ్మ వంటి ఋషి. బ్రహ్మతో సమానమైన ఋషి; వేదమును స్మరించువాడు. ఓంకారం, వషట్కారం(అగ్నిలో హవిస్సులు వేసేటప్పుడు "వషట్" అనే శబ్దాన్ని ఉచ్చరించడం) , వేదాలు ప్రకాశించిన వ్యక్తి.

పదే పదే చిన్తయానో వాక్యాని ద్వాదశాత్మనః ।
ప్రహృష్టచేతా రాజర్షిర్వ్యతనోత్ తత్ప్రదక్షిణమ్ ॥౩

ద్వాదశాత్ముని ( పన్నెండు పేర్లు కలిగిన సూర్యుని) మాటలను మాటి మాటికి మనస్సులో తలుచుకొంటూ రాజర్షి అయిన(ఋషి వలె సంయమము కల్గిన శ్రేష్ఠుడైన రాజు. రాజర్షి.) విశ్వామిత్రుడు సంతోషముతో ఘటికాచల ప్రదక్షిణము చేసాడు.

ప్రదక్షిణీకృత్య గిరిం త్రిస్తథా నృపసత్తమః ।
సర్వాన్ ఋషీన్నమస్కృత్య బ్రహ్మాణమపి భైరవమ్ ॥౪

తరువాత రాజులలో శ్రేష్ఠుడయిన విశ్వామిత్రుడు ఆ ఘటికాచలానికి మూడు ప్రదక్షిణలు చేసాడు.

అక్కడ ఉన్న అందరు ఋషులకు, బ్రహ్మకు, భైరవునికి నమస్కరించాడు.

రవినోక్తేన విధినా లక్ష్మీసరసి మజ్జనమ్ ।
కృత్వా సువాసినీపూజాం భృగువారే నిరాకులః ॥ ౫

సూర్యుడు సూచించిన ప్రకారం  లక్ష్మీ సరస్సులో స్నానం చేసి,  శుక్రవారమునాడు సువాసిని( ముత్తయిదువ) పూజ చేసి ఆందోళన నుండి విముక్తి పొందాడు.

తస్య దక్షిణపార్శ్వస్థస్తపస్తేపే హ్యనుత్తమమ్ ।
దుర్దర్శ చ దురాధర్షం సర్వైరపి మహాత్మభిః ॥౬
ఆ సరస్సునకు దక్షిణమువైపు విశ్వామిత్రుడు    తీవ్రమైన తపస్సు చేసాడు. .
ఆతపస్సు  సర్వమునులకు  చూచుటకు అలవికానిది. చేయుటకు  శక్యము కానిది.(అంత గొప్పదని భావం)

విశ్వామిత్రో మహాభాగః కురుతే తాదృశం తపః ।
గ్రీష్మే పఞ్చాగ్నిమధ్యస్థో వర్షర్తీ సలిలం గతః । ॥౭
గొప్ప అదృష్టం కలిగిన విశ్వామిత్రుడు  గ్రీష్మఋతువులో పంచాగ్నుల మధ్య నిలబడి, వర్ష  ఋతువులలో నీటిలో నిలబడి దారుణమైన తపస్సు చేసాడు.
విశేషాలు
నాలుగు దిశలలో ఉంచిన నాలుగు అగ్నులు (పూర్వాగ్ని, దక్షిణాగ్ని, పశ్చిమాగ్ని, ఉత్తరాగ్ని)+ ఆకాశంలో సూర్యుడు.

శిశిరేషు తదా చక్రే తపః పరమదారుణమ్ ।
అలక్షీకృత్య విఘ్నాంశ్చ దేవరాజకృతాంస్తదా ॥౧౮
శిశిర ఋతువులో కూడా  నీటిలో దారుణమైన తపస్సును విశ్వామిత్రుడు చేసాడు.
ఇంద్రుడు అనేక విఘ్నములు  కల్పించినప్పటికీ లెక్కపెట్టలేదు.

ఫలమూలజలాలమ్బో ముమోచాశామతన్ద్రితః ।
శాఖోపశాఖాశ్శతశో వంశవల్ల్యస్తథావిధాః ॥
విశ్వామిత్రుడు  పండ్లు,  వేర్లు, నీరు ఆహారముగా తీసికొని తపస్సు చేసాడు. అతనిపై శాఖోపశాఖలుగా వెదురు పొదలు పెరిగాయి.

తథ్యం కలేబరం తస్య వ్యావవ్రుః పరితో భృశమ్ ।
పురా ఫలాశసమయే విష్ణుమిత్రాయ దేవరాట్ । । ౧౦
ఆ విశ్వామిత్రుని శరీరం చుట్టూ చాలా పండ్ల చెట్లు మొలిచాయి

, పండ్లు కావలసిన పూజా సమయములో దేవతల రాజు వాటిని కోసి తన స్నేహితుడు విష్ణువుకు నైవేద్యం పెట్టేవాడు. . 10. 10

11 -20

ప్రదర్శయామాస పఞ్చ బదరాన్ విఘ్నకారిణః |

ఏషాం ఫలాని భుక్త్వా వై నరో రాజవశం గతః | | ౧౧

అతని తపస్సును భగ్నం చేయాలనుకొని ఇంద్రుడు అతని ముందు పండ్లతో వెలిగే అయిదు బదరీ (రేగు) చెట్లను కనిపించేటట్లు చేసాడు. తన తపోశక్తితో నిజాన్ని గ్రహించిన విశ్వామిత్రుడు ఆ వృక్షాలలలోని ఫలాలు ఎండిపోయేటట్లు శపించి తన తపస్సు కొనసాగించాడు..

భ్రమతే కామినీపార్శ్వే తాన్ పశ్చాదర్శయన్ బుధః |

తానాశ్రమపదాపన్నానలీనాన్ ఫలశాలినః | | ౧౨

5 మంది దేవ వనితలను ఇంద్రుడు విశ్వామిత్రుని తపస్సునకు విఘ్నకారిణులుగా పంపగా, ఆ అప్సరసలు విశ్వామిత్రుని పక్కనే తిరుగుతూ, అతనిని ఆకర్షించాలని ప్రయత్నించారు.

మహేన్ద్రప్రేరితాన్ కామ్యే స ధర్మాత్మా నిరాశయః|

శశాప వీరుధః పఞ్చనిష్పత్రా నిష్ఫలా ఇతి | | ౧౩

ఇంద్రుడు పంపిన ఆ అయిదుగురు అప్సరసల చేష్టలకు కోపించి ఆ ధర్మాత్ముడైన విశ్వామిత్రుడు వారిని ఆకులు, పండ్లు లేని పొదలుకమ్మని శపించాడు.

తదాప్రభృతి దృశ్యన్తే వీరుధో విటపాత్మకాః |

బ్రాహ్మణ్యకామం విజ్ఞాయ తమృషిం ద్యుమ్నతేజసమ్ ||౧౪

అప్పటినుండి బ్రహ్మర్షి కావాలనే తపనతో విశ్వామిత్రుని తీవ్రమైన తపస్సు మరింతగా పెరిగింది. అతనిచుట్టూ ఇంకా విస్తృతంగా చాలాపొదలు ఒకదానికొకటి కొమ్మలతో అలముకొన్నాయి.తేజస్వి అయిన విశ్వామిత్రుని కఠిన తపస్సుకు భయపడిన దేవతలు బ్రహ్మను పురస్కరించుకొని భూలోకానికి వచ్చి ఘటికాద్రినరసింహుని సేవించారు.

మామీయురమృతార్థం వై శ్రీనృసింహనిబోధితాః |

అభ్యేత్య మమ సన్నిద్ధగిరిం సర్వే సుధాశనాః ||౧౫

తరువాత నరసింహప్రేరితులైన దేవతలు నేనున్న(వశిష్ఠుని) సందిగ్ధ పర్వతము దగ్గరకు వచ్చి విశ్వామిత్రునకు బ్రహ్మర్షిత్వాన్ని అనుగ్రహించమని ఇలా అర్థించారు.

దేవాః-

తస్థివాంసమిమం దేశం మామూచుస్స్నిగ్ధయా గిరా |

అస్తు భద్రం భగవతో మిత్రావరుణజన్మనః ||౧౬

దేవః-

నేను(వశిష్ఠుడు) ఉంటున్న ఈ స్థలం దగ్గరకు వచ్చి దేవతలు నాతో ఇలా సున్నితమైన మనోహరమైన స్వరంలో మాట్లాడారు.

"మిత్రావరుణులకు జన్మించిన ఓ వసిష్ఠుడా ! నీకు శుభం జరుగుగాక !'

**విశేషాలు**

**వశిష్ఠుని జన్మ వృత్తాంతము ఇది**

వశిష్ఠుడు బ్రహ్మమానసపుత్రులలో ఒకడు. మహాతపస్సంపన్నుడు. ఇక్ష్వాకువంశస్థులకు పురోహితుడు. వైవస్వతమన్వంతరములో సప్తర్షులలో ఒకడు. ఇతని భార్య అరుంధతి. కొడుకులు శక్తి మొదలగు వారు నూఱుగురు. ఈతడు దక్షప్రజాపతి కూతురు అగు ఊర్జను వివాహము చేసుకొని రజుడు, గోత్రుడు, ఊర్ధ్వబాహువు, సవనుడు, అనఘుడు, సుతపుడు, శుక్రుడు అని ఏడుగురు పుత్రులను పొందాడు. వారు స్వాయంభువ మన్వంతరములో సప్తర్షులుగ ఉన్నారు.

వశిష్ఠుడు మొదట బ్రహ్మమానసపుత్రుడు అయినప్పటికీ నిమి శాపముచేత ఆ శరీరమునకు నాశము కలుగగా మిత్రావరుణులకు మరల జన్మించాడు. ఒకప్పుడు మిత్రావరుణులకు ఊర్వశిని చూచి రేతస్సు స్ఖలితము అయి అది ఒక కుంభమునందు చేర్చగా దానిలోనుంది వసిష్ఠుడును, అగస్త్యుడు పుట్టారు.

**భవతస్తత్రభవతో వసిష్ఠో జపతాం వరః ।**

**అయం మహాత్మా తపసాం ప్రభావేన బలం ద్విషః ॥౧౭**

**దేవతలు ఇలా అన్నారు**

ఓ వశిష్ఠా ! నువ్వు తపస్వులలో అత్యుత్తమునివి.ఈ విశ్వామిత్రుడు తన తపోశక్తితో బలమైన శత్రువులను కూడా ఆశ్చర్యపరిచాడు.

**మహామరాణాం నృహరేరనుకంపామవాప సః ।**

**విశ్వామిత్రస్య పార్శ్వే తు గతమస్మాభిరాదరాత్ ॥౧౮**

ఆ విశ్వామిత్రుడు శ్రీ నరసింహస్వామి అనుగ్రహముతో మహోన్నత స్థితిని పొందాడు. నరసింహుడు విశ్వామిత్రుని ఎడ మిక్కిలి ప్రసన్నుడయ్యాడు. ఆ నరహరి విశ్వామిత్రుని తపస్సును చూచి సంతోషించి మమ్మలిని ఇచ్చటికి పంపించాడు.

**బ్రహ్మర్షిత్వం చ భవతే దదురిత్యుక్తవర్తినే ।**

**వసిష్ఠవచసా మహ్యం బ్రహ్మర్షిత్వం ప్రయచ్ఛత ॥౧౯**

నీవు వచ్చి విశ్వామిత్రుని బ్రహ్మర్షియని సంబోధించ వలసినది. అతడు నీచేత బ్రహ్మర్షి అని పిలిపించుకోవాలనుకొంటున్నాడు.

**ఇతీరయతి ధర్మాత్మా విశ్వామిత్రో మహాతపాః ।**

**విశ్వామిత్రస్య చరితం శ్రుత్వా యోగభృతాం వరాః ॥ ౨౦**

**శ్రీనృసింహస్స భగవాన్ విస్మయం పరమేయివాన్।**

యోగులలో శ్రేష్ఠుడయి, గొప్ప తపస్సు చేస్తున్న విశ్వామిత్రుని కథ విన్నప్పుడు ఆ నరసింహుడు ఆశ్చర్యంతో నిండిపోయాడు.

**తతోఽస్మాంశ్చ సహేన్ద్రేణ చోదయామాస తేఽన్తికమ్ ।**

భవద్వాక్యేన లభతాం బ్రహ్మర్షిత్వం మునీశ్వరః ।

అప్పుడు నరసింహస్వామి ఇంద్రునితో పాటు మమ్మల్ని  నీ దగ్గరికి వెళ్లమని కోరాడు. మీ మాటల ద్వారా విశ్వామిత్రుడు బ్రహ్మర్షి హోదాను పొందుగాక!

వసిష్ఠః-

ఇత్యుక్తోఽహం మహీపాల హర్షనిర్భరమానసః ॥౨౨

ఓ రాజా ! దేవతలు ఇలా చెప్పినప్పుడు, నేను(వసిష్ఠుడు) ఆనందంతో నిండిపోయాను.

నృహరేశ్శాసనం గృహ్య దేవానామనుగోఽభవమ్ ।

అద్రాక్షమాశ్రమపదం విశ్వామిత్రస్య యోగినః ॥౨౩।

నేను భగవంతుడు నరసింహస్వామి ఆజ్ఞను అంగీకరించి దేవతల వెంట వెళ్లి  యోగి విశ్వామిత్రుని ఆశ్రమాన్ని చూశాను.

అద్రాక్షం చ తతస్తత్ర తరువృద్ధిమనేకశః ।

తత్ర కాంచన గుల్మాంశ్చ లతాశ్చ వివిధా ద్రుమాః ॥౨౪

అప్పుడు నేను అక్కడ చాలా కాంచన వృక్షాలు( ఉమ్మెత్త; సంపెగ;  నాగకేసరము; పొన్న; మట్టి)పొదలతో పెరగడం చూసాను.

భూత్వా బహుఫలాపుష్పైర్యుజ్జవన్త్యశ్చ వీరుధః ।

క్రీడన్తి జన్తవస్తత్ర ద్వన్ద్వశోఽపి తథాపి సః । । ౨౫

అనేక పండ్లు, పువ్వులు కలిగిన చెట్లు చూసాను. ఆ చెట్ల కింద పరస్పర విరుద్ధ స్వభావము కలిగిన  జంతువులు  ఆడుకుంటున్నాయి.  25

కథంకారీ తపస్తీవ్రం క్రీడావానిత్యచిన్తయన్ ।

తతో లక్ష్మీసరస్యాం వై కృత్వాఽహం కర్మ చాహ్నికమ్ । ౨౬

ఎన్ని రకాలయిన జంతువుల అలజడులున్నప్పటికీ విశ్వామిత్రుడు తీవ్రమైన తపస్సు చేయుట నేను చూసాను. అచ్చట లక్ష్మీ సరస్సు వద్ద ఆహ్నికమును(పగలు చేయదగిన వైదిక క్రియలు.)  ముగించి తరువాత విశ్వామిత్ర ఆశ్రమమునకు వెళ్ళాను.

పశ్చాత్తస్యాశ్రమపదం సహ దేవైస్తథాగమమ్ ।

మాలాకారో నృసింహస్య మయా దృష్టో వనాన్తరే ॥౨౭

తరువాత, నేను దేవతలతో కలిసి ఆశ్రమానికి వెళ్లి, అడవి మధ్యలో నరసింహుని మాలాకారునికి సంబంధించిన ఒక విచిత్రాన్ని చూసాను.

వనమాలాపి పతితా తన్మూర్ధ్ని నభసశ్చ్యుతా ।

తదుత్తరక్షణే వాపి శఙ్ఖచక్రధరో యువా ॥౨౮

నరసింహుని వనమాల(వనపుష్పములచే అల్లిన పుష్పమాల)  ఆకాశమునుండి ఆ ఆశ్రమము దగ్గరలో ఉన్న ఆ మాలాకారుని తలపై బడినది. ఆ వనమాల పడిన వెంటనే అతడు శంఖ చక్రములను  ధరించి  బంగారపు విమానమును ఎక్కి   ప్రకాశించాడు.

విశేషాలు

వనమాలకు ఈ అర్థాలు కూడా ఉన్నాయి

1. మోకాళ్లవరకు వ్రేళ్లాడుతూ, అన్ని ఋతువులలోనూ పూచే పూలతో, మధ్యన పెద్ద గుచ్ఛంతో విష్ణు మూర్తి మెడలో ఉండే దండ.

2. పంచతన్మాత్రలకు(1. రూపము, 2. రసము, 3. గంధము, 4. స్పర్శ, 5. శబ్దము.) ఒక రూపమైన దండ.

3. చివురుటాకులు, పూలు కూర్చిన దండ.

4. శివ కేశవ భేదం లేని దండ.

హేమవర్ణవిమానస్థో లక్ష్యతే స్మ నభః పథా ।
తదద్భుతం సమాలోక్య హర్షవిస్మయమానసః ।।౨౯

ఆ వనమాల మీద పడిన వ్యక్తి బంగారపు విమానము ఎక్కి  కనబడ్డాడు. ఆ అద్భుతమైన దృశ్యాన్ని చూసి నేను ఆనందంతో, ఆశ్చర్యంతో నిండిపోయాను.

తతోఽహం దేవతానాం వై రాజానమిదమబ్రువన్ ।
కుతః కథం సముత్పన్నా మాలా మూర్ధ్ని నిపాతితా ||౩౦
అముష్య వైష్ణవం రూపం కస్మాదేతత్ ప్రశంస మే ।

అది చూచి దేవరాజైన ఇంద్రుని "ఈ వైష్ణవ రూపము ధరించిన వాడు ఎవడు? ఆ దండ ఎక్కడి నుండి, ఎలా వచ్చి అతని తలపై పడింది? ఈ వైష్ణవ రూపంతో  ఎందుకు అతడు అంత అందంగా ఉన్నాడో దయచేసి నాకు చెప్పు."అని నేను అడిగాను..

**31- 40**

ఇన్ద్రః -

ఆసీత్ సత్యవ్రతో నామ హనూమన్నగరే పురా ।।౩౧
సుశీలగుణసంపన్నో వైష్ణవో ద్విజసత్తమః ।

ఇంద్రుడు వశిష్ఠునితో ఇలా చెప్పాడు.  "పూర్వము హనుమన్నగరములో సత్యవ్రతుడను ఒక  బ్రాహ్మణుడు ఉన్నాడు.అతడు చక్కని శీలము గుణసంపద కలిగిన వైష్ణవ బ్రాహ్మణుడు.

గిరేః ప్రదక్షిణం నిత్యం కృత్వా కర్మాన్తరే మతిమ్ || ౩౨

ఆ సత్యవ్రతుడు ఈ ఘటికాచలమునకు ప్రదక్షిణము చేసిన తరువాతనే మిగిలిన పనులు చేసికొనేవాడు.

తనోతి జ్ఞానవృద్ధోఽసౌ వృద్ధసేవీ జితేన్ద్రియః|
నిరీక్ష్య విష్ణుభక్తాంశ్చ దేవతాశ్చ ద్విజన్మనః || 33
దణ్డవత్ ప్రణమేన్నిత్యమాదృతోఽభూన్మనీషిభిః |

అతడు జ్ఞానవృద్ధుడు.( **వయస్సులో చిన్నవాడయినా జ్ఞానము అధికముగా కలిగినవాడు**). జితేంద్రియుడు. (ఇంద్రియములను జయించినవాడు.) విష్ణుభక్తులను, బ్రాహ్మణులను, దేవతలను చూచినంతనే ఎనిమిది శరీర భాగాలు నేలను తాకేవిధంగా ప్రణామం సాష్టాంగ నమస్కారం చేసేవాడు. ( 1. ఉరం (రొమ్ము), 2. శిరం, 3-4. శ్రవణ, చక్షురింద్రియాలు, 5. చేతులు, 6. పాదాలు, 7. నోరు, 8. ఉదరం (పొట్ట) అనునవి ఎనిమిది శరీర భాగాలు)నమస్కరించి సేవించెడివాడు.

స కదాచిన్నరహరిం వన్దితుం పురుషర్షభమ్ ||౩౪
ఘటికాచలరాజానమారురోహ శనైశ్శనైః |

ఆ సత్యవ్రతుడు ఒకసారి శ్రేష్ఠ పురుషుడయిన నరహరిని సేవించటానికి ఘటికాచలమును నెమ్మది నెమ్మదిగా ఎక్కుతున్నాడు..

తస్యాహం వ్యజనే ధృత్వా వ్యనైషీచ్ఛ్రమశీకరమ్ ||౩౫
తథా వైష్ణవకైఙ్కర్యాత్ ప్రాప్తవాన్ పదమున్నతమ్

అప్పుడు నేను(ఇంద్రుడు) విసనకర్రను ధరించి ఆ సత్యవ్రతుని శ్రమను పోగొట్టటానికి విసిరాను.ఆ వైష్ణవ కైంకర్యము( భగవంతుని భక్తునికి చేసే సేవ) వలన ఉన్నతపదవిని నేను పొందాను.

కలవఙ్కో నామ వణిక్ పురా వంశవనే స్థితః || ౩౬
వరతన్తోః ప్రసాదేన మునేర్జజ్ఞే సుతద్వయమ్ |

పూర్వము కళవంకుడను పేరు కలిగిన ఒక వైశ్యపుత్రుడు వంశవనములో ఉండేవాడు. వరదత్తుడు అను ముని అనుగ్రహముతో ఆ మునికి ఇద్దరు పుత్రులు పుట్టారు.( ఈ కళవంకుడే మాలాకారుడు)

తస్యాయమగ్రజః పుత్రో నామ్నా పిఙ్గలకో మునే ||౩౭
వరతన్తుమునేస్తస్య నిత్యం శుశ్రూషణే రతః |
విష్ణుభక్తో వైష్ణవేభ్యో యథాశక్తి ప్రయచ్ఛతి || ౩౮

ఓ మునీ ! ( వసిష్ఠా !) అతని పెద్ద కుమారుని పేరు పింగళకుడు. ఇతడు వరతంతువు అనుమునికి నిత్యము సేవ చేసేవాడు. విష్ణుభక్తులకు యథాశక్తిగా దానము ధర్మము చేసెడివాడు

ఏవం పఞ్చాశదబ్దాస్తు జాతాస్తస్య మహామునే ।
తథాపి పుత్రసంపత్తిరాసీన్నైవ సుఖప్రదా ॥ ౩౯
ఓ గొప్ప ఋషీ ! ( వసిష్ఠా !)  ఈ విధంగా యాభై సంవత్సరాలు గడిచాయి.అయినప్పటికీ అతనికి సంతాన భాగ్యము కలుగలేదు. 39

తస్య చిన్తా సమభవత్ పిఙ్గలస్య మహాశ్రుతేః ।
స పుత్రాభావతో లోకైర్దూష్యమానశ్చ మానవైః ॥౪౦
సంతానము లేకపోవుటవలన పింగళకునికి బాధ కలిగింది.  కొడుకులు లేకపోవడంతో అతను  లోకముచేత నిందింపబడ్డాడు.

41 -50
తస్య చిన్తయమానస్య దుస్సమాధిమధాన సః ।
సన్తానార్థం మహామన్త్రం వరతన్తురూపాదిశత్ ॥౪౧
సంతానం గురించి ఆలోచిస్తూ పింగళకుడు  భరించలేని  మానసిక స్థితిలో కాలం గడుపుతున్నాడు. అతని బాధను చూచి వరతంతు మహర్షి ఒక  మహా మంత్రాన్ని(సంతాన గోపాలమంత్రాన్ని)  ఉపదేశించాడు.

స గోపాలమనుం తస్మై ఉపదిశ్య మహామునిః ।
వైష్ణవం తముపాసీనమితి హోవాచ పిఙ్గలమ్ ॥౪౨
ఆ మహా ఋషి వరతంతువు  పింగళకునికి సంతాన గోపాల మంత్రాన్ని  బోధించాడు. వైష్ణవులు ఆమంత్రాన్ని ఉపాసిస్తారని చెబుతూ పింగళునితో వరతంతు మహర్షి ఇలా అన్నాడు.
వరతన్తుః -
చతుర్వర్ణమముం మన్త్రరాజం సన్తానసిద్ధయే ।
ప్రాతఃకాలే చ మధ్యాహ్నే త్రికాలే చ శతం శతమ్ ॥౪౩
జపంస్తు హి స గోపాలస్సాన్నిధ్యం కురుతే హృది ।
 “నాలుగు అక్షరములు గల ఈ సంతాన గోపాల మంత్రాన్ని  నీవు ఉదయ మధ్యాహ్న సాయంకాలములలో జపించు.  గోపాలుని హృదయమున ఉంచుకొని 100 మార్లు  జపించు.

సన్నిధాయ చ గోపాలః ప్రయచ్ఛతి సుతాన్ బహూన్ ॥ ౪౪
అప్పుడు గోపాలుడు నీ సన్నిధికి వచ్చి  నీకు పుత్రులను అనుగ్రహిస్తాడు.

ఇతః పశ్చిమదిగ్భాగే ఘటికాద్రిరితి శ్రుతః ।

యత్రాస్తే భగవాన్ భూతభావనో నరకేసరీ । ।౪౫

ఈ ప్రదేశం యొక్క పశ్చిమ భాగంలో ఘటికాచలము ఉన్నది.

అక్కడ సర్వ జీవులను సృష్టించే దేవదేవుడు నరసింహస్వామి నివసిస్తున్నాడు. .45

విశేషాలు

భూత భావనుడు

1.భూతాని పృథివ్యాదీని భావయతి జనయతి పృథివ్యాది భూతమును సృష్టించువాడు 2. భూతా సత్యా యథార్థా వా, భావనా యస్య భావశుద్ధి కలవాడు. విష్ణువు.

ప్రయాహి తత్పరిసరం సర్వర్షిగణసేవితమ్ ।

స ఏవ భగవాన్ దాతా భుక్తిముక్తీ మహాత్మనామ్ ||౪౬

ఋషులందరూ తరచుగా సందర్శించే ఆ ప్రాంతానికి వెళ్ళు.ఆ నరహరి  సర్వోన్నత ప్రభువు, మహాత్ములకు ఆనందాన్ని మరియు ముక్తిని ప్రసాదించేవాడు.

వైష్ణవాశ్చ ద్విజన్మానస్సన్తి తత్ర మహామతే ।

తేషాం శుశ్రూషణే బుద్ధిరుదేష్యతి న సంశయః ||౪౭

ఓ మహాత్మా!  బ్రాహ్మణులు,  వైష్ణవులు అక్కడ ఉన్నారు.

వారి సేవలో నీకు చక్కని బుద్ధి  పుడుతుంది అనడంలో సందేహం లేదు అని  పింగళునితో వరతంతు మహర్షిఅన్నాడు.

త్వం విష్ణుభక్తస్సతతం ప్రియవాదీ జితేన్ద్రియః ।

బ్రహ్మోదాదిమహాతీర్థస్నానం కురు సమాహితః ||౪౮

నువ్వు విష్ణు భక్తునివి.  ఎప్పుడూ ఆహ్లాదకరంగా మాట్లాడేవాడివి, నువ్వు ఇంద్రియాలను జయించావు. అక్కడ ఉన్న  బ్రహ్మతీర్థము మొదలైన మహాతీర్థములలో ఏకాగ్రతతో  స్నానము చేయి. అని  పింగళునితో వరతంతు మహర్షిఅన్నాడు

గిరిప్రదక్షిణం చైవ కర్తవ్యం భుక్తిమిచ్ఛతా ।

తత్రత్యేషు చ తీర్థేషు స్నాతవ్యం ముక్తిమిచ్ఛతా ||౪౯

సుఖాలను అనుభవించాలనుకునేవాడు ఆ ఘటికాచల పర్వతానికి ప్రదక్షిణం చేయాలి.

మోక్షాన్ని కోరుకునేవాడు అక్కడ పవిత్ర తీర్థాలలో స్నానం చేయాలి. అని  పింగళునితో వరతంతు మహర్షిఅన్నాడు

భుక్తిముక్తిఫలే భవ్యే ఏతాని చ సర్వాం నృణామ్|
ప్రయచ్ఛతి హృషీకేశో ఘటికాద్రౌ వసన్విమాన్ | ౫౦
ఇవన్నీ ( గిరిప్రదక్షిణము, తీర్థ స్నానము) భవిష్యత్తులో ఆనందం మరియు మోక్ష ఫలాలుగా మారతాయి.
ఘటికాచల పర్వతంపై నివసించే ఇంద్రియములకు ఈశుడు, ఇంద్రియములను వశపరచుకున్న విష్ణుస్వరూపుడైన నరహరి భక్తులకు వరాలను ఇస్తాడు. అని పింగళునితో వరతంతు మహర్షిచెబుతూ శత్రుంజయమహారాజు కథ ఇలా సందర్భ వశాత్తు వివరించాడు.

## శత్రుంజయమహారాజు కథ

పురా పుణ్యపురాధ్యక్షో రాజా శత్రుఞ్జయాభిధః
అపత్యార్థీ గురోః పార్శ్వ కాశ్యపస్య జగామ హ | | ౫౧
పూర్వము పుణ్యపురాధిపతి అయిన శత్రుంజయుడను పేరు కలిగినవాడు ఉండేవాడు. . అతనికి అన్ని సంపదలు ఉన్నా, పుత్ర భాగ్యం మాత్రం కలుగలేదు. సంతానముకొరకు తన గురువైన కాశ్యపుని వద్దకు శత్రుంజయుడు వెళ్లాడు.
స గత్వా కాశ్యపమునేః పాదౌ గృహ్య స యాచితః |
భార్యయా మన్త్రిణా సాకమిదమూచే పురోధసమ్ ||౫౨
అతను కశ్యప ముని పాదాలకు నమస్కరించి తన భార్య మంత్రి మరియు పూజారులతో కలిసి గురువుతో ఇలా అన్నాడు

శత్రుఞ్జయః
కశ్యప త్వయి ధర్మాత్మన్నత్ర స్థితిముపేయుషి |
అనపత్యతయా వ్యగ్రాః కుతో వయమిదం వద ||౫౩
ఓ మహర్షీ! మీవంటి ధర్మాత్ముడు నాకు రక్షకుడై ఉండగా సంతానము లేదన్న బాధ నన్ను పీడిస్తున్నది. ( మీలాంటి వారుండగా నాకు ఈ సంతానము లేదను బాధ రాకూడదని భావం)

అనపత్యస్య మే బ్రహ్మన్ క్వ రాజ్యం క్వ చ మన్త్రిణః |
క్వ సేవా క్వ చ మే భోగః క్వ చాతుర్వర్ణ్యరక్షణమ్ ||౫౪
ఓ బ్రాహ్మణా! నాకు పిల్లలు లేరు. సంతానము లేనప్పుడు నా రాజ్యం ఎందుకు? నా మంత్రులు ఎందుకు? నాకు సేవ ఎందుకు? నా భోగభాగ్య ముల ఆనందం ఎందుకు? నాలుగు వర్ణాల రక్షణ ఎందుకు?

కాశ్యపః
శత్రుఞ్జయ మహాభాగ విష్ణుభక్తిం దృఢం కురు |

క్రియతాం పుత్రకామేష్టిర్ఘటికాద్రిపతౌ త్వయా ||౪౫

అప్పుడు కాశ్యపుడు "రాజా! ఓ అదృష్టవంతుడా! శత్రుంజయా ! విష్ణువు పట్ల నీ భక్తిని బలోపేతం చేసుకో. ఈ ఘటికాచల ప్రభువు అనుగ్రహం కొరకు ఘటికాచలానికి పోయి పుత్రకామేష్టిని(పుత్రుడు కలుగవలెనని కోరికతో చేయబడు యాగము) చేయవలసినది. అని కశ్యపుడు ఆ రాజుతో చెప్పాడు.

నృహరిస్స తు విజ్ఞాయ పుత్రమిత్రాదిసంపదః |
ప్రదాస్యతి మహారాజన్నాత్ర కార్యా విచారణా ||౪౬

ఆ నరసింహదేవునికి కుమారులు, స్నేహితులు మరియు ఇతర సంపదలు నీకు కావాలసిన ఆవశ్యకత తెలుసు. ఓ మహా రాజా! ఆయన నీకు సంతానము అనుగ్రహిస్తాడు. దాని గురించి నువ్వు వేరే విధంగా ఆలోచించవలసిన అవసరం లేదు. అని కశ్యపుడు ఆ శత్రుంజయ రాజుతో చెప్పాడు.

వైష్ణవాస్తత్ర శతశో బ్రాహ్మణా వేదపారగాః |
సన్తి తేషాం నియోగేన ప్రాప్యన్తే పుత్రసంపదః ||౪౭

వేదాలలో బాగా ప్రావీణ్యం ఉన్న వందలాది వైష్ణవులు మరియు బ్రాహ్మణులు ఆ ఘటికాచలంలో ఉన్నారు.
వారి ఆజ్ఞ చేత పుత్ర సంపదను పొందిన వారు చాలామంది ఉన్నారు.( కనుక నీకు కూడా పుత్ర సంపద లభిస్తుందని భావం) అని కాశ్యపుడు శత్రుంజయుడను రాజుతో అన్నాడని పింగళునితో వరతంతు మహర్షి చెప్పాడు.

శత్రుఞ్జయ:

ప్రతిగృహ్య మునేర్వాచం తేనానుజ్ఞాపితస్తథా |
పుత్రకామేష్టిమకరోన్నృహరేః పదమేయివాన్ ||౪౮

శత్రుంజయుడు ఆ కాశ్యప ఋషి మాటలను అంగీకరించి పుత్రకామేష్టిని చేయుట కొరకు నరసింహుడు కొలువైన ఘటికాచలమునకు వెళ్లాడు.

అచిరేణైవ కాలేన వైష్ణవానాం సమాగమాత్ |
అనుగ్రహాన్నరహరేః ప్రాప్తవాన్ పుత్రసంపదమ్ ||౪౯

తపస్సు చేసే వైష్ణవ మునులను కలిసి , వారి సహకారంతో వారి అనుమతితో పుత్రకామేష్టిని చేసి నరహరి అనుగ్రహం వల్ల పుత్ర సంపదను శత్రుంజయుడు పొందాడు. ఆ తరువాత అతడు తన భార్యాబిడ్డలతో చాలాకాలం సుఖంగా జీవించి, చివరకు స్వర్గాన్ని చేరాడు. అని పింగళునితో వరతంతు మహర్షి శత్రుంజయుని కథ చెప్పాడు.

అతస్త్వయా నరహరే పాదే మాలాకృతః పదమ్ |

ఆస్థాయ భార్యయా శక్త్యా బ్రాహ్మణేభ్యః ప్రదీయతామ్ ||౬౦

అందుకే నువ్వుకూడా నీ భార్యతో కూడి శ్రీ నృసింహస్వామి  సన్నిధిలో మాలికలు రచించు.   నీ శక్తి మేరకు బ్రాహ్మణులకు దానం ఇచ్చి సేవించు. అని పింగళునితో వరతంతు మహర్షి చెప్పాడు.

61- 70

తులస్యా మాలికా కార్యా నృసింహాయ మహాత్మనే|

అన్యేషాం చైవ పుష్పాణాం మాలా కార్యా ప్రయత్నతః | | ౬౧

మహాత్ముడయిన  నరసింహస్వామికి తులసి మాల సమర్పించు.( పూలమాలికను కూర్చి సమర్పించే పవిత్రకైంకర్యము చేయమని భావం)  ఇతర దేవతలకు పువ్వులతో మాలలు కట్టుము.

వైష్ణవేషు సదా కుర్వన్ భక్తిమవ్యగ్రయా ధియా |

తత్తత్తీర్థేషు చ స్నాత్వా యథాశక్తి ప్రదీయతామ్ ||౬౨

అచంచలమైన తెలివితేటలతో ఎల్లప్పుడూ వైష్ణవులకు భక్తితో సేవలో నిమగ్నమై ఉండవలసినది.ఆయా పవిత్ర తీర్థములలో స్నానం చేసి, మీకు వీలైనంతవరకు దానం చేయండి.

వైష్ణవేభ్యః ప్రదానేన పుత్రాన్ ప్రాప్య సుఖీ భవ

మాలాకరణతో భక్త్యా ప్రయాస్యసి చ వైష్ణవమ్ || ౬౩

వైష్ణవులకు చేయు దానము వలన  పుత్రులు కలుగవలెనను  నీ కోరికను పొందగలవు .మాలలు కట్టుటచే పూలమాలికను కూర్చి సమర్పించే పవిత్రకైంకర్యముతో  నువ్వు వైష్ణవునిగా మారతావు. అని పింగళునితో వరతంతు మహర్షి చెప్పాడు.

తత్ర సత్యవ్రతో నామ హనుమత్పురి తిష్ఠతి |

తస్య శుశ్రూషణద్వారా సర్వం తవ భవిష్యతి ||౬౪

ఆ ఘటికాచలములో  సత్యవ్రతుడను పేరుతో  హనుమంతుడు ఉన్నాడు. అతని సేవతో నీకు సర్వము సిద్ధిస్తుంది. అని పింగళునితో వరతంతు మహర్షి చెప్పాడు.

అస్మిన్ వినయసంపన్నే వైష్ణవే ద్విజసత్తమే |

సదా విహరతే శ్రీమాన్ నరహరిః పుమాన్ ||౬౫

అత్యుత్తముడైన  వినయసంపన్నులయిన బ్రాహ్మణుల  వైష్ణవభక్తి సామ్రాజ్యంలో   నరసింహస్వామి ఎల్లప్పుడూ ఆనందిస్తుంటాడు. ( కనుక వారిని భక్తితో సేవించమని హితబోధ) అని పింగళునితో వరతంతు మహర్షి చెప్పాడు.

కదాచిత్ నారదో  నామ వైణికో మునిపుఙ్గవః ।
ఉపవీణాహృతః పార్శ్వమభ్యేష్యతి హరేరథ ||౬౬

ఒకప్పుడు నారదుడను ముని వీణ వాయిస్తూ  నృసింహ పర్వత  సమీపములో సంచరిస్తాడు.

**విశేషాలు**

మూలములో కదాచిత్ పిఙ్గలో నామ అని సంస్కృత, తెలుగు లిపులపుస్తకములలో ఉన్నది. ఇది అసంబద్ధమయిన పాఠము. శ్రీ మాన్ మామిళ్ళపల్లి నరసింహముగారు తమ ఘటికాచల మాహాత్మ్య  అనువాదములో  ఈ సందర్భములో ఇలా వ్రాసారు. ''ఒకప్పుడు పింగళుడను ముని వీణ వాయించుచు నృసింహ సమీపమున  సంచరించును. నృసింహుడు ప్రసన్నుడై పుష్పమాలను ఇచ్చును. ఆమాలతో వీణను అలంకరించి అతడాకాశమున తిరుగుచుండగా ఆమాల గాలికి తొలగి నీ తలపై పడును. దానిని నీవు ధరించినంతనే బంగారు విమానములో విష్ణులోకము చేరెదవు,'' అని వరతంతు మహర్షి ఉపదేశింపగా పింగళుడు హనుమంతుని అనుగ్రహముతోసంతానమును పొందెను. నీవు చూచిన ఉన్నతస్థితిని పొందెను.'' '' అనివ్రాసారు. (52, 53 వపుటలు) పింగళకుని వీణ పై ఉన్న పూల దండ మరలా  పింగళకునిపై పడుట అయోమయముగా ఉన్నది. కదాచిత్ పిఙ్గలో నామ వైణికో మునిపుఙ్గవః( ఒకప్పుడు పింగళుడు  అనే గొప్ప ఋషి ఉండేవాడు, అతను వీణ వాయించువాడు) అను గందరగోళ సంస్కృత మూలమును యథాతథముగా నరసింహముగారు అనువదించారు.

శ్రీమాన్ సింగరాచార్యులవారు తమ సంక్షిప్త  ఘటికాచల మాహాత్మ్యపు  అనువాదములో ఈ పింగళకుని కథా వృత్తాంతములో ''ఒకనాడు ఆకాశమార్గంగా వచ్చిన నారదమహర్షి వీణనుండి జారిన ఒక మాల పింగళుని మెడలో పడింది.' అని వ్రాసారు.( 29 వపుట) కనుక వీరి పాఠాన్ని అనుసరించి నారదుడని మూల పాఠాన్ని సవరించే సాహసం చేసాను. – పతంజలి)

ఉపవీణ్యా చిరం కాలం గాతుకామస్స వై మునిః।
నదసింహః ప్రసన్నాత్మా దాపయిష్యతి మాలికామ్ ||౬౭

ఆ నారదముని  ఇలా చాలా కాలం నరసింహ పర్వత  సమీపంలో సంచరిస్తూ వీణా గానము చేస్తాడు. నరసింహస్వామియొక్క అనుగ్రహాన్ని పొందడానికి వీలయిన  అరుదైన తులసీమాలికను వీణపై నారదుడు ధరిస్తాడు.

స తయా మాలయా వీణామలఙ్కృత్వా వియత్పథే।
గమిష్యతి ప్రహృష్టాత్మా వల్గు గాయన్ పదే పదే || ౬౮

ఆ తులసీమాలికతో తన వీణను అలంకరించుకుని అడుగడుగునా మధురంగా పాడుతూ ఉల్లాసమైన హృదయంతో ఆకాశంలో  నారదుడు సంచరిస్తాడు.

వనమాలా వాయునున్నా తవ మూర్ధ్ని పతిష్యతి ।
తదలంకృతమూర్ధా త్వం వైష్ణవం లోకమేష్యతి ||౬౯

ఒకసారి గాలి వీచినప్పుడు  నరసింహస్వామియొక్క అనుగ్రహాన్ని  పొందడానికి వీలయిన ఆ అరుదైన తులసీమాలిక నారదుని  వీణనుండి పక్కకి తొలగి నీ తలపై పడుతుంది. ఆ  తులసీమాలికతో  అలంకరించబడిన శిరస్సుతో నీవు వైష్ణవ లోకాన్ని పొందుతావు. అని పింగళునితో వరతంతు మహర్షి చెప్పాడు

ఇన్ద్రః
అఙ్గీకుర్వన్ వచస్తస్య వరతన్తోర్మహామునేః ।
అభ్యగాదముముద్దిశ్య ఘటికాద్రిమనుత్తమమ్ ।।౨౦
పై  వరతంతు  మహా ఋషి మాటలను విని, ఆయన మాటలను  దృష్టిలో ఉంచుకుని పింగళకుడు అద్భుతమైన ఘటికాచలాన్ని  చేరుకున్నాడు.

యదుక్తం గురుణా వాక్యం హృది కృత్వా స పిఙ్గలః ।
సత్యవ్రతానుగ్రహేణ ప్రాప్తవాన్ పుత్రసంపదః ।।౨౧
గురువైన వరతంతుమహాముని మాటను హృదయంలో పదే పదే తలుస్తున్న    పింగళుని అదృష్టం ఒకనాడు  హనుమంతుని అనుగ్రహముతో ఫలించింది. నారదమహర్షి వీణనుండి జారిన  తులసీ మాల పింగళుని మెడలో పడింది. నరసింహుని అనుగ్రహముతో పింగళకుడు  పుత్ర సంతానమును  పొందాడు.

ప్రాప్య పౌత్రాన్ స తేజస్వీ వైష్ణవానామనుగ్రహాత్ ।
పదమీదృశమాపన్నో నృహరేశ్చ ప్రసాదతః ।।౨౨
వైష్ణవమునుల  అనుగ్రహం వల్ల, ఆ తేజస్వి అయిన పింగళకుడు  మనవళ్లను కూడా   పొందాడు. నరసింహ స్వామి  అనుగ్రహం వల్ల నీవు చూచిన ఉన్నతస్థితిని పొందాడు. ( ఇదిఅంతా ఇంద్రుడు వసిష్ఠునితో చెప్పిన కథలు. కనుక ఇక్కడ నీవు అనగా వసిష్ఠుడని అర్థం చేసుకోవాలి)

**విశేషాలు**

(నరసింహుని వనమాల ఆకాశమునుండి ఆ ఆశ్రమము దగ్గరలో ఉన్న  ఒకని తలపై బడినది. ఆ వనమాల పడిన వెంటనే అతడు శంఖ చక్రములను  ధరించి  బంగారపు విమానమును ఎక్కి   ప్రకాశించాడు అను 29 వ శ్లోకపు భావాన్ని మరలా ఇక్కడ చదువుకోవాలి. ఆ ఒకడు పింగళకుడు.)

వసిష్ఠః -
అహో వైష్ణవమాహాత్మ్యం అహో నృహరిసేవనమ్ ।
యదేష సభ్యసఙ్గేన వైష్ణవం లోకమేయివాన్ ।।౨౩
ఆ ఇంద్రుడు చెప్పిన శత్రుంజయుడు, పింగళకుడు మొదలయిన  కథలను  విన్న వశిష్ఠుడు  ‘‘ఆహా! విష్ణు మాహాత్మ్యము ఎంతగొప్పది. నరహరిపాదసేవ ఎంతగొప్పది’’. అని పొంగిపోయాడు.

బ్రహ్మా

బహుమాన్య తతో దేవం ఋషిర్ధర్మార్థకోవిదః ।

విశ్వామిత్రాశ్రమపదం సహ శిష్యైరుపాగమత్ ।।౨౪

అప్పుడు ధర్మార్థ  శాస్త్రాలలో బాగా ప్రావీణ్యం ఉన్న వశిష్ఠుడు ఇంద్రదేవుని  ఎంతో గౌరవంగా సత్కరించాడు .  తరువాత వశిష్ఠుడు తన శిష్యులతో కలిసి విశ్వామిత్ర ఆశ్రమానికి చేరుకున్నాడు

విశ్వామిత్రస్తు తచ్ఛ్రుత్వా మహేన్ద్రేణ సహామరైః ।

వసిష్ఠాగమనం తత్ర శుభం మేనే తపస్స్థితః । ।౨౫

ఇంద్రుడు మరియు ఇతర దేవతలతో కలిసి వశిష్ఠుడు తన ఆశ్రమానికి వచ్చిన వార్తను తపస్సు చేసుకొనుచున్న  విశ్వామిత్రుడు  విని తనకు శుభము కలుగునని భావించాడు.

తాను తపస్సు చేస్తున్నప్పుడు వసిష్ఠుని రాక శుభప్రదమని భావించాడు.

విశ్వామిత్రః

తపసాం మమ మాహాత్మ్యం కిం బ్రూమో వయమున్నతమ్ ।

యదేష్యతి వసిష్ఠో మే నః పదం హరిమేయివాన్ । ।౨౬

వసిష్ఠుడంతటివాడు  నా దగ్గరకు వచ్చినప్పుడు నా తపస్సుల గొప్పతనాన్ని గురించి ఏమి చెప్పగలను? ( తన తపస్సు గొప్పగా ఉండటం వలననే వసిష్ఠుడంతటివాడు తన దగ్గరకు వచ్చాడని విశ్వామిత్రుని భావన.

అద్య మే సఫలం జన్మ అద్య మే సఫలం తపః ।

అద్య మే సఫలం జ్ఞానం నృహరేః పదసేవనాత్ ।। ।।౨౭

ఈ రోజు నా జన్మ విజయవంతమైంది మరియు ఈ రోజు నా తపస్సు విజయవంతమైంది.

ఈ రోజు, నృహరి పాదపద్మములను సేవించడం ద్వారా, నేను ఫలవంతమైన జ్ఞానాన్ని పొందాను.

బ్రహ్మా

తతోఽనన్తరే మహేన్ద్రేణ మైత్రావరుణిరుత్తమః ।

కౌశికస్యాశ్రమపదం ప్రేత్య వజ్రిణమూచివాన్ । ।౨౮

బ్రహ్మా

ఈలోగా, ఇంద్రుని స్నేహితుడయిన  ఉత్తముడయిన వరుణుడు ప్రత్యక్షమయ్యాడు.

కౌశికుని ఆశ్రమానికి చేరుకున్న తర్వాత, వరుణుడు  ఇంద్రునితో ఇలా  మాట్లాడాడు. ౭౮||

వసిష్ఠ: -

ఇదం తపస్యాశ్రమపదం తస్యేమే తరవో మునేః |

తస్య శిష్యా ఇమే వజ్రిన్ మదామగనకాక్షిణః | |౭౯

వశిష్ట: -

ఇది తపస్సు చేస్తున్నకౌశికుని ఋషి ఆశ్రమం.

వీరు ఆయన శిష్యులు, ఓ ఇంద్రా ! నేను రావాలని వీరంతా కోరుకొంటున్నారు.  79

ఏతస్మిన్నన్తరే విశ్వామిత్రశ్శిష్యేణ సంగతః |

వజ్రిణం మాం చ నృపతే పూజయామాస సాదరమ్ ||౮౦

ఇంతలో విశ్వామిత్రుడు తన శిష్యునితో కలిసి మా దగ్గరకు వచ్చాడు.

ఓ రాజా! అతను ఇంద్రుని  మరియు నన్ను భక్తితో పూజించాడు.

పత్రైః పుష్పైః ఫలైర్మూలైర్మన్త్రైః కృత్వాహర్ణం మునిః |

విశిష్య పూజయన్ మాం తు నయయుక్తముదాహరత్ ||౮౧

ఆ విశ్వామిత్రుడు ఆకులు, పువ్వులు, పండ్లతో మమ్మలిని అర్చించి  మంత్రాలను జపించాడు.

అతను నన్ను గౌరవంగా పూజించాడు. మరియు నాతో చాలా చమత్కారంగా , మృదువుగా ఇలా మాట్లాడాడు.

విశ్వామిత్ర:-

యథాశక్తి మయా దత్తం వసిష్ఠః ప్రతిగృహ్యతామ్ |

న మే కామదుఘా ధేనుర్యయా సర్వ భవిష్యతి ||౮౨

విశ్వామిత్రుడు:-

వశిష్ఠా ! నేను నీకు నా యథాశక్తిగా   ఇచ్చిన దానిని వీలైనంత వరకు స్వీకరించు.

అన్ని  కోరికలను తీర్చు కామధేనువు  నా దగ్గర లేదు. ( తాను ఇచ్చు ఆతిథ్యము అల్పమయినదని విశ్వామిత్రుని భావన)

తదా సంచిత్య మనసా తదా చాకర్ణ్య శబ్దితమ్ |

మాముద్వీక్ష్య సురాధ్యక్షో వచః ప్రోవాచ వాసవః ||౮౩

తరువాత విశ్వామిత్రుడుచెప్పినదానిని తన మనస్సులో గ్రహించి దేవతల అధిపతి ఇంద్రుడు నన్ను( వసిష్ఠుని) చూసి ఈ మాటలు అన్నాడు.

అఙ్గీకృత్య ఫలం దత్తం విశ్వామిత్రేణ ధీమతా ।
నృహరేః ప్రీతయే చాస్మై బ్రహ్మర్షిత్వం ప్రయచ్ఛ వై ॥౮౪

జ్ఞానియైన విశ్వామిత్రుడు ఇస్తున్న ఆతిథ్య ఫలాన్ని  స్వీకరించి నరహరి ఆనందం కోసం అతనికి బ్రహ్మర్షి హోదాను ప్రసాదించు.

శ్రద్ధదానో వచస్తస్య వజ్రిణో నృహరేః ప్రియమ్ ।
కౌశికం నియతాహారం మునిమేనమభాషత ॥౮౫

నియమముగా మితాహారం తీసుకుంటూ తపస్సు చేసుకొంటున్న  కౌశిక మునిని ఉద్దేశించి  ఇంద్రుడు చెప్పిన  మాటలు భగవంతుడు నరహరికి ప్రీతికరమైనవి. అందుకే నేను విశ్వామిత్రునితో ఇలా అన్నాను.

వసిష్ఠః

సన్తుష్టోఽహం మునిశ్రేష్ఠ బ్రహ్మర్షిత్వం ప్రయాహి వై ।
మహర్షీణాం చ నృహరేరిన్ద్రస్యానుగ్రహాదపి ॥౮౬

వశిష్టః

ఓ ఋషులలో శ్రేష్ఠుడా ! విశ్వామిత్రుడా !  నేను మీ ప్రవర్తనతో  సంతృప్తి చెందాను. దయచేసి బ్రహ్మర్షి హోదాను పొందండి.
.నరసింహస్వామి , గొప్ప ఋషులు  మరియు ఇంద్రుల అనుగ్రహం కూడా పొందండి.

వరాహకల్పే సప్తర్షిప్రవరో భవ సర్వదా ।
వైవస్వతాన్తరే సర్వే వయం త్వత్ప్రీతికాఙ్క్షిణః ॥౮౭

ఓ బ్రహ్మర్షీ! నీవు కఠోరమయిన  తపస్సుతో నరసింహుని ప్రసన్నుని చేసుకొన్నావు. వరాహ కల్పములో సప్తర్షులలో శ్రేష్ఠునిగా నువ్వు ఉంటావు. వైవస్వత మన్వంతరమున మేమందరము నీ ప్రేమకొరకు ఎదురుచూస్తుంటాము.

విశేషాలు

భాగవతం అష్టమ స్కందంలో మన్వంతరాల గురించిన వివరణ ఉన్నది. ప్రస్తుతం వైవస్వత మన్వంతరంలో 27 మహాయుగాలు గతించి 28వ మహాయుగంలో సత్య, త్రేతా, ద్వాపర యుగాల తరువాత కలియుగం నడుస్తున్నది. ప్రతి మన్వంతరం లోను సప్తర్షులు, ఇంద్రుడు, సురలు మారుతుంటారు. భగవంతుని అవతారాలు కూడా మారుతుంటాయి.

14 మన్వంతరాల పేర్లు

1. స్వాయంభువ మన్వంతరము ,స్వారోచిష మన్వంతరము,ఉత్తమ మన్వంతరము,తామస మన్వంతరము,రైవత మన్వంతరము,చాక్షుష మన్వంతరము,వైవస్వత (ప్రస్తుత) మన్వంతరము,సూర్య సావర్ణిక మన్వంతరము,దక్షసావర్ణి మన్వంతరము,బ్రహ్మసావర్ణి మన్వంతరము ధర్మసావర్ణి మన్వంతరము,భద్రసావర్ణి మన్వంతరము
2. దేవసావర్ణి మన్వంతరము
3. ఇంద్రసావర్ణి మన్వంతరము

**వైవస్వత (ప్రస్తుత) మన్వంతరము**

ఇది ప్రస్తుతం జరుగుతున్న మన్వంతరము. చాక్షుష మన్వంతరం చివర కల్పాంత ప్రళయకాలంలో భగవానుడు మత్స్యావతారుడై జలరాశినుండి జనులను, ఓషధులను దరిజేర్చాడు. వేదాలను కాపాడాడు.

మనువు - వివస్వంతుడని పుత్రుడు వైవస్వతుడు.

తండ్రి - వివస్వంతుడు (సూర్య భగవానుడు)

తల్లి - సంజ్ఞ

భార్య - శ్రద్ధ అందుకే ఇతనికి శ్రాద్ధదేవుడు అనే పేరు కూడా ఉంది.

మనువు పుత్రులు - ఇక్ష్వాకుడు, నాభాగుడు, ధృష్టుడు, సంయాతి, కరుషుడు, వృషధ్రుడు, వసుమంతుడు, నరిష్యంతుడు మరియు పృషపదుడు.

మనువు పుత్రికలు - ఇల(సుద్యుమ్నుడు).

భగవంతుని అవతారాలు

కశ్యపునకు అదితి యందు వామనుడిగా జన్మించి బలి చక్రవర్తి నుండి మూడడుగుల నేల యాచించి త్రివిక్రముడై ముల్లోకాలను ఆక్రమించాడు.

సప్తర్షులు - కశ్యపుడు, అత్రి, వశిష్ఠుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, జమదగ్ని, భరద్వాజుడు

ఇంద్రుడు - ఓజస్వి

సురులు - వసువు, రుద్రుడు, ఆదిత్యుడు, విశ్వదేవుడు, నాసత్యుడు, మరుత్తు

ఈ మన్వంతరమున వామన , పరశురామ, శ్రీ రామ, బలరామ, శ్రీ కృష్ణ మరియు బుధ అవతారములు జరిగినవి, మరియు కల్కి అవతరిస్తారు.

కల్పాలు పద్దెనిమిది ఉన్నాయని భవిష్య పురాణం చెబుతోంది. ఈ కల్పాలు కాల విభజనలో సుదీర్ఘమైన కాలావధులు. ఒక్కో కల్పంలో నాలుగు పాదాలు ఉంటాయి. అవన్నీ సమానమైన కాలావధి లో ఉంటాయి. ప్రస్తుతం నడుస్తున్నది శ్వేత వరాహ కల్పం లోని వైవస్వత మన్వంతరం. అందుకే సంకల్పం చెప్పుకునే టప్పుడు తిథి చెబుతూ శ్వేత వరాహకల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే అంటూ చెప్పుకుంటాం. కూర్మ కల్పం,మత్స్య కల్పం, శ్వేతవరాహ కల్పం, నృసింహ కల్పం వామన కల్పం,  స్కంద కల్పం , భాగవత కల్పం, రామ కల్పం , మార్కండేయ కల్పం, భవిష్య కల్పం,లింగ కల్పం,బ్రహ్మాండ కల్పం,అగ్నికల్పం,వాయు కల్పం,పద్మ కల్పం ,శివ కల్పం , విష్ణు కల్పం, బ్రహ్మ కల్పం

ప్రస్తుతం నడుస్తున్నది శ్వేతవరాహ కల్పం.

అంటే భవిష్య పురాణం ప్రకారం వరుసలో మూడో కల్పం దీని తరువాత 15 కల్పాలు ఉన్నాయి అందులోని ప్రతి దానిలో మన్వంతరాలు ఉన్నాయి. ప్రతి మన్వంతరం లోనూ నాలుగు యుగాలు ఉంటాయి. ఈ చక్రం అంతా పూర్తయిన తర్వాతనే సంపూర్తి లయం. ఈలోగా ప్రతి కలియుగాంతంలో జల ప్రళయం వచ్చి  దుష్ట ప్రకృతి కి చెందిన వారినందరిని అంతం చేస్తుంది. మిగిలిన కొద్ది మంది మంచివాళ్ళతో మరో మన్వంతరంలోని సత్య యుగం ఆరంభం అవుతుంది.(అంతర్జాల సౌజన్యం)

కల్పమనగా 432, 000, 000 సంవత్సరాలు.

ఉపశ్లోక్య చ మాహాత్మ్యం విశ్వామిత్రో మహామునిః ।
ప్రమోద నిర్భరమనాస్సస్వజే మాం తథా నృప ।౮౮
విశ్వామిత్రుడు  నా మాటలలోని గొప్పతనాన్ని విన్నాడు. ఆనందంతో నిండిన  మనస్సుతో  అతను నన్ను కౌగిలించుకున్నాడు.

బ్రహ్మర్షిత్వం తతో దత్వా తస్మై గాధితనూభువే ।
ఆమన్త్ర్య చ సురాధీశం ప్రాప్తవానహమాశ్రమమ్ ।।౮౯
గాధికుమారుడయిన విశ్వామిత్రునికి బ్రహ్మర్షిత్వాన్ని ఇచ్చిన తరువాత  దేవతల ప్రభువయిన ఇంద్రునికి వీడ్కోలు పలికి నేను ఆశ్రమానికి చేరుకున్నాను.

తతో గాధిసుతో రాజా బ్రహ్మర్షీణామనుత్తమః ।
సాలోక్యం నృహరేరిచ్ఛన్ తపస్యతి మహామునిః । ౯౦
ఆ తరువాత, గాధికుమారుడయిన విశ్వామిత్రుడు బ్రహ్మర్షులలో అత్యంత శ్రేష్ఠుడయ్యాడు.
ఆ బ్రహ్మర్షి విశ్వామిత్రుడు సాలోక్య ముక్తిని  పొందాలనే కోరికతో, తపస్సు చేస్తున్నాడు. 90

విశేషాలు

ముక్తులు నాలుగు రకాలు 1. సాలోక్యము (విష్ణులోకమందుండుట), 2. సామీప్యము (విష్ణువు దగ్గఱనుండుట), 3. సారూప్యము (విష్ణురూపుడై యుండుట), 4. సాయుజ్యము (విష్ణువులో జేరియుండుట).

గౌతమస్య చ దౌహిత్రః పృథులోమేతి విశ్రుతః ।
అత్రాశ్రమపదే రాజన్ తపస్తేపే సుదారుణమ్ ।।౯౧
ఓ రాజా !గౌతముడను మహర్షికి  పృథులోముడు అను మనుమడు ఉన్నాడు.
ఈ ఆశ్రమంలో అతను నరహరి గురించి తీవ్రమైన తపస్సు చేసాడు.

విష్ణుభక్తో జితామర్షస్త్రిసన్ధ్యే నృహరేస్స్తవమ్ ।
వికుర్వాణోఽమితాహారో గాయత్రీమన్వహన్ జపమ్ ।।౯౨
పృథులోముడు కోపాన్ని జయించిన విష్ణు భక్తుడు . మూడు సంధ్యలలోను(1. ప్రాతః సంధ్య, 2. మాధ్యాహ్నిక సంధ్య, 3. సాయం సంధ్య.)

నరహరి స్తోత్రాలను జపించేవాడు.మితంగా ఆహారాన్ని తింటూ గాయత్రీ మంత్రాన్ని జపించేవాడు.

విశేషాలు

ప్రొద్దుపొడుచుటకు ముందు అయిదుగడియలవరకును( గడియ= 24 నిమిషాలు) ప్రొద్దుగ్రుంకిన వెనుక మూడుగడియల వఱకును గల కాలమును సంధ్య అంటారు.

పర్వతారోహణపథే తృణం ఛేత్తుం తథేచ్ఛత ।

కరే లవిత్రమాదాయ భార్యయా సహ తాపసః ॥ ౯౩

ఒకనాడు అతడు ఘటికాచలము ఎక్కుతున్నాడు. కొడవలి చేతిలో ధరించి భార్యతో కలిసి  పర్వత మార్గములో  ఉన్న గడ్డిని తొలగించుటకు శ్రమపడ్డాడు.

తృణవిచ్ఛేదనే కాలే శ్రమవన్తం పదే పదే ।

పృథులోమానముద్వీక్ష్య ప్రశశంసుర్మహర్షయః ॥ ౯౪

ఆ ఘటికాచల మార్గములో గడ్డి కోసే సమయంలో, పృథులోముడు  అడుగడుగునా అలసిపోయాడు.

మహా ఋషులు అతనిని చూసి ప్రశంసించారు. 94

పృథులోమా

భో భో మహర్షయస్సర్వే సభార్యస్య మమాచ్యుతః ।

హరిః ప్రసన్నో భవతి కర్తవ్యోఽనుగ్రహో మహాన్ ॥౧౫

పృథులోముడు ఇలా అన్నాడు

ఓ గొప్ప ఋషులారా! ఓ దోషరహితులారా! నేను నా భార్యతో కలిసి హరి పూజలో  ఉన్నాను.

మీ దయవలన నరసింహుడు నాకు ప్రసన్నుడు అవుతాడు. అలా ఆశీర్వదించండి.

అమోఘో వైదికో మన్త్రః అమోఘా బ్రాహ్మణాశిషః ।

హరిభక్తిరమోఘేతి వ్యాహరన్తి విపశ్చితః ॥౯౬

వేద మంత్రము అమోఘమైనది. అలాగే బ్రాహ్మణ ఆశీర్వాదము, హరి భక్తి కూడా అమోఘమైనవని పూజింపదగిన జ్ఞానం కలిగిన పండితులు చెబుతారు.

ఋషయః

అద్య ప్రసన్నో భగవాన్ నృహరిర్భవితానఘ ।

సాలోక్యమపి ధర్మాత్మన్ ప్రయచ్ఛత్యపి రాజితే ।। ౯౭

ఋషులు

అప్పుడు ఋషులు పృథులోమునితో  "నీకు శ్రీహరి ప్రసన్నుడు కాగలడు. నీకు  సాలోక్యముక్తిని ఇస్తాడు" అని దీవించారు.

విశేషాలు

90 వశ్లోకంలో సాలోక్యము అనుదానికి వివరణ ఇవ్వబడినది.

వసిష్ఠ:

తత్రాన్తరే నరహరిః ప్రాదుర్భూత్వా సురారిహా ।

సభార్యం పృథులోమానమనయద్వైష్ణవం పదమ్ ||౯౮

ఆ ఋషులు చెప్పినట్లుగానే  అంతలో నరహరి ప్రత్యక్షమై సకుటుంబముగా పృథులోముని విష్ణులోకమునకు తీసుకొనిపోయాడు.

మార్గం విశోధయతి యో ఘటికాద్రేరతన్ద్రితః ।

స బ్రహ్మర్షిప్రసాదేన సర్వాన్ కామానవాప్నుయాత్ ||౯౯

కావున ఘటికాచలపు  మార్గాన్ని పరిశుద్ధి చేసినవారు ఋషుల అనుగ్రహముతో తాము కోరుకొన్న  కోరికలను పొందుతారు.

యశ్శృణోతి కథామేతామశక్తో మార్గశోధనే ।

తస్యాపి సఫలం జ్ఞానం తపశ్చ సఫలం భవేత్ || ౧౦౦

ఈపద్దెనిమిదవ అధ్యాయములో  కథలను విన్నవారు, ఘటికాచల మార్గమును శుభ్రపరచినవారు సకలమైన జ్ఞానాన్ని,  తపః ఫలమును పొందుతారు

ఇతి బ్రహ్మకైవర్త ఉత్తరఖణ్డే భృగుపరాశరసంవాదే ఘటికాచలమాహాత్మ్యే అష్టాదశోఽధ్యాయః ||

ఇక్కడితో  బ్రహ్మ-కైవర్త పురాణంలోని ఉత్తరఖండంలో భృగువు మరియు పరాశరుని మధ్య జరిగిన సంభాషణలో ఘటికాచల మాహాత్మ్యంలో పద్దెనిమిదవ అధ్యాయం పూర్తి అయినది.

+++++

శ్రీ శివాయ గురవే నమః

ఘటికాచలనివాసాయ శ్రీ నృసింహాయ నమః

బ్రహ్మకైవర్త పురాణములో ఉన్న  శ్రీఘటికాచల మాహాత్మ్యపు  పందొమ్మిదవ అధ్యాయం

(మూల శ్లోకము మరియు తాత్పర్య విశేషాలతో)

**1-10**

ఏకోనవింశోఽధ్యాయః

పరాశరః

ఇత్యుక్తో రాజశార్దూలో వసిష్ఠేన మహాత్మనా ।

ముహూర్తం ధ్యాయన్ ప్రోవాచ హర్షగద్గదయా గిరా ॥౧

ఈవిధంగా మహాత్ముడైన వశిష్ఠుడు ఘటికాచల మాహాత్మ్యమును తనకు వివరింపగా ఇంద్రద్యుమ్న మహారాజు  కణకాలము నరసింహుని మనస్సులో ధ్యానించి  సంతోష పులకిత గాత్రుడై వశిష్ఠునితో ఇలా అన్నాడు

ఇన్ద్రద్యుమ్నః

వసిష్ఠ తాపసశ్రేష్ఠ శృణ్వతో మమ సాంప్రతమ్ ।

కర్ణౌ పూరితవాన్ తాత వైష్ణవానాం కథామృతైః ॥౨

. ''ఓ తపోశ్రేష్ఠా ! వశిష్ఠా ! వైష్ణవ కథామృతముతో  నా శ్రవణేంద్రియములను(చెవి) ఈనాడు  తృప్తి పరిచారు.

పరావరజ్ఞో భగవాన్ నృహరౌ భక్తిమాన్ భవాన్ ।

యదస్య దర్శయా పుణ్యకథయా ప్రీణయత్యముమ్ ॥౩

మీరు  శ్రేష్ఠుడు-నీచుడు, చిన్నవాడు-పెద్దవాడు, దగ్గర-దూరము, ముందు-వెనుక, జ్ఞానము-కర్మ గురించి  బాగా తెలిసినవారు.  దేవదేవుడయిన నృసింహ భక్తులు.

నరసింహునిపై  దృష్టిని మరల్చు  పవిత్రమైన  కథలతో సంతోషపెడతారు.

వాణీ సఞ్చారిణీ బ్రహ్మనుచ్చనీచేఽపి యత్వదే ।

తావకీ కిము నాన్యేషామిత్యేషా వైదికీ శ్రుతిః । ४

ఓ బ్రహ్మర్షి ! మీ స్వరంలో సరస్వతి ఉదాత్త అనుదాత్త స్వరాలతో  అడుగడుగునా కదులుతూనే ఉంటుంది.తనకి వేదోచ్చారణకి మధ్య తేడా ఏమిటని అడుగుతుంటుంది. ( అనగా వశిష్ఠుడు ఏది మాట్లాడినా వేదం పలికినట్లు ఉంటుందని పొగడ్త.)

**విశేషాలు**

వేదము పలుకుటలో ప్రధానంగా మూడు స్వరాలుంటాయి.

ఉచ్చైరుదాత్తః [1.2.29]

స్వరముల యొక్క ఉచ్చారణసమయమున ఆ ఉచ్చారణస్థానానికి ఊర్ధ్వభాగమునుండి పలికితే  అది ఉదాత్త స్వరం.

నీచైరనుదాత్తః [1.2.30]

స్వరముల యొక్క ఉచ్చారణసమయమున ఆ ఉచ్చారణస్థానానికి క్రిందిభాగమునుండి పలికితే అది అనుదాత్త స్వరం.

స్వరితః (30)

సమాహారః స్వరితః [1.2.31]

స్వరముల యొక్క ఉచ్చారణసమయమున ఆ ఉచ్చారణస్థానానికి ఊర్ధ్వభాగ మును, అధోభాగమును కూడా ఉపయోగించిన 'స్వరితస్వరము

కేనోపాయేన లఘునా లఘునా సర్వకర్మణామ్ ।

ఫలమావిర్భవేత్తన్నో వద బ్రహ్మర్షి సత్తమ ॥ ॥౫

ఓ బ్రహ్మర్షి ! ఏ చిన్న ఉపాయము చేత బాగా పెద్దదయిన సర్వ కర్మఫలము కలుగుతుందో  అటువంటి ఉపాయమును దయతో నాకు చెప్పండి'' అని ఇంద్రద్యుమ్నుడు వశిష్ఠుని అడిగాడు.

## నరసింహ కవచము

వసిష్ఠః -

నృసింహకవచం పుణ్యం తచ్ఛ్రుణుత్వం మహీపతే ।

ఏనం సంప్రోక్తమనసం దృష్ట్వా ధావన్త్యపగ్రహాః ||౬

అప్పుడు వశిష్ఠుడు ఇలా అన్నాడు,

''ఓ ఇంద్రద్యుమ్న మహారాజా! పవిత్రమైన, పుణ్యప్రదమయిన  నరసింహ కవచమును నీకు చెబుతాను.  సావధానుడవై విను. చక్కగా మనస్సులో పారవశ్యాన్ని పొందుతూ చదవబడిన ఈ  నృసింహ కవచ పదముల చప్పుడు విని  చదివినవానినుండి  చెడు గ్రహ ప్రభావాలు  పారిపోతాయి.( నృసింహ కవచాన్ని శ్రద్ధగా చదివితే గ్రహదోషాలు తొలగుతాయని భావం)

**విశేషాలు**

ఈ శ్లోకంలోని ప్రోక్త  అను పదము  దృష్ట-ఉపజ్ఞాత-ప్రోక్త-కృత అను నాలుగు విధములలో ఒకటి;

పాణిని రాసిన అష్టాధ్యాయిలో దృష్ట-ఉపజ్ఞాత-ప్రోక్త-కృత అను పదబంధాలు ఉన్నాయి.

మహర్షులు కనుగొన్న సార్వత్రిక సత్యాన్ని 'దృష్ట' అని పిలిచేవారు.

ఈ సత్యాన్ని తిరిగి చెప్పిన రచనలను 'ప్రోక్త' అని పిలిచేవారు.

పైన పేర్కొన్న రచనలను  అధ్యయనము చేసి  సత్య ఆవిష్కరణ ఆధారంగా రూపొందించిన రచనలను 'ఉపజ్ఞాత' అని పిలుస్తారు.

(ఉపజ్ఞాత  అంటే ఒకరిచేత చెప్పించు కొన్నదిగా గాక, స్వతహాగా కలిగిన జ్ఞానం; స్వయంగా కనిపెట్టిన విషయం.)

మిగిలిన సాధారణ సాహిత్య రచనలను 'కృత' అని పిలిచేవారు

జపన్నృసింహస్య మనుం పశ్చాత్ తత్కవచం పఠన్ ।
లభతే పురుషో లోకే పురుషార్థచతుష్టయమ్ ॥౭

మొదటగా నృసింహ మంత్రమును జపించి, తరువాత నరసింహ కవచమును చదివినవాడు  లోకమున నాలుగు పురుషార్థములను పొంద గలడు.( పురుషుడు సాధించవలసిన ప్రయోజనమును పురుషార్థము అంటారు. అవి ధర్మ-అర్థ-కామ-మోక్షములు.)

మన్త్రస్యాస్య మహాభాగ ఋషిరాశ్లాయనస్స్మృతః ।
ఛన్దోఽనుష్టుప్ తథా దేవో భగవాన్నృహరిర్హరిః ॥౮

ఓ ఇంద్రద్యుమ్న మహాభాగా ! (గొప్ప అదృష్టం కలవాడా !) ఈ మంత్రానికి ఋషి ఆశ్లాయనుడు.

ఛందస్సు  అనుష్టుప్.  ఆ దేవత దేవదేవుడైన నృహరి.

**విశేషాలు**

ప్రతి మంత్రాన్ని ఒక ఋషి,ఛందస్సు, దేవత, బీజం, శక్తి, కీలకం,అంగన్యాస, కరన్యాసాలనే సప్తాంగాలతో క్రమం తప్పకుండా ధ్యానించాలని పెద్దలు చెప్పారు.

1. ఋషి:.

మంత్రాన్ని చదివేవాడు  ఋషిని శిరస్సులో నిలుపుకొని ధ్యానించాలి. ఏ మంత్రం ఎవరిచేత ఆవిష్కరింపబడిందో, ఎవరిచేత సిద్ధి పొందిందో, అతనినే ఆ మంత్రానికి కర్తగా (ఋషిగా) భావించాలి.

2. ఛందస్సు:.

శరీరాన్ని కప్పిన వస్త్రంలా ఆత్మను కప్పుతున్న దానికి ఛందస్సు అని పేరు. ఈ ఛందస్సులు మంత్రాలను రక్షించగలవు. దేవతలు తమను తాము కాపాడుకొనేందుకు గాయత్రీ వంటి మంత్రాలను ఆచ్ఛాదనలుగా చేసుకొన్నారు.

3. దేవత:.

ప్రతి మంత్రానికి ఒక అధిష్ఠాత దేవత ఉంటుంది. ప్రతి మంత్ర ప్రవర్తకుడు మంత్రానికి తగిన అధిష్ఠాన దేవతను హృదయ కమలంలో నిలుపుకొని

ధ్యానించాలి.

4. బీజం:.

మంత్రానికి ప్రత్యేకశక్తిని కలుగజేసే మంత్రసారమే బీజం అని పేరు. ఈ బీజాన్ని గుహ్యంలో నిలిపి ధ్యానించాలి.

5. శక్తి:.

మనం మంత్రశక్తిని వహించినప్పుడే, అందుకు తగిన మంత్రశక్తి కలుగుతుంది. మంత్ర ప్రవర్తకుడు మంత్రశక్తిని పాదాలలో నిలిపి ధ్యానించాలి.

6. కీలకం:.

మంత్రశక్తిని మనలో నిలిపి ఉంచేందుకు సాయపడే బిరడా వంటిది కీలకం. మంత్ర ప్రవర్తకుడు కీలకాన్ని నాభియందు నిలిపి ధ్యానం చేయాలి. అప్పుడు సాధకుడు ఉపాసనామూర్తిని దర్శించి, సర్వసిద్ధులను పొందుతాడు.

7.అంగన్యాసం:.

అంగన్యాస క్రియలు ఆచరించకుండా చేసిన మంత్రాలు నిష్ప్రయోజనమవుతాయి. శరీరశుద్ధికోసం న్యాసాలు తప్పనిసరిగి చేయాలి. సాధకులు న్యాసాలు చేసుకొని మంత్రజపాన్ని చేయాలి. న్యాసములు ఆచరించకుండా సాధకునికి మంత్రాధికారం లేదు.

సంధ్యావందనము మొదలయినవి చేసేటప్పుడు అంగన్యాస కరన్యాసాలు చేస్తారు. ఇవి రెండు భాగాలు. 1. అంగ న్యాసం, 2. కరన్యాసం.

'ఓమ్ తత్సవితుః బ్రహ్మాత్మనే హృదయాయనమః' అంటూ హృదయస్థానాన్ని స్పృశించడం, అదే పద్ధతిలో గాయత్రి మంత్రంలో మిగతా భాగాలను ఉచ్చరిస్తూ శిరస్సు, శిఖాదులను స్పృశించి 'ఓమ్ ప్రచోదయాత్ సర్వాత్మనే అస్త్రాయఫట్' అనడం, కుడిచేతి చూపుడు వేలు పైకి ఉండే విధంగా చూపుడు వేళ్ళు రెండింటిని లంకెవేస్తూ 'దిగ్బంధః' అనడం అంగన్యాసం.

కరన్యాసంలోనూ గాయత్రీ మంత్ర భాగాలను ఉచ్చరిస్తూ అంగుష్ఠ, తర్జని(చూపుడువ్రేలు), మధ్యమ, అనామిక, కనిష్ఠిక వేళ్ళను బొటన వేలిని తర్జనితోనూ, మిగతా వేళ్ళను బొటన వేలితోనూ తాకాలి. మంత్రంలో చివరి భాగమైన 'ఓమ్ ప్రచోదయాత్' అన్నప్పుడు ఒక అరచేతి వెనుక భాగంతో రెండవ అరచేతిని రాయడం కరన్యాసం చివరి అంశం.

అంగన్యాస కరన్యాసాల తరువాత 'ముక్తావిద్రుమ'తో మొదలయ్యే గాయత్రీ ధ్యాన శ్లోకం చదవడం పద్ధతి.

సకలాభీష్టసిద్ధ్యర్థం వినియోగ ఉదాహృతః ।
ఆదౌ ప్రణవముచ్చార్య లక్ష్మీర్బీజం తతః పరమ్ ॥౬

అన్ని కోరికలు  నెరవేరటం  కోసం ''వినియోగం''  చేయాలి. ప్రారంభంలో ఓంకారాన్ని జపించి, తరువాత లక్ష్మీ బీజ మంత్రాన్ని  జపించండి.

**విశేషాలు**

వినియోగం:

చతుర్విధ పురుషార్థాలకై లేక ఏదో ఒక సంకల్ప సిద్ధికై మంత్రాన్ని ఉపయోగించడమే వినియోగం అని అంటారు.

నృసింహేతి పదం పశ్చాత్ చతుర్థ్యన్తం సముచ్చరేత్ ।
నమస్కృత్య తతో ధీమాన్ మన్త్రరాజం సముచ్చరేత్ ।

''నరసింహ'' అను పదాన్ని జపించిన తర్వాత, నరసింహలోని నాల్గవ అక్షరాన్ని(హ) జపించాలి.

నమస్కారాలు సమర్పించిన తర్వాత, పండితుడు ఈ నరసింహ మంత్రాన్ని జపించాలి.11

తేనైవ హృదిగుప్తేన భుక్తిముక్తీ ప్రవిన్దతి ।

ప్రజాపతిసహస్రం తు ప్రజపేన్మన్త్రముత్తమమ్ ॥౧౧

హృదయంలో గుప్తంగా ఈ నరసింహ మంత్రాన్ని జపిస్తే భుక్తి ముక్తి పొందుతారు.

అన్ని జీవుల ప్రభువయిన నరసింహస్వామి యొక్క ఉత్తమ మంత్రాన్ని వెయ్యి సార్లు జపించాలి.( విష్ణుసహస్ర నామంలో కూడా ప్రజాపతి పదం ఉన్నది)

**విశేషాలు**

'భుక్తి ముక్తులు' అనే మాట 'భోగం-మోక్షం' అని అర్థాలను తెలియజేస్తుంది. ఇహలోకంలో భోగం. జీవునికీ అంతిమ ప్రయోజనం మోక్షం. రెండింటినీ దైవం ప్రదానం చేస్తున్నాడు. స్తోత్రాదులు అనుష్ఠానం వల్ల ఈ రెండూ కలగాలని ఋషుల భావన.

'భుక్తి' కర్మానుభవం. 'ముక్తి' కర్మబంధనం నుండి విమోచనం. ఈ రెండింటినీ తెలియజేసే పదాలివి.

ధ్యాయేదుక్తేన విధినా జానున్యస్తకరద్వయమ్ ।

యోగాసనే సమాసీనం శఙ్ఖచక్రమహాయుధమ్ ॥౧౨

పైన వివరించిన విధంగా చేసి రెండు చేతులను మోకాళ్లపై ఉంచి నరసింహ ధ్యానం చేయాలి.

శంఖం, చక్రం మరియు గొప్ప ఆయుధాలతో యోగాసనంపై కూర్చుని ఉన్న నరసింహుని ధ్యానించాలి.

సురర్షిభిర్వృతం దేవైస్సేవ్యముత్పలకోమలమ్ ।

ప్రశమం నిరతారూఢయోగోద్ధృతపయోరుహమ్ ॥౧౩

దేవతలు మరియు ఋషులతో కలిసి ఉన్నవానిని, దేవతలచే పూజింపబడు వానిని, తామరపువ్వు అంతటి మెత్తని శరీరము కలవానిని, మోక్షమార్గమును అనుగ్రహించువానిని, నిరంతరం యోగారూఢునిగా(యోగాభ్యాసం చేసినవాడు. విషయములయందు అనాసక్తుడు. ) ఉండువానిని,యోగము నందు పైకి ఎత్తబడిన తామరపువ్వు కలవానిని ధ్యానించాలి.

**విశేషాలు**

భాగవతం విష్ణుమూర్తిని *పయోజసన్నిభపదుడు* - పయోజ (పద్మము) సన్నిభ (సమానమైమ) పదుడు (పాదములు గలవాడు), [4-920-ఉ.] *పయోజాసనార్చితుడు* - బ్రహ్మచేపూజింపబడువాడు [3-58-మ.] *పయోదశ్యాముడు* - పయోద (మేఘము వంటి) శ్యామ (నల్లనివాడు), [8-1-క.] *పయోధరాకారుడు* - పయోధరము (మేఘముల వలె) నల్లని ఆకారుడు (దేహము కలవాడు), [10.1-644-ఉ.] మొదలగు విశేషణాలతో అర్చించింది. అదే పద్ధతిలో విష్ణు స్వరూపుడైన నరసింహుని ఉద్ధృతపయోరుహమ్ గా ( పైకి ఎత్తబడిన తామరపువ్వు కలవానిగా) ఈ శ్లోకం వర్ణిస్తున్నది.

నమ తద్ఘటికాశైలాధ్యక్ష తం పురుషోత్తమమ్ ।

నృహరీతి కృతాభిఖ్యం సత్పరిత్రాణసంభవమ్ ||౧౪

ఆ ఘటిక పర్వతానికి అధిపతి అయిన ఆ దేవదేవునికి నా ప్రణామాలు అర్పిస్తున్నాను.

నరహరి అని పేరు కల ఆస్వామి సత్పురుషులను రక్షిస్తాడు.

ప్రభాతే తత్సవన్నిత్యం కర్తవ్యం ఫలమిచ్ఛతా ।

జపాన్తే కవచం తస్య నృసింహస్య మహామనోః । । ౧౫

సత్ఫలాలను కోరుకుంటే, ప్రతిరోజూ ఉదయం ఆ నరహరి మంత్రాన్ని జపించాలి.

ఆ గొప్ప మనసున్న భగవంతుడు నృసింహదేవుని కవచాన్ని చివరిలో జపించాలి. 15

పఠేత్ త్రిసన్ధ్యం నియతో నృహరి ప్రీతయే నృప ।

ఓం నృసింహోఽగ్రతః పాతు శ్రీనృసింహస్తు పృష్ఠతః || ౧౬

ఓ రాజా! నరహరిని ప్రసన్నం చేసుకోవడానికి ఈ మంత్రాన్ని మూడు సంధ్యలలోను క్రమం తప్పకుండా పఠించాలి.

ఓం.... నృసింహుడు నన్ను ముందు నుండి కాపాడాలి. మరియు శ్రీ నృసింహుడు వెనుక నుండి కాపాడాలి. 16

అచ్యుతో వామతః పాతు పాతు దక్షిణతో హరిః ।

హిరణ్యదారకో వక్త్రం కణ్ఠం రౌద్రాకృతిః పుమాన్ ||౧౭

ప్రహ్లాదాహహ్లాదకారీ మే బాహూ రక్షతు సర్వదా ।

అచ్యుత నామము కలిగిన నరహరి ప్రభువు నన్ను ఎడమ వైపున, హరి అను నామము కలిగిన నరహరి ప్రభువు కుడి వైపున రక్షించుగాక!

హిరణ్యకశిపుని పొట్టను చీల్చినవాడు, భయంకరమైన కంఠము, రూపము కలిగినవాడు, ప్రహ్లాదునికి ఆహ్లాదము కలిగించు నరసింహస్వామి నా చేతులను ఎప్పుడు రక్షించుగాక !

హృదయం కేసరీ రక్షే దంష్ట్రావాన్ మమ చోదరమ్ ||౧౮

కటిం కరాలవదనో జఘనం జగదీశ్వరః ।

వృషణం వృషపర్వా మే పాతు మే మహాభుజః ||౧౯

నరసింహం నా హృదయాన్ని, నా కడుపును తన కోరలతో కాపాడుగాక!

విశ్వ ప్రభువు యొక్క భయంకరమైన ముఖం నా నడుమును, జఘనమును( పిఱుదు) కాపాడుగాక!

మహా బాహువులు కలిగిన వృషపర్వుడు నా వృషణాలను(వీర్యమును వర్షించునవి కనుక వృషణములు అనిపేరు) రక్షించుగాక.

విశేషాలు

విష్ణువు యొక్క  ఉత్తమ స్థానము అను సౌధమును ఎక్కాలనుకోవాలి అనుకొనేవానికి  సాధనముగా వృషపర్వములు(ధర్మమనెడి నిచ్చెనమెట్లు) ఉన్నాయి.  అట్టి వృషపర్వములు కలిగిన వాడు కనుక  విష్ణువును  వృషపర్వుడు అంటారు. ( ఇది విష్ణుసహస్రనామము)

అష్టాదశభుజో రక్షేదూరూ మే జానునీ విభుః ।

జఙ్ఘే మే పాతు దైత్యేన్ద్ర వనమాలావిభూషణః ||౨౦

పద్దెనిమిది చేతులు కలిగిన నరహరి ప్రభువు నా  తొడలను మరియు నా మోకాళ్ళను(తొడ-పిక్కల మధ్య వుండు భాగములు) రక్షించుగాక! వనమాలతో  అలంకరించబడిన రాక్షసుల ప్రభువు నా జంఘలను(వట్టికాలి వెనుకటి భాగములు) రక్షించుగాక.

**విశేషాలు**

వనమాల అనగా

1. మోకాళ్లవరకు వ్రేళ్లాడుతూ, అన్ని ఋతువులలోనూ పూచే పూలతో, మధ్యన పెద్ద గుచ్ఛంతో విష్ణు మూర్తి మెడలో ఉండే దండ.
2. పంచతన్మాత్రలకు రూపమైన దండ.
3. చివురుటాకులు, పూలు కూర్చిన దండ.
4. శివ కేశవ భేదం లేని దండ.

21 - 30

ఘటికాచలవాసో మే సదా రక్షతు గుల్ఫయోః ।

పాదౌ స్తమ్భోద్భవః పాతు పదపృష్ఠే మహీధరః || ౨౧

ఘటికాచల నివాసి అయిన నరసింహస్వామి  ఎల్లప్పుడూ నా చీలమండలను(కాలిమడమలకు ఇరుప్రక్కలనుండు కీలు)  కాపాడుగాక.

స్తంభము నుండి పుట్టిన  నరసింహస్వామి నా పాదాలను కాపాడుగాక! పృథివిని ధరించువాడు , భూమిని పాలించువాడు అయిన నరహరి నా పాదాల వెనుక భాగాన్ని  రక్షించుగాక. 21

పాదాఙ్గులీస్తు మే రక్షేత్కోలాహలకరః పుమాన్ ।

రోమకూపాణి సింహేన్ద్రస్త్వచం మే యోగశీలవాన్ । ౨౨

ఘనీభూతమైన ధ్వనితో కోలాహలము  చేసే నరసింహస్వామి నా కాలి వేళ్లను కాపాడుగాక.

నరసింహేంద్రుడు  నా వెంట్రుకల కుదుళ్లను కాపాడుగాక! యోగశీలవంతుడు( యోగమను సదాచారము కలిగినవాడు) నా చర్మమును కాపాడుగాక! 22

రక్తమజ్జవసామాంసాన్యస్థీన్మే భైరవస్వనః ।
అఙ్గాని దీర్ఘశ్రవణో మకుటం మే కిరీటవాన్ ॥ ౨౩
భయంకరమైన శబ్దములు  కలిగిన  నరసింహస్వామి    నా ఎముకలు, మజ్జ(ఎముకలలోని కొవ్వు.) మరియు మాంస ధాతువులను రక్షించుగాక ! నరసింహుని  అవయవాలు నా పొడవాటి చెవులను రక్షించుగాక ! మరియు నా తలను నరసింహుని కిరీటం రక్షించుగాక ! 23

విశేషాలు

ప్రతి మానవశరీరంలో ఏడు ధాతువులు మరియు ఉపధాతువులు ఉంటాయి.

ఏడు ధాతువులు వరుసగా ఇవి -1 - రసము .2 - రక్తము .3 - మాంసము .4 - మేధస్సు5 - మజ్జ .6 - అస్థి .7 - శుక్రము .వీటిలో మాంసము, ఎముకలు, మజ్జ ల ప్రసక్తి పై శ్లోకంలో ఉన్నది కనుక వాటిగురించి ఆయుర్వేద శాస్త్రంలో చెప్పిన విషయాలను సంగ్రహంగా పేర్కొంటాను.

*మాంసము -

ఇది నాళములలోని రక్తము ద్వారా పోషించబడుచూ ఉండును. ఇది స్థూలం , సూక్ష్మం , మలం అను విభాగాలు పొందును. సూక్ష్మంగా ఉండు భాగం మేధస్సుని చేరి పోషించబడుతూ ఉండును. ఇది రక్తధాతువు నుండి ఏర్పడుతుంది.

అస్థి –

అస్థి అనగా ఎముక. ఇది మేధోధాతువుచే పోషింపబడుచూ శరీరం యొక్క పటుత్వమునకు ప్రధాన హేతువుగా ఉంటుంది. ఇది 3 భాగాలుగా విభజింపబడి ఉంటుంది. ఇది మజ్జా ధాతువుని పోషిస్తుంది.

* మజ్జ

ఇది బోలు ఎముకలో ఉండు పచ్చని కొవ్వు వంటి పదార్థం . ఇది అస్థిధాతువు చే పెంచబడును. ఇది స్థూలం , సూక్ష్మం , మలం మూడు బాగాలుగా విభజింపబడి ఉంటుంది. అందులో స్థూలభాగం మజ్జభాగంలో చేరుచూ ఉండును. సూక్ష్మ భాగం శుక్రధాతువు ని పొషించుచుండును . ఇది అస్థిధాతువు వలన ఏర్పడును .

జ్వాలాముఖస్తథా జ్వాలాస్సర్వాత్మా పాదసన్ధిషు ।
బ్రహ్మోవాచ-
శఙ్ఖచక్రధరశ్శుక్లం ఛాయాం ఛాయాపతిః ప్రభుః । ౨౪
అగ్ని జ్వాలలతో మండు ముఖం కలిగిన మరియూ జ్వాలా రూపుడైన నరసింహుడు పాదాల మొత్తము కీళ్లను రక్షించుగాక !
బ్రహ్మ ఇలా అన్నాడు:
శంఖ చక్ర ధరుడయిన విష్ణువు  నా శుక్రమును ( వీర్యమును) కాపాడుగాక ! సూర్యునికి  ప్రభువు అయిన నరసింహుడు నా కాంతిని రక్షించుగాక !24

అహఙ్కారాద్యనేకాని హుంకారధ్యానభీషణః ।
ప్రాణాపానౌ తథా వ్యానముదానం చ సమానకమ్ ॥ ౨౫
యశః కీర్తి చ లక్ష్మీం చ రక్షేద్ఘట్ఠోచితో హరిః ।

మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అను అంతఃకరణ చతుష్టయమును మరియు ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానాలు అను పంచప్రాణాలను   ధ్యానం చేయునప్పుడు హుంకారముతో  భయంకరంగా కనబడే నరసింహుడు  రక్షించుగాక !25

తన భక్తుల ధ్యానమునకు  అర్హుడైన భగవంతుడు యశస్సు,  కీర్తి మరియు సంపదలను రక్షించుగాక.

విశేషాలు

1. ప్రాణము (హృదయమున నుండునది), 2. అపానము (గుదమున నుండునది), 3. సమానము (నాభి మండలమున నుండునది), 4. ఉదానము (కంఠమున నుండునది), 5. వ్యానము (శరీరమంతట వ్యాపించి యుండునది).

"ప్రాణోஉపానః సమానశ్చోదాన వ్యానే చ వాయవః శరీరస్థా ఇమే" [అమరకోశము 1-1-64]

కీర్తి , యశస్సు రెండూ  ఒక్కటే. కాకపోతే స్వల్ప భేదం ఉంది.

అశ్నుతే దిశ ఇతి యశః - దిక్కులను వ్యాపించునది యశము.

కీర్త్యత ఇతి కీర్తిః - కీర్తింపబడునది కీర్తి

అయితే కీర్తులు, యశస్సులు ఎన్ని అనేదాని మీద వస్తు రత్న కోశము కొంచెం తేడా చూపించింది.

కీర్తులు ఏడు.

1. దానకీర్తి, 2. పుణ్యకీర్తి, 3. కావ్యకీర్తి, 4. వక్తృత్వకీర్తి, 5. వర్తనకీర్తి, 6. శౌర్యకీర్తి, 7. విద్వజ్జనకీర్తి.

యశస్సులు 05

1. జ్ఞానకృతము, 2. ప్రతాపకృతము, 3. పరాక్రమకృతము, 4. సదాచారకృతము, 5. రూపకృతము.

సంఖ్యలో తేడా ఉన్నప్పటికి ఫలితాంశాలు ఒకటే.

హేమకోటివిమానస్థో గోత్రం మే పాతు శాశ్వతమ్ ॥౨౬

హేమకోటి విమానంలో యోగాసనంలో కూర్చున్న నరసింహస్వామి నా వంశాన్ని శాశ్వతంగా రక్షించుగాక.

విశేషాలు

ఘటికాచలంలో ప్రాచీనాలైన 14  శిఖరాలు ఉన్నాయి. వీటిలో ఏకశిలాపర్వతశిఖరంలో స్వర్ణమయమైన విమానం ఉన్నది. దానికి హేమకోటి విమానమనిపేరు. అందులో శ్రీమన్నారాయణుడు శ్రీనృసింహమూర్తిగా ఉన్నారు. 'హేమకోటివిమానం చుట్టూ ఉండే యోజనదూరాన్ని ( ఎనిమిది మైళ్ళ దూరం) నరసింహక్షేత్రము అంటారు. 'హేమకోటివిమానం సింహాలతో మోయబడుతున్నది. పెద్దకొండపై శ్రీ నరసింహస్వామి గర్భాలయమునకుపైన కట్టబడినవిమానమునకు హేమకోటి విమానము అని పేరు. దానిపై ఒక కలశము అమర్చబడియున్నది.

భార్యాం మే రక్షతు సదా వామదేవాదిముక్తిదః ।

సప్తర్షివన్ద్యః పుత్రాన్ మే పశూన్ మే హనుమత్ప్రియః । । ౨౭

వామదేవుడు మొదలయిన మునులకు ముక్తిని ప్రసాదించే నరసింహ దేవుడు నా భార్యను ఎల్లప్పుడూ కాపాడుగాక.

ఏడుగురు ఋషులచే పూజించబడు నరసింహ దేవుడు నా కుమారులను కాపాడుగాక! హనుమంతునికి ప్రియమైన నరసింహ దేవుడు నా పశువులను  కాపాడుగాక! 27

మార్గం రుద్రప్రియో రక్షేత్ సర్వతస్తుతిమేయివాన్ ।
ఇదం హి కవచం పుణ్యం సురాణామపి దుర్లభమ్ ॥౨౮
శివునికి ప్రియమైనవాడు , అందరినుండి స్తుతులు పొందువాడు అయిన నరసింహ దేవుడు నా  మార్గాన్ని కాపాడుగాక !
ఈ నరసింహ కవచం  ఒక పవిత్ర కవచం. పుణ్యకరమైనది.  ఇది దేవతలకు  కూడా దుర్లభమైనది.
విశేషాలు కఠినమైన మంత్ర విధానాలు మరియు మార్గదర్శకాలు స్తోత్రాలకు వర్తించవు.కాని కవచాలను ఒక విధమైన ఆచార పవిత్రతతో జపించాలి. ఈ రెండింటికి ప్రధానమయిన తేడా ఇది.
యః పఠేత్ప్రయతాత్మా వై త్రిసన్ధ్యం నృహరేః పురః ।
నిశ్చలా వైష్ణవీభక్తిస్తస్మిన్నవ్యభిచారిణీ ॥౨౯
ఈ కవచ మంత్రాన్ని ఏకాగ్ర మనస్సుతో నృహరి సన్నిధిలో ఘటికాచలంలో మూడు సంధ్యలలోను చదువు భక్తునికి నరసింహుని పట్ల ఉన్న  వైష్ణవ భక్తి నిశ్చలమవుతుంది. మరియు  ఏకనిష్ఠమవుతుంది.( ధ్యానంలో ఒకే ఉద్దేశ్యం)

అపగ్రహాః ప్రధావన్తి కవచే హృదిసంస్థితే ।
ఢాకిన్యాద్యాః పిశాచాశ్చ శాకిన్యాద్యాస్తథా రిపుః । ॥౩౦
ఈ నరసింహ కవచాన్ని హృదయపూర్వకంగా  చదివినవానికి  అతని జాతకంలో ఉన్న చెడు గ్రహాలు పారిపోతాయి.
ఢాకిని మొదలయిన పిశాచాలు, శాకిని మొదలయిన  శత్రువులు దూరంగా పారిపోతాయి.

**31 - 40**

నశ్యన్తి వ్యాధయస్సర్వే భూతాదిస్ఫోటకాదయః ।
అభిచారీణి సర్వాణి మన్త్రయన్త్రాణి వై తథా ॥౩౧
ఈ నరసింహ కవచాన్ని హృదయపూర్వకంగా  చదివినవానికి  అన్ని వ్యాధులు నాశనమవుతాయి. దయ్యము సోకుటలు ఉండవు. మశూచి (బొబ్బలు పొక్కెడు రోగవిశేషము) రాదు.
అలాగే శత్రువుల నాశనము కొరకు మంత్రతంత్రములు ప్రయోగించు విధానాలు  బాణామతి మొదలగు క్షుద్రవిద్యల ప్రయోగములు , మంత్రయంత్రములు ఈ నరసింహ కవచాన్ని హృదయపూర్వకంగా  చదివినవానిపై ప్రభావాన్ని చూపలేవు.

కవచేనామునా యస్తు సంపరిష్కురుతే మనః
సిధ్యన్త్యుచ్చాటనాదీని తస్య విష్ణోః ప్రసాదతః । । ౩౨
కానీ ఈ కవచంతో తన మనస్సును శుద్ధి చేసుకునే భక్తునికి  విష్ణువు దయ వలన, ఉచ్చాటనములు( పిశాచాదులను అవి ఉన్న చోటునుంచి పంపించి వేయడం; శత్రువును ఒక చోట నిలవకుండా చేసే కర్మకాండ) కలుగుతాయి. 32

మనోన్మథీర్భవేద్రాజన్ ప్రభవేద్బహ్మవర్చసమ్ ।

యః త్రిసన్ధం పఠేన్నిత్యం శ్రద్ధయా హరిసన్నిధౌ ॥౩౩

ఓ రాజా! ఈ నరసింహ కవచాన్ని  విష్ణువు సన్నిధిలో విశ్వాసంతో ప్రతిరోజూ మూడు సంధ్యలలోను చదివినవాని మనస్సు ఉత్సాహంగా మారుతుంది . మరియు బ్రహ్మ వర్చస్సు(వేదాధ్యయనం వల్లా, తపస్సు వల్లా ప్రాప్తించే వర్చస్సు/ తేజస్సు) కలుగుతుంది.

యం యం చిన్తయతే కామం తం తమాప్నోత్యయత్నతః ।

పురా విష్ణూపదిష్టేన కవచేనామునా నృప ॥౩౪

ఓ రాజా! గతంలో  విష్ణువు బోధించిన ఈ నరసింహ కవచం చదవటం ద్వారా అన్ని కోరికలు సులభముగా నెరవేరుతాయి.

బ్రాహ్మణ్యం గాధితనయః ప్రవిన్దత మునీశ్వరః ।

తథాకర్ణ్య స రాజేన్ద్రో త్రిరాచమ్య శుచిర్భవాన్ ॥౩౫

పూర్వము విష్ణువుచే ఉపదేశింప బడిన ఈ నరసింహ కవచమును జపించి విశ్వామిత్రుడు బ్రాహ్మణ్యమును( బ్రహ్మర్షిత్వము) పొందెను.'' అని అని వసిష్ఠుడు ఇంద్రద్యుమ్న మహారాజుకు చెప్పాడు. ఈ నరసింహ కవచమును విన్న ఇంద్రద్యుమ్నమహారాజు త్రిసంధ్యాసమయాల్లోను ఆచమనం చేసి, శుచిత్వాన్ని పొందాడు.

విశేషాలు

ఆచమనం అంటే కేవలం ఒక ఉద్ధరణి నీళ్లు చేతిలో పోసుకొని లోపలికి పుచ్చుకోవడం మాత్రమే కాదు, మంత్ర పూత జలంతో శరీరాన్ని స్పర్శించడం, స్నానం చేయడం కూడా ఆచమనమే. ఆచమనం నాలుగు విధాలు.

అవి : 1. శ్రుత్యాచమనం : స్వాధ్యాయ బ్రాహ్మణంలోని శ్రుతి "హస్తౌ వవవిజ్య రతిరాచమేత్..." అంటూ చేతులు కడుగుకొని, "ఓం కేశవాయ స్వాహా, ఓం నారాయణాయ స్వాహా, ఓం మాధవాయ స్వాహా" అని ఆచమనం చేయాలి. తరువాత రెండు చేతులను శుద్ధి చేసుకొని, ఉదకాన్ని స్పృశించి, కుడి చేతితో ఎడమ చేతిమీద, పాదాల మీద నీళ్లు చల్లుకోవాలి. శిరస్సు, నేత్రాలు, ముక్కు, చెవులు, హృదయ స్థానాలను తాకాలి.

2. శ్రౌతాచమనం : గాయత్రీ మంత్రంలోని మూడు పాదాలను విడివిడిగా స్వాహాకారంతో పఠిస్తూ, అంటే ఓమ్ తత్సవితుర్వరేణ్యగ్ స్వాహా, భర్గోదేవస్య ధీమహి స్వాహా, ధియో యోనః ప్రచోదయాత్ స్వాహా అని పలుకుతూ ఆచమించడం మొదలైన క్రియలు ఇందులో ఉన్నాయి.

3. స్మృత్యాచమనం/ స్మార్తాచమనం : పీట/ కృష్ణాజినం మీద కూర్చుని, పాదాలను నేలపై ఉంచి, ఆపస్తంబ సూత్ర సంప్రదాయంలో ఆచమించే పద్ధతి. బొటన వ్రేలితో పెదవులను తుడుచుకోవడం లాంటి క్రియలు ఇంకా ఉన్నాయి.

4. పురాణాచమనం : ముమ్మారు కేశవ నామాలతో ఆచమించడం, గోవిందాది నామాలతో అవయవ శుద్ధి మొదలైన క్రియలు ఇందులో ఉన్నాయి. శ్రుత్యాచమనం, శ్రౌతాచమనం ఒక్కటేనని కొందరి భావనగా దువ్వూరి రామకృష్ణారావుగారి సంపాద కత్వంలో వెలువడిన సంధ్యావందనం గ్రంథంలో వ్రాశారు. కావచ్చు.

శిలాపుష్కరిణీతీరే ఉపదేశం గతో మునేః ।

ఉపదిష్టస్తతో రాజా ప్రత్యుత్పన్నమనీషయా ॥ ౩౬

ఆ తరువాత  ఘటికాచలంలోని  శిలాపుష్కరిణి ఒడ్డున వసిష్ఠుని దగ్గర ఇంద్రద్యుమ్న మహారాజు ఉపదేశం పొందాడు. ఈ నరసింహ కవచ ఉపదేశము పొందుట వలన ఇంద్రద్యుమ్న మహారాజు  సమయోచిత మగు బుద్ధిగల  ప్రతిభావంతుడయ్యాడు.

అభిపూజ్య గురుం తత్ర ధృతపద్మాసనస్తదా ।
కవచం మనుముద్గృహ్య సర్వేషామగ్రణీరభూత్ ॥౩౭

ఆధ్యాత్మిక గురువయిన వసిష్ఠుని పూజించిన తరువాత, ఇంద్రద్యుమ్న మహారాజు   పద్మాసనాన్ని వేసి  నరసింహ కవచ మంత్రాన్ని ఉపదేశంగా పొంది అందరిలోను గొప్పవాడయ్యాడు.

వజ్రేణ కవచేనైవ స చిరేణ ధనుర్ధరః ।
తతస్తత్రత్యతీర్థేషు వసిష్ఠేన ప్రచోదితః ॥ ౩౮

వజ్రముతో సమానమైన నరసింహ కవచమును  చదివి , ఆ ఇంద్రద్యుమ్న మహారాజు ధనుస్సును ధరించిన వాడై చాలా కాలము   ఆ ఘటికాచలములోని పవిత్ర తీర్థములలో వశిష్ఠునిచే ప్రేరేపింపబడి స్నానము చేసాడు.

స్నాత్వా శైలాధిరోహే మాం ఇదం వచనమబ్రవీత్ ।
ఇన్ద్రద్యుమ్నః
కిమిదం ప్రోన్నతం శృఙ్గం సర్వదేవర్షివన్దితమ్ ॥౩౯

తీర్థములలో స్నానము చేసిన  తరువాత కొండను ఎక్కి, ఆ  మహారాజు వశిష్ఠుని ఈ విధముగా ప్రశ్నించాడు.
అందరు దేవతలు ఋషులు నమస్కరించు ఈ  ఉన్నతమైన శిఖరము ఎవరిది?

కస్యాశ్రమపదం బ్రహ్మన్ వద మే వదతాం వర ।
వసిష్ఠః
అధిత్యకేయం రాజర్షిన్నిదం శృఙ్గం చ పుత్ర వై ॥౪౦

ఇక్కడ కనపడుతున్న ఆశ్రమము ఎవరిది? ఓ బ్రహ్మర్షి వశిష్ఠా! నాకు చెప్పవలసినది అని మహారాజు అడుగగా వశిష్ఠుడు ఈ విధముగా జవాబు చెప్పాడు"

ఓ మహారాజా! ఈ పర్వతపు పై భాగము, ఈ శిఖరము ఎవరికి సంబంధించినదో చెబుతాను విను.

## నరసింహతీర్థము

41 -50

వామదేవాదయో ముక్తాస్తపస్యన్తి తపోధనాః ।
శిలాపృష్ఠే నరహరిస్స్వనామ్నా కృతవాన్ సరః ॥౪౧

ముక్తిని కోరుకొను తపోధనులైన వామదేవుడు మొదలైన మహర్షులు ఇక్కడ తపస్సు చేయుచున్నారు. శిలా పుష్కరిణి అని తన పేరుతో నరసింహస్వామి ఇక్కడ సరస్సును నిర్మించాడు

ఆవిర్భూతోऽత్ర భగవానృషీణాం ముక్తయే పురా ।
శ్రీనృసింహస్సరస్తీరే వ్యపనేతుం స్వకిల్బిషమ్ ||౪౨
పూర్వము నరసింహస్వామి ఋషులకు ముక్తిని ఇచ్చుటకు ఇక్కడ ఆవిర్భవించాడు. తాను నిర్మించిన ఈ శిలా పుష్కరిణి తీర్థము అన్ని రకములైన పాపములను పోగొడుతుంది.

ఉమయా చోదితో రుద్రః ప్రాప్తవాన్ ప్రమథాధిపః ।
నృసింహకరుణాయోగాత్ బ్రహ్మహత్యాం ప్రహాయ్య సః ।। ౪౩
పునః కైలాసమగమత్ సోమసోమార్ధశేఖరః ।
పూర్వము పరమశివుడు పార్వతిచే ప్రేరేపితుడై ఇక్కడికి వచ్చి  స్నానము చేసి, నరసింహుని దయవలన తాను చేసిన బ్రహ్మహత్యాపాతకమును తొలగించుకొని చంద్రశేఖరుడైన ఆ పరమశివుడు మరలా కైలాసానికి వెళ్ళాడు.

వామదేవాశ్రమో నామ రాజన్నత్ర విరాజతే ||౪౪
ఓ మహారాజా! ఇక్కడ ఉన్న ఆశ్రమము వామదేవ మహర్షిది.
నృసింహతీర్థమేతస్య మధ్యే తిష్ఠతి నిర్మలమ్ ।
ఈ ఆశ్రమము  నిర్మలమైన నరసింహ తీర్థము వద్ద ఉన్నది

అత్ర దేవాస్సగన్ధర్వాస్సేన్ద్రాశ్చ పరమర్షయః ||౪౫
నృసింహప్రీతయే సర్వే సతతం తర్పయన్తి వై
రాజానశ్చ తథా వైశ్యా ద్విజన్మానశ్చ వైష్ణవాః ।। ౪౬
ప్రాతస్స్నాత్వా చ మధ్యాహ్నే దేవర్షీం తర్పయన్తి చ ।
నరసింహుని ప్రీతి కొరకు ఇక్కడ దేవతలు గంధర్వులు ఇంద్రుడు  ఎప్పుడూ తర్పణములు విడుచుచుందురు. నాలుగు వర్ణముల వారు(బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్ర జాతులు) ఉదయం ఇక్కడ  స్నానం చేసి, మధ్యాహ్నం దేవర్షులకు తర్పణాలు విడుస్తుంటారు.

విశేషాలు

ఈ లోకంలో కొంతకాలంపాటు జీవించి ఏవో కొన్ని పాపపుణ్యాలని చేసి ఆ పాపాలనుండి నివృత్తి కోసం మరో జన్మని ఎత్తవలసివున్నవారికి కృతజ్ఞతా పూర్వకంగా నువ్వులనీ, నీటినీ కలిసి మంత్రపూర్వకంగా సమర్పించుకోవడాన్ని 'తర్పణం' అంటారు.

ఇఙ్గుదీసప్తపర్ణాశ్చ తమాలాశ్చ కపిత్థకాః ।। ౪౭

సన్తానాద్యాశ్చ తరవః పఞ్చ సన్నిహితా నృప ।

గారచెట్టు, ఏడాకులరటి (ఏడాకులపొన్న), తిలక వృక్షము, వెలగ వృక్షము, సంతానమను కల్పవృక్షము అను అయిదు వృక్షములు ఈ ఘటికాచలములో ఉన్నాయి.

తత్ర కల్పతరోర్మూలే నృహరిః పద్మయా సహ ॥౪౮

శఙ్ఖచక్రవరాభీతిముద్రితస్తిష్ఠతే సదా ।

సంతానము మొదలయిన  దేవతా వృక్షముల మధ్య కల్పవృక్షము క్రింద లక్ష్మీ సహితంగా  శంఖ చక్ర వర అభయ ముద్రలు ధరించి నరసింహుడు  ఇక్కడ కొలువై ఉన్నాడు.

గయాక్షేత్రాధికం క్షేత్రం నృసింహస్య మహామతే ॥ ౪౯

తులావిన్యసనే పూర్వ గయా కిఞ్చిదుదంచితా ।

పూర్వము ఏది గొప్పదో  తేల్చుకోవటానికి గయ మొదలయిన  క్షేత్రములను ఒక వైపున ఈ ఘటికాచలక్షేత్రమును ఒకవైపున  ఉంచి తూచినప్పుడు గయ మొదలయిన  క్షేత్రములను  పైకి లేచిపోయాయి.

తదా వీక్ష్య సురాస్సర్వే బ్రహ్మాద్యాశ్చ మహర్షయః ॥౫౦

51  -60

నృసింహక్షేత్రమేతద్ధి నిస్తులం బహు మేనిరే ।

అది చూచిన  బ్రహ్మాది దేవతలు మహర్షులు నరసింహ క్షేత్రమే గొప్పదని, దీనికి సమానమైనది లేదని భావించారు.

జన్మక్షణాత్ పురా వీక్ష్య దత్తో నామ ద్విజర్షభః ।। ౫౧

విష్ణుభక్తిమవష్టభ్య నితరాం ధర్మచిన్తనః ।

యాదవాద్రౌ తపస్తేపే కల్యాణసరసస్తటే ॥౫౨

పూర్వము దత్తుడు అను పేరు కలిగిన  బ్రాహ్మణుడు చిన్నతనమునుండి ధర్మపరాయణుడై , విష్ణుభక్తి కలిగినవాడయి యాదవాద్రిలో కల్యాణసరస్సు తీరములో  తపస్సు చేసాడు.

ఉపాస్తే విష్ణుభక్తాంశ్చ విష్ణుభక్తో హ్యతన్ద్రితః ।

పితరం స్వం తదా శ్రుత్వా మృతం యవనకర్మణా ॥ ౫౩

అతను విష్ణు భక్తులను పూజిస్తాడు.  మరియు అలసట  లేకుండా ప్రయత్నశీలుడై  విష్ణువును పూజించు భక్తుడు.

అతను తన తండ్రిని యవనుడు(తురుష్కుడు,  యవనదేశీయుడు) చంపాడని ఒకసారి విన్నాడు.

చిన్తయానం తముద్వీక్ష్య వ్యాజహార మునిస్తథా ।

పురుకుత్స ఉవాచ

కిమర్థం చిన్తితం విద్వన్నిరాకులధియా త్వయా ।। ౫౪

ఒక యవనుడు తన తండ్రిని చంపిన విషయమును విని దత్తుడు దుఃఖిస్తున్నాడు.

అప్పుడు పురుకుత్సుడను ఋషి ఇలా ప్రశ్నించాడు.  “ఓ విద్వాంసుడా ! నీవు ఎందుకు ఇలా దుఃఖిస్తున్నావు?

అశ్రావ్యమస్తి కిఞ్చిత్తత్తత్ ప్రశంస మమాన్తికే ।

ఏదైన వినగూడనిది జరిగిందా? నా సమక్షంలో జరిగినది చెప్పు”

విష్ణుదత్తోవాచ -

గృహీతశతధర్మాఖ్యః పితా మే వత్సవంశజః ।। ౫౫

విష్ణుదత్తుడు ఇలా చెప్పాడు. “మా నాన్నగారి పేరు శతధర్ముడు.  వత్సవంశములో పుట్టినవాడు

జనయిత్వా స మాం ధన్వీ యవనానాం పురీమగాత్ ।

నా తండ్రి నేను పుట్టిన తరువాత యవనుల నగరానికి వెళ్లాడు.

తత్ర గత్వా స తేషాం వై వృత్తి నిత్యం సమాచరత్ ।। ౫౬

యవనుల నగరానికి వెళ్ళిన తరువాత అచ్చటనే నా తండ్రి తురుష్కుల  అలవాట్లను నేర్చుకొన్నాడు.

తత్రత్యా రమతే భార్యా మధుసేవీ సదా మునే ।

కదాచిదపి మే మాతుః కదాచిదపి మే ముఖమ్ ।।౫౭

ఓ పురుకుత్స మునీ ! యవనుల నగరములో నా తండ్రి వారి అలవాట్లను నేర్చుకొన్నాడు. నాకు గాని మా తల్లికి గాని బంధువులకు గాని ఎప్పుడు కనిపించలేదు.

కదాచిదపి బన్ధూనామనాలోకితవాన్ మునే ।

తథాపి దేవ యం సర్వే సర్వదా ప్రియకారిణః ।। ౫౮

ఓ పురుకుత్స మునీ ! అతను ఎప్పుడూ తన బంధువుల వైపు ఒక్కసారి కూడా చూడలేదు.

అయినప్పటికీ, మేమందరం ఎల్లప్పుడూ ఆయనంటే  ఇష్టమైన వాళ్ళమే. 58.

మాతృదేవో భవేత్యేతత్ పితృదేవో భవేతి చ ।

ఆచార్య దేవ ఇత్యేతద్వాక్యం న హి మయా శ్రుతమ్ ।।౫౯

మాతృదేవో భవ పితృదేవో భవ ఆచార్య దేవో భవ మొదలగు వేద వాక్యాలు నేను విని ఉన్నాను కదా ! (అనగా తండ్రి ఎట్టివాడైనను సేవింపదగిన వాడే అను మార్గమును అనుసరించానని భావం)

విశేషాలు

1. మాతృ దేవః + భవ. 2. పితృదేవః + భవ.3..ఆచార్య దేవః +భవ. 4..అతిథి దేవః + భవ. ఇవి చదువులు పూర్తి చేసుకొని వెళ్లే విద్యార్థికి..ఈ విధంగా నడుచుకో ——అని గురువు వేద కాలంలో ఉపదే శించి పంపేవాడు.

ఇవి బహువ్రీహి సమాసాలు.

మాతృ దేవః ——అంటే తల్లియే దైవంగా కలవాడు. అని అర్థం. తల్లి దైవంతో సమానం—— అని కాదు.. .. మాతృ దేవః + భవ. అంటే తల్లి యే దైవంగా కలవానివిగా నడుచుకో ——అని అర్థం. ఇలాగే 2. పితృదేవః + భవ.3..ఆచార్య దేవః +భవ. 4..అతిథి దేవః + భవ. అనువాటికి అర్థాలు చెప్పుకోవాలి. .

కుత్సితో వా దరిద్రో వా పతితో వా బహిష్కృతః|
హీనసేవో యది పితా సేవ్యః పుత్రేణ ధీమతా || ౬౦

తన తండ్రి నిందించబడినప్పటికీ, పేదవాడయినప్పటికీ, పాపాత్ముడయినప్పటికీ, బహిష్కరించబడినప్పటికీ , హీనులచే సేవించబడుతున్నప్పటికీ కుమారుడు అవి పట్టించుకోకుండా సేవ చేయాలి.

61 -70

ఇతి స్మృతో వచో నైవ విస్మృతం గురుచోదితమ్ |
పితృతృప్తిం ప్రవక్తృభ్యో న ముఞ్చామి పదం మునే || ౬౧

ఆ విధంగా ఆధ్యాత్మిక గురువులు మన స్మృతులలో చెప్పిన మాటలను గుర్తుంచుకొన్నాను. వాటిని ఎప్పటికీ మర్చిపోలేదు.

ఓ పురుకుత్స మునీ ! అందుకే ఎటువంటివాడయినా తండ్రికి సంతృప్తిని కలిగించాలనే ప్రబోధాలను వదులుకోలేకపోతున్నాను.

స హి మే తాతపాదస్తు అద్య కాలవశం గతః |
కిం కుర్మ ఇతి చిన్తా మే ప్రాదురాసీన్మహామునే || ౬౨

ఓ పురుకుత్స మునీ ! అటువంటి నా తండ్రి ఈనాడు మరణించాడని తెలిసింది. నేను ఏమి చేయాలో తోచక ఆందోళన చెందుతున్నాను. 62.

పురుకుత్సః

గయాం గచ్ఛ మహాభాగ తథాఽస్థీని నిగృహ్య వై |
గదాధరః ప్రసన్నశ్చేత్ పితా తే ముచ్యతే కలేః || ౬౩

అప్పుడు పురుకుత్సుడు దత్తునితో ఇలా అన్నాడు

"నాయనా! మీ తండ్రి ఎముకలను తీసికొని గయకు వెళ్ళు. అక్కడ నీ తండ్రి శ్రాద్ధము పెట్టు. గదాధరుడు(గదను ధరించిన విష్ణువు) ప్రీతి చెందితే నీ తండ్రి సమస్త పాపములనుండి విడువబడుతాడు. "

తత్ర విద్వన్ గయాయాం వై శ్రాద్ధం కురు సమాహితః ।

గదాధరస్తు ప్రియతామితి వాచముదాహరన్ ।।౬౪

ఓ జ్ఞానీ! దత్తా ! గయలో శ్రాద్ధ కర్మను ఏకాగ్రతతో ఆచరించు.

గదాధరుడు ప్రియముచెందితే కోరికలు నెరవేరుతాయి. అని సంప్రదాయ వాక్యాలను పురుకుత్సుడు చెప్పాడు.

విశేషాలు

శ్రాద్ధం

శ్రద్ధతో చేయబడునది శ్రాద్ధము

ఇది పితృదేవతల తృప్తి కొరకు చేస్తారు. దీనిని కవ్యము అని కూడా అంటారు.

శ్రాద్ధము శుభకార్యములలో అశుభకార్యములలో చేస్తారు.

శుభకార్యములలో చేసేదానిని నాంది , అభ్యుదయము అంటారు.

అశుభశ్రాద్ధములు అనేకములు

1. ప్రేత శ్రాద్ధము. ఇది ప్రేత(మరణించినవాడు)తృప్తి కొరకు ప్రేతత్వ విముక్త్యర్థము చేసేది. ఇది నగ్ననవ ఏకోద్దిష్ట షోడశ సపిండీకరణ శ్రాద్ధములు అంటారు.

2. పైతృకశ్రాద్ధము. ఇది పితృదేవతల తృప్తి కొరకు చేయబడునది. పితృదేవతలు వసురుద్రాతిత్య రూపులుగా ఉంటారు. ఈ పైతృక శ్రాద్ధములలో పిండతర్పణములు కలిగినవి కొన్ని, లేనివి మఱికొన్ని.

కాశి, గయ, ప్రయాగ, కురుక్షేత్రము, గోకర్ణము, కురుజాంగలము, విశేషనదీతీర్థములు, పుష్కర క్షేత్రములు ఇవి శ్రాద్ధము పెట్టుటకు తగిన దేశములు. వీటిలో గయాశ్రాద్ధము మిక్కిలి విశేషము.

మృతాహము, అమావాస్య (సూర్యేందు సంగమదినము), అష్టకలు (మార్గశీర్షము మొదలు నాలుగుమాసములయందు బహుళాష్టమి), సంక్రమణదినములు, మహాలయపక్షము ఇవి ముఖ్యమయిన శ్రాద్ధకాలములు. మఱియు పుత్రజన్మాది వృద్ధియందును, శ్రుతాధ్యయన సంపన్నుఁడు అయిన బ్రాహ్మణ సంపత్తియందును, వ్యతీపాత మహావ్యతీపాత యోగములయందును, గ్రహణాది పుణ్యకాలముల యందును పితృశ్రాద్ధము చెప్పఁబడి ఉన్నది.

ఇవిగాక కామ్యశ్రాద్ధకాలములు అనేకములు ఉన్నవి.

వసిష్ఠః

తథేతి వచనం గృహ్య పురుకుత్సస్య వై మునేః

సభార్యయా విష్ణుదత్తో గయాం గన్తుం తథైచ్ఛత ।।౬౫

పురుకుత్స మహర్షి చెప్పిన మాటలను అంగీకరిస్తూ "అలాగే "అంటూ విష్ణుదత్తుడు తన భార్యతో గయకు వెళ్లాలని అనుకున్నాడు.

తత్రాన్తరే సుప్రసన్నా వాణీ వాణీయసీ నృప ।

కాప్యాసీదన్తరిక్షస్థా విష్ణుదత్తశుభావహా ||౬౬

ఇంతలో, ఓ రాజా!  చాలా ఆహ్లాదకరమైన ఒక  స్వరం   ఆకాశము నుండి  శుభమును చేకూర్చునదిగా  వినిపించింది.

యది తే పితరం ఘోరనరకాదుద్ధరిష్యతి |

ఇతో గచ్ఛ మహాభాగ ఘటికాచలముత్తమమ్ || ౬౭

"ఓ అదృష్టవంతుడా ! విష్ణుదత్తా! నీ తండ్రిని ఘోర నరకముల నుండి తప్పించాలంటే ఉత్తమమైన ఘటికాచలమునకు వెళ్ళు

యత్రాస్తే నృహరిస్సర్వాన్ ప్రణయన్నృషిసత్తమాన్ |

తస్యోత్తరోపత్యకాయాం శ్రీనృసింహసరస్తటే || ౬౮

నరహరిఆ ఘటికాచలములో నివసిస్తూ  గొప్ప ఋషులందరినీ ప్రేమిస్తాడు.

ఆ ఘటికాచలములోని ఉత్తర లోయలో ఉన్న శ్రీ నరసింహదేవ సరస్సు ఒడ్డున ఇంగుదీవనము ఉన్నది.  68

ఇఙ్గుదీనామథ వనం వర్ధితం తన్మహీపతే |

ఆవిర్భవన్తం నృహరిం స్వముక్త్యర్థమరిన్దమమ్ ||౬౯

అక్కడ ఇంగుదీ(గారచెట్ల) వనములో స్వయముగా జన్మించిన నరసింహుని'సేవించు.

శత్రువులను అణచివేసే స్వభావం కలిగిన నరహరి భక్తుల విముక్తి కోసం ప్రత్యక్షమవుతాడు.

వామదేవః-

స్వామిన్నిఙ్గుదిపార్శ్వే యముద్దిశ్య చ యః పుమాన్ || ౭౦

ఇదమూచే హరిం తత్ర వామదేవో మహామునిః |

పూర్వము వామదేవుడు, నరసింహుని ఇంగుదీ వనములో సేవించేవాడు.

ఒకసారి  మహా ఋషి వామదేవుడు శ్రీ హరితో ఈ విధంగా మాట్లాడాడు.

71 -80

కురుతే గురువిశ్వాసీ తస్య తత్తద్భవేద్ధరేః |

అస్మిన్ నృసింహక్షేత్రే యః కురుతే పితృతర్పణమ్ ||౭౧

గయాక్షేత్రాదభ్యధికం తస్యావిర్భవతాత్ ఫలమ్ |

ఒక వ్యక్తి తన ఆధ్యాత్మిక గురువుపై నమ్మకంతో ఏమి చేసినా, అది అతనికి దేవోత్తమ పురుషునిచే వెంటనే అనుగ్రహించబడుతుంది ఈ నరసింహ క్షేత్రమయిన ఘటికాచలములో పితృ కర్మలు చేసినవారు, గయాక్షేత్రములో చేసిన కర్మఫలము కంటె అధిక ఫలమును పొందాలి'' అని వామదేవుడు నృసింహుని ప్రార్థించాడు.

శ్రీభగవానువాచ -

ఆరభ్య హేమకోటిం మే పరితో యోజనాపదమ్ ||౭౨.

మత్క్షేత్రం భవితా బ్రహ్మన్ భుక్తిముక్తిఫలప్రదమ్ |

ఓ బ్రహ్మ జ్ఞానము కలిగినవాడా ! హేమకోటి విమానముతో ప్రారంభించి, నా చుట్టూ ఎనిమిది మైళ్ళవరకు ఇది నా పవిత్ర స్థలం, భుక్తి ముక్తులను ఈ ఘటికాచలం అనుగ్రహిస్తుంది.

యస్త్వత్ర కురుతే శ్రాద్ధం పితౄనుద్దిశ్య వా మునే ||౭౩

ఫలం తస్య మహాభాగ గయాతో ద్విగుణం భవేత్ |

నా అనుగ్రహముతో ఈ క్షేత్రములో సిత్ృకార్యములు చేస్తే నువ్వు కోరినట్లుగా గయ కంటే రెట్టింపు ఫలితాన్ని పొందుతారు.

ఇదమత్ర సరో బ్రహ్మన్ మమాఙ్గుష్ఠపరిచ్యుతమ్ ||౭౪

భాగీరథీ జలమితి అవైహి తపతాం వర |

ఓ సన్యాసులలో శ్రేష్ఠుడా! నా అంగుష్ఠము(బొటనవ్రేలు) నుండి పుట్టిన ఈ సరోవర జలము గంగతో సమానమైనది.

ఇహ యస్తనుతే దానం బ్రాహ్మణేభ్యో యథా బలమ్ ||౭౫

స మమానుగ్రహాజ్జీవన్ముక్తో భవతి తాపస |

ఇచ్చట చేయు దానాదులు బ్రాహ్మణులకు రెండింతలు ఫలితాన్ని ఇస్తాయి.

ఓ తపస్వీ. అలా దానము చేసేవాడు నా దయ వలన జీవన్ముక్తి పొందుతాడు.

వసిష్ఠః -

తదాऽశరీరవాక్యం వై శ్రుత్వా హర్షాకులేన్ద్రియః ||౭౬

అలా అశరీర వాణి మాటలు విన్న విష్ణుదత్తుడు చాలా సంతోషపడ్డాడు.

వాక్యమేతద్ధి నృహరేర్భవేదితి తదూచివాన్ |

విష్ణుదత్తస్సపత్నీకో వచనం గృహ్య నాభసమ్ ||౭౭

ఈ ఆకాశవాణి మాటలు నృహరి మాటలే అని విష్ణుదత్తుడు అనుకున్నాడు.

విష్ణుదత్తుడు  మరియు అతని భార్య ఆ  ఆకాశవాణి మాటను స్వీకరించారు.

ఇహావతీర్య వై శ్రాద్ధం కారయామాస భక్తిమాన్ ।
ఏతస్మిన్నిఙ్గుదీమూలే క్షేత్రే నరహరేరహమ్ ॥౭౮
ఇక్కడ దిగిన తర్వాత, విష్ణుదత్తుడు శ్రాద్ధ కర్మను నిర్వహించాడు.
ఈ గారచెట్టు మూలంలో  నరహరిని ప్రార్థించాడు.

పితౄణాం కరవై శ్రాద్ధం నృసింహః ప్రియతామయమ్ ।
ఇతి మన్త్రం ద్విరుచ్చార్య శ్రద్ధయా పితృతర్పణమ్ ॥౭౯
పూర్వీకులు చేసే శ్రాద్ధ కర్మ భగవానుడు నృసింహదేవునికి ఆనందాన్ని కలిగిస్తుంది.
ఈ మంత్ర పూర్వకమైన మాటలను  రెండుసార్లు పలిస్తే, విశ్వాసంతో పూర్వీకులకు సంతృప్తి లభిస్తుంది.

ప్రకుర్వన్తి తదా విప్ర ప్రసన్నాః పితృదేవతాః ।
పితః -
శ్రాద్ధేనానేన తే విప్ర తృప్తాస్మస్సర్వదా వయమ్ ॥౮౦
వెంటనే విష్ణుదత్తుని పితృదేవతలు ప్రత్యక్షమై "నాయనా! నీ శ్రాద్ధకర్మతో మేము తృప్తి పడ్డాము.

కిమీప్సితం తవేదానీం తన్నో వద మహామతే ।
ఓ మహా మతీ ! నీకేమి కావలయునో తెలుపుము

విష్ణుదత్తః
భవన్తో మే ప్రసన్నాశ్చేత్ తృప్తా వా హృదయంగమాః ॥౮౧
పితరం నరకామ్భోధేః ద్రుతముద్ధర తం చ మే ।
విష్ణుదత్తుడు "మీరు తృప్తి పడినచో  నా తండ్రిని నరకమునుండి వెంటనే ఉద్దరించండి" అని ప్రార్థించాడు.

పితరః

యదా త్వయా పితృశ్రాద్ధం కర్తవ్యమితి చిన్తయా ||౮౨

ప్రాప్తమేతత్ పదం తావత్ ప్రాప్తో విష్ణుపదం పితా |

పితృదేవతలు ఇలా అన్నారు.  "నీవెప్పుడు పితృశ్రాద్ధ కార్యము కొరకు  ఈ క్షేత్రమునకు వచ్చావో అప్పుడే  నీ తండ్రి తరించాడు.

యస్త్వయం దేశముద్దిశ్య కురుతేఽన్యత్ర పైతృకమ్ ||౮౩

తస్య వై పితరస్తృప్తాః ప్రయచ్ఛన్తి మనీషితమ్ |

ఈ ఘటికాచల క్షేత్రాన్ని తలచుకొని వేరేచోట శ్రాద్ధ  కర్మలను నిర్వహించేవాని  పితరులు సంతృప్తి చెంది, అతను కోరుకున్నది ఇస్తారు.

దీర్ఘాయుర్భవ భద్రం తే బహుపుత్రా భవన్తు తే ||౮౪

భక్తిశ్చ వైష్ణవీ నిత్యా ప్రాదురేష్యతి బ్రాహ్మణ |

నీవు దీర్ఘాయుష్మంతుడవై పుత్రవంతుడవై సుఖిస్తావు.

ఓ బ్రాహ్మణా! విష్ణువు పట్ల నీ  భక్తి ఎల్లప్పుడూ ఉండుగాక !

వసిష్ఠః -

ఇత్యుక్త్వా పితరస్తత్ర వరం దత్త్వా చ వాఞ్ఛితమ్ ||౮౫

పితృలోకం గతాస్సర్వే మిషతి బ్రాహ్మణే నృప |

ఓ రాజా,! ఇలా చెప్పి విష్ణుదత్తుని తండ్రులు అతనికి కావలసిన వరం ఇచ్చారు

వారందరూ అతనిని ఆశీర్వదించి పితృలోకానికి వెళ్లిపోయారు.

గతేషు తేషు ధర్మాత్మా విప్రో హృష్టమనాస్తదా ||౮౬

పిణ్డాపాకసశేషం వై భుక్తవాన్ భార్యయా సహ |

పితృప్రసాదాన్నృహరేః ప్రసాదేన చ భూపతే ||౮౭

విష్ణుదత్తుడు సంతోషముతో శ్రాద్ధములోని  పితృ ప్రసాదమును భార్యతో  స్వీకరించాడు.

పితృ ప్రసాదము(పితృదేవతలకు  నివేదించిన అన్నము) మరియు నృసింహుని ప్రసాదము(దయ) అతడు పొందాడు.

సుతద్వయం ప్రలేభేఽథ స్వానురూపం ద్విజస్తథా |

అచిరేణైవ కాలేన భుక్త్వా భోగాననుత్తమాన్ ||౮౮

విష్ణుదత్తుడు తనకు తగిన ఇరువురు కుమారులను పొందాడు..

తక్కువ సమయంలోనే విష్ణుదత్తుడు అద్భుతమైన ఆనందాలను అనుభవించాడు

అథ ప్రసాదాన్నృహరేరునతం పదమేయివాన్ ।

తస్య వంశభవో యోగీ తపసా విప్రశేఖరః ||౮౯

సకల భోగ భాగ్యములను అనుభవించిన తరువాత  విష్ణుదత్తుడు నరసింహమోక్షాన్ని  పొందాడు.

ఆ విష్ణుదత్తుని వంశమున విప్రశేఖరుడను యోగి జన్మించాడు.

.

పిత్రానుద్ధర్తుకామోఽయం భగీరథ ఇవోదితః ।

అస్మిన్ వరాహసరసి తపస్తపతి దారుణమ్ ||౧౦

ఇప్పుడు అతడు వరాహ తీర్థము వద్ద తన పితరులను ఉద్ధరించుటకు   భగీరథునిలా   తీవ్రమయిన తపస్సు చేయుచున్నాడు

**91 - 100**

ప్రసాదకాఙ్క్షీ నృహరేర్దీర్ఘకాలమతన్ద్రితః ।

పుఞ్జికస్తాదయో రాజన్ బభూవుః ప్రపితామహాః | | ౯౧

వరాహ తీర్థము వద్ద  పితరులను ఉద్ధరించుటకు  నరసింహ అనుగ్రహమును కోరి ఆ విప్రశేఖరుడు శ్రద్ధతో తపస్సు చేయుచున్నాడు

ఇతని పూర్వీకులు పుంజికుడు మొదలయినవారు మూర్ఖ ప్రవృత్తి కలిగినవారై ఉన్నారు.

పురాస్య దుర్విదగ్ధాస్తే కర్మణా ప్రవినిన్దితాః ।

ఆచార్యద్రోహిణో నిత్యం దేవతాయాం తథా గురౌ ||౯౨

పుంజికుడు మొదలయినవారు కర్మబాహ్యులుగా,( కర్మ మార్గాన్ని నమ్మక, దానిని దూషించువారు) గురువును దూషిస్తూ  దేవతలను నిందించేవారు.

సత్సు కర్మసు విశ్లేషం దుర్విదగ్ధాః ప్రకుర్వతే ।

గర్వితాస్సజ్జనైర్నిన్ద్యాస్సన్ధ్యాకర్మనిరాదరాః ||౯౩

మంచి చర్యలను విశ్లేషించడంలో  తమకే తెలుసునని పుంజికుడు మొదలయినవారు గర్వంగా ఉన్నారు. మరియు ధర్మబద్ధమైన సంధ్యావందన కార్యక్రమములను దూషించేవారు.

.

సాదరా పిశునే మన్త్రే తథాన్యస్త్రీపరిగ్రహే ।

దుర్వినీతిం తతస్తేషాం శ్రుత్వా బ్రహ్మర్షయస్తథా | | ౯౪

దుష్టులై  , పరస్త్రీ వ్యామోహపరులై పుంజికుడు మొదలయినవారు ప్రవర్తిస్తుండగా, వారి దుష్ప్రవర్తనా చర్యలను బ్రహ్మర్షులు విన్నారు.

ప్రకోపస్ఫురితోష్ఠాస్తు తేషు చక్రుర్బహిష్క్రియామ్ ।
ప్రక్షీణతేజసోఽభూవన్తద్య తే బ్రహ్మబన్ధవః ॥ ౯౫

పుంజికుల దుష్ట ప్రవర్తనకు కోపంతో బ్రహ్మర్షుల పెదవులు వణికిపోయాయి. కోపముతో వాళ్ళను వెడలగొట్టారు. ఋషుల కోపముతో మరియు వారు తమను వారి నుండి దూరం చేసుకోవడం ప్రారంభించారు.కర్మహీనులైన బ్రాహ్మణులయిన ( బ్రహ్మ బంధువులు) పుంజికులు తేజస్సు కోల్పోయారు.95

న తేషాం వచనగ్రాహీ భర్తాపి న తథాభవత్ ।
క్రమేణ తే బహిష్కార భారపీడామసాసహా: ॥౯౬

వారి పెద్దల మాటను నమ్మలేదు, అలాగే వారి బాటను కూడా నమ్మలేదు.
ఋషులఃఏ వెలివేయబడుటచే పుంజికులు బాధలు పడ్డారు.

ఉత్సృజ్య చ శరీరన్తే పిశాచాః ప్రబభూవిరే।
న క్రోష్టా తేన వా కఙ్కా శ్వాపదా వా న వా శశాః । ౯౭

క్రమేణా వారు మరణించి పిశాచములయ్యారు. బాధలతో పుంజికులు శరీరాలను విడిచిపెట్టారు.
వారి పార్థివదేహాలను( మట్టితో సమానమైన దేహాలను) నక్కలు, రాబందులు, కుక్కలు చివరికి కుందేళ్ళు కూడా ముట్ట లేదు. 97

లేఢుమఙ్గాని తేషాం వై న కాకా న మరీచయః ।
కీటవన్తి శరీరాణి బహుకాలాత్ ప్రతీక్ష్య వై । ॥౯౮

వాళ్ళ శవాలను నాకడానికి కాకులు ఇష్టపడలేదు. సూర్య కిరణాలు కూడా స్పృశింపలేదు.
చాలాకాలం తర్వాత, పుంజికుల శరీరాలు పురుగులు పట్టాయి. 98॥

పూతిగన్ధాసహా: కేచిన్మునయోఽన్యత్ర సంస్థితాః ।
అఙ్గాని తేషాం దృష్ట్వా వై కుదుర్గన్ధాని కేచన । ౯౯

ఆ పుంజికుల శవాల నుండి వచ్చు చీము వాసనను(దుర్వాసనను) భరించలేని కొంతమంది ఋషులు ఆ ప్రదేశాన్ని విడిచి వేరే చోట స్థిరపడ్డారు. 99

భస్మీభవత్వితి తదా శేపుర్గృహ్య జలం కరే ।
గతిమన్వేషయన్ తేషాం సతామనుమతాం తథా ।। ౧౦౦

దుర్గంధ భూయిష్ఠములైన వారి శరీరములను చూచి కొందరు మహర్షులు కొందరు తమ చేతుల్లోకి నీళ్ళు తీసుకుని ఆ పుంజికుల శవాలను భస్మమై పోవుగాక అని శపించారు.

దీనికోసం వారు తమ సద్గురువుల అనుమతిని తీసుకొన్నారు. . 100

101 -110

ప్రబోధితస్తు మనునా విన్ధ్యే తేపే తపః పరమ్ ।

పదే పదే నమస్కుర్వన్ దేవలో నామ వైష్ణవాన్ ॥ ౧౦౧

మనువు చేత ప్రబోధింపబడిన పుంజికుల కుమారుడైన దేవలుడు అనే విష్ణుభక్తుడు అడుగడుగునా నమస్కరిస్తూ , తన పితరుల ఆత్మ శాంతికై వింధ్యపర్వతములో తీవ్రమైన తపస్సు చేసాడు.. 101

తానుద్ధర్తుమశక్తో వై తపసా కాలమేయివాన్ ।

తస్యాయం ప్రథమః పుత్రో విశ్రుతో విప్రశేఖరః ॥ ౧౦౨

విష్ణుభక్తివిశుద్ధాత్మా సర్వేషాం ప్రియకారకః ।

కాని దేవలుడు పుంజికులను ఉద్ధరించుటకు, విష్ణులోకములను చేర్చుటకు చేసిన ప్రయాస అంతా వృధా అయ్యెను.

దేవలుని మొదటి కుమారుని పేరు విప్రశేఖరుడు. 102 -

అతడు విష్ణువు పట్ల స్వచ్ఛమైన భక్తి కలవాడు. మరియు అందరినీ సంతోషపెట్టే స్వభావం కలవాడు.

అగస్త్యభ్రాతృవచనాదేత్య వల్లీసరస్తటే ॥౧౦౩

పితౄనుద్ధర్తుచేతాస్తు తపశ్చరతి దారుణమ్ ।

విష్ణుభక్తో జితక్రోధో జితారాతిజితేన్ద్రియః ॥౧౦౪

అగస్త్య భ్రాత మాట మేరకు, ఆ విప్రశేఖరుడు వల్లీ సరస్సు(వరాహ సరస్సు ) ఒడ్డుకు వచ్చాడు.

తన పితరులను రక్షించాలనే కోరికతో, అతను తీవ్రమైన తపస్సు చేసాడు.

అతను విష్ణు భక్తుడు. కోపాన్ని జయించినవాడు. ఇంద్రియాలను జయించినవాడు.

**విశేషాలు**

అగస్త్య భ్రాత

అగస్త్య భ్రాత అంటే ఊరు-పేరు లేనివాడు.నిజానికి ఇతను అగస్త్యుని సహోదరుడు. ఇతనికి గర్భమునందే జ్ఞానము కలిగినందున ఇతనికి వ్యవహారనామము లేదు. పేరుచేత తెలిసికోదగనివానిని అగస్త్యభ్రాత అంటారు.

సానుక్రోశో విష్ణుభక్తాన్ దణ్డవత్ప్రణమంస్తదా ।
మహాప్రదక్షిణం శైలరాజస్య తనుతే నృప ॥ ౧౦౫
విప్రశేఖరుడు  కష్టాల్లో ఉన్నవారిని చూసి కరుణతో కదిలేవాడు.  , అతను విష్ణు భక్తులకు సాష్టాంగనమస్కారము చేసే స్వభావం కలిగినవాడు. . ఓ రాజా ! అతడు  పర్వతరాజము చుట్టూ  ప్రదక్షిణ చేసేవాడు. 105

తథాన్తరం చ ధర్మాత్మా కాలే కాలేఽప్యతన్ద్రితః ।
దినే దినే శైలరాజారోహణవ్యావృతాత్మనామ్ । । ౧౦౬
మహాత్మానాం శ్రమహరో వ్యజనాదినిషేవనాత్ ।
విప్రశేఖరుడు దాన ధర్మములను చేసేవాడు. మూడు సంధ్యలలోను  నృసింహ ధ్యానము చేసేవాడు.
ప్రతిరోజు కొండ ఎక్కుటచే శ్రమపడు భక్తుల శ్రమను పొగొట్టటానికి విసనకర్రలతో విసిరేవాడు.

మార్గస్య శోధనవిధౌ వ్యాకులో నృపసత్తమ ॥ ౧౦౭
భక్తుల ఇబ్బంది తొలగించటానికి  ప్రతిరోజు  పర్వతారోహణ మార్గమును విప్రశేఖరుడు శుభ్రం చేసేవాడు.

స్థిత్వాత్ర భార్యయా యుక్తో ప్రదదౌ చ ఫలాదికమ్ ।
సప్తర్షీశ్చ ప్రతిదినం యథాశక్తి ప్రతోషయన్ ॥౧౦౮
విప్రశేఖరుడు తన భార్యతో ఇక్కడే కొండ ప్రాంతములో  ఉండి పండ్లు మరియు ఇతర వస్తువులను అవసరమయినవారికి దానము చేసేవాడు.
ఆ సప్తర్షులకు కూడా ప్రతిరోజూ యథాశక్తిగా సేవచేసి సంతృప్తి పరిచేవాడు.

**విశేషాలు**

**సప్తర్షులు**

మరీచి, అంగిరసుడు, పులహుడు, వసిష్ఠుడు, అత్రి, పులస్త్యుడు, క్రతువు అనువారు. (ఒక పట్టిక)
కశ్యపుడు, అత్రి, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, జమదగ్ని, వసిష్ఠుడు (రెండవ పట్టిక)

మహాత్మానో విష్ణుభక్తాన్ హనూమత్పురనిష్ఠితాన్।
దినం దినం నమస్కుర్వన్ వర్ధతే తత్కృతాశిషా ॥ ౧౦౯
హనుమంతుని నగరంలో  నివసించే  మహాత్ములయిన విష్ణు భక్తులకు దినదినము ఆ విప్రశేఖరుడు నమస్కరించేవాడు.వారిచే ఆశీర్వదించబడేవాడు. 109 –

త్రిసన్ధ్యం ప్రజపన్నిత్యం నృహరౌ ధ్యానతత్పరః ।

భార్యయా సహ విస్రబ్ధం స్తువన్నర్చన్ పితుః ప్రియః ।। ౧౧౦

విప్రశేఖరుడు హేమకోటి విమానంలో వేంచేసి ఉన్న  శ్రీయోగనరసింహస్వామిని త్రి సంధ్యలలో  తన వాక్కులతో స్తుతించేవాడు.

శ్రీనరసింహస్వామి అతని సేవలకు, స్తుతికి సంతోషించి అతని వంశంలోని పూర్వులకు మోక్షాన్ని ఇచ్చాడు.

(విప్రశేఖరుడు చేసిన ఈ పవిత్రమయిన  స్తోత్రము పూర్వము ప్రహ్లాదుడు చేసినది. పూర్వము ప్రహ్లాదుని అతని తండ్రి హింసింప బూని నడి సముద్రమున ముంచాడు. ఆ సమయంలో  నృసింహుడు ప్రహ్లాదునికి  ఈ స్తోత్రము చెప్పాడు, . దీనిని జపించి ప్రహ్లాదుడు సముద్రమునుండి బయటపడి తండ్రి వద్దకు చేరాడు. . ఆ నృసింహుని ఏకవింశోత్తర నామ స్తోత్రమును విప్రశేఖరుడు కూడా ఈ విధముగా గానం చేసాడు)

. నృసింహుని ఏకవింశోత్తర నామ స్తోత్రము

హేమకోటివిమానస్థం జానున్యస్తప్రకోష్టకమ్ ।

శఙ్ఖచక్రధరం పీతవాసోద్భాసికటీతటమ్ ।। ।౧౧౧

పెద్దకొండపై శ్రీ నరసింహస్వామి గర్భాలయమునకుపైన కట్టబడినవిమానమునకు(గర్భగుడిపై గల గోపురము) హేమకోటి విమానము అని పేరు.ఆ హేమకోటి విమానములో మోకాళ్లపై ముంజేతులను  ఉంచి కూర్చుని ఉన్నవానిని, ( యోగాసనంలో కూర్చున్నవానిని),

శంఖం, చక్రం ధరించినవానిని,  నడుముపై  మెరిసే పసుపు రంగు వస్త్రాన్ని ధరించిన నరసింహస్వామిని సేవిస్తాను. 111.

యోగాసనే సమాసీనం కిరీటినమనామయమ్ ।

దూర్వానీలోత్పలవనశ్యామలం కోమలాకృతిమ్ ।। ౧౧౨

కిరీటం ధరించినవానిని, యోగాసనంపై కూర్చుని ఆరోగ్యంగా ఉన్నవానిని.

మృదువయిన రూపము కలవానిని,  గరిక మరియు నల్లని కలువల వనంలా శ్యామల వర్ణంతో ఉన్న నరసింహస్వామిని సేవిస్తాను

ప్రసన్నవదనం లక్ష్మీభాసితోరస్కముజ్వలమ్ ।

నతమర్త్యప్రసన్నార్తిహరిణం వనమాలినమ్ ।।౧౧౩

ఉల్లాసంగా, నిర్మలంగా ఉన్న ముఖం కలవానిని,   లక్ష్మీ తేజస్సుతో ప్రకాశించు ఉరము కలవానిని, ప్రకాశించువానిని

నమస్కరించు మానవులు కలవానిని, దుఃఖపడే  జింకలకు ఆనందము ఇచ్చువానిని, వనమాల కలిగిన నరసింహస్వామిని సేవిస్తాను.

**విశేషాలు**

వనమాల అనగా

1. మోకాళ్లవరకు వ్రేళ్లాడుతూ, అన్ని ఋతువులలోనూ పూచే పూలతో, మధ్యన పెద్ద గుచ్ఛంతో విష్ణు మూర్తి మెడలో ఉండే దండ.
2. పంచతన్మాత్రలకు రూపమైన దండ.
3. చివురుటాకులు, పూలు కూర్చిన దండ.
4. శివ కేశవ భేదం లేని దండ.

శ్రీవత్సకౌస్తుభధరం చన్ద్రసూర్యవిలోచనమ్ ।
సింహస్కన్ధం సింహముఖం ప్రహ్లాదప్రియకారిణమ్ ॥౧౧౪
శ్రీవత్సం మరియు కౌస్తుభ రత్నాలను ధరించినవానిని, చంద్రుడు మరియు సూర్యుని వంటి కళ్ళు కలిగి ఉన్నవానిని, సింహము వంటి  భుజాలు కలవానిని, సింహ ముఖం కలిగిన వానిని,  ప్రహ్లాదుని సంతోషమునకు కారణమయినవానిని నరసింహస్వామిని సేవిస్తాను.

దానవేన్ద్రవిభేత్తారం కర్తారం జగతామపి ।
గోప్తారం చ తదా విష్ణుం ప్రణతారమనిన్దితమ్ । । ౧౧౫
రాక్షస రాజులను నాశనం చేసేవానిని,  విశ్వ సృష్టికర్తను
రక్షకుని, నిందింపబడనివారిచే నమస్కరించబడువానిని శ్రీమహావిష్ణుస్వరూపమయిన నరసింహస్వామిని సేవిస్తాను.

దంష్ట్రిణం తం కేసరిణం నరకేసరిణం విభుమ్ ।
సప్తర్షివన్దితం భీమం గదాధరమధీశ్వరమ్ ॥౧౧౬
కోరపల్లు కలవానిని, మెడమీది వెంద్రుకలు ( జూలు)కల సింహము వంటివానిని, మానవ శ్రేష్ఠుని, సర్వశక్తిమంతుడయిన ప్రభువుని సప్తర్షులచే పూజించబడినవానిని, భయంకరమైనవానిని, కౌమోదకి అను  గదను ధరించినవానిని,  సమస్తసామంతులచేత సేవింపబడు చక్రవర్తిఅయిన నరసింహస్వామిని సేవిస్తాను.

వ్యక్తాననం మహోరస్కం జ్వాలామాలావిభూషణమ్ ।
షట్కోణమధ్యనిలయమున్నతశ్రుతిముద్ధరమ్ ॥౧౧౭
స్పష్టమైన( సాంఖ్యమతములో స్థూల ప్రకృతి) ముఖం కలవానిని, చాలా విశాలమైన ఛాతీ కలవానిని, అగ్నిలోకము ఆభరణముగా కలవానిని, షట్కోణముల మధ్య బిందువులో నివాసమున్నవానిని, వేదాలను ఉద్ధరించిన నరసింహస్వామిని సేవిస్తాను.

**విశేషాలు**

1. తొమ్మిదవ అధ్యాయములో ‘‘ఋతుకోణస్య మధ్యే తు బైన్దవం స్థానముచ్యతే ।‘‘ అనుశ్లోకములో  కూడా ఈ బిందు షట్కోణ ప్రస్తావన ఉన్నది.

షట్కోణము అనగా ఆరు కోణములు గలది.  శ్రీచక్రంలో ప్రధానమైనది బిందువు. ఇది తొమ్మిదవ ఆవరణ అయిన సర్వానందమయ చక్రం. ఇక్కడ శివశక్తులు విహరిస్తూ ఉంటాయి. 'యోగినీ హృదయంలో త్రికోణంలో బిందువున్నదని చెప్పబడింది. పరావశ్యంతులు బిందుత్రికోణాలుగా ఉన్నాయి "త్రికోణరూపిణీ శక్తి: బిందురూప పరశ్శివ: "  ఘటికాచల మాహాత్మ్యంలో శివునికి బదులు నరసింహ నామము శ్రీ చక్రార్చనలో వాడబడినది.

కౌళాచార సంప్రదాయంలో బిందువు త్రికోణంలో ఉంటుంది కాని సమయమతానుసారము బిందువు చతుష్కోణము లేదా షట్కోణములో ఉంటుంది.ఈ రకంగా భిన్న వాదనలున్నాయి.

2. శ్రుతిముద్ధరమ్(వేదాలను ఉద్ధరించిన)

ప్రళయం తరవాత పరమేష్ఠి సృష్టి కార్యానికి యత్నించబోయి వేదాలు అపహరణకు గురయ్యాయని తెలుసుకొని శ్రీమహావిష్ణువును ప్రార్థించాడు. వేదాలను అపహరించిన సోమకుడనే రాక్షసుడు మహా సముద్ర గర్భంలోకి చొచ్చుకుపోయాడు. విష్ణువు మహా మత్స్య రూపంలో జలనిధిని అన్వేషించాడు. సోమక, మత్స్యాలకు పోరుసాగింది. చివరకు నారాయణుడు రాక్షసుడి ఉదరాన్ని చీల్చి వేదాలను, దక్షిణావర్త శంఖాన్ని బ్రహ్మ వద్దకు తెచ్చాడు. వేదాలను విధాతకు అప్పగించి, శంఖాన్ని తాను గ్రహించాడు.

సోమకుడు మింగడం వల్ల శిథిలమైన వేదభాగాలను బ్రహ్మను పూరించమని చెప్పాడు.

వేదాలను అపహరించడమంటే జ్ఞాన ప్రకాశాన్ని అదృశ్యం చేయాలనే యత్నం. రాక్షస నాశనంతో సృష్టికార్య ప్రతిబంధరూపమైన నిద్రారూప తమస్సు అంతరిస్తుంది. బ్రహ్మ సహజ స్వరూపాన్ని పొందుతాడు. పరబ్రహ్మ చైతన్యాత్మ సర్వవ్యాపకమని, విశ్వంలో కనిపించే తేజమే పరమాత్మ స్ఫురణమని గ్రహించాలి.( డాక్టర్ దామెర వేంకట సూర్యారావు)

ఉదగ్రనాసముచ్చణ్డకాలముత్తమమస్తకమ్ ।
వామదేవాదిబ్రహ్మర్షిసేవితం శివసేవితమ్ ॥౧౧౮

ఉన్నతమైన, పొడవైన ముక్కుకలిగిన వానిని ఆగ్రహము గల ఉత్తమమయిన తల కలిగినవానిని,
వామదేవుడు మొదలయిన బ్రహ్మర్షులు సేవించువానిని, శివుడు సేవించువానిని నరసింహస్వామిని సేవిస్తాను.

సర్వకామప్రదం వ్యక్తమవ్యక్తం పురుషోత్తమమ్ ।
సింహగామినమీశానం నిధిమచ్యుతమవ్యయమ్ ॥౧౧౯

అన్ని కోరికలను ప్రసాదించువానిని, వ్యక్తమైన(స్పష్టమైన రూపము కలవానిని) మరియు అవ్యక్తమైన( స్పష్టమైన రూపము లేని) పరమాత్ముని సింహంగా నడిచేవానిని, ప్రభువుని, దయకు తరగని నిధిఅయినవానిని, నాశము లేనివానిని, శాశ్వత మైన బ్రహ్మపదార్థ స్వరూపుని నరసింహస్వామిని సేవిస్తాను

విశేషాలు

అమ్మవారికి కూడా వ్యక్తావ్యక్త స్వరూపిణీ అని లలితాసహస్ర నామం ఉన్నది.(399) ఈ నామానికి పెద్దల వ్యాఖ్యానం ఇది

వ్యక్త = వ్యక్తమైన, అవ్యక్త = అవ్యక్తమైన అన్నిటి యొక్క, స్వరూపిణి = స్వరూపముగా నున్నది.

వ్యక్తమైన దాన్ని 'కార్యం' అని, వ్యక్తం కాకుండా ఉన్నదాన్ని 'కారణం' అనీ అంటారు. ఈ రెంటినీ - "వ్యక్తం సర్వముమారూపం, అవ్యక్తంతు మహేశ్వరః'''' అని వ్యవహరిస్తారు. అంటే వ్యక్తమైందల్లా అమ్మవారు, వ్యక్తం కానిదల్లా అయ్యవారు — అని ఈ శ్లోకపాదాలకు అర్థం.

కళ్ళకు కనబడే 'పంచదార' - దాని వ్యక్త స్వరూపం అవుతుంది. కాని, దాంట్లో గుప్తంగా వుండే $C_{12}$, $H_{22}$ $O_{11}$ అంటే, 12 కర్బన పరమాణువులు, 22 ఉదజని పరమాణువులు, 11 ఆమ్లజనీ పరమాణువులు కళ్ళకు కనబడవు కాబట్టి అవ్యక్త స్థితికి చెందినవవుతాయి.

'ఒకే పదార్థంలో, వ్యక్త కార్యంగాను, అవ్యక్త కారణంగాను ఉండునది' అని ఈ నామానికి అర్థం.
దీనినే నరసింహ స్వామికి కూడా అన్వయించుకోవాలి.

పిఙ్గలాక్షం పృథుగ్రీవం విమలం స్తమ్భసంభవమ్ ।
ముక్తిదం భుక్తిదం శాన్తం దాన్తమానన్దకన్దలమ్ ||౧౨౦

గోరోజనమువంటి(పశువుల పిత్తరసమునుండి తీయబడిన ఒకానొక పసుపు పచ్చని పదార్థము)  రంగు కళ్ళు కలవానిని,  పొడవయిన  మెడ కలవానిని, స్వచ్ఛమైనవానిని, స్తంభములోనుంచి పుట్టినవానిని ,

'భుక్తి ముక్తులు ఇచ్చే వానిని , శాంతి కలవానిని, తపఃక్లేశము నోర్చువానిని ,  ఆనందపు నవాంకురమైన నరసింహస్వామిని సేవిస్తాను

**విశేషాలు**

'భుక్తి ముక్తులు' అనే మాట 'భోగం-మోక్షం' అని అర్థాలను తెలియజేస్తుంది. ఇహలోకంలో భోగం. జీవునికీ అంతిమ ప్రయోజనం మోక్షం. రెండింటినీ దైవం ప్రదానం చేస్తున్నాడు. స్తోత్రాదులు అనుష్ఠానం వల్ల ఈ రెండూ కలగాలని ఋషుల భావన.

'భుక్తి' కర్మానుభవం. 'ముక్తి' కర్మబంధనం నుండి విమోచనం. ఈ రెండింటినీ తెలియజేసే పదాలివి.

**121  -130**

మన్దారమాలాభరణమష్టబాహుం మహోదరమ్ ।
సనకాదినుతం దేవం రాజపూజితమీశ్వరమ్ ||౧౨౧

మందార పూల మాలతో  అలంకరించబడినవానిని,  ఎనిమిది చేతులుకలవానిని, పెద్ద ఉదరం కలిగినవానిని
సనకుడు మొదలయినవారు  పూజించే దేవుని, రాజులు పూజించే దేవుని, ఈశ్వరుని  నరసింహస్వామిని సేవిస్తాను.

సూర్యకోటిప్రతీకాశం చన్ద్రకోటిసమద్యుతిమ్ ।
శృఙ్గకోటిమహాశైలవాసినం హృదివాసినమ్ ||౧౨౨

లక్షలాది సూర్యులంత ప్రకాశవంతంగా, లక్షలాది చంద్రులంత ప్రకాశవంతంగా ఉన్న దేవుని
అనేక  గొప్ప పర్వతాల శిఖరాలలో నివసించువానిని,  హృదయాలలో  నివసించువానిని నరసింహస్వామిని సేవిస్తాను.

హనుమద్వన్దితం లోకశఙ్కరం శఙ్కరప్రియమ్ ।
భక్తార్చితం యథాభక్తిదాయినం శుభదాయినమ్ ||౧౨౩

హనుమంతునిచే నమస్కరింపబడినవానిని, లోకానికి మేలు కలిగించువానిని, శివునికి ప్రియమైనవానిని,
భక్తులచే పూజించబడువానిని, భక్తులు ఎంత భక్తిని చూపిస్తారో అంతగా అనుగ్రహించువానిని,  శుభాన్ని ప్రసాదించువానిని నరసింహస్వామిని సేవిస్తాను.

.

సటాలఙ్కృతమవ్యగ్రముగ్రశాసనముద్ధతమ్ ।

విస్తీర్ణవదనం దీనరక్షకం సురరక్షకమ్ ॥ ౧౨౪

వెంట్రుకలు అతుక్కొను జూలుతో అలంకరించబడినవానిని, క్షోభించనివానిని( ఆతురత లేనివానిని) , భయంకరమైన పాలన కలిగినవానిని, గురువులవద్ద శిక్ష పొందనివానిని

విశాలమైన ముఖం కలిగి ఉన్నవానిని, దీనులను రక్షించువానిని, దేవతలను రక్షించువానిని నరసింహస్వామిని సేవిస్తాను.

జపాకుసుమవర్ణాభం హేమయజ్ఞోపవీతినమ్ ।

ధృతహేమకటీసూత్రం హేమాఙ్గం హేమకుణ్డలమ్ ॥౧౨౫

జపా పుష్పము వలె( లోధ్రపుష్పము. దాసనము) ప్రకాశవంతమైనవానిని, బంగారపు యజ్ఞోపవీతము కలవానిని.

బంగారపు నడుము కట్టు కలవానిని, , బంగారపు అవయవాలు కలవానిని, బంగారు చెవిపోగులు ధరించినవానిని నరసింహస్వామిని సేవిస్తాను.

**విశేషాలు**

యజ్ఞోపవీతము అనగా జందెం. వైదిక కర్మాచరణకు అర్హత కలిగిస్తుంది కనుక యజ్ఞ సూత్రం. వేదాధ్యయన యోగ్యత కలిగిస్తుంది గనుక బ్రహ్మసూత్రం. ఉపనయన సమయంలో అది బ్రహ్మసూత్రం. ఎడమ భుజము మీది నుంచి ఒక వైపు ఉదర భాగాన్ని, మరొక వైపు వీపును తగులుతూ కుడిచేతి క్రింద వ్రేలాడుతున్నప్పుడు అది ఉపవీతం. యజ్ఞసూత్రం ఇలా ఉన్నప్పుడు దేవతా కార్యాలన్నీ చేయవచ్చు. యజ్ఞ సూత్రం మెడలో హారంవలె వ్రేలాడు తున్నప్పుడు అది నివీతం. ఋషి తర్పణం, మలమూత్ర విసర్జనాదులలో యజ్ఞోపవీతం నివీతంగా ఉండాలని అంటారు

హేమపుష్పమాహామాలాపరిష్కృతభుజాన్తరమ్ ।

దైత్యరాజవసామాలాభరణం శరణం నృణామ్ ॥౧౨౬

బంగారు పూలతో చేసిన గొప్ప దండతో అలంకరించబడిన చేతులు కలవానిని

రాక్షసుల రాజు అయిన హిరణ్యకశిపుని చంపి అతని మాంసములోని క్రొవ్వును దండగా ధరించినవానిని, మానవులకు ఆశ్రయమయినవానిని, నరసింహస్వామిని సేవిస్తాను.

ఉత్తమానుత్తమం దేవరాజమాజానుబాహుకమ్ ।

పోషణం జగతాం భూతపావనం పత్రివాహనమ్ ॥౧౨౭

ఉత్తములలో ఉత్తముని , దేవతలకు రాజయినవానిని, మోకాళ్ళవరకు వ్రేలాడు పొడుగు చేతులు కలవానిని

లోకాలను పోషించువానిని, జీవుల మనస్సులను శుద్ధి చేయువానిని, గరుత్మంతుడు వాహనముగా కలిగిన విష్ణుస్వరూపుని నరసింహస్వామిని సేవిస్తాను.

**విశేషాలు**

దీర్ఘబాహువులు కలిగియుండుట ఉత్తమ పురుషలక్షణములలో ఒకటి. ఇది  సంపత్తు దీర్ఘాయుస్సు మొదలగునవి గలవాని గుఱుతు మరియు  దీర్ఘ శరీరముగలిగిన బలముగలవాని గుఱుతు

వేదాన్తవేద్యమవ్యగ్రం వైఖానససుపూజితమ్ ।
వాలఖిల్యాదియోగీన్ద్రసంస్తుతం పరమార్థదమ్ ॥౧౨౮

ఉపనిషత్తుల ద్వారా తెలియదగినవానిని,  వైఖానసులచే బాగా పూజించబడువానిని,
ఇది వాలఖిల్యుడు వంటి గొప్ప యోగులచే ప్రశంసించబడినావనిని, మోక్షమును అనుగ్రహించువానిని నరసింహస్వామిని సేవిస్తాను.

**విశేషాలు**

వైఖానసులు అనగా 1. విఖనసుడు అను ఒక ఋషి చెప్పిన ధర్మ శాస్త్రాలను అనుసరించే వారు.2. వానప్రస్థులు. తృతీయాశ్రమంలో ఉన్న ద్విజులు.3. ప్రజాపతి నఖముల నుంచి పుట్టిన, బ్రహ్మ ఉంగరపు వ్రేలినుంచి పుట్టిన ఋషులని కథలు ఉన్నాయి.4. వైఖానస సూత్రాల ప్రకారం వైష్ణవాలయాలలో పూజలు నిర్వహించే అర్చక స్వాములు. అని నాలుగు అర్థాలున్నాయి.

మహాక్షం చ హిరణ్యాక్షశిక్షకం భక్తరక్షకమ్ ।
అపరాజితమక్షోభ్యమనన్తం పరమం పరమ్ ॥౧౨౯

గొప్ప నేత్రము కలవానిని,  హిరణ్యాక్షుని శిక్షించినవానిని,  భక్తుల రక్షకుని,
అజేయుని, అచంచలుని, అనంతుని, అత్యున్నతులలో  అత్యున్నతుడయిన నరసింహస్వామిని సేవిస్తాను.

అనేకరూపమాదిత్యమణ్డలస్థమకృత్రిమమ్ ।
హిరణ్మయం హిరణ్యాక్షం హిరణ్యశ్మశ్రుకం ప్రభుమ్ ॥౧౩౦

అనేక రూపాల్లో ఉండువానిని,  సూర్యునిమండలంలో ఉండువానిని,  కారణము లేకుండా పుట్టినవానిని,
హిరణ్మయమై రమ్యమైన ప్రకృతి వెనుక విహితమై ఉన్న సత్యస్వరూపుని, బంగారపు ఛాయగలవానిని, బంగారు నేత్రములు కలవానిని,
బంగారు గడ్డము కల  ప్రభువయిన నరసింహస్వామిని సేవిస్తాను.

**విశేషాలు**

హిరణ్యశబ్దము వేదాల్లో, ఉపనిషత్తులలో చాలా చోట్ల భగవంతుని పరంగా వాడబడింది. పెద్దలు చెప్పిన ఒకటి రెండు ఉదాహరణలు ఇస్తాను.

1. అథ ఏష అంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే, హిరణ్యశ్మశ్రుః హిరణ్య కేశః ఆప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః" అను ఉపనిషద్వాక్యము ఈ సందర్భములో స్మరణీయము.

సూర్యునిలో ప్రకాశిస్తూ కనిపిస్తున్న పురుషుడే హిరణ్మయ పురుషుడు.

హిరణ్మయ = బంగారపు ఛాయగలవాడు

పురుషుడు = సమస్తము తన పురుషకారముగా ప్రదర్శించువాడు.

సత్తాస్ఫూర్తిచే జగత్తులన్నీ నింపి ఉంచుచున్నవాడు.

బంగారు గడ్డము, మీసము; కేశములతో ఉపాసించబడువాడు. గోళ్ళతో సహా సర్వము బంగారు రంగుతో ప్రకాశించువాడు.

బంగారు పక్షి వలె కనిపించు గోళ్లు కలవాడు.

ఆతని కళ్ళు ఎర్రటి ఎరుపుగా ఎర్ర కలువల వలె ప్రకాశిస్తూ ఉంటాయి.

2. *హిరణ్మయేన పాత్రేణ సత్యస్య అపిహితం ముఖం తత్ త్వం పూషణ్ అపవృణు సత్య ధర్మాయ దృష్టయే*.(ఓ నా ప్రభూ, సమస్త జీవులకు పోషకుడా! నీ నిజమైన ముఖం నీ మిరుమిట్లు గొలిపే తేజస్సుతో కప్పబడి ఉంది. దయచేసి ఆ కవచాన్ని తొలగించి, నీ స్వచ్ఛమైన భక్తుడికి నిన్ను నీవు ప్రదర్శించుకో.)

నాయకం సురమాలాయా ఘటికాలయనాయకమ్ ।
నమస్కుర్వన్ సదా విప్రశేఖరో విష్ణుభక్తిమాన్ ॥ ౧౩౧

దేవతల సమూహమునకు నాయకుడైనవానిని,ఘటికాచల నాయకుని
పై న చెప్పిన విధముగా విష్ణువు పట్ల భక్తి కలిగిన విప్రశేఖరుడు సన్నుతించాడు.

ఏకవింశోత్తరశతం నామ్నాం నరహరేరిదమ్ ।
చతుర్థ్యన్తేన సహితం సమర్చయతి భూపతే ।।౧౩౨

ఓ ఇంద్రద్యుమ్న రాజా ! శ్రీ నరసింహునికి సంబంధించిన చతుర్థీ విభక్తితో అంతమయ్యే 24 నామాలను భక్తితో జపించాడు.

పుత్రం దుర్లలితం దృష్ట్వా ప్రహ్లాదం హ్లాదనం సతా ।
పురా హిరణ్యకశిపూరూచే సన్దేశకారిణః ।। ౧౩౩

పూర్వము ఒకసారి తనకు ఇష్టంలేని విష్ణు భక్తితో దుశ్చేష్టితుడయిన ప్రహ్లాదుడను తన కొడుకును చూసి,
హిరణ్యకశిపుడు తన దూతలతో ఇలా అన్నాడు -

హిరణ్యకశిపురువాచ –

హే దూతా యూయమవ్యగ్రాః ప్రహ్లాదం దుష్టచారిణమ్ ।

అనుక్తకారిణం వార్ధౌ క్షిపధ్వం హర్షమానినమ్ || ౧౩౪
ఓ దూతలారా, మీరు దుష్టుడైన ప్రహ్లాదునితో   చాలా బాధపడుతున్నారు. హరి భక్తి మానమంటే అతను మానటంలేదు. మన మాటకు ఏమీ తిరిగి మాట్లాడనివాడిని, సంతోషంగా ఉన్నట్లు నటించే ఈ ప్రహ్లాదుని రాతికి కట్టి సముద్రంలో పడవేయండి . 134

వసిష్ఠః -
ప్రతిగృహ్య వచస్తస్య స్వామికార్యధురన్ధరాః |
ప్రచిక్షిపుస్తదా వార్ధీ ప్రహ్లాదం నిరవగ్రహమ్ || ౧౩౫
యజమాని విధులను  తూ.చా. తప్పక పాటించు హిరణ్యకశిపుని సేవకులు రాజు  మాటలను అంగీకరించి  తండ్రి చెప్పినట్లు వినక స్వతంత్రప్రవృత్తి కలిగిన ప్రహ్లాదుడిని  సముద్రంలోకి  విసిరివేశారు. 135

ప్రహ్లాదస్తత్ర వై మగ్నో హరిభక్తిపరాయణః |
సర్వం భగవతో మాయా ఇతి మేనే మహామతిః || ౧౩౬
ప్రహ్లాద మహారాజు తన ఆపదను పట్టించుకోకుండా  శ్రీమన్నారాయణుని భక్తి సేవలో నిమగ్నమై ఉన్నాడు.ఆ గొప్పవాడయిన బాల్య మేధావి అంతా భగవంతుని మాయ అని అనుకున్నాడు. 136

తదా హరిస్తమభ్యేత్య ప్రసన్నేనాన్తరాత్మనా |
నామాన్యమూని భక్తాయ తస్మై తాన్యుపదిష్టవాన్ | |౧౩౭
అప్పుడు దేవదేవుడైన హరి, సంతోషకరమైన హృదయంతో ప్రహ్లాదుని వద్దకు వచ్చాడు.
ఆయన తన భక్తుడికి తనకు సంబంధించిన  పై 24   పేర్లను ఉపదేశించాడు. .137
ఉపదిష్టస్తు ప్రహ్లాదో నామ్నాముచ్చారణాత్తతః |
ఉన్మజ్జన్ వార్ధిరాగత్య జగ్రాహ చరణౌ పితుః | | ౧౩౭
అప్పుడు ప్రహ్లాదుని  తన 24 నామాలను జపించమని   నరసింహుడు ఆదేశించాడు. .
ఆ నరసింహ 24 నామాలను జపం చేసిన వెంటనే  ప్రహ్లాదుడు  మునిగిపోకుండా సముద్రం బయటికి  వచ్చి తన తండ్రి పాదాలను పట్టుకున్నాడు. ( నమస్కరించాడని భావం). 137

ఇతి బ్రహ్మకైవర్త ఉత్తరఖణ్డే భృగుపరాశరసంవాదే ఘటికాచలమాహాత్మ్యే ఏకోనవింశోఽధ్యాయః ||

ఇక్కడితో  బ్రహ్మ-కైవర్త పురాణంలోని ఉత్తరఖండంలో భృగువు మరియు పరాశరుని మధ్య జరిగిన సంభాషణలో ఘటికాచల మాహాత్మ్యంలో పందొమ్మిదవ అధ్యాయం పూర్తి అయినది. +++++

శ్రీ శివాయ గురవే నమః

ఘటికాచలనివాసాయ శ్రీ నృసింహాయ నమః

బ్రహ్మకైవర్త పురాణములో ఉన్న  శ్రీఘటికాచల మాహాత్మ్యపు  20వ అధ్యాయం

(మూల శ్లోకము మరియు తాత్పర్య విశేషాలతో)

వింశోఽధ్యాయః

శ్రీవసిష్ఠః -

ఇదం పవిత్రం పరమం పాపఘ్నం వేదసమ్మితమ్ ।

పఠేన్నరహరేర్నామ్నామేకవింశోత్తరం శతమ్ ॥౧

వశిష్ఠుడు ఇలా అన్నాడు

" ఇది ( 19 వ అధ్యాయము చివర చెప్పిన స్తోత్రము) పరమ పవిత్రమైన స్తోత్రము. పాపాలను నాశనం చేసేది. వేదసమ్మతము. నరహరి యొక్క  ఇరవై ఒక్క నామాలను చదివినవారు ధన్యులు.

మహత్పాపౌఘసంప్రాప్తౌ నామాన్యేతాని కీర్తయేత్ ।

నరస్తు తస్మాదుత్తీర్ణో భవేద్దేవోఽపి దేవరాట్ ॥౨

అత్యంత పాపపీడితులైనవారు ఈ స్తోత్రము చదివినచో ఉద్ధరింపబడతారు. మహాపాపాల వరదలో మునిగిపోయినప్పుడు, ఈ నామాలను జపించాలి. ఈ స్తోత్రము చదివిన మానవుడు మహాపాపాల వరద దాటి దేవతలకు రాజు అవుతాడు.

పురన్దరో నామ దేవో దేవరాజః ప్రసన్నధీః ।
అహల్యాసక్తిదోషేణ శాపాన్నిర్వృషణోఽభవత్ ॥౩
పురందరుడు (పురములను చీల్చువాడు. ఇంద్రుడు ) అని  దేవతలకు రాజు  ఉండేవాడు.
అహల్యతో ఉన్న అనుబంధం వల్ల ఆ ఇంద్రుడు శపింపబడి  వృషణాలు లేనివాడయ్యాడు.

అథ లజ్జానతముఖో నైచ్ఛతామరసఙ్గమమ్ ।
ఇన్ద్రో మానసకాసారపద్మషణ్డముపాగతః ॥౪
అప్పుడు, సిగ్గుపడే ముఖంతో, ఇంద్రుడు  దేవతలను కలవడానికి ఇష్టపడలేదు. మానస సరోవరములోని తామరపువ్వుకాడలో దాక్కున్నాడు.

చిరాయ తత్ర భగవానిన్ద్రస్సంస్థితిమేయివాన్ ।
గోపయన్నిఖిలాన్యఙ్గాన్యర్ణోజదశమాలయా ॥౫
చాలా కాలం ఇంద్రుడు అక్కడ దాక్కున్నాడు. అక్కడ అతని  అవయవములన్ని తామరాకులతో పూలరేకులతో కప్పబడి ఉన్నాయి.

సహస్రదలసఞ్ఛన్నతనురిన్ద్రస్తు మూర్తిమాన్ ।
శృఙ్గార ఇవ తేజస్వీ దృశ్యతే జలజన్తుభిః ॥౬
వెయ్యి రేకులతో కప్పబడిన శరీరం కలిగిన వానిగా ఇంద్రుడు అవతారమెత్తాడు.
ఆ అవతారం  జలచరాలకు ఒక అలంకారంలా అద్భుతంగా కనిపించేది.

అథ హంసముఖాద్వేధా విజ్ఞాయేన్ద్రపరాభవమ్ ।
స్తూయమానస్త్రయీభిస్తు ప్రాదురాసీత్ సరస్తటే ॥౭
హంసలు మానస సరోవరములోని తామరతూడులను తినుటకు వచ్చి  ఇంద్రుని చూసాయి. వాటిద్వారా ఇంద్రుని పరాభవమును  బ్రహ్మ తెలుసుకొన్నాడు. మూడు వేదాలచే ప్రశంసించబడిన బ్రహ్మ ఆ మానస సరోవరపు ఒడ్డుకు వచ్చాడు.  .

**విశేషాలు**

వేదాలు నాలుగు కదా ! ఇక్కడ మూడు అని ఎందుకన్నారంటే…

మనకి వేదములు నాలుగయినా, సంప్రదాయంలో వాటిని త్రయీగా వ్యవహరిస్తారు.

ఈ అయిదు కారణాలను పెద్దలు చెప్పారు.

1. ఋగ్వేదము, యజుర్వేదం, సామవేదం, ఈ మూడు వేదములు నేర్చుకోవడానికి ఒక్కసారి ఉపనయనం చేసుకుంటే చాలు. ఒకసారి ఉపనయనం చేసుకుంటే ఒక గాయత్రీ ఉపదేశంతో ఈ మూడు వేదములు చదువవచ్చుకానీ అధర్వవేదం చదవడానికి, ఈ మూడు వేదములు చదవడానికి కావలసిన ఉపనయనం సరిపోదు. అధర్వ వేదం చదవడానికి మరల ఉపనయనం చేసుకొని, ఇంకొక బ్రహ్మోపదేశం పొందాలి. అందుకని సాధారణంగా వేదాలను త్రయీ( మూడు) అంటారు
2. నాలుగు వేదాలు సంహిత - బ్రాహ్మణ - ఆరణ్యకాలని మూడుగా భాగాలుగా ఉండడం వల్ల కూడా త్రయీ అంటారు.
3. నాలుగు వేదములు మూడు రకాలుగా  ఉంటాయి! ఋక్కులు, యజుస్సులు,సామములు అని. అందుకే వేదాలను "త్రయి ' అని అంటారు.ఋక్కులు శ్లోకాత్మకముగా యజుస్సులు గద్యాత్మకముగా, సామములు గేయాత్మకము లేదా గానాత్మకముగా ఉంటాయి! అందుకే త్రయీ  అని అంటారు.

4. ఋక్ యజుస్సామ వేదాలు మూడింటిని కలిపి త్రయీ అంటారని ఒక వాదం ఉంది.

5. కర్మకాండ, ఉపాసనాకాండ, జ్ఞాన కాండ అని మూడు విధాలుగా వేదం ఉంటుంది కనుక త్రయీ.

విచిన్వానస్సురేశానం జగత్కర్తా తతస్తతః ।

కుత్రచిత్ కర్ణికాయాం వై తస్థివాంసం దదర్శ హ ॥౮

విశ్వ సృష్టికర్త  అయిన బ్రహ్మ ఆ సరస్సుతీరములో దేవతల ప్రభువు అయిన  ఇంద్రుని వెదుకుతూ  ఒకానొక తామరపూవుయొక్క మధ్యలో దాగిఉన్న  ఇంద్రుని చూసాడు. అతనితో ఇలా అన్నాడు

బ్రహ్మ

శతక్రతో మహాభాగ వృథా మజ్జసి వారిధౌ ।

నృహరేః ఖలు నామాని వర్తన్తే తాని సంస్మర ॥౯

ఓ అదృష్టవంతుడా!  శతక్రతూ ! (వంద యజ్ఞములు చేసినవాడా!) “ఇంద్రా! వ్యర్థముగా ఈ నీటిలో దాక్కున్నావు.నరసింహ నామాలు నీకు గుర్తు లేవా ! నృసింహ  నామములను జపించు. నీకు మంచి జరుగుతుంది.

ఇన్ద్రః

భగవన్ హృదయే బ్రహ్మన్ ప్రత్యభిజ్ఞా కృతా త్వయా ।

స్మృతిక్షణాదేవ మహావృషణం సమజాయత ॥౧౦

ఇంద్రుడు:

“ఓ ప్రభూ, ఓ బ్రహ్మదేవా !  నువ్వు నా హృదయంలో నరసింహ నామాలు జపించాలనే విషయాన్ని  గ్రహించేలా చేసావు.”అని ఇంద్రుడు బ్రహ్మదేవునికి ధన్యవాదాలు చెబుతూ అతడు నరసింహ నామాలు జ్ఞాపకం చేసుకొన్న  క్షణంలోనే పోయిన వృషణములు మరలా పొందాడు.

11 - 20

వసిష్ఠ:

ఇన్ద్రస్తు సహసోత్థాయ స్తుత్వా స్వాయంభువం మహః ।

స్తూయమానోఽమరైర్సర్వైస్స్వాం పురీమన్వపద్యత ।। ౧౧

వశిష్ఠుడు

ఆ తరువాత స్వర్గపు రాజైన ఇంద్రుడు అకస్మాత్తుగా సంతోషంగా ఆ తామరతూడు నుంచి పైకి లేచి తనకుతానే పుట్టిన బ్రహ్మను స్తుతించాడు. అందరు దేవతలచే ప్రశంసించబడి, ఇంద్రుడు తన నగరానికి తిరిగి వచ్చాడు. . 11

బ్రహ్మే

ఇన్ద్రద్యుమ్నస్తు సంతుష్టో గృహ్యనామాని తన్ముఖాత్।

విముక్తపాప్మా ప్రోవాచ వసిష్ఠం ప్రాఞ్జలిస్తథా ।। ౧౨

ఇంద్రద్యుమ్నుడు సంతోషపడి వశిష్ఠునిద్వారా నరసింహుని నామాల ఉపదేశం పొంది, జపించాడు.

పాపాల నుండి విముక్తి పొంది ఆ ఇంద్రద్యుమ్నుడు చేతులు జోడించి వశిష్ఠునితో ఇలా అన్నాడు.

అత్యున్నతమిదం శృఙ్గం హేమకోటిపదానుగమ్ ।

మనః ప్రసీదయతి మే ప్రరూఢమివ పర్వతమ్ ।। ౧౩

"స్వామీ! ఈ పెద్దకొండపై శ్రీ నరసింహస్వామి గర్భాలయమునకుపైన కట్టబడినవిమానమునకు(గర్భగుడిపై గల గోపురము) హేమకోటి విమానము అని పేరు కదా !.ఆ హేమకోటి విమానము కలిగిన ఈ శిఖరము చాలా ఎత్తైనది. ఇది నా మనస్సునకు మిక్కిలి శాంతి కలిగిస్తున్నది."

వసిష్ఠః

బహోః కాలాత్తపస్తప్త్వా పరం పదమివ ధ్రువః ।

ప్రహ్లాదసుచిరం శృఙ్గం ప్రాప్తవాన్ నృహరేస్స్వాత్ ।।౧౪

అప్పుడు వశిష్ఠుడు ఇలా అన్నాడు. "రాజా!పూర్వము చాలకాలము తపస్సు చేసిన ధ్రువుడు పరమపదాన్ని ఇక్కడే పొందాడు. ప్రహ్లాదుడు కూడా నృహరి స్తుతి ద్వారా ఈ క్షేత్రము దర్శించే అదృష్టాన్ని పొందాడు.

అత్ర స్థిత్వా మహాయోగీ ప్రహ్లాదో ధర్మవత్సలః ।

తపస్యతి గతక్లేశో అన్తరఙ్గే స్మరన్ హరిమ్ ।।౧౫

ఇక్కడే నివసిస్తూ గొప్ప యోగి, ధర్మ సూత్రాలంటే చాలా ఇష్టం కలిగిన ప్రహ్లాద మహారాజు తపస్సు చేసాడు.

తపస్సు ద్వారా బాధలు నశించి , సంపూర్ణ శాంతిని పొంది తన అంతరంగంలో హరిని స్మరించాడు.

శృఙ్గస్య దక్షిణే పార్శ్వే చక్రతీర్థమితి శ్రుతమ్ ।
పశ్చిమే తు మహాతీర్థం శఙ్ఖాభిధమనిన్దితమ్ ॥౧౬
ఈ శిఖరానికి దక్షిణం వైపున చక్రతీర్థం అనే ప్రదేశం ఉంది.
పశ్చిమాన శంఖమను పేరు కలిగిన  మహాతీర్థము ఉన్నది.

మత్స్యకారణ్డవాకీర్ణ అమ్భోరుహశతాకులమ్ ।
ఘటికాశైలరాజస్య నేత్రద్వయమిదం నృప ॥౧౭
శంఖమను పేరు కలిగిన  మహాతీర్థము చేపలు, కన్నెలేడిఅను పక్షులతో  వందలాది తామర చెట్లతో నిండి ఉంది.
ఓ రాజా! చక్రతీర్థం, శంఖతీర్థం ఘటికాచలానికి రెండు కళ్ళవంటివి.

శఙ్ఖం చ చక్రతీర్థం చ సదా సర్వర్షిసేవితమ్ ।
సదా సలిలసంపూర్ణం సన్మనోవద్వినిర్మలమ్ ॥౧౮
ఈ శంఖచక్రతీర్థములు ఋషిసేవితములు. చక్రతీర్థం, శంఖతీర్థాలను  ఋషులు ఎల్లప్పుడూ సందర్శిస్తారు.
అవి ఎల్లప్పుడూ నీటితో నిండి ఉంటాయి. ఆ నీరు మంచి మనస్సులా స్వచ్ఛంగా ఉంటుంది.

యయోస్తీరద్రుమాణాం వై ఛాయా భాస్కరరోధినీ ।
అత్ర పూర్వం మహాలక్ష్మీముపాస్య హరిశఙ్కరౌ ॥౧౯
నది ఒడ్డున ఉన్న చెట్ల నీడ సూర్యుడిని అడ్డుకుంటుంది.( అనగా చెట్లు చాలా పొడుగుగా ఉన్నాయని భావం)ఇక్కడ గతంలో హరి మరియు శంకరులు మహాలక్ష్మిని పూజించారు

చన్ద్రాదిత్యౌ తథా బ్రహ్మా ప్రాప్తవన్తౌ వరాన్ పృథక్ ।
హరేర్జ్ఞానప్రదాతృత్వం శఙ్కరే శ్రీప్రదాదృతా ॥౨౦
చంద్రసూర్య బ్రహ్మలు కూడ లక్ష్మిని సేవించి ఇక్కడే  వరాలను పొందారు. హరికి జ్ఞాన ప్రదాతృత్వము,(జ్ఞాన దానముచేయు గుణము),శంకరునికి శ్రీ ప్రదాతృత్వము(సంపదను దానముచేయు గుణము)) నరసింహుని నుండి ఇక్కడే లభించాయి.

21- 30

చన్ద్రే కలా ప్రదాతృత్వం రవేరారోగ్యదాతృతా ।

ప్రవక్తృతా ప్రజానాథే శ్రియా సర్వాణి జజ్ఞిరే ॥౨౧

చంద్రునికి  కళను ప్రసాదించే గుణము, సూర్యుడు ఆరోగ్యాన్ని ప్రసాదించే గుణము, బ్రహ్మకు ప్రజాపతిత్వము(ప్రజాపాలనగుణము) నరసింహుని నుండి ఇక్కడే లభించాయి.

కుబేరో నారదముఖాత్ సర్వమాలోక్య వైభవమ్।

ధనదత్వం మహాభాగస్స్వామినిచ్ఛన్ హి భాగతః । । ౨౨

కుబేరుడు నారదుని ద్వారా ఈ ఘటికాచల  మాహాత్మ్యమును విన్నాడు.  తాను కూడా ఇక్కడే లక్ష్మిని సేవించి ధనాధిపత్యమును పొందాడు.

బహుకాలం తపస్తేపే ఫలమూలాశనో నృప ।

నృసింహభక్తానన్వీక్ష్య చాన్వీక్ష్య ప్రణమంస్తథా ॥ ౨౩

ఓ రాజా! కుబేరుడు లక్ష్మానుగ్రహము కొరకు  ఇక్కడ  చాలా కాలం పాటు అతను పండ్లు, వేర్లను తిని తపస్సు చేసాడు. నృసింహ భక్తులను చూసి వారికి నమస్కరించేవాడు. 23

తత్రత్యఋషిహర్షాయామృతవల్లీరనేకశః ।

ఆరోపయద్వైశ్రవణో లక్ష్మీసూక్తం జజాప హ ॥౨౪

కుబేరుడు  ఋషులను సంతోషపెట్టడానికి ఇక్కడ అనేక అమృత లతలను పెంచాడు. విశ్రవణుని కుమారుడయిన  కుబేరుడు లక్ష్మీ సూక్తాన్ని జపించాడు.

తత్రాన్తరే మహాలక్ష్మీర్వల్లీమూలే తదా హితే ।

హర్షాయావిరభూత్ రాజన్ కమలం గృహ్య పాణినా ॥ ౨౫

ఓ రాజా ! ఆ లక్ష్మీ సూక్త జపమువలన  అమృత లతల మూలములో, చేతిలో కమలం పట్టుకుని ఆనందంగా  మహాలక్ష్మి ఆవిర్భవించింది

ఆవిర్భవన్తీం తాం దృష్ట్వా పురుషార్థప్రదాయినీమ్ ।

ఉవాచ పరమప్రీతః ప్రణమన్ గుహ్యకేశ్వరః ॥౨౬

ధర్మ-అర్థ-కామ-మోక్షములు ప్రసాదించు మహాలక్ష్మి కనిపించడం చూసి, గుహ్యకుల ప్రభువయిన కుబేరుడు  నమస్కరించి, చాలా సంతోషించి ఇలా అన్నాడు

విశేషాలు

గుహ్యకులు

కుబేరుని నవనిధులను పాలించువారు. (తఱచుగా కుచ్ఛితము పలుకువారు అని శబ్దార్థము.) వీరు మాణిభద్రాదులు.

కుబేర:-

అమ్బ త్వత్సన్నిధానేన కృతార్థోఽహం తథా పరః |

చరితార్థం చ విజ్ఞానం తథా సందర్శనం సతా ||౨౭

కుబేరుడు:-

అమ్మా! మీ సన్నిధానములో ప్రయోజనమును పొందిన కృతార్థుడిగా మారాను. అలాగే శ్రేష్ఠత్వాన్ని పొందాను.  ఈ జన్మకు సార్థకత, విజ్ఞానం లభించాయి.

అద్య తే పాదపద్మస్య దర్శనాజ్జగదీశ్వరి |

చరితార్థమివాత్మానం మన్యే కన్యే పయోనిధేః ||౨౮

అమ్మా! జగదీశ్వరీ ! సముద్రకన్యా! మీ పాదపద్మాల దర్శనం వలన  నా బతుకు చరితార్థమయినదిగా భావిస్తున్నాను.

విశేషాలు

సముద్రకన్యా!

లక్ష్మీదేవి  పాల సముద్రం  యొక్క  కూతురు . అందుకే సముద్ర కన్య.  దేవతలు , దానవులు  మందరపర్వతము  ను కవ్వముగా , నాగరాజైన  వాసుకి  అనే  సర్పమును  తాడుగాను  ఉపయోగించి  పాల సముద్రమును  చిలకగా , అందులోనుండి  కలువ  పూవు  మీద  కూర్చుని  , కలువ  పువ్వు  చేతిలో  పట్టుకుని  లక్ష్మీదేవి  ఉద్భవించింది.

కుబేరుడు చేసిన అమృత వల్లీశ్వరీ స్తవము

శ్రీలక్ష్మీరిన్దిరా పద్మా లోకమాతా జనేశ్వరీ |

పద్మాలయా పద్మహస్తా నిత్యా పద్మప్రియా సతీ ||౨౯

శ్రీ లక్ష్మీ

(లక్షయతి పశ్యతి ఉద్యోగినమ్] ప్రయత్నించువారిని శోభాకరంగా చూచునది. విష్ణుపత్ని,

ఇందిరా

(ఇందతి పరమైశ్వర్యవతీ భవతి] పరమైశ్వర్యము కలిగినది. లక్ష్మి

పద్మా

(పద్మం అస్తి అస్యాః] పద్మము గలది. లక్ష్మి.

లోకమాతా

లోకములకు తల్లి.

జనేశ్వరీ

జనులకు యజమానురాలు

పద్మాలయా

పద్మం ఏవ ఆలయః వాసస్థానం యస్యాః పద్మము నివాస స్థానంగా గలది. లక్ష్మి.

పద్మహస్తా

పద్మం హస్తే యస్య పద్మము హస్తమునందు గలది

నిత్యా

నిత్యం భవా  ఎల్లప్పుడు వుండునది

పద్మప్రియా

తామరపూవులో ప్రీతిని కల్గినది

(పద్మప్రియే! పద్మిని! పద్మహస్తే! పద్మాలయే! పద్మదళాయతాక్షి

విశ్వప్రియే! విష్ణుమనోనుకూలే! త్వత్పాదపద్మం మయి సన్నిధత్స్వ॥

తామరపూవులో ప్రీతిని కల్గినది, స్త్రీలలో గొప్పది, తామరపూవులు చేతిలో  పెట్టుకొన్నది, తామరపూవుపై వేంచేసి ఉన్నది, తామరరేకులవంటి విశాలమైన కన్నులను కల్గినది, అందటిపట్ల వాత్సల్యాన్ని కల్గినది, విష్ణువు మనస్సుకు అనుకూలమైనది, అయిన మహాలక్ష్మి! తామరపూవువంటి నీ పాదాన్ని నా తలపై పెట్టాలి. )

సతీ

సత్ అస్తి అస్యాః మంచితనము గలది.

యోగినీ సా యోగనిద్రా కమలా మాలికా రమా ।

హరిప్రియా సిన్ధుకన్యా పద్మజన్మాథ భార్గవీ ॥౩౦

యోగినీ

యోగాభ్యాసముచేయు స్త్రీ.

సా యోగనిద్రా

ఆమెయే యోగనిద్రా.

యోగః చిత్తవృత్తినిరోధ లక్షణః సమాధిః తత్ రూపా నిద్రా

యోగం అనేది మనస్సును నిగ్రహించుకునే లక్షణం , ఆ  రూపం కలిగినది యోగనిద్రా.

కమలా

- (కమలం విద్యతే అస్యాః] కమలమునం దుండునది. లక్ష్మి.

- [కమనీయా స్త్రీ] అందమైన స్త్రీ.

మాలికా

(మాలా ఇవ మాలికా]  హారము;

హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణరజతస్రజామ్|

చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మ ఆవహ||| 1

ఇందులో సువర్ణరజత స్రజామ్అను పదబంధం  ఇక్కడ స్మరణీయం.

(సువర్ణరజతస్రజామ్)-బంగారంతో, వెండితో చేయబడిన మాలలను కల్గినది.

రమా

(రమయతి] ఆనందము నిచ్చునది. స్త్రీ, లక్ష్మి

హరిప్రియా

(హరేః విష్ణోః ప్రియ] విష్ణువుకు ప్రియమైనది. లక్ష్మి

సిన్ధుకన్యా

పాల సముద్రం  యొక్క  కూతురు .

పద్మజన్మా

పద్మమునుండి జన్మించినది.

అథ = మరియు

భార్గవీ

శుక్రుని తొలికూతురు

సర్వకామప్రదా నృణాం మఙ్గలా చేన్దిరా స్వధా ।

స్వాహా పుష్టిస్తథా తుష్టిస్సర్వకామదుఘా ప్రియా ॥ ౩౧

సర్వకామప్రదా

అన్ని కోరికలను అనుగ్రహించునది

నృణాం మఙ్గలా

రాజులకు శుభాన్ని అనుగ్రహించునది

చ = మరియు

ఇన్దిరా

(ఇందతి పరమైశ్వర్యవతీ భవతి] పరమైశ్వర్యము కలిగినది. లక్ష్మి.

స్వధా

(స్వద్యతే అనేన పితృభిః] దీనితో పితరులు ఆస్వాదింతురు. ఆహుతి, స్వధా.

“స్వధా త్వం లోకభావినీ అను సూక్తినిబట్టి, “శుచిం స్వాహాం సుధాం స్వధామ్” అను అష్టోత్తర శతనామస్తోత్రప్రమాణమునుబట్టి స్వధాశబ్దము లక్ష్మీవాచకము.

అగ్నిమూర్తి అయిన ఈశ్వరునికి దోహదపడే పరమేశ్వరీ అంశ రూపమే 'స్వధా'. 'దేవీం వామే స్వధాం తథా'. ఈ స్వధాదేవి అగ్నికి ఎడమవైపున ఉండేది. ఈవిడ కూడా తేజ స్స్వరూపిణియే ! మానవులు అర్పించిన పిండదానాదులు ఈ స్వధా దేవి ద్వారా పితృదేవతలు స్వీకరిస్తారు.

'స్వాహా,' 'స్వధా' దేవతలిద్దరూ వరుసగా అగ్నికి కుడి, ఎడమ పార్శ్వాల్లో ఉంటారని చెప్పబడింది. అంటే ఈ రెండూ సవ్య, అపసవ్య పద్ధతుల్లో ఉంటాయని గూడా గుర్తించాలి. అందుకే - స్వాహాతో దేవతలకు ఏదైనా అర్పిస్తున్నప్పుడు యజ్ఞోపవీతం సవ్యంలోను అంటే - ఎడమ భుజంమీదను, పితృదేవతలకు తిల, పిండదానాలు అర్పిస్తున్నప్పుడు యజ్ఞోపవీతం అపసవ్యంలోను- అంటే కుడి భుజం మీద ఉండాలి.

ఈ స్వధాదేవికి మొత్తం ఏడు నామాలున్నాయి. అవి - 1) పితృ ప్రాణతుల్య 2) ద్విజప్రీతికరా 3) ద్విజజీవనరూపిణి 4) శ్రాద్ధాధిష్ఠాతృదేవి 5) శ్రాద్ధఫలప్రదా 6) బ్రహ్మమానసకన్యా 7) పితృతుష్టిప్రదా

ఈ స్వధాదేవిని - అనాహత చక్రాధిష్ఠాన దేవత అయిన 'వామదేవి' మంత్ర విశేషంగాను, ద్వితీయ మాస గర్భస్థ పిండ విశేషంగాను సమన్వయ పరచుకోవాలి. ఈ నామము పితృదేవతా దాన వాచకము.

### స్వాహా

సుష్ఠు ఆహూయంతే యజ్ఞే దేవాః అనయా] దేవతలు యజ్ఞంలో దీనితో పిలువబడుదురు. స్వాహాదేవి

అగ్ని స్వరూపుడైన ఈశ్వరునికి దోహదపడే పరమేశ్వరీ అంశ రూపమే 'స్వాహా”, 'స్వాహాంతు దక్షిణే పార్శ్వే' - అంటే అగ్నికి ఈమె కుడివైపు ఉండేది. ఈ స్వాహా దేవి పూర్తిగా తేజస్స్వరూపిణి. ఈశ్వర స్వాహాలకు సంబంధించినవాడే 'కుమారస్వామి' (కుమారస్వామి అగ్నిపుత్రుడనే పురాణ కథలోని రహస్యం ఇదే!) ఈ విషయాన్ని -

శ్లో. స్వాహా వహ్న్యాత్మనస్తస్య ప్రోక్తా పశుపతేః ప్రియా

షణ్ముఖో భగవాన్దేవః బుధైః పుత్ర ఉదాహృతః- అన్న శ్లోకంలో లింగపురాణంలో చెప్పబడింది. ఈ స్వాహాదేవికి మొత్తం పదహారు నామాలున్నాయి. అవి - 1) స్వాహా2)వహ్నిప్రియా 3) వహ్నిజాయా 4) సంతోషకారిణీ 5) క్రియ 6) శక్తి 7) కాలరాత్రి 8)పరిపాకకరి 9) ధ్రువ 10) గతి 11) దాహిక 12) దహనక్షమ 13) సంసారసార రూప

14) దేవపోషణ కారిణి 15) మోదసంసారతారణి 16) దేవజీవనరూపా.

ఈ పదహారు నామాలతో కూడిన పై శ్లోకంతో స్వాహాదేవిని స్తుతిస్తే వివాహసిద్ధి, సంతాన సిద్ధిలతో పాటు సర్వకామ్య సిద్ధి కూడా చేకూరుతుంది. ఈ స్వాహా - విశుద్ధి చక్రదేవత అయిన వజ్రేశ్వరి యొక్క మంత్ర విశేషం.

### పుష్టిః

'ప్రతి జీవిలోని పుష్టి యొక్క స్వరూపము (మానసిక తృప్తి, శారీరక పుష్టి కలిగినవారు నిత్య సుఖ సంతోషాలతో ఉంటారు)

యాదేవీ సర్వభూతేషు పుష్టిరూపేణ సంస్థితా.

తథా=అట్లు

### తుష్టిః

తృప్తి, సంతోషముల రూపిణి

సర్వకామదుఘా

సర్వ  కామాన్ దోగ్ధి అన్ని కోరికలను పూరించునది. కామధేను.

ప్రియా

ప్రీణాతి] సంతోషపెట్టునది. భార్య; ప్రియురాలు.

సత్త్వైర్నామపదైరమ్బా నిత్యం సంపూజ్యతాం నృభిః ।

కిం కిం న ప్రార్థితా కుర్యాద్భవతీ హరివల్లభే ।। ౩౨

రాజులు  ఎల్లప్పుడూ లక్ష్మి దేవతను ఆమె పవిత్ర నామాలతో పూజిస్తారు.

భగవంతుడైన హరికి అత్యంత ప్రియమైనదానా ! మేం  అడిగితే  నువ్వు ఏమి ఇవ్వవు? ( అన్ని అనుగ్రహిస్తావని భావం)32

స్వస్తి తేఽస్తు ప్రసన్నాత్మా వరదా సముపాస్థితా ।

స్తవేనానేన సంతుష్టా సర్వదా యక్షపుఙ్గవ ।।౩౩

కుబేరుని లక్ష్మి స్తవం పూర్తయిన వెంటనే  లక్ష్మి ఇలా అన్నది

'ఓ యక్షుల అధిపతీ ! కుబేరా! నీకు శుభమగుగాక! ఈ స్తుతితో నేను  సంతృప్తి చెందాను. నీకు కావలసిన వరములు కోరుకో.''

ధనానామాధిపత్యం చ తద్దాతృత్వం చ సాంప్రతమ్ ।

దేహి మేఽత్ర జగద్ధాత్రి కరుణాం చ నిధేహి మే ।।౩౪

కుబేరుడు:-

జగత్తును ధరించుదానా ! ఓ లక్ష్మి ! సకల సంపదలకు యజమానిత్వమును ,  దానిని ఇవ్వటానికి అధికారాన్ని నాకుఇప్పుడు వరంగా ఇవ్వు. నాపై దయ చూపు''అని కుబేరుడు  ధనాధిపత్యమును కోరెను.

వసిష్ఠః -

ఉత్సార్య పాణినా దేవీ శిలాముపరివేష్టితామ్ ।

తత్రత్యాంశ్చ నిధీన్ప్రోక్ష్య శఙ్ఖపద్మాదికాన్నవ । । ౩౫

అప్పుడు లక్ష్మి తనచేతితో పెద్దరాయిని తొలగించింది. అచ్చట శంఖము, పద్మము మొదలైన నవనిధుల మీద నీరు చిలకరించింది.

విశేషాలు

1. మహాపద్మము, 2. పద్మము, 3. శంఖము, 4. మకరము, 5. కచ్ఛపము, 6. ముకుందము, 7. కుందము, 8. నీలము, 9. ఖర్వము ఇవి కుబేరుని నవనిధులు.

"మహాపద్మశ్చ పద్మశ్చ శంఖో మకరకచ్ఛపౌ, ముకుందకుందనీలాశ్చ ఖర్వశ్చ నిధయో నవ"

అత్రత్యనిధయే లక్ష్మ్యాశ్శఙ్ఖపద్మాదయోం నవ|
అభీప్సితాని గృహ్ణీష్వ విచారం మా కృథా ఇహ | | ౩౬

కుబేరా ! శంఖము, పద్మము మొదలైన నవనిధులు ఇక్కడ ఉన్నాయి. నువ్వు కోరుకునేది తీసుకో. విచార పడకు అని లక్ష్మి కుబేరునితో చెప్పింది. 36

పఞ్చషట్ చ నిధీన్ గృహ్యప్రహృష్టహృదయస్తథా |
అభివాద్య జగద్ధాత్రీం ప్రాప్తవాన్ ధనదః పురీమ్ ||౩౭

కుబేరుడు లక్ష్మికి నమస్కరించి నవనిధులను స్వీకరించి వాటికి అధిపతి అయ్యాడు.. విశ్వమాత అయిన లక్ష్మికి నమస్కరించి కుబేరుడు తన నగరానికి చేరుకున్నాడు.

తత్రత్యఋషయో దేవీం ప్రశశంసుర్యథామతి |

అక్కడి ఋషులు తమకు నచ్చినట్లుగా ఆ లక్ష్మీ దేవతను స్తుతించారు.

తథామృతలతామూలే సముత్పన్నామనిన్దితామ్ ||౩౮
దుగ్ధాబ్ధిజాన్తు తాం దృష్ట్వాఽమృతవల్లీశ్వరీతి వై |
నామధేయం తథా చక్రుః ఋషయో బ్రహ్మవాదినః | | ౩౯

ఆమెను అమృత వల్లీశ్వరి అని పిలిచిరి.అందువలన లక్ష్మి అమృతవల్లీశ్వరి అయినది.

అమృతలతను చేతిలో ధరించి జన్మించి ప్రసన్నురాలైనందున మరియు పాల సముద్రములో పుట్టినందువల్ల మహాలక్ష్మిని దేవతలు, మునులు "అమృతవల్లీశ్వరి" అని పేరు పెట్టి స్తుతించారు. మహాలక్ష్మి ఘటికాచలంలో "అమృతవల్లి, అమృతఫలవల్లో" – అనే పేర్లతో కీర్తింపబడుతున్నది.

యతశ్శంఖాదయస్తత్ర సముత్పన్నాస్సరోఽన్తరే|
తతశ్చక్రుర్మహాతీర్థం శఙ్ఖాభిధమకృత్రిమమ్ ||౪౦

సరస్సు మధ్యలో శంఖాలు మొదలయినవి పుట్టుకొచ్చాయి కనుక ఆ తీర్థానికి ఋషులు శంఖతీర్థం అని పేరు పెట్టారు.

41 - 50

వసిష్ఠ: -

సర్వర్షిభిస్తూయమానా తదా ప్రభృతి భార్గవీ ।

శఙ్ఖపుష్కరిణీ తీరే సర్వదా తిష్ఠతే రమా ॥౪౧

అందరు ఋషులచే  ప్రశంసించబడిన లక్ష్మిని అప్పటి నుండి భార్గవి అని పిలవసాగారు. లక్ష్మి ఎప్పుడూ శంఖపుష్కరిణిలో ఉంటుంది.

యద్యత్కామయతే లక్ష్మీ సన్నిధానాదభిస్తువన్ ।

తత్తదాప్నోతి నిఖిలం మహాలక్ష్మీప్రసాదతః ॥౪౨

తన సమక్షంలో మహాలక్ష్మిని స్తుతించి, సేవించి  ఆమెను ఏఏ కోర్కెలు,  కోరినా మహాలక్ష్మి అనుగ్రహం ద్వారా అవన్నీ సంపూర్ణంగా  నెరవేరుతాయి.

తస్యాగ్నేయాం దిశి నృప తయోః పార్శ్వే సుశృఙ్గయోః ।

చక్రతీర్థమితి ఖ్యాతః ద్యోతతే సలిలాశయః ।। ౪౩

ఓ రాజా! ఈ శంఖ తీర్థానికి  ఆగ్నేయ భాగములో(తూర్పు-ఉత్తర దిశల నడిమి దిశ.) రెండు అందమైన శిఖరాలు ఉన్నాయి. వాటి మధ్య చక్రతీర్థం అనే నీటి జలాశయం ఉంది. . 43

విభ్రాజమానాశ్శతశస్తీరే తస్య తపస్వినః ।

తపశ్చరన్తి నియతాహారాస్తత్ర తపస్వినః । ।౪౪

. ఇక్కడ చక్రతీర్థపు ఒడ్డున వందలాది మంది ఋషులు ఆహారాన్ని నియమంగా తింటూ తపస్సు చేస్తుంటారు.    44

శిలావటస్య మూలే తు న్యగ్రోధస్య చ కేచన।

అశ్వత్థానాఞ్చ బిల్వానాం తథామ్రాణాఞ్చ కేచన । ।౪౫

ఇక్కడ  సెలయేటిగట్టునందలి మర్రిచెట్టు క్రింద కొందరు  జమ్మిచెట్టు కింద ఇంకొందరు మునులు తపస్సు చేస్తుంటారు. ఇక్కడ రావి చెట్లు, బిల్వవృక్షాలు మరియు మామిడి చెట్లు కూడా పెరిగాయి. .45

**విశేషాలు**

‘‘బాలక ! యిచట శిలావట మూలంబున’’  అను  ధూర్జటి  శ్రీకాళహస్తి మాహాత్మ్యము ఇక్కడ స్మరణీయం. (03 -56)

జమ్బూమూలే శిలాపృష్ఠే తథార్జునతరౌ నృప ।
తపస్తీవ్రం ప్రకుర్వన్తి ఋషయస్సంశితవ్రతాః || ౪౬
ఓ రాజా! ఇక్కడ నేరేడుచెట్టు మూలమున రాతిని చీల్చుకొని రెండు అర్జున వృక్షాలు(ఏఱుమద్ది చెట్లు) ఉన్నాయి.
ఇక్కడ ఋషులు తీవ్రమైన తపస్సులు చేస్తారు. మరియు కఠినమైన ప్రమాణాలు పాటిస్తారు. 46

పురా తత్ర మహీపాల ఋషిరౌద్దాలికీశ్రుతః ।
పశుకామస్తపస్తీవ్రం తేపే నృహరిసన్నిధౌ ||౪౭
పూర్వం ఔద్దాలకుడు అనే ఋషి పశుసంపదకొరకు నరహరి సన్నిధిలో తీవ్రమైన తపస్సు చేసాడు.

స కదాచిద్ధనూమన్తం నృసింహస్య ప్రతోషణాత్ ।
చక్రం లబ్ధ్వా స నిర్యాన్తమూచే సూనృతయా గిరా ||౪౮
ఒకసారి, శ్రీ నరసింహదేవుడిని సంతృప్తి పరచడానికి మరియు ఘటికాచలప్రాంతంలోని ఒక తీర్థానికి హనుమంతుని
చక్రాయుధ స్పర్శకోరి ఔద్దాలికుడు చక్కని మాటలతో హనుమంతుని స్తుతించాడు.
హనుమంతుని,నృసింహుని మెప్పించి చక్రధారియైన హనుమంతుని చూచి ఔద్దాలికుడు ఇట్లు స్తోత్రము చేసాడు.

హనుమదష్టోత్తరశతనామ స్తవం

ఔద్దాలికః
మారుతస్యౌరసః పుత్ర ప్రసీద త్వమరిన్దమ ।
న వై త్వద్వ్యతిరిక్తోఽస్తి స్తోతా నృహరిమీశ్వరమ్ ||౪౯
ఓ మారుతీ ! ( వాయుదేవునికి ధర్మపత్నియందు పుట్టిన కుమారుడా !) . ఓ శత్రువులను, ఇంద్రియములను
వశపరుచుకొనువాడా ! దయచేసి నాపై దయ చూపండి.
నీవు తప్ప నరహరిని చక్కగా స్తుతించే వారు ఎవరూ ఈ లోకంలో లేరు.

అతిపాటలవక్త్రాబ్జం ధృతహేమాద్రివిగ్రహమ్ ।
ఆఞ్జనేయం శఙ్ఖచక్రపాణి చేతసి ధీమహి ||౫౦
తెలుపు మించిన ఎఱుపు కమలము వంటి ముఖం కలిగినవాడా ! చేతిలో బంగారు పర్వతం ధరించిన విగ్రహం
కలిగినవాడా!( కొండంత బంగారు శరీరం కలిగినవాడా!)
!శంఖం, చక్రం పట్టుకున్న ఆంజనేయా ! నిన్ను మనస్సులో ధ్యానిస్తున్నాను.
51- 60
పారిజాతప్రియో యోగీ హనుమన్ నృహరిప్రియః ।

ప్లవగేన్ద్రః పిఙ్గలాక్షశ్శీఘ్రగామీ దృఢవ్రతః ||౫౧

యోగిఅయిన హనుమంతా ! నువ్వు పారిజాత వృక్షానికి ప్రియమైనవాడివి. ( కల్పవృక్షాలలో ఒకటి. పారిజాతము, మందారము, సంతానము, కల్పవృక్షము, హరిచందనము - ఇవి దేవవృక్షములు) మరియు నరహరికి ప్రియమైనవాడివి. నువ్వు కోతుల రాజువి. గోరోజనమువంటి(పశువుల పిత్తరసమునుండి తీయబడిన ఒకానొక పసుపు పచ్చని పదార్థము) రంగు కళ్ళు కలవాడా ! వేగంగా కదిలేవాడా ! గట్టి నియమం గలవాడా !

**విశేషాలు**

1. పూజ చేసేటప్పుడు పై కప్పు (అచ్ఛాదన) ఉండాలని శాస్త్రం, సంప్రదాయం చెబుతున్నాయి. కానీ కొన్ని చెట్లకింద - వాటి నీడలో భగవదారాధన శ్రేష్ఠం. ఆ చెట్టునీడయే ఆచ్ఛాదన. మారేడు చెట్టుకింద శివారాధనని శివపురాణం చెప్పింది. అలాగే గొప్ప దేవతా వృక్షాలకింద పూజలు శ్రేష్ఠమని చెప్పారు.
   'పారిజాత తరుమూలవాసినం' అనే వాక్యంలో చెప్పిన 'పారిజాత వృక్షం' మనమనుకొనే పారిజాతం చెట్టు కాదు. పారిజాతమంటే కల్పవృక్షం. దాని మూలంలో ఉన్న హనుమంతుడు - అని అర్థం. ఆ దేవతావృక్షం ఈ భూమిపై దొరకదు. దేవతను ధ్యానించేటప్పుడు కల్పవృక్ష మూలంలో ఉన్నట్లుగా ధ్యానించి, పూజించడం అభీష్ట సిద్ధి. అలాంటి భావన హనుమత్ శ్లోకంలో చెప్పబడుతోంది. అని పెద్దలు చెప్పారు.
2. హనుమాన్' అనే మాటకి శాస్త్రరీత్యా – వాక్య కోవిదుడు, జ్ఞాని అని ప్రధానార్థాలు.
3. కేవలం హనుమంతునికే కాదు. శ్రీఘటికాచల మాహాత్మ్యపు 19 వ అధ్యాయములో పిఙ్గలాక్షం అను విశేషణము నరసింహస్వామిస్తుతిలో కూడా కవి ప్రయోగించాడు.

శఙ్ఖచక్రవరాభీతిపాణిరానన్దదాయకః |
స్థాయీ విక్రమసంపన్నో రామదూతో మహాయశాః ||౫౨

శంఖం, చక్రం, విల్లుతో పాటు అభయం మరియు ఆనందాన్ని కలిగి ఉన్న చేతులు కలిగినవాడా !

స్థితివిశిష్టుడా ! పరాక్రమములో సంపన్నత్వము కలిగినవాడా ! , మహోన్నత కీర్తి వైభవం కలిగిన రాముని దూతా !

**విశేషాలు**

1. శ్రీమూకామ్బికా అష్టోత్తరశతనామావళిలో కూడా "ఓం శఙ్ఖచక్రవరాభీతి కరాబ్జాయై నమో నమః" అని ఉండుట గమనార్హం.
2. సీతమ్మ శోకాన్ని పోగొట్టి అభయాన్నీ, ఆనందాన్నీ హనుమంతుడు ప్రతిష్ఠించాడు. జగదానందకారకుడైన శ్రీరామచంద్రమూర్తికే ఆనందాన్ని అందించాడు. "శ్రీరామ హృదయానంద" స్వరూపమే హనుమ అనే కీర్తిని సంపాదించాడు. అభయాంజనేయునిగా, ఆనందాంజనేయునిగా, ఆపదుద్ధారక మూర్తిగా తన దయా స్వరూపాన్ని వివిధ రీతులలో ప్రదర్శించిన మహా మంత్రమూర్తి హనుమ అని పెద్దలు చెప్పారు..

సౌమిత్రిజీవనకరో లఙ్కావిక్షోభకారకః |

ఉదధిక్రమణస్సీతాశోకనాశకరో హరిః ||౫౩

లక్ష్మణుని ప్రాణదాతా ! లంకలో అల్లకల్లోలానికి కారణమైనవాడా !

సముద్రాన్ని దాటి సీత దుఃఖాన్ని నాశనం చేసినవాడా ! హరీ !

విశేషాలు

1. హరి అను పదానికి యముడు, వాయువు, ఇంద్రుడు, చంద్రుడు, సూర్యుడు, విష్ణువు, సింహం, కిరణం, గుఱ్ఱం, కోతి మొదలైన అర్థాలు ఉన్నాయి.
2. ప్రాణదాతగా  హనుమంతుడు  చూపించిన దివ్యత్వం గొప్పది.. ఇంద్రజిత్తు ప్రయోగించిన బ్రహ్మాస్త్రానికి దెబ్బతిన్న వానర వీరులను, రామ లక్ష్మణులను సైతం ఓషధీపర్వతాన్ని తేవడం ద్వారా స్వస్థుల్ని చేశాడు. రావణుడు విసరిన శక్తికి మూర్ఛితుడైన లక్ష్మణ స్వామిని తిరిగి సంజీవ పర్వతాన్ని తెచ్చి బ్రతికించాడు. ఆవిధంగా మళ్ళీ శ్రీరాముని ప్రీతికి పాత్రుడయ్యాడు

బలీ రాక్షససంహర్తా దశకణ్ఠమదాపహా |

బుద్ధిమాన్ నైర్ృతవధూకణ్ఠసూత్రవిదారకః ||౫౪

బలవంతులైన రాక్షసులను నాశనం చేసినవాడా !పది తలల రావణుని గర్వాన్ని నాశనం చేసినవాడా !

బుద్ధిమంతుడా ! నిరృతి అను రాక్షసుని భార్య యొక్క మంగళ సూత్రము తెంచినవాడా !

1.నైరుతి దిక్కుకు అధిష్టాన దేవత నివృత్తి అనే రాక్షసుడు. అన్న దిక్కులకన్నా ఈ దిశ తక్కువ ఖాళీగా ఉండి ఎక్కువ ఎత్తు కలిగి ఉండాలి. ఈ దిశలో ఎక్కువగా బరువులు వేయటం శుభం. ఈ దిశలో గోతులు, నూతులు ఉన్నట్లైతే ప్రమాదాలు, దీర్ఘ వ్యాధులు, స్థిరాస్తులు కోల్పోవటం జరుగుతుంది.

2. రావణుడు మహాశివభక్తుడు,వీరాధివీరుడు, పది రకాలుగా ఆలోచించేవాడనే దానికి, పది విద్యలలో ప్రవీణుడు అన్నదానికి ప్రతీకగా, కళా రూపాలలో రావణుని పది తలలతో చిత్రిస్తారు. పది తలలు ఉండటం చేత ఈయనకు దశముఖుడు (పది ముఖములు కలవాడు), దశగ్రీవుడు (పది శీర్షములు కలవాడు), దశకంథరుడు, దశకంఠుడు (పది గొంతులు కలవాడు) అన్న పేర్లు వచ్చాయి

రావణుడికి పదితలలు పుట్టుకతో వచ్చినవి కావు. వరప్రసాదంగా లభించినవి కావు. కామరూప విద్యతో పది తలలు ఏర్పడ్డాయి. అలా పది తలలు వచ్చినప్పుడు.. ఇరవై చేతులూ వస్తాయి. సర్వసాధారణంగా యుద్ధరంగంలో శత్రువులకు భయం కలిగించడానికి రావణుడు ఈ పదితలలు, ఇరవై చేతుల రూపాన్ని ధరిస్తూ ఉండేవాడు. నిద్రించే సమయంలో, భార్యలతో కలిసి ఉన్న వేళలో.. ఒకే తల, రెండు చేతులతో ఉండేవాడు. ఈ పదితలలూ ఆధ్యాత్మికంగా ఒక సంకేతం కూడా! మనస్సుకు లోబడి ఐదు కర్మేంద్రియాలు, ఐదు జ్ఞానేంద్రియాలు మొత్తం పది ఇంద్రియాలు ఉంటాయి. ఈ పదింటినీ అదుపులో పెట్టుకోవడం ఆధ్యాత్మిక సాధనకు బలమవుతుంది. వీటికి లొంగిపోవడం లౌకిక బంధాలకు కారణం. పది ఇంద్రియాలకు లొంగిపోయినవాడే రావణుడు.(- మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తిగారు)

సుగ్రీవసచివో భీమో భీమసేనసహోదరః ।

సావిత్రీవిద్యాసంసేవీ చరితార్థో మహోదరా ॥ ౫౫

సుగ్రీవుని మంత్రీ ! భయంకరమైనవాడా ! భీమసేనుని సోదరుడా !

గాయత్రి జ్ఞాన గౌరవము కలిగినవాడా ! ప్రయోజనమును పొందిన(పొందించు)వాడా ! విశాలమైన ఉదరం కలిగినవాడా !

వాసవాభీష్టదో భవ్యో హేమశైలనివాసవాన్ ।

కింశుకాభోఽవ్యగ్రతనూ ఋజురోమా మహామతిః ॥౫౬

ఇంద్రుని కోరికలన్నింటినీ తీర్చేవాడా ! గొప్పవాడా ! మరియు బంగారు పర్వతంపై నివసించేవాడా !

మోదుగుపువ్వు లాంటి క్షోభించని శరీరము కలవాడా ! చక్కనయిన రోమములు కలవాడా ! గొప్ప తెలివితేటలు కలిగినవాడా !

మహాక్రమో వనచరస్స్థిరబుద్ధిరభీశుమాన్ ।

సింహికాగర్భనిర్భేత్తా లఙ్కానివాసినామ్ ॥౫౭

**మిక్కిలి గొప్పవైన అడుగులు కలవాడా ! వనములో తిరుగువాడా** స్థిరమైన మేధావీ ! కిరణములు( కాంతి) కలవాడా !

సింహిక గర్భాన్ని మరియు లంక నివాసులను నాశనం చేసినవాడా !

విశేషాలు

1. **మహాక్రమో మహా కర్మా మహా తేజా మహోరగః ।**

   **మహా క్రతు ర్మహా యజ్వా మహా యజ్ఞో మహా హవిః ॥ అని విష్ణుసహస్ర నామము ఇక్కడ స్మరణీయము**

'శం నో విష్ణు రురుక్రమః' ఇతి శ్రుతేః. 'శం - నో- విష్ణు - రురుక్రమః' అను శ్రుతి వచనాన్ని అనుసరించి మహాపద విక్షేపములు (కదలికలు) కలవాడగుట జేసి పరమేశ్వరుడు మహాక్రముడు అని శంకరులు విష్ణుసహస్రనామభాష్యంలో ఈ నామానికి వివరణ చేసారు.

**2. తత్ర స్థితం ప్రసన్నం తరుణతమాలప్రవాళకిరణాభామ్ ।**

**కర్ణావలంబికుండల కందళితాభీశుకవచితకపోలమ్ ॥ అను ఆర్యాద్విశతి 74 వ శ్లోకములో విష్ణువును అభీశు - కిరణములచేత (కాంతులచేత), కవచిత - వ్యాపింపబడిన, కపోలమ్ - చెక్కిళ్ళు కలవానిగా చెప్పారు. ఇక్కడ హనుమంతుని అభీశుమాన్ గా పేర్కొన్నారు.**

**3. ఆంజనేయుడికి సముద్ర లంఘనంలో ఎదురయిన ఆటంకాలలో ఒకటి సింహిక రూపంలో ఎదురవుతుంది. ఆమె ఆకాశంలో ఎగురుతున్న జీవుల నీడను పసిగట్టి వాటిని తన నోట్లోకి లాక్కునే స్వభావం కలది. హనుమంతుడిని అలానే**

**లాక్కునే ప్రయత్నం చేయగా  ఆంజనేయుడు  తన శరీరాన్ని పెంచి  ఆయువుపట్టును గుర్తించి,  ఆమె నోట్లో ప్రవేశించి ఆయువుపట్టును బద్దలుకొట్టి బయటికి వస్తాడు.తరువాత  సింహికను పూర్తిగా చంపుతాడు ఆంజనేయుడు.**

సింహికాగర్భనిర్భేత్తా అని ఘటికాచలమాహాత్మ్యం ఈ వృత్తాంతాన్ని పేర్కొంది.

అక్షఘ్నశ్శత్రునిఘ్నశ్చ రక్షోఽమాత్యభయావహః |
వీరహా మృదుహస్తశ్చ పద్మపాణిర్జటాధరః ||౫౮

అక్షకుమారుని చంపినవాడా ! శత్రువులను చంపువాడా !  మంత్రి కుమారులను  భయపెట్టే వాడా !
రాక్షస వీరులను చంపువాడా !  మృదువయిన హస్తములు కలిగినవాడా !  చేతిలో కమలం పట్టుకున్నవాడా !  జడలను ధరించువాడా !

సర్వప్రియస్సర్వకామప్రదః ప్రాంశుముఖః శుచిః |
విశుద్ధాత్మా విజ్వరశ్చ సటావాన్ పాటలాధరః ||౫౧

అందరికీ ప్రియమైనవాడా ! అన్ని కోరికలను ప్రసాదించేవాడా ! విశాలమైన ముఖం కలిగినవాడా !  పవిత్రుడా !
హృదయంలో స్వచ్ఛంగా ఉన్నవాడా !  ఎప్పుడూ స్వస్థతగా ఉండువాడా ! జూలు కలిగిన వాడా ! తెలుపు మించిన ఎఱుపు కలిగిన పెదవి కలిగినవాడా !

**విశేషాలు**

**తతో విభీషణః పార్థ రామమిక్ష్వాకునందనమ్ |**
**ఉవాచ విజ్వరం దృష్ట్వా కృతాంజలిరిదం వచః || 8**

యుధిష్ఠిరా! అప్పుడు ఇక్ష్వాకునందనుడైన రాముడు స్వస్థుడై ఉండడంతో విభీషణుడు చేతులు జోడించి ఇలా అన్నాడు. (8)
(**మహాభారతమున వనపర్వమున రామోపాఖ్యానమను ఉపపర్వమున ఇంద్రజిద్వధ అను రెండువందల ఎనుబది తొమ్మిదవ అధ్యాయము 08 వశ్లోకం) అను విజ్వర ప్రయోగము కలిగిన  భారత శ్లోకము ఇక్కడ స్మరణీయం**

భరతప్రేమజనకో చీరవాసా మహాక్షదృక్ |
మహాస్త్రబన్ధన సహో బ్రహ్మచారీ వ్రతేశ్వరః ||౬౦

భరతుని ప్రేమకు కారణమయినవాడా ! నార బట్టలు ధరించినవాడా !గొప్పవైన కన్నులు కలవాడా! (
గొప్ప అస్త్రప్రభావాలకు లొంగనివాడా !   బ్రహ్మచారీ !  మరియు గొప్ప ఆయుధాలు కలిగిన వ్రత ప్రభువు.

**విశేషాంశములు**

1. మహతీ అక్షిణీ మహాన్త్యక్షిణి వా అస్యేతి మహాక్షః విశాలమైన నేత్రములు కలవాడు అని మహాక్ష పదానికి  శంకర భగవత్పాదులు అర్థం చెప్పారు.
2. హనుమంతుడు బ్రహ్మచారి అయితే, మరి 'సువర్చల' అనే భార్య ఎవరు? సమన్వయం ఎలా?

రామాయణం వరకూ హనుమంతుడు బ్రహ్మచారి. భార్య లేదు.

కాని ఒక హనుమన్మంత్రం -'సువర్చలాంజనేయం'. హనుమంతుని శక్తి 'సువర్చస్సు'-సువర్చలగా ఉపాసింపబడుతున్నది.

మంత్రాధి దేవతని శక్తిసహితంగా ఉపాసించాలి. .అందువలన సువర్చలా సహిత హనుమంతుని ఉపాసించాలి.

ఇది ఉపాసనకి సంబంధించినది.

అలాగే పంచముఖాంజనేయుడు కూడా మంత్రోపాసనమూర్తి.

రామకథలోని హనుమంతుడు- ఆ మంత్రమూర్తి ధరించిన ఒక అవతారం

. రామాయణంలో సువర్చల ప్రసక్తి లేదు. కాని ఉపాసనాపరంగా సువర్చల ఉన్నది అని పెద్దలు చెప్పారు.

61 - 70

శ్రీవసిష్ఠః-

మహౌషధోపహర్తా చ వృక్షపర్వా వృషోదరః ।

సూర్యోపలాలితస్స్వామీ పారిజాతావతంసకః ॥౬౧

గొప్ప ఔషధ మూలికలను  లోకానికి అందచేసినవాడా ! చెట్టు లక్ష్యముగా కలిగినవాడా ! ( పారిజాత తరుమూల వాసినం). బాల్యంలో  సూర్యునిచేత ప్రేమతో  బుజ్జగింపబడినవాడా ! భక్త సామ్రాజ్యానికి అధిపతి అయినవాడా !  పారిజాతము అలంకారముగా కలిగినవాడా !( పారిజాత విశేషాలకు 51 వశ్లోక వ్యాఖ్యచూడండి)

సర్వప్రాణధరోఽనన్తస్సర్వభూతాతిగో మనుః ।

రౌద్రాకృతిర్భీమకర్మా భీమాక్షో భీమదర్శనః ॥ ౬౨

అందరి జీవుల ప్రాణములను ధరించువాడా !  దేశ, కాల, వస్తు పరిమాణం లేని పరబ్రహ్మ ! అన్ని జీవులకు అతీతుడా ! మంత్రస్వరూపుడా !

భయంకరమైన రూపం కలిగినవాడా ! భయంకరమైన  పనులు చేయువాడా !  భయంకరమైన   కళ్ళు కలవాడా ! భయంకరముగా కనిపించువాడా ! 62

సుదర్శనకరోఽవ్యక్తో వ్యాత్తస్యో దున్దుభిస్వనః ।

సువేలచారీ మైనాకహర్షదో హర్షణప్రియః ॥౬౩

సుదర్శన చక్రము చేతకలవాడా ! మనోబుద్ధ్యాదులకు అగోచరమైన ప్రత్యగాత్మ(పరమాత్మ) యొక్క  మహత్తత్త్వమయినవాడా! విస్తరింపబడినవాడా !  భేరిశబ్దమువంటి కంఠస్వరం కలిగినవాడా !

త్రికూట పర్వత సంచారీ !( త్రికూట పర్వతాన్ని చేరుకున్న హనుమంతుడు రాత్రి సమయంలో తన శరీరాన్ని కుదించుకొని లంకా నగరంలోకి ప్రవేశించాడు.) మేనకకు పుట్టిన మైనాక పర్వతమునకు ఆనందము కలిగించువాడా ! సంతోషపెట్టు స్వభావనము కలవారికి ఇష్టమయినవాడా !

**విశేషాలు**

***సుదర్శనకరుడు*** - అని భాగవత ప్రయోగము విష్ణుపరంగా[3-748-క.]

**మహత్తత్త్వం**

మహత్ అంటే గొప్ప. మహత్‌తత్త్వం అంటే గొప్పతత్త్వమనీ, మహదహంకారం అంటే గొప్ప అహంకారమనీ నైఘంటుకార్థం. జ్ఞానేంద్రియాలతో కూడిన బుద్ధి వ్యష్టిగానూ, సమష్టిగానూ వ్యక్తం అవుతుంది. వ్యష్టిగా అది కేవలం బుద్ధి. సమష్టిగా అది మహత్తత్త్వం, మహద హంకారం కూడా. బుద్ధికి సంబంధించిన వృత్తులు కలిగి, కర్తృత్వ లక్షణాలతో సంసారాన్ని నిర్వహిస్తుంది. (మహావాక్య దర్పణం 69వ శ్లోకం ఆధారంగా.)

**దుందుభి స్వనః**

దుందుభి స్వన నిర్ఘోషః స్నిగ్ధ వర్ణః ప్రతాపవాన్ | సమస్సమ విభక్తాంగో వర్ణం శ్యామం సమాశ్రితః || 5.35.16

**మైనాకుడు**

ఇక్ష్వాకుకుల తిలకుని రాముని కార్యార్థమై వెళ్ళుతున్న హనుమంతునకు సహాయము చేయడానికి సాగరుడు తనలో దాగి వున్న మైనాకునకు చెపుతాడు. మైనాకుడు వెంటనే సూర్యకాంతిలో మెరుస్తున్న బంగారు శిఖరాలతో పైకి పెరిగి నిలబడతాడు సాగరములో.అలా హఠాత్తుగా కనబడిన మైనాకుడు హనుమంతునికి ఒక అడ్డంకి లాగా కనిపిస్తాడు.వెంటనే హనుమంతుడు తన రొమ్ముతో ఢీకొని మైనాకుని శిఖరాలని నుగ్గు నుగ్గు చేస్తాడు.అప్పుడు మైనాకుడు తన మానుషరూపము ధరించి , ఇక్ష్వాకుకులానికి సహాయము చేయాలి అనే సాగరుని కోరిక,అదే కాక తనను హనుమంతుని తండ్రి అగు వాయుదేవుడు రక్షించిన ఉపకారము ,దానికి ప్రత్యుపకారము చేయవలసిన తన కర్తవ్యము చెప్పి ,హనుమంతుని తన శృంగములలో విశ్రమించమని కోరుతాడు. అతి ముఖ్యమైన కార్యం మీద వెళుతున్నందున ఎక్కువ సేపు ఆగకుండా అతన్ని ఆశీర్వదించి హనుమ ముందుకు సాగిపోయాడు.

**సులభస్సువ్రతో యోగీ యోగిసేవ్యో భయాపహః |**
**వాలాగ్నిమథితానేకలఙ్కావాసిగృహోచ్చయః || ౬౪**

సులభముగా లభించువాడా ! మంచి వ్రతం కలవాడా ! యోగసాధనము చేసినవాడా !యోగులచే సేవింపబడువాడా ! భయమును తొలగించువాడా !

తోకకు అంటించిన నిప్పుచేత కాల్చబడిన అనేక లంకా గృహములు కలిగినవాడా ! ( హనుమంతుడు తనతోకతో అనేక లంకా గృహములను కాల్చాడని భావం)

**విశేషాలు**

- 1. చిత్తవృత్తులను నిరోధించడం యోగమని పాతంజల యోగ సూత్రాలలో రెండవదైన "యోగశ్చిత్త వృత్తి నిరోధః" అనే సూత్రం తెలియజేస్తున్నది. సుషుప్తి మినహా మిగిలిన అవస్థలలో చిత్తంలో ఏదో ఒక జ్ఞానం కలుగుతునే ఉంటుందనీ, ఇదే చిత్త వృత్తి అనీ ఆచార్య పుల్లెల శ్రీరామ చంద్రుడు గారు పాతంజల యోగ సూత్రాలకు తమ బాలానందినీ వ్యాఖ్యలో నిర్వచించారు.2. మనోనాశానికీ, వాసనాక్షయానికీ చేసే పురుష ప్రయత్నం యోగం. 3. జీవాత్మ పరమాత్మల ఐక్యం.యోగం

**వర్ధనో వర్ధమానశ్చ రోచిష్ణూ రోమశో మహాన్ |**
**మహాదంష్ట్రో మహాశూరస్సద్గతిస్సత్పరాయణః ||౬౫**

వృద్ధి చేయువాడా ! వృద్ధి చెందు స్వభావం కలవాడా ! ప్రకాశించు స్వభావము కలవాడా ! శరీరమందు వెండ్రుకలు గలవాడా ! పూజింపబడువాడా !( గొప్పవాడా !)

గొప్ప కోరలు కలవాడా ! యుద్ధమునకు భయపడని గొప్ప పరాక్రమము కలిగినవాడా ! ప్రశస్తమైన ఉత్తమశీలము కలవాడా ! **సజ్జనులకు పరమగతి అయినవాడా !**

**సౌమ్యదర్శీ సౌమ్యవేషో హేమయజ్ఞోపవీతిమాన్ |**
**మౌంజీకృష్ణాజినధరో మన్త్రజ్ఞో మన్త్రసారథిః || ౬౬**

మృదువుగా కనిపించేవాడా ! మృదువయిన వేషము కలిగినవాడా ! బంగారుమయమయిన  యజ్ఞోపవీతము ధరించినవాడా ! ఉపనయన సమయంలో వటువునడుము కట్టుకొనవలసిన ముంజ గడ్డి తాడు ధరించినవాడా ! మరియు నల్ల జింక చర్మం ధరించినవాడా !  మంత్రాలను ఎలా జపించాలో తెలిసినవాడా !  మంత్రాల రథసారథీ ! 66

**విశేషాలు**

**యజ్ఞోపవీతము**

యజ్ఞోపవీతము అనగా జందెం. వైదిక కర్మాచరణకు అర్హత కలిగిస్తుంది కనుక యజ్ఞ సూత్రం. వేదాధ్యయన యోగ్యత కలిగిస్తుంది గనుక బ్రహ్మసూత్రం. ఉపనయన సమయంలో అది బ్రహ్మసూత్రం. ఎడమ భుజము మీది నుంచి ఒక వైపు ఉదర భాగాన్ని, మరొక వైపు వీపును తగులుతూ కుడిచేతి క్రింద వ్రేలాడుతున్నప్పుడు అది ఉపవీతం. యజ్ఞసూత్రం ఇలా ఉన్నప్పుడు దేవతా కార్యాలన్నీ చేయవచ్చు. యజ్ఞ సూత్రం మెడలో హారంవలె వ్రేలాడు తున్నప్పుడు అది నివీతం. ఋషి తర్పణం, మలమూత్ర విసర్జనాదులలో యజ్ఞోపవీతం నివీతంగా ఉండాలని అంటారు

**జితారాతిష్షడూర్మిశ్చ సర్వప్రియహితేరతః |**
**ఏతైర్నామపదైర్దివ్యైర్యస్తౌతి తవ సన్నిధౌ ||౬౭**

ఊర్మి అంటే అల, నొప్పి, ప్రకాశం, ప్రవాహం, వంకర మొదలైనవి సామాన్యార్థాలు. పారమార్థికంగా ధర్మం, తత్త్వం అనే అర్థాలు ఉన్నాయి. జీవి ధర్మాలను షడూర్ములు అన్నారు. ఆకలి, దప్పిక, దుఃఖం, మోహం, వార్ధక్యం, మరణం జీవి ధర్మాలు. ఇందులో ఆకలి దప్పులు ప్రాణధర్మాలు. దుఃఖం, మోహం మనస్సు ధర్మాలు. వృద్ధాప్యం, మరణం దేహధర్మాలు.ఈ ఆరురకాలైన ఊర్ములను  మరియు శత్రువులను జయించినవాడా ! అందరికి ప్రియము చేయుటయందు, మేలు కోరుటయందు ఇష్టపడే స్వభావం కలిగినవాడా !

ఈ విధముగా దివ్యమయిన నామావళిని   చక్రధారియైన హనుమంతుని సన్నిధిలో ఎవడు గానం చేస్తాడో (అతడు కోరిన కోర్కెలు పొందుతాడు)

హనూమంస్తస్య కిం నామ నో భవేత్ భక్తిశాలినః |
ప్రణవఞ్చ పురస్కృత్య చతుర్థ్యన్తైర్నమోన్తకైః ||౮౮

మనం పూజించాల్సిన హనుమంతుడు   ప్రసన్నుడగుటకు అద్భుతమైన మార్గము ఈ నామ పఠనం. ఈ నామాన్ని భక్తితో చదివిన వారికి నెరవేరనిది ఏది ఉంటుంది? ( అన్ని నెరవేరుతాయని భావం)

ప్రతి నామానికి ముందు ఓంకారము చేర్చి, చివర చతుర్థీ విభక్తి , నమః చేర్చి చదివితే ఇంకా విశేష ఫలితముంటుంది( ఉదాహరణకి ఓం సర్వప్రియహితేరతాయ నమః అని చదవాలి.)

విశేషాలు

ప్రణవం

- ప్రణవమనగా ఓంకారం. (విష్ణువు, స్తుతి అనే అర్థాలు కూడా) నిరంతరం ప్రస్తుతిని అందుకొంటుంది కనుక ప్రణవమని అన్నారు.  శ్రుతి వాక్యం "ప్రణామయతి ఇత్యేస్మాత్ ప్రణవః" ప్రకారం జీవితాహంకారాన్ని నశింపజేసి, సర్వకర్తృత్వాదికం పరమాత్మదే అనే అనుభవమే ప్రణవం.

ఏతైర్నామభిరవ్యగ్రైరుచ్యతే హనుమన్ భవాన్ |
వ్రణరోగాదిదారిద్ర్యం పాపక్షుదపమృత్యవః ||౮౯
వినశ్యన్తి హనూమంస్తే నామ్నాం సంకీర్తనే క్షణే |
భగవన్ హనుమన్నిత్యం రాజవశ్యం తథా సతామ్ ||౯౦

ఓ హనుమంతుడా ! ఎవడు ఈ నీ నామాలను ఆత్రుత లేకుండా శ్రద్ధగా అర్థం చేసుకొంటూ చదువుతాడో అతనికి శరీరమును గాయపరచు పుండ్లు మొదలయినవి, దరిద్రము పోతాయి. పాపము, ఆకలిబాధ, అపమృత్యు(అకాల మరణము)బాధ తొలగిపోతాయి. ఈ హనుమంతుని నామావళిని చదివినవారికి రాజు( అధికారి) వశుడవుతాడు. ( అనగా అధికారుల దగ్గర పనులు వెంటనే జరుగుతాయని భావం)

71- 80

లక్ష్మీవశ్యం చ స్త్రీవశ్యం ఆరోగ్యం దైర్ఘ్యమాయుషః ।

ప్రాధాన్యం సకలానాం చ జ్ఞాతి ప్రాధాన్యమేవ చ ।

వీర్యం తేజశ్చ భక్తానాం ప్రయచ్ఛసి మహామతే ॥౭౧

ఎవడు ఈ హనుమంతుని నామాలు చదువుతాడో అతనికి  సంపద వశమవుతుంది.   స్త్రీలు వశమవుతారు.  ఆరోగ్యం మరియు దీర్ఘాయువుతో ఆశీర్వదించబడతాడు. అందరిలోను అతనికి  ప్రాధాన్యత కలుగుతుంది. ఒకే వంశములో పుట్టినవారిలో ఈ నామావళిని చదివినవారికి    ప్రాధాన్యత పెరుగుతుంది .ఓమహా బుద్ధిమంతుడా ! హనుమంతుడా !    ఈ నామావళిని చదివినవారికి తేజస్సు, పరాక్రమమును నువ్వు అనుగ్రహిస్తావు.

ఇతి సంతోషితస్తేన హనూమానపరాజితః ।

ఈ స్తోతమును విన్న ఓటమి ఎరుగని  హనుమంతుడు  సంతోషించాడు .ఔద్దాలికునితో ఇలా అన్నాడు.

ప్రాహ ప్రసన్నయా వాచా కిమభ్యర్థయతే వరాన్ ॥౭౨

"ఓ మునీ! నీ స్తోత్రముతో నేనుసంతోషించాను. ఏమి వరము కావాలో కోరుకో. ఇస్తాను.

హనూమాన్ -

ప్రసన్నోఽహం తవాభ్యర్ణే సంస్తుతో నామభిర్మునే ।

వద సువ్యక్తయా వాచా ఋషిమోద్దాలికీం తథా ॥౭౩

ఓ ఔద్దాలిక మునీ ! నువ్వు (నా హృదయానికి) దగ్గరగా చదివిన, అదేవిధంగా నారూప ప్రాభవాలను సువ్యక్తం చేసిన  ఈ నా నామాలకు  నేను ప్రసన్నుడిని అయ్యాను.

ఏతైర్నామపదైర్దివ్యైరర్చయన్తి నిరాకులాః ।

స్తువన్తి వా సకృత్తేషాం కామదోఽహం సదా మునే ॥౭౪

ఓ ఔద్దాలిక మునీ !  ఈ నా  స్తోత్రము చదివినవాడు ఏబాధలు లేక నా అనుగ్రహమువలన కోరుకున్న వరములను పొందగలడు.

ఏతేన మమ వై నామ్నామష్టోత్తరశతేన చ ।

కౌణ్డిన్యో మాం సమభ్యర్చ్య ప్రాప్తవాన్ పుత్రసంపదః ॥౭౫

ఈ అష్టోత్తర శత నామ స్తోత్రముతో  పూర్వము  కౌండిన్యుడు అనే ఋషి  నన్ను సేవించి పుత్రసంపదను పొందాడు.

అకాతర్యఞ్చ మనసో నిర్మర్యాదాం తథాధిపః ।
అక్షోభ్యమిన్ద్రియాణాఞ్చ దీయతేఽస్మై సదా మునే ॥౨౬

ఓ ఔద్దాలిక మునీ !  ఈ అష్టోత్తర శత నామ స్తోత్రము  చదివిన వారికి పిరికితనము తొలగిపోతుంది. అవమానము రాదు. ఇంద్రియములు బాధించవు. ఇంద్రియ నిగ్రహము కలుగుతుంది. అమితమయిన ధైర్యము వారికి నేను ఎప్పుడూ అనుగ్రహిస్తాను.

ఆయురారోగ్యమైశ్వర్యం తస్మై దత్తాన్యమూని వై ।
తదాభిలషితం సద్యో దద్మి స్తోత్రేణ తోషితః ॥౨౭

ఈ అష్టోత్తర శత నామ స్తోత్రము   చదివినవారికి ఆయురారోగ్య ఐశ్వర్యములు కలుగుతాయి. నా ఈ స్తోత్రము చదివినవాడు  ప్రశంసలతో సంతృప్తి చెందుతాడు. అతడు  కోరుకున్నదానిని  వెంటనే అతనికి అనుగ్రహిస్తాను.

శ్రీవసిష్ఠః
తతః ప్రహృష్టో భగవాన్ ఋషిరౌద్దాలికస్తదా ।
హనూమన్తం సమభ్యర్చ్య వాక్యముత్తరమబ్రవీత్ ॥౨౮

హనుమంతుని మాటలు విని మహా సంతోషముతో ఔద్దాలికుడు హనుమంతుని చక్కగా పూజించి ఇలా అన్నాడు.

ఔద్దాలిక:-
స్వామిన్నచఞ్చలా భక్తిరస్తి మే త్వయి సర్వదా ।
ప్రసాదం కురు సర్వత్ర ప్రసన్నేనాన్తరాత్మనా ॥౨౯

"స్వామీ! నాకు నీపై  అచంచలమైన భక్తి ఎప్పుడూ ఉండుగాక!  ఎల్లప్పుడు నువ్వు  నాపై దయ చూపించు.

ఏతస్మిన్నేవ తీర్థే వై కౌణ్డిన్యాద్యా ద్విజర్షయః।
తపః కుర్వన్తి నిరతం హనుమత్ప్రియకాఙ్క్షిణః ॥౩౦

ఈ పవిత్ర తీర్థంలో  కౌండిన్యుడు  మరియు ఇతర బ్రాహ్మణ ఋషులు నివసిస్తూ నిన్ను ప్రసన్నం చేసుకోవాలనే కోరికతో తపస్సు చేస్తున్నారు

సర్వేషాం చైవ దేవానామృషీణాఞ్చ మహాత్మనామ్ ।
ప్రీతయే చక్రసజ్జేన పవిత్రీ కురు దీర్ఘికామ్ ॥౩౧

స్వామీ! ఇంకా చాలామంది దేవతలు, ఋషులు , మహాత్ములు  ఈ తీర్థ సమీపములో నివసిస్తున్నారు. ఈ తీర్థమును నీ చక్రముతో పవిత్రముచేయవలసినదిగా మనవి.

ఏష నః ప్రథమః కామః పవనానన్దవర్ధన ।
చక్రతీర్థమితి హ్యస్య నామఖ్యాతం భవిష్యతి ॥౮౨
తండ్రి యైన వాయువుకు  ఆనందము కలిగించు ఆంజనేయా !  దీనికి చక్ర తీర్థము అను పేరు కలుగుగాక. ఇది నా యొక్క మొదటికోరిక  అని ఔద్దాలికుడు ఆంజనేయుని ప్రార్థించాడు.

వసిష్ఠః
అథాఞ్జనేయో ధర్మాత్మా బ్రహ్మర్షిప్రీతయే నృప ।
చక్రం సంయోజ్య సలిలే స్వపదం పునరేయివాన్ ॥౮౩
అప్పుడుధర్మాత్ముడయిన  ఆంజనేయుడు బ్రహ్మర్షుల ప్రీతికొరకు  చక్రమును నీటిలో త్రిప్పి ఔద్దాలికునకు కోరిన వరములు ఇచ్చి తన స్వస్థానమునకు వెళ్ళాడు

గతే తు తస్మిన్ సరసి చక్రపాణౌ హరీశ్వరే।
చక్రాఖ్యయా చ జయతే త్రిషు లోకేషు విశ్రుతః ।। ౮౪
ఆంజనేయుడు తన స్వస్థానమునకు వెళ్లిన తరువాత  చక్రం పట్టుకున్న ఆ అంజనేయ ప్రభువు పేరు మీదుగా ఆ తీర్థం చక్రతీర్థమని పిలువబడుతూ మూడు లోకాలలోను పేరు పొందింది.   84

చక్రపుష్కరిణీస్నాయీ నరో ముచ్యేత కిల్బిషాత్।
శ్రోతా వాధ్యాయమేతద్ధి జపన్వా నాత్ర సంశయః ॥ ౮౫
ఈచక్రపుష్కరిణిలో స్నానము చేసేనవారు సర్వపాపములనుండి విముక్తులవుతారు.  ఈ అధ్యాయమును చదివినా,  విన్నా పాపవిముక్తులవుతారు.

ఇతి బ్రహ్మకైవర్తే ఉత్తరఖణ్డే భృగుపరాశరసంవాదే ఘటికాచలమాహాత్మ్యే వింశోఽధ్యాయః ॥
ఇక్కడితో  బ్రహ్మ-కైవర్త పురాణంలోని ఉత్తరఖండంలో భృగువు మరియు పరాశరుని మధ్య జరిగిన సంభాషణలో ఘటికాచల మాహాత్మ్యంలో  ఇరవయవ అధ్యాయం పూర్తి అయినది.

శ్రీ శివాయ గురవే నమః

ఘటికాచలనివాసాయ శ్రీ నృసింహాయ నమః

బ్రహ్మకైవర్త పురాణములో ఉన్న శ్రీఘటికాచల మాహాత్మ్యపు 21వ అధ్యాయం

(మూల శ్లోకము మరియు తాత్పర్య విశేషాలతో)

---

శ్రీఘటికాచలమాహాత్మ్యమ్

ఏకవింశోఽధ్యాయః

బ్రహ్మ

1 - 10

అరున్ధతీసహాయేన గురుణా చోదితాః కథాః|

ఇన్ద్రద్యుమ్నస్తథా శృణ్వన్ హృష్టో నావిన్దత శ్రమమ్ ||౧

బ్రహ్మ ఇట్లనెను. ఈవిధముగా అరుంధతి సహాయంతో వశిష్ఠుడు అను గురువు బోధించిన కథలు ఇంద్రద్యుమ్నుడు విని సంతోషించాడు. అలసట చెందలేదు.

ఘటికామాత్రతస్తస్య ఘటికాచలరోహణమ్ |

అభవన్మునయస్తత్ర పుణ్యతీర్థకథాశ్రవాత్ ||౨

కేవలం ఒక గడియలోనే, ఇంద్రద్యుమ్నుడు అత్యున్నతమయిన ఘటికాచల శిఖరాన్ని అధిరోహించాడు.
పవిత్ర స్థలాల కథలు వినడం ద్వారా సాధారణమయిన మానవులు ఘటికాచలములో ఋషులు అయ్యారు

గురుణోక్తేన విధినా శఙ్ఖతీర్థే మహర్షయః |

చక్రతీర్థే చ స స్నాత్వా తర్పయామాస దేవతాః ||౩

ఇంద్రద్యుమ్నుడు వశిష్ఠుడు అను  గురువు చెప్పినట్లుగా  ఘటికాచలమును అధిరోహించి మునులతో కలిసి శంఖచక్రతీర్థములలో స్నానము చేసాడు.  దేవతలను, పితృదేవతలను  తృప్తి పడేటట్లు చేసాడు.

విశేషాలు

హోమాదులలో హవిస్సులను అందుకొనే దివంగత తండ్రి, తాత, ముత్తాతలు. పితృదేవతలను మూడు రకాలుగా వర్గీకరించారు. విధియుక్తమైన శ్రౌతాది కర్మలను ఆచరించినవారు ఉత్తములు. స్మార్త కర్మలను మాత్రం చేసి పితృదేవతల స్థానం పొందినవారు మధ్యములు. మిగతా వారు చివరి వర్గం. ఈ మూడు వర్గాలవారూ హవిస్సులను స్వీకరించడానికి అర్హులే.

పాదప్రక్షాలనాదూర్ధ్వం త్రిరాచమ్య శుచిస్తదా |

ఆరురోహ వసిష్ఠేన దక్షిణం శృఙ్గసత్తమమ్ ||౪

తన పాదాలను కడుక్కున్న తర్వాత మూడుసార్లు ఆచమనము చేసి పరిశుద్ధి పొంది,   ఇంద్రద్యుమ్నుడు వశిష్ఠునితో కలసి ఘటికాచల దక్షిణ శిఖరాన్ని ఎక్కాడు.

విశేషాలు

ఆచమనం అంటే కేవలం ఒక ఉద్ధరణి నీళ్లు చేతిలో పోసుకొని లోపలికి పుచ్చుకోవడం మాత్రమే కాదు, మంత్ర పూత జలంతో శరీరాన్ని స్పర్శించడం, స్నానం చేయడం కూడా ఆచమనమే. ఆచమనం నాలుగు విధాలు. అవి : 1. శ్రుత్యాచమనం : స్వాధ్యాయ బ్రాహ్మణంలోని శ్రుతి "హస్తౌ వవవిజ్య రతిరాచమేత్..." అంటూ చేతులు కడుగుకొని, "ఓం కేశవాయ స్వాహా, ఓం నారాయణాయ స్వాహా, ఓం మాధవాయ స్వాహా" అని ఆచమనం చేయాలి. తరువాత రెండు చేతులను శుద్ధి చేసుకొని, ఉదకాన్ని స్పృశించి, కుడి చేతితో ఎడమ చేతిమీద, పాదాల మీద నీళ్లు చల్లుకోవాలి. శిరస్సు, నేత్రాలు, ముక్కు, చెవులు, హృదయ స్థానాలను తాకాలి. 2. శ్రౌతాచమనం : గాయత్రీ మంత్రంలోని మూడు పాదాలను విడివిడిగా స్వాహాకారంతో పలిస్తూ, అంటే ఓమ్ తత్సవితుర్వరేణ్యగ్ స్వాహా, భర్గోదేవస్య ధీమహి స్వాహా, ధియో యోనః ప్రచోదయాత్ స్వాహా అని పలుకుతూ ఆచమించడం మొదలైన క్రియలు ఇందులో ఉన్నాయి. 3. స్మృత్యాచమనం/ స్మార్తాచమనం : పీట/ కృష్ణాజినం మీద కూర్చుని, పాదాలను నేలపై ఉంచి, ఆపస్తంబ సూత్ర సంప్రదాయంలో ఆచమించే పద్ధతి. బొటన వ్రేలితో పెదవులను తుడుచుకోవడం లాంటి క్రియలు ఇంకా ఉన్నాయి. 4. పురాణాచమనం : ముమ్మారు కేశవ నామాలతో ఆచమించడం, గోవిందాది నామాలతో అవయవ శుద్ధి మొదలైన క్రియలు ఇందులో ఉన్నాయి. శ్రుత్యాచమనం, శ్రౌతాచమనం ఒక్కటేనని కొందరి భావనగా దువ్వూరి రామకృష్ణారావుగారి సంపాద కత్వంలో వెలువడిన సంధ్యావందనం గ్రంథంలో వ్రాసారు.

ఆరోహ వివిధం తీర్థం వివిధా అగవల్లరీః |

పశ్యన్ కాఞ్చన వై లేఖామపశ్యన్నృపతిస్తథా || ౫

ఇంద్రద్యుమ్నుడు వివిధ పవిత్ర తీర్థాలను, వివిధ కొండతీగలను చూసాడు. తరువాత ఇంద్రద్యుమ్నుడు ఒక కొండ శిఖరంలో మెరుపు తీగవలె మెరిసే ఒక తీగను చూచి విస్మయపడ్డాడు.

ఆమూలం శిఖరం రమ్యం స్ఫురన్తీం దృష్టిగోచరామ్ ।

అవలోక్య తదా లేఖాం వసిష్ఠమిదమబ్రవీత్ । ౬

బంగారు తామరతూడుతో ఉన్న ఆ శిఖరం అందంగా, మెరిసిపోతూ, అద్భుతంగా ఉన్నది.అప్పుడు ఆ  శిఖరంపై  బంగారు తామరతూడును చూసి వశిష్ఠునితో ఇలా అన్నాడు 6.

ఇన్ద్రద్యుమ్నః -

హేమకోటిసరోజస్య నాలామివ మనోహరామ్ ।

లేఖాం పశ్యాస్య శృఙ్గస్య వనమాలామివ ప్రియామ్ ।।౭

"మహర్షీ!హేమకోటి అను పద్మమునకు బంగారపు కాడవలె  మనస్సుకు ఆకర్షణీయంగా వెలిగే ఆ తీగను చూడండి.  ఇది శిఖరానికి వనపుష్పములచే అల్లిన పుష్పమాలలా ఉన్నది.  ఇది ఏమిటి? "అని అడుగగా వశిష్ఠుడు ఇలా అన్నాడు.

శ్రీవసిష్ఠః

పురా మానసకాసారవాసీ కోఽపి మృణాలవాన్ ।

హంసరాజస్తు తుణ్డేన నాలాం జగ్రాహ చైకికామ్ ||౮

పూర్వము మానససరోవరములో నివసించే  ఒక రాజహంస ఒక  తామర తూడును నోటితో కరచుకొని ఆకాశ మార్గమున బయలుదేరింది..

నిగృహ్య నాళమేకం వే గరుడం పన్నగో యథా ।

వియత్పథం జగాహేఽథ రథపత్రీ స్వయంభువః ||౯

పామును గద్ద పట్టుకున్నట్లుగా,  ఆ హంస తామరతూడును పట్టుకొని ఆకాశ మార్గంలో బ్రహ్మ దగ్గరకు  బయలుదేరింది.

అచ్చట దాని నోటినుండి జారిన తామర తూడు ఘటికాచలమున తీగవలెపడెను. నృసింహ ప్రభావముతో అది బంగారు తామరతూడుగా మారెను.

శ్వేతద్వీపే మహావిష్ణోర్నాభీకమలవాసినమ్ ।

ఉద్యోతమాత్మనో నాథం జగామ స మృణాలవాన్ ।।౧౦

శ్వేత ద్వీపంలోని(వైకుంఠం) విష్ణువుయొక్క  నాభి కమలంలో నివసిస్తున్నట్లుగా భాసిస్తున్న ఆ తామరతూడు తన ప్రాణ నాథుడైన విష్ణువు దగ్గరకు తిరిగి వెళుతున్నట్లుగా  ఆ ఘటికాచల విష్ణు నివాసంపై జారింది.

11-20

మధ్యే వ్యోమపథే తుణ్డాద్గలితా సా మృణాలికా ।

పతితా ఘటికాశైలశృఙ్గపృష్ఠే లతా యదా ।।౧౧

వెడుతూ ఘటికాచల శిఖరంపైఎగిరే సమయంలో ఆకాశమార్గం మధ్యలో ఆ తామర తీగ ఆ హంసనోటినుండి జారి, ఘటికాద్రి శిఖరం వెనుక భాగంలో పడింది.

దూరనిష్పతనాద్ధేతోః నృసింహస్య చ వైభవాత్ ।
దృఢలగ్నా భవన్నాలా ధృతహేమద్రుమైశ్శుభా ॥౧౨

దూరముగా పడుటవలన మరియు భగవంతుడు నృసింహదేవుని మహిమ కారణంగా ఆ స్వర్ణమయమైన ఘటికాచల శిఖరంలో అందంగా ఆ బంగారు తామరతీగ నాటుకొన్నది.

అథ హంసస్సముత్పాద్య గృహీతుం న శశాక హ ।
నరసింహమహాత్మానమస్తౌషీత్ కేవలం తదా । ౧౩

హంస ఆ తామరతూడుని మరల గ్రహించుటకై ప్రయత్నించింది. కాని పట్టుకోలేక అశక్తురాలై మహాత్ముడయిన నరసింహుని ఇట్లు స్తోత్రముచేసింది.

### హంస చేసిన నరహరి స్తోత్రం

హంసః -

దేవ దేవ జగన్నాథ కృపాలో భక్తవత్సల ।
ప్రసాదం కురు మే క్షిప్రం ఘటికాచలనాయక ॥౧౪

దేవతల యందు ప్రకాశించువాడా ! (దేవతలకు దేవుడా !)విశ్వ ప్రభువా! నీవు నీ భక్తుల పట్ల దయగలవాడవు మరియు కరుణామయుడవు. ఘటికాచల నాయకుడా, త్వరగా నన్ను కరుణించు.

హేమకోటిపదాధ్యక్ష హృదయానన్దకేశవ ।
భగవన్ భవరోగఘ్న నమస్తే నృహరే హరేః ॥౧౫

హేమకోటి విమానములో ప్రత్యక్షమైనవాడా ! ఓ కేశవా, హృదయానందకారకా ! ఓ భగవన్ !( ఐశ్వర్యాదులు కలవాడు.) ఈ సంసార వ్యాధులను( పుట్టుక, మరణాలను) నాశనం చేసేవాడా! ఓ ప్రభూ, నీకు నా ప్రణామాలు అర్పిస్తున్నాను,

విశేషాలు

పెద్దకొండపై శ్రీ నరసింహస్వామి గర్భగుడిపై గల గోపురమునకు హేమకోటి విమానము అని పేరు. 'హేమకోటివిమానం క్రింద యోగాసనంలో వేంచేసి ఉండే శ్రీనృసింహస్వామి కనుక అధ్యక్ష (=ప్రత్యక్షమైనవాడు).అను పదము ప్రయోగించబడినది.( ప్రత్యక్షమైనవాడు).

నామరూపాత్మనా విశ్వం విభజ్య పరిపాల్యతే ।
సృజ్యతే నీయతే యేన నమస్తే నృహరే హరే॥ ౧౬

నరసింహుడు తన నామము , రూపము ద్వారా విశ్వములోని జీవులను విభజిస్తాడు మరియు నిర్వహిస్తాడు. ఎవరి చేత జీవులు సృష్టించబడి ,లయమవుతున్నారో ఆ నరసింహస్వామికి నా ప్రణామాలు అర్పిస్తున్నాను. 16

శ్రీవసిష్ఠః

యస్యాజ్ఞామవలమ్బ్యైష వాయుపుత్రశ్చతుర్భుజః ।
శఙ్ఖచక్రధరో హ్యాస్తే నమస్తే నృహరే హరే ॥ ౧౭
ఎవరి ఆజ్ఞను  చతుర్భుజుడు, శంఖ చక్రధారిఅయిన   వాయు పుత్రుడు  పాటిస్తాడో,  ఆ నరసింహస్వామికి
నా ప్రణామాలు అర్పిస్తున్నాను. 17
విశేషాలు
యోగాంజనేయస్వామి మూలమూర్తి చతుర్భుజుడు. ఒక చేతిలో శంఖమును, వేరొక చేతిలో చక్రమును, మరిరెండు చేతులలో జపమాలను,జపముద్రను కల్గి కూర్చున్న భంగిమలో నున్నాడు. ఈ శంఖచక్రములనున్నృసింహస్వామి హనుమానునకు అను గ్రహించిన వృత్తాంతము ఘటికాచల మాహాత్మ్యములో ఉన్నది.
ప్రహ్లాదభక్తివరద వామదేవాదిముక్తిద ।
సప్తర్షిప్రియ సర్వేశ నమస్తే నృహరే హరే ॥౧౮
ప్రహ్లాద మహారాజు భక్తికి సంతోషించి వరములిచ్చినవాడా !  వామదేవుడు మొదలయినవారికి  ముక్తిని ప్రసాదించినవాడా !. అందరికీ ప్రభూ! సప్తర్షులకు ప్రియమైనవాడా! ఓ హరీ ! నరసింహా!  నీకు నా ప్రణామాలు అర్పిస్తున్నాను.

సంసారవైరీ దైత్యారిదంష్ట్రీ భీమపరాక్రమః ।
ఆపాతాలనభోవాసీ నమస్తే నృహరే హరే ॥౧౯
చావు పుట్టుకల ప్రపంచానికి  శత్రువైనవాడా !( అనగా ముక్తిని అనుగ్రహించువాడని భావం) దైత్యులకు శత్రువయిన విష్ణూ! ప్రశస్తమైన పన్నులు (పండ్లు) కలవాడా ! భయంకరమయిన పరాక్రమము కలిగినవాడా !
పాతాళం నుండి ఆకాశం వరకూ వ్యాపించిన రూపము కలవాడా !  ఓ హరీ ! నరసింహా!  నీకు నా ప్రణామాలు అర్పిస్తున్నాను అర్పిస్తున్నాను.

సిధ్యన్తి సిద్ధయో యస్మాత్సర్వరూపాత్ సహస్రశః ।
వేదాశ్చ భూతయస్సర్వా: నమస్తే నృహరే హరే । ౨౦
అన్ని రూపాల్లో వేలాది పరిపూర్ణతల సిద్ధులను సిద్ధింపచేసినవాడా !. వేదాలు, సమస్త భూతాలు నీ స్వరూపంగా కలిగినవాడా !  ఓ హరీ ! నరసింహా!  నీకు నా ప్రణామాలు అర్పిస్తున్నాను. 20
21 - 30
విశ్వస్యేశానమపి యం మతీనాం పురుషర్షభః ।
సంగిరన్తే ఘృణాపూర్ణా నమస్తే నృహరే హరే ॥౨౧

విశ్వానికి ప్రభువయినవాడా ! జ్ఞానులలో అత్యుత్తముడా !తమ హృదయాలలో నిన్ను పురుష శ్రేష్ఠునిగా మనస్సులో తలచుకొని భక్తులు నీతో సంబంధం కలిగి ఉన్నారు.

వసిష్ఠుడు

ఇతి స్తువతి ధర్మాత్మన్నాత్మయోనిం యథా తథా ।

స ప్రాహ భగవానాహ యోగవాన్ నరకేసరీ ॥ ౨౨

ఈ విధంగా  తనంతట తానే జన్మించిన స్వయంభువు అయిన  నరసింహస్వామిని హంస స్తోత్రం చేసింది.

అప్పుడు  భగవానుడైన నరసింహుడు ఈ స్తోత్రమును విని ఇలా ఆ హంసతో అన్నాడు. 22

శ్రీభగవానువాచ

ప్రసన్నస్తే పురస్సోఽహం పత్రిరాజ మహామతే ।

వరం వరయ భద్రం తే వినా నాలగ్రహాదరమ్ ॥౨౩

"ఓ హంసరాజమా! నీ స్తోత్రానికి చాలా సంతోషించాను. తామరతూడు తప్ప ఏవరమునైన కోరుకో. అనుగ్రహిస్తాను..

అన్యఇ్ఛ, నాగశృఙ్గస్థో మమ పశ్య మృణాలవాన్।

దైత్యరాజవసామాలాకణ్ఠమావిష్కరోతి హ ।। ౨౪

ఆ తామరతీగను తిరిగి తీసికొనిపోయే  ఏ ప్రయత్నాన్ని చేయకు.  నేను హిరణ్యకశిపుని వధించేటపుడు ఆ అసురుని పేగుల మాల నా వక్షస్థలంలో ఎలా అందంగా ప్రకాశించిందో అలా ఈ  తామరతీగ ఘటికాద్రి శిఖరాన్ని అలంకరిస్తున్నది.." అని.

హంసః-

స్వామిన్నియమనాయాసః కృతా యది మయా సదా ।

అతః పరం భయన్నామ భవతే భవతాత్ కథమ్ ॥౨౫

హంస "స్వామీ! నేను చేసిన ఈ సేవా ప్రయత్నం  చాలస్వల్పమైనది.  మీ దగ్గర ఉండగా భయం అనే పేరు నాకు ఎలా వినబడుతుంది? ( తామరతూడును తిరిగి తన యజమాని  బ్రహ్మ దగ్గరికి – బ్రహ్మ లోకానికి చేర్చకపోతే  ఆ యజమాని ఏమన్నా అంటాడో ఏమో అనే  భయం నరసింహ స్వామి అభయము ఇచ్చిన తరువాత రాదని భావం)

త్వన్నాభికమలస్థేన వరేణ్యం పద్మయోనినా ।

ధృతం భగవతా సాక్షాత్ భాగ్యం మే కిమతః పరమ్ ॥౨౬

బ్రహ్మ నివసించు పద్మము  మీ నాభినుండి పుట్టినది. ప్రభువు స్వయంగా నా తామరతూడును భరించిన నా అదృష్టం కంటే మెరుగైనది ఏది ఉంటుంది? నాభాగ్యము ఫలించినది.ఇంతకంటె ఏమి చెప్పగలను" అని హంస అన్నది.

భగవాన్ -

సాధు హంస తవ బ్రహ్మా నిత్యం ప్రీతికరో భవేత్ ।

సర్వేషామపి వాహానాం ముఖ్యస్త్వం ప్రభవిష్యసి ॥ ౨౭

నరసింహుడు "హంసరాజమా! నీవు బ్రహ్మకు ఇష్టమైన దానివవుతావు. బ్రహ్మకు వాహనమవుతావు.  అన్ని వాహనములకంటె నీ వాహనము అతనికి ఇష్టము అవుతుంది .

వసిష్ఠః -

ఇతి ప్రియంవదే దేవే తిరోధానముపేయుషి ।

హంసః పరమ హృష్టాత్మా శ్వేతద్వీపమవిన్దత ||౨౮

." అని పై విధముగా చెప్పి  నరసింహుడు  అంతర్ధానము చెందాడు. నరసింహుని వరముతో పరమానందము పొందిన హంస శ్వేత ద్వీపానికి చేరింది.

తదా ప్రభృతి నాలోஉయం యుగభేదేన భూపతే ।

వర్ణభేదం గతో భాతి భూషా శిఖరిణో యథా || ౨౯

ఓ రాజా ! అప్పటినుండి  శిఖరానికి ఆభరణములా ఉన్న  ఈ తామరతూడు  ఈశిఖరము చుట్టూ  వేరువేరు రంగులతో ఒక్కో యుగంలో ఒక్కో రంగుతో కనిపిస్తుంది.

అయం నృప మహాశైలో హేమనాలావిభూషితః ।

దైత్యసింహవసాభూషో నృసింహ ఇవ లక్ష్యతే ||౩౦

ఈ పర్వతము( ఘటికాచలం)  బంగారు తామరతూడుతో  ప్రకాశిస్తూ  హిరణ్యకశిపుని పేగులు నృసింహునికి అలంకారమైనట్లుగా ఉన్నది.

గ్రథిమానం చ నాలస్య యస్తు పశ్యతి సానుని

సుతసన్తతిదైర్ఘ్యఞ్చ ఆయుర్దైర్ఘ్యఞ్చ  విన్దతి ||౩౧

ఘటికాద్రి కొండచరియలలో నాటుకొన్న ఆ తామర తీగను దర్శించిన వాని వంశం ప్రకాశిస్తుంది. అతడు పుత్ర సంపదను, దీర్ఘాయువును పొందుతాడు.

కురుతే శ్రద్ధయా విద్వాన్ యో హంసబలిమత్ర వై ।

హంసముద్దిశ్య విధివత్ సంతుష్టః పురుషో భవేత్ || ౩౨

ఇచ్చట శ్రద్ధతో హంసను ఉద్దేశించి హంసబలి  చేసిన విద్వాంసుడు  సంతోషము పొందుతారు.

విశేషాలు

హంసబలి అనగా హంసకు చేసే నైవేద్యము. దేవతలకు నివేదించు అన్నమును బలి లేదా బల్యన్నము అంటారు. బల్యన్నము వేయు పీఠమును బలిపీఠము అంటారు. గర్భగుడి, విమానం, విగ్రహం (మూలమూర్తి), బలిపీఠం ఇవి నాలుగూ ఉంటేనే దాన్ని దేవాలయం అంటారు. కనుక ఆలయంలో బలిపీఠం ప్రముఖమైనది. ఆలయంలోని మూలమూర్తికి, ఇతర పరివార దేవతలకు నైవేద్యం సమర్పించిన తర్వాత చివరగా అష్టదిక్పాలకులకు బలిపీఠంపై బలి సమర్పిస్తారు. గర్భగుడిలో ఆంతరంగికంగా శాంతి మంత్రాలతో జరిగేది నైవేద్యం. ఆరుబయట బహిరంగంగా ఆవరణ దేవతలకు సమర్పించేది బలి. బలిప్రదానం వలన దేవతలకు

పుష్టి కలుగుతుంది. బలి బుక్కుల వల్ల కంటికి కనిపించే భైరవ (కుక్క), కాకి, పక్షులు, చీమలు, పురుగులు, కనిపించని సూక్ష్మజీవులు ఎన్నో తృప్తి చెందుతాయి

గర్భగుడిపై ఉన్న విమానం, గుడికి ముందు ఉన్న బలిపీఠం రెండూ ఒకటే అని నారాయణ సంహిత చెప్పింది. విమానం ముకుళితపద్మం (ముడుచుకుని ఉన్న తామర) వలె ఉంటే బలిపీఠం వికసితపద్మం (విరిసిన కమలం) వలె ఉంటుంది.

హంసశ్శుచిషదిత్యేతత్ త్రిరుచ్చార్య మహామనుమ్ |

బలిం వితనుతే యస్తు ధూతపాప్మా స సంభవేత్ ||౩౩

"హంసశ్శుచిషత్ "అను మంత్రమును  మూడుసార్లు  జపించి బలిని( నైవేద్యాన్ని) ఇచ్చినవారు పాప విముక్తులై సుఖసంతోషములతో ఉంటారు.

ఇన్ద్రద్యుమ్నః -

శ్లాఘయంశ్చ గురోర్వాక్యం హేమనాలావలోకకః |

ఉక్తేన విధినా చక్రే బలిం సన్తుష్టమానసః ||౩౪

ఈ మాటలువిన్న ఇంద్రద్యుమ్న మహారాజు, గురువును నుతించి విధి ప్రకారం  మిక్కిలి శ్రద్ధతో బంగారు తామర తూడును దర్శించి  హంసబలి(హంసకు చేసే నైవేద్యము) చేసాడు.

హంసతీర్థావగాహేన పూతాత్మా నృపపుఙ్గవః |

తతో దక్షిణపార్శ్వస్థం హేమకోటిం దదర్శ హ ||౩౫

హంస తీర్థములో స్నానము చేసి పవిత్రుడై ఆ ఇంద్రద్యుమ్న మహారాజు  దక్షిణ దిక్కులో ఉన్న హేమకోటి విమానమును దర్శించాడు. (పెద్దకొండపై శ్రీ నరసింహస్వామి గర్భగుడిపై గల గోపురమునకు హేమకోటి విమానము అని పేరు)

సింహస్కన్ధైశ్చ సంవాహ్యం ప్రత్యఙ్కణమృదిత్వరామ్|

అనేకర్షిసంసేవ్యాం పరమాం ప్రణవాత్మికామ్ ||౩౬

సింహాలతో మోయబడుతున్న,  ఓంకారరూపంలో ఉన్నది. దేవతలచే, మునులచే స్తుతింపబడుతున్నభగవన్నామాంకితమైన స్తోత్రపు గుర్తులు కలది, అనేక మంది ఋషులు పూజిస్తున్న  అత్యున్నత ఓంకారముతో కూడుకొన్న శ్రీ నరసింహస్వామి గర్భగుడిపై గల గోపురమును (హేమకోటి విమానమును) ఇంద్రద్యుమ్న మహారాజు  చూసి పరవశించాడు.

**విశేషాలు**

గుడిలోని మూలవిరాట్టుకు ఎంత ప్రాముఖ్యం ఉంటుందో గుడి గోపురానికీ అంతే ప్రాధాన్యం ఉంటుంది. గోపురాన్ని గర్భగుడి తలవాకిలిగా భావిస్తారు. అక్కడే దేవుడి పాదాలు అదృశ్యంగా ఉంటాయని ఆగమశాస్త్రం చెబుతోంది.

పరాం కోటిం గాహమానాం శృఙ్గకోటివిరాజితామ్ |

భూతప్రేతపిశాచాదిబ్రహ్మరాక్షసరక్షసామ్ ||౩౭

ఆకాశాన్ని తాకే రీతిలోని ఔన్నత్యాన్ని కలిగి , జ్యోతిర్మయమై భూతాలు, ప్రేతాలు, పిశాచాలు, బ్రహ్మరాక్షసులు - అనే పాపులకు దరిచేరడానికి, భావించడానికికూడా వీలు కాని మహిమను కలిగిన శ్రీ నరసింహస్వామి గర్భగుడిపై గల గోపురమును (హేమకోటి విమానమును) ఇంద్రద్యుమ్న మహారాజు చూసి పరవశించాడు.

**విశేషాలు**

గుడికి సంబంధించిన బ్రహ్మస్థానం గోపురంపైన ఉంటుందని శాస్త్రాలు చెబుతున్నాయి. ఆ బ్రహ్మ స్థానంలోనే కోవెల మూలవిరాట్టులో ఆవహింపజేసిన శక్తి కేంద్రం ఉంటుందని అంటారు. ఆ కేంద్రం నుంచి వెలువడే చలనశక్తి నిరంతరం దేవాలయ ప్రాంగణంలోని మానవులను కాపాడుతుందట. ఆ కారణంగా దివ్యమైన ఇష్టసిద్ధి లభిస్తుందని కాశీయాత్ర చరిత్రలో ఏనుగుల వీరాస్వామి ప్రస్తావించారు.

దురాపాం దుష్టసంప్రైశ్చ దుర్ధర్శాం దురవగ్రహామ్ |
దిక్పాలగణసంవీతాం బ్రహ్మశఙ్కరవన్దితామ్ ||౩౮

దుష్టాత్ములు చేరుకోవడానికి కష్ట సాధ్యమైనది,దుష్టులను తిరస్కరించునది, అర్థము చేసికొన వీలు లేనిది, ఎనిమిది దిక్కులను కావలి కాచే దిక్పాలకులచే శివుడు, బ్రహ్మ అనే వారిచే ఎల్లప్పుడు కీర్తింప బడునది అయిన శ్రీ నరసింహస్వామి గర్భగుడిపై గల గోపురమును (హేమకోటి విమానమును) ఇంద్రద్యుమ్న మహారాజు చూసి పరవశించాడు.

**విశేషాలు**

*అష్టదిక్పాలకులు :* (వారి నగరాలు, భార్యలు, వాహనాలతో సహా)

- 1. ఇంద్రుడు (అమరావతి - శచీదేవి - ఐరావతం)
- 2. అగ్ని (తేజోవతి - స్వాహాదేవి - తగరు)
- 3. యముడు (సంయమిని - శ్యామలాదేవి - మహిషం)
- 4. నిరృతి (కృష్ణాంజన- దీర్ఘాదేవి - నరుడు)
- 5. వరుణుడు (శ్రద్ధావతి - కాళికాదేవి - మొసలి)
- 6. వాయువు (గంధవతి - అంజనాదేవి - లేడి)
- 7. కుబేరుడు (అలక - చిత్రలేఖ- గుర్రం)
- 8. ఈశానుడు (యశోవతి - పార్వతీ దేవి- వృషభం)

వేదవాహ్యం చ సూర్యస్య శకటాం మణికూబరామ్ |
వైఖానసార్చితాం నిత్యాం అప్సరోగణసేవితామ్ ||౩౯

వేదాలు వహింపదగినది, మరియు రత్నాలతో కప్పబడిన సూర్యుని వాహన కాంతి కలది, నిత్యము వైఖానసులు అప్సరసలు పూజించునది అయిన శ్రీ నరసింహస్వామి గర్భగుడిపై గల గోపురమును (హేమకోటి విమానమును) ఇంద్రద్యుమ్న మహారాజు చూసి పరవశించాడు.

**విశేషాలు**

విష్ణు అర్చకులలో ఒక తెగవారిని వైఖానసులని . మఱియొక తెగవారిని పాంచరాత్రులు అంటారు.

- 1. విఖనస ధర్మ శాస్త్రాలను అనుసరించే వారు.2. వానప్రస్థులు. తృతీయాశ్రమంలో ఉన్న ద్విజులు.3. ప్రజాపతి నఖముల నుంచి పుట్టిన, బ్రహ్మ ఉంగరపు వ్రేలినుంచి పుట్టిన ఋషులు 4. వైఖానస సూత్రాల ప్రకారం వైష్ణవాలయాలలో పూజలు నిర్వహించే అర్చక స్వాములు ఇలా వివిధార్థాలు వైఖానసులకు ఉన్నాయి.

నృసింహమణిపేటీ తాం హేమకోటిముదీక్ష్య వై ।
ఇన్ద్రద్యుమ్నో మహాభాగో ముముదే సపరిచ్ఛదః ।।౪౦

శ్రీనృసింహమూర్తి అనే మణి భద్రపరచబడిన పెట్టెలా ఉన్న శ్రీ నరసింహస్వామి గర్భగుడిపై గల గోపురమును (హేమకోటి విమానమును) ఇంద్రద్యుమ్న మహారాజు తన భార్యతో కలిసి చూసి పరవశించాడు.

తతః ప్రాఙ్ముఖమాసీనం హేమకోటిపదం గతమ్ ।
యోగారూఢం నరహరిం దృష్ట్వా నత్వా ముహుర్ముహుః ।
రోమాఞ్చితాశేషవపుః స్తోత్రయామాస భూపతిః ।।౪౧

తరువాత శ్రీ నరసింహస్వామి గర్భగుడిపై గల గోపురములో (హేమకోటి విమానమును) తూర్పుదిక్కు గా యోగాసనములో ఆసీనుడై ఉన్న నరసింహుని దర్శించి పదేపదే నమస్కరించి పులకిత గాత్రుడై ఇంద్రద్యుమ్న మహారాజు ఇలా నరసింహ స్తోత్రము చేసాడు.

యద్ద్వారాధిప చాటుకా న సరణిః ప్రార్థ్య విరిఞ్చాదిభి-
శ్చిన్వన్తి శ్రుతయోఽప్యలబ్ధవిషయాశ్చిద్రూపమద్యాపి యమ్ ।

ఏ చిద్రూపుని వేదసాహిత్యాలు, బ్రహ్మాదులు ఏ దేవదేవుని స్వరూపాన్ని వెతుకుతుంటారో, ఎవని ద్వారము వద్ద వేచి ఉండి ప్రశంసలు కురిపిస్తుంటారో దుర్లభుడైన ఆ చిద్రూపుడయిన(చైతన్యస్వరూపుడయిన) నరసింహస్వామికి నమస్సులు.

న త్వం లోచనగోచరో భవసి యత్ తత్కాకతాలీయక-
న్యాయోదాహరణైకకా నరహరే లక్ష్మీపతే తే వయమ్ ।।౪౨

ఓ లక్ష్మీ ప్రభూ ! నరహరీ ! నిజానికి నువ్వు ఈ మానుషనేత్రాలకు అందేవాడివి కావు. కాని కాకతాళీయ న్యాయముచే మాకు ఈ రూపములో కనబడుతూ మమ్మలిని ఆనందపెడుతున్నావు. అటువంటి నరసింహస్వామికి నమస్సులు

**విశేషాలు**

కాకతాళీయన్యాయం

కాకతాళీయన్యాయం అనగా కాకి తాటిచెట్టుకింద వాలగానే పైనుండి దానిపై తాటిపండు పడినట్లు. [అనుకోకుండా ఆకస్మాత్తుగా జరగడమని భావం.] "కాకతాళీయముగ మహాకాళి కరుణ, నుజ్జయిని రాజ్యవైభవ మొనరెఁగాక" (విక్రమార్కచరిత్ర. 4-61)

లక్ష్మీమహీకరసరోజసుధావమర్దలీలావహౌ నరహరే ఘటికాద్రినాథ ।
ఉల్లాసినో చరణపల్లవతల్లజౌ తే సంలాలితో సమవలోక్య భవామ ధన్యాః ॥౪౩
ఓ ఘటికాచల ప్రభూ! మీరు లక్ష్మీదేవి యొక్క మృదువైన తామర పువ్వువంటి చేతులతో పాదసేవనందు మహానుభావులు. అటువంటి మీ గొప్ప పాదములను లక్ష్మీదేవిచే లాలించబడిన ఉల్లాసమైన పాద కమలాలను చూసిన ధన్యులము మేము.

యోఽనన్తరూపోఽఖిలవిశ్వమేతత్ బిభర్తి సత్వం నృహరే రమేశ ।
త్వమక్షరం తం సవితుర్వరేణ్యం యతః ప్రసూతిః ప్రసృతా పురాణీ ॥౧౪౪
ఓ లక్ష్మీ ప్రభూ ! మీరు సమస్త విశ్వాన్ని నిలబెట్టే అనంత స్వరూపులు
మీరు దోషరహితులు. నశించని శాశ్వతులు. సూర్యులలో ఉత్తములు.మీ నుండి పురాతన సృష్టి జరిగింది.

శాస్తా జనానాం చ తథా నియన్తా తథా విసృష్టా భగవన్ మహాత్మా ।
త్రిమూర్తిరూపోఽసి గుణత్రయాకః త్వమేక ఏవాత్ర పరం నృసింహ ॥౪౫
ఓ నరసింహా ! ప్రజలను పాలించే మరియు నియంత్రించే మరియు మోక్షముతో విడుదల చేయించే మహాత్ములు మీరు. మీరు త్రిమూర్తి స్వరూపులు. త్రిగుణ రూపులు. మీరు మాత్రమే శ్రేష్ఠులు.

**విశేషాలు**

శాస్తా అంటే పరిపాలించేవాడు. భగవంతుడు ఈ విశ్వం నిర్వహించబడటానికి ఉన్న నియమనిబంధనలను సృష్టించేవాడు; ఆ విశ్వం యొక్క వ్యవహారాలను తనే స్వయంగా మరియు ఆయన నియమించిన దేవతల ద్వారా అజమాయిషీ చేస్తాడు. ఈ విధంగా, ప్రతీదీ ఆయన ఆధీనంలోనే ఉంటుంది.

అస్మాదృశో భూమితలే నృకేసరిన్ పదం పరం త్వామవమత్య దుర్మతిః ।
వృతో జగత్స్యన్దనసిన్ధుజన్మభిస్సధర్మతాధామగతో నృపాధమః॥౪౬
భూమిపై ఉన్న ఓ నరసింహా ! మా లాంటి దుర్మార్గులయిన రాజులలో కొందరు మిమ్ములను అడుగడుగునా అవమానించి తగిన ఫలితాన్ని పొందారు. చావుపుట్టుకల శిక్షను పొంది మోక్ష రహితులయ్యారు. ( నాకు ఆ స్థితి కలిగించవద్దని భావం)

**విశేషాలు**

భక్తి ప్రపత్తులందు వినయవిధేయతలు ముఖ్యాంగములుగా వైష్ణవ శా స్త్రములు చెప్పుచున్నవి. దీనినే నైచ్యానుసంధాన మంటారు. అనగా భక్తుడైనవాడు తానే తక్కిన అందఱికంటె నికృష్టుడనియు నందఱు తనకంటె గొప్పవారనియు తనకంటె నీచుఁడు లేడనియు నెంచి యణగి మణగి యుండుట. కావుననే శ్లో. "త్వదృత్య భృత్యపరిచారక భృత్యభృత్య భృత్యస్యభృత్య ఇతి మాం స్మరలోకనాథ. " నీ భృత్యానుభృత్యులకు భృత్యుడని జగదీశ్వరా ! నన్ను జ్ఞప్తియం దుంచుకొనుమని కుల శేఖరులు ముకుందమాలలో చెప్పారు.

వేదాంతదేశికు లను పరమభక్తుడు భిక్షతో జీవనము చేయుచుండెను. ఈయనను పరాభవింపవలయు నని ఒకడు  తన వాకిటికడ్డముగా చెప్పులతోరణము కట్టాడు. బిచ్చమునకై వేదాంతదేశికులు ఇంటిలో ప్ర వేశించునపు డాచెప్పులు తలకి తగిలితే చెప్పుతో కొట్టిన ట్లగునని ఆ పాపి ఊహ . వేదాంతదేశికు లాయభిప్రాయము గ్రహించి

శ్లో. " కర్మావలంబినః  కేచి, త్కేచి జ్ఞానావలంబిన : వయంతు విష్ణుభక్తానాం, పాదరక్షావలంబిన : "

అని చెప్పుచు నా చెప్పులు తల దగులుచున్నను ఇంటిలోపలికి భిక్షకు వెళ్ళాడు.  కొందఱు మోక్షము సంపాదింపుటకు కర్మయోగమును  సాధనముగా స్వీకరిస్తారు.  కొందఱు జ్ఞానయోగమును  సాధనముగా స్వీకరిస్తారు . మేము విష్ణు భక్తుల పాదరక్షలను ఆధారముగ స్వీకరిస్తామని  పై శ్లోకమునకు అర్థము.

ఇంద్రద్యుమ్న మహారాజు కూడా నైచ్యానుసంధానమును ఈ ఘటికాచల మాహాత్మ్య  శ్లోకమున చెప్పాడు.

విభ్రాన్తచిత్తా భవదేకమాయయా వరాసనస్థా వయమిత్యశఙ్కయా ।
నిగర్వభాజో నివసన్త్యహంకృతః స్వల్పక్షయాసఙ్గతయో నరాః పదే ॥౪౭

ఓ నరసింహా ! మేము అయోమయంలో ఉన్నాము. నీ ఒక్క మాయా శక్తి వల్లనే మేము అందమైన సింహాసనంపై కూర్చున్నామని అనుకుంటున్నాము. అహంకారం లేకుండా జీవించే అవకాశం ఇవ్వు.

త్వయి స్థితే దాతరి మానవాద్యహం వరేణ్యతాత్త్వేన హరో సదా హరౌ ।
దాతృభ్రమాదన్యముపాసతే జనాః ప్రమూఢచిత్తాః ప్రమదానుసఙ్గినః ॥౪౮

ఓ నరసింహా ! నీవు సమస్తప్రపంచాలలో  ఉత్తముడవు . సమస్త సౌభాగ్యాలను ప్రసాదించేవాడివి.

నేను ఎల్లప్పుడూ నీలోనే ఉన్నాను. స్త్రీల పట్ల మోహానికి గురై, ఆకర్షణకు లోనైన వ్యక్తులు, మాయకు గురయి నిన్ను గాక వేరే వాటిని పూజిస్తారు.

భక్తిం చ ముక్తిం భవదఙ్ఘ్రిసేవినాం దదాసి విష్ణో నృహరే త్వమేవ హి ।
నతేతరాణామవివేకశాలినాం వృథా శుకానామివ నిష్ఫలద్రుమః ॥౪౯

ఓ నరసింహా ! నీ పాదపద్మములను పూజించే వారికి భక్తి మరియు ముక్తిని ప్రసాదించేది నీవే.

పండ్లులేని చెట్టు చిలుకకు పనికిరాదు. అలాగే  నిన్నుగాక ఇతరులను పూజించే అవివేకుల పూజ వృథా.( ఫలములను ఇవవ్ని చెట్టును చిలుక ఆశ్రయించినట్లుగా నరసింహుని కాక ఇతరదేవతలను ఆశ్రయించిన భక్తుల పూజ వృథా అని భావం)

స్వతన్త్రభావేన సనాతనో భవాన్ విముక్తయే సర్వనృణాం ప్రకల్ప్యతే ।
ఉతామృతేతి శ్రుతిరాహ తత్ర వై ప్రమాణమవ్యాజఘృణా చ హి ప్రభో ॥
ఓ నరసింహా ! మీరు మీ స్వేచ్ఛా సంకల్పంలో శాశ్వతంగా ఉంటారు, మరియు మీరు అందరు మానవులకు మోక్షానికి సాధనంగా ఉన్నారు.దీనికి ''ఉతామృతత్వేశానః'' అను వేదమంత్రమే ప్రమాణం.

విశేషాలు

ఉతామృతత్వేశానః అనునది పురుష సూక్త మంత్రం.
పైలోకంలోనూ మోక్షమనే అనుభవం అనే అన్నాన్ని కూడా ప్రసాదించేవాడు ఇతడే అని ఈ మంత్ర భావం. ఈ లోకంలో అన్నాన్ని ప్రసాదించడమే కాక, ఆ లోకానికి వెళ్లినా "అహమన్నాదః" (నేను పరమ పురుషుని ప్రీతి అనే అన్నాన్ని అనుభవించేవాడను) అని అనేటట్లు చేసేవాడు ఇతడే.50

మహానుభావో భగవాన్ నృసింహలోకత్రయేఽప్యప్రతిమప్రభావ ।
ప్రహ్లాదసే పాదసరోజభాజో ప్రహ్లాదనాలాదకరస్త్వమేవ ॥౫౧
ఓ నరసింహా ! సర్వోన్నత పురుషుడైన నృసింహదేవుడవి నీవు.  చాలా శక్తిమంతునివి. మూడు లోకాలలోనూ అసమానమైన శక్తిని కలిగినవానివి.  ప్రహ్లాదుడు సేవించిన పాదపద్మములు కలవానివి.  ప్రహ్లాదుని లాలించిన  హస్తము నీదే.

పరాత్పరం వస్తు పుమాన్ పురాణస్త్వం కారణం కారణకారణం గురుః ।
సతాం గతిస్త్వం నరసింహపచ్ఛో వ్యాకుర్వతే నాన్య ఇతి శ్రుతిశ్చ ॥ ౫౨
ఓ నరసింహా ! నీవు పరమాత్మవు.  పురాణపురుషునివి.( పురాణములు స్తుతించు పురుషుడు. విష్ణువు)  కారణభూతునివి. ఆధ్యాత్మిక గురువువి.
నీవు సద్గురువుల గమ్యస్థానంవి.  'నరసింహుని ప్రతిపాదముతో ఈ లోకము వ్యాపించి ఉన్నది'' అని వైఖానస గుహ్య సూత్రాలు చెబుతున్నాయి. అటువంటి గొప్పవానివి నువ్వు. 52

విశేషాలు

పురాణ అంటే, ఆదిరహితము మరియు అత్యంత ప్రాచీనము అని. భగవంతుడే, సమస్త భౌతిక మరియు ఆధ్యాత్మిక విషయములకు ఆదిమూలము, కానీ, ఆయన మాత్రం మరొక దేనినుండో రాలేదు మరియు ఆయన కన్నా ముందు ఉన్నది ఇక ఏమీ లేదు.

అనిన్ద్యమేకం పరమం మహాన్తమాదిత్యవర్ణం తమసః పరస్తాత్ ।

త్వామేవ విద్వానమృతత్వమేతి దురాపమన్యామరసంగిలోకైః || ౫౩

ఓ నరసింహా ! నీవు నిష్కళంకమైనవాడివి.  ఉన్నతమైనవానివి.  సూర్యుని వలె తేజోవంతునివి. , అజ్ఞానపు చీకటి కంటే అతీతునివి. (ఎలాగైతే ఒక్కోసారి మబ్బులు సూర్యుడికి అడ్డు వచ్చినా, సూర్యుడు ఎప్పటికీ మబ్బులచే కప్పివేయబడలేడో, అదేవిధంగా, భగవంతుని వయిన నిన్ను అజ్ఞానము అను మాయ, కప్పివేయలేదు.) కోటి సూర్యకాంతులతో వెలిగే ఈ ఆదిపురుషుడవైన నిన్ను ,  నా హృదయములో తెలుసుకున్నాను.  నిన్ను  ఈ విధముగా ఎవరు తెలుసుకొంటారో వాడు అమృతత్వమును, కష్ట సాధ్యమయినదానిని తప్పక పొందుతాడు..  53

విశేషాలు

1.కవిం పురాణమనుశాసితారమ్

అణోరణీయాంసమనుస్మరేద్యః ।

సర్వస్య ధాతారమచింత్యరూపమ్

ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్  (08 -09) అను భగవద్గీతా శ్లోకము ఇక్కడ స్మరణీయము.( భగవంతుడు సర్వజ్ఞుడు, అత్యంత ప్రాచీనుడు, అందరినీ శాసించేవాడు, సూక్ష్మము కంటే సూక్ష్మమైన వాడు, అన్నింటికీ ఆధారమైన వాడు, ఊహాకందని దివ్య స్వరూపం కలవాడు; ఆయన సూర్యుడి కంటే తేజోవంతుడు మరియు సమస్త అజ్ఞానపు చీకట్లకీ అతీతుడు. ఎవరైతే మరణ సమయంలో, యోగ అభ్యాసము చేత లభించిన అచంచలమైన మనస్సుతో, ప్రాణములను కనుబొమల మధ్యే నిలిపి, నిశ్చలంగా దివ్య మంగళ భగవంతుడిని అత్యంత భక్తితో స్మరిస్తారో, వారు ఖచ్చితంగా ఆయనను పొందుతారు.)

2. వేదాహమేతం పురుషం మహాంతం

ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్

తమేవం విద్వానమృత ఇహ భవతి

నాన్యః పంథా విద్యతేఽయనాయ  అను మంత్ర పుష్పము కూడా ఇక్కడ స్మరణీయము.

కోటి సూర్యకాంతులతో వెలిగే ఈ ఆదిపురుషుడు, సమస్త అంధకారములకు అతీతుడు. ఆ పరమాత్మను నా హృదయములో తెలుసుకున్నాను.  ఈ ఆదిపురుషుడుని ఈ విధముగా ఎవరు తెలుసుకొంటారో వాడు అమృతత్వమును తప్పక పొందుతాడు. దీనికి మించి మార్గము లేదు.

సత్యఞ్చ దివ్యామితధారితం హరే బ్రహ్మణమేవార్యమణం తథావిధమ్ ।

దూర్వాదలశ్యామలపీతవాససం తథా నృసింహ ప్రియశఙ్కరాచితమ్ || ౫౪

ఓ ప్రభువైన నరహరీ ! నువ్వే  పరమ సత్యానివి. పరిమితిలేని బ్రహ్మాండమును ధరించినవానివి. అలాగే బ్రహ్మకు జీవనమును ఇచ్చు బ్రహ్మశక్తివి. శ్రేష్ఠాతిశ్రేష్ఠునివి.  గరికవలె శ్యామల వర్ణము కలిగినవాడా ! పసుపు రంగు దుస్తులు ధరించినవాడా ! శివుడు పూజించినవాడా !. (శ్యామల పదం నుంచి చామన చాయ అనే పదం వచ్చింది)

విశేషాలు

.రామం దూర్వాదళ శ్యామం పద్మాక్షం పీతవాససమ్(దూర్వాదళ శ్యాముడు, కమల నేత్రుడు, పీతాంబరాన్ని ధరించిన వాడు అయిన శ్రీరామ చంద్రుని దివ్యములైన నామాలతో స్తుతించు మానవులు, సంసార బంధనాలను త్యజించి మోక్షమును పొందగలరు.) అను శ్రీ రామ రక్షా స్తోత్ర శ్లోకము ఇచ్చట అనుసంధానించుకోవాలి.

కిరీటినం హేమవిమానమధ్యగం జానుద్వయన్యస్తకరామ్బుజద్వయమ్ ।
గృహీతశంఖారిభుజం సుదంష్ట్రిణం నృసింహరూపం భగవన్తమాశ్రయే ॥
హేమకోటి విమానం(శ్రీ నరసింహస్వామి గర్భగుడిపై గల గోపురము) మధ్యలో కిరీటం ధరించినవానిని, మోకాళ్లపై రెండు కమలము వంటి చేతులు కలిగి యోగాసనంలో కూర్చున్నవానిని, శంఖము , చక్రము ధరించినవానిని, చక్కని కోరలు కలిగినవానిని నరసింహరూపుని నేను ఆశ్రయిస్తాను.

శ్రీవత్సచిహ్నం జయశాలినన్దకం శ్రియానుషక్తం గళశోభి కౌస్తుభమ్ ।
కౌమోదకీలక్షణమాశ్రయే సదా గళాదధో మర్త్యవపుర్ధరం హరిమ్ ॥ ౫౬
శ్రీవత్సము కలవానిని(విష్ణువు వక్షఃస్థలమునందలి మచ్చ) , సంతోషించునది యు మరియు సంతోషపెట్టునదియు అగు నందకము అను జయస్వభావము కలిగిన ఖడ్గము కలవానిని, లక్ష్మీ సంబంధము కలవానిని,మెడలో కౌస్తుభము ( శోభించు విష్ణు వక్షస్థలంలో ప్రకాశిస్తుండే మణి.) కలవానిని, మెడ కింద మర్త్య రూపాన్ని ధరించిన నరహరిని నేను ఎల్లప్పుడూ ఆశ్రయిస్తాను. 56

త్వద్యోగనిద్రా జగతాం ప్రబోధినీ శివా సతీ శుంభనిశుమ్భరోధినీ ।
సరస్వతీ శ్రీరీతి నామభిస్సదా ప్రకీర్త్యతే శ్రీనృహరే త్వదాజ్ఞయా ॥ ౫౭
ఓ నరసింహా ! మీ యోగ నిద్ర (యోగః చిత్తవృత్తినిరోధ లక్షణః సమాధిః తత్ రూపా నిద్రా యోగుల ధ్యానమూలకమగు నిద్ర. ) లోకాలను మేల్కొలుపునది. శుభప్రదమైనది. పవిత్రమైనది, మరియు శుంభ, నిశుంభ రాక్షసులను నిరోధిస్తుంది.
నీ ఆజ్ఞతో ఆ యోగనిద్ర సరస్వతి శ్రీ అను పేర్లతో లోకంలో కీర్తింపబడుతుంది.

త్వం వై హిరణ్యాక్షముఖామరద్రుహాం హన్తా గళాదూర్ధ్వమృగేన్ద్రరూపః ।
రౌద్రాకృతిస్తే భగవన్ సతానాం సౌమ్యా కిమీదృగ్విధయా ప్రవేశితా ॥ ౫౮
ఓ ప్రభూ ! నువ్వు హిరణ్యాక్షుడు మొదలయిన రాక్షసులను నరసింహ రూపంతో చంపావు.
సద్గురువులలో సౌమ్యుడైన నీవు ఈ భయంకరమైన రూపంలోకి ఎందుకు ప్రవేశించావు? 58

నమస్తే పరస్మై నమో విశ్వకర్త్రే నమో విశ్వగోప్త్రే నమో విశ్వనేత్రే ।

నమో భక్తిదాత్రే నమో దుష్టశాస్త్రే నమో వేదవేత్రే నమో వేదప్రోక్తే ||౫౯

సర్వోన్నతుడయిన పరమాత్మా !  విశ్వ సృష్టికర్తా! విశ్వ రక్షకుడా !  విశ్వ నేత్రుడా !  నీకు నా గౌరవపూర్వక నమస్కారాలు అర్పిస్తున్నాను.

భక్తిని ఇచ్చేవాడికి నమస్కారం, దుష్టత్వమును శాసించేవానికి నమస్కారం, వేదాలను తెలిసినవాడికి నమస్కారం, వేదాలను చెప్పేవాడికి నమస్కారం.

నమస్తే నృసింహాయ విశ్వప్రియాయ నమస్తే హేమకోటివిమానానుగాయ |

నమో నీలవేద్యాచలశ్యామలాయ నమస్తే నమస్తే నమస్తే నమస్తే || ౬౦

నరసింహుడా ! , విశ్వానికి ప్రియమైనవాడా! హేమకోటి విమానంను(శ్రీ నరసింహస్వామి గర్భగుడిపై గల గోపురము) వెంబడించువాడా !( ఉండువాడా !)  నీకు నమస్కారాలు.

నల్లని రంగుచేత తెలియదగినవాడా !  శ్యామల వర్ణము కలిగిన  పర్వతనివాసీ !, నీకు నమస్కారాలు, నీకు నమస్కారాలు, నీకు నమస్కారాలు. 60

61 - 70

బ్రహ్మోవాచ

ఇతి స్తుతో జగదభిరామవిగ్రహః శ్రియాన్వితో నరహరిరాదియోగినమ్ |

 సుధామయీం గిరమవదత్సుఖోదయాం తథా నదన్ స్మితవదనామ్బుజో హరిః || ౬౧

ఇట్టు స్తుతింపబడిన  అన్ని లోకాలలోను అందమయిన రూపము కలవాడు, లక్ష్మీదేవితో కూడినవాడు, ఆదియోగి అయిన కమల ముఖం  కలిగిన నరసింహస్వామి  చిరునవ్వుతో ఆనందము కలిగించు మధురమైన మాటలు ఇలా మాట్లాడాడు. 61

శ్రీభగవానువాచ -

భక్తి పరాంకోటిమయాదయం మే వసిష్ఠ తస్మాద్బ్రాహ్మ్యముపైతు రాజా |

 ఇన్ద్రద్యుమ్నో విష్ణుభక్తో జగత్యాం ప్రాయశ్శ్రోతా సత్యవాదీ జితారిః || ౬౨

నరసింహస్వామి  ఇలా అన్నాడు -

ఓ వసిష్ఠా ! చక్కని విష్ణు భక్తుడయినవాడు, లోకంలో తరచుగా మంచి మాటలు  వినే స్వభావం కలవాడు, సత్యమే మాట్లాడేవాడు,  శత్రువులను జయించేవాడయిన  ఈ ఇంద్రద్యుమ్నమహారాజు బ్రాహ్మ్యము( మోక్షము)  పొందుగాక!

 జన్మారభ్య వ్యాకరోద్విష్ణువిద్యాం నిత్యైషా వై యాతిగాధా జగన్తి |

 పూతాత్మానో యోగినో భక్తిమన్తః పుణ్యశ్లోకాః కుమ్భయోన్యాదయోఽన్యే || ౬౩

ఈ విష్ణుభక్తుడు అగస్త్యుడు మొదల.ఋషులకంటె గొప్పవాడు. బ్రహ్మర్షిత్వము పొందుగాక

ఈ  ఇంద్రద్యుమ్నుడు  పుట్టినప్పటి నుంచీ,  విష్ణు జ్ఞానాన్ని  పొంది, విష్ణుకథలు వినటంలో ఆనందం పొందే స్వభావం కలిగి, ఆత్మ శుద్ధి కలిగి భగవంతునికి అంకితమయిన జీవ నడవడి కలిగిన అగస్త్యుడు మొదలయిన బ్రహ్మర్షుల వరుసలో  ఇతడు చేరుగాక !  63.

సన్త్వేతేషామగ్రయాయీ ఋషీణామిన్ద్రద్యుమ్నో యాతు బ్రాహ్మ్యం మహీపః । ౬౪

ఈ బ్రహ్మర్షులలో అగ్రగణ్యునిగా  ఇంద్రద్యుమ్నుడు బ్రహ్మర్షిత్వము పొందుగాక !. 64

శ్రీవసిష్ఠః

స్వామిననన్యసులభాం నరసింహభక్తిమస్మై వితీర్య పరిపాలయసి ప్రజానామ్ ।

త్తైనైవ సంప్రతి దదాసి పరఙ్చ తేజో బ్రాహ్మం చ రాజని సుఖాదనవాప్యమేతత్ ॥ ౬౫

వశిష్ఠుడు ఇలా అన్నాడు

ఓ నరసింహా ! అనన్య సులభమైన( ఇతరులకు సాధ్యం కాని) విష్ణుభక్తిని అత్యున్నతమైన వైభవాన్ని  ఈ ఇంద్రద్యుమ్నునికి ఇచ్చావు. దుర్లభమైన బ్రహ్మర్షి పదమును ఇచ్చావు.  ప్రజలందరిని చల్లగా చూచావు.

ప్రసీద భక్తేషు పరావరజ్ఞ త్రిలోకసాక్షీ నను భక్తరక్షిన్ ।

కృపామ్బువర్షేణ నిషిఞ్చ దీనాన్ భక్తోచితశ్రీనృహరే యతస్త్వమ్ ॥ ౬౬

భక్తుల రక్షకుడా! నరహరీ !  శ్రేష్ఠుడు-నీచుడు, చిన్నవాడు-పెద్దవాడు, దగ్గర-దూరము, ముందు-వెనుక, జ్ఞానము-కర్మ ఇవన్నీ బాగా తెలిసినవాడివి. నీవు ఉన్నతమైన మరియు అత్యల్పమైన వాటిని బాగా తెలిసినవాడివి.  మూడు లోకాలకు సాక్షివి. దీనులపై  దయా వర్షాన్ని కురిపించు. అని నరహరిని ప్రార్థించాడు.  66.

బ్రహ్మోవాచ-

అథ నరహరివీక్షయా స రాజా నిరుపమమేత్యదదగ్రజన్మతేజః ।

మిషతి నిజపురోహితే వసిష్ఠే పరమమవిన్దత వైష్ణవం చ లోకమ్ ॥ ౬౭

ఈ విధంగా జరిగిన కథను  తెలిపిన బ్రహ్మ ఇలా అన్నాడు. “ఈ విధంగా  నిరుపమానమైన నృసింహుని కటాక్షముతో బ్రహ్మర్షిత్వాన్ని  ఆ రాజు పొందాడు.  విష్ణువుండెడి చోటయిన  వైకుంఠమును  పొందాడు.

బ్రహ్మర్షిభావం గమితో మహాత్మా రాజాథ సాలోక్యమవాప్య హృష్టః ।

సనన్దనాదిస్తుతమర్చయన్వై ప్రీణాతి చ శ్రీనరసింహరూపమ్ ॥ ౬౮

సాలోక్యముక్తిని పొందిశ్రీన్నృసింహుని సేవించుచున్నాడు.”

ఆ  ఇంద్రద్యుమ్న మహారాజు బ్రహ్మర్షి హోదాను పొంది సాలోక్య స్థితిని సాధించినందుకు  సంతోషించాడు.

అతను సనందనుడు మరియు ఇతర ఋషులచే ప్రశంసించబడి  శ్రీ నరసింహ రూపాన్ని  ప్రీతి పూర్వకంగా పొందాడు. 68

విశేషాలు

1. ముక్తులు 04

   సాలోక్యము (విష్ణులోకమందుండుట), 2. సామీప్యము (విష్ణువు దగ్గఱనుండుట), 3. సారూప్యము (విష్ణురూపుడై యుండుట), 4. సాయుజ్యము (విష్ణువులో జేరియుండుట).

2. జనన మరణ బంధ విమోచనం ముక్తి. అవిద్య నశించడం ముక్తి. ఇలాంటి ముక్తులు నాలుగు విధాలని కొందరు, ఐదు విధాలని కొందరు అంటారు. ఐదు విధాల ముక్తులివి : 1. సార్ష్టి (అంటే సృష్టించే శక్తి, సమానాధికారం కలది అనే అర్థాలు ఉన్నాయి), 2. సాలోక్యం, 3. సామీప్యం, 4. సారూప్యం, 5. సాయుజ్యం. నాలుగు విధాలనే వారు 'సార్ష్టి'ని ఇందులో చేర్చరు. సార్ష్టి, సాయుజ్యం ఒకటే అని శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు  వివరించింది.

ఇతి బ్రహ్మకైవర్త ఉత్తరఖణ్డే భృగుపరాశరసంవాదే ఘటికాచలమాహాత్మ్యే ఏకవింశోఽధ్యాయః ||

ఇక్కడితో  బ్రహ్మ-కైవర్త పురాణంలోని ఉత్తరఖండంలో భృగువు మరియు పరాశరుని మధ్య జరిగిన సంభాషణలో ఘటికాచల మాహాత్మ్యంలో  21వ అధ్యాయం పూర్తి అయినది.

శ్రీ శివాయ గురవే నమః

ఘటికాచలనివాసాయ శ్రీ నృసింహాయ నమః

బ్రహ్మకైవర్త పురాణములో ఉన్న  శ్రీఘటికాచల మాహాత్మ్యపు  22వ అధ్యాయం

(మూల శ్లోకము మరియు తాత్పర్య విశేషాలతో)

శ్రీఘటికాచలమాహాత్మ్యమ్

ద్వావింశోஉధ్యాయః

ఇత్థం చతుర్ముఖాద్దేవాద్బోధితాః ప్రాక్తనీ: కథా: ।

శ్రావ్యాశ్చాకర్ణ్య ఋషయో ముముదుః హృష్టచేతసః ॥౧

ఈ విధంగా చతుర్ముఖుడైన బ్రహ్మ ఋషులకు నరసింహుని గత గాథలతో జ్ఞానోదయం కలిగించాడు.

బ్రహ్మచెప్పిన కథలను విని ఋషులు సంతసించి ఇలా అన్నారు.

విశిష్య ఘటికాద్రేస్తు మాహాత్మ్యశ్రవణోత్సుకాః ।

పునశ్చ ఋషయస్సర్వే బ్రహ్మాణమిదమూచిరే ॥౨

ఋషులు  ఘటికాద్రి గొప్పతనాన్ని గురించి వినడానికి ఇంకా  ప్రత్యేకంగా ఆసక్తిగా ఉన్నారు.అందుకని మళ్ళీ అందరు ఋషులు బ్రహ్మతో ఇలా అన్నారు.

ఋషయః

|

ఘటికాచలమాహాత్మ్యకథనైర్భవతోஉనఘ ।

అపర్యాప్తాన్యమూల్యాని ఆశ్రయన్తాం బహూని వై ॥౩

“ఓ పితామహా!బ్రహ్మదేవుడా ! ఓ పాపరహితుడా, మీరు చెప్పగా  ఘటికాచల మాహాత్మ్యము కథలను విని ధన్యులమయ్యాము. అసంపూర్ణమైనవి ,  సరిపోనివి,  సమర్థము కానివి సదాశ్రయము కాని  ఇతర కథలు చాలా ఉన్నాయి. ( ఘటికాచల మాహాత్మ్య కథలు చక్కనివని భావం)

అహో కరోతి మాహాత్మ్యం ఘటికాద్రేర్మహామతే ।

జయావహమిదం బ్రహ్మన్ శ్రావ్యం లక్ష్మీకరం నృణామ్ ||౪
ఓ పితామహా!బ్రహ్మదేవుడా ! ఓ మహా బుద్ధి మంతుడా ! మీరు చెప్పిన ఈ ఘటికాచల మాహాత్మ్యము జయావహమైనది.శ్రావ్యమైనది. లక్ష్మీకరమైనది.

పఠతాం శృణ్వతాం బ్రహ్మన్ మాహాత్మ్యం లిఖితామపి |
అర్చతాం పుస్తకం నృణాం శ్రీనృసింహః ప్రసీదతి ||౫
ఓ పితామహా!బ్రహ్మదేవుడా ! ఈ ఘటికాచల మాహాత్మ్యము చదివినవారు, విన్నవారు, వ్రాసినవారు,పూజించినవారు నృసింహుని దయను పొందగలరు.

కిం పితౄణాముద్ధరణం కృతవాన్విప్రశేఖరః |
కేన వా తపసా తస్య శ్రీనృసింహః ప్రసాదకృత్ ||౬
విప్రశేఖరుడు తన పితృదేవతలను ఉద్ధరించాడు కదా? ఏ తపస్సుతో ఆ నృసింహుని అనుగ్రహమును పొందాడో చెప్పవలసినది'' అని ఋషులు బ్రహ్మను ప్రశ్నించారు.

**విశేషాలు**

పితృదేవతలనగా హోమాదులలో హవిస్సులను అందుకొనే దివంగత తండ్రి, తాత, ముత్తాతలు. పితృదేవతలను మూడు రకాలుగా వర్గీకరించారు. విధియుక్తమైన శ్రౌతాది కర్మలను ఆచరించినవారు ఉత్తములు. స్మార్త కర్మలను మాత్రం చేసి పితృదేవతల స్థానం పొందినవారు మధ్యములు. మిగతా వారు చివరి వర్గం. ఈ మూడు వర్గాలవారూ హవిస్సులను స్వీకరించడానికి అర్హులే.

బ్రహ్మోవాచ-
స్వాయంభువే కృతే పాదే త్రితయే మునిసత్తమాః |
నిజర్క్షే శుక్లపూర్ణాయాం భార్గవే మాసి మాధవే ||౭
బ్రహ్మ చెబుతున్నాడు
''స్వాయంభువ మన్వంతరమున కృతయుగములో మూడవపాదములో తన జన్మనక్షత్రము లో వైశాఖశుద్ధ పూర్ణిమ సంధ్యాకాలమున ప్రహ్లాదుని ప్రీతికై యోగ నరసింహ స్వామి ఆవిర్భవించాడు.

**విశేషాలు**

స్వాయంభువ మనువు, మొదటి మనువు. స్వయంభువుని సంతానము.స్వాయంభువుడు (స్మృతికర్త), స్వారోచిషుడు, ఉత్తముడు, తామసుడు, రైవతుడు, చాక్షుషుడు, వైవస్వతుడు, సూర్యసావర్ణి, దక్షసావర్ణి, బ్రహ్మసావర్ణి, ధర్మసావర్ణి, రుద్రసావర్ణి,

రౌచ్యుడు, భౌమ్యుడు అని 14 మంది మనువులు. మనువు అనగా సృష్ట్యాదిలో భగవన్నియామకుడు అయి భూమిని పాలించు రాజు.

మన్వంతరం అనగా మన లెక్కలో 43, 20, 000 సంవత్సరాలు.

ఉత్తమాయాం తు సన్ధ్యాయాం ప్రాతస్తన్యామహస్పృశి |
ప్రహ్లాదప్రీతయే యోగభావేన భగవాన్ హరిః ||౮

ఆరోజు ఉత్తమ సంధ్యలో సూర్యుడు ప్రకాశిస్తున్నప్పుడు,ప్రహ్లాదుని సంతోషపెట్టడానికి దేవదేవుడైన హరి యోగ స్ఫూర్తితో అవతరించాడు.

**విశేషాలు**

ప్రొద్దుపొడుచుటకు ముందు అయిదుగడియలవరకును ప్రొద్దుగ్రుంకిన వెనుక మూడుగడియల వఱకును గల కాలమును సంధ్య అంటారు. ( గడియ అనగా 24 నిమిషముల కాలము)

ప్రకృత్యా ఘటికామేకాం కుర్వతాం తప ఉత్తమమ్ |
వామదేవముఖర్షీణాం ముక్తయే చ నృకేసరీ ||౯

ఒక్కగడియ కాలములో తపస్సు చేసిన వామదేవాదిమహర్షులను అనుగ్రహించుటకై నృసింహుడు హేమకోటి విమానములో(పెద్దకొండపై శ్రీ నరసింహస్వామి గర్భగుడిపై గల గోపురమునకు హేమకోటి విమానము అని పేరు) నిలిచాడు.

యతో హేమశిలాపృష్ఠే హరిరావిర్బభూవ హ |
ఘటికాతోషితస్తస్మాద్ఘటికాచలనామభాక్ ||౧౦

'హేమకోటివిమానం క్రింద యోగాసనంలో శ్రీనృసింహస్వామి ఆవిర్భవించాడు. ఒక్కగడియ కాలము ఈ ఘటికాచలములో తపస్సు చేస్తే ఫలితము లభిస్తుంది కనుక ఈ ప్రదేశానికి ఘటికాచలము అని పేరు వచ్చినది.

**విశేషాలు**

ఘటికా అనగా ఘటతి విహితకార్యకరణాయ- వేదవిహితకార్యమునకు సరిపోవు ముహూర్తకాలము(24 నిమిషాలు)

తత్ర జజ్ఞే మహాభాగో విఖనా ఇతి విశ్రుతః |
సదా సంప్రీణయన్ సర్వాన్ విష్ణుభక్తిపరాయణాన్ ||౧౧

ఈ ఘటికాచలంలో విఖనుడు అనే మహర్షి జన్మించాడు.

విష్ణు భక్తికి అంకితమైన వారందరినీ ఈ ఘటికాచల ప్రాంతం ఎప్పుడూ సంతోషపెడుతుంది.

ఘననం ఘ్నన్తిరిత్యుక్త్వా నామైషాం తు న విద్యతే ।
తతో వైఖానసా నామ బ్రహ్మర్షయ ఉదీరితాః ।। ౧౨
ఘననము అనగా పాపము. దానిని ఇతని సంతతి వారు పోగొట్టువారు గనుక విఖనసుని ధర్మ శాస్త్రాలను అనుసరించే వారికి వైఘానసులను పేరు కలిగినది.

వైఖానసాస్స్మృతాస్తేఽపి వృత్తవిద్యోపజీవిన: ।
స్వసూత్రోక్తేన విధినా హరిమారాధయన్తి వై ।। ౧౩
వైఖానసుల శాస్త్రంపై ఆధారపడి జీవించినవారిని వైఖానసులని కూడా పిలుస్తారు.
వారు తమ వైఖానస సూత్రాలలో సూచించిన ఆచారాల ప్రకారం హరిని పూజిస్తారు. 13

భగవానపి విశ్వాత్మా నృహరిః ప్రీణయన్ సదా ।
వైఖానసేభ్యస్స్వం పూజామనుగృహ్ణాతి శాశ్వతః । ।౧౪
దేవోత్తమ పురుషుడు, విశ్వ పరమాత్మ అయిన నరసింహస్వామి ఎప్పుడూ మనలను సంతోషపరుస్తాడు.
తనను పూజించే వైఖానసుల పట్ల ఆయన నిత్యం దయ చూపిస్తాడు.

ఇతి బ్రహ్మకైవర్త ఉత్తరఖణ్డే భృగుపరాశరసంవాదే ఘటికాచలమాహాత్మ్యే ద్వావింశోఽధ్యాయః ।।
ఇక్కడితో బ్రహ్మ-కైవర్త పురాణంలోని ఉత్తరఖండంలో భృగువు మరియు పరాశరుని మధ్య జరిగిన సంభాషణలో ఘటికాచల మాహాత్మ్యంలో 22వ అధ్యాయం పూర్తి అయినది.

సంపూర్ణము

ఫలశ్రుతిః
యః పఠతీదం చరితం శ్రుణుయాద్వా భక్తితో లిఖేత్తస్య
ఘటికాద్రినాథకృపయా ఘటికామాత్రాద్భవన్తి దుర్ఘటాః కామాః ।।
।। శుభమస్తు ।।
ఫలశ్రుతి(ఏదైనా ఒక విషయాన్ని పఠించినప్పుడు, ఏదైనా ఒక స్తోత్రం రచించి నప్పుడు ఫలానా ఫలితం కలుగుతుందని చెప్పే విధానం).
ఈ ఘటికాచల మాహాత్మ్యం చదివినవాడు , విన్నవాడు లేదా భక్తితో వ్రాసినవానికి ఘటికాచల ప్రభువు నరసింహదేవుని దయ వలన, కష్టమైన కోరికలు కేవలం ఒక గడియలోనే ( 24 నిమిషాలకాలం)నెరవేరుతాయి.

శుభము జరుగుగాక !

****

**ఇంతటితో  బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రి గారి వంశంలో జన్మించిన, శ్రీ తాడేపల్లి పార్వతీశశాస్త్రి , సుశీలల తృతీయ పుత్రుడు ఆచార్య తాడేపల్లి పతంజలి ఘటికాచల నరసింహదేవుని దయతో రచించిన శ్రీ ఘటికాచలమాహాత్మ్యపు అనువాదము సర్వమును సంపూర్ణము.**

**శ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీ**

**మంగళం మహత్**